# ఆరోగ్య నికేతనము

(బెంగాలీ నవల)

తారాశంకర్ బంద్యోపాధ్యాయ

తెనుగుసేత:

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

AROGYA NIKETANAMU — Telugu translation by J.S.N. Moorti of Tarashankar Bandyopadhyaya's Bengali novel entitled *AROGYA NIKETAN*. Sahitya Akademi, New Delhi,1972.
Price Rs. 14.



ప్రథమ ముద్రణ : 1972

Available at ;

SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1

Regional offices : MADRAS-6,
CALCUTTA-29 and BOMBAY-14

ముద్రణ : వెల్డన్ ప్రెస్,

7/1, మన్నప్ప ముదలి వీధి, మద్రాసు-21.

# ప్రకాశక విజ్ఞప్తి

ఈ మధ్యనే కీర్తిశేషులైన సుప్రసిద్ధ నవలా రచయిత శ్రీ తారా శంకర్ బందోపాధ్యాయ రచించిన ప్రసిద్ధ నవల ఆరోగ్యనికేతన్. దీనికి 1956 లో సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది.

ఈ నవలను కీర్తిశేషులు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు బెంగాలీనుంచి తెనుగు చేశారు. కాని అనారోగ్యకారణంగా ఆయన తమ అనువాదాన్ని పునః పరిశీలించలేక పోయినారు. మా సలహా సంఘమువారి ఆదేశము ననుసరించి దీనిని యథాతథంగా ప్రచురిస్తున్నాము.

సాహిత్య అకాడెమీ

# సూచన

ఆరోగ్యనికేతనము చికిత్సాలయము. అందరి దృష్టిలో ఉండే ఆసుపత్రి వంటిది కాదిది. ధర్మౌషధాలయమూ కాదు. దేవీపుర గ్రామంలో మూడుతరముల నుండి వైద్యవృత్తినవలంబించుచున్న పెద్దమనుష్యుల సంస్థ.

రమారమి ఎనుబది ఏళ్లకు ముందు నెలకొల్పబడినది. ఇప్పు డది శిథిలావస్థలో ఉన్నది. మట్టి గోడలు బీటబు పడినవి. పైభాగంలోని జిగి అందందు సడలిపోయింది. గూనివాని వీపువలె వంగి పోయింది. ఎట్లో ఇప్పుడు కూడా అది నిలిచి ఉన్నది. అంత్యకాలమును అంది పుచ్చుకొనుచున్నది. కూలి క్రుంగిపోవు ముహూర్తమునకై గ్రుక్కిళ్లు మ్రింగుచున్నది.

కాని అది శుభోదయమున తలసూపినది. నిర్మింపబడిన దినమున స్థానిక కర్త జగద్బంధు కవిరాజ మహాశయుడు తన అంతరంగ మిత్రుడైన ఠాకూర్ దాసు మిశ్రు నుద్దేశించి ఇట్లు పలికినాడు :

"దాసూ ! విషయం చెపుతాను విను. ఎంతకాలము మేదినీ చంద్రార్కుల మండలములు నిలుచునో—నా మాట శ్రుతిమించిన అతిశయోక్తి అంటావేమో—మా వంశం ఎంతకాలం నిలుస్తుందో, అంతకాలం ఈ భవంతి దృఢమై నిలిచి తీరుతుంది." నవ్వి "దంభోక్తు లుచ్చరిస్తున్నానని అనబోకు. దంభం కానే కాదు" అని నొసట కేలుదోయి కీలించి, "సోదరా, ఈ వృత్తి ప్రాకృత ప్రయోజనమునకై ఉద్దేశింపబడింది కాదు. పరమార్థము దీని లక్ష్యము. చేసిన కొలది దానము పెరిగి పెంపొందుతుంది. అది నిలువ చేసిన నెయ్యివంటిది. ఉన్నకొద్దీ దానికి కమ్మదనం వస్తుంది. ఘుమ ఘుమ హెచ్చిన కొద్దీ విలువ హెచ్చదా ? నిజంగా ఇది ప్రపంచంలో సర్వోత్కృష్టమైన వృత్తి అని చెప్పాలి. ఇచ్చినా, పుచ్చుకొన్నా, దీనిలో ఎంతో మహిమ ఉంది. ఏవిధంగా చూచినా, ఇందులో మోసమనేది కన్ను పొడుచుకొన్నా కనబడదు" అని అత డన్నాడు.

జగద్బంధు మహాశయుని మిత్రుడు ఠాకూర్ దాసు మిశ్రుడు చిట్టా ఆవర్జాలు తయారు చేయుటలో మిగుల దిట్ట. ఉద్యోగ రీత్యా జమీందారుల గుమాస్తా ; పెద్ద

లెక్కగాడు. దావా లావా దేవులలో మంచి నేర్పరి. అర్జీలలో, అప్పీళ్ళలో అందె వేసిన చేయి. మాటలలో తాత్త్విక ధోరణి అంతగా వాని తల కెక్కదు. నెచ్చెలి పలుకులు విని వెటకారము వ్యక్తపరచుచు అత డిట్లనినాడు.

"నాడి చూచి మూలికలూ, కాడలూ, ఆకులూ, అలములూ ఏరి తెచ్చి నూరి నూరి ఆరబెట్టి మాత్రలు చేసి రోగులకిస్తే సొమ్ము ముట్టుతుంది. పదహారణాలలో అథమ పక్షము పధ్నాలుగణాల లాభం ఖాయం. విషయమంతా స్పష్టంగా తెలిసి పోతుంది. ఇక రోగుల మాటంటావా జగూ! వాళ్లకు ముట్టే ప్రయోజనం గుడ్డి గవ్వంతైనా ఉండదు. నీ చేతిలో నాలుగు రాళ్లు చేరడం వాళ్ల చేతి చమురు వద లడం కాదా? బహుశా ఆ అభాగ్యులు అప్పు సప్పులలో పడిపోవడం తటస్థించు తుంది. వారి చేతులు తలకెక్కుతాయి. ఒడుదుడుకులలో కూలి వారు తలక్రింద లౌతారు. పాపము వారికి ప్రాణ సంకటం కలుగుతుంది........"

వాని ధోరణికి అడ్డువచ్చి జగద్బంధు ఇట్లనినాడు. "ఓయీ! నువ్వు వంకర తెన్నుబట్టి పోతున్నావు. పైకం మాట దేవు డెరుగును. నేను చెప్పిన లాభం సొమ్ముకు సంబంధించింది కానే కాదు. ప్రపంచంలో మిగుల ఉత్కృష్టమైన ప్రయో జనం అది. ఒక విధంగా చూస్తే ఆరోగ్యం చేకూరుతుందనడం తథ్యం. మరొక విధంగా చూస్తే సేవ చేసిన పుణ్యం కూడా దక్కుతుంది కదా! విషయం తల కెక్కిందా? ఈ విశాల విశ్వంలో ఆరోగ్య సంపాదనమే దొడ్డ సంపాదనము. యక్షరూపంలో ధర్మువు యుధిష్ఠిరుని అడిగిన ప్రశ్నలలో ఒకటిది:

'లాభానాముత్తమమ్ కిమ్?' (ప్రపంచ ప్రయోజనము లన్నిటి లోనూ ఉత్తమమైన దేది?)

'లాభానాం శ్రేయ ఆరోగ్యమ్' (ఆరోగ్య లాభమే జగత్తులో శ్రేష్ఠ మైన లాభం) అని ప్రశ్నకు ధర్మరాజు ఉత్తర మొసగెను."

ఠాకూర్ మిత్రుడు నవ్వి యిట్లన్నాడు.

"కాయగూరల మరుగున చేపలదాపరికం ఎంతవరకు నెగ్గుతుంది? కళ్లు మూసుకొన్నా, ముక్కులు మూసుకుంటాయా? గంగా తీరంలోని ఇసుక తిప్పల్లో పాదులు పెట్టటం ఎలా పొసగుతుంది? ఏవేవో సంస్కృత శ్లోకోక్తులు ఉచ్చరిస్తున్నావు. ధర్మపుత్రుడైన యుధిష్ఠిరుని మాటలనుబట్టి చూసినప్పటికీ ధనానికి సంబంధించిన నీ లాభపు లెక్క దాగదు."

మాటల పోటీలో తనదే పై చెయ్యి అయిందని అతడు కులుకసాగినాడు. నోరు సమగ్రంగా తెరిచి అతడు పకపక నవ్వినాడు.

కాని కొన్నాళ్లు గడచీ గడవకముందే పాప మాతనికి కీళ్ల వాతపు తెవులు దాపురించింది. మూడు నెలలు కుంటి కాళ్లతో కాలక్షేపం చేసి, జగద్బంధు చేతి వైద్యంవల్ల తేరుకొని మిత్రు నుద్దేశించి అతడు ఘంటాపథంగా ఇట్లన్నాడు.

"సోదరా! నిజంగా నువ్వు నాకు జీవదానం చేశావోయి. అవసరమైతే ఏ రోజునైనా నీ కోసం నా పంచప్రాణాలు అర్పించి తీరుతాను."

జగద్బంధు నవ్వి "అట్లైతే 'లాభానాం శ్రేయ ఆరోగ్యమ్' అని ఇప్పు డొప్పుకుంటున్నావా?" అని అడిగినాడు.

మిత్రుడు "తప్పక ఒప్పుకుంటున్నాను." అన్నాడు.

మర్నాడతడు జగద్బంధు మహాశయుని ఆరోగ్య నికేతనమునకు వచ్చి, ఒక పుల్లకు గుడ్డ చుట్టి, నూనె కలిసిన ఎఱ్ఱరంగులో దానిని ముంచి, గోడపై తన చేతితో తాను "లాభానాం శ్రేయ ఆరోగ్యమ్" అను వాక్యమును పెద్ద అక్షరాలతో వ్రాసినాడు.

ఆ రోజులలో 'ఆరోగ్య నికేతన' మను నామకరణము జరుగలేదు. పల్లె ప్రాంతములో నివసించువారు కొందరు 'పెద్దింటివారి మందుల లోగిలి' అని, మరికొందరు 'కవిరాజుల ఔషధాలయం' అని దానిని పిలిచేవారు.

జగద్బంధు మహాశయుని కొడుకు జీవనం గారి హయాంలో దానికి ఆరోగ్య నికేతన మను పేరు వచ్చింది. అప్పటికి కాలం మారింది. క్రొత్త శకం తలయెత్తింది. దేశంలోని పెద్ద పెద్ద నగరాలలో అప్పటికప్పుడే నూతన యుగం బాగా ముందంజ వేసినప్పటికీ ఈ గ్రామ సీమలో తప్పటడుగులు వేయుచున్నది. తాటికాయలంత అక్షరాలతో పెద్ద పలకపై క్రొత్త పేరు వ్రాసి, జీవనంగారు వసారాలో వ్రేలాడ గట్టినాడు. అంతేకాదు. తండ్రి కట్టిన కొంప కాత డెన్నెన్నో మార్పులు చేసినాడు. పెద్ద బల్లపై తివాసీ గుడ్డ పరచినాడు. కుర్చీలూ, బెంచీలూ అమర్చినాడు.

ఈ యేర్పాటు ఈ రోజులలో కూడా అగపడుతుంది. పెద్ద బల్లకు ఎక్కువ కదలిక కలిగించి చెయ్యి తగిలీ తగలక ముందే అది ఊగిసలాడిపోతుంది. కుర్చీలు

చేతులు లేని మొండి ఘటాలైనవి. బెంచీలో ? అవి మాత్రం కట్టుదిట్టంగానే ఉన్నవి. వాటి కెట్టి చలనమూ కలుగలేదు.

ఇప్పుడు పోయి చూచితిరేని పడిపోనున్న గృహమూ, ఔషధాలయపు పేరున్న పలకా, చెప్పనేల—వైద్య శేఖరుడు జీవనమహాశయుడూ ఎదుట సాక్షాత్కరించడం తథ్యము.

*　　*　　*　　*

పట్టణ సీమనుండి సుమారు నూరు మైళ్లు కదలి పొండు. పెద్ద యినుప దారి మీదుగా ప్రయాణం చేయుడు. జంక్షన్ దగ్గర దిగిన వెంటనే సన్నని రైలుదారి అగపడును. పెద్ద యినుపదారి కిది శాఖ. దానిగుండా పది మైళ్లు దూరము సాగిపోతే ఒక పల్లె స్టేషన్ అగపడును. అచటి గ్రామము వస్తుసమృద్ధి గలది. నవయుగ స్వప్న చిహ్నములు నాలుగు దిక్కులకు అగపడును. ఒక టాక్సీ, బస్సు, సైకిల్ రిక్షా, ఒక యెద్దుబండి గోచరించును. స్టేషనుకు ఆరోగ్య నికేతనము ఎంతో దూరంలో లేదు. ఒక్క మైలుకు కొంచెము మించి యుండును. అవసరమైతే ఒక సైకిల్ రిక్షానుగాని, ఒంటెద్దు బండినిగాని కుదుర్చుకొని పోవచ్చును. కాని నడిచి వెళ్లడమే మేలు. శిథిల చిహ్నములూ, పునరుద్ధరణపు ఆనవాళ్లూ, ప్రాచీన అర్వాచీన వస్తువుల కలయిక అందు దృగ్గోచర మగుచుండును.

కంకరరోడ్డును పట్టి నడవండి. వెనుకటి జమీందారుల భవనములు కంట బడును. వాటి చుట్టూ తోట కలదు. అది ఇప్పు డంతగా చెప్పదగినట్లు లేదు. క్షీణ దశలోనికి వచ్చింది. దానికి దగ్గరలో ఒక గుడి కలదు. దాని చుట్టూ నాచు పెరిగింది. ఆలయం ఈ నాటిది కాదు. దుమ్ముతో నిండినది. ఆవల పెంటపోగులకు కొదువ లేదు. డొంకలు దట్టముగా పెరిగినవి. వీని నడుమ చెప్పదగిన వటవృక్షము కలదు. దీని శాఖలును, రెమ్మలును జీర్ణించినవి. మఱ్ఱిచెట్టు చుట్టూ సిమెంటుతిన్నె ఉన్నది. దానిలో లెక్కలేని బీటలు. ఇది పల్లె వేదిక. ఇంతటితో వెనుకటి తెరువు ఆఖరైనది. పెద్ద కంకర రోడ్డు ఆరంభమైనది. దీనిలో అది కలిసిపోయినది. రోడ్డుకు రెండు ప్రక్కలా అంగళ్లున్నవి. విపణి మార్గము ప్రాణిస్పందనముతో ప్రతిధ్వనించుచున్నది. ఎడ్లు లాగు సామాను బళ్లు వరుసగా పోవుచున్నవి. పథికులు వేర్వేరు గతులందు నడచుచున్నారు.

విశేష కోలాహలము విజృంభించుచున్నది. ఒక విధమైన వాసన అందుత్పన్న మైనది. దిన దినము బజారు పెద్దదగుచున్నది. టీ షాపులూ, మిఠాయి అంగళ్లూ

విరివిగా ఉన్నవి. ఆకలి దప్పులతో తాళలేనివారు వాటిలో ఎట్టి అభ్యంతరమూ లేకుండా ప్రవేశించవచ్చును. ఈ నవగ్రామమందలి మెడికల్ స్టోర్సుకు చేరువలో అన్నిటి కంటె శ్రేష్ఠమైన టీ, మిఠాయి షాపు కలదు. పల్లెలో ఈ మెడికల్ స్టోర్సును వెతుకనక్కర లేదు. ఈ స్టోర్సు తళతళలాడే చక్కని గృహంలో అమర్చబడి ఉన్నది. మేజా, బల్లలూ, కుర్చీలూ వగైరా సామగ్రి విరివిగా అందమర్చబడి యున్నవి. విభిన్న ఔషధముల రంగు రంగుల విజ్ఞాపనలు ఎల్లరదృష్టిని ఆకర్షించు చుండును. బుష్ కోటూ, ప్యాంటూ ధరించిన డాక్టరు మెడలో స్టెతెస్కోప్ వ్రేలాడుచున్నది. అతడు కూర్చున్నప్పటికీ ఈ వైఖరి అట్లే అగపడుచుండును. ఒక తేనీటి అంగడి మన దృష్టిని ఆకర్షించుచునే యుండును.

ఇక్కడనుండి మరల ఉత్తరదిశగా పోవు శాఖాపథము ఒకటి కలదు. ఇది వెడల్పైనది కాదు. ఒక బండి మాత్రము దీనిగుండా పోవచ్చును. రెండు వైపుల నుండి వేర్వేరు వరుసలలో తెరువరులు యథేచ్ఛగా నడువవచ్చును. ఛాయాచ్ఛన్న మార్గమునుండి ఇంచుకదూరము—రెండు ఫర్లాంగులు—పొండు. తెన్నున దోవ కిరువైపులలో నాలుగైదు పుష్కరిణులు అగపడును. తటాకతీరములందు మామిడి, జామ, చింత చెట్లు కలవు. వీని నడుమ శిరీషతరువులు విలసిల్లుచున్నవి. కనులకు విందొనరించు శాఖోపశాఖలు పల్లవములతో విస్తరించుటచే పథ మంతయు ఛాయా వృతమై ఉన్నది. ఒక సరస్సు చక్కని ఘట్టములతో ఒప్పుచున్నది. ఇందుండి అవ్వలికి పోయిన ఒక విశాల ప్రదేశము మీకంట పడును. అచ్చటి దృశ్యము మిగుల విచిత్రమైనది.

కొత్త యుగపు ఫేషన్‌లో కట్టబడిన ఇళ్ళు ఇందున్నవి. వాటి నిర్మాణ ములో ఈ కాలపు ఇంజనీరింగ్ నేరిమి గోచరించుచున్నది. నవీన పద్ధతిలో ఆఫీసులు తయారైనవి. ఇందందు వసతి గృహములు కూడా ఉన్నవి. కాలువలు త్రవ్వబడుచున్నవి. ఇంచుక దూరములో వేరురీతి ఇండ్ల వరుస కలదు. చిన్ని కట్టడముల చుట్టూ పెద్ద భవంతులు లేచుచున్నవి. వీటి నిర్మాణములో నలుదిక్కు లందు కర్రబొట్ల చెంత తాపీ మేస్త్రీలు పనిచేయుచున్నారు. ఆడువారు కూలి పనిలోనుండి ఉల్లాసముతో పాటలు పాడుచు దరువుల కనుకూలముగా సమ్మెట వేయుచున్నారు. హేటు, కోటూ, ప్యాంటూ ధరించిన ఇంజనీరు చేత సైకిల్ పూని, నలువైపులకు సంచరించుచున్నాడు. చిన్నయిండ్ల గుంపులో ఈనాటి ఆసుపత్రి అలరారుచున్నది. డాక్టర్లూ, కాంపౌండరులూ నివసించే బసలు దాని కంటియున్నవి. నర్సుల వసతులు ఎంతో దూరములో లేవు. కొంచెం దూరములో

ప్రత్యేకమైన ఇల్లొకటి కలదు. శవవాహకు లందు నివసించుచుందురు. వేరొక దిక్కున సగము పూర్తియైన పెద్ద కట్టడ మగపడుచున్నది. ఈనాటి పద్ధతిలో తయారగు స్వాస్థ్యకేంద్ర మది.

వీటి నన్నిటినీ చూచి ఆశ్చర్యపడకుడు. నూతన నిర్మాణమున ఆశ కలదు. అందుండి భవిష్యత్తు సృష్టియగును కదా! మానసదిగ్వలయమున సదాశారేఖలు ఆవిర్భవించును. అంతరంగనేత్రం ముందు స్వప్నప్రపంచము పరిఢవిల్లును. స్వప్నములను వీక్షించుచుండగనే తెల్లవారిపోవును. ఆరోగ్య నికేతన పర్యంతము పోవలెనను ఉద్దేశము మరి చిత్తములో తలయెత్తదు.

ఇంకను ముందుకునడువుడు. నూతన కాలపు మేలిమెరపు కట్టడములను ఎడమ వైపునే నిలిపి పొండు. మరొక మైలు దాటి పోవలెను. ఇరువైపులందు సస్యక్షేత్రములు కన్నులకు విందొనరించును. పచ్చదనమును, ఎఱ్ఱనికాంతిని చూపుల కందించు పథము కలదు. ఇది కంకరరోడ్డు. ఇది వంకరగా ఉన్నది. ఎడ్ల బండి ఒకటి పోవుటకు మాత్రము వీలున్నది. మైలు దూరము నడిచిన పిదప దేవీపురము కన బడును. తొల్లిటి ఆరోగ్య నికేతనము ఈ పల్లెలోనే కలదు. దేవీపురము శ్రీ హీన మైనది. ఇట్లనిన దారిద్ర్యభారమున అది క్రుంగుచున్నదనీ, నిష్పచ్చరమున నిపీడితమై ఉన్నదనీ తలపజెల్లదు. కాలమువలన దాపురించు జీర్ణత అం దగపడు చున్నదని చెప్పవచ్చును. తేరిచూడుడు. పల్లెలోని చెట్ల జొంపము శిరమెత్తి కుట్మలకుసుమములను దశదిశలందు విస్తరింపజేయుచున్నది. వృద్ధసాలములు చాల గలవు. నూతన తరువుల లావణ్యమయ శోభ అందందు కన్నుదోయికి విందుచేయు చున్నది. నవనవోన్మేషములైన నూతనకుంజముల శ్యామశోభ జీవన నవీనతా ధ్వజమై వెలయు చున్నది. తుపాను దెబ్బ తిని క్రుంగిన వకుళవృక్షతలము శూన్య గర్భమై ఉన్నది. అందలి ధర్మ ఠాకూరు నివాసము తొలుత తెరువరి చూపును ఆకర్షించును. తదుపరి గోచరించునది ఒక కమ్మరి శాల. అచ్చట అది ఉన్నట్లు చాల దూరమందే తెలియవచ్చును. అందుండి వెడలు ఠంగ్, ఠంగ్ శబ్దములు దశ దిశల మీది చరపులవలె శ్రుతి గోచరము లగుచున్నవి. ఈ శాల దేవీ పురమునకు దక్షిణమున ఉన్నది. నూతన కాలపు స్వాస్థ్య కేంద్రమునకు చక్కని శబ్దానుభూతి కలుగుచున్నది. గృహ భిత్తి కలదు. ప్రతిధ్వనులు చెలరేగుచున్నవి.

కమ్మరి పాకలో వ్యవసాయదారులగుంపు అగపడును. ఎఱ్ఱగా కాలిన లోహపు తున్కల నుండి వెడలు నెరసులు ఇందందు చిందులాడు చుండును. కమ్మరి కొలిమి నుండి కదిలిన అనంతరము ఊరి పొలిమేర కంటబడును.

ఆ ఊరు కుగ్రామము. అందు శాంతి వెలయు చుండును. వెదుళ్ళ వన మొకటి పల్లెను తన కౌగిలింతలో చేర్చుకొనినది. ఆ వనమందును, దానికి అంటియున్న శిరీషవృక్షశాఖలందును వికిరతతులు వివిధరీతుల కూజితములు సలుపుచుండును.

"కుహూ-కుహూ-కుహూ-కుహూ."

"రాం-రాం-రాం-రాం"

"కా-కాకా-కా"

"క-క్-క-క్." మున్నగు కలరవములు చెవులపండువు ఒనరించుచుండును. ఉన్నత ఉర్వీరుహములపై వ్రాలుగ్రద్దలు నడుమ నడుమ "కృష్ణా! కృష్ణా!" అని కూయుచుండును. తపతప రెక్కలు కొట్టుకొనుచు పికములు కలహించు చుండును. 'క్యా! క్యా! కట్! కట్! అను కలకలరవములు వినబడు చుండును. మనుష్య సంచారము అరుదుగా అగపడుచుండును. కంటబడు ఒకరు, ఇద్దరి దేహములు జీర్ణములు; మనుష్యులు క్లాంతములు; దృష్టి సందిగ్ధము. మిమ్ము చూచినప్పటికీ వారేమీ పలుకరింపరు. సంశయముతో, వెరపుతో మిమ్ము చూచిపోదురు. ఇంచుక దూరము పోయి, వెనుకకు తిరిగి మరల చూతురు. "ఎవరు మీరు? ఏ పంథ మీది? వామ పక్షమునకు చెందినవారా? ఓటు కావాలా? చందా కోసం వచ్చారా?" అని అడుగుదురు.

ఆ రోజులలో అనగా ఆరోగ్యనికేతనము నెలకొనిన దినములలో మనుష్యుల నడవడి మరొక మాదిరిగా ఉండేది. దేశపరిస్థితి వేరొక పద్ధతిలో అగపడేది. గాదిలో ధాన్యము నిండి ఉండేది. పశువుల సాలలో ఆవు లెన్నో ఉండెను. కొట్టులో బెల్లమునకు కొదువే లేదు. చెరువులో చేపలు లేవని చెప్పలేము! 'ఓహో!' అని పిలిచినంతనే పాడిపంటలు 'ఓయి' అని పలికేవి. రెండు చేతులతో కష్టపడి పనిచేసి, ఒంటిచేతితో కడుపు నిండునట్లు మెక్కుతుండేవారు ప్రజలు. వారి శరీరములందు శక్తి ఉండేది. మనసులందు ఆనందము తొణికిస లాడుచుండేది. ఆ వ్యక్తుల తీరే వేరు. ఈనాటి వేషభాషలు వారిలో హుళక్కి. మోకాళ్ళవరకు అంగవస్త్రము గట్టి అనావృతస్ఫీతవక్షములతో చర చర పోవు చుందురు. మిసమిస మను ఉడుపులు ధరించి, కళ్ళకుట్టు కాలిజోళ్ళు తొడిగి, మీరగ పడినపుడు వంగి వంగి నమస్కారము చేసి "అయ్యగారూ! ఎక్కణ్ణుంచి వేంచేస్తు న్నారు? ఎక్కడికి దయచేస్తున్నారు ప్రభూ?" అని ప్రశ్నించుచుందురు.

"ఆరోగ్యనికేతనమునకు" అని మీరు ప్రత్యుత్తర మిత్తురు.

"ఓహో! అలాగా? కాకపోతే మీవంటివారు ఎందుకు వస్తారు? ఈ కుగ్రామంలో ఎక్కడికి పోతారు? మంచిది— నడవండి. అదిగో! చూడండి— అక్కడ ఆగపడుతోంది కాళీఅమ్మవారి గుడి. ఎడమతట్టున ఉంది చందనం గారి మూలికల అంగడి. కుడివైపుగా మళ్ళినయెడల, కంటబడుతుంది. ఎత్తు గోడల నుయ్యి— అది సర్కారు వారు కట్టించిన బావి. దాని చేరువలో ఉంది జీవనం గారి ఔషధశాల. అందరూ దానిని ఆరోగ్యనికేతనం అంటారు. ఇసుక వేసినా రాలదు. అక్కడ జనం ఎప్పుడూ కిటకిట లాడుతూ ఉంటారు. బండ్ల వరుస నడిచే బళ్ళు నడుస్తూ ఉంటాయి. వచ్చేవి వస్తూ ఉంటాయి. వెతుక్కో కుండా కనుక్కోగలరు మీ రాచోటు వెళ్ళండి. అయ్యగారు" అను ఆదరోక్తులు వినబడును.

కాని రోజులు మారిపోయినవి. ఇప్పుడా సందడి ఏది? ఒకప్పుడు అక్కడకు వచ్చేవారూ, పోయేవారూ ఏటి ఆటుపోటులవలె ఉండేవారంటే ఇప్పు డెవ్వరూ నమ్మరు. మీదుమిక్కిలి పక్కన నవ్వుదురు. ప్రొద్దుటిపూట ఒక రిద్దరు అచట చేరుతూ ఉంటారు. విశేషించి ఆ సంఖ్యమించినా ఆరు, ఏడుగురు రోగులు వచ్చి, నాడి చూపించుకొని గౌరవపూర్వకంగా నిష్క్రమిస్తూ ఉంటారు. ఆరోగ్య నికేతనములో ఇప్పు డిక ఔషధాలే లేవని చెప్పవచ్చును. మందుల అల్మారీలు ఖాళీగా పడి ఉన్నవి. వాటి స్థితి ఆకర్షణీయంగా లేదు. వాటి మీది వార్నిష్ పూత బొత్తిగా మాసిపోయింది. వాటిపై దుమ్ము దట్టముగా చేరింది. రెండు మూడింటి బందుల చీలలు ఊడిపోయినవి. నాడి చూపించుకొనుటకై వచ్చేవారు, రోగ నిర్ణయ మైన తరువాత మందుచీటి వ్రాయించుకొని చల్లగా చక్కాపోతూ ఉంటారు. తక్కిన వేళల్లో ఆ చోటంతా పాడుపడినట్లు తోస్తుంది. ఒక్క పిట్టైనా అగపడ దంటే కల్లకాదు.

అపరాహ్ణ సమయమున వెళ్ళి చూచారంటే జీవనంగారు ఒంటరిగా తిష్ఠ వేసుకుని సాక్షాత్కరిస్తారు. రమారమి పాతికమూరల పొడవు, పండ్రెండు పదు నాలుగు మూరల వెడల్పుగల పూరిల్లు ఒకటి అగపడుతుంది. ముందటితట్టున గచ్చు వేసిన వసారా ఉన్నది. బీటలువడి గచ్చు పాడైపోయింది. అక్కడక్కడ రాళ్ల పైకి లేచినవి. మూడుచోట్ల నేల దిగువకు క్రుంగిపోయింది. నలు దిక్కులందు ధూళి దట్టముగా చేరి ఉన్నది. వసారా రెండు వైపులను రక్తకరవీరతరువులు

జంటగా సుందరకుసుమ విలసిత శాఖోపశాఖలతో వేలయుచున్నవి. పూలు కెంపుతునకలవలె ఎఱ్ఱగా ఒప్పుచున్నవి. కొమ్మలును, రెమ్మలును నలుదిశలందు వ్యాపించి యున్నవి.

కవీంద్రుని ఊహలవలె అవి మారుతమున ఊగాడుచున్నవి. ఆ చెట్లపై చూపు నిలిపి వృద్ధుడు కూర్చున్నాడు. వాని వయస్సు రమారమి డెబ్బదియేళ్లుం డును. స్థవిరధూళి ధూసర దిక్కరివలె ముదుసలి అగపడుచున్నాడు. ఒకప్పుడు దృఢమైయుండిన వానిశరీరము గ్రథనము ముడుతలుపడిన చర్మము మరుగున కృశించి యున్నది. వక్షపంజరము స్పష్టమై ఎదుటివారి కన్నుల బడుచున్నది. రెండు చేతులందలి త్వగస్థులు అన్లే దృగ్గోచరములు. కరములకు కాళ్లు ఉజ్జీయైనవి. పాదముల పొంత పెద్ద కాలిజోడు కలదు. దాని నిర్మాణ మెప్పటిదో ఊహించు టకు వీలులేదు. అది మిగుల జీర్ణమై ఉన్నదనిన అతిశయోక్తి కాజాలదు. వృద్ధుడు ధరించిన ధోవతి మిగుల మలినమై ఉన్నది. పంచపై కుట్టుపని ఉన్నది. వాని శ్మశ్రువులు శుభ్రగజదంత వర్ణముతో ఎకసక్కెము లాడుచున్నవి. శిరోజము లపై వేసిన వెండిపూత గోచరించుచున్నది. అవి కురుచగా కత్తిరింపబడినవి.

పూర్వయుగపు బల్లపై చిరిగిన తివాసీముక్కను పరచుకొని అతడు కూర్చుం డును. పూలతో వేలయు చెట్లజంటను చూచినపుడు వాని మానస వీధిలో ఎన్నెన్నో తలపులు తళుక్కొత్తుచుండును. ఆ ఊహలు విచిత్రములు; వివిధములును. మచ్చుకు ఆ భావస్రవంతిని అవలోకింపుడు.

"మానవుని ఆయువుకంటె చెట్టు ఆయువు అధికము. ఎన్నడో అరవై ఏళ్ళ క్రితం రెండు కరవీర విత్తనాలను మా నాన్నగారు ఇచ్చట నాటినారు. అవి మొక్కలై, తరువులై నేడు కూడ నవనవ లాడుచున్నవి. చూచిన కొద్దీ కన్నుల కరువు తీరిపోతోంది."

ఆకస్మికముగ వాని ఊహాసూత్రము నేడు పుటుక్కున తెగిపోయినది. ఏదో వికృతస్వరము వాని వీనులందు పడినట్లాయెను. నలుదెసల నాతడు చూపులు సారించినాడు. ఎవ్వరూ అగపడలేదు. పరక్షణమున అతడు నవ్వు కొన్నాడు. పంజరములో పోషింపబడుచుండిన చిలుక ఒకటి ఎట్లో వెలుపలకు ఎగసివచ్చి సమీప తరుశాఖపై కూర్చునియున్నది. వృక్షతలమునుండి ఎవరో తెరువరి నడచిపోవుచుండగా కీరము వానిని పలుకరించుచున్నది.

"పళ్లు లేవు, పళ్లు లేవు, పళ్ళు లేనేలేవు." అంటూ ఉన్నది.

అది మామూలు పిట్ట కాదు. తక్కిన పక్షులకూ, దీనికీ ఇంచుక వ్యత్యాస మున్నది. కొన్ని పెంపుడు పక్షులు ఒక పర్యాయము పంజరమునుండి విడిపోయినయెడల మరి రావు. తొలుత ఇంటి పొరుగున చెరలాడి, ఎగిరెగిరి కొంపపై వ్రాలును. మరల పెరట్లో ప్రవేశించును. కాని అవి ఇక పంజరములో చొరబడవు ఈ పక్షి పద్ధతి వేరు. ప్రొద్దుటిపూట పంజరగేహమునుండి ఇది విడువ బడును ఎందెందో ఎగసి ఎగసి మరల సంధ్యాసమయమున అది తిరిగి వచ్చును. పంజరకవాటము తెరచి ఉన్నయెడల, తిన్నగా లోపలకి ప్రవేశించును. తలుపు తెరచి ఉండని యెడల పంజరముపై కూర్చుని "అమ్మా! అమ్మా! ఓ అమ్మా! ముసలీ! ముసలీ! ఓ ముసలీ!" అని అరచుచుండును. ముసలివాడు హిట్‌కుడ్ జిల్లా మనిషి. అచటి ఆడువారు అతనిని 'ముసలీ' అని పిలుస్తూ వుంటారు. ఆ మాటలనే చిలుక పలుకుతూ ఉంటుంది. ఎందుండియో యెగసివచ్చి, అది ముసలివానిని పలుకరిస్తూ ఉంటుంది. మనుష్యులతో కలిగిన సందర్శనసంపర్కముల ప్రభావమును పక్షి పడసినది. పూర్వజన్మ సాధన కొంత పక్షి జీవితమున ప్రస్ఫుటించి యుండును. పూర్వజన్మలో మానవుడై యుండి ఏ కారణమువల్లనో శాపమునకు గురియై పక్షియై పుట్టియుండును.

జీవనమహాశయుడు గడ్డమును తడవుకొన్నాడు తోడ్తోడనే పక్కున నవ్వుకొన్నాడు. జన్మాంతర సిద్ధాంత విశ్వాసము అతనిలో తలక్రిందులై పోయినది. కావున దానిని గురించి తలపోయువాడు కాడు. గడ్డమును దువ్వుచు తలతడవుచు దిక్కులందు దృక్కులు సారించుచున్నాడు.

"ముఖోపాధ్యాయుడు ఇంకా రాకపోయెనే" అని అనుకొన్నాడు.

ఇంతలో అతడు వేంచేసినాడు. ఆతడు వచ్చునప్పుడు చతురంగపు గళ్లగల కాగితము చెంత నుండును. కాలసముద్రమందలి కొంతభాగమును కాగితపు నౌక ద్వారా పరమానందముతో దాటవచ్చును గదా!

అది శ్రావణ మాసములో ఒక నాటి అపరాహ్ణము. జీవనమహాశయుడు మొగమెత్తి చూచినాడు. ఆకాశము మేఘాచ్ఛన్నమై ఉన్నది. వానతుంపురులు రాలుచున్నవి. గాలి తీవ్రముగా వీచుచున్నది. నలువైపులు ఛాయాగాఢమై సంధ్యాసమయము ఆసన్న మగుచున్నట్లు తోచెను. దూరమున సతీశముఖోపాధ్యాయుని తెల్ల గొడుగు అగపడినది. వయసు వచ్చినప్పటికీ జీవనమహాశయుని కంటిచూపుకు అంతగా ధక్కా తగులలేదు. దారముతో కట్టబడిన కళ్లజోడు వాని

ముక్కుపై నిలిచినది. దాని ద్వారా చూచినపుడు, నలుపు రంగుల గొడుగును గుర్తు పట్టుట వాని కంతగా కష్టము కలుగలేదు. శరీరస్వాస్థ్యమును గురించి అతడు శ్రద్ధ వహించియుండినయెడల ఇంచుకైనా దృష్టికి హాని కలిగివుండేదికాదు. వచ్చిన పెద్ద మనిషి ఆరోగ్యము చెడిపోలేదు. అపుడపుడు జీవనమహాశయుడు అతని నాడి పరీక్షించి, ''ఈ ముసలయ్య పరలోకమునకు వేంచేయుటకు ఇంకను ఆలస్య మున్నది'' అనుచుండును. నాడీ గతిని చక్కగా గ్రహింపగలుగు ప్రజ్ఞాధురీణుడు జీవన మహాశయుడు.

నాడిలో మృత్యుకాంతాగమన ప్రతిధ్వనిని కనిపెట్టగల సామర్థ్యము ఆతనికి గలదు. తాతముత్తాతల కాలమునుండి ఈ అద్భుతప్రజ్ఞ వారివంశసంప్రదాయమందు విద్యమానమై ఉన్నది. ఈ వంశజులందరూ కవిరాజులే! ఆయుర్వేద వైద్యులే. వారిలో జీవన మహాశయుడు మాత్రము డాక్టరు అనిపించుకొన గలిగినాడు. వెనుకటి సంప్రదాయపుకవి రాజైనను అవసరమునుబట్టి రెండురీతుల చికిత్సను ద్విగుణీకృతోత్సాహముతో అతడు అవలంబించుచుండును. వైద్యవృత్తిలో అతనిని సవ్యసాచి అనవచ్చును. కాని అతనిలో చెప్పదగిన విశేషము నాడీ పరీక్షలో కలదని రాయిగుద్ది చెప్పనొప్పును. ఒకనికి రోగము సంక్రమించినముహూర్తమునుండి వ్యాధి ప్రకోప మెట్లు విజృంభించినదో కనిపెట్టి మృత్యుమహిళా ప్రవేశము ఎప్పుడు ఆసన్నమగునో తెలిసికొనజాలు అద్భుత ప్రజ్ఞ ఆయనకు ఉండేది.

నిదానములో, రుగ్మతను గుర్తించు చాకచక్యములో అద్వితీయుడను పేరు ప్రతిష్ఠలు జీవన మహాశయునకే దక్కినవి. ఆ యశస్సు నేడుకూడ మాపుకాలేదు.

నాడిని పరీక్షించి పూటదాటకుండా మృత్యువు ప్రత్యక్షమగునని రాయి గుద్ది అతడు చెప్పేవాడు. ఆ మహాశయుడు చెప్పిన దానికెన్నడును తిరుగులేదు. ఈ విషయ ములో అతనిమాట తప్పదనుటకు లెక్కలేనన్ని దృష్టాంతములు గలవు. ఈ రీతి కేసుల నాతడు—లక్షలాది కేసులను—రెప్పపాటు కాలములో ఏకరువు పెట్టు వాడు. ఆతని స్మరణశక్తి అస్వాభావికవేగముతో విజృంభించుచుండును. వాని వచః కౌశలము కూడ తక్కువ కాదు. కావున శరవేగముతో చావు కేసులను ఆతడు పనస వల్లించినట్లు చెప్పేవాడు. ఈ దృష్టాంతమును అవలోకింపుడు. సురేశ మిశ్రుని చిన్న కొడుకు ఎట్లు కెవ్వుమని ఊపిరి విడిచెనో ఆతడు తెలుపగలిగినాడు. గుండె పగులునట్లు వాని యిల్లాలు కావించిన రోదనము, ఆమె కంటిలో అగపడిన భయం కర దృష్టి ఎట్లు ఎల్లర గుండెలందు గగ్గోలు పుట్టించెనో నైసర్గిక ప్రతిభతో ఆతడు

వర్ణించును. కథ చెపుతూ ఉండగా పాపము ఆమహాశయుడు పెక్కు నిట్టూర్పులు విడుచుచుండును.

ఎంత ఆక్రందమును అతడు వినలేదు? ఎంత దారుణయాతనను ఆతడు అవలోకింప లేదు? ఎట్టి నీరవ మర్మాంతిక శోకమును ఆతడు చెవులందు జొనుపలేదు? ఎన్ని మృత్యువులను ఆతడు వీక్షించలేదు? ఎవరైన రోగి ప్రమాద స్థితిలో ఉన్నాడను దారుణవార్త చెవిని బడిన తోడనే జాప్యము చేయకుండా బరువు కాళ్లతో అల్లనల్లన అడుగులు వేస్తూ ఇంటినుండి ఆతడు బయలు పడుచుండును. తులసి నీరు రోగి గొంతుకలో పడువరకు అతడు ప్రయత్నము మానువాడు కాడు. తన ప్రయత్నము వ్యర్థ మని యెరిగియు ఆతడు గట్టి పూనికకు గడగువాడు. గుండెపై చెయ్యి వేసికొని మనస్సును కుదుట పరచుకొనేవాడు. రోగి ఇంటిపైపు పోవునపుడు అతని హృదయములో ఎన్నెన్ని ఊహాలో దిర్దిర తిరుగుచుండును. వీధిలో నడచువేళ ఆత్మీయులును, అంతరంగ మిత్రులును ఎదురైనను, వారిపై వాని చూపు పోవునది కాదు. వ్యాధి పీడితుని విషయమూ, చేయవలసిన చికిత్సవిషయమూ ఆతడు యోచించువాడు. ఆతడు నవనీత హృదయుడు. అప్పుడప్పుడు మృత్యువిషయము తలపోయుచుండువాడు. మహాశయుని భావనామగ్నచిత్తము విశ్వమందలి ప్రజలనుండి వాని దృష్టిని మరలించి, చికిత్సా విజ్ఞాన గ్రంథమందలి పుటలను ఒకదాని తరువాత వేరొకదానిని త్రిప్పి, త్రిప్పి పరిశీలింపజేయుచుండును. అందువలన ఇతరులను చూచినను చూడనట్లు ఉండేవాడు. అనేక రంగములందు, విశేషించి దూర గ్రామములందు రోగులు తన ఔషధ ప్రభావము వలన చప్పున పరమపదించిన అనంతరము తప్పని సరిగా ఆ యా చోటులందు ఆతడు కనిపెట్టుకొని తదనంతరపు ఏర్పాటులపై మనసు నిలుపువాడు. శోక విహ్వల కుటుంబముల నడుమ అచంచలుడై కూర్చుండువాడు. వాయుసంచలనము లేని గ్రీష్మ కాలాపరాహ్ణమున కదలికలేని వనస్పతివలె అతడు తిష్ఠ వేసికొని కూర్చుండు వాడు. ఎండిన మోడుకు సహపాఠి ఆతడే అనిపించుకొనువాడు. ఈ రీతి వైఖరిని చూచి కొందరు ఇటువంటి వారు పాషాణ ప్రాయు లనేవారు. వారు చెప్పునది కేవలము మిథ్య అని తెలుప లేము. కొందరు వైద్యులలో బండరాతివైఖరి లేదనలేము. మృత్యువును చూచి, ఆర్తనాదము చేయు వారిని గమనించి వారు చలించరు. ఒరుల వేదనను గ్రహింపజాలు సత్తువ వారిలో అడుగంటియుండును. తిమ్మిరి క్రమ్మిన దేహములతో వారుందురు. జీవన మహాశయుని వైఖరి ఇతరుల పట్ల, సొంత కుటుంబముపట్ల ఒకే రీతిగా నడచినది. శశాంకునిపట్ల అత డెట్లు వ్యవహరించెనో ఎల్ల రెరుగుదురు.

తన పుత్రుని చేతినాడిని చూచి ఆయన భయపడినాడు. ముప్పు తప్పదని మూడు రోజులకు ముందే ఆయన గ్రహించినాడు. మనస్సులోని మాటను మరుగు పరచక తన యిల్లాలితో చెప్పివేసినాడు. వైద్యవిద్యలో తాను మిగుల ప్రవీణుడనను దొడ్డవిషయమును ప్రకటింపనెంచుటే ఆయన ఆశయము.

సత్యమును ముక్తకంఠముతో తెలిపియు మానసకోశమందు ఆతడు వేదనానుశోచనానుభూతి నందుచుండెనా? ఈ స్మృతి మానసమధ్యమున తల నూపినంతనే ఆతని హృదయము నుండి స్వీయధిక్కారము చెలరేగుచున్నదా?

గ్రుడ్లు మీదికి త్రిప్పి, ఆతడు వినీలాకాశముదెస దృష్టిని సారించి అట్లే కూర్చుని యున్నాడు. అయినను తాను నమ్మినదాని నతడు పలికి తీరవలెను. అది వానివిధి. అది చికిత్సకుని కర్తవ్యము. స్వీయ క్షేత్రమునుండి ఆతడు చేయ గలిగిన పని అది.

# మొదటి ప్రకరణము

హూణ శకము 1950. వంగ సంవత్సరము 1356. శ్రావణ మాసము. అపరాహ్ణసమయము. జీవనమహాశయుడు నిశిత దృష్టితో ఆకాశమును వీక్షించు చుండెను. సమీప పథమునుండి ఎవరో అతనిని పిలిచిరి.

"డాక్టర్ బాబూ! ప్రణామము!"

"ఎవరు? మతియా? ఎక్కడకు పోతున్నావు?"

మతి దుస్తులు మసి పాతలై ఉన్నవి. కమ్మరి కొలిమిలోని యావత్తు మసి ఎనిమిదడుగుల పూతలో వాని బట్టల నాశ్రయించినది. కడువడిగా వగర్చుచు పరు గెత్తికొని వచ్చినాడు. అతడు సుధీరనుపాలికాపు కొడుకు. డాక్టరంటే పాలికాపుకు ఎంతోభక్తిగలదు. వానిపై డాక్టరుకూ విశేష వాత్సల్యమున్నది. పాలికాపు ఎన్నెన్నో ఔషధముల నెరుగును. అవి సన్యాసు లిచ్చిన మందులు. రఘువరభారతి అను నాతడు పెద్దతరహా యోగి. అతనినుండి ఔషధములు వానికి లభించినవి. తన వద్ద నున్న మందులను డాక్టరు కివ్వాలని ఉద్దేశించెను. జీవనమహాశయుడు వాటిని స్వీకరించుటకు నిరాకరించెను. కాని పలువురు రోగులను అతడు సుధీర్ కడకు పంపుచుండును. రెండురోజుల కొకపర్యాయము సంక్రమించు జ్వరము వలన పీడింపబడువారిని అతడు వానికడకు పంపుచుండును. అది మిగుల పాడు తెగులు. మరే జ్వరమైనా మందుకు లొంగును; కాని ఇది లొంగదు. ఔషధముచే దానిని మాపు చేయదలచినను చాల కాలము పట్టును. క్వినైన్ మందునుగాని, ఇంజెక్షనులను గాని అది లెక్కచేయదు. కాని రఘువరభారతి చేతిమందు వలన ఆ విషజ్వరము ఒక్కనాటితో నయమై పోవును. ఈ వరలో ఈ ఔషధమును సుధీరిచ్చువాడు. ఇప్పుడు మతియే దానిని ఇచ్చుచుండును. నీటిలో పెరుగు ఒకానొక మొక్కను తీసి నలిపి, పసుపు గుడ్డలో పిండి, రసమునకు ఎండ తగుల నిచ్చి, కొంత గట్టిపడిన తర్వాత మాత్రలు చేసి ఇచ్చినయెడల జ్వరము పటా పంచలగుట తథ్యము. ఇది ముమ్మాటికి నిజము. ఇది అతి విచిత్రమైన

ఔషధము. విషజ్వరపీడితులను జీవనమహాశయుడు సుధీరు కడకు పంపు చుండుటవలన ఇరువురకు గాఢమైన నేస్తము కుదిరినది. ఈ దేశమందలి బైరాగులందు ఒకవిధమైన చికిత్సా ప్రణాళిక ప్రచలితమై యుండెను. దానివలన విస్మయకరఫలము ప్రత్యక్ష మగుచుండును. ఈ వైద్యపద్ధతి నెరుగవలెనని ఒకప్పుడు జీవనమహాశయుడు ఉద్దేశించెను కాని గురునిషేధము వలన దాని నతడు నేర్చుకొన జాలకపోయెను. "డాక్టరు వైద్యవిధానము నేర్చితివి. మరొక రీతి చికిత్స జోలికి పోకుము. విజ్ఞాన శాస్త్రసమ్మతము కాని వైద్యము నవలంబింప కుము." అని గురువు అతనిని హెచ్చరించెను.

"మీకోసం వచ్చినాను పెద్దబాబూ" అని మతి పలికినాడు.

మాట విని డాక్టరు తెప్పరిలినాడు. మాట చెప్పు వ్యక్తికై ఆతడు తహ తహ లాడుచుండెను. సరిగ కూర్చుని పాత తలగడను చెంతకు చేర్చుకొని అతడు "రా! నాయనా! కూర్చో, కబురేమో, చెప్పు" అన్నాడు.

"ఒక పర్యాయం మీరు మా యింటికి రావాలి పెద్దబాబూ!"

"ఎందుకు?"

"మీరు వచ్చి ఒకమారు మా అమ్మను చూడాలి"

"మీ అమ్మకేమి వచ్చింది?"

"నెల్లాళ్లై అమ్మ చెరువుకు పోయి రేవులో పడిపోయింది. మోపుగా దెబ్బ తగిలింది. చాలా బాధ పడుతూంది. ఆసుపత్రికి తీసుకొని పోయాను. అక్కడి వాళ్లు ఏదో కట్టుకట్టి పొమ్మన్నారు. కొన్నాళ్లు కదలక మెదలక పడివుండాలి. నొప్పి పోతుంది అని ఆసుపత్రిలో డ్రెస్సరుగా రన్నారు. మళ్ళీ పది దినాలనుండి బాధ హెచ్చింది. రేయింబవళ్లు మిక్కుటమైన యాతన పడుతోంది. మళ్లీ ఆసుపత్రికి తీసికొని పోయాను. ఎక్స్‌రే పరీక్ష చేయాలి. లేకపోతే ఏమయిందో చెప్పలేము. అన్నారు అచటి డాక్టర్లు. అది పెద్ద ఖర్చుమాట. ఎంతో ఝంఝాటము కొంపలో పెరిగి పోతోంది. అందుచే పెద్దబాబుదగ్గరకు పరుగున వచ్చాను!"

"అయ్యో! పాపం! ముసలిదాని మెడలో ముల్లు గుచ్చుకొన్నట్లయింది"

తల్లిపై మతి కెంతో భక్తి. అందువల్ల ప్రజలు వానిని పెద్ద కుర్రవాడు అని పిలుస్తుంటారు. అమ్మబాధ అతడు చూడలేక పోతున్నాడు. ఇప్పుడు ఎక్స్‌రే

పరీక్ష ఏర్పాటు చేయడం వానికి చాల కష్టం. అతడు ఆదుర్దా పడుతూ పెద్దబాబు కడకు పరుగున వచ్చినాడు.

"మంచిది, వెళ్లు. రేపు ప్రొద్దున వస్తాను" అని జీవనమహాశయు డన్నాడు.

"రేపు కాదండి, రేపుకాదండి. ఇప్పుడే వచ్చి తీరాలి. ముసిలిది అల్లరి చేస్తోంది. నన్ను తిట్టి పోస్తోంది. నీ కూతురుకే ప్రమాదం వస్తే ఏ మందూమాకూ లేక యిలా పడవేస్తావురా ? అని రాగాలు పెడుతోంది."

పాపం! చెపుతూ, చెపుతూ అతడు వెక్కి-వెక్కి- ఏడ్చినాడు. జీవితంలో ఎన్నడూ ఆతడు అమ్మను నిర్లక్ష్యం చెయ్యలేదు.

"అమ్మ యీవేళ నన్నిలా అంటోంది" అని ఆతడు గోల పెట్టినాడు.

"అయితే నడు. చూచి వస్తా."

ఒంటిపై గుడ్డ వేసుకొనక డాక్టరు బయలుదేరినాడు.

"మీ గొడుగేది?" అని మతి అడిగినాడు.

"గొడుగు అక్కర్లేదు నడు. పడుతున్నవి తుంపురులే. గొడుగు పనేమి?"

జీవనమహాశయుడు బరువు కాళ్ళ మనిషి. చప్పుచప్పున అడుగులు వేయ లేక పోతున్నాడు.

"పెద్దబాబూ! నేను ముందు వెళ్లి మీరు వస్తారని అమ్మతో చెబుతాను" అని మతి పరుగు పుచ్చుకున్నాడు.

ఇంటిని పరిశుభ్రపరిచేందుకే మతి ముందు పోయినాడు. ఇంట్లో చంటిని వెంటిని అదుపులో పెట్టాలి. బహుశా ముసలిది మాసిన బట్ట కట్టుకుని ఉంటుంది. ఆమెకు ఉతికిన బట్ట కట్టబెట్టాలి. జీవనంగారికి తెలియని దేదీ లేదు.

ఇంటి తలుపువద్దకు పోయి డాక్టరు కంఠము సర్దుకొని "మతీ! మతీ!" అని పిలిచినాడు.

"అయ్యా! ఇదిగో వస్తున్నానండి." అని లోపలినుండి అతడు బదులు చెప్పినాడు.

'కొంచెము ఆగండి' అను భావము వాని మాటలో కలదు.

ఇంకను లోపల రోగి తయారు కాలేదు. డాక్టరు నిలబడినాడు. తడయుట మంచిదే యైనది. దగ్గర సందులోనుండి తెల్లబట్ట కట్టుకొని గొడుగు చేబూని సురేశ

ముఖర్జీ వస్తున్నాడు. రెండవ చేతిలో ఆరిపోయిన లాంతరూ, చంకలో చతురంగపు సామాను గల సంచీ ఉన్నవి.

"ఓహో! సురేశ్! ఎక్కడకు ప్రయాణం?" అని డాక్టరు అడిగినాడు.

ఇంతలో "పెద్దబాబూ! లోపలికి రండి" అని లోపలినుండి మతి కేక వేసినాడు.

జీవనంగారు ఇంటిలో కాలు పెట్టినారు. ముసలిది మ్రుక్కి, మ్రుక్కి కుక్కి మంచంపై పడి వుంది. పాపం తడబడుతా, తడబడుతూ పడిపోయింది. మోకాలు బాగా వాచిపోయింది.

వాచినచోటున డాక్టరు చేయిపెట్టి, నింగిపై చూపు నిగిడించినాడు. ముసలిది కెవ్వుమంది. బరువుకాళ్ళ డాక్టర్ ఉలికిపడినాడు. గుఖాలున కూలబడలేదని చెప్పలేము.

"అవ్వకు జ్వరం కాచింది కాబోలు" అని "ఏది, చెయ్యి చూడనియ్యి" అని మహాశయు డన్నాడు.

నాడి చూస్తూ అతడు చతికిలపడి యుండి "ఎప్పటినుండి వస్తోంది జ్వరము?" అన్నాడు.

"పెద్దబాబూ, జ్వరం లేదండి"

నాడి చూస్తూ, చూస్తూ "రాలేదంటావేమి? వచ్చి తీరింది జ్వరం" అన్నాడు మహాశయుడు.

"పెద్ద దెబ్బ తగలడంవల్ల కొంచెము జ్వరం వచ్చిందేమో! నొప్పి పోతే జ్వరం పోతుంది". అని మేలిముసుగులోనుంచి ముసలిది పలికింది.

"అవును, నిజం చెప్పేవు. నొప్పిపోతే జ్వరం పోతుంది" అన్నాడు డాక్టరు.

"బాబుగారూ! వద్దు, వద్దండి. తమరు జ్వరానికి మందీయకండి. జ్వరం తనంత తానే పోతుంది. కాని నొప్పి తగ్గేందుకు ఏం చెయ్యాలో అది చేయండి. జ్వర చికిత్స వద్దంటే వినండి. అది లేదే లేదనుకోండి. కాస్త క్వినైన్ పుచ్చుకున్నా, ఇంజెక్షన్ గుచ్చుకున్నా, అది ఉండదు. నోరు కట్టివేశాను. ఉపవాసాలవల్ల నీరస పడిపోయాను. ఇక కూడిమాడి చావలేను" అని ముసలిది మూలుగుతూ, మూలుగుతూ పలికింది.

డాక్టరు నవ్వుతూ "నీవు లంఖణాలు చేయవలసిన పనిలేదు. మాడమని నేను చెప్పడంలేదు. నీ సంగతి, నీ రోగం సంగతి యీ వేళే నేను చూడలేదు. నువ్వు పెళ్ళికుమార్తె వైనప్పటినుంచీ నిన్ను చూస్తున్నాను. ఈ జ్వరం యీనాటిది కాదు. జ్వరం మూటకట్టుకుని ఇక్కడ అడుగుపెట్టేవు. అప్పటి నీ జ్వరాన్ని నేను ధైర్యంతో ఎదుర్కొన్నాను. ఎదుర్కోనడమే కాదు, దాన్ని హతమార్చి వది లేశాను. అర్ధ రాత్రివేళ మగవి ప్రాణాలుతీసి, పది పిడచలు దిగమ్రింగేవు. ఈ మాట ఎక్కడా చెప్పవద్దని నీ భర్త ఆనాడు పెద్దపెద్ద ఒట్లు పెట్టుకున్నాడు. మళ్లీ నీ చేత మందు మింగించి పథ్యం పెట్టించింది నేను" అన్నాడు.

మేలి ముసుగులో నాలుక కరచుకొని సిగ్గుతో తలవంచుకొన్నది మతి తల్లి.

వైద్యుని ఉద్దేశమునకు విరుద్ధముగా ఆమె భర్త ఆమెచే అన్నము తినిపించ లేదు. తానే అట్లు భుజించింది. దొంగతిండి తినుచుండగా మగనిచే ఆమె పట్టు పడింది. ఆ మరునాడే డాక్టరును అడిగి ఆతడు పథ్యము పెట్టించాడు. ఇది దశాబ్ద ముల నాటి మాట.

డాక్టరు "అయితే ఇప్పుడు నీ కేమి తినాలని వున్నదో చెప్పు." అన్నాడు.

రోగి తల వంచుకొని యున్నది. ఈ రీతి ప్రసంగధోరణిలో ఆమె ఏమి ప్రత్యుత్తర మీయగలదు? లజ్జతో నేలలో తల దూర్చుకొనవలెనని ఆమె ఉద్దే శించినది. "చెప్పు. బిడియమేల? నీ కిష్టమైన పదార్థమును తినుము. నీ ఆరోగ్యము యావత్తూ నీ రుచిపై ఆధారపడి వున్నది" అని తెలిపి, డాక్టరు మతి దిక్కుగా చూచి "ఏమోయీ! మీ అమ్మకు ఏమి కావలిస్తే అదిపెట్టు. తెలిసిందా?" అన్నాడు.

మతి ఉక్కిరి బిక్కిరి యైనాడు. "అయితే, పెద్ద బాబూ! ఇప్పుడు ఆమె కాలినొప్పిని పోగొట్టు మందు మాట ఏమంటారు? విషయం ఏమైనా అణచి పెడు తున్నారా యేమి?" అని శంకతో ప్రశ్నించాడు.

"అబ్బెబ్బే! అణచడం లేదు, గిణచడం లేదు. మీ అమ్మకు కడుపునిండా మెక్కపెట్టు. ఈమె భోజనపు ప్రియురాలని నే నెరుగుదును. కాళీ గుడిదగ్గరకు పోయి, కొంత మట్టితెచ్చి వాచిన చోటున దట్టంగా పెట్టించు. ఇంతకంటె చెప్పవల సిందేమి?" అని జీవనమహాశయుడు అన్నాడు.

మేలిముసుగు ఇంచుక తొలగించి మతి తల్లి "స్వామీ! ఈ బాధ నా ప్రాణాలు తోడేస్తుంది" అన్నది.

"అయితే నిప్పుతో కాపడం పెట్టండి. నిప్పు నూరు వైద్యములపెట్టు. అగ్ని కంటె మేలైన ఔషధం ముల్లోకాలలోను లేదు".

"అంతేనా? మీరేమీ చికిత్స చేయరా? ఇష్టమైనపదార్థం తినమంటారేల? భోజనానికీ. కాలినొప్పికి ఏం సంబంధము ఉన్నది బాబూ? అయితే స్వామీ! ఇక నేను బ్రతుకనా?"

అని మతి తల్లి మొగముమీది నుండి ముసుగు తీసివేసి రెప్పలు వాల్చక డాక్టరును తేరితేరి చూడ దొడగినది. అది విడ్డూరపు చూడ్కి. ఆ దృష్టిలో కఠినమైన ప్రశ్న వ్యక్తమౌతూ ఉంది. ముసలిదాని బ్రతుకులో ఇదియే తుది ప్రశ్న కాబోలు.

ఆ దృష్టి సమక్షమున ఎవరు నిలువ గలరు? మూడు రీతుల వ్యక్తులు నిలువ జాలుదురు. మరణదండన జారీచేయు న్యాయమూర్తి ఒకడు. అపరాధి "అయ్యా! నేను చావవలసినదేనా?" అని ప్రశ్నించినపుడు "చచ్చి తీరాలి" అని బదులు చెప్పు న్యాయమూర్తి అతడు. రెండవవాడు దోషికుత్తుకకు ఉరిత్రాటిని కట్టువాడు. మూడవ వాడు చికిత్సకుడు.

అతని తండ్రి జగత్ మహాశయుడు భక్తకోటిలోని వాడు. అంత్య ముహూర్తములో రోగి కాతడు భక్తియోగమును బోధించువాడు. "గోవిందా! గోవిందా! అనుకో. హరినామస్మరణము చేయుము. ఇష్టదైవమును ఆరాధింపుము. బాధనుండి దాటించేది ఆ హరినామము" అని ఆతడనుచుండువాడు.

వైద్యవృత్తిలో ఆతని గురువు రంగలాల్. ఆతడొక విచిత్ర వ్యక్తి. రోగిముందు మృత్యువును గురించి మహోపన్యాసము లిచ్చువాడు కాడు. కాని వ్యాధి పీడితుని గురించి ప్రశ్నించినపుడు ఆతడు "మందులూ మాకులూ రోగమును నయము చేస్తాయి గాని చావును తప్పిస్తాయా?" అని సాగిన పదములతో ముందంజ వేసి నిష్క్రమించువాడు.

నేడు జీవన మహాశయుడు మతిమొగమును చూచి నవ్వుతూ, "ఇక నీవు దుఃఖపడవలసిన పనిలేదు. మీ అమ్మ అదృష్టవంతురాలు. కొడుకూ, కోడలు, మనుమలూ, మనుమరాండ్రూ - యీ రీతి దోసపాదుని ఎక్కడ చూస్తాము. ఇందరి చేతుల్లోంచి వెళ్ళిపోయే భాగ్యం ఆమెకు కాక మరెవ్వరికి దక్కుతుంది? ఇక బెంగెందుకు? బెంబేలెందుకు? కాని ఇహలోకమునుండి సెలవు తీసికొనక ముందు, ఈమెను ఏదేని తీర్థస్థానమునకు తీసికొనిపోవడం మంచిది" అన్నాడు.

"తమ సలహా దొడ్డదే! తీర్థయాత్ర చేసేందుకు మాదగ్గర పైకమేది?" అన్నాడు మతి.

"ఇందు అమ్మక్కు ఏముంది? పది క్రోసుల దూరం పోతే తీర్థం తనంత తానే ప్రత్యక్షమౌతుంది. రైలు ప్రయాణం కష్టం కాదుకదా! ఏ కొంపలోనైనా తల దాచుకోవచ్చును. రద్దీలేని ఊరికే తీసికొని పోవచ్చును. ఒక నెలదినాలు గంగా తీరంలో వుంటే, పవిత్రమైనగంగా వాయువు ఒంటికి తగిలితే, ముసలిదానికి కొత్త కళేబరం ఏర్పడుతుంది. అలా జరగకపోతే...."

మాట పూర్తి చెయ్యకుండానే జీవనమహాశయుడు వెలుపలికి పోయి గుమ్మం ముందు నిలిచి, రెండు చేతులూ జాపి, "మతీ! చేతిపై నీరు పొయ్యి" అన్నాడు.

# రెండవ ప్రకరణము

డాక్టరు మనస్సు పాడుకాలేదు. మతి తల్లికి పెద్దవయస్సు వచ్చింది. ఒళ్లు అనేకరీతుల శిథిలమై పోయింది. వాతజ్వరం, కడుపులో గగ్గోలు - నానా విధముల విజృంభించు వ్యాధి. మీదుమిక్కిలి చెరువుగట్టున పడిపోవుటవలన మోకాలి చిప్పకు గట్టి దెబ్బ తగిలింది. ఎముక బెణికిందో విరిగిందో దేవు డెరుగును. ఆమెకు ఒక్కడే కొడుకు. కోడలు, మనుమలూ, మనుమరాండ్రూ ఉన్నారు. ఆమె నిజముగా అవ్వయే। ఇక సుఖంగా పృథ్వీరంగంనుండి నిష్క్రమించవచ్చును. కాని అలా నిష్క్రమించాలనే ఉద్దేశం ఆమెకు లేనేలేదు. ఒక్క చూపుతోనే డాక్టర్ ఇట్లని గ్రహింప గలిగినాడు. మృత్యువంటే ఉలికిపడే బాపతులోనివాడు కాడు అతడు. ఈ రీతివారు పుడమిలో అరుదుగా ఉందురు. కనుకనే కాటోలు ప్రపంచం ముందుకు సాగిపోతోంది.

పాపం అవ్వ కారుచీకటిలో కూలిపోయింది. ఆమె బ్రతుకే అంధకార బంధురమై పోయింది. ముసలిదాని నెత్తికి నేరం కట్టనేల? మనుమలతో, మనుమ రాండ్రతో తామర తంపరగా పెరిగింది సంసారము। ఇందులో ఆమె చిక్కుపడి పోయింది.

"అహన్యహని భూతాని గచ్ఛంతి యమ మందిరం
శేషః స్థిరత్వ మిచ్ఛంతి కిమాశ్చర్యమతః పరమ్"

ఈ 'ఆశ్చర్యము' ఈనాటిది కాదు. ఇది సనాతన మైనది. అవ్వ దీనికి గురియైనది. కాని ఆమెపోయి తీరవలెను. పోవుటే ఆమె పట్ల మంగళకరము. ముమ్మాటికీ మంగళకరము.

ఇక కదలిపోనియెడల ఆమెకు దాపురించు చేటునకు అంత ముండదు. అది కడలేని పాటే యగును.

ఇక జీవన మహాశయుడు? అతని దేహము బరువైనది. అతికాయ మహాకాయ వర్గంలోని మహనీయుడు. నడచునపుడు శరీర భార మంతా అడుగులపై పడి పోవును. తెరువునుబట్టి అతడు నడచునపుడు దాపలి ఇండ్లలోని వారు "జీవనం గారు నడుస్తున్నారు" అని తెలుసుకోగలరు.

అది శ్రావణ మాసం. వర్షాకాలం. తుంపురులు సదా పడుచునే ఉండును. బాట బాడెతో నిండి ఉంది. నేలపై చూపుంచి అడుగు వేయక పోయినయెడల అతని మహాకాయము గుభాలున ధరిత్రిపై పడడం నిక్కము. ఈ పరిస్థితి అతని మనస్సుకు గొప్ప సంకటమే కలిగించింది. కాని అది మాపగునది కాదు. బురదలో కాలు జారినయెడల ఉలికిపడని వారెవ్వరు? పృథ్విని గురించి ప్రజ లిట్లు చెప్పుకుం దురు. "ధరిత్రీదేవి! మాతృదేవి! సస్యశ్యామలయై కోమలాంగియై వెలయును." కాని కూలిపడునపుడు భావనా బంధురకవిత్వ సౌధము కూడ కూలిపడును.

జీవన మహాశయుని ఉత్తమాంగంలో ఊహా పరంపర అవిరతముగ పెరిగి పోతున్నది. కులుకుతూ కులుకుతూ లెక్కపెట్టుకొని మహాశయుడు అడుగులు వేస్తున్నాడు.

తటాలున నిలిచి అతడు "అరే! అరే! ఏమిపని అది?" అని హెచ్చరించి నాడు.

బాటలో ఒకగుంట ఉన్నది. ఇపుడు అది వాన నీటితో నిండియున్నది. ఇద్దరు పిల్లలందు పరమోత్సాహముతో, విశేషోల్లాసముతో ఆటలాడుతున్నారు. బురదనీటిని నలుదిక్కులందు చిమ్ముచున్నారు.

డాక్టరును చూచి వారు ఆట మానివేసిరి. జీవన మహాశయు డిచట సర్వజన మాన్యుడు.

"ఏమిరా! ఏంచేస్తున్నారు? ఏమిపని యిది? అని అతడు ప్రశ్నించాడు.

"గుంటలో చేపలు పడుతున్నాం. చూడండి – ఇక్కడ ఎంతపెద్ద చేప ఉందో!"

"ఒరే నువ్వు మదనంగారి కొడుకువు కాదట్రా?"

"అవునండి, మదనుని కొడుకును. వదనుణ్ణి." డాక్టరు నవ్వి "మదనుని కొడుకు వదనుడవా? మదనుని కొడుకు అనడం నిజమే! కాని వదనుడు పట్టి కుంక! కుంకల్లో కుంక. చెవలమ్మల అధ్యక్షుడు" అన్నాడు.

"ఏమండీ! ఎందుకీ దూకుడు? నేనే ంచేశాను?"

"అడుగుతున్నావా?" కంఠస్వరం కొంచెం స్నిగ్ధ మొనరించి డాక్టరు "ఈలా అబ్బ పేరూ నీ పేరు కలప వచ్చునా? ఛీ! ఛీ! "అన్నాడు.

"చిత్తమండి. నిజం చెప్పేరు. శ్రీ మదనలాల్ మహాశయుని పుత్రుడనండి నేను. నా పేరు శ్రీ వదనలాల్ అంటారు! అని చెప్పలేవా? తెలిసిందా?" మరల జీవన మహాశయుడు పలికెను.

వదనుడు తలవంచుకొన్నాడు. ఉల్లాసముతో ఆతడు ఆడుతున్నాడు. "మరి వీడెవరు" అని డాక్టరు అడిగినాడు. రెండవ పిల్లవాడు మంచి లక్షణములు కలవాడు. అందమైన మొగముగలవాడు. అతడీ పల్లెవాడని తోచుట లేదు.

డాక్టరు ప్రశ్నకు అతడు ఉత్తర మొసగ లేదు.

"వీడు మన వూరు వచ్చాడు. సర్కారు కుటుంబము లోనివాడు. మామయ్య గారింటికి వచ్చాడు" అని వదనుడు అన్నాడు.

"అలాగా? మంచిది. అహీంద్రుని కూతురు అతసీ కొడుకువట్రా".

రెండుమారులు తల పంకించి, "అవునండి. అవునండి" అన్నాడు బాలకుడు.

"నీళ్ళలో నానకండి. రొంప వస్తుంది. జ్వరము వస్తుంది. తలనొప్పి వస్తుంది. ఇంటికి పొండి!"

"అయితే అయ్యగారూ! మీ రెందుకు తడుస్తున్నారు? అని అడిగినాడు వదనుడు.

ఉల్లాసముతో డాక్టరు పక్కున నవ్వినాడు. "ఒరే! దుష్టుడా! నువ్వు నేనూ ఒక్కటేనా? నేను డాక్టరును. నన్నుచూచి రోగాలూ రొష్టులు భయపడి పారి పోతవి. పొండి, ఇక పొండి. నాతో రండి పోదాము."

ఇరువురు కుఱ్ఱవాళ్ళను వెంటగొని జీవనంగారు కదలిపోయినారు. చతురంగపు సామగ్రితో సతీశుడు రాకపోయిన యెడల ఈ బాలకులతో ఉల్లాసముగా కాలక్షేపము చేయవచ్చునని అత డనుకొనినాడు నడుస్తూ, నడుస్తూ.

"పుల్లని పండ్లను తింటే అజీర్ణం వస్తుందని యెరుగుదురా? అజీర్ణం వల్ల జ్వరం వస్తుంది. కాని డాక్టరులు ఆ పళ్లు తిని జీర్ణించుకోగలరు. ఇతరులు వాటిని తిన కూడదని చెపుతూ ఉంటాను" అని అత డనినాడు.

ఇంతలో ఆరోగ్యనికేతనపు వరండాలో సురేశుడు వచ్చి కూర్చుని యున్నాడు. డాక్టరుని చూచి, ఆతడు. "ఎక్కడికిపోతివా" అని యోచిస్తున్నాను. ఎక్కడికి పోతివో! నందుడుగాని ఇందిరగాని యిరువురిలో ఎవ్వరు లేరే!" అన్నాడు.

"మీరింటికి పొండు" అని పిల్లలిద్దరను విడిచి, సురేశు నుద్దేశించి డాక్టరు "కార్మికుడు మతి ఇంటికి పోయాను. వానితల్లినుండి కబురు వచ్చింది. కూర్చో కుర్చీ వస్తుంది. ఈ లోపుగా హుక్కా వెలిగించు. ఇందిర బయటికి పోయింది" అన్నాడు.

ప్రతి దినము ఇంటిలోని వారు హుక్కావ్యవస్థ చేస్తూ వుంటారు. అన్నము కూడా మూతపెట్టబడి వుంటుంది. చతురంగపు ఆటకు కూర్చున్నపుడు సమస్త ప్రపంచమును మరచి మిత్రులిద్దరు అందు నిమగ్నులై వుంటారు. కాని నెచ్చెలు లిద్దరికి తొల్లింటి శక్తి సన్నగిల్లి ఉత్సాహం కొరవడింది.

టీ త్రాగి ఇద్దరూ ఆటకు కూర్చున్నారు. చతురంగపు కదనంలో తీవ్రంగా ఢీ కొన్నారు. సురేశుని మంత్రి తటాలున మరణించాడు.

అవ్వల ఆకాశంపై మబ్బు దట్టంగా క్రమ్ముకొనిపోయింది. వాన జోరుగా ఆరంభింపనున్నది. కడువడిగ చినుకులు పడినట్లున్నవి. భయంకరంగా హెచ్చునను సూచన అగపడుతోంది. ఇద్దరూ కదలక మెదలక ఘోరమైన చతురంగపు భండనంలో ఒకరి నొకరు ఎదుర్కొనుచున్నారు.

కొన్ని క్షణములైన పిదప సురేశుడు "చలి వేస్తోంది, జీవన్, లోపలికి పోదాము" అన్నాడు.

"నీకు చలివేస్తోందా? నాకు చాలా హాయిగా ఉందే!"

"నీ సంగతి, నీ కథా వేరు. ఒంటి నిండా కావలసినంత కొవ్వు పెంచుకొని వున్నావు. నీకు చలివేస్తుంది? నా ఆరోగ్యం ఇపుడు బాగులేదు."

"జ్వరం రాలేదు కదా! ఏది ఒక పర్యాయం చెయ్యి చూడనియ్యి" అని డాక్టరు మిత్రుని చేయి పట్టుకొన్నాడు.

"బాబూ! పాహిమాం, పాహిమాం. నువ్వు నా చెయ్యి చూడనక్కరలేదు. కొంతకాలం నన్ను బ్రతుకనియ్యి. నాడి చూడడం నీ కొక వెఱ్ఱి. కొందరి హస్త స్పర్శ కలిగిన ముహూర్తమందే రోగులు చావడం మొదలుపెడతారు. ఆ ముఠాకు

నీవు నాయకుడవు. నాడి చూడడం నాకూ కొంత తెలియక పోలేదు. కొంచెం ఉష్ణం వచ్చినట్లు గా తోస్తూంది. కాని దీని వల్ల వచ్చే ప్రమాదం లేదు. రా లోపలకు పోదాము.'' అని సురేశుడు డాక్టరు పట్టునుండి తనచేతిని వదల్చుకొన ప్రయత్నించాడు.

కాని జీవన మహాశయుడు మిత్రుని చేతిని వదలలేదు. దానిని బలముగా లాగినాడు. ''ఆహా! ఉష్ణం ఎంత తీవ్రంగా ఉంది! ఇప్పటివరకు నీ నాడి చూసే అవకాశమే నాకు లభించలేదు.'' అన్నాడు.

హస్తమును విదల్చుకొనుటకై సురేశుడు పెద్ద ప్రయత్నం చేశాడు. జీవనం గారి పట్టు భల్లూకపు పట్టువలె ఉన్నది.

''వదులు, చెయ్యివదులు. జీవన్! ఏమిటీ మొండిపట్టు?''

''పిచ్చివానిగా ప్రవర్తించకుము. నాడి చూడనియ్యి. నేను చూచితీరుతాను''.

''నీకీ కసి ఎందుకోయి?''

''ఎంతకాల మిచట?''

''నా చేయి వదలుము. నా నాడి నీవు చూడనక్కరలేదు.'' అని అరచి సురేశుడు లేచి నిలిచినాడు.

''అరే? నీకేమయింది? ఏమి యీధిక్కారం?'' అని ఆశ్చర్యముతో జీవన మహాశయుడు పలికినాడు.

''వదులు! నా చేయివదులు!'' అని జీవనంగారిని ఒక్క త్రోపు త్రోసి సురేశుడు చేయి వదల్చుకొనినాడు. వాని లాంతరు ఒకవైపున పడియున్నది. దానిని వెలిగించుకొనుటకై తడయక, సురేశుడు తక్షణమే అందుండి లేచి పోయినాడు.

'సురేశ్! సురేశ్! ఒహో సురేశ్! గొడుగు, గొడుగు! నీ గొడుగు!''

సురేశ్ మరలినాడు. గొడుగు తీసికొని, లాంతరు వెలిగిస్తూ వెలిగిస్తూ అతడిట్లన్నాడు.

''జీవన్! ఇకముందు నీవు నీ నాడి చూచుకొనుట మంచిది. నేను చెప్పి వేస్తున్నాను. నీ రోజులు దగ్గరికి వచ్చాయి. ఇతరుల నాడి చూచి చావు మూడు తుందని నోటీసు ఇస్తూ వుంటావు. నీ నాడి నీవు చూచుకొని, టపా కట్టేందుకు తయారు కమ్ము.''

వాన హోరున కురుస్తూనే ఉంది. ఆ కుంభవృష్టిలోనే సురేశుడు పరుగు పరుగున అందుండి కదలిపోయాడు.

పాపము జీవన మహాశయుడు కదలక మెదలక ఏమీ పలకక కొయ్యవలె నిలబడిపోయినాడు. సురేశుడు అకారణముగ అపుడపుడు క్రుద్ధుడై, రుద్రుడై లేచిపోతూ ఉంటాడు. చతురంగపు ఆటలో ఎత్తు మరచినపుడో, ఒకదాని వెంబడి వేరొకటి జంతువు చచ్చినపుడో తనపై తానే చికాకుపడును. ఏదో నెపముతో అతడు కలహించును. లేచిపోవును. మరి ఈ జన్మలో తిరిగిరానట్లు అతడు చింయకొని చెలరేగును. మర్నాడు డాక్టర్ వాని యింటికి పోతూవుండును. కడచిన నాడేమీ జరుగనట్లే సురేశుడు "జీవన్, రా! వచ్చికూర్చో. నేనే నీకోసం రావాలని అనుకొంటున్నాను. నీవే వచ్చినద్దావు" అని అంటూ వుండును.

గుమ్మముపొంత కొంతసేపు నిలిచి జీవన మహాశయుడు ఇంటిలోనికి మరల నుంకించెను. వైద్యశాలను మూయబోయి అతడు ఆకస్మికముగ నిలిచినాడు. నేడు సురేశుడు ప్రదర్శించిన ఆగ్రహము ప్రచ్ఛన్న సన్నిపాత జ్వరము కాక మరేమి? అని అతడనుకొనినాడు.

సురేశుని శరీరమున ఉష్ణ ముండెను. కాని నాడీ పరీక్ష కాతడు సమ్మతింప లేదు. డాక్టర్ కనుబొమ్మలు ముడివైచి, అట్లే కొంతసేపు నిలిచినాడు.

"ఒకపర్యాయం వానియింటికి పోయివత్తునా?" అని అతడు అనుకొని నాడు. కాని పోయినందునలన ఫలమేమీ ఉండదని ఆతడు తలపోసినాడు. తన నాడి చూపించుకొనుటకాతడు సుతరామూ సమ్మతింపలేదు. ధూమధామము చేసినాడు. అగ్నిహోత్రుడై అంతర్ధానమైనాడు.

ఇంతవానలో మిత్రుడు తడిసిపోవుట జీవనం గారికి కష్టముగనే ఉన్నది. ఇప్పుడు చేయవలసినదేమి? జరగనిదేమో జరిగిపోయినది.

మృత్యువును రోగమును ఒకప్పుడు కలియును. వేరొకప్పుడు విడివడును. ఇవి మిగుల విచిత్రములైన విస్మయ జనకములైన ఘట్టములు.

మఱునాడు :

సాధారణముగా జీవన మహాశయుడు కొంచెము ఆలస్యముగా నిద్దురనుండి లేచును. కాని నేడాతడు పెందలకడ లేచినాడు. రాత్రి అతనికి నిద్ర బాగుగా పట్టలేదు. సురేశునిగురించిన దుశ్చింత అతని మనసున కలవరపాటు కలిగించెను.

అదెంత ఉద్భటమైన చింత! తన అనుభవములో అత డెన్నెన్నిరీతుల రోగలక్షణ ములనో ఎరిగియుండెను. ఆ లక్షణములతో సురేశునందు చెలరేగిన లక్షణములను పోల్చి చూచి, సరిచూచి పరిశీలింపసాగినాడు. పరిశీలించిన కొలది రెండురీతుల యోచనలు వానియందు స్పష్టము కాదొడగినవి.

సురేశుని బలవంతముగ నా ఆలింగనమున బంధించి వైచి నా యింటిలో ఏల నిలుపక పోతినా? అని వాపోవదొడగెను. కుండపోతగా కురియు వానలో వానిని పోనిచ్చుట మంచిపని కాలేదని అతడు తలపోసెను. ప్రచ్ఛన్న సన్నిపాత జ్వరమువలన ఆతడు పీడింపబడుచుండెనని జీవన మహాశయుని భయము. ఆతని సిద్ధాంతము లన్నియు మృత్యుబిభీషికకు సహపాఠులే! వాని భయమునకు అప్పటి పరిస్థితులు తోడుపడినవి. కుంభవృష్టియందు తడియుచు ఆతడు చరచర సాగిపోయినాడు. రొంపతో జ్వరము ప్రబలమైనయెడల వ్యాధి విషమించి తీరును.

సురేశునకు పెద్ద వయస్సు వచ్చినది. బ్రతుకులో వానికి చెప్పదగిన ముడి ఏమీ లేదు. పెండ్లాము ముడి ఉన్నదని స్థూలదృష్టితో చెప్పవచ్చును. కాని సూక్ష్మ దృష్టి పరిశీలనమువలన ఆ ముడి ముడిగా లేదని తేటపడును. ఆమె మిగుల సామర్థ్యముగల ఆడుది. ఆత్మపరాయణ. సురేశుడు లేక పోయినను, ఆమెకు కలుగు ఇబ్బంది అంతగా లేదు. ఆతడు లేక పోవుట వలన వచ్చెడు లోటు జీవన మహాశయునకే! మిత్రుడు హంశక్కి యైన యెడల డాక్టరు దినములు గడవవు. అత డెవరికొరకై బ్రతికియుండవలెను?

ప్రొద్దున లేచి, జీవన డాక్టరు సురేశుని యింటికి పోవుటకై సిద్ధపడినాడు. ఆతనిభార్య రేపకడ లేచును. ఆమె విచిత్ర స్వభావమందలి విచిత్రతమ విషయమిది. పడకనుండి లేచిన తడవుగ స్వీయ వ్యక్తిత్వమును అద్భుతరీతిని ప్రకటించు కొనును. ఆ మహిళామణి పేరు దుర్గ. భీషణసంగ్రామమునకై సన్నద్ధమగు దశ ప్రహరణ ధారిణి వలె ఆమెమెదడు కుతకుత ఉడుకుచుండును. ఉడికిన కొలది ప్రళయతాండవము విజృంభించును. పిడుగుల వాన వలె దురూక్తులు వెడలును. ఎల్లకడలందు భయవాతావరణము విస్తరించును. ఇంటి పునాదులు వెలుపలికి నురికి మేఘ పటలముపై చరపులు చరచును. సమస్త జీవరాసులు ఈ ధాటికి కొంతసేపు తాళుకొనవలెను. కొంతసేపైన పిదప ఆమె శాంతించును. తెప్పరిల్లును. విమ్మళించును. ఆశ్చర్యము కలిగించు తీరున ధీరస్థిరచిత్త యగును. ప్రళయ

మును చెలరేగ నిచ్చుటయే భర్త లక్ష్యము. అత డాలస్యముగా లేచుటకు గల కారణములో ఇది ఒకటి. ధర్మపత్ని స్థిరచిత్తయైన పిదప, దానవి కాక మానవియై ఆమె నిలిచిన పిమ్మట ఇంద్రాక్షీమంత్రమును జపించుకొనుచు ప్రక్కనుండి కడు జాగరూకతతో ఆతడు మహాకాయమును లేపుచుండును.

అమ్మవారు చాలసేపటికి మున్నే లేచి, ముందు ప్రత్యక్షమైన అభాగినిపై విరుచుకొని పడుచుండును. ఆమె అంట్లుతోము పరిచారిక. ఇసుక, కంకర, కచిక, మన్ను ఇటుకపొడుము వగైరా సామగ్రిని చేబూని గట్టిగా మిగులగట్టిగా పాత్రలను తోమవలెనని ఆమె హెచ్చరించును. తక్షణమే ఆమెయాజ్ఞను పరిచారిక శిరసావహించి తీరవలెను. తాను చెప్పుతీరున అంట్లతప్పేలలు తోమిన యెడల వాటి ఆయుష్కాల మెంత యని ఆమె యోచింపదు. ధరిత్రిలో సిద్ధ పురుషులు, మృతువును ఇచ్ఛాధీన మొనరించుకొనువారును ఉండుట నిక్కమే! ఇట్టివారు పయితము తలపై దెబ్బలు పడినపుడు చచ్చితీరవలసినదే! ఇక పాపము కంచు పాత్రల మాట చెప్పనేల? ఇసుక మున్నగు పదార్థము లతో రెండువేళలందు వాటిని తోమి తోమి విడిచినయెడల అవెన్ని దినములు భూతలమున నిలుచును? కంచుపాత్రల వెల దినదినము పెచ్చుపెరిగిపోవు చున్నది! ఆ జ్ఞానము ఆమెకు కలుగవలసి యుండెను.

డాక్టరు లేచి, "శాధిమాంత్వాం ప్రపన్నం" అని శ్రీ కృష్ణపరమాత్మని తలచుకొని, గుండెను కుదుటపరచుకొని, ఇంచుక దగ్గి, గొంతుని సవరించుకొని అల్లనల్లన అడుగులు వేయదొడగినాడు. తదుపరి దైవ సాహాయ్యము తనకు చేకూరుటచే ధైర్యసాహసములను చిక్కబట్టి, గృహరాజ్ఞికి వినబడునట్లు స్వగత మున "నేనొక పర్యాయం మఠానికి పోవాలి" అనినాడు. మంచమునుండి లేచీ లేవగనే మొట్టమొదట ఆత డబద్ధ మాడవలసివచ్చెను. అట్లాడకపోయినచో వీరపత్ని చేయు హుంకారమువలన దిక్తటములు విరిగి నేలపై పడెడివి. భస్మ లోచన భస్మ కారిణియై ప్రచండ రూపము దాల్చి జగములను బెగ్గిల జేయును.

జీవనమహాశయుడు "బ్రతుకు జీవుడా!" అనుకొని కొంపనుండి బయట బడినాడు. బజారులో ప్రవేశించినాడు, పెద్దరస్తాగుండా అడుగులను సాగనిచ్చి నాడు. అందుండి చిన్న సందులోనికి అతికాయమును మరలించినాడు. తద నంతరము మెల్లమెల్లగ అంజలు వేసినాడు. సురేశుని గుమ్మము ముందు నిలిచినాడు.

"సురేశ్ !" అని పిలిచినాడు.

అంతకుముందే ఆతడు నిద్రనుండి లేచినాడు. బల్లపై కూర్చుని హుక్కా పీలుస్తున్నాడు. డాక్టరుని చూచి నవ్వి "వచ్చినావా ? వచ్చినావటోయీ" అన్నాడు.

బల్లపై నెచ్చెలి సమీపమున కూర్చుని జీవనమహాశయుడు "జరిగినదేదో జరిగినది. నూరుచెప్పు వెయ్యిచెప్పు. మనము అంతరంగ మిత్రులము. ఇపుడు జ్వరం లేదుకదా! మొగం చూస్తూ వుంటే వృష్ణం పోయినట్లు తోస్తోంది" అన్నాడు.

బ్రతుకు మీది తీపిని సురేశుడు వదులుకొనినాడు.

చేయి జాపి "చూడు" అనినాడు. డాక్టరు నవ్వి "చూడమంటావా ?" అన్నాడు.

"చూడుము. ఏమిమందు సేవించాలో చెప్పుము. ఇక నే నీబాధలు పడలేను. బ్రతుకంటే రోత పుట్టుతోంది."

"అట్లని నిన్న రాత్రే బోధపడింది. అయితే, నాపై అంతగా కోపగించి నావేమి ?"

సురేశుడు మరి ఆ మాటెత్తలేదు. వేరు ధోరణిలోనికి దిగినాడు. "మన ఇరువురి జాతకములు ఒకే రీతిగా నడుస్తున్నాయి. మా ఆవిడ నిన్నరాత్రి నాతో ఏమి చెప్పినదో ఎరుగుదువా ? గుప్పెడు మురమురాలైనా నా నోటిలో పోసింది కాదు. 'రొంప పట్టింది. ఒళ్లు వేడిగా ఉంది. మురమురాలు తిని పాలుత్రాగు మని జీవనం చెప్పేడని మనవి చేసికొన్నాను. నెయ్యి, మైదాపిండీ కలవు కదా ! నాలుగు లూచీలు చేసి నామొగంపై వేయగూడదా ?' అన్నాను ఆమె నుద్దేశించి. ఇంటిలో మైదాపిండికి కొదువలేదు. నెయ్యికి పేదరికం లేదు. కనుకనే మనసులోని మాటలు చెప్పినాను. బజారుపిండి పనికిరాదు. నా పొలంలో ఒకటి రెండు మణుగుల గోధుమలు పండినవి. విసరించి పిండి చేయించాను. మరి ఇంటిపాడి ? పిండగా పిండగా ఒకటి రెండు సేర్లపాలు చెంబులో పడ్డాయి. కాబట్టి ఇంటి నెయ్యి తయారుచేయడం సాధ్య మయింది. అయితేం గాక ! కొంపలో ప్రళయం చెల రేగింది. నిద్రనుండి లేచునప్పటికే కడుపులో భుగుల్భుగుల్మని మంటలు లేచినవి. ఉదరగోళంలో ఖాండవదహనం చెలరేగిపోయింది. 'హతవిధీ ! మాలద్దైవమా !'

అనుకొన్నాను. ఏమి చేతును ! చతికిలపడి హుంక్కా పీలుస్తున్నాను. ఇలాంటి బ్రతుకు బ్రతకడంకంటె చస్తే మేలు కాదటోయి మిత్రమా ! బ్రతికి నేను చేసేదేమి ?"

సురేశు చేయిపట్టుకొని, "స్పర్శవల్లనే జ్వరంపోయినట్లు బోధపడింది. జ్వరంలేదు. నిన్నరాత్రి మీ ఆవిడ నీకు తిండి పెట్టకపోవడమే మంచిదైనది." అని డాక్టరు కొంతసేపు నాడిని పరీక్షించి "ఈ పూట కొంచెం ఎంగిలి పడడం మంచిది. కొంచెము చారూ, అన్నమూ పుచ్చుకో. ప్రస్తుతం కొంచెము టీతో ఏమైనా నోటబెట్టుకో ! ఇక జ్వరం రాదనే తోస్తోంది" అన్నాడు.

"ఏమైనా తినమంటావా ? ఇప్పుడే పుక్కిలించి ఉమ్మివేశాను. ఇంటిలో దేవతార్చన జరగనిదే ఎలా తినగలను ? అర్చన చేసేవారెవరు ?" అన్నాడు సురేశుడు.

"ఎవరిచేతనైనా దేవతార్చన చేయించకూడదా ?"

"ఎవరు చేస్తారు ? ఈ కాలపు వారిలో దేవతార్చనకై దేవుళ్ళాడేవారెవరు ? అర్చనపై ఎవరిమనసు పోతోంది ? ఎవరో ఒక అనూయకుడు ఛట్టోపాధ్యాయుల కుటుంబంలో ఉన్నాడు. వాని దగ్గరకు ఇప్పుడు పోయేవారెవరు ? పైగా పూజ చేస్తే ఎనిమిదణాలిమ్మని అతడు దండిస్తాడు."

"అయితేంగాక ! ఒళ్లముందా లేక సొమ్ముముందా ? పాపం అకలితో నీకడుపు కాలుతున్నది. నీ వేమైనా తిని తీరాలి. అందుకు తగిన ఏర్పాటు చేస్తాను. గ్రామంలో 'నా' అనేవారు లేకపోలేదు. అంత ముద్ద పెట్టక పోతారా" అన్నాడు డాక్టరు.

"కొంచెము టీ పుచ్చుకొన్నాను. ప్రాతఃకాలము ఊరక పోలేదు."

పదంపడి సురేశుడు అల్లనల్లన ఇట్లన్నాడు :

"జీవన్, మనసులోని మాట మరుగుపరచక నీతో చెప్పివేస్తున్నాను. కొంచెం హల్వా చేసి పెట్టమని మా అమ్మతో చెప్పు. మైదాపిండి జల్లిస్తే నూక వస్తుంది. కాని ఇంట్లో పంచదార లేదు. లేకపోతేంగాక ! బెల్లం లేకపోలేదు. తాటిబెల్లం కాదు సుమీ ! ఖర్జూరం కూడా ఉంది. ప్రతిరోజూ రాత్రిపూట అన్నం తిన్న తర్వాత పాలు త్రాగి, రెండు ఖర్జూరపుపళ్ళు నోటిలో వేసుకొని ప్రక్కపై మేను వాలుస్తాను. నేను నిద్రపోతున్నానని అనుకొంటుంది మా ఆవిడ".

జీవనంగారు నవ్వినారు.

సురేశుడు భోజనప్రియుడు. మిఠాయికై పలువరిస్తాడు. రకరకముల మృష్టాన్నమునకై చెవి కోసుకొంటాడు. ఎన్నెన్నిరుచులో ఆతడెరుగును. పెనిమిటి వైఖరి చూచి, పెండ్లాము పేళ్లూ, వద్దులూ పెడుతుంది. "నాలుక కోసుకోరాదా? తిండికోసం ఇంత రంధి పనికివస్తుందా? రుచులూ గిచులూ ఎంతకాలం సాగివస్తాయి. కావలసింది దొరకక పోతే బ్రతుకు బంజరై పోతుందా? ప్రపంచం చీకటి కోణ మవుతుందా! ఇది కావాలి అది కావాలి అని నోరుచేసుకోవడమా? ఏమి ఘోరకలి?" అని ఆమె మహోపన్యాసమిస్తుంది.

భోజనపు బాగోగులేమో ఆ వృద్ధదంపతులిరువురు ఎరుగుదురు. ముసలితనం వలన కక్కురితి, తిండికై వానికి పితలాటం ఎక్కువయింది. దీనివలన కొంపలో ఆలుమగల మధ్య పెద్ద తంపి రేగుతుంది. జీవనంగారు వచ్చి ఆలుమగల నడుమ అతికాయమును నిలిపి తీర్పుచెపుతూ ఉంటారు.

సురేశుని హల్వాప్రీతి ఎట్టిదో ఎరిగి డాక్టరు నవ్వుకొన్నాడు.

కనుబొమ్మలు విరిచి సురేశుడు "నవ్వేదెందుకు?" అన్నాడు.

"మందుచీటి వ్రాయుమని చెప్పినావా?"

నిమిషములో సురేశుని మొగము వాడిపోయింది. దానిని జీవనమహాశయుడు చూచినాడు. సమాదరంతో వానివీపుపై తట్టి అతడు "దానిమాటకేమి? భయ డపకు. నీవింకా ప్రపంచంలో చూడవలసిన దినాలు చాలా ఉన్నవి. పరలోకానికి పోయేందుకు ఆలస్యం ఉంది. బ్రతుకు తీపికి నోటి తీపి కలసివచ్చింది. కాని, యీ వేళ హల్వా నోట బెట్టకు. జ్వరం పూర్తిగా పోనియ్యి. ఈ పూట చాయ, అన్నమూ తిను. సాయంకాలం జ్వరం రాకపోతే.....ఏది నాడి? ఒక పర్యాయం చూస్తా! (ఒళ్లుచూచి) జ్వరం రాదనుకొంటున్నాను. వస్తుందో రాదో చెయ్యి చూడ నియ్యి" అన్నాడు డాక్టరు.

నాడి చూచి, అతడు "ఇక జ్వరం రానట్లే తోస్తోంది. హల్వా నీకు యీ వేళ కాక రేపు తినిపిస్తా. కాని మిత్రశేఖరా! హఠాత్తుగా నీ చిత్తము ఉరికిందేమి?" అని పలికినాడు.

"టీ అంటేనూ, మురముురాలూ, అటుకులు అంటేనూ వమనము వస్తోంది. నోటిచేదు చెప్పనలవిగాకున్నది. జీవన్, నీ వొక పనిచెయ్యి. అంగడినుండి నాలుగు

బిస్కత్తులు తెచ్చి, టీలో కలిపి ఇమ్మని మా ఆవిడతో చెప్పిపోబాబు, తేనీటిలో బిస్కత్తులు మునిగి తేలితే కొంత రుచి కలుగుతుంది." బిస్కత్తులు తాను కొని పంపెదనని డాక్టరు చెప్పినాడు. విషయం సురేశుని ఇల్లాలితో చెప్పినయెడల రోగియొక్క ప్రస్తుత స్థితిలో మురమురాలు తింటే మేలా లేక బిస్కత్తులు తింటే మేలా? అను విషయమును గురించి, వైద్యశాస్త్ర ధర్మశాస్త్రసంయుక్తపరిజ్ఞాన బంధురతర్కమును లేవదీస్తుంది. వైద్యవృత్తిలో సమానమైన పాయాగల వ్యక్తివలె ఆమె వాదిస్తుంది.

పూర్వకాలములో బిస్కత్తులూ, టిస్కత్తులూ అనేవి లేవు. అప్పుడు రోగులేమి తినేవారు? బిస్కత్తులు తినకపోవడం వల్ల వారి శరీరాలు విరిగి నేల గూలి పడినవా? వారి మనుష్యత్వం దిగజారి పోయిందా? వారి రోగాలూ, రోష్టులూ పోలేదా? అని ఆమె యూడించి ప్రశ్నిస్తుంది. ఆమె ఆడుదిగాక మగవాడై పుట్టిన యెడల, పెద్ద వకీలై ఉండేది. కేవలం ఆగ్రహించి, అల్లరిపెట్టుటేకాదు, తన యావత్తు సత్తువను ప్రయోగించి, ఒంటికాలిపై నిలిచి బ్రహ్మాండము బద్దలగునట్లు వాదిస్తుంది. ఆమె బ్రోల నిలిచి. ఆమె ఫాటీ నోర్వగల పురుషుడేడీ? ఈ యుగంలో జన్మించినా ఆమె తన జీవితమును సార్థకము చేసికొని వుండేది. ఈ రోజులలో ఆడువారు కూడా వకీళ్ళై, జడ్జీలై మేజిస్ట్రేటులై ఒప్పుతున్నారు కదా!

నెచ్చెలియిల్లాలి వైఖరి చూచినప్పుడు జీవనంగారి గుండె దడదడ లాడింది. ప్రకాశముగా అతడిట్లనినాడు. "ఈ కథంతా తాము మీ ఆవిడతో చెప్పవలసిన పనిలేదు. నేనింటికి. పోతూ బిస్కత్తులు కొని ఎవరిచేతనైనా నీకు పంపుతాను, నీవు వీధి అరుగుపై చతికిలపడి కనిపెట్టుకొని ఉండు, తెలిసిందా?" తన పథ్యం విషయమై మిత్రుడు ఏర్పాటు చేసినందుకు సంతృప్తి నంది డాక్టరు చేయిపట్టుకొని, "కూర్చో, కొంచెం టీ త్రాగి పోదువుగాని" అన్నాడు సురేశుడు.

"ఇక్కడ నేను టీ త్రాగుతూ కూర్చుంటే నీకు బిస్కత్తులు కొని పంపే వారెవరు? అది అటుండగా నేనుగాని నీవుగాని కర్మఫలం అనుభవించి తీరాలి కదా? మరొకరు మన కర్మఫలం అనుభవిస్తారా? నాకోసం ఇద్దరు ముగ్గురు రోగులు వచ్చి కూర్చుంటారు. నాడి చూపించుకు పోవాలని ఆతురపాటుతో మా యింట కనిపెట్టుకొని ఉంటారు."

ఇట్లని జీవనమహాశయుడు లేచి, నిలిచినాడు.

సురేశుని గురించిన దుశ్చింత ఆతని గుండె నుండి అంతర్ధాన మయింది. పరమానందముతో "హరి హరీ! మాధవా!" అని భగవన్నామ స్మరణ మొనరిస్తూ బరువు పాదములతో ఆతడు ఇంటి దెస అడుగులు వేస్తున్నాడు.

మహాశయుడు చేతిలోని గొడుగును తలమీదికి దింపుకొనినాడు. సాధారణ ప్రజలు ఎవరి ఇంటిలో రోగులుంటారో వారు చూచిన యెడల ఆతనిని విడువరు. "డాక్టరు గారూ! కొంచెం నిలబడండి. పిల్లవాని చేయి చూచి పొండి. ఒక పర్యాయం లోపలికి దయచెయ్యండి. పది దినాలనుండి మానాన్న మంచం పట్టి ఉన్నాడు. ఒకసారి నాడి చూచి పొండి" అని వా రనుచుందురు.

తదుపరి అనర్గళ ప్రశంస చెలరేగుతుంది! ఎడతెరపి లేని పొగడ్త! గుడ్డి గవ్వ చేత బెట్టక డాక్టరు గారిని అంబరవీధికెగుర వేయుట! మీదికి విసరబడేం దుకు డాక్టరేల అడ్డుపెట్టును? తండ్రినాటినుండి తనకాలం వరకు 'ఫీ' లేకుండానే వైద్యం చేసే సాంప్రదాయం వారిది. ఇప్పుడీ వయసులో ఆ పద్ధతికి కొంచెం చెట్ట పట్టింది. తొల్లింటి శూన్య విధము ఎట్లు చెల్లుబడి అవుతుంది? అది అట్లుండ—

ఈ వర్షాకాలంలో ప్రొద్దుటి నుండి ఆతని చెవిలో ఏదో నొప్పి పుట్టింది.

ధనికులకు జీవనంగారి వైద్యం యెందుకు? ఈతడు ప్రాచీనకాలపు కవిరాజు సంతతి లోనివాడు. అంతో యింతో ఇంగ్లీషు వైద్యం ముట్టినాడు. ప్యాసులూ, ఫ్యూసులూ ఎరిగినవాడు కాడు. ఆతనిది చదువు సంధ్య లెరుగని చాదస్తపు వైద్యం! ఈ కాలపు డాక్టర్లు ఎంత ఉన్నత స్థితి నందిరో! జీవనం గారిని చూచి "ఏం వైద్యుడితడు!" అని వారు వెక్కిరిస్తూ ఉంటారు.

చప్పు చప్పున ఒళ్లు మోసుకు పోయేందుకు పాపం జీవనమహాశయుడు శక్తి వంచన లేక ప్రయత్నిస్తూనే ఉన్నాడు.

బాట ప్రక్కనే ఉన్నది ఆసుపత్రి. దాని ప్రాంత తయారవుతూ ఉన్నది. కొత్త హెల్త్ సెంటర్. దానిపై చూపుంచక అందుండి ఎవ్వరూ ముందుకు పోలేరు.

అందుండి పోవునపుడు కూడ జీవనంగారు దానిని తేరిచూచినారు. అపు డందలి వారు గాఢ నిద్రలో నిమగ్నులై ఉండిరి. ఇప్పు డందరూ నిద్రనుండి లేచి నారు. ఆసుపత్రి వసారాలో కొందరు రోగులు బయటకు వచ్చి కూర్చున్నారు. పరిచారకులు పరిసర ప్రదేశములను చీపుళ్ళతో పరిశుభ్రమొనరించుచున్నారు. ప్రత్యేక

మైన తమ వసతినుండి నర్సులు ఆసుపత్రి దిక్కుగా పోవుచున్నారు. ఈ వైపున చారిటబుల్ డిస్పెన్సరీ వరండాలో కొందరు రోగులు వచ్చి కూర్చున్నారు. ఇంకా వస్తున్నారు. అవైపున హెల్త్ సెంటరు యొక్క నూతన గృహము తయారగుచున్నది. అది పెద్ద భవనము. అందెన్నియో ఏర్పాటు లున్నవి. ఎన్నెన్నో విభాగము లున్నవి. శిశువుల కొరకూ తల్లుల కొరకూ అందు వసతు లున్నవి. అంటువ్యాధులకూ, సాధారణ రోగులకూ పెద్ద సర్జరీ క్రియలకూ వేర్వేరు భాగము లున్నవి. రక్త పరీక్ష మొదలు సర్వ విధ పరీక్షలకు వ్యవస్థ లేర్పడుతున్నవి. అన్ని నిర్ణయములూ సక్రమముగా జరుగుతున్నవి. రకరకముల రుగ్మతలు పెచ్చిల్లు కొలది ఈ రీతి చికిత్సా విధానములు తల సూపకున్నచో వేరు మార్గమేది? తొలుత ఇందు తల యెత్తినది చారిటబుల్ డిస్పెన్సరీ. 1902 లేక 1903లో అది నెలకొనినది. ఈ నిర్మాణ కాలము జీవనంగారు ఎరుగనిది కాదు. అంతకు మున్ను?

"డాక్టరుగారూ నమస్కారము. ఎక్కణ్ణుంచి వస్తున్నారు? ఎవరైనా పిలిచారా?" అను మాటలు వెనుక నుండి చెవిలో పడినవి.

జీవనంగారు చకితుడై వెనుకకు తిరిగి చూచినాడు. చారిట్ బుల్ డిస్పెన్సరీ లోని కాంపౌండరు హరిహరపాల్ తన వెనుక సైకిల్ పట్టుకొని నిలిచి యున్నాడు. తన బసనుండి అతడు డిస్పెన్సరీకి వస్తున్నాడు.

కవిరాజ డాక్టరును గుర్తు పట్టి, బెల్ కొట్టక అతడు సైకిల్ మీదినుండి దిగి అతని నుద్దేశించి నమస్కరించినాడు.

వాత్సల్యముతో డాక్టరు "హరిహర్! బాగా ఉన్నావా?" అని ప్రశ్నించాడు

"బాగా ఉన్నానండి"

"పరిస్థితులన్నీ చక్కగా నడుస్తున్నాయా? నీ పని పాటలు ఎలా వున్నాయి?"

"ఏదో విధంగా నడుస్తున్నాయి. చెప్పేదేముంది?" హరిహరుని ప్రాక్టీస్ యీ రోజులలో చక్కగా నడుస్తున్నదని డాక్టరు గ్రహించాడు. వెనుకకు తిరిగి నిలిచి అతడు "పెన్సిలిన్ సవ్యంగా నడుస్తున్నదా? ఇది పెన్సిలిన్ యుగం కాద టోయ్?" అన్నాడు.

"అవునండి పెన్సిలిన్ భేషుగా నడుస్తోంది. అంతా పెన్సిలినే; ఔషధం బాగా పనిచేస్తోంది. మీరు మా పేట నుండే వస్తూ ఉన్నట్లు తోస్తోంది. మతి తల్లిని

చూచేందుకు వెళ్ళినట్లు విన్నాను. నిన్న రాత్రి అతడు మా యింటికి వచ్చి పిలిచినాడు.''

జీవన మహాశయుని మానసవీధిలో విద్యుత్తరంగము ప్రవహించినట్లైనది. తన తల్లిని చూచేందుకై కాంపౌండరును మతి ఆహ్వానించినాడా? కొయ్యవలె డాక్టరట్లే నిలబడి పోయినాడు! ఆ ప్రక్కనుండి ఆసుపత్రిలోని క్రొత్త డాక్టరు గారి బై సికల్ చప్పు చప్పున వస్తోంది. వానిని చూచి, జీవన మహాశయుడు "నమస్కార్" అన్నాడు, హాస్పిటల్ డాక్టర్ బై సికిల్ నుండి క్రిందికి దిగినాడు. అతడు తరుణ వయస్కుడు. ప్యాంట్ ధరించినాడు. బుష్షర్టుపై వాటర్ ప్రూఫ్ అంగీ అలరారుతున్నది. తలపై ఆయిల్ స్కిన్‌తో కప్పబడిన జిలుగు బెండుహేట్ దిగంతములకు తన తీవిని తెలుపుచున్నది.

కళ్ళపై మేలిజోడు ప్రకాశించుచున్నది. అతడు కలకత్తా వాసి. పేరు ప్రద్యోత బోస్. ప్రతినమస్కార మొనరించి అతడు ''అయ్యా! బాగున్నారా?'' అన్నాడు.

"చిత్తము. కానైతే రోగమనేది లేదు. సంసార మనేది గిర్రుగిర్రున తిరిగి పోతోంది."

"మతి తల్లిని చూచినారా?"

"చూడకేమి? చూచినాను. నిన్నరాత్రి మతి మా ఇంటికి వచ్చి తక్షణం తన ఇంటికి రావలసినదని కాళ్లా వేళ్లా పడి ప్రాధేయపడ్డాడు. తన తల్లి దారుణంగా బాధపడుతున్నదని గోలపెట్టినాడు. రాక తప్పదన్నాడు. నన్ను వదలినాడు కాడు. ఆ కేసు ఏమో మీకు బాగా తెలిసే ఉంటుంది. పడిన తర్వాత ముసలిది కొన్నాళ్ల ఆసుపత్రిలో ఉంది. నొప్పి అపుడు తగ్గిపోయింది. కాని మరల యాతన హెచ్చింది. ఆ అవస్థలో అవ్వ ఇటూ అటూ తిరిగి ఉంటుంది. దెబ్బపై దెబ్బ తగిలి వుండును. నిన్న సాయంకాలము ఆమెను మీరు చూచినారు కదా! మీ కంతా తెలియును."

"అవును. చూచాను. కనుకనే ఎలా ఉందని అడిగినాను." కొంత పమాదంలోకి దిగింది. ఎక్సరే తీయకపోతే సరియైన చికిత్స చేయడం సాధ్యం కాదు. మోకాలు చిప్పకు గట్టి దెబ్బ తగిలింది. ఎముక విరిగి ఉంటుంది. అట్లేయైన యెడల ఆపరేషన్ చేయవలసి వస్తుంది. దానిని గురించి ఆతురత

పడ నక్కర్లేదనుకుంటాను. ఆమె మొగముపై యాతనతో కూడిన నిరుత్సాహము అగపడుతోంది.

జీవనమహాశయుడు ఆలోచనలో పడినాడు. కొంచెము సేపుండి ఇట్లన్నాడు; "నొప్పి తగ్గితే అవ్వ నడువ గలుగుతుంది. వాపు కూడ తగ్గిపోయింది. సర్జరీ ఏమో గిర్జరీ యేమో నాకు తెలియదు. నాకు తెలిసింది నాడి చూడడమే! నా వైద్యం యావత్తూ దాని మీదే నడుస్తుంది. కాని అసలు గ్రహింపవలసినది తలవ్రాత. అది వక్రంగా ఉంటే"- మాట ముగించక సంజ్ఞద్వారా తాను చెక్కవలసినది. ఆతడు తేల్చివేశాడు.

ప్రద్యోత డాక్టరు కంఠస్వరం ఇంచుక కర్కశమైనది. "తాము జ్ఞాన గంగా వ్యవస్థ చేసినారటకదా!" ప్రశ్న వ్యంగ్యగర్భితమై సాభిప్రాయముగ నున్నది.

జీవన మహాశయుని గుండెలో గగ్గోలు పుట్టినది. అతని నుద్దేశించి ఆసుపత్రి డాక్టరు, "మీ గంగా యాత్ర హితవు చెవిని బడిన తోడనే ఆమె గుండె దడ హెచ్చింది. గంగా తీరము చేరకమున్నే స్టేషనుకు పోయేందుకు బండి కుదుర్చుకొని అందులో ఎక్కబోవునపుడే ఆమె గుండె తటాలున ఆగిపోవడం నిక్కమై పోవును" అన్నాడు. ఇంచుక తాళి అతడు. అవ్వ చావదు, కొంతడబ్బు పెట్టేందుకే మతి సిద్ధంగా ఉన్నాడు. అంతకు మించిన వ్యయమైనను ఆసుపత్రిలో ట్రీట్‌మెంటు ఏర్పాటు చేసి ముసలిదానిని నేను నిలబెట్టి తీరుతాను. నే నామెను చావనీయను." అన్నాడు.

వాని మాటలో ప్రచ్ఛన్నమై యుండిన వ్యంగ్యము వాడి తూపువలె జీవన మహాశయుని బుఱ్ఱలో గ్రుచ్చుకొని బ్రహ్మరంధ్రమును భేదించి వేసెను. తల పంకించి ఆతడు "ఆమె ముసలివగ్గు, ఆమెను చంపడం నాకేల! ఆమె చచ్చి తీరుతుంది. ఇంకా బ్రతికినా మూడుమాసాలు లేక ఆరు మాసాలు. ఆమె తెగుళ్ళపుట్ట! ఈ దెబ్బవలన ఆమె శరీరంలో ఉన్న యావత్తూ రోగములకు కదలిక పుట్టింది."అన్నాడు

అతని మాట కడ్డు వచ్చి ప్రద్యోత డాక్టరు "పెన్సిలిన్, స్ట్రెప్టోమయిసిన్, ఎక్సరే మున్నగు వాని యుగంలో మీలాంటి ప్రాతకాలపు వైద్యం కూడిరాదు. వాతమని, పిత్తమని, ఇంకా ఏమేమో అని పలుకువారి కాలమునుండి చాలా దూరము సాగి వచ్చినాము. మీరు చేసేది అమానుషత్వం! ఇన్‌హ్యూమన్ ట్రీట్‌మెంట్ అంటాను" అన్నాడు.

జీవన మహాశయుని నోరు విప్ప నీయక ప్రద్యోత డాక్టరు "మంచిది నమస్కారము. ఇకపోయెదను. వెంటనే హాస్పిటల్‌కు పోవాలి. ఇప్పటికే ఆల స్యమై పోయింది." అని ఆతడు సైకిల్ ఎక్కి ఇంచుక దూరమరిగి నాటకీయ వైఖ రితో గిరుక్కున తిరిగి, సైకిల్ నుండి దిగి, యీ మాటలు ఉచ్చరించాడు.

"ఒక పర్యాయం వచ్చి, మా ఆసుపత్రిలోని ఏర్పాటులను, వేర్వేరు వ్యవ స్థలను చూచి పొండు. క్రొత్త క్రొత్త కేసులకు సంబంధించిన ట్రీట్‌మెంట్ ఎంత అద్భుతముగా నడుస్తున్నదో హిస్టరీగా మెడికల్ జర్నల్‌లో ప్రకటింప బడి నది. ఆ వృత్తాంతము యావత్తు మీకు చదివి వినిపిస్తాను. ఏదో ఛాందసపు వైద్యము తప్ప ఒకప్పుడు సరియైన, సక్రమమైన చికిత్స ఉండేది కాదు. వెనుకటి రోజులలో ఏమి జరిగిందో జరిగి పోయింది. ఈ కాలమున వైజ్ఞానికాభివృద్ధి కలిగిన పిదప ప్రజలకు మేలివైద్యము జరుగుచున్నది. హేతు గర్భితంగాని మోటువైద్యం ఎవరైనా జరిపితే, ఘోరమైన అపరాధము చేసినట్లే అగును. మరే దేశంలోనో ఈ రీతి పిచ్చి చికిత్స మీరు చేసిన యెడల మీరు కఠినదండనకు గురియై వుండే వారు."

తరుణ డాక్టరు కంఠసర్వము మరింత కర్కశము కాదొడగినది. వాని ముఖము కందిపోయింది.

జీవన మహాశయుడు స్తంభించి చకితుడై పోయినాడు. ఆత డపరాధియా? అన్యదేశములో తనకు దారుణ దండన తప్పనిసరియై ఉండేదా? పెద్దమాటలుచ్చ రించి కుఱ్ఱడాక్టరు హాస్పిటల్ లోనికి తుఱ్ఱుమన్నాడు. జీవన డాక్టరు స్తబ్ధుడై నిలబడిపోయినాడు.

కొందరు రోగులు ఆసుపత్రిలో ప్రవేశిస్తూ ఇంచుక తడవి జీవన డాక్టరు స్వరూపమును విడ్డూరముతో చూడ దొడగిరి. ఆ చూపులు సూది మొనల వలె నున్నను, అవి మంటలు పుట్టించునవే యైనను, జీవన మహాశయుడు వాని నంతగా సరకు చేయలేదు. ఈరీతి అనుభూతి ఆతనికి క్రొత్త కాదు. ఆతని దీర్ఘ జీవనంలో ఈరీతిగా ఇంగ్లీషు చదువులో ఉత్తీర్ణులైన వారెందరెందరో ఆతని కంటబడినారు. అదృశ్యులైనారు. జిల్లా పట్టణమునుండి పెద్దపెద్ద డాక్టర్లు వచ్చినారు. కలకత్తా నుండి కూడ వచ్చినారు. వారితో ఆతనికి అభిప్రాయ బేధములు పొసగినవని, అవి కయ్యములందు చెలరేగినవని వేరుగా తెలుప నక్కరలేదు. కొన్ని కొన్ని సంద ర్భములం దాతడు అవజ్ఞకు పాలబడవలసి వచ్చెను. తుదకు జీవన మహాశయుడే

అభ్రాంతుడని ఋజువై పోయినది. అతడే కాదు. నాడీ జ్ఞానయోగము అభ్రాంత మని రూఢి యైనది. ఈ సంఘటన లన్నియు ఆతని స్మృతి వీధులందు ఉరుకు లెత్తినవి.

ఆతని పితామహుడు దీనబంధుదత్తు అను నతడు వైద్యకులతిలకమనిపించు కృష్ణదాసు సెన్ కవిరాజు మహాశయునియొద్ద సుశిక్షితుడైనాడు. చికిత్సాజ్ఞాన యోగమున విశేష ప్రావీణ్యము నందినాడు.

కొంచెము సేపటికి తెప్పరిల్లి జీవనమహాశయుడు శరీరమునకు కొంత కద లిక కలిగించుకొనజాలినాడు. బరువైన నడకతో సొంత కొంప దెస జనినాడు.

# మూడవ ప్రకరణము

జీర్ణమైయున్న ఆరోగ్యనికేతనపు వీధి వసారాలో పదుగురు రోగులు వచ్చి కూర్చున్నారు. వీరిలో చాలమంది ముసల్మానులు. కడచిన మూడు పురుషాంతరములనుండి దీనబంధుమహాశయుని కాలమునుండి, ఈవంశమున వైద్యవృత్తి సాగుచున్నది. జీవనమహాశయుడు ఇపుడు వృద్ధుడైపోయినాడు. శక్తి సన్నగిల్లినది. ఆసక్తి అడుగంటినది. ఉత్సాహము కొరవడినది. ఓపిక అంతర్ధానమయినది. అయినను ఈ రోగులు అతనిని వదలుటలేదు. అతని కొక పుత్రుడుండేవాడు. ఏకాత్మజుడు. పాపము అకాలమున మృత్యువాతపడి కబళించివేసింది. ఇపుడు నవయుగమున పాశ్చాత్య చికిత్సా విధానము విపుల సమారోహముతో ఆవిర్భవించినది. వృద్ధుడు క్రుంగిపోతూ, కృశిస్తూ నవ్యదృశ్యమును అవలోకించినాడు. కొంపలో శాంతిసుఖములు పూజ్యములైనవి. సంసారజలధి ఉత్తాలతరంగ సంకులమై చెలరేగుతున్నది. ముసలివాని హృదయము విరక్తితో నిండిపోయినది. వైద్యవృత్తికి నీళ్లు వదలవలెనని ఆతడు తలపోయుచుండును.

"ఇక ఇది నాకు వద్దు; నాకు వద్దు" అని ఆతడు అనుకొనుచునే ఉన్నాడు. కాని వృత్తిని జారవిడువలేక పోతున్నాడు. వానిని అది అంటియే యున్నది. "ఇక ఎంతకాలము ఈవిధంగా బాధపడను? ఈవేళే యీ వైద్యవృత్తికి తిలతర్పణాలు విడుస్తాను." అని ఆతడు రాయిగుద్ది చెప్పుకొన్నాడు.

ఆరోగ్యనికేతనములో నేడిక ఔషధములేమీ లేవు. మందులిచ్చు వ్యవస్థను డాక్టరు తొలగించివేసినాడు. ఇపుడు కేవలం ప్రిస్క్రిప్షన్ (మందులపట్టీ) వ్రాసియిస్తూ ఉంటాడు.

నవగ్రామంలోని మెడికల్ స్టోర్స్‌లో ఔషధ సామగ్రి దొరుకుతూ ఉంటుంది. అది స్థాపింపబడిన రెండుమూడు నెలలలో కమీషన్ పద్ధతిని వ్యాపారం అక్కడ ఆరంభమయింది.

జీవనమహాశయుని వీధి గదిలో మూడు అల్మారాలు ఉన్నవి. అవి చాల వరకు విరిగిపోయినవి. వీరువాలపై ప్రాతకాలపు ఔషధాల జాబితాలు ప్రోగుపడి

యున్నవి. వాటి అట్టలను గొజ్జింకలు కొట్టివేసినవి. లోపలి కాగితములను చెద పురుగులు ఆహారించినవి. జల్లెడ తూంట్లవలె అందు చిల్లులగపడుతున్నవి. అయినను భూతలమున అవి నిలిచియున్నవి. జీవనమహాశయుని దౌర్భాగ్యం యావత్తు అందు స్పష్టముగ ప్రత్యక్షమౌతున్నది. ఇంకను వాటికి అగ్ని సంస్కారము కలుగలేదు. తుక్కు ప్రోవులై సాక్షాత్కరిస్తున్నవి. వానిపై చూపుంచి డాక్టరు నిట్టూర్పు విడిచినాడు. ఇరవై ముప్పై వేల రూకల బకాయి వివరాలు అందులో నిలిచియున్నవి. మరికొంత వెనుకనుండి లెక్కకట్టి చూస్తే—మూడు తరముల జాబితా పరిశీలిస్తే- లక్ష రూకల బాకీ అందు కనబడుతుంది. జీవనంగారు సొంత చేతిమీదుగా సాగించిన చికిత్సకు రావలసిన బాకీ మొత్తము అధమపక్షము ఇరువది వేలకు తక్కువ కాదు.

ఈతని పితామహుడు దీనబంధు దత్తు. నవగ్రామంలో పెద్ద కుటుంబీకులు రాయచౌదరీల నాశ్రయించి ఆతడొక వీధి బడిని నెలకొల్పినాడు. బడిపంతులుగా నుండి పై కుటుంబము వారి దేవస్థానంలో గుమాస్తాగా ఉండేవాడు. ఆ దిక్కునుండి కొంత రాబడి చేతిలో పడేది. రాయచౌదరీ కుటుంబమునకు గృహవైద్యుడుగా ఉండేవాడు. కవిరాజ శిరోమణి కృష్ణదాసు సెన్. దీనబంధుదత్తుకు ఆతని పరిచయము లభించింది.

రాయచౌదరీల వంశములో ఒక పెద్దతరహా వ్యక్తియొక్క ఏకైక పుత్రుడు ఒకప్పుడు సన్నిపాత జ్వర పీడితుడాయెను. ఆతడు బ్రతుకుననే ఆశ నెల్లరు విడిచివేశారు. వాని తల్లి బెంగతో మంచం పట్టింది. స్థాణువువలె తండ్రి చతికిలపడిపోయినాడు. తరుణియైన పత్ని కన్నులనుండి గంగాఝరివలె అశ్రుధార స్రవిస్తూ ఉన్నది. కాని వైద్యుడు మాత్రము ఆశ వదులుకొనలేదు. "నిరంతర సేవా కుశలుడైన వ్యక్తి యొకడు తోడుపడినయెడల వ్యాధిని అదుపులోనికి తీసికొని రాగలను. ఆలస్యమైతేం గాక!" అని ఆతడనినాడు. అట్టి సేవ సలుపుటకై ముందంజ వేసినవాడు దీనబంధుదత్తు. నలువది యెనిమిది దినాలలో జ్వరం మళ్లింది. కవిరాజు దీనబంధుతో "ఇప్పుడుకూడ నీకు సేవనుండి విడుదల లేదు. మరి ఇరవై ఆరురోజులు రోగికి నీవు సేవ చేసితీరాలి. ఈ సమయంలో చేయవలసిన సేవయే నిజముగా కఠినమైనది. రోగి స్వజనులును, ఆత్మీయులును ప్రేమాంధులై అమితానురాగముతో సేవపేరిట రోగికి ఘోరమైన విపత్తు తెస్తారు. వానికి నిద్రపట్టనీయరు. నిరంతర ప్రసంగము సాగిస్తారు. కుపథ్యం బాగా నడుస్తుంది. దానితో రోగికి బాగా దెబ్బ తగులుతుంది. ఈ సమయంలో వేయి కళ్లతో నీవు రోగిని

చూస్తూ ఉండాలి. సదా వానిని కనిపెట్టుకొని ఉండాలి." అని హెచ్చరించినాడు. వైద్యుని ఆన దీనబంధు తలపై పూవైనది. అతడు చెప్పినట్లు చేసినాడు.

కొడుకు బ్రతికి బట్ట కట్టినందులకు చౌదరీ మహాశయుడు ఉల్లాసంతో దీనబంధుకు పెద్ద బహుమతి ఇచ్చేందుకు సమకట్టినాడు. కాని దానిని అతడు నిరాకరించినాడు. కృష్ణదాసుకవిరాజు అడ్డుపడి వాని నుద్దేశించి "ఆతడు కాదు. నేను నీకు మంచి బహుమాన మిస్తాను. నిరాకరింపకుము. నీ ధీరత ఆశ్చర్యకరమైనది. ఓపిక ప్రశంసనీయమైనది. నీ బుద్ధి స్థిరమైనది. నీవు నిష్కామకర్తవ్యం నిర్వహించావు. నే నేమీ అతిశయోక్తి పలుకలేదు. నాయొద్ద నీవు చికిత్సా విద్యయందు శిక్షితుడవు కమ్ము" అన్నాడు.

దీనబంధు వైద్య విద్యలో అరితేరి, నవగ్రామమునకు సమీపంలో ఈ సివారు పల్లెలో మకాము పెట్టినాడు. ఈ కుగ్రామంలో శాంతి వాతావరణము కలదు కదా! నవగ్రామంలో మకాము చేయడం ఆతనికి సుతరామూ ఇష్టం లేదు. అది బ్రాహ్మణ జమీందారుల నిలయం. సదా కలహసంకులమై ఉంటుంది. అందు పెద్ద బజారు కలదు. అది ఎల్లప్పుడు కోలాహలంతో ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. కావున ఆ తావుకు దూరంగా ఉండడమే మేలని దీనబంధు ఊహించాడు. దేవతలు సులభంగా ప్రసన్నులు కారు. నిమిషంలో ప్రచండస్వరూపములు దాల్చుచుందురు. చిన్న నెరసేది యైన అగపడినయెడల, ఆజన్మ సేవను మరతురు.

విపణివీథిలో వర్తకులదొమ్మికి కొదువ ఉండదు. అచట ప్రశాంత చింత ఎట్లు పొసగుతుంది? అని అతడు పలుకువాడు.

దీనబంధు గౌరవ ప్రపత్తులు సంపాదించుకొన్నాడు. మాననీయుడై, మహాశయుడనిపించుకొన్నాడు. సరళ స్వభావము కలిగి, నిరాడంబరముగ జీవించేవాడు. అంచులులేని పంచె కట్టుకునేవాడు. పాదములకు స్లిప్పర్లు ఉండేవి. పై బట్ట లేకనే అతడు మసలువాడు. సమీపమందలి పల్లెపల్లెలందు సంచారముచేసి అతడు రోగులకు మందులు ఇస్తూ ఉండేవాడు. ఆయా పిల్లలందరికి కూడ అతడు సుపరిచితుడు. పిలిచి, పిలిచి అతడు వారికి మందులిస్తూ ఉండేవాడు. అపుడపుడు వారి నాల్కలపై తేనె చుక్కలు రాల్చుతూ ఉండేవాడు. వాని యింట తేనె డబ్బాలు విరివిగా ఉండేవి.

సన్యాసులంటే వానికి ప్రీతి మెండు. వారితో స్నేహముచేసి ఎన్నెన్నో గోసాయిచిట్కాలు నేర్చుకొనేవాడు. దొంగసన్యాసులు తరచుగా వానిని మోసగించేవారు. అందుల కాతడు అంతరంగికముగ బాధపడేవాడు కాదు. "వటి

అమాయకుడవు" అని ఎవరైనా వానిని ఎత్తి పొడిచినప్పుడు నవ్వుతూ "వాళ్ల నన్ను బుట్టలో వేశారు. నేనో? వాళ్లను తట్టలో పెట్టేను. నాకు వచ్చిన నష్ట మేమి?" అని అంటూ ఉండేవాడు. కేవలం సన్యాసులే గాక, రకరకముల మంత్ర గాళ్లూ, మందులవాళ్లూ ఆతనికి సంగడికాళ్లు, వాళ్లతో మసలి వాళ్ల విద్యలను గ్రహించేవాడు.

ఆతని కొడుకు జగద్బంధుదత్తు. తండ్రి అడుపాజ్ఞలలో పెరిగిన బుద్ధి మంతుడు. తండ్రి వైదుష్యమును యావత్తూ ఆతడు తన గుండెలో చిక్కబట్టినాడు.

మృత్యుకాలంలో తండ్రి కొడుకుతో ఇట్లు చెప్పినాడు. "నాయనా! నే నింక వెళ్లిపోతున్నాను. నీకై ఆస్తి, కొంచెమైనా సంపాదించి పెట్టలేకపోయాను. కాని వైద్యంలో నీవు మంచి తరిఫీదు పొందేవు. నీకు లభించిన గొప్ప సంపద చికిత్సాలయం. ఈ విభూతిని నాయనా! కాపాడుకో! దీనివలన ఇహలోక పర లోకములు రెండూ నీ చేతిలో చిక్కిపోతవి."

జగద్బంధుదత్తు పితృవాక్య పరిపాలన మొనరించినాడు. ఆతని మాటల లోని ప్రత్యక్షరమును పూర్ణమొనరించినాడు. లోకులు ఆతనిని కూడా మాననీయుడని, మహాశయుడని భక్తిశ్రద్ధలతో పిలుచువారు. ఆతడు తండ్రిమహత్త్వమును అలవరచుకొన్నాడేయని తలపజెల్లదు. తన జీవనమున దాని నాతడు ఉజ్జ్వలతర మొనరించినాడు.

సంస్కృతభాష నభ్యసించి, ఆతడు ప్రధాన ఆయుర్వేద గ్రంథములను పఠించినాడు. వైద్యవిద్యలో గట్టివాడనిపించుకొన్నాడు. ఆయుర్వేదశాస్త్రములో వాని వ్యుత్పత్తి ఎట్టిదో ప్రజలలో గాఢ సానుభూతితో మెలగు ప్రజ్ఞ కూడ అట్టిదే; రోగులయెడ ఆతడు స్నేహపరాయణుడు. స్వతస్సిద్ధముగా మధురప్రకృతి గల వాడు. వాని మాటలనుండి తేనె సోనలు వెలారుచుండేవి; రసబంధుర ప్రసంగ ములు చేయుటలో, తనవైఖరిలో రసికత ప్రకటించుటలో ఆతడు అందెవేసినచేయి. వానివాక్కులు రసగుళికలు, వాని పలుకులు గ్రంథస్థములై యుండినచో అవి మహా కావ్యము లయ్యేడివి. కాని వాని వాక్కులు పలువురకు కంఠస్థములైనవి. వాని యం దావంతయైన ఆమ్లరసము ఉండేదికాదు. అమాంతముగా మనుష్యులను మధుర రసార్ణవములో ముంచుటలో ఆతడు అజేయుడు. రసికతలో అభిషిక్తులై లోకులు వానిపట్ల ప్రసన్నులై ఉండువారు.

నవగ్రామంనుండి ఈ పల్లెవరకు ఇప్పుడు ఎఱ్ఱ కంకరరోడ్డు పడింది. ఈ పల్లెను దాటి ఉత్తరదిశగా పోయినపుడు విశాలములైన పొలములు అగపడును. ఈ తెరువులో కాలుపెట్టిన తోడనే బాటసారులకు జగద్బందునిమాటలు జ్ఞప్తికి వస్తూ ఉండును.

ఆ నుడువులను పురశ్చరణ మొనరించుకొనుచు వారు వినోదిస్తూ ఉంటారు. కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతూ వుంటారు.

నలువది ఐదేళ్లనాటి మాట :

పథికులు నడచుటకై చెప్పదగిన బాట అప్పుడు లేనేలేదు. దాని ఆనవాలు కూడ అగపడదు. ఆ తావు లోతు గోతులతో నిండిఉండేది. అది ఒక పుంత. గొడ్లు పోతూఉండేవి ; వానల్లో అది మరింత అధ్వాన్నమై ఉండేది. బాటసారులు గుండెవరకు ఊబిలో దిగబడుతూ ఉండేవారు. ఆ దుస్థితి ఎట్టిదో ఈ కాలపువారు కల్పన చేయజాలరు. జీవనమహాశయుడు సలుపు రసభరిత ప్రసంగాలలో దాని ఉదంతము కొంత తెల్లమవుతూ ఉంటుంది.

పుంతలోని దొంగయూబిలో ఒకప్పుడు ఊరిమంగలి ముసలిఆవు పడి, పాపము చచ్చిపోయింది. దాని యజమాని ప్రాయశ్చిత్తము చేసికొన్నగాని ఆ ఘోరపాపము శమింపదని ఊరిపెద్దలు పంచాయితిచేసి తీర్మానించారు. మస్తక ముండనమే ప్రాయశ్చిత్తవిధానమని తీర్పులు సెలవిచ్చారు. మంగలికి మంగలి యెవరు ? జీవన మహాశయున కా ఉద్యోగము లభించినది. అమోఘమైన శస్త్ర చికిత్సలో ఆతడు పెద్దపేరు సంపాదించుకొన్నాడు. కవిరాజు మహాశయుడే నిర్దుష్ట ముగ సమగ్రముండనము ఒనరించి, ఆ యభాగుని పాపవిముక్తిని చేసినాడు. వాని మస్తకమునుండి బొత్తుగా నెత్తుటి చుక్కలు రాలలేదని సత్య సంధులెవ్వరూ చెప్ప లేరు. "హా ! భగవాన్ ! అని ఆతడు బాధపడుతూ ఉండగా డాక్టరు మహాశయుడు "ఎందుకీ ఈశ్వరస్మరణ—బదులు తీరింది." అనేవాడు.

"బాబయ్యా ! బదులేమి ?"

"నీవు క్షౌరం చేసేటప్పుడు ఎన్ని తలకాయలమీదనో గంట్లు చెక్కేవాడవు. ఎన్నెని బుఱ్ఱలో నెత్తురు క్రక్కుతూ ఉండేవి. ఆ పనికి నీకు శాస్తి కలిగింది. బదులు తీరింది." అప్పటి కథ అటుండనిండు.

ప్రమాదబంధురమైన పుంతకు ఒక బాటరూపం ప్రసాదించినవాడు జీవన మహాశయుడు. ఒక్క చెక్కపై తనపేరు చెక్కించి, అతడు తెరువుపొంత ప్రేలాడగట్టినాడు. జగద్బంధుమహాశయుడు కేవలం మందుకుప్పెల వైద్యంచేసే వెనుకటితరహా కవిరాజు. జీవన మహాశయుడు వాటితో, మిక్చరు చేర్చుతూ రెండు రీతుల ఔషధవిధానం అవలంబిస్తూ ఉంటాడు. ఆ రోజులలో ఈ ద్వివిధ ఔషధ సేవనమును గురించిన పరిభాష ప్రజలలో ప్రచలితమై ఉండేది. ఈ పరిభాషా పదములు లోకుల నోళ్లల్లో ఆడుతూ ఉండేవి. 'జగత్'ను మింగుతావా, లేక 'జీవన్'ను మింగుతావా అని ఇళ్లల్లోనివాళ్లు రోగులను అడుగుతూ ఉండేవాళ్లు. "ఇంగ్లీషుమందు కావాలంటే జీవనం గారిని పిలుస్తాము, నాటుమందు కావాలంటే జగద్బంధును పిలుస్తాము" అని వారనేవారు. "మందే వైద్యుడు, వైద్యుడే మందు" అను అద్వైత తత్త్వము వారికి జీర్ణమై పోయింది.

జీవనమహాశయుడు సురేశుని గృహమునుండి నొచ్చిన మనస్సుతో ఇంటికి తిరిగివచ్చి, వీధి వసారాలో స్తబ్ధుడై కూర్చుని ఉన్నాడు. రెప్పలు వాల్చక అవ్వలకు చూపులు సారిస్తున్నాడు. నేటితో తన వృత్తికి తిలతర్పణాలు వదల వలెనని అతని దృఢనిశ్చయము. కాని అతనిపేరు ప్రతిష్ఠలు తామరతీగెలవలె నలు దిక్కులందు విస్తరించుకొని పోయినవి. వానిని పెకలించి త్రుంచి పార వేయుటెట్లు ?

ఆ సమయంలో అవలి వీధిలోఉండే మకబుల్ అను వృద్ధుడు వీధి గుమ్మం ముందు గుభాలున కూలబడి "డాక్టరు బాబూ ! ఓ బాబయ్యా" అని అరచినాడు.

మాట చెవినిబడిన తోడనే జీవనంగారి గుండెనుండి దీర్ఘ నిశ్వాస మొకటి తనంత తాను వెడలింది. నుదుటిపై చరచు కొనినాడు. కొంతసేపు చైతన్య హీనుడై పోయినాడు. కొంతసేపటికి తెప్పరిలి ఆగంతుకునివైపు వెఱ్ఱిచూపులు విసిరినాడు.

మకబుల్ ఇట్లనినాడు "బాబూ ! ఒక పర్యాయం చెయ్యి చూడు. ముసలి తనంలో చాలా కష్టపడుతున్నాను. అష్టాంగములలో దారుణజ్వాల ! దఫదఫాలుగా జ్వరం వస్తోంది ! ఈ ఘటం ఎంత కాలమో నిలుస్తుందని తోచదు బాబయ్యా ! నేనింక ఈ యాతన పడలేను. నన్నొకదరికి చేర్చివెయ్యి."

తల పంకించి మహాశయు డిట్లనినాడు :

"మకబులూ! నాదగ్గరికి నీవింక రావద్దు. నేను వైద్యవృత్తి చాలించు కొన్నాను. ఈ రోజుల్లో మంచివైద్యం ఆరంభ మయింది. క్రొత్త క్రొత్త ఆస్పత్రులు లేచినవి. పెద్దపెద్ద డాక్టర్లు బయలుదేరినారు ఇక రోగులందరూ వాళ్ల దగ్గరకు పోతే మంచిది."

మకబుల్ నోటినుండి మాట రాలేదు. జీవనమహాశయుడు ఈ రీతిగా ప్రసంగించె నేల? దీనబంధు మనుమడు, జగత్కవిరాజు కొడుకు, జీవనం మాట్లాడే తీరు ఇదియా? ఆయన ఒక పర్యాయం నాడి చూస్తే ఎటువంటి తెవులైన మటుమాయ మౌతుందని మక్బుల్ విశ్వాసము. అట్టి వైద్యుని ప్రసంగధోరణి ఇట్లు మారనేల అని ఆ రోగి చింతింపసాగినాడు.

డాక్టరు వానిని చూచి, విషణ్ణభావముతో నవ్వి వృద్ధున కిట్లు నచ్చచెప్పుటకై ప్రయత్నించాడు. "చూడు! నా శరీరస్థితి తలక్రిందులై పోయింది. వయసు త్రోసుకొని పైబడింది. ఏ విషయమూ మనసులో నిలువదు దారుణ మైనమరుపు దాపురిం చింది."

"అయ్యా, నీవు వైద్యం కట్టిపెట్టినయెడల నావంటి వాళ్లపని ఏమౌతుంది? మే మెక్కడకు పోవాలి? కథ మామూలుగా సాగించు. రోగులచేతులు చూచి మరి పొమ్మనుము. నీవు మందమతివి ఔతున్నావా? ఈ మరపు తెగులు నీ కెందుకు వచ్చింది? అది మా దురదృష్టమే! క్రొత్త క్రొత్త వైద్యమనీ క్రొత్తరకం డాక్టర్లనీ అంటున్నావు. అవును. భారీసరంజామ జరుగుతోంది! పెద్ద వ్యాపారం సాగుతోంది. కాని వాటి దిక్కుగా పోయేందుకు మాకు కాళ్లాడవు. వాటిలో మాకు నమ్మకమూ లేదు."

అని కామదేవపురం నుంచి వచ్చిన మరొకరోగి, ఘోసాల్ అనువాడు పలికి నాడు.

వడివడిగా ఇంతసేపు మాట్లాడడంవల్ల ఈ వృద్ధునకు దగ్గు వచ్చింది. అస్థి పంజరంవలె ఉన్న వానిగుండె కదిలిపోయింది. ఊపిరి తిత్తులు విరిగి నేలపడునట్లు తోచెను. వగర్పువలన ప్రాణవాయువు ఎగసిపోవునట్లు తోచెను. ఉన్నకొలది పండ్లు రాలుస్థితికి వచ్చినవి. విసనకఱ్ఱగాని, విసనకఱ్ఱవంటి మరే వస్తువైన, విసిరేందుకు పనికివచ్చునది కావలయునని డాక్టరన్నాడు.

రోగికి విసరవలెనని అతడు నొక్కి చెప్పినాడు. వృద్ధునకు ముచ్చెమటలు పోసినవి. కాని వీవన స్వరూప మేమీ అగపడలేదు. దానిని తయారు చేయుట కేమీ దొరకలేదు.

బీరువాలు చూచినాడు డాక్టరు. అవి ఖాళీ యైనవి. సీసాలు, చిన్నచిన్న గ్లాసులూ ధర్మామీటరుకేసూ, స్టెతస్కోపు యొక్క రబ్బరు గొట్టాలూ యావత్తు సరకులు ఎందో అంతర్ధానమై పోయినవి.

విరిగిన బీరువాలోనుండి పాత చిట్టా పుస్తకాలను అత డావలకు తీసినాడు. కాలదోషం పట్టిన బాకీలలెక్క అందు గలదు. చిరిగిన ఎఱ్ఱగుడ్డ ఒకదానికి కట్టబడి ఉంది. దానిని పీకివేసి, దానితో డాక్టరు రోగికి విసర దొడగినాడు. వెలుపల నిలిచి ఉన్న రోగులలో ఒకనిని ఉద్దేశించి, "లోపలికి పోయి, ఒకగాసు మంచినీరు తీసుకురా. చప్పున పో" అని అతడన్నాడు.

కామదేవపురంనుంచి వచ్చిన ఈవృద్ధుడు చిరకాలమునుండి ఇదే రీతిగా దినములు గడుపుతున్నాడు. వానికొంపనుండి లక్ష్మీదేవి దూరంగా తొలగిన కొలది, వాని లోభం, వాని మమకారమూ హెచ్చిపోతున్నవి. యావత్తు ప్రపంచమును గుటుక్కున మ్రింగి కడుపు నింపుకోవాలని అతడు ఉద్దేశిస్తున్నాడు. వాని ఆశకు తృప్తి కలుగుచుండుట లేదు. పైగా వ్యాధి సంక్రమించింది. పుష్టి కలిగేందుకు బదులు వానిఒళ్లు క్షీణించింది. మీదు మిక్కిలి వానికి గంజాపై మిక్కుటమైన మక్కువ కలదు. ఆకలి పోగొట్టు కొనుటకై ఒకప్పుడాతడు గంజాయిని ఆశ్రయించినాడు. దానివలన వానిపొట్ట బ్రహ్మాండముగా ఉబ్బిపోయింది. దానిని నింపడం పెద్దసమస్య అయినది. ఎంత ఆహారమునైన, ఎట్టి ఆహారమునైన ఆ ఉదరగోళము 'స్వాహా' అంటూ ఉంటుంది. ఎవ్వరైన భోజనమునకు పిలిచినయెడల అతడు కొండ నంటునట్లు ఉవ్వెత్తుగ ఎగురును. విందు లభించిననాడు వానికి పండుగ దినము.

పద్మాసనము వేసికొని భక్ష్యభోజ్య లేహ్య చోష్యములను ఉదరగహ్వరమున పూటుగా అతడు ఎక్కించును. తీపిపై వానికి తీవ్రమైన తీపి కలదు. ఒక్క పట్టులో 47 రసగుల్లాలు వాని కడుపులో యథాస్థానమున సర్దుకొంటూ ఉండును జ్యేష్ఠమాసములో పనసపండ్లు విరివిగా లభించేవి. పనసతొనల రాశిని తీక్ష్ణ

దృష్టితో చూచి నిమిషములో దిగ్భ్రమింగేవాడు. తదనంతరకాండ ఆతనికే తెలియును. వెలికిలపడి, పదిఊళ్లకు వినిపించేటట్లు మూలుగువాడు. నేలపై దొరలును. నాలుగైదు పర్యాయములు వానిలో కలరా లక్షణములు అగపడ్డాయి. అయినను అమితభోజనము మీది ఆతని ఆశ అవంతైన తగ్గలేదు. అజీర్ణరోగము ఉబ్బసపు దగ్గుకు కన్నతల్లి అయింది. త్రాగుడుకై ఆతడు చెవి కోసికొంటాడు. మత్తు తలకెక్కినపుడు అంతరంగికముగ ఆతడు ముల్లోకాలలో సంచారము చేస్తూ ఉంటాడు. హుంక్కా గొట్టము చేత పుచ్చుకొని, గంటలకొలది ఆతడు దగ్గుతూ ఉంటాడు. దగ్గినకొలది వాని వగర్పు హెచ్చుతూ ఉంటుంది. ఈ పరిస్థితిలో వారమునకు రెండు పర్యాయము లాతడు జీవనడాక్టరు వద్దకు వచ్చి, "ఔషధం ఇమ్మ"ని వేధిస్తూ ఉంటాడు. "మంచిమందు. ఒహటొరకమైన ఔషధం ఇమ్మ"ని వేపుకొని తింటాడు. "ఇక నేను తాళలేను" అని అరుస్తూ ఉంటాడు.

ఘోసాలుకు మేలి మందుపై మనసు పోవుట నిక్కమే. అయినను మందుకు డబ్బిచ్చే అలవాటు వానికి లేదు. ధర్మానికి ఔషధం లభించాలి.

బాల్య కాలంలో ఆతడు జీవనం గారితో కలసి చదువుకొన్నాడు. దుష్టులతో సాంగత్యం చేసి దురభ్యాసములు అలవరచుకొన్నాడు. ఒకనాటి నేస్తమును పురస్కరించుకొని, సహపాఠిని దండించి, దండించి మందు పుచ్చుకునే హక్కు వానికి కలదు. గమనింపవలసిన విషయము మరొకటి కలదు. ఆతడు ఇంటిపురోహితుని కొడుకు. అపస్వరముతో మంత్రము లుచ్చరిస్తూ ఇంటింటకి తిరుగుతూ దేవతార్చన గదుల్లో పూజచేస్తూ ఉంటాడు అందుచే వాని హక్కు మరింత హెచ్చింది. ఇంగ్లీషుమందు లిచ్చే పెద్దడాక్టరువద్ద ఈ ఆటలు సాగవు. వానిని పాటించుట వారికి గిట్టదు. జీవనడాక్టరు వారి పద్ధతిని ఎట్లు అవలంబింపజాలును? ఉచితవైద్య సంప్రదాయము దీనబంధు మహాశయుని కాలమునుండి సాగుతూ ఉన్నది. తాతలనాటి అభ్యాసమును వదలించుకొనవలెనని ఆతడు అనుకొంటున్నాడు. కాని అది వానిని వదలడం లేదు.

ఘోసాలులో కొన్ని సుగణములు లేవని చెప్పలేము. ఎవరైనా పెద్ద కుటుంబంవారు కాకితో కబురు పంపినను సరే, ఆతడు రెక్కలు కట్టుకొని ఎగిరి వస్తాడు. నడుముగట్టి రేయింబవళ్లు చెమటోడ్చి పనిచేసి, పని ముగించి కడుపు నిండా భుజించి ఇంటికి పోతూ ఉంటాడు. చేసిన పనికి చేతిలో దక్షిణ పడిన సంతోషమే! అది పడకపోయినను ఆతడు గొణుగుకొనడు. రెండు మందు

పొట్లాలో లేక నాలుగణాలు వెలచేసే గంజాయియో చేతపడినయెడల కృతార్థుడనని అత డెంచుకొనును. వానిని గురించి ముఖ్యంగా పాటింపవలసిన విషయం మరొకటి ఉంది. శవములను మోసుకొని శ్మశానవాటికకు పోవడంలో వానికీడైన వాళ్లెవరూ లేరు. కొందరు వానికి పీనుగుల పిచ్చయ్య అనే నామాంతరం ప్రసాదించారు. ఏ విషయంబట్టి చూచినప్పటికీ అతడీప్రాంతపు సంఘంలో ఎల్లరకు తలలోనినాల్కయై, దగ్గరిచుట్టమై మెలగుతూ ఉంటాడు. కాదని చెప్పేందుకు సాహసించు వారెవ్వరూ లేరు. ఉత్సవములందు చూచినను అతడు ప్రత్యక్షమౌతూ ఉంటాడు. వల్లకాడు మాట చెప్పిన ముందే ఆతడందు సాక్షాత్కరిస్తాడు. రాజద్వారములం దతడు హాజరవుతూ ఉంటాడు. కోర్టులలో ఆతడు తప్పని సరిగా కనబడుతూ ఉంటాడు. దావా లావాదేవులందు ఒంటి కాలిపై నిలిచి, జంకక గొంకక ఎట్టి సాక్ష్యమైనను ఈయగలడు.

జీవనంగారి ఇంటి వసారాలో పడివుండి, కొంతసేపటికి ఆతడు తెప్పిరిలినాడు. ఊరు మారుమ్రోగేటట్లు దగ్గి, దగ్గి మూడు పర్యాయములు దోకి, పెద్ద నిట్టూర్పు విడిచి, "అమ్మా! బ్రతికిపోయాను. జీవనమూ! రోగు లెందరెందరో అవల కనిపెట్టుకొని ఉన్నారు. వారి చేతులు చూచి, వారిని పంపించి రా. నేను మరికొంతసేపు విశ్రాంతి తీసుకొంటాను." అని అతడన్నాడు

ఈ అవకాశం పురస్కరించుకొని, మొదటి రోగి మకబుల్ ముందుకు వచ్చి చేయి చాపి జీవనంగారి కరకమలములందు చొప్పించాడు. డాక్టరు దానిని గట్టిగ పట్టుకొన్నాడు. విడ్డూరపు నవ్వులో వాని ముఖం ప్రసన్న మయింది. రోగుల భారము ఆతడు వహింపక తప్పదు. వేరు దోవ లేదు. తాను వారిని వదలించుకొనవలెనని నిశ్చయించినను, వా రాతనిని విడుచువారు కారు. ఈ రోగులు క్రొత్త డాక్టర్లను చూచి అడలుతూ ఉంటారు. వారి హితవుగాని, ఔషధం గాని స్వీకరించేందుకు వారు సాహసింపరు. అందుకు వలసిన సామర్థ్యము వారికి లేదు. ఉద్దేశము లేదు. ఆర్థికమైన స్తోమత కూడ లేదు.

మకబుల్ శరీరం మిగుల విచిత్రమైనది. ఒకగ్రెయిన్ క్వినైన్ వాని కడుపులో పడిన యెడల వాని శరీరమునకు చెమట పట్టును. వైద్యుని చేతికి నాడి అందనే అందదు. విదేశీ ఔషధములంటే వానికి వడకు పుట్టుతుంది.

కనిపెట్టుకొని ఉండిన రోగులను ఒక్కొక్కరిని పరిశీలించి, వారికి వలసిన వ్యవస్థ చేసి డాక్టరు మరల ఘోసాల్ వద్దకు వచ్చినాడు.

ఇప్పటి కాతడు బాగుగా తెప్పరిలినాడు. చేయి చాపి డాక్టరు కందించినాడు. అతడు స్పష్టంగా తన ప్రవచనం ఇట్లు ఉచ్చరించినాడు. "అబ్బీ! నీ చేయి చూసి నేనేం చేయగలను? నీది మళ్లీరోగం కాదు. నీ అసలువ్యాధి లోభం. దురాశ నీలో జీర్ణించిపోయింది. మందుల వలన మాకులవలన ఇది మాపు కాదు. పైగా నీవు మొదటి రకపు త్రాగుబోతువు. మతి తప్పి ఎక్కడో గుభాలున కూలబడుతూ ఉంటావు. నిద్రనుంచి లేచిన తడవుగ గంజాయి సేవిస్తే గాని నీవు బ్రతుకలేవు!"

మాటలు విని అతడు సిగ్గుపడలేదు. ఆతడు రాటుతేరిన గట్టిఘటం. వడి వడిగా మాటలు విసరుతూ ఇట్లు సెలవిచ్చాడు. "దత్తూ! ఒక్క గంజాయితో ఏం పని జరుగుతుంది? బీడీ వగయిరాలు నాకు దగ్గరిచుట్టాలు. వాటితో కొంత కాలక్షేపం అవుతుంది. మీ యింటి వసారాలో కూర్చుని ఉండగా ఎవరో ఒక ఆసామి బీడీ కాలుస్తూ ఉండడం నా కళ్ళ బడింది. బీడీపై నా మనసు పడింది. ఒకటి అడిగి పుచ్చుకొని, నిప్పంటించి ఒక దమ్ము పీల్చాను. గురుడు పన్నెండో గదిలో నృత్యం చేశాడు. నేను ఉక్కిరి బిక్కిరి అయిపోయాను. వగర్పు హెచ్చింది. తరువాత నీ దగ్గర వాగినాను. అంతటితో కూలి చిత్తైనాను."

ఘోసాల్ రెండు చేతులూ చాపినాడు. వ్యాధిప్రకోపం శ్రుతి మించిందని సూచించాడు. వాని అపరాధ మేముంది? తప్పంతా గ్రహస్థితిలో ఉంది. "బాబూ వగర్పు! వగర్పు! దగ్గు తగ్గేందుకేమైనా మంచి మందు నా మొహాన్ని పడవెయ్యి! ఉదయమూ, సాయంకాలము టీలో కొంత ప్రాణికోటిని కలుపుతూ ఉంటాను. అప్పటికీ ఏ మాత్రమూ గుణం అగపడడం లేదు" అన్నాడతడు.

"నువ్వు గంజాయి పొగాకులను పూర్తిగా మానివేయవలెను. విందులకై ఎగపడకూడదు. విందుకూ మందుకూ చుట్టపు చూపులు లేవు. చారూ అన్నమే నీకు శ్రీరామరక్ష. మరి నీకు వేరు శరణ్యం లేదు. నామాట పాటించక పోతే నా మందు నీకు పనిచేయదు. ఉహూ— నేను నీకు ఔషధం ఇయ్యనే ఇయ్యను." అని డాక్టరు పలికినాడు.

మరొకసారి చేయి చాపి రోగి ఈ పర్యాయం చెయ్యి బాగా చూడు. నాడి చూసి చెప్పు ఎప్పుడు టపా కట్టానో సెలవియ్యి. జాగ్రత్తగా చూడు నాడి. వాక్సిద్ధి కలవాడవనే ప్రతీతి నీకుంది. కంచరి ముసలమ్మ చెయ్యి చూసి దెబ్బతో చెప్పేసి

నావు కదా నీ ప్రవచనం. గంగ ఒడ్డును చేరుకొమ్మన్నావుట కదా! దొడ్డ సలహా! దయచేసి అట్టి సలహా నాకు కూడ ప్రసాదించుము. బాబు! బాబు! బ్రతిమాలు కుంటున్నాను'' అన్నాడు.

మాట విని డాక్టరు ఉలికిపడినాడు. మతి తల్లి మాట జ్ఞప్తికి వచ్చింది. తొట్రుపాటుతో ఇంత మనిషీ చతికిలపడి పోయాడు.

''ఇక నువ్వు నోరు మూసుకోవడం మంచిది.'' అని ఘోసాలుకు సలహా చెప్పి చప్పున ఒక కాగితపు ముక్క తీసి, దానిపై ప్రిస్క్రిప్షన్ వ్రాసి, రోగి చేతిలో పెట్టి, ''ఇదిగో! దీనిని తీసికొనిపో! రెండు మూడు మూలికల పేర్లు వ్రాశాను. చిల్లర దుకాణాలలో ఇవి దొరకవచ్చు. వీటిని కొని నూరి కషాయం చేసి త్రాగు. తక్కిన త్రాగుడు కట్టి పెట్టు'' అన్నాడతడు.

అందుండి లేచి, కుర్చీలను ఇటూ అటూ నెట్టివేసి, ఇల్లు వెడలి వీధి బడ్డాడు.

సమీప గ్రామం నుండి వచ్చిన ఆసామి ఒకడు పరాన్ అను అతడు వెలుపల బండిలో నిలిచియున్నాడు. వాని మూడవ పెండ్లాము పెండ్లి నాటినుండి వ్యాధి పీడితయై ఉన్నది. ఆరు మాసాలనుండి బొత్తిగా మంచము నుండి దిగడమే లేదు. మృత శిశువును ప్రసవించి పడి ఉన్నది. చచ్చిన బిడ్డకై గొల్లుమంటూ ఉంటుంది. వారమునకు రెండు తూరులు వచ్చి, పరాన్ జీవన డాక్టరును తీసుకొని పోతూ ఉంటాడు. నేడు రోగిని చూచేందుకై జీవన మహాశయుడు పోవలసిన రోజు. అతడు పోయి తీరాలి. పరాన్ సంపన్నుడైన కృషికుడు. నియమితమైన ఫీ ఇస్తూ ఉంటాడు. వానిని చూచి డాక్టరు చిరునవ్వు నవ్వినాడు

ఒక పర్యాయం జీవిత విషయం జ్ఞాపకం చేసుకొన్నాడు. ఫీ చెల్లించని రోగులతో తాను ఇక వైద్య వృత్తిని వదులు కొంటున్నట్లు చెప్పివేశాడు. వృత్తికి నీళ్లు వదిలితే ముద్ద గడవడం ఎట్లో మరచినాడా? చచ్చేవరకూ బ్రతకాలికదా? తాతలనాటి సర్వస్వమూ వ్యయమై పోయింది. ఇపుడు చేతిలో చిల్లిగవ్వ లేదు జీవన సమస్య ఆతని యొక్కనిదే కాదు. ఇంటిలో ఉన్నది కదా భామామణి, భార్యారత్నం! క్షమాహీన పత్ని. కొంపలో ఏమి లోపించినా వీరావేశంతో ఆమె ఉవ్వెత్తున లేచి, ఆకాశం పగులునట్లు అరుస్తుంది. మహిషాసుర మర్దినికి సయితము వెరపు కలుగు నట్లు చెలరేగుతుంది.

''అయ్యా! ఇంకా ఆలస్య ముందా ఏమి?' అని పరాన్ పలికినాడు.

"లేదు లేదు. ఆలస్యం ఎందుకు ? ఆలస్యం అమృతం విషం అన లేదా పెద్దలు" అని డాక్టరు మహాకాయమునకు కొంత కదలిక కలిగించాడు.

ఇటూ అటూ చూచి పరాన్ "మీరు బండిలో రండి. నేను దూకుడుగా నడిచి త్రోవలో మిమ్ము కలుసుకుంటా" నని, మెల్లగా డాక్టరును బండిలోని కెక్కించాడు.

"కూరలు కొన్ని తెచ్చి నందుని ద్వారా లోపలికి పంపినాను. ఖాళీయైన తట్ట పుచ్చుకొని వస్తాను. పోతూ ఉండండి" అని అతడన్నాడు.

పరాన్ పాతకాలపు పెద్ద మనిషి. ఈ నాడు కూడ భక్తి విశ్వాసముల మూల్య మెరిగినవాడు. సొంత పొలంలోని కూరల పంటా, చెరువులోని చేపల పంటా ఒక్కడే ఆరగింపడు. కొంత కొంత భాగం జీవన మహాశయునికి అందిస్తూ ఉంటాడు. భార్య అస్వస్థత వలన వాటిని మరింత తరచుగా పంపుతూ ఉంటాడు. డాక్టరుపై వానికి ప్రగాఢ విశ్వాసము కలదు. ఆంగ్ల చికిత్సా విధానము వానికి గిట్టనే గిట్టదు. యువక డాక్టర్లపై వాని కెన్నడూ నమ్మకము లేదు మూడవ పెండ్లి పెండ్లాము. చక్కని వాళ్ళలో లెక్క సంపాదించు కొన్నది. భర్త సందేహ సంక లిత స్వాంతుడు. భార్యను బ్రతికించు కొనవలననే వాంఛ ప్రగాఢ మయింది. వాని మక్కువ హద్దు పద్దు లెరుగదు. కావున వాని ఆకులత అవధి లేనిదై ఉన్నది. డబ్బు ఖర్చుపెట్టేందుకు వెనుకాడువాడు కాడతడు. కాని ఇల్లాలి మొగం మీది మేలి ముసుగు పెరికివేసి, ఆమెను బ్రతికించుకోవడం కంటె చచ్చుటే మేలని వాని తలంపు. జీవన మహాశయుని విషయం వేరు. మహాశయుని తల నెరిసి పోయింది. కృతయుగంలో నుంచి గుభాలున ఊడి పడిన ఋషి సత్తముడు. వాని కంటి చూపు కూడ తాత ముత్తాతల నాటిదే! శీతకాలపు గంగా జలం వలె పవిత్ర మైనది ఆయన వ్యక్తిత్వము.

బరువైన మనిషి బండిలో చతికిల బడ్డాడు. బండి కూడ భక్తి శ్రద్ధలతో మెల్ల మెల్లగా నడుస్తూ ఉన్నది.

పరాన్ గృహం వంటి గృహాలు కొన్ని జీవనం గారి ప్రాక్టీసులో స్థిరమై పోయినవి. వాటిని బట్టి ఆతని ప్రాక్టీసు కొంత పదిలపడిందని చెప్పవచ్చు. ఆ ఇళ్ళలో రోగాలు వచ్చినా, రొష్టులు వచ్చినా, జీవన మహాశయుడే సంచి కట్టుతో, మిక్చర్లతో హాజరు కావాలి. ఈ ఇళ్ళ వల్లనే ఆతని కొంపలోని ఇబ్బంది నడలుతూ ఉంటుంది. వానల్లో ఇంటిలోని ధాన్యపుగాది ఖాళీయైనపుడు ఆ ఇళ్ళ వాళ్ళు చప్పున

అప్పుగా దానిని నింపుతూ ఉంటారు. ఏ లోటు అగపడినను, గృహరాణి కంఠంలో కొంత కదలిక అగపడినను, గడగడ లాడుతూ వచ్చి వారు లోటు తీర్చుతూ ఉంటారు. కాబట్టి జీవనమహాశయుడు "దేవుడా! బ్రతికించావు నాయనా!" అని, నిట్టూర్పు విడుస్తూ ఉంటాడు.

ఇక లేనిదేమి? కానిదేమి?

బండి పొలాల్లో ప్రవేశించింది. నలువలంకులందు సుందర వసన ధారిణియై ధరిత్రీ దేవి కన్నులకు విందొనరిస్తూ ఉన్నది. నగుమోము కేదార పరంపరపై జీవన మహాశయుని కన్నుదోయి పడింది. అగపడు పొలములో పెక్కు పొలము లొకప్పుడు వాని హక్కులో ఉండేవి.

ఆ దిక్కున గోచరించే పెద్దచెరువు నిర్మల సలిల పూరితమయింది. పొల ములను తనిపే తల్లి ఆ కాసారము. లక్ష్మీ నివాసమైన క్షేత్ర మొకటి కకుబంతరేఖ వరకు విస్తరించి ఉన్నది. సమక్షమున జవరాలివలె స్మితముఖియై అగపడుచున్నది. కమనీయమైన ఆరామము. అది జీవనం గారి చేతుల నుంచి జారిపోయి ఒరుల చేతులందు పడిపోయింది. కేవలము ఇవి మాత్రమే ఆతని ఆస్తిలోని ప్రధానాంగ ములని తలపచెల్లదు. ఆతని తండ్రి జగద్బంధు మహాశయుడు ఈ పల్లె జమీందారీ లోని ఒక అంశమును, ఒక అణాభాగమును పెద్ద మొత్త మిచ్చి కొన్నాడు.

జీవన మహాశయుడు బండిలో పోతూ, పోతూ ఉండగా ఆతని జీవనమందలి తొల్లింటి ఘట్టాలు వాని మానసవీధిలో స్మృతి పథంలో చలింపసాగినవి.

అపు డాతనిది కిశోర వయసు.

నవగ్రామంలోని వీధి బడిలో ఆతడు చదువుతూ ఉండేవాడు. దిగువ తర గతులను మెల్లమెల్లగా నెట్టివేసి, ఆతడు తుది తరగతిలో కాలు పెట్టినాడు.

ఆరోజులలో జమీందారీదర్జాలో ఒక విధమైన వేంద్రము భుగుల్భుగుల్మ నది. జమీందారీని కొన్నవాని మెదడు తలక్రిందులై పోయేది. వేరొక స్వరూపము దాల్చి నట్లు వ్యక్తియే మారిపోయెడువాడు వాని చేతులలో భారీయెత్తున జమీ పడిన వెంటనే "లచ్చి బుచ్చియై వాని ఇంట్లో కైదీయై కుర్చుంది." అని లోకులు అనుకొంటూ ఉండేవారు. ఆకాలమున సుప్రసిద్ధుడై యుండిన గాయకుడు శ్రీకంఠ మహాశయుడు "ముందు జమీందారికి కామందు పిదప సౌధరాజికి మేలి యేలిక" అనేవాడు! "జమీచేపట్టిన వాడు మేడకట్టి తీరును" అని లోకు లనుకొంటూ ఉంఛారు,

జీవనం గారి చుట్టములును, మిత్రులును, ఆత్మీయులును వీధి బడిలో సహ పాఠులై చదువుకునే వారు. వారిలో రాధాకృష్ణమిత్ర ఒకడు. ఆతడు పెద్దింటి వారి కొడుకు. జమీందారుల ఆదర పోషణము లందుతూ, పాఠశాల క్రమాభి వృద్ధినందు చుండెను జమీందారుల గొప్పతనము చదువు సంధ్యలను బట్టి గణింపబడేది కాదు. అపుడపుడు అది కలహ సంకులమై ఉండేది. ఈ కయ్యములలో మూల పురుషుడై ఉండేవాడు రాధాకృష్ణ మిత్ర. "He is a Zamindar's son, I am also a Zamindars's son. (అతడు జమీందారు కొడుకు. నేను కూడ జమీందారు కొడుకునే) అంటూ అతడు పోరుకు దీ కొనేవాడు. పిల్లల చిట్టి పోరాటము పెద్దల తీవ్ర యుద్ధమై చెలరేగెడిది.

జగద్బంధు జమీందారీని కొన్న తరువాత కొడుకు జీవనం గుండెలో కూడ గర్వోష్ణము కొంత రవుల్కొన్నది. ప్రజలు, ముఖ్యముగ తోడి చదువరులు "చిరుత పులి పెద్దపులి అయిపోయింది. మనం జాగ్రత్త పడాలి" అంటూ వానిని వెక్కిరించే వారు. "పులి! పులి!" అని వానిని ఉడికించే వారు."

పసితనంలో తన స్వరూప మెట్లుండెనో బండిలోని జీవన మహాశయుని జ్ఞప్తికి వచ్చినది. అది సుకుమార, కోమల ఉజ్జ్వల రూపము. ఆ రీతి రూపము వాని తరువాతి వయసులో నవీన ఉన్మేషము కాలేదు. చిరుత ప్రాయంలో వానిది సుందర రూపము; సరళ పరిపుష్టదేహము, గుండ్రని మొగము. తళుక్కులీను కన్నుదోయి. అందలిది నిర్భీక దృష్టి, శ్యామ వర్ణ దుర్దాంత కిశోరమని వానిని వర్ణింపవచ్చును. చెడుగుడు ఆడేటప్పుడు గ్రుక్కత్రిప్పుకొనక క్రీడారంగంలో ఛెంగు ఛెంగున చారల మెకము వలె చెలరేగువాడు. ఎదుటి దళంలోని వారు "అబ్బో! పులి మీదికి ఉరుకుతోంది" అని భయంకరముగ అరచేవారు. మీదికి దుమికి దుమికి ఇంచుక వెనుకకు మరలి, మరల ఒక్కుమ్మడి ముందుకురికి పట్ట వచ్చిన వారిని చరచి చరచి 'చెంగుడుగుడు' అనే గ్రుక్కను బిగ పట్టి యుంచి గిఱ్ఱున వెనుకకు మరలి, కదనాంగణ మందలి మహా వీరుని వలె విజృంభిస్తూ సొంతదళమున జీవనుడు చేరువాడు.

వాని ఇంటి వెనుక తాలింఖానా ఉండెను. అందు మస్తుగా కుస్తీలు జరిగేవి లంగోటా బిగించి, జీవనం మెత్తని నేలపై తటాలున శరీరము విసరేవాడు. ఈ ప్రక్రియ వలన ఒళ్లు గట్టిపడునని ఆత డెరుగును. డంబుల్సు నెంతో చాకచక్యంతో తిప్పే అలవాటు అతనికి ఉండేది. అప్పటి రెండు డంబుల్సు నేడు కూడ ఉన్నవి

జగద్బంధు మహాశయుని అదుపాజ్ఞలలో లేని యెడల మామూలు పులి నరఘాతుక వ్యాఘ్రమై పోయెడిది. జగద్బంధు చిత్తము ఇంచుకంతైన ఉత్తప్త మయ్యేది కాదు. వారి వంశపురుషులందాతడు మహోదారుడు. దంభముతో ఆతడు జమీందారిని కొనలేదు. దానిపై ఆతని కెట్టి మోహము లేదు. అప్పటి జమీందారుల నంటి యుండు దంభోత్తాపమును తొలగించుటకొరకే దాని నాతడు కొనినాడు. దానిని కొనిన ముహూర్తమందే ఈ యూహ వాని మనసున ఉండేది.

ఆతని జమీందారీ వ్యవహారములను చూచు గుమాస్తా ఠాకూరు దాసు మిశ్రుడు, చికిత్సాలయము గోడపై 'లాభానాంశ్రేయ ఆరోగ్యమ్' అని వ్రాసినపుడు, అది భావ బంధురమైనదని తలప జెల్లును. జగద్బంధు హృదయ మందు ప్రకటిత మైనది ధనలాభముపై కాక ఆరోగ్యలాభముపై వాని మనసు నిలిచింది. ఐహిక సంపద కంటె ఘనతరమైనది ఆధ్యాత్మిక విభూతి కదా! ఆ దృష్టితోనే ఆతడు వైద్యం సాగించినాడు. అట్టి చూపుతోనే ఠాకూరుదాసు కళ్ళవాతపు తెగులును ఆతడు కుదిర్చినాడు. అది తొల్లింటి మాట. ఇపుడు మరుగున పడిపోయింది.

జగద్బంధు ఠాకూరుదాసుతో ఇట్లనేవాడు :

"డాలూ, ఖడ్గమూ, రెండూ కలిస్తేనే అస్త్రం అవుతుంది. ఇది కలవాడే యోధుడు. తరవారిని చేబట్టక, ఎదుటివాని ఖడ్గాఘాతమునుండి తల కాపాడు కొనేందుకు ఎవడు డాలు చేబూనునో, వానికిని సంపూర్ణాస్త్ర సంకలితుడైనవానికిని తేడా కలదు. అవునా కాదా చెప్పు. నా చేతిలో ఉన్నది కేవలం డాలు. వట్టి డాలు మాత్రమే! నవ గ్రామంలోని ధనికుల ధాటీనుండి సదాశయ సంరక్షణ మొనరించు కొనుట పాడి. వారివలె సర్వ సన్నద్ధుల మగుట మేలు. విషయమును విప్పి చెప్పెదను. నవ గ్రామ జమీందారుల మ్రోల గౌరవం నిలుపుకోవలసిన బాధ్యత తలపై కలదు. సదా వారు శస్త్రపాణులై విజృంభించేవారు. కాని క్రమక్రమంగా వాటి కిపుడు తుప్పుపట్టింది! వారిపుడు గద చేబూని గిరగిర తిప్పుతూ ఉన్నారు. క్రొత్తగా డబ్బు మూటగట్టిన వ్రజలాల్ ఇపుడు మన గ్రామ జమీందారీలో ఎనిమి దణాల భాగము సంపాదించాడు. వాని చేతిలోని అడిదము మిలమిల మెరుస్తూ ఉంది. వాని ఇంట్లో ఎవరైన వ్యాధిపీడితుడైనపుడు నౌకరు ద్వారా కబురు వస్తుంది. ఆరునెలలనుండి ఈ రీతిగా కబురు వస్తోంది."

నౌకరు వచ్చి కవిరాజుపై ఒక సలాము పారవేసి "అయ్యగారూ! మా కామందుగారు మిమ్మొక పర్యాయం పిలుస్తున్నారు. తప్పక మీరు రావాలి" అని

తెలుపుతూ ఉంటాడు. భిషగ్వరుడు కదలిపోతూ ఉంటే మధ్యమార్గంలో రాయ చౌదరీలు చూచి 'ఏమండోయ్! మా ఇంటికి ఒక పర్యాయం వచ్చిపోవాలి' అని అరుస్తారు. గొప్ప ఇంటివారి పిలుపది. ఈ రీతిగా అపుడపుడు వారి దర్శన భాగ్య ఉంటుంది. ''

ఠాకూరుదాసుకు జగద్బంధు కవిరాజు చెపుతూ ''మిత్రమా! ఈ పరిస్థితు లలో డాలొకటి సంపాదించినాను. కాని తరవారి లేదు. ఒక చేతిలో డాలున్నట్లు రెండవ చేతిలో మందుల కల్వ మున్నది. గొడుగుకు బదులుగా అది ఉంటుంది'' అన్నాడు.

జగద్బంధు డాలు మరుగున పల్లెలోని పలువురకు ఆశ్రయము లభించింది. అస్త్రధారుల ఔద్ధత్యమునుండి రక్షణము చేకూరింది.

తండ్రి మాటలు జీవనదత్తు చెవియందు పడినవి. ప్రక్క గదిలో కూర్చుని అతడు చదువుచున్నాడు.

వాతావరణ మహిమ కుఱ్ఱవాని గుండెపై ప్రసరించినది. జీవనుని మనస్సులో విషయ వైభవ దంభోత్తాపము చెలరేగినది. ఈ పరిస్థితిలో ఉత్తప్తమగుట ప్రకృతి ధర్మము కదా! దీనినుండి పరిత్రాణము పడయుట సులభకార్యము కాదు. అది వినా అతడు కానేకాడు. తండ్రి యొద్దనే ఉండి, ఆతని అడుగు జాడల ననుసరించి తొల్లింటి వైద్యవిధానముమీదనే మనసుంచి, అందు పెద్దచేయి అనిపించుకొనేవాడు. ఉత్తప్త వస్తువు సులభముగా విస్తరించును గదా! అతడు జమీందారు కొడుకు. పెద్ద కుటుంబంలో పెరిగినవాడు. పొరుగున నున్న కలవారి అలవాట్లను అత డెదు ర్కొనలేకపోయినాడు. వైభవాహంకారము వలన ఉత్తప్తమైన చిత్తము తండ్రి తాతలు నిర్ణయించిన పరిధి నతిక్రమింప నిచ్చగించినది. వీధి బడిలోని చదువు ముగిసిన వెంటనే తండ్రి వానిని సంస్కృత పాఠశాలలో ప్రవేశపెట్ట నుద్దేశించినాడు. అందు కొంత వ్యాకరణ జ్ఞాన మలవడిన పిదప ఆయుర్వేదంలో కొడుకును చేర్పించ వలెనని జగద్బంధు దత్తు ఉద్దేశించినాడు. కాని జీవనుడు ''నాయనా! ఈ పాతకాలపు చదువుపై నా బుద్ధి పోవడం లేదు. పాశ్చాత్య చికిత్సా విధానము దొడ్డదని నాకు బోధపడుతోంది. నేను విదేశీ పద్ధతిలో డాక్టరు నవుతాను'' అని జీవనుడు తండ్రితో గట్టిగా చెప్పివేసినాడు.

''ఏమీ! డాక్టరు వౌతావా?''

"అవు నవును. దేశంలో ఇంగ్లీషు చదువుకొన్న డాక్టర్లపై ప్రజల మోజు హెచ్చుతోంది. కవిరాజు వైద్యాన్ని కొద్ది చూపుతో చూస్తున్నారు. వర్ధమానులో (బర్ద్వాను) స్కూలు క్రొత్తగా నిలిచింది. అక్కడకు పోయి చదువుతాను."

దేశంలో నిక్కముగా అప్పుడు అలోపథిక్ చికిత్స రాజకీయ సమారోహంతో రథముపై అధివసించి ఆవిర్భవించింది. కలకత్తాలో మెడికల్ కాలేజీ, హాస్పిటల్, బర్ద్వాన్‌లో మెడికల్ స్కూలు, వేర్వేరు జిల్లాలలోని ప్రధాన పట్టణాలలో ఆసుపత్రులూ, ఛారిటబుల్ డిస్పెన్సరీలు నెలకొనినవి. ఆంగ్లేయులు కొందరు డాక్టర్లుగా ఉన్నారు. స్వదేశీయులు సయితము ఇంగ్లీషువారి దుస్తులతో విరాజిల్లుతున్నారు. పెద్ద కోట్లూ, హేట్లూ, వార్నిష్‌తో ఒప్పు కాల్ బూట్సూ, మిస మిస మెరుస్తూ ఉన్న లేబుల్సు గల సీసాలలోని రంగు మిక్చర్లూ, క్రొత్త క్రొత్త ప్రిస్క్రిప్షనులు విశేషంగా విజృంభిస్తున్నవి. ఈ పల్లె ప్రాంతంలో మాత్రము కవిరాజు సామ్రాజ్యము బారుగా శిథిలం కాలేదు.

పట్టకారు కాడలవలె ఇద్దరు డాక్టర్లు కవిరాజుగారికి ఇరుకొలంకులందు చేరుకొన్నారు. ఉత్తర దిశలో ఒకడు, దక్షిణ పూర్వదిశలో వేరొకడు నెలకొని యున్నారు. మొదటి వ్యక్తి భువన డాక్టరు. నవీన దుస్తులు ధరించి, గుఱ్ఱముపై కూర్చొని యీ ప్రాంతము నుండియే అపుడపుడూ పోతూ ఉంటాడు. రెండవ ఆసామీ రంగలాల్ డాక్టరు. పాశ్చాత్య జగతినుండి ఆవిర్భవించిన వ్యక్తివలె అతడు అగపడుతూ ఉంటాడు. పాలకీలో కూర్చుని నలుగురు తన్ను చూస్తున్నారో లేదో కనిపెట్టుతూ అతడు కవిరాజు గుమ్మము నంటి పోతూ ఉంటాడు. ఈతని మకాము ఇచటి నాలుగు మైళ్ల దూరంలో ఉన్నది. ఈ ప్రాంతంలో అలోపథిక్ చికిత్సను ప్రవేశపెట్టిన వ్యక్తి యితడే!

ఇతడొక విడ్డూరపు వ్యక్తి. ఈతని శక్తి విచిత్రమైనది. అద్భుతమైనది. వీని ప్రతిభకు పట్టుదల యీడైనది. మెడికల్ స్కూల్‌లోగాని, మెడికల్ కాలేజిలోకాని ఇతడు చదువలేదు. సొంత ఇంటనే అతడు వైద్య శాస్త్రం దిగమ్రింగినాడు. అర్ధరాత్రివేళ శ్మశానమునకు పోయి శవములను త్రవ్వి తెచ్చి, నదిలో అపుడపుడు కొట్టుకొనిపోవు పీనుగులను మోసుకొనివచ్చి గ్రంథాలలోని సూత్ర నిర్వచనములను బట్టి అనాటమీ నేర్చుకొన్నాడు 'విస్మయకర సాధన! విషయకర సిద్ధి' గట్టి పిండము! మొండి ఘటము! వాని సొంత ఊరు హుగ్లీ జిల్లాలో ఎక్కడో ఉంది.

ఏదో ఒక్క విసరున ఈ ప్రాంతాలకు వచ్చి పడ్డాడు. ఈ జిల్లాలో గవర్న మెంటు ఇంగ్లీషు స్కూలులో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. ఇంగ్లీషు భాషను చక్కగా అధ్యయనం చేశాడు. ఈ భాషలో అసామాన్య అధికారము సంపాదించినాడు. వానికి గల ఆత్మవిశ్వాసము అగాధము. విఖ్యాతి నందిన హెడ్‌మాస్టరు శివరాముని ఆంగ్లరచనలను చూచి రెండు చోటులందు గీతలు గీచి, "ఇచ్చట ఈ పదప్రయోగము దోషాక్తమైనది. ఈ విధంగా మార్పు చేయడం మంచిది. మరి దానిని ఇంప్రూవ్ చెయ్యండి" అని చెప్పుట కాతడు సంశయింపడు. ఆత డెందువల్లనో మయూరాక్షి నదీతీరమునకు ఆకర్షింపబడి, కొండొక నిర్జనప్రదేశములో ప్రవేశించి, తపస్వివలె సాధనచేయ సాగినాడు.

"ఇక నేను చికిత్స చేస్తాను." అని ఆతడొకనాడు ఆకస్మికముగ నిశ్చయించి, కొలది దినములలో ఈ ప్రాంతములందు అసామాన్య ప్రతిష్ఠ నార్జించినాడు. ఆతడు సంపాదించిన ప్రతిష్ఠ ఆతనిదే కాదు. అలోపథిక్ చికిత్సా విధానమునకే అపూర్వమైన ప్రతిష్ఠ దక్కినది. ఇందది సుప్రతిష్ఠత మైనది. నలుదిక్కులనుండి ఎంద రెందరో వచ్చి నూతన వైద్య విధానమునకు శ్రద్ధాంజలి సమర్పింప దొడగిరి.

జీవనుడు కైశోర యౌవన సంధికాలమున ప్రాతకాలపు వైద్య విధానము దెస పెడమొగము పెట్టి అలోపథిక్ చికిత్స దిక్కుగా పోయినాడు. వానికి ప్రతిష్ఠ అవసరము. అర్థ మవసరము ఖ్యాతి అవసరము. లోకులనుండి అగాధ శ్రద్ధ అవసరము. సొంత జమీందారీ ఇందుల కాతనిని ప్రేరేపించినది. తండ్రి జమీందారీ కొన్న ముహూర్తమందే తాను తప్పక ఆంగ్ల చికిత్సా విధానమున సురక్షితుడు కావలెనను లక్ష్యము వాని దృష్టియందు సాక్షాత్కరించినది. పల్లెలోని వీధి బడి చదువు ముగించి పిదప కాందీ రాజా స్కూలులో ఎన్ట్రెన్స్‌లో ఆతడు ప్రవేశించాడు. అందు ఉత్తీర్ణుడై ఎఫ్.ఎ. క్లాసులో అడుగుపెట్టినాడు. తదనంతరము ఆంగ్ల వైద్య కళాశాలలో ప్రవేశించినాడు.

ఎద్దు బండి ఆగినంతనే జీవన మహాశయుని భావనా స్రవంతి తటాలున ఆగి పోయినది; తన్మయసూత్రము పుటుక్కున తెగినది; కట్టెదుట పరాన్ వీధి చావడి అగపడుతోంది. పరాన్ పరుగు పరుగున వచ్చి స్వగృహమును చేరుకొని బండిమీదినుండి డాక్టరును మెల్లగ దింపినాడు.

గత జీవన భావనమునుండి వెడలి, జీవన మహాశయుడు వాస్తవ వర్తమానమున అడుగు పెట్టినాడు.

# నాలుగవ ప్రకరణము

పరాన్ బీబి ఒళ్లు కొంచెం నిమ్మళించింది. ఇంకా నిమ్మళించే అవకాశం ఉండేది. కాని అలా కాలేదు. అయ్యేదారి అగపడడం లేదు. నాడి గతి చూచి వైద్యుడు అనుకొనుదానికిని, రోగి లక్షణాలకును పొందిక కనుపించడం లేదు. డాక్టరు ఊహ వేరు. తెవులు తంతు వేరు. వ్యాధికంటె వ్యాధిని గురించి పిచ్చి తలపులు అధికంగా చెలరేగుతున్నవి. "అయ్యో! ఇక్కడ నొప్పి! అక్కడ నొప్పి" అని ఆమె గోల చేస్తూ మంచంపై దొరలుతూ బొబ్బలు పెడుతూ ఉంటుంది.

"అయ్యో! ఈ కడుపునొప్పి ఈ జన్మలో పోదా?" అని అరుస్తూ ఉంటుంది. ఇంకొక వింత విషయం ఉంది "రోగం పోయింది. నువ్వు బాగు పడ్డావు" అని ఆమెతో డాక్టరు చెప్పినయెడల వ్యాధి ప్రకోపించి పోతుంది. పాపం అతడేమి చేయగలడు? ఈ రీతి ప్రకృతికి వలసిన చికిత్స ఆతని చేతిలో లేదు. బాగుపడాలనే ఉద్దేశం ఆ యువతికి లేదని అతడు గ్రహించాడు. లేచి నడిచేందుకు ఆమె ఇష్టపడడం లేదు. కాబట్టి కొంచెం బుద్ధి ప్రయోగించి అతడొక యెత్తువేశాడు.

"ఈమె వ్యాధి సాంతంగా తగ్గడం లేదు. అయినప్పటికి భయపడవలసిన పనిలేదు. వట్టి దుడుకెందుకు?" అని అతడు అంటూఉంటాడు. మరేమి చేయ గలడు? ఆరీతిగా అతడు పలుకుతూ ఉన్నపుడు బీబీ మగని ముఖవైఖరి ఎట్లుం టుందో, మానసికావస్థ ఎలా ఉంటుందో డాక్టరుకు తెలియనిదికాదు. జీవనమహా శయుని జీవనం యావత్తూ అశాంతి మయమై పోయింది. ఆలుమగల మనస్సులు కలియనపుడు పుట్టుగగ్గోలు, గందరగోళము, పెనుగోల, భీషణప్రళయ ప్రదర్శనము అనిర్వచనీయములు. ఆజన్మము డాక్టరు ఈ ప్రళయాగ్నిలో మ్రగ్గిపోతున్నాడు. ఈ అగ్గి ఎన్నడు ఆరిపోవుట లేదు. నేడు కూడ రోగిని చూచి, అతడింటికి మరలిన వెంటనే ఆ మంట మరింత భయంకరంగా ప్రజ్వరిల్లింది. తాను కొంపలో లేనపుడు నిప్పు ఎట్లు అంటుకొన్నదో అత డెరుగడు. గుమ్మంలో ప్రత్యక్ష మయింది అమ్మ వారు!

ఇంటిఅమ్మవారి అరుపులు పరిసర ప్రాంతములందు ప్రతిధ్వనిస్తూ ఉన్నవి. ఆగ్రహావేశములో ఆమె చెలరేగుచున్నది. ఒక క్షణంలో మగనిని ఆడిపోస్తూన్నది, మరుక్షణంలో నవగ్రామంనుండి వచ్చిన మోటువైద్యుని దుయ్యపట్టుతూ ఉంది.

ఇతని పేరు శశిభూషణుడు. తనవైద్యం వల్ల ఈ మహాశయుడు భూభారం తగ్గిస్తూ ఉంటాడు ధరిత్రీలలామ బాధ తగ్గుతూ ఉంటుంది. ఇపుడు జీవన డాక్టరు కొంపలో నిప్పు ముట్టించిన వాడాతడే! యజమాని ఇంట లేనివేళ, అతని కొంపలో జొరబడ్డాడు. ఇంటిఅమ్మవారి మ్రోల తిష్ఠవేసి అనేక విధముల ఆమెను విసిగించి, రెచ్చగొట్టినాడు. హుంక్కా-పీల్చి, పీల్చి బొగ్గుపొడుం, కచిక వగైరాపెంటతో ఇంటి వసారా యావత్తూ పాడుచేసి వదిలినాడు. తన ప్రసంగధోరణిలో కొన్ని స్వీయ చరిత్రాంశములను కలిపి, హాస్పిటలు డాక్టరు తన్ను, తనవైద్యమును తూర్పారబట్టిన విషయం గ్రుక్క-తిప్పకుండ ఏకరువు పెట్టినాడు. ఈ పిచ్చి ధోరణివలన ఇంటి అమ్మవారికి నైసర్గికమైన వెఱ్ఱి మరింత హెచ్చింది. అభాగుడైన శశిపై ఆమెకు కొంత వాత్సల్యము లేకపోలేదు. ఆవేశము వచ్చినపుడు ఆ మమత మంట గలిసిపోతుంది.

జీవనమహాశయుని శిష్య శిఖామణి శశిభూషణుడు. ఆరోగ్యనికేతనమందే వైద్యవిద్యలో అతడు అక్షరాభ్యాసం చేశాడు. డిస్పెన్సింగ్ నేర్చుకొన్నాడు. తరువాత ఇందుండియే వర్ధమాన పురమునకు పోయి, కొన్ని పర్యాయములు మాత్రమే పట్టీలుకొట్టి పరీక్షలోనెగ్గి కంపౌండరై తిరిగి వచ్చి, నవగ్రామంలోని ఛారిటబుల్ డిస్పెన్సరీలో ఉద్యోగిగా ప్రవేశించాడు. కంపౌండింగ్‌పని అతడు బాగుగా ఎరుగును. తోడ్తోడనే ప్రిస్క్రిప్షన్ ఇచ్చే అర్హతగల వైద్యవిద్య అంతో ఇంతో నేర్చినాడు. రోగి నాడి చూచి వ్యాధినిర్ణయం చేయడం ఎట్లో జీవనడాక్టరు వానికి నేర్పినాడు. తనకొక ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉండి తీరాలని అతడు నిశ్చయించినాడు. క్షుర కర్మబాధ తొలగించుకొన వలెననీ, తన వైయక్తిక ప్రభావము జగతికి తెలుపవలెనని నిశ్చయించి అతడు తన గడ్డమును, మీసములను చిత్తము వచ్చినట్లు పెరుగనిచ్చినాడు. జీవితములో ఎపుడో ఒకప్పుడు (బుద్ధిపుట్టిన సమయములో) అతడు స్నానముచేస్తూ ఉంటాడు. పూర్వజన్మంమాట చెప్పలేముకాని, యీ జన్మలో అతడు పళ్లుతోముకొని యెరుగడు. ప్రతిదినము మొగము కడుగుకొనవలెనని ఎవ్వరూ నోరెత్తి వానితో చెప్పరైరి. ఒక జుబ్బా తొడిగి, అధమ పక్షము పదునేను దినములు దానిని శరీరముపై నిలుపుతూ ఉంటాడు. అందుండి మిగుల ఉత్కటమై, దుర్భరమైన, దుర్దాంతమైన దుర్గంధము వెడలి మానవ

లోకమును మటుమాయముచేయు స్థితి వచ్చువరకు దానిని విప్పుటకు అతడు సాహసింపడు. అనవరతము తంబాకు వాని నోటిలో ఉండి తీరవలెను హుక్కాగొట్టము వాని దేహమందలి భాగమే అగునట్లు వానిచేతి నంటియుండును. జుబ్బాజేబులో సర్వదా హుక్కా సామానూ, అగ్గిపెట్టె ఉండితీరాలి.

ఇవి ఇట్లుండగా మద్యపానం లేనిదే అతడు బ్రతుకలేడు. తప్పత్రాగి అపుడపుడు పడిపోతూ ఉంటాడు. ఈ దురభ్యాసముల వల్లనే నవగ్రామం డిస్పెన్సరీలో వాని ఉద్యోగం ఊడిపోయింది. తన దురభ్యాసములకు సంబంధించిన సరకును దేహముపై వేసికొనినగాని అతడొక అడుగు ముందుకు వేయజాలడు, "కొందరు, తమ పెద్దలకు తెలియక హుక్కా పీలుస్తూ ఉంటారు. నేను నా తాత కాలం నుంచి అనగా నా బాబు బాబు నాటినుండి దీనిని పీలుస్తున్నాను. అసలు నాకు దీనిని మప్పిన వాడాతడే! మాతాత నన్ను ఒడిలో కుర్చుండ బెట్టుకుని, తనచేతిలో తాను హుక్కా గొట్టపు సరంజాము చేసి నాకు దీనిని పీల్చడం ఎట్లో నేర్పేసాడు. ఇది లేనిదే ఎక్కడికి పోరాదని అతడు హెచ్చరించేవాడు. నేను మరణించిన తర్వాత నాచేతిలో హుక్కా గొట్టమూ, గంజాయీ, తంబాకు వగైరా సామగ్రి పదిలముగా చేర్చవలసినదనీ, అగ్గిపెట్టి పెట్ట నవసరము లేదనీ, చితిమంట సరిపోతుందనీ పిల్లకాయలతో చెప్పివేసినాను." అని శశి అంటూ ఉంటాడు.

నవగ్రామంలోని డిస్పెన్సరీలో ఉద్యోగం చేసే కాలంలో అతడు తన సామగ్రిని మందుల బీరువాలో ఒకమూల ఉంచి, పైన కొన్ని కాగితములనూ, పేకింగ్ సామగ్రినీ అమర్చేవాడు. అయినప్పటికీ ముమ్మారు డాక్టరువలన పట్టుపడ్డాడు. డాక్టరు వానిని కరుణించి పనిలో ఉంచినాడు. నాలుగవ పర్యాయం అతనిని ఉద్యోగమునుండి తొలగించినాడు. అయినప్పటికి వైద్యంలో తనకుగల మిడిమిడి జ్ఞానమును ప్రయోగించి అంతో ఇంతో అతడు డబ్బు చేస్తున్నాడు. యథాప్రకారం బ్రతుకు గడుపుతున్నాడు. వాని పిల్లలు ఎందెందో ఏమేమో పనులు చేస్తూ కాలక్షేపము చేస్తున్నారు. శశి తన ప్రాక్టీసువల్ల ఎందుండియో రూపాయి డబ్బులు గుంజుతూ ఉంటాడు. తన ప్రాక్టీసులో గడ్డుస్థితి ఎదురైనపుడు "అన్యథా శరణం నాస్తి" అంటూ జీవనడాక్టరు కడకు పరుగు పరుగున వస్తూ ఉంటాడు. 'గురూజీ'! అని అతనిని సంబోధిస్తూ ఉంటాడు. గురూజీయొద్ద అతడు పెక్కు విషయములు నేర్చికొనినాడు. "గురు మహాశయుని విద్యలో నాలుగింట మూడు వంతులు నాకు దక్కినవి" అని పకపక నవ్వుతూ అతడంటూ ఉంటాడు. కేవలము నాడీ జ్ఞానమును, వైద్యజ్ఞానమును మాత్రమే అతనియొద్ద పడయలేదు. చతు

రంగపు ఆటకూడ నేర్చుకొన్నాడు. గురూజీ హరినామ సంకీర్తనం చేస్తూ ఉండగా. తానుకూడ తనకు తోచిన రీతిని భజనచేస్తూ ఉంటాడు. "శిష్యవిద్యగరీయసీ" అనుమాట కలదుకదా!

కొందరు మిత్రుల సంసర్గమున కాలక్షేపము చేస్తూ అతడు ఆహార నిద్రలు మరుస్తూ ఉంటాడు. "ఈ రాత్రి రోగులవద్దనుండి పిలుపు వచ్చింది. ఇంటికి వచ్చేందుకు వీలులేదు. ఆహారం మూటగట్టి పంపండి." అని ఆత డింటికి కబురు పంపుతూ ఉంటాడు.

రాత్రులందు శశి చపాతీలు మాత్రము తింటూ ఉంటాడు. వానిని చేయ డంలో వానిభార్య విశేష విఖ్యాతిని సంపాదించుకొన్నది. మిత్రులతో కాలక్షేపము చేసి, తన సామగ్రి నొకమూల పారవేసి రాత్రి రెండుగంటలవేళ ఖాళీ కంచము చూసి, ఏవేవో దురూక్తులు ఉచ్చరించి ఎందెందో దొరలి, మర్నాడు ఎవరియొద్దనైన రెండు రూకలను అప్పుగాగొని ఇంటికి మరలుతూ ఉంటాడు. "నిన్నటి ప్రాక్టీసులో చేబడిన డబ్బిది. జాగ్రత్త పెట్టు" అని భార్యతో చెపుతూ ఉంటాడు.

శశి నేర్చిన మూడవవిద్య సంగీతము. అతని కంఠము అసురస్వర విశిష్టమై ఉన్నది. కేవలము అసురస్వర మంటే సరియైన వ్యాఖ్యానము కాదు. అది వికాసుర స్వర మన జెల్లును. వాని కంఠనాద మెట్లు కర్కశమైనదో, రాగతాళము లును దానికి తగినట్లుగానే యుండును. స్వతంత్రమైన పోకడలతో అవి చెల రేగుతూ ఉండును. మద్యపాన ప్రభావము వాని గాంధర్వ విద్యపై ప్రసరిస్తూ ఉంటుంది. పెద్ద పాటకులలో తనకు పెద్దచోటు కలదని వాని ఊహ. సంకీర్తన సమయములో అపస్వరములు దుళ్లిపడుట చూచి, జీవన డాక్టరు నుదురు చరచికొని, "శశీ! హరి శబ్దము విరిచి పారేస్తున్నావు! పాపము హరి శరీర మెంతగా నొచ్చుతోందో! శిష్యుని పాపము గురువుతలకు చుట్టుకోకమానదు. నరకకూపము నన్ను కబళించి తీరుతుంది" అని పలుకుతూ ఉంటాడు.

"మీకీ గుండె దడ ఏల? మీ రథాన్ని గోతిలోకూర్చే దుష్టుణ్ణి కానునేను." అని నవ్వుతూ అంతేవాసి జవాబు చెపుతూ ఉండును.

ఇది శశి డాక్టరును గురించిన ఉపాఖ్యానము.

"అయ్యో! కేసు బాగా ముదిరిపోయింది. ఇప్పుడు ఉపాయమేమి? అని సందిగ్ధస్థితిలో గురువు కడకు వచ్చి మొరపెట్టుకుంటూ ఉంటాడు శశి.

" రోగి లేతమనిషా లేక ముదిరినవాడా ? ముదిరినకేసు పండుతుంది. పండి సులభంగా రాలిపోతుంది. నీ వైద్యంలోని దోషంకంటె రోగి వయసులోని దోషం అధికంగా ఉంటుంది " అని జీవనడాక్టరు ప్రత్యుత్తర మిస్తాడు.

రోగి తరుణ వయస్కుడైన యెడల, కేసు సంగతి ఆతడు వింటాడు. బాగా ఆలోచించి, సలహా చెపుతాడు.

ఒక్కొక్కపుడు శశి గురూజీని రోగియొద్దకు తీసికొనిపోతూ ఉంటాడు. చాల కేసులకు ఫీ హుళక్కి. పుణ్యానికిపోయి రోగిని చూడాలి. శశి కంపౌండరుకి డాక్టరు హోదాలో వైద్యంచేసే వేళల్లో నాలుగణాల ఫీ లభిస్తూ ఉంటుంది. అందుకు తక్కువైతే గిట్టదు. అతడపుడు ఘాటుగా చెపుతూ ఉంటాడు. రెండణాలు మొదలు ఎనిమిదణాల వరకు ప్రాక్టీసు నడుస్తూ ఉంటుంది. దైన్య మనేది ఆతదెన్నడూ ఎరుగనే ఎరుగడు. ధైర్యం వాని సొమ్ము. సంతుష్టాంత రంగుడై వ్యవహరించే వ్యక్తి ఆతడు.

తనద్వారా జీవనడాక్టరు చేతబట్టే కేసులకు ఒక్కొక్క రూపాయి ఫీ ఇవ్వా లనే ఖరారు ఉండడం నిజమే। కాని ఖరారు చెల్లిన సమయాలు లేవు.

జీవనమహాశయునికి ఇచ్చటి మట్టి, మనుష్యులూ, చెట్లు, చేమలూ సమస్తమూ సుపరిచితములే। ఎల్లర పుట్టు పూర్వోత్తరాలూ ఆత డెరుగును. తాత తండ్రుల నాటినుండి ప్రజల ఇక్కట్లపై ఒక కన్నువేసి ఉండడం వారి వంశ మర్యాద. పేదలకోసము ఆరోగ్యనికేతన ద్వారము సదా తెరువబడి యుండును. పగలనక రాత్రియనక కొందరు రోగులు ఇతర పల్లెలనుండి సయితము ప్రాకియో, దేకియో వచ్చి జీవన డాక్టరు పంచ చేరుతూ ఉంటారు. డబ్బుకై వారిని ఆతడు నిర్బంధించడు.

జీవనంగారి వైద్యం అలా నడుస్తూఉండగా శశి ప్రాక్టీసు అలా ఉంది.

యుద్ధకాలంలో వైద్యశాస్త్రంలో అద్భుతమైన సంచలనం కలిగింది. క్రొత్తక్రొత్త ఔషధములు కనుగొనబడినవి. నూతన చికిత్సా విధానములు గోచ రించినవి. ఇవి శశి ఆకళింతలో ఎట్లు ప్రవేశింపజాలును• అణాల ప్రాక్టీసు కూడా అధ్వాన్నపు స్థితి లోనికి వచ్చింది. సల్ఫర్ వర్గపు టేబ్లెట్సు, పెన్సిలిన్, స్ట్రెప్టొమైసిన్ మున్నగునవి పాశ్చాత్య చికిత్సా రంగంలో అగపడినవి. నూతన కాలపు డాక్టర్లు ఈరీతి ఔషధాలను విశేష పరిమాణాలతో ప్రయోగిస్తూ ఉంటారు. పిడుగుకీ బియ్యానికీ పెన్సిలిన్ సిద్ధమౌతుంది జ్వర

మేదైనను సరే ఇవి ప్రత్యక్షమై తీరును. వీని ప్రయోగ విధాన మేమో శశికి తెలియనే తెలియదు. ఇంగ్లీషు మందులను చూచినపుడు వానికి తప్పనిసరిగా దడ పుడుతూ ఉంటుంది. నిషాలేని సమయంలో ఒకరీతిగానూ, నిషా ఉన్న సమయంలో వేరొక రీతిగానూ ప్రవర్తిస్తూ, ఆతడొక పర్యాయం నవ్వుతూ వేరొకమారు ఏడుస్తూ ఉంటాడు.

కొన్ని దినాలకు పూర్వం ఆవలిపేటలో నివసించే సీతారాముని కూతురు నిమోనియా వ్యాధివలన పీడింపబడినది. శశి నుద్దేశించి ఆతడు "ఇన్జెక్షన్లు ఇస్తే త్వరలో కుదిరిపోతుంది. అని ఆసుపత్రి డాక్టర్లు అంటున్నారు. మరి వైద్యం...." అని చెప్పబోతుండగా శశి మాట కడ్డువచ్చి బుస్సుమన్నాడు.

వాని ఊహ శశికి బోధపడింది. సీతారాముడు పెన్సిలిన్ ఇన్జెక్షన్ మాట సూచిస్తున్నాడని ఆతడు గ్రహించినాడు. కళ్లెఱ్ఱజేసి ఆతడు, "అయితే మందు రూపాయిలు గ్రక్కుము. సూది మందుకు ఆలస్యము లేదు. సూది మందంటే శరీరంలో పాతరలు త్రవ్వడం అని గ్రహించాలి. అంతపని చేసేందుకు నా చేతులాడవు. ఒంట్లో సూదులు గ్రుచ్చిన తర్వాత ఎంత దారుణమైన మంట పుట్టుతుందో నీకేం తెలుసు ? ఈ మంటలో కొత్త తంటా పెరుగుతుంది. ఈ తంటాను, ఆ మంటను ఎలా ఎదుర్కోవాలో ముందుగా మీరు తెలిసికోవాలి. ఈ సందర్భంలో కడుపునొప్పి ఒకటి పుట్టడం తథ్యం. దానికి తట్టుకోవడం యెట్లా. సమస్త విషయాలూ ఆలోచించి, మరి క్రొత్త వైద్యంలోనికి దిగు" అన్నాడు.

"అయితే ?"

"అయితే నీకేమి ఇష్టమో అలా చెయ్యి. ఆసుపత్రి డాక్టరు ఏమేమో అఘోరించాడు అంటున్నావు. వానిచేతనే రోగికి సూదులు పొడిపించకపోయినావా ? ఆసుపత్రిలో ఆమె నెందుకు ప్రవేశపెట్టించినావు కావు ?"

"అందులో ఖాళీ లేదండి."

"అలా అయితే నేను చెప్పినట్లు చెయ్యి. యుగయుగాలనుండి, తరతరాల నుండీ చెల్లుబడి అయ్యే వైద్యమే శరణ్యం అనుకో. మర్దనాలు మంచి పని చేస్తుంది."

"అయితే అలాగే సాగించండి."

ముసలితనంవల్లా, నిషావల్లా శశి మస్తకము వికృతమై పోయింది. ఒకపుడు నిరాశ, వేరొకపుడు దురాశ వాని మనస్సులో పైశాచిక నృత్యం చేస్తూ ఉంటవి,

దీర్ఘంగా ఆలోచించి ఆ భిషగ్వరుడు నిమోనియా వ్యాధి నివారణకై ఈ క్రింది వైద్య విధానం సర్వోత్కృష్టమైనదని నిర్ణయించాడు.

"సీతారాముడూ! నీవు కావలసిన వాడవు. నీ మీది మక్కువతో ఈ వైద్యం సాగిస్తున్నాను. ఆవనూనెతో మనము ఒంటికి ఎల్లప్పుడూ మర్దనాలు చేస్తూ ఉంటాము. ఈ కేసులో ఆవనూనెకు బదులు కిరసనాయిలు ఎక్కువ పనిచేస్తుంది. కిరసనాయిలు యొక్క గుణం అమోఘమయింది. దాని వలన అగ్ని జ్వలిస్తుందని ఎరుగుదువుకదా! అది లేనిదే జ్వాల ఎక్కడిది? కిరసనాయిలుతో ఆమె గుండెను రుద్ది తీరాలి. దీని మర్దనాలు వలన గుండెలో జ్వాల పుట్టుతోంది. లోని నిమోనియా శీతలం దెబ్బతో మాడి చక్కాపోతుంది. ఏనుగు బలంతో రోగి లేచి కూర్చుంటుంది. యోచన బట్టి కర్మ ఉంటుంది. రోగిని బట్టి వైద్యం ఉంటుంది"

ఆలాగే వైద్యం జరిగింది. కిరసనాయిలు మర్దనాలవల్ల గుండెపై బొబ్బలు లేచినవి. రోగి నోటినుండి పెదబొబ్బలు వెడలినా, కొంప వానివల్ల దద్దరిల్లి పోయినా చికిత్స జరిగింది. కేసు ఘోరమైన ప్రమాదస్థితిలో పడిపోయింది. సీతారాముడు ఉన్మాదుడై అరవసాగినాడు. వాని కొంపనుండి మహారాజశ్రీ శశిడాక్టరు పలాయనం చిత్తగించి, జీవనడాక్టరు ఇల్లు చేరుకొన్నాడు.

తన ప్రాక్టీసులో దారుణ పరిస్థితులు ప్రత్యక్షమైనప్పుడు గురూజీ పాలికి పోవడం వాని అభ్యాసమేకదా! గురూజీ అపుడింట లేడు. దురదృష్టవశత్తూ ఇంటి అమ్మవారిని రెచ్చగొట్టినాడు

మరికొంత సేపటికి జీవనమహాశయుడు కొంపకు తరలి వచ్చినాడు. తన ఇంటి పునాదులు కదలుతున్నవనీ, తన కొంప కప్పు అజాండములోనికి ఎగురుతున్నదనీ దూరమునుండి ఆతడు కనిపెట్టినాడు. బరువు శరీరము మరింత బరువెక్కింది. నిమిషముసేపు ఆతడు నిలిచి "ప్రళయ హేతువేమై యుండునా" అని ఆలోచింప సాగినాడు. వీథి గుమ్మమునుండి శశి గురుమహాశయుని చూచి, క్షణములో పరుగునపోయి కేసును గురించి ఆతనితో చెప్పినాడు. ఇరువురూ సీతారాముని ఇంటికి పోయినారు. రోగిని పరిశీలించారు. సమస్త వృత్తాంతం సవిస్తరముగ శిష్యోత్తముడు ఆచార్య వర్యునకు విశద మొనరించినాడు. రోగి గుండెమీది బొబ్బలు లోపలకు వ్యాపింపలేదని వారు గ్రహించారు. భిషగ్వరులిద్దరూ తమ తమ మస్తకములను కలిపి తరువాతి చికిత్సను గురించి పర్యాలోచించారు. మెరపు తీగవలె ఒక అద్భుత భావము ఒకే పర్యాయం వారి మానస

దిగ్వలయమందు తళ్కొత్తింది. "బొబ్బలమీది తోలు ఊడి చక్కాపోయింది. కాబట్టి దొడ్డిలోని రొట్ట తెచ్చి కాచి, వాటిపై కట్టడం మేలు" అని తీర్మానించారు.

ఈ చికిత్స ఏకా వర్ణింప నక్కర లేదు. తక్కిన మానవులకున్నట్టు రోగికి కూడ పంచప్రాణము లున్నవి. అయిదింటిలో నాలుగు ప్రాణాలుపోయి ఒకప్రాణము మిగిలింది. ఇద్దరు డాక్టర్లకు ఇరుగుపొరుగువారు సహస్రధన్యవాదములు సమర్పించారు.

దైవకటాక్షము వలన అనండి లేక బాలిక అదృష్టం అనండి కొంతకాలము నకు ఆమె మంచమునుండి లేచినది. ప్రమాదం తప్పింది. నిమోనియా పెక్కు ఆమడలదూరం పలాయనం చేసింది. "పెన్సిలిన్ పనిలేక, ఇన్జెక్షన్లు అక్కర లేకుండా, ఏంటీ ఫిలోజెస్టిన్ వగైరాల ప్రమేయం లేకుండ మా వైద్యంవల్ల బాలిక బాగుపడింది. మరొక చికిత్స ఐతే బ్రతికి బట్ట కట్టేదా?" శశి జీవనములు జెబ్బగొట్టి చెప్పివేశారు.

కథ ఇంటి అమ్మవారి చెవిలో పడింది. అంతకుమున్ను ఒకనాడు మాటల సందర్భంలో కంచరి ముసలమ్మ కథను శశి ఆమెతో చెప్పివేసినాడు. మనసు కుదుట బడినపుడు ఆమె మేలి ఇల్లాలగును. తన అభిప్రాయము నిట్లు వ్యక్తీకరించినది. "బ్రతికినంత కాలము స్వభావం ఒకే రీతిగా ఉండాలా? ఎన్నెన్నో తప్పులూ, ముప్పులూ ఘటిల్లాయి. ఇంకా జ్ఞానం కలుగలేదు. నాడి చూడడంలో తనకుసాటి ముల్లోకాల్లో ఎవ్వరూ లేరని గొప్పలు చెప్పుతూ ఉంటారు. వట్టి గంగ వెఱ్ఱి! రోగిని చూచి 'ఫలానా రోజున నువ్వు చచ్చి తీరుతావు' అని చెప్పడం ఎందుకు? మాట విని బ్రతికే రోగెవరు? పరీక్షల్లో పేసైన డాక్టర్లు ఈ రీతిగా ప్రసంగిస్తారా? ఇంటిదగ్గర ఏవేవో నాలుగు ముక్కలు ముక్కున బట్టి ఎవ్వరైనా సర్వవిద్యలూ మావే అని చెప్పుకొంటారా? ఛీ! ఛీ! ఈ కథంతా నవగ్రామ డాక్టర్లూ, మరి బుద్ధి కలవాళ్లూ ఏమంటారో అని యోచించుకోనక్కర్లేదా? గురువును మించిన శిష్యుడూ, శిష్యునిమించిన గురువూ! భేష్! భేష్!"

# ఐదవ ప్రకరణము

శశి తన ప్రసంగంలో తరచుగా బోగస్ అనుపదం ప్రయోగిస్తూ ఉంటాడు. జీవనం గారి భార్య గౌరి (ఇంటి అమ్మవారు) ఈ మాట అనేకపర్యాయములు విని నది. దాని అర్థము ఆమెకు తెలియదు కాని, అతడు శబ్ద ప్రయోగం చేసే సంద ర్భమునుబట్టి, ఉచ్చారణమునుబట్టి, వాని హావ భావములనుబట్టి అది చెడ్డ అర్థము గల మాట అని ఆమెకు బోధపడినది. ఆనాడు అతడు చేసిన ప్రసంగంలో ఆ పదము ఎన్నిపర్యాయములో దుల్లిపడింది.

వానిదోషం లేదు. ఆ వేళ అతడు ఒళ్లు మండి వచ్చినాడు. తన వైద్యం వలన అట్టి ప్రమాదం ఘటిల్లుతుందని అతడు కలనైన తలపలేదు.

నవగ్రామంలో నివసించే ప్రద్యోత డాక్టరు జీవనశశుల అపూర్వ వైద్య వృత్తిని గురించి పెద్ద అల్లరి పుట్టింప నిశ్చయించినాడు. అన్యాయమూ, అధర్మమూ జగతిలో చెలరేగినపుడు దాని నెదుర్కొనుట స్వభావ ధర్మము. ఒక విషయమును పూర్వపక్ష మొనరించేందుకై ఒకడు లేచిన వెంటనే పదుగురు తమంత తాము ముందుకు వచ్చి వాని బుజమొడ్డి తీవ్రంగా ప్రతిఘటిస్తూ ఉంటారు.

ప్రద్యోత డాక్టరు నవగ్రామంలో ఉండే అలోపథిక్ డాక్టర్లందరికి తన ఉద్దేశ మును వెల్లడి చేసినాడు. వెంటనే డాక్టర్లయొద్దనుండి ఉదంతము బజారులందూ, పల్లె ప్రాంతములందూ ప్రాకిపోయింది.

'చావును మించిన చేటేమి ?' అను మాట కలదు కదా! మృత్యువుకంటె కఠినమై, భీషణమైన దేదియును లేదు. దీనిని మించిన విపత్తును అగపడదు. మానవుడు అహరహమూ ప్రపంచమున మృత్యువును ఉపలక్షించుచునే ఉన్నాడు, అయినను మృత్యుమహిళ నాతడు ప్రత్యక్షముగా వీక్షింపలేదు. ఆమె కంఠస్వర మును వినలేదు. ఆమెను గురించిన వర్ణ, గంధ, శబ్ద, స్పర్శ స్వాదు గుణము లెవ్వరికిని తెలియవు. ఆమెను గురించిన ఆభాసము నించుకైన ఎవ్వరూ, ఎందునూ పడయలేదు. ఇది వ్యాఖ్యానమునకు అతీత మైనది. ఇప్పటివర కెవ్వరును దానిని చేసియుండలేదు.

సాధారణ మానవు డొకడు "నీకు చావు మూడుతుంద"ని తెలిపిన యెడల ఎవ్వరూ భయపడరు. కాని ఆ మాట నొక వైద్యుడు చెప్పినయెడల వెరపు కలుగుట నిక్కము. విశేషించి ఆమాట నొక రోగికి తెలిపినయెడల ఆతనికి దాపురించు సంకటము మాటల కందనిది. ఉరికంబమున కెక్కునపుడు కత్తులను త్రాటిని కట్టు వానిని చూచినపుడు కలుగు భీతికిని, వాని భీతికిని వ్యత్యాసము ఉండదు. ఈ విషయమును మనసులో నిడికొనియే ప్రద్యోత డాక్టరు 'ఇట్టి హృదయహీను డెందును లేడు. ఉండబోడు. దారులు కొట్టు బందిపోటుగాని, గుండజేయు గుండావాడుగాని ఈ రీతిగా ప్రవర్తింపడు. కత్తిని చేబట్టి నెత్తురును చిమ్ము పనికిని ఈత దోనరించు చెట్టకును భేదమేమి?' అని తలచి డిస్ట్రిక్టు మేజస్ట్రేటు పాలి కొక దరఖాస్తును పంపుట మేలని ప్రద్యోత డాక్టరు ఊహించినాడు. డాక్టర్లందరిచేతను దానిపై సంతకాలు పెట్టించితీరాలని ఆతడు నిశ్చయించినాడు

ఆధునికమైన మెడికలు డిగ్రీలు సంపాదించిన డాక్టర్లు ముగ్గురు నవగ్రామంలో ఉన్నారు. ప్రద్యోతుడు హాస్పిటలులో పనిచేస్తూ ఉంటాడు. రెండవవాడు హరేన్. నవగ్రామంలో పుట్టిపెరిగినవాడు. వయసులో ప్రద్యోతునికంటె ఇంచుక పెద్ద. మెడికల్ స్కూలులో చదివి, పరీక్షలో కృతార్థుడై తన ఊళ్లోనే బల్లకట్టి ప్రాక్టీసు మొదలుపెట్టినాడు. మిగుల చిన్నదైన సొంత డిస్పెన్సరీ వానికి గలదు. మూడవ వాడు డాక్టరు చారు. ప్రౌఢ వైద్యుడు పేరు సంపాదించుకొనినాడు. ఈ ముగ్వురిలో చారు డాక్టరు ప్రవీణుడు. మిగుల గట్టివాడు. సుమారు ఏబదేళ్లను మోసినాడు. ఆధునికులలో మొట్టమొదట ఎం. బి. లో ఉత్తీర్ణుడైనాడు. రమారమి రెండు దశాబ్దులకు మున్ను డాక్టరు పట్టము పొందినంతనే హాస్పిటలులో ఉద్యోగిగా ప్రవేశించాడు. పదేళ్లక్రితము తన ఉద్యోగమును చాలించుకొని, స్వతంత్రంగా ప్రాక్టీసు ఆరంభించాడు. కాని గడచిన నాలుగేళ్లనుండి ఆతడి ప్రాక్టీసును ఇంచుమించుగా వదలివేసెననియే చెప్పవచ్చు. ఇప్పుడిచట యూనియన్ బోర్డులోను, స్కూలు బోర్డులోను, ఈరీతి మరికొన్ని సంస్థలలోను కొంతకొంత ధ్వనిచేస్తూ కాలక్షేపం చేస్తూ ఉంటాడు. "చారు డాక్టరు ప్రాక్టీసు తనంత తానే పడిపోయింది. అందుచే ఆతడు ఈ పనులలో తలకాయ దూర్చుకొన్నాడు" అని ప్రజలు చెప్పుకొంటూ ఉంటారు. చారుగారి కొడుకులు పెద్దవాళ్లైనారు. పెద్దవాడు భారీయెత్తు సర్కారీ ఉద్యోగిగా ఉన్నాడు. చిన్నవాడు డాక్టరు పరీక్షకై చదువుతున్నాడు. చారు డాక్టరు మోమోటము లేక స్పష్ట నిర్వచనముచేసే పెద్దమనిషి. లెక్కలను ధొక్కలను చూడడంలో ఖచ్చితమైన ఘటము. నియమానుసారముగా ప్రతిదినమూ

సాయంకాలము పెద్ద గ్లాసుతో కొలిచి, రెండు ఔన్సుల బ్రాంది పుచ్చుకొంటూ ఉంటాడు.

ఈ ప్రాంతంలో నివసించే డాక్టర్లకు ఎంతో కొంత అప్పు ఉంటూ ఉంటుంది. చేతికి రావలసిన బాకీ మొత్తములు కూడ వారికి గలవు. కాని చారుడాక్టరుయొక్క అకౌంటు పుస్తకాలు చూచినపుడు అతడొకరికి పైసా బాకీ ఉన్నట్లుగాని, ఇతరులు వాని కొక పైసా బాకీ ఉన్నట్లుగాని అగపడదు. అతని కంపౌండరు ప్రతి మాసము వంద రూకలకు మించిన బాకీలను రాబట్టుకొనేందుకై కాలదోషము పట్టనీయక యూనియన్ కోర్టులో దావాలు తెస్తూ ఉంటాడు. కొందరు వానియెడల సానుభూతి చూపుతూ ఉంటారు. మరికొందరు "ఇది కఠోరకాండ" అని చెప్పేందుకు సంశయింపరు. కాని చారుగారు తన కంపౌండరుతో "లుక్ అట్ జీవన్ మహాశయ్. (జీవనమహాశయుని చూడు). ఆ వృద్ధునిచూచి బుద్ధి నేర్చుకో. ఎన్ని బకాయిలున్నా అతనికి చీమ కుట్టదు. అతగాడి చిట్టావర్జాలు చూస్తే ఏభైవేల రూపాయల బాకీ ముట్టవలసి ఉన్నట్లు తేలుతుంది. ఈ పుస్తకాలను యావత్తు చెదపురుగులకు సమర్పించి, చేతులు ముడుచుకొని కూర్చున్నాడు. బాకీలు కూడా మింగుడు పడిపోయినవి. వానిని చూచి ఓరిమీ, ఔదార్యమూ నేర్చుకో!" అంటూ ఉంటాడు. ఇప్పుడు కూడ చారుడాక్టరు చేతి వెచ్చానికి కావలసిన చిన్న మొత్తాన్ని ఇంచుక ప్రాక్టీసు చేస్తూ ఉంటాడు. వాని ప్రాక్టీసు తగ్గుతూన్నకొలది ఇంటిలోని డిస్పెన్సరీ కూడా చిన్నది అయిపోతోంది. కొంపలోని నాలుగు అల్మారీలలో ఒక దానిలో మాత్రము ఔషధాల సీసా లున్నవి. తక్కిన మూడూ ఖాళీగా ఉన్నాయి.

మెడికల్ డిగ్రీ పుచ్చుకొన్న మరొక డాక్టరున్నాడు. వాని పేరు చక్రధారి. చారుడాక్టరుకంటె కొంత ముదిరిన ఈడుగలవాడు. ఎల్. ఎం. ఎస్. పరీక్షలో నెగ్గిన పిండము. చారుగారికంటె ముందే ఈతడు ఛారిటబుల్ డిస్పెన్సరీలో డాక్టరుగా ఉండేవాడు. అతడు ఉద్యోగము చేసే రోజుల్లోనే చారుకు నౌకరీ కుదిరింది. చక్రధారి ఇపు డించుమించుగా సన్న్యాసియై పోయినాడు. అన్నప్పుడూ ఇంటి పట్టునే ఉంటున్నాడు. కాషాయ వస్త్రాలు కట్టుకొని, రేయింబవళ్లు పూజా ప్రార్థనలు సలుపుతూ ఉంటాడు. ప్రాక్టీసు పొంతకు పోడు. ఎవ్వరైనా చేయి చూపించుకొనేందుకు వచ్చినపుడు "ఇది వట్టి వెట్టి. చేయి చూస్తే కలిగే మేలేమి? దీనివలన ఏమి బోధపడుతుంది? ఏవేవో మాటలు ఉజ్జాయింపుగా చెపుతూ ఉంటారు వైద్యులు. చెప్పింది సరి కావచ్చు. వైద్యం నెగ్గవచ్చు. నెగ్గకపోవచ్చు. ముట్టవలసిన ఫీజు జేబులో పడి తీరుతుంది. రోగం వస్తే అది తనంత తానే కుదిరిపోవాలి. వ్యాధి నిర్మూలన

శక్తి శరీరానికే ఉంది. ఏవేవో చేదు మాత్రలూ, వగరు కషాయములూ రోగి కంఠంలో వదలి 'హైసరుమజ్జా' అంటూ ఉంటారు వైద్యులు. మందు వల్ల జ్వరం దిగజారిందనీ, తెగులు కుదిరిందనీ అనుకుంటారు, అమాయకులైన రోగులు. ఎవరో ఒకరిద్దరికి మందు పట్టిస్తే యియ్యవచ్చు. కాని విశేషంగా దానివల్ల ఒరిగేది ఏదీ లేదు." అని అతడు అంటూ ఉంటాడు.

చక్రధారి హుక్కా పీలుస్తూ, పీలుస్తూ యౌవనారంభమున తాను చూచిన పెద్ద డాక్టర్లను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉంటాడు. సర్ నీలరతన్, విధానరాయ్, నళినీ సెన్ గుప్తా మున్నగు పెద్ద తలకాయలను స్మరిస్తూ ఉంటాడు. వెనుకటి పరిస్థితి మిగుల విచిత్రమైనది, విస్మయకరమైనది. వాని ఊహా స్రవంతి ఈ విధంగా ప్రవహిస్తూ ఉంటుంది. "అప్పటి డాక్టర్లనూ చూశాను. ఇప్పటి వారినీ చూశాను. ఇప్పటి వారిలో రంగలాల్ డాక్టరు నమోనాగా ఎన్నబడే వ్యక్తి. తొల్లింటి డాక్టర్లు తమ వృత్తిలో తల పండించుకొన్న పెద్దలు; ఆరితేరిన చేతులు. ఇక్కడ గణింపబడిన జీవనమహాశయుడు. మిగుల గట్టివాడు. నాడి యెరిగినవాడు. అతని కొడుకు వనవిహారి! అతడూ డాక్టరే! నాకు గుండెకాయ వంటివాడు. ఇద్దరికీ కుఱ్ఱతనపు చేష్టలు బాగా పట్టుబడ్డాయి. మధుపానమును నాకు బాగుగా నేర్పిన గురువర్యుడు. ఇద్దరమూ త్రాగి త్రాగి తందానలాడుతూ ఉండే వాళ్ళము. పాపం వానికీ అలవాటు భర్జింపలేదు. వానిఒళ్ళు డుళ్ళిపోయింది. కాని సంక్రమించిన రోగం వల్ల కొంప మునుగుతుందని ఎవరమూ అనుకోలేదు. విపత్తు ఘటిల్లింది. రోగం వలన ధైర్యం అడుగంటి పోతుంది. లేక ఎందో పలాయన మౌతుంది. గోవింద! గోవింద! గ్రుడ్డి గవ్వ చేతిలో పడక పోయినప్పటికి, ఎన్నెన్నో చేతులు చూశాను. ఇక ఆ పప్పు ఉడకవు."

చక్రధారీ ఒక డాక్టరే అని ప్రద్యోతుడు తలపనే తలపడు. వాని దృష్టిలో నవ గ్రామంలో డాక్టరు పట్టాలు పొందిన వారు, డాక్టర్లని చెప్పుకోతగిన వారు ముగ్గురే! ప్రద్యోత డాక్టరు చెప్పిన దానిని కాదనేవారెవ్వరూ ఆ ఊళ్ళో లేరు. ముఖ్యంగా హరేన్ గాని చారు గాని పల్లెత్తు మాట ఎదురు చెప్పరు. మౌన ముద్ర వహించి వాని ఊహలను పాటించి, ఆనలను మన్నిస్తూ ఉంటారని చెప్పవచ్చున తన మనసులోని మాటను ప్రద్యోతుడిట్లు చెప్పివేసినాడు. ఒకానొక రోగిని చూచి 'ఓయీ! నీకు చావు తప్పదు.' అనడం కంటె నిష్ఠురవాక్యమేమి ఉంటుంది! ఈ

మాట చెవిలో పడిన వెంటనే గుండె ముక్కలు కాదా? వ్యాధి ప్రకోపము హెచ్చి రోగిని కబళించివేయదా? బ్రతుకవలెననే ప్రగాఢవాంఛ, బ్రతికెద నను గాఢ విశ్వాసమూ, ఇవి బ్రతుకును ప్రసాదించే పరమౌషధాలు కాదనేవారెవరు?''

హరేన్ డాక్టరు తలవంచుకొని వాని మాటలు విన్నాడు. "జానోవ"ని చేతులు జోడించి, "ఈ విషయంలో నన్ను మన్నించండి.'' అని మాత్రము అన్నాడు.

మరల ప్రద్యోతుడు తన ధోరణి సాగించాడు. "వైద్యుడైతే మాత్రం ఇష్టము వచ్చినట్లు ప్రలాపింపవచ్చునా? అతడు నిర్వహింపవలసినది సేక్రెడ్ డ్యూటీ (పవిత్రమైనది) కాదా? కాషాయ వస్త్రము ధరించి, చేతిలోని రేఖలు చూడడం ఒక ఎత్తు. గచ్చాకు పుచ్చాకు తినిపించి వైద్యం చేయడం, ఆయుర్వేద సూత్రాలు పాటించి చికిత్సచేయడం వేరు.''

హరేన్ చేతులు జోడించి అట్టే నిలిచియున్నాడు. ప్రద్యోతుని మాటలు ముగిసిన పిదప అతడిట్లనినాడు. "నేను పల్లెటూరి వాణ్ణి. చిన్నవైద్యుణ్ణి. నా విద్యాబుద్ధులు సామాన్యములు. జీవనంగారు ఒకప్పుడు మంచి వైద్యం చేస్తూ ఉండే వారు. నాడి చూసిన వెంటనే ఫలానా రుగ్మత అని చెప్పివేయ గలిగిన శక్తి ఆయన కుండేది. దాని నెరిగి ప్రజలు ఆశ్చర్యపడుతూ ఉండేవారు. పాపం ఇపు డతడు వృద్ధుడైపోయినాడు. "మునీనాంచ మతిభ్రమః'' - ఎవ్వరూ ఒడుదుడుకు చేతకు చేయి చేసికొన రాదుకదా! ఇక్కడ కిశోరు అన్న ఉండేవాడు. అతడు లేనపుడు చొరవ చేసి రగడ పెంచడం మంచిదా? వానిని రానిమ్ము.'' "కిశోరుడా? కిశోరుడా?'' అని ప్రద్యోతుడు మండిపడినాడు. "అతడెవరు?'' అని లేచి నిలిచినాడు.

చారు డాక్టరు అక్కడే ఉన్నాడు. ప్రద్యోతుని హుంకరింపు అతనికి గిట్టలేదు. "అయ్యా! ప్రద్యోత మహాశయా! మీరు యువకులు! మీది ఉడుకురక్తం. మీ సంగతి కొంచెం ఆలోచించుకొనడం మంచిది. ఈ వేళ ఇక్కడ ఉంటారు, రేపుండరు. మరొక చోటికి బదిలీ అవుతారు. మీ కున్నది ట్రాపికల్ డిసీజెస్‌లో ఎక్స్‌పీరియెన్సు. అందువల్లనే మీకీ నౌకరీ దొరికింది. ఇక్కణ్ణుంచి మీరు విదేశాలకు పోవచ్చు. ప్రత్యేకమైన శక్తి సంపాదించుకొని వచ్చి తలమెక్కి ఊరేగ వచ్చు. ఆ ముసలిత్వక్కుపై ఈ రీతిగా ఎగిరిపడడం ఏమిన్యాయం? ఏమేమో చేస్తామని ఘీంకరిస్తున్నారు! తినే కూటిలో దుమ్ము పోయడం సులభమే! 'నూరు చావులు చూసిన వాడు వైద్యుడు. వేయి చావులు చూసిన వాడు మేలి చికిత్సకుడు.'

అనే మాట ప్రసిద్ధికెక్కింది. తమకు తాము వైద్యులైనవారు ఎందరులేరు ? అంతో ఇంతో లోకులకు ఉపకారం చెయ్యగలిగిన వారు ప్రపంచంలో లేరని ఎవరు చెప్ప గలరు ? మీవలె ధూమ ధామము చేసేవారెవరూ లేరు. ఈ రీతి సలహాకాని వైద్యం కాని చెయ్యవద్ద'ని ముసలివానిని నేను హెచ్చరిస్తాను. నాడీ విధానం మాట ఎత్త కండి. వెనుకటి రోజుల్లో ఒక ప్రసిద్ధమైన మాట ఉండేది. 'బాబూ ! ఏం చేస్తావో పస్తాయించి చెయ్యి' ఇప్పుడు కూడా ఈ హితవు పాటించడం ధర్మం. ఏల వృథాగా తలకు బొప్పి కగిలించుకొంటారు ?'' అని చారుగారు వచఃకౌశలం ఉట్టి పడునట్లుగా మహోపన్యాసం చేసినారు.

చారు డాక్టరు సూటి మాటలు ప్రద్యోతుని మనసున బాగుగా నాటినవి. చారుగారి నుడువుల నాతడు పెక్కు తూరులు విన్నాడు. కాని అతని ప్రస్తుత ధోరణి వేరుగా ఉన్నది. ధైర్యంతో, ఔదార్యంతో హుందాతనంతో ఈ పర్యాయ మాతడు ప్రసంగించాడు. ఆతడు రసికుడైన పెద్దమనిషి. రస బంధుర ప్రసంగం చేశాడు. 'ఏం చేస్తావో పస్తాయించి చెయ్యి' అని హితవొసగినాడు. ప్రద్యోతుని చిత్తము మెత్తపడింది. అత డించుక సిగ్గుపడినాడు కూడ. 'ముసలి వానిపై ఉరికి పడవద్దని హెచ్చరించినాడు కదా !'

ఇంచుక తెప్పరిలి ప్రద్యోతుడిట్లన్నాడు. ''మంచిది, మీ మాట పాటిస్తాను. కాని జాగ్రత్తగా మెలగవలసినదని ఆ వృద్ధునితో నచ్చచెప్పండి. ఈ వైద్యం చేయడం, సలహాలు చెప్పడం కూడని పనులని చెప్పండి. అతని వైద్యం నిష్ఠుర మైనది. కేవలం అన్‌సైంటిఫిక్. చెయ్యి చూచి, మణికట్టు నొక్కిపట్టి ఇది పిత్తం, ఇది కఫము, ఇది వేంద్రం అని తెగుళ్ల జాబితా ఏకరువు పెట్టడం వెను కటి యుగంలో చెల్లుబడి అయ్యేదేమో ! ఈ యుగంలో అవుటాఫ్‌డేట్''.

తర్వాత చారుగారు ''ఒకప్పుడు జీవనమహాశయుని నాడీ జ్ఞానము అద్భు తంగా ఉండేది. దాని ఫలం అమోఘంగా ఉండేది'' అన్నాడు.

మృదు స్వరంతో మరల ఆతడిట్లన్నాడు.

''కంచరి ముసలిదాని స్థితి చూచి, వర్ధమానుకు గాని, కలకత్తాకు గాని తీసు కొని పోవడం మంచిదని జీవన డాక్టరు సలహా ఇవ్వడం నిజమే ! అతడు చెప్పి నట్లు చేయడమే మేలని తోస్తుంది. లేకపోతే అతడన్నంత పని జరిగిపోతుం దేమో !''

చారుగారి మాటకు అడ్డువచ్చి ప్రద్యోత డాక్టరు "అలా జరుగదు. హి మస్ట్ ప్రూవ్ హిమ్ సెల్ఫ్ (తనవ్యక్తిత్వాన్ని అతడు రూఢి చేసుకోవాలి). విచ్‌క్రాఫ్ట్ లాంటి ఈ వైద్యం సంగతి ఏమో కనుక్కొంటాను. ఈ తంత్రమేమో కనుక్కొని, దీనిని తలక్రిందులు చేసివేస్తాను. నా జీవితంలో ఒక మిషన్, ఒక ఐడియల్ ఉంది. కేవలం సొమ్ము చేసుకొనేందుకే నేను డాక్టరును కాలేదు." అని కంఠమెత్తి ప్రద్యోతుడు దృఢస్వరంతో చెప్పినాడు.

ఈ విష్కంభం రహస్యంగా నిలువలేదు. ఎట్టి గుట్టైనా రట్టు కాదా? కొద్ది గంటల్లో విషయం ఊరంతా పొక్కిపోయింది. నవగ్రామం యావత్తూ అట్టుడికి పోయి నట్లైపోయింది.

"ప్రద్యోత డాక్టరు జీవనం గారిని ఖైదులో పెట్టించేస్తాడు. కంచరి ముసలమ్మను జీవన మహాశయుడు కాటిపై పెట్టేశాడు. ఆమెను బయటికి తీసి ప్రద్యోత డాక్టరు పంపుతో ఊపిరి కొట్టేడు. ముసలి డాక్టరుపై క్రిమినల్ కేసు తెచ్చి జెయిలులో ఆమూలంగా త్రోసివేస్తాడు. తగిన శాస్తి జరిగిపోతుంది. మేజస్ట్రేట్, కమిషనర్, మినిష్టరుల ముందు ఫిర్యాదు చేస్తాడు. వెట్టి మొట్టి వైద్యం ఇంక బుట్ట దాఖలా అయిపోతుంది. చట్టం గట్టిగా పట్టుకొని ఈ వైద్యాన్ని తుదముట్టిస్తాడు" అని ప్రతివారూ అనుకొంటున్నారు. ఈ ధోరణి మెడికల్ స్టోర్స్‌లో ఎక్కువ ఉడుకు పుట్టించింది. అచ్చట చేరేవారు ఎంతో ఉద్రేకంతో విషయం చెప్పుకొంటున్నారు.

వినయుడనే వానికి మందుల అంగడి ఉంది. అది ఈ ప్రాంతాంలో ఉన్న అన్ని మందుల షాపులకంటె పెద్దది. ప్రాక్టీసుతో ఔషధాల వ్యాపారం చేసే డాక్టర్లు వాని దుకాణంలోనే టోకు ధరలకు మందులు కొంటూ ఉంటారు. చుట్టు ప్రక్కల ఉన్న ఊళ్ళల్లో కూడా అతని షాపుకు పెద్ద పేరుంది. చారు గారు అందు కేవలం మందులుకొని ఊరుకోరు. వినయునితో కూడా కొంత వ్యవహారం సాగిస్తూ ఉంటారు. అసలు అతడు చారు గారి తోడ్పాటుతోనే వ్యాపారం ఆరంభించాడు. చారు గారు ఉద్యోగం చాలించు కొన్న పిదప క్రొత్తగా ఎం. బి. ప్యాసై వచ్చి అతని స్థానంలో ప్రవేశించిన అహీన్ డాక్టరు ఊళ్లో కాలు పెట్టిన తర్వాతనే ఈ వ్యాపారం ఆరంభ మయింది. దీనిలో అహీనునకు కొంత జోక్యం ఉంది తాను వ్రాసిన ప్రిస్క్రిప్షన్ వినయుని షాపుకు పంపించి, సాయంకాలములందు నియ

మాను సారముగా రెండు గంటలసేపు ఆతడు షాపులో కూర్చుంటూ ఉంటాడు. ఫీ పుచ్చుకోకుండా అతడు రోగులను చూస్తూ ఉంటాడు.

ఆహీన డాక్టరు తర్వాత చప్పు చప్పున ముగ్గురు డాక్టర్లు హాస్పిటలులో ప్రవేశించారు. వారు కూడ వినయుని వ్యాపారమునకు చేయూత ఇస్తూ ఉండేవారు. ప్రద్యోత డాక్టరు మాత్రం వారి పదాంకములను అనుసరింపలేదు. ధరల విష యంలో ఆతనికిని వినయమునకును కొంత పేచీ వచ్చింది కూడ.

వినయుని దుకాణం పేరు వి. కే. ఫార్మసి. అతగానికి వైద్యం తెలియదు, కాని కవి రాజుల కథలూ, డాక్టర్ల పుట్టు పూర్వోత్తరాలూ ఆతని పొట్టలో ప్రవే శించాయి. పురాణ గాథలు చెప్పునట్లు వాని నాతడు ఏకరువు పెడుతూ ఉంటాడు. ఇట్లు వివరించడంలో అతడు శుకదేవుడని చెప్పిన యెడల, ఆది అతిశయోక్తి కాజాలదు. రేయింబవళ్లు అతడు డాక్టర్లను గురించిన ధోరణిలోనే మునిగి తేలుతూ ఉంటాడు.

హరిజన వాడలో ఉన్న రోగులను చూచేందుకు శశి అంగడి పొంత నుండి పోతూ ఉంటే. వినయు డాతనిని ఉద్దేశించి "శశిబాబూ! లోపలికి రా! కాస్సేపు కూర్చుని హుక్కా పీల్చుకొని పో"! అన్నాడు.

శశి లోనికి వచ్చి కూర్చుని హుక్కా గొట్టం చేత పుచ్చు కొన్న వెంటనే వినయుడు తన పురాణ కాలక్షేపం ఇట్లు సాగించాడు.

"డాక్టరూ! ఈ మాటు నీ పని అయిపోయింది. ఇన్నాళ్లైన తర్వాత పట్టు పడి పోయినావు. ఇంక నీ ఆటలు సాగవు. వెట్టి మొట్టి డాక్టర్ల పొట్టలపై దెబ్బ పడి పోతోంది. పిచ్చి పిచ్చి వైద్యాన్ని మటుమాయం చేస్తానని ప్రద్యోత డాక్టరు రాయి గుద్ది చెపుతున్నాడు. కుంకమ్మల నందరినీ కైదులో దూరుస్తాడట!"

అంత కంతకు వాని కంఠం హెచ్చింది. చుట్టు ప్రక్కల నుండి జనం పార్మసీ ముందు గుమిగూడి ఎవరికి తోచినట్లు వారు విషయం విమర్శింప సాగి నారు. అంతటితో ఊరంతా గాలి దుమారం రేగింది.

ఈ దూకుడులో శశి అందుండి చల్లగా తప్పించుకు పోయినాడు. తిన్నగా జీవనం గారింటికి వెళ్ళినాడు. వృద్ధ భిషగ్వరుడు గృహంలో లేడు. ఇంటి అమ్మ వారు దొడ్డివసారాలో కూర్చుని స్వగతంలో ఏమేమో చెప్పుకుంటోంది. శశి వెళ్ళి ఆమె ప్రమాల సాక్షాత్కరించి, ఫార్మసీలో తాను విన్న యావత్తు కథా పూసగ్రుచ్చి

వట్లు అమ్మవారికి నివేదించినాడు. సహజ ధోరణితో ఆ మహిళామణి ఇట్లు సెలవిచ్చింది.

"అసలు ఆయన ఈ మకిలిపని ఎందుకు చేశారు? డబ్బ్వాదస్కం లేని ప్రాక్టీసు చేస్తూ కొరవితో తలగోకుకొనడం ఎందుకు? చిల్లిగవ్వ ముట్టదని తెలిసి ఉండీ ఆ కంచరి కొంపకు ఈయన ఎందుకు పోవాలి? ఆ ముసలి వగ్గు చెయ్యిచూచి ఏమేమో వాగడం ఎందుకు? ముసిలిది కొన్నాళ్లు బ్రతుక దలచుకొన్నప్పుడు పర లోక యాత్రకు దానికి దారి చూపడం ఎందుకు? మాట విసరగానే సరా? ఇప్పుడు ఈయనగారి తలపై కుంపటి ఎక్కింది. ఇది విజ్ఞానం బలసిన కాలం. చెయ్యిపట్టి కొని రొంప, పైత్యమూ, కఫమూ, ఇంకా ఏమేమో దిబ్బ, దిరుగుండం అంటూ వైద్యం చేసే రోజులు కృతయుగం లోనివి. ఈ రోజుల్లో పెద్ద పెద్ద పరీక్షల్లో నెగ్గిన డాక్టర్లున్నారు. ఈ కాలంలో ఆ బూజు పట్టిన పద్ధతి ఎందుకు? చీ! ఛీ! ఏం పని చేశారాయన?"

ఈ మాటలు డాక్టరు చెవితో పడినతోడనే అవి వాడి శూలములై వాని గుండెలో లోతుగా గ్రుచ్చుకొన్నవి.

వెనుకటి కథ స్మృతిపథంలో తలసూపినది. తన జీవనం ఏల కొరగాని దైనదో, తన దుర్దశ ఎప్పుడారంభమయిందో అతడు మననం చేసికొన్నాడు. విష క్రిమి కుట్టినపుడు విషమెట్లు సమస్త శరీరమందు వ్యాపిస్తుందో, మనసును కుట్టిన గరళంపువాడి తలపు సమస్త అంతరంగిక గ్రథనమును విషాక్త మొనరిస్తుంది గదా! దురదృష్టము పాడుపుబుగువలె వాని బ్రతుకుపై వ్రాలింది. అట్లుగాక ఇకే మనగలము? గృహంలో లక్ష్మీ ప్రసన్నత ఉన్నప్పటికీ, పెద్ద డాక్టరీ పరీక్షకు చదివే భాగ్యం వానికి కలుగలేదు. కాలేజీలో పెద్దపెద్ద పరీక్షల్లో అతడు ఉత్తీర్ణుడై ఉండిన యెడల ఈ ఇంటి అమ్మవా రిందు కాలు పెట్టకనే పోయేది.

అదంతా ఒక విచిత్రపు ఘట్టం. దానిని తలుస్తూ తలుస్తూ అత డొక వేడి నిట్టూర్పు విడిచినాడు.

సర్వనాశన కారియైన ప్రలోభ మొకటి వాని యావత్తు బ్రతుకుమూ వ్యర్థం చేసి విడిచింది. కాందీ పాఠశాలలో చదువుకొనే రోజుల్లో ఈ ప్రలోభం వలన ఒక దొడ్డ ఇంటిబాలకునితో వానికి వివాదం ఘటిల్లింది. పోరు పొసగింది. బాలుడు జీవనుని స్వజాతీయుడే! క్షత్రియుడు. స్థానిక జమీందారీ కుటుంబంలో పుట్టినవాడు.

ఆహా! పిన్నతన మెంత దురూహ్యమైనది! కైశోరకాలం ఎంత పని చేస్తుంది? శక్తిని యోగ్యతను పురస్కరించుకొని పోటీ పొసగదు. ప్రతిద్వంద్విత తలయెత్తదు. చిన్న బుడుతడు తాటియాకు చేబూని పెనురక్కసితో యుద్ధము చేయవలసివచ్చును వాడి యడిదమునకు చొప్పదంటు నెదుర్కొనవలసిన దుఃస్థితి ఘటిల్లును! గొత్తెల మేపరి రాజపుత్రు నెదిరించేందుకు సంశయింపడు; భయపడడు.

# ఆరవ ప్రకరణము

తన జీవనోదంతము జీవనమహాశయుని స్మృతి దిగ్వలయమున పొడగట్టింది. ఒక కిశోర రసాలము మరియొక కిశోర తమాలముతో పోటీపడవలసి వచ్చింది. ఈ పోటీలో తమాలపుమొక్క బిడియపడలేదు.

నవగ్రామంలో ప్రయిమరీ తరగతిలో ఉత్తీర్ణుడై ఎన్ట్రెన్స్ చదివేందుకు జీవనం కాందీపురం పోయినాడు. కాందీలో రాజా హైస్కూలులో ప్రవేశించాడు. ఎన్ట్రెన్స్ పరీక్షలో నెగ్గి వర్ధమాను మెడికల్ స్కూలులో ప్రవేశించాడు. భావికాల జీవితం గురించి ఎన్నెన్నో కలలు కన్నాడు; ఎన్నెన్నో కల్పనలు చేశాడు. తాను పెద్ద డాక్టరీ పరీక్షలో కృతార్థుడై పెద్ద ఎత్తున విజృంభించే తీరు అతని భావనా పథమున గోచరించింది. ప్రభాకలితమై భావి జీవన మూర్తి మానస యవనికపై తళ్కొత్తింది. రంగలాల్ డాక్టరు వలె దొరదుస్తులు దాల్చి, తెల్ల గుఱ్ఱమెక్కి నలుగురి దృష్టి ఆకర్షిస్తూ అశ్వాన్ని నడుపుతూ ఎల్లర వలన 'ఓహో!' అనిపించుకోవాలని ఆశపడ్డాడు. బంగారు గొలుసుకు కట్టబడిన సింగారపు గడియారం గుండె మీది జేబులో నుంచి వ్రేలాడుతూ ఉండగా పదుగురూ తన్ను చూడాలనే మక్కువ వానికి మిక్కుటముగా ఉంది థెర్మామీటర్, స్టెతెస్కోప్, కాల్‌బాక్స్ వగైరా సామగ్రి ఒంటిపై ఒప్పుతూ ఉండాలనే కోరిక వానిలో తక్కువగా లేదు ఇంటిలో లక్ష్మి ఉంది. తండ్రి ప్రేమమయుడు. డబ్బా దస్కంలో లోపం లేనట్లే శరీర దార్ఢ్యంలో వాని కెట్టి లోటు లేదు మనసులో కావలసినంత సాహసం ఉంది. కాందీ పాఠశాలలో అతడు చదువుకొనే రోజుల్లో ఉత్సాహానికి గాని స్ఫూర్తికి గాని ఎట్టి లోపమూ లేదు. ఒకదిక్కున ఉల్లాసంతో చెలరేగుతూ వేరొకదిక్కున బోర్డింగ్ హౌస్ టేబుల్‌పై వెలికిల పరుండి భావికాలపు భాగ్యరేఖలను భావవాపీధిలో చూస్తూ ఉండేవాడు ఎల్. ఎం. ఎస్. లో నెగ్గడం, తెల్లగుఱ్ఱంపై స్వారి చేస్తూ తిరగడం వాని పగటి స్వప్నంలోని ముఖ్యమైన ఘట్టాలైనవి. కాని వాని భాగ్య రేఖపై పరగంగ వ్రాలు సూచన గోచరింప సాగింది. ఒకనాడు హఠాత్తుగ వాని చింతాస్రవంతి వెరదిక్కుగా మళ్లింది. అతని జీవితంలో యౌవన ప్రాదుర్భావ మగపడే సమయ మది; జీవనదత్తు ప్రేమలో పడిపోయినాడు.

వాని చూపు నాకర్షించింది చదువుకొంటూ ఉన్న ఒకబాలిక. క్షత్రియ కులంలో పుట్టింది. నిరుపేదల ఇంట పుట్టింది. అపుడు జీవనదత్తు వయసు పదునెనిమిదేళ్లు. నాయిక ఈడు పన్నెండేండ్లు. ఆ రోజుల్లో పదుమూలుగేండ్ల బాలికలు యౌవనంలో ప్రవేశించేవాళ్లు.

ఈకాలపు పదునేడేండ్ల వాలుజడల బాలికలకంటె వారు అధికముగ శారీరక పుష్టికలిగి, మానస వికాసము కలిగి ఉండేవాళ్లు. మన కథానాయిక మరింత ఒళ్లు పోసుకుని పెరిగింది. అకాలమున పరిపక్వస్థితి పొందిందంటే జీవనదత్తు సుతరామూ ఒప్పుకోడు. అకాల పరిపక్వస్థితికిని, సకాల పరిపక్వస్థితికిని చాలా వ్యత్యాస మున్నదని కొందరంటూ ఉంటారు. అకాల పరిపక్వమున లోపము ఉండక మానదు. సకాల పరిపక్వంలో సమగ్ర సౌందర్యమూ, పరిపూర్ణభావవికాసమూ ఉండునుగదా ! స్వాభావికాభివృద్ధి గంధ బంధుర వాతావరణమున పెరిగి పెంపొందు సుమ సీమంతిని వంటిది. మంజరి ఇంచుమించుగా సకాలమందే ప్రఫుల్లముఖియైనదని చెప్పవచ్చును.

మన కథానాయికపేరు మంజరి. మంజరి అందకత్తె. వయసు పన్నెండేండ్లే యైననేమి ? ఈ దినాలలో కాలేజీల్లో చదువుకునే పదిహేను, పదహారు ఏళ్లున్న అమ్మాయిలకంటె అధికంగా సౌష్టవ సంపన్నయై ఉంది మంజరి. ఆమె శిరోజము లింకా కటితలమునుండి దిగజారలేదు. కురులట్లు పెరిగి ఉంటే బాలిక పదహారేళ్లు నిండినదని ముక్తకంఠంతో చెప్పవచ్చును. దసరా పూజాగృహాల్లో దేవీప్రతిమలను తయారుచేసే శిల్పులు ఈ సూత్రాన్ని పాటిస్తూ ఉంటారు.

తాను వలచిన చక్కని చుక్క సొంపును ఈ సూత్రాన్ని దృష్టిలో ఉంచుకొని జీవనం సమీక్ష చేయలేదు. ఆమె నచ్చిన లచ్చియే ! నల్లని శరీరమైతేం గాక అందచందాలకు లొచ్చు ఘటిల్లలేదు. ఆమె అంగ ప్రత్యంగములనుండి కల్యాణ గుణములు ప్రస్ఫుటిస్తున్నవి. మృత్తికా పాత్రలో నిలువబడి ప్రస్ఫుటితమగు కుట్మలరాజిలోని వనకామె యెనయైనదని అనవచ్చును. శారీరక గ్రథనము ననుసరించి మానసాభివృద్ధి యైనది. 'అత్తింటికి పోయే పిల్ల' వనే మాటను మంత్రపునశ్చరణ చేసేటట్లు తల్లి చెవిలో ఊదుతూ సంరక్షణ చేస్తూఉండేది.

ఆమె తండ్రి పేదవాడైతేంగాక మంచి దొక్కశుద్ధిగలవాడు. స్వభాషను చక్కగా వ్రాయడంలోనూ, చదవడంలోనూ అత డే మగవానికీ తీసిపోడు. బాల శిక్షను చేతబుచ్చుకొని, శతకాలు వగైరాలను కడుపులోని కెక్కించుకొన్న ఘనాపాఠి

ఆతడు. కృత్తివాస, కాశీదాస రామాయణాలలో, భారత భాగవతాల్లో ఏ ఘట్టం అడిగినా కొంచెం తలగోకికొని, తటాలున చెప్పే సామర్థ్యం వాని కున్నది. అంతటితో వైదుష్య పరిమాణము కడముట్టలేదు. వైష్ణవ కీర్తనలను ఎంతో ఆవేశంతో ఆలపిస్తూ ఉంటాడు. భారత చంద్రుని కృతులు ఆతని హృదయ మంజూషలో రతనాలైనవి. పురాణ వాఙ్మయము దేవతార్చన గదిలో పొందికగా దాచబడిఉన్నది. లెక్కాడొక్కా వ్రాయడం తాత ముత్తాల కాలంనుండి ఇంట్లోని వాసాలకూ, పెండేలకూ పట్టుపడిన విద్య. ఈ కాలపు బంకించంద్రు డంటే ఆతనికి అమితమైన భక్తి. ఆయన నవలల్లోని పాత్రలూ, పాత్రముల సంభాషణలూ, స్వగత ప్రసంగాలూ ఆతనికి గాయత్రీ మంత్రాక్షరాలైనవి. బంకించంద్రుని వాని తల కెక్కించింది వాని పెద్దన్నగారు.

జీవనం బడిలో చదువుకునే రోజుల్లో మంజరి అన్న బంకిం ఆతని సహపాఠి. భోజన శాలలో జీవనం భారీ ఎత్తున విజృంభించేవాడు. ఖర్చు చెయ్యడంలో కుబేరునికి సిగ్గు పుట్టించేవాడు. ఆతని తండ్రి జమీందారీ కొన్నాడు. ఈ విషయం జీవనం జీవితంలో విస్తారంగా పొక్కిపోయింది. మంచి వాసనగల తంబాకు వాని నోటిలో ఘుమఘుమ లాడిపోతుంది. ఈ ఘుమఘుమ చతురాననుని ఆకర్షించింది. బంకిం ముద్దుపేరు చతురాననుడు. అతడు నాలుగు ముఖాలతో హుంక్కా పీలుస్తాడనీ, నాలుగు మొగాలతో రసబంధురంగా ప్రసంగిస్తాడనీ తోడి బుడుతలు వానికా పేరు పెట్టేరు. జీవన, బంకింల అలవాట్లు ఒకేపాయలో నడవడం వల్ల, వారి నేస్తం మరింత గాఢమై పోయింది. ఒండొరుల ప్రసంగాలలో వారిద్దరూ చుట్టాలనే ముఖ్య విషయం బయలుపడింది. జీవనం మేనమామ తోడల్లుని వేలు విడిచిన అక్కగారి రెండవ తోడికోడలిముని మనుమడు బంకిం.

ఈ చుట్టరికపు ప్రభావం వల్ల బంకిం ఒకనాడు జీవనుని తన యింటికి ప్రేమ పాశంలో బరబర ఈడ్చుకొని పోయినాడు. తండ్రితో వానికి పరిచయం కలిగించి "నాన్నా, జీవనం మన దగ్గరికోవలోని చుట్టం" అని చెప్పివేశాడు. బంకిం తండ్రి నవకృష్ణసింహునకు బంధుసంపర్క మంటే కడుపు ఉబ్బుతూ ఉంటుంది. జీవనం తమ బంధు కోటిలోని వాడనగానే ఎంతో ఉల్లాసం కలిగింది. వాని పొట్ట ఉబ్బి అటకమీద పడిపోయింది.

"అబ్బాయీ, నీవు దీనబంధు మహాశయుని మనుమడవా? జగద్బంధు గారి కొడుకువా? మీది చాలా ఘరానా కుటుంబమోయి! ఆయుర్వేదం మీ కులవిద్యయై

నిలబడి పోయింది. మీ నాన్న జమీందారీ కొన్నాడని విన్నాను. భేష్! దొడ్డపని చేశాడు!" అన్నాడతడు.

ఈ మాటలు విని జీవనం పులకితగాత్రుడై పోయినాడు. సిగ్గుతో ఆతడు తలవంచుకొని నిలబడిపోయినాడు. ఈ పొగడ్త వాని మనస్సుకు హాయిగా నచ్చింది.

నవకృష్ణగారిట్లన్నారు. "మా ఇల్లు మీ ఇంటికెంతో దూరం లేదు. పనికై పోతూ ఉండేరోజుల్లో మీ ఇంటిమీదుగా పోయేవాణ్ణి. దసరా ఉత్సవాలు నాకెంతో ఆనందం కలిగించేవి! వేసవిలో మాత్రం ఆ దారిని అంతగా తొక్కేవాణ్ణి కాను. మాకు ఆస్తి పాస్తులు అంతగా లేవు. ఐదారు ఎకరాల కొండ్ర. అందులో అడుగడుగునా వ్యాజ్యాలో వెల్లంకులో, ఇంకా ఎవేవో లావాదేవీలు వేపుకు తినేవి! ఇంక పొలంలో అడుగుపెట్టేది ఎట్లా? అదిన్నీ ఐదు క్రోసుల దూరం. కాళ్ళు బొబ్బ లెక్కేటట్లు నడిచి పోవాలి. ఈ విషయం అలా ఉండనియ్యి, మీకూ మాకూ చుట్టరికం అంటూ ఉంది. మీతో చనువు లేక పోలేదు. ఇపుడు మరింత దగ్గరలో పడ్డాము కాని (కొంచెం దగ్గి) అయితే అబ్బాయీ! నువ్వు ఇంగ్లీషు చదువు కునేందుకు వచ్చావా?"

ప్రశ్నలోని మర్మార్థం జీవనునకు బోధపడలేదు. అయినా "అవునండి" అని బదులు చెప్పేడు.

"మీ వంశంలో ఆయుర్వేదం కులగత విద్యయై నిలిచిపోయింది. అది కుల ధర్మమని రాయి గ్రుద్ది చెప్పగలను. అందుచే నువ్వు సంస్కృతం చదవడం న్యాయం. ఇంగ్లీషు చదివేందుకు ఎందుకు వచ్చావు? ప్లీడరీ ప్రాక్టీసును తలదన్నిన ప్రాక్టీసు మీ కొంప నంటియున్నది. స్థిరంగా ఏర్పడ్డ కొందరు రోగుల మంచాలు మీ నాన్న ప్రాక్టీసునంటికొని ఉన్నవి. రోగుల చావు బ్రతుకు లెలావుంటేంగాక? పడే డబ్బు చేతిలో పడిపోతుంది. మీ ప్రతిష్ఠ పాతాళం వరకు పాతుకుపోయింది! పెద్ద తరహాలోని కుటుంబం అనే పేరు పాకి పోయింది, ఊరూ వాడా, పొలాలూ. చెరువులూ, చెప్పేదేమి? మీ యావత్తు జమిందారీ ఆ ప్రతిష్ఠనుంచే పెరిగి పోయినాయి".

"డాక్టరీ చదువు సాగించాలనే గట్టి ఊహ నాకుంది" అన్నాడు జీవనం.

"భేష్! ఇది దొడ్డవూహ కాదని ఎవరన గలరు? నేను వహవ్వా అంటాను."

ముగ్ధుడై పోయినాడు నవకృష్ణ సింహం గారు. "నాయనా! ఒక పర్యాయం లోపలికి పో. ఒరే బంకిమూ! ఈ పిల్లవానిని మీ అమ్మ దగ్గరకు తీసుకొనిపో! అనలు చుట్టం అయింది ఆవిడ! మే మంతా లాగగా లాగగా ఆమె దరి చేరుకొన్న పేగులము. బాబూ! వెళ్లు!"

మంజరి అప్పుడు పెరట్లో చిట్టి తమ్ముణ్ణి ఎప్పటివలె ఆడిస్తూ ఉంది. వానా వల్లప్ప చెమ్మ చెక్కలు కలిపి ఆడుతూ కిల కిల నవ్వుతూ ఎగురుతూ చప్పట్లు కొడుతూ మంజరి మహోల్లాసంతో ఏవేవో పాటలు పాడుతోంది.

ఎవరు అడ్డువచ్చినా,
తొలగి పో బొమ్మ చరచర వెలుపలకు
తొలగి పోకున్న తప్పక ములుగుపుట్టి

అని పాడుతూ, పాడుతూ, చప్పట్లు కొడుతూ ప్రక్కనుండి నడచు అక్క అన్నల చెంపలపై చెళ్లు మనిపిస్తూ ఉంది. ఒక్కొక్కపుడు నేలగూలి కండ్లు మూసి కొని ఉంటారు. భూమి క్రుంగుతూ ఉన్నదని, ఆకాశం విరిగి తలపై పడుతోందని, కొండలు కదులుతూ ఉన్నవని, అతలపాతాళలోకాల్లో పడుతున్నట్లు తోచినను వారు స్తంభించి ఉంటారు. చెల్లెలి ఆటదూకుడు సహించి వారు ఊరుకొనియే ఉంటారు.

ఈ పర్యాయం జీవనాన్ని వెంటబెట్టుకొని బంకిం పెరట్లో ప్రవేశించునప్పటికి కన్నులు మూసికొని నాట్యం చేస్తూ ఎప్పటివలె మంజరి చేయి విసిరింది. ఆ చరపు జీవనం గుండెపై పడింది. ఆమె అన్న అనుకునే చరచి, నేలపై పడి మంజరి పకపక నవ్వసాగింది. జీవనం గుండె వాచిపోయింది. మొగం కందిపోయింది. నిర్విణ్ణుడై నిలిచిపోయినాడు. కొన్ని నిమిషాలలో మంజరి నవ్వు ఆగిపోయింది. తన తప్పిదం తెలుసుకుంది. అన్నగారనుకొని పరాయి పెద్దమనిషికి సంభావన చెల్లించింది. కన్నులు తెరచి ఆశ్చర్యంతో ఎదుటి అభాగ్యుని చూచి లేచి, "అమ్మా! అమ్మా!" అని అరుస్తూ లోనికి పారిపోయింది. లోపల మరల పకపకలూ, వికవికలూ ఆరంభమైనవి. జీవనుడు విహ్వలుడై నిలిచిపోయినాడు.

ఇది ఆరోజుల్లో జరిగిన ఒకానొక విచిత్రఘట్టం. అంతటితో ఆ అధ్యాయం నిలిచిపోలేదు. ఇంకా కొంత ఉంది. లోనికి పరుగెత్తిన మంజరితో బంకిం నవ్వుతూ, "అమ్మడూ! ఏమి యీ ఆగడం" అని, అనంతరం అమ్మతో జీవనునకు పరిచయం కలిగించాడు.

జీవనం ఆమె పాదములకు ప్రణామం చేయబోయినాడు. "నాయనా! వద్దు, వద్దు." అని అన్నది ఆమె. "వావి వరుసలు పట్టి చూస్తే నీవు నాకంటె పెద్ద వాడవు. మనది పెద్ద లెక్కల్లోని చుట్టరికం. దానిని పట్టి నువ్వు మా అన్నయ్యకు మామయ్యో గీమయ్యో అవుతావు. నాకు కూడ ఆ వరుసే చెల్లుతుంది. బాబూ! కూర్చో! నేను నీకు ప్రణామం చెయ్యను. నువ్వు నాకు ప్రణామం చెయ్యకు" అన్నది బంకిం తల్లి.

తెలియబడిన చుట్టరికం బంకింకు ఎంతో ఉల్లాసం కలిగించింది. అమ్మ అన్నయ్యకు మామయ్య జీవనం; కాబట్టి అమ్మకూ మామయ్యయే! వెరసి చుట్టరికం యావత్తూ తూగి చూస్తే జీవనం అతగాడికి తాతయ్య అయి కూర్చున్నాడు. కావున మిక్కిలి చనువుతో వానితో పరిహాసం చెయ్యవచ్చు.

ఫలహారం తెచ్చేందుకై గృహిణి లేవగనే, బంకిం లోనికి పోయి, చెల్లిని పిలిచి "అమ్మడూ! ఇంక అల్లరి చెయ్యకు, తాతయ్యను చూద్దువుగాని రా" అని అన్నాడు.

"ఎవరు?" అన్నది మంజరి. ఆమె స్వరం కొంచెం తగ్గింది. అయినను ఆమె మాట జీవనం చెవిలో పడింది.

"అమ్మడూ! అతడు తాతయ్య."

"తాతయ్య ఎలా అవుతాడు? అతడున్నాడు అడవిపందిలా. వాని మొహం చూస్తే భయం వేస్తోంది. నలుపు. వట్టి కారునలుపు!"

"ఛీ! అమ్మడూ! రోజురోజూ నీ వాగుడు ఎక్కువై పోతోంది. వేలువిడిచిన మామయ్య ముత్తాత మేనల్లుడు తాతయ్య కాడా?"

"ఈ చుట్టరికంలో ఎన్ని వేళ్లు విరిగిపడ్డాయి?"

"ఛీ! ఈవలికి రా! అతడు నా స్నేహితుడు. పెద్దింటివారి కొడుకు."

"పెద్దింటివారి కొడుకైతే, అలా పందిమొహం పెట్టుకువచ్చాడేం."

"చెల్లీ! అలా అనకు. వాని మొహం చూస్తే ఎవరైనాసరే మహావీరుడని అనుకుంటారు. డంబుల్సుతో వ్యాయామం చేసేవాడు. వాని మొగం మీద పరాక్రమం తాండవమాడుతోంది, చూడు."

"అలా అయితే చదువు కట్టిపెట్టి నాటకపువాళ్ల గుంపులో కలసి భీముని వేషం ఎందుకు వేయకూడదు? అసలు గదాయుద్ధమేమిటో చూసేవాళ్లము. నువ్వు పో. నేను రాను."

ఇంచుక కోపించి, బంకిం గిరుక్కున తిరిగి వచ్చినాడు. జీవనం నిజంగా వన్యవరాహంవలె తల వంచుకొని చతికిల పడిపోయాడు. చిన్నవయసు బాలిక మాటలు ఎవ్వరి మనస్సును తేలు కుట్టినట్లు కుట్టలేదు. ఇక అందు తడయక లేచి పోవాలని నిశ్చయించి తత్తరపాటుతో జీవనం "సోదరా! నేనిక లేచిపోతాను. పని ఉంది." అన్నాడు.

ఇంతలో గృహిణి ఫలహారములతో నిండిన పళ్లెము చేబూని వచ్చింది.

పళ్లెం క్రింద వుంచి, "అమ్మా! మంజీ!" అని పిలిచింది. "మంజీ ఒక గాను నీళ్ల తే తల్లీ!" అన్నది. "మంజీ! ఓ మంజీ!"

ఆ ఇంటి గృహిణి మంచి మర్యాద ఎరిగిన మహిళవలె అగపడింది. ఆమె మాటను సులభంగా కాదనడం ఎవ్వరికీ సాధ్యం కాదు.

"అమ్మా! నాకివేమీ అక్కర్లేదు" అనబోయినాడు జీవనం. కాని నోటి నుండి మాట బయటపడలేకపోయింది. కొద్ది నిమిషాలలో మంజరి మంచినీటి గ్లాసుతో అచటికి వచ్చింది.

"ఇతగాడికి ప్రణామం చెయ్యి. ఇతడు కేవలం అన్నకు స్నేహితుడు మాత్రమేకాదు. మన బంధువర్గంలోనివాడు. నీకు తాతయ్య అవుతాడు."

మంజరి గుడ్డతో మొగం కప్పుకొని కిలకిల నవ్వసాగింది. "వెఱ్ఱిమొహమా! అలా నవ్వుతావేమీ? ఇతగాడికి సాష్టాంగ నమస్కారం చెయ్యి"

"ఇతడు తాతయ్యా?"

"అవును. మేనమామల్లో, పినతండ్రుల్లో పిన్నవయసువారుండరా? తులసీ దళం చిన్నదనీ, పెద్దదనీ ఎవరైనా ఎంచుతారా?"

మంజరి ఈపర్యాయం జీవనునకు ప్రణామం చేసింది. వెనుకటిరోజుల్లో పాదాలకు సాగిలపడే ఆచారం ఉండేది. ఈ రోజుల్లో తలవంచి, పాదములు ముట్టు కొని సొంత తలకాయను తాకుటతో ప్రణామ పద్ధతి వంగసీమలో ముగిసిపోతోంది,

వెనుకటి పద్ధతిలోనే మంజరి ప్రణమిల్లింది. కాని ఆమె మళ్లీ నవ్వుకొంద సాగిం చింది. తల్లి చీకాకుపడి " ఎందుకీ వెకిలి నవ్వు ? " అన్నది.

" తాతయ్యకూ దానికీ పోలిక కుదరడం లేదు."

" దేనితో పోలిక కుదరడం లేదు ? "

" తాతయ్య చెంపలమీద బురద లేదే ? కడిగేసుకొన్నాడు కాబోలు ! వీర్లే జీవికి బాడి పట్టుకోదా ? " అని మంజరి నవ్వుతూ అక్కడనుంచి పారిపోయింది.

ఈ కాండ తర్వాత తాతయ్యవలె తయారైన జీవనం అవస్థ ఎలా ఉన్నదో చెప్పకపోతేనే మంచిది.

అతడు చతికిలపడి ఉక్కిరి బిక్కిరి యై పోయినాడు. వానికి పిచ్చెత్తిన ట్లైపోయింది.

" మంజరీ ! మంజరీ ! " అని ఆమెను తనలో సంబోధించినాడు. ఆమెపై విజయం సాధించితీరాలి అనుకొన్నాడు. కాని హటాత్తుగా ఒక వ్యక్తి వాని తెరు వునకు అడ్డముగా నిలిచినాడు.

ఏ బాలునితో వాదులాడి, తన ఆశలకు దిగదుడుపనుకొని అతడింటికి మరలి నాడో అతడే ఆ వ్యక్తి. వాడు పెద్దకుటుంబంలో పుట్టినవాడు. ఉగ్రుడు. దుండ గీడు. దాంభిక ప్రవృత్తిగలవాడు ! భూపతి కుమార వసు, వాని పేరు. కాని భూపీ భూపీ అని ప్రజలంతా వానిని పిలుస్తూ ఉంటారు. గట్టిపిండ మనే పేరు తెచ్చు కొన్నాడు. ఆ ప్రాంతంలో వన్యపశువులా నడుస్తూ ఉంటాడు. ముందు పోయే వారికీ, వెనుక నున్నవారికీ వాడంటే హడలు ! తెన్నుప్రక్కనున్నవారివి తీవ్రంగా రాచుకొనిపోతాడు. " అమ్మో ! భూపీగా "డని వారు దూరంగా తొలగిపోతూ తేరి చూస్తూ ఉంటారు. వాని వికృతపు ప్రసంగ ధోరణి ననుకరిస్తూ వెక్కిరిస్తూ ఉంటారు.

భూపీ చామన చాయ గలవాడు. వానిది పొడవు పాటి ఒళ్లు. తలపై గిరజాలు బాగా పెంచాడు. తలమీదినుండి దిగి మెడపై పడుతూ ఉంటాయి జునపాలు ! జమీందారీ ఇంట పుట్టినవాడు. ఇతడుకూడ బంకింకు చెలికాడు. వెనుకటినుండి మంజరిపై కన్నువేసి ఉన్నవాడు.

కాబట్టి భూపీ జీవనులకు అనురాగ కురుక్షేత్రంలో పోరు పుట్టించాడు, కౌతూహల ప్రియుడు విధాత. భూపీ పెద్దపులి, జీవనం అడవిపంది అని మంజరి వారికి పేళ్లు పెట్టింది.

# ఏడవ ప్రకరణము

హాస్టలులో వానితో కలిసి ఉండే సహపాఠులు "జాగ్రత్తసుమీ!" అని జీవనుని హెచ్చరించారు. హెచ్చరించడంలో వారించుక ఆలసించారు. దోషము వారిదికాదు. యువకుడైన జీవనునిదీ కాదు.

జీవనుని గుండెపై మంజరి చరపు చరచిందనీ, చరపు తినినప్పటికీ ఆతడు ఆమెను పట్టుకొని ప్రాకులాడుతున్నాడనీ, అదను చిక్కినపుడు ఆమెదిక్కుగా సాగి పోతున్నాడనీ సహాధ్యాయు లెరుగరు. మంజరిపై కన్నువేసి, ఆమెను వశపఱచుకో వాలని భూపీవ్యాఘ్రం దృఢనిశ్చయుడై ఉన్నాడని జీవన్ ఎరుగడు. ఇట్లుండగా ఒక సామాన్య కారణంవలన ఉన్నత వంశ ప్రదీపకుడైన భూపీబోసు మంజరి మీదను ఆమె తల్లిమీదను కినిసి వారి గుమ్మము త్రొక్కుట మానుకొనినాడు. ఈ సమయంలో వరాహం వచ్చి అందు ప్రవేశించాడు.

భూపీ జీవనునికంటె వయసులో అంతో ఇంతో పెద్ద. పరీక్షల్లో దండ యాత్రలు సాగించడం వానికి పరిపాటి. కాబట్టి జీవనంకంటె ఒకే మీది తరగతిలో ఉన్నాడు. కాందీ స్కూలులోని వారందరికీ భూపీ పరిచితుడు ఆరోజుల్లో కాందీ స్కూలులో ప్రవేశించే క్రొత్త విద్యార్థులకు సయితము ఐదారుదినాలలో ఆతడు పరి చితుడైపోతూ ఉండేవాడు. వాని చిత్రవైఖరి, వింత వాగ్ధోరణీ విడ్డూరపు హావ భావములూ వారిని మరింత ఆకర్షిస్తూ ఉండేవి.

"ఓరి కుంకమ్మల్లారా! మీ వూరేది?" అని నిరుపేదలైన అమాయకులను ఉద్దేశించి ఆతడు ప్రశ్నిస్తూ ఉంటాడు. అతడు వేయు మొదటి ప్రశ్నే అది.

ఆతని వేషభాషలకు పేదబాలురపై కొంత ప్రభావ ముండెను. ఈకాలపు పిల్లలవలె ధ్వజమెత్తడం వారెరుగరు. అప్పటి కాలప్రవంతి అంత అనుకూలంగా ప్రవహించేది కాదు. వేసే ప్రశ్న ఎంత మోటుగా ఉన్నప్పటికీ, వారు గౌరవ పూర్వకముగా తమ ఊరుపేరు చెబుతూ ఉండేవారు. "అయితే మీ పల్లె ఏ పోలీసు స్టేషను హయాంలో ఉంది? ఏ పరగణాలో, ఏ జిల్లాలో ఉంది. మీరుండే జమీం

దారీ సరిహద్దు నెంబరెంత ? దాని ఎల్లలేవి ? 508 నెంబరులో ఉందా లేక 805 నెంబరులో ఉందా? " అని భూపీబోసు తరువాత ప్రశ్నిస్తూ ఉంటాడు.

జీవనదత్తును మొట్టమొదట కలిసికొన్నప్పుడు భూపీబోసు ఈ పద్ధతిలో ప్రశ్నించలేదు. వానిపై లక్ష్యం ఉంచి "ఓ పిల్లకాయా! మీ ఊరేది? అని ప్రశ్నించాడు. జీవనుని బలిష్ఠకాయమునూ దుస్తుల పద్ధతినీ పరిశీలించి, "కుంకమ్మా, దద్దమ్మా, చెవలమ్మా" అనే మాటలు ప్రయోగింపక 'పిల్లకాయా! " అని సంబోధించాడు. ఈరీతి సంబోధనవలన జీవనుని మనస్సు చివుక్కుమన్నది. కాని లోని భావం వ్యక్తీకరింపక అతడు మెల్లగా " నవగ్రామ " మని బదులు చెప్పినాడు.

ఇట్లు చెప్పి ఆతడు దూరముగా తప్పుకొన్నాడు. 'గర్వాంధులనుండి దూరంగా తొలగుట పాడి ' అను ఆర్యోక్తి నాతడు జ్ఞాపకం చేసికొన్నాడు. అట్టి వ్యక్తులలో భూపీబోసు ఒకడని వాని తలంపు. కాని భూపీ వానిని విడువలేదు. రెండడుగు లాతడు ముందుకు వచ్చాడు. మూడు నాలుగు దినములు గడచినపిదప హాస్టలులోని జీవనుని గదిలో ప్రవేశించి అతడు " ఓహోయీ కుర్రవాడూ! నువ్వు మంచి మంచి తంబాకుతో హుక్కా పీలుస్తావట ఏది? ఒక పర్యాయం నీ హుక్కా గొట్టం నానోటికందియ్యి! ఏరకం తంబాకు పీలుస్తున్నావో చూడనియ్యి " అని సగర్వంగా అన్నాడు. పెద్దతరహా వ్యక్తి కొద్ది స్థితిలోని వానితో ప్రశ్నించే తీరున ఉంది వాని ప్రసంగ ధోరణి.

జీవనుడు కొంచెం పెంకివాడగుట నిజమే! కాని ప్రసంగ ధోరణిలో అతదెన్నడూ ఒడుదుడుకు మాట వెలుపలకు రానీయడు. జమీందారీ స్తోమతు ముదిరిన కొద్దీ సౌమ్యవర్తనము కొంత దిగజారిపోతుందేమో! భూపీబోసు పెద్ద సాయా ఇంటిలో పుట్టిన ఘటం. ఆకర్షణీయమైన విగ్రహం కలవాడు. అపూర్వ వాగ్వైఖరి ప్రదర్శిస్తూ, ఈకాలపు పోకిళ్లలో నడుస్తూ ఉంటాడు. జీవను డిచ్చిన హుక్కా పీల్చినాడు. పీలుస్తూ, పీలుస్తూ ఉండగా వాని చూపు గదిలోని డంబుల్సుపై పడింది. ఒకటి, రెండుసారులు వానిని కదిలించి చూశాడు. "కుట్టివాడూ! నువ్వు డంబుల్సు సింహమోయీ ! " అని అతనిని ఆశ్వాసించినాడు.

పోరుకు దారిచూపే ఘట్టాలు క్రమక్రమంగా అగపడదొడగినవి.

ఒకరోజున నవకృష్ణసింహుని గృహంనుండి భూపీబోసు వెలుపలపడుతూ ఉన్న సమయంలో జీవనుడు లోపల ప్రవేశించాడు. వానివెంట బంకిం ఉన్నాడు.

వాని వెనుక బంకింతల్లి అడుగులువేస్తూ ఉంది. జీవనుడు రాకమున్ను వేసవి సెల వులలో భూపీకిని ఆ కుటుంబంవారికిని ఉండిన జగడము సమసిపోయింది.

జీవనునివెంట ఒక కూలివా డున్నాడు. అతడు వాని ఊరివాడు. వేసవి తరువాత సొంతపల్లె నుండి తిరిగివచ్చేటప్పుడు అత డొక తట్టనిండ మామిడిపండ్లూ, ఇంకా ఎన్నెన్నో రకాల పళ్లూ, కూరలు, ఒక మీన విశేషమునూ వేసికొని కూలివాని ద్వారా తెచ్చినాడు.

ఈ బహూకృతిని భూపీ అక్కజంతో చూచి, నవ్వుతూ "ఏమోయీ దంబుల్సు సింహమూ! ఇక్కడా సిద్ధమైనావేం ?" అని ప్రశ్నించాడు. "అతడు మా బంధుకోటిలోనివాడు. నాకు తాతయ్య అవుతాడు." అనే మాటలు వెనుకనుండి వినవచ్చినవి. "తాతయ్యా! ఏం తెచ్చావు ?" అనే ప్రశ్న వినిపించింది.

ముఖమును వలువతో కప్పుకొని, చిరునవ్వుతో ఎల్లర వెనుకనుండి ముందుకు వచ్చింది మంజరి.

భూపీ ఒక అడుగు ముందుకు వేసి "దంబుల్సు సింహం తాతయ్య ఏం తెచ్చాడో చూస్తాం" అని కూలివాని నుద్దేశించి "తట్ట దించుకోరా వాజమ్మా!" అన్నాడు.

గంపలోని దినుసులోనుండి ఒక మామిడిపండును తీసి పండ్లతో చీకి, రసము పీల్చి "ఛీ! పులుపు రొడ్డు" అని ఉమ్మివేసి "నారాయణా! ఏమిపండురా నాయనా!" అన్నాడు భూపీబోసు. "రేపు నేనూ పంపుతాను పళ్లగంప. వాటిలో నుండి అమృతం ఒలుకుతుంది. ఏ రోజున ఏ పండ్లు తినవలెనో ఒక జాబితా కూడా పంపుతాను. ఈరీతి ఫల ప్రకటన పత్రిక మా పల్లెలో ప్రచలితమై ఉంది. అందలి వివరాలను అనుసరించి మేము పళ్లు తింటూ ఉంటాము. ఆ నియమం తప్పితే పండు రుచి తెలియనే తెలియదు" అని అతడు పలికినాడు.

"ఇక వెడతా"నని అతడు కదలిపోయినాడు.

"అంతా కుశలమే కదా?" అన్నది మంజరి తల్లి.

"కుశలమే! ఇంక నడుస్తా. హాస్టల్ వరండాలో సామగ్రి యావత్తు పడి ఉంది. బండివాడు నిలబడినాడు" అన్నాడు జీవనుడు.

"బాబూ! కొంచెం ఫలహారం చేసి పో" అన్నది మంజరి తల్లి.

"ఇపుడేమీ వద్దు. బండివాడు పల్లెనుండి వచ్చాడు. వానికి తావు క్రొత్త. భయపడుతూ ఉంటాడు. ఇంక నేను కదలాలి" అని జీవనుడు నిష్క్రమించాడు.

భూపీ ధాటి అనాడే జీవనుడు రుచి చూశాడు. తన అనుభూతి ఎట్టిదో హాస్టల్ విద్యార్థులకు చెప్పివేశాడు. చెప్పక ఉండలేక పోయాడు. పండ్ల తట్టను గురించి, అందులోని పెద్ద చేపనుగురించి వారిలో వింత చర్చ బయలుదేరింది. దీనిని ఆ ఇంటికి గొనిపోవడంలోని అంతరార్థ మేమి ?'' అని వారు గుచ్చి గుచ్చి జీవనుని అడిగినారు. అతడు మంజరి పేరు చెప్పక తప్పింది కాదు.

మాట వినిన తోడనే మిత్రుల శరీరములలో గగుర్పాటు పుట్టింది. '' ఓయి దేవుడా ! ఎక్కడికి చొరవచేసిపోయినావోయీ ! పులిగుహలో మోహనాంగిని వెతుకుతున్నావా ? ఆమె భూపీబోసు మంజరి. వాని సొంత సొత్తు. వాని హక్కు ముద్ర ఆమెపై పడింది'' అని వారన్నారు.

''ఏమి ? అతగాడి సొత్తా !''

'' అవునోయి వయస్యా, అవును.''

''చివరకు మంజరి ఎవరికి దక్కుతుందో నేను చూస్తాను. మంజరి అందము అరవిందంవలె ఇప్పుడిప్పుడే వికసిస్తోంది. ఎవనికి సాహసం ఉందో వాడే దండ వేస్తాడు. నేను జీవదత్తునని తెలుసుకోండి.''

రహస్యంగా ఒక ఉత్తరం వ్రాసి అతడు తల్లికడకు పంపినాడు. '' అమ్మా ఆలస్యం చెయ్యక ఏభై రూపాయలు పంపు '' అని అం దాతడు వ్రాసినాడు. 1925 లో ఆ సొమ్ముకు రెండువేల రూకల విలువ కలదని రాయి గుద్ది చెప్పవచ్చును.

గాలి దుమారం చెలరేగే సూచన అగుపడింది.

తనకు ప్రతిద్వంద్విగా వరాహము నిలుచునా అని భూపీ ప్రశ్నించుకొన్నాడు. మంజరి వాని కా నామధేయము ప్రసాదించిందని అతడు విన్నాడు. వినినపుడు వానికి చాలా ఉల్లాసం కలిగింది. మంజరి వానిని 'అడవి పంది' అని స్పష్టంగా పిలుస్తూ ఉంది. దానిని బట్టే అతడు జీవనుని వరాహమని పేర్కొంటున్నాడు. దంబుల్సు సింహమని కూడ భూపీ వానికి నామకరణము చేసినాడు. ఈ పేర్లతో జీవనుడు పరగుతున్నాడు. మొగముమీద కాక చాటుగా ఈ క్రొత్త పేర్లతో అతడు వ్యవహరింపబడుతున్నాడు. ఎంతో కష్టపడి జీవనుడు తెప్పించిన గంపెడు పళ్లు కొరగానివని భూపీ డిక్రీ ఇచ్చినాడు. ప్రసిద్ధి కెక్కిన పండ్లూ, లూచీ, రసగుల్లా, గులాప్‌జామ్, సందేశ్ మున్నగు మధుర పదార్థములు వానికి సుపరిచితములు. వీని ముందు ఆ గంపలోని దినుసులు వానికి వెగటు పుట్టించినవి.

కాని జీవనుడు అప్రతిభుడు కాలేదు. వానిలో శౌర్యాగ్ని రవుల్కొన సాగింది. తన ప్రాధాన్యమును మరింత పెద్దచేసికోవాలని అతడు నిశ్చయించాడు. వాని ఇంటిలోని లక్ష్మీదేవి అధికమైన పసుపు కుంకుములతో వెలుగుతుంది. వాని హృదయంలోని ఆలోచనా స్రవంతి పరవళ్లు త్రొక్కుతూ విజృంభిస్తూ ఉంది. జగద్బంధు మహాశయుడు ఏకాత్మజునకు జరగవలసిన మురిపెంపు బాధ్యతను నెరపుటకై ఎన్నడును వెనుకాడ లేదు. తండ్రికడనుండి కాక జీవవడు తల్లియొద్దనుండి కావలసినంత విత్తమును తెచ్చుకొనుచుండెను. ఈ విషయం సమగ్రంగా తండ్రికి తెలియదు. తెలిసినంత దాని నాతడు ప్రతిఘటింపలేదు.

తన చిత్త వృత్తిని పురస్కరించుకొని జీవనుడు జీవనపథంలో అడుగులు వేయదొడగినాడు.

అతని స్వప్నములు మధురాతి మధురములై వాని అంతరంగమున అపూర్వ సృష్టి చేస్తూన్నవి. అవి యౌవన సులభస్వప్నములు. నారీప్రేమను చూరగొను టలో గోచరించిన పోటీలో నెగ్గితీరవలెనను కాంక్ష వానిలో క్రమక్రమముగ బల వత్తర మవుతూ ఉన్నది. యౌవన వేగము అతని హృదయములో ఉత్తాల భావనాతరంగములను సృజిస్తూ ఉన్నది. అదెట్టి మధురానుభూతి! దానిని వ్యక్త పరుపగల మాట లేవి? ఒక సుందరికి ఆత్మ జీవన సామ్రాజ్యమున పట్టము గట్టుట కంటె ఘనతరముగ గణనీయమైన భాగ్య మేది? ఆమెను వశపరచుకొనుటకై తన జమీందారీలోని కొంత భాగమును విక్రయించవలసి వచ్చిన యెడల దాపురించు నష్టమేమి? హెచ్చగు తన వెచ్చమునకు వలసిన విత్తము ఇంటినుండి రాని తరి అప్పుచేయుటకు అతడు నిశ్చయించుకొనినాడు. సంఘమందలి అతని పరిస్థితి ఎట్టిదో ఎల్లరకు తెలిసిపోయింది. జీవనదత్తు ధనవంతుడనీ, కాడనీ ఎవ్వరూ చెప్పలేరు. పేరుప్రతిష్ఠలు గల పెద్దమనిషి కొడుకు జీవనుడని, పరిస్థితి పచ్చనిదే అని ఎల్ల రెరుగుదురు. అందువలన ఆ ప్రాంతంలో అప్పుచేసి ధనం చేపట్టేందుకు ఎట్టి ఇబ్బందీ కలుగలేదు. మిగుల మనోహరములైనవి, నిత్యనూతనములైనవి పస దనములను పెద్ద మొత్తములకు కొని జీవనుడు ఎంతో మక్కువతో మంజరి యొద్దకు పంపుతున్నాడు.

కాందీ బజారులో 'బాబుజీ' అను గౌరవనామము బాగా వ్యాపించి పోయింది. రాచబాటలో అతడు నడచిపోతూ ఉండగా ప్రజలు నమస్కరించి

"ఏమండి బాబుజీ! ఎక్కడికి పోతున్నారు?" అని అప్యాయంగా పలుకరిస్తూ ఉంటారు.

'జీ' అను గౌరవప్రదమైన అక్షరము వెనుకటి వలె ఇపుడును ఆ ప్రాంతంలో ప్రసిద్ధికెక్కి యున్నది. ఈస్టు ఇండియా కంపెనీ హయాములో ఈ 'జీ' కి మరింత ప్రశస్తి చేకూరింది.

ఉల్లాసంతో ఆత్మ విశ్వాసంతో జీవనుడు పథమందు అడుగులువేస్తూ ఉండేవాడు. ఉస్మాన్ అను పెద్దమనిషి ఒకడు అచట వర్తకము చేసే వారిలో మిగుల పేరెన్నిక గలవాడు. వానితో జీవనునకు గల వర్తక సంబంధములు దినదినాభివృద్ధి నందుతూ ఉన్నవి. "మామా!" అని వానిని జీవనుడు పిలుస్తూ ఉంటాడు. 'చిట్టిబాబూ!' అని ఉస్మాన్ జీవనుని సంబోధిస్తూ ఉంటాడు.

ఉస్మాన్ అంగడి మిగుల పెద్దది. వానికి రెండు మూడు శాఖ లున్నవి. రకరకముల సరకులు వాని అంగడిలో అమర్చబడి ఉంటాయి. కన్ను గుట్టు కాలి జోళ్లు, తంబాకు వగైరాలూ, అందు సమృద్ధిగా దొరుకుతూ ఉంటవి. 'చిట్టిబాబు' పేరుతో ఉస్మాన్ మామ పెద్ద ఖాతా ఏర్పరచినాడు. 'మామ' మనుష్యులను బాగా గుర్తు పట్టగల గట్టి ఘటము. వానికడకు పోయే అవసరము లేకపోయినప్పటికీ, రోడ్డుగుండా జీవనం నడచిపోతూ ఉన్నప్పుడు "చిట్టిబాబూ! మాట వినిపో." కొంచెంసేపు అంగడిలో కూర్చొని పో. పిచ్చాపాటీ చెప్పుకుందాం" అని ఉస్మాన్ మామ పిలుస్తూ ఉంటాడు.

కాదనక "ఎందుకు మామా!" అని పలికి చిట్టిబాబు అంగడిలో ప్రవేశించి తిష్ఠ వేస్తూ ఉంటాడు.

"చిట్టిబాబూ! నాలుగైదు రోజులనుండి బొత్తిగా నీ వగపడడమే లేదు. కొత్త కొత్త సరకులు వచ్చి దుకాణంలో చేరుకొన్నవి. నే నీ మధ్య మురదాబాదు నగరానికి పోయాను. 'ఉస్మానూ! ఎటువంటి వస్తువులు వచ్చాయో చూడు!' అని పెద్దపెద్ద వర్తకులు నన్ను పిలుస్తూ వచ్చారు. "ధరలు బాగా తగ్గిపోయినాయి. కావలసిన సరకులు తీసికొని పో. జమీందారుల కివి మిక్కిలి అవసరమై ఉంటాయి. అందుచే నాణ్యమైన వస్తువులను రకరకముల సరకులను మూటగట్టుకొని వచ్చాను. ఇవిగో మంచి నిషా కలిగించే రెండు బుడ్లు కూడా తెచ్చాను. నీ కొకటీ నా కొకటీ. నీ బుడ్డి నీవు తీసుకొని పో" అంటూ కన్ను

గుట్టు సరకులను కొన్ని పేకేజీ చేసి, కాగితంలో సీసాను కట్టి ఉస్మాన్ జీవనుని చేతిలో పెట్టేడు.

"వీని ఖరీదెంత ?"

"ఖరీదు కేమిలే ? నువ్వు పట్టుకొని పో. ఇక నీ సరకులను నాయొద్ద మూట గట్టుకొని ఉండలేను. ఈ మధ్య భూపీ మామ ఈ సరుకులపై కన్నుంచి తిరిగేడు అంగడిచుట్టు. వకీలుగారింటిలో కొన్నిటిని చూచి, ఇక్కడికి పరుగు పరుగున వచ్చి చేరుకొనినాడు. ఈ రెండు పీసాలు తనకు కావాలని పట్టు పట్టేడు నే నీయనని గట్టిగా చెప్పివేశాను. ఇచ్చితీరాలని అతడు మొండి పట్టు పట్టినాడు. "నీ దుకాణం అంతా గాలించి తీసుతాను. సరకులను నువ్వు జీవనంగాడికై దాచి ఉంచుతున్నావు" అని వాడు చడామడా వాగినాడు వాని మాటను నెట్టివేసి, ఎంతో జాగ్రత్తగా నీకై వీని నుంచినాను. బాబూ! ఇవి నీవి. వీనిని పట్టుకొని పో! ఖాతా ఉందికదూ! ధర దానిలో ఎక్కించి వేస్తాను. ఇక నీకు దుడుకెందుకు ? సంశయ మెందుకు ?"

అంగడిలో జీవనం తీసుకొను వస్తువులలో అత్తరొకటి. కొన్ని అత్తరు చుక్కలు చేతి రుమాలుపై చల్లి అతడు జేబులో ఉంచుకొంటాడు. భూపీ ఎదురైనపుడు రుమాలు వెలుపలికి తీసి ముఖము తుడుచుకొంటూ ఉంటాడు. సువాసన నలువైపులా గుబాళించి పోతుంది. భూపీ చకితుడై తలక్రిందులై పోతాడు. సప్రశ్నదృష్టితో అతడు జీవనుని చూస్తూ ఉంటాడు. భూపీ లోలోపల ఈసుతో ఉడికిపోతూ ఉంటాడు. అది ఎరిగి జీవనుడు కులుకుతూ ఉంటాడు. మంజరి వలువలనుండీ, ఈ వరాహముయొక్క చేతి రుమాలునుండి ఒకేరీతి పరిమళం వెడలుతోందేమి ? "దీని భావమేమి తిరుమలేశ ?" అని భూపీ వితర్కించుకొంటాడు.

భూపీ అవలీలగా తొలగువాడు కాడు. ఎందుండియో అత్తరు తెప్పించి దానిలో తన చేతి రుమాలును ముంచి, ముంచి స్నానము చేయించాడు. భూపీ, జీవను లెదురైనపుడు, వారి ఒండొరుల రుమాళ్లు బయలుపడేవి. సువాసన మిన్ను ముట్టేది. "వీని పోటీ, వీని పొగరూ అణిగితీరుతాయి. ఉస్మాన్ దుకాణంలో దొరకనందున, ఈ పక్షి ఘుమఘుమలాడే ఈ సెంటును మూర్షిదాబాదునుండి తెప్పించి ఉంటాడు." అని జీవనుడు ఊహించాడు. మంజరికడకు తాను పంపిన అత్తరును ఏదో విచిత్రరీతిని భూపీ సంగ్రహించి ఉంటాడని అతడు తలపోసినాడు.

ఎట్లైనను ఆ విషయమును జీవనం ఉపేక్ష చేసినాడు. ఏ విషయమునైనా ఆతడంతగా పట్టించుకోడు. ఆతడు పరిహాస ప్రియుడు. ప్రేమ ఒకరీతి సామయిక ఉన్మాద రోగము. నవయౌవనమందు జీవనదత్తుకు అట్టి పిచ్చి పట్టినది.

భూపీ బోసుతో జరుగు ద్వంద్వ యుద్ధంలో ఓటమి కలుగువరకు జయము తనదే అని జీవనం అనుకున్నాడు. జయలక్ష్మి తనకు గృహలక్ష్మియై తీరుతుందని ఆతడు గట్టిగా నమ్మినాడు. భూపీ రెండుకాళ్లూ పప్పులో పడడం తథ్యమని ఆతడు విశ్వసించినాడు.

నిక్కముగ తనకు దాపురింపనున్న అపజయమును తలపోస్తూ భూపీ తనలో కుళ్లిపోతున్నాడు. వానిమొగం వివర్ణమై పోయింది. దానిని చూచి జీవనం లోలోన ఉబ్బి తబ్బిబ్బై పోతున్నాడు.

జీవనుడు మంచినీటి ప్రాయంగా పైకము వ్యయం చేస్తున్నాడు. భూపీబోసు కన్నెఱ్ఱ, కడుపుమంట అధికమైనవి. ఇరువురూ తారసిల్లినప్పుడు ఒకరినొకరు ఎత్తిపొడుచుకొనేవారు, వేడిమాటలు ప్రయోగించుకొంటున్నారు. వేంత్రమునకు తింత్రము తోడయ్యేది. ఈ ప్రణయోపాఖ్యానంలో ఈతీరు విష్కంభము జీవనునకు కొంత ప్రమోదానుభూతి కలుగుతూ ఉంది.

ఒక్కొక్కప్పుడు డంబుల్సు త్రిప్పునట్లు పిడికిళ్లు త్రిప్పుతూ భూపీ మ్రోల జీవనుడు విజృంభిస్తూ అతనికి అడలు పుట్టించుతూ ఉంటాడు. నిత్యము అతడు డంబుల్సు దగ్గర సిద్ధంగా ఉంచుకొంటున్నాడు రాత్రి భోజన సమయంలో సహపాఠులతో పందెము వేసుకొని అతడు ఇరువదియైదు మొదలు ముప్పయి వరకు చపాతీలను నమలియో నమలకయో నిమిషంలో దిగమ్రింగుతూ ఉంటాడు. జీవనుని ఒళ్లు పెద్దపెద్ద కండలతో పెరిగిపోయింది. వాని స్వరూపం చూచి భూపీ హడలెత్తిపోయేవాడు. వాని వడకుచూచి, జీవనుడు పకపక నవ్వుతూ ఉంటాడు. పోటీలోనూ, పోరులోనూ అతనికి విజయం సిద్ధించడం అనివార్యం. ధన వ్యయములో వానిదే పైచేయి. ఇక స్వయంవరములో కావలసిన దేమున్నది ?

ఆహాహా ! మానవుని దంభ మెట్టిది ? మనుష్యుని మన స్సెంత విచిత్రమైనది ? ఇక నారీ స్వాంత మెట్టిదో దుర్గ్రాహ్యమే కదా! అది వశము కాజాలునో ఎవరు చెప్పజాలుదురు ?

ఒకనాడు ఆకస్మికముగ జీవనదత్తు భ్రమ చిట్లిపోయింది. భూపీబోసుతో వానికి తుని సంఘర్షణము జరిగినది. సంపదలోనూ, శక్తిలోనూ, వానిదే మీదిచేయి ఐనను, యావత్తు స్వప్నమూ శిథిలమైపోయింది.

ఆనాడు హోళీపండుగ దినము. వెలగల పెక్కు వస్తువులను ఒక తట్టనిండ నింపుకొని జీవనదత్తు మంజరి ఇంటికి పోయినాడు. హోళీమహోత్సవంలో ఊరి లోనివారు ఒకరిపై ఒకరు వసంతం చల్లుకొంటున్నారు. రంగు పులుముకొం టున్నారు. జీవనం మంజరి ఇల్లు చేరుకొని, ఆమెను తేరిచూచినాడు. ఆమె అంగ ప్రత్యంగములలో ఏ భాగమునకైనను రంగు అంటుకోలేదు. వసంతపు చిన్నెలు అగపడడం లేదు. ఆమె శ్యామల సుందర ముఖముపై తొలుత రంగు పూసివేయ వలెనని జీవనుడు నిశ్చయించుకొన్నాడు. మొదట ఆతడు మంజరి తల్లిని చూచి నాడు. తాను తెచ్చిన దినుసుల తట్టను ఆమె ముందుంచి, "ఇని అమ్మ పంపిం చింది. మిమ్ము గురించిన యావత్తు వృత్తాంతము అమ్మ నావల్ల విన్నది." అని జీవనుడు ఆమెతో చెప్పినాడు.

మంజరి తల్లి గంభీర వ్యక్తి. జీవనుడు సరిగా ఆమెను గుర్తింపలేకపోయి నాడు. ఆమె అనిన వానికి కొంత భయ మున్నది. ఆమెపై అంత ఇష్టము లేదేమో!

"జీవన్ ! ఇవన్నీ ఎందుకోయీ ?" అని ఆమె తట్ట చేతబుచ్చుకొని, మిద్దెమీదికి పోయింది. మంజరి క్రిందనే ఉంది. మంజరి ముఖముమీదను, కన్నుల లోనూ నిష్ఠుర కౌతుకము విరాజిల్లుతూ ఉంది. ఈ నిష్ఠుర కౌతుకము జీవనునకు ముద్దుగొలుపుతూ ఉంది. ఈ నిష్ఠురతవల్లనే ఆమె కౌతుకము మధురమైపోయింది. ఈ మాధుర్యం మరింత వేగముగా అతనిని ఆకర్షించింది.

మంజరి ఒంటరియై వాని ఎదుట నిలిచింది. రంగు, పొట్లము చేతిలోనికి తీసుకొని మనుమరాలి పిల్ల మొగానికి రంగు పూస్తునా ?" అన్నాడు జీవనుడు.

"నేను కూడా పూస్తాను. చేత కాదనుకున్నావా ? నీకోసం రంగు తయారు చేసి ఉంచాను, కొంచెం నిలబడు, నిలబడు." అని ఆమె ఇంటిలోనికి చరచర పోయింది.

తృటిలో వెలుపలకు వచ్చి, రెండు చేతులు వీపు వెనుకకు మడచి నిలిచింది మంజరి. జీవనంలో ఉత్సాహం పొంగి పొర్లిపోతూ ఉంది. మంజరి ముద్దు

మొగం మీదను. తలమీదను పకపక నవ్వుతూ అతడు దట్టంగా రంగు పులిమి వేశాడు. మరి మంజరి ఊరుకుందా? తన చేతి జంటను జీవనుని ముఖముమీదికి పోనిచ్చింది. ఆమె కరకమలములకు పట్టించుకొన్నది రంగుకాదు; తారు. ఫేలురః పు తారు.

జీవనుడు ఉలికిపడి వెనుకకు తరలినాడు. వెలుపలి ద్వారము దెస వన్యవరాహమువలె పరుగెత్తుకొని పోయినాడు.

ఆ ద్వార సమక్షమున హఠాత్తుగ ప్రత్యక్ష మయింది వ్యాఘ్రము. పులివెనుక ఉన్నాడు ప్రజాపతి చతురానన బంకిం.

అడవి పందికిని పెద్దపులికిని దారుణమైన సంఘర్షణము పొసగినది. కడువడిగా పరుగెత్తు జీవనుని దేహము, కండగల దేహము భూపీ శరీరమునకు బలముగ గ్రుద్దుకొన్నది. బంకిం వీధిలోనుండి ఒక ఉరుకున వసారాలో పడినాడు. జీవనదత్తు వలన కలిగిన దెబ్బను భూపీ సహించుకోలేకపోయాడు. అతడు గుభాలున వెనుకకు కూలపడినాడు. మల్లయుద్ధంలో చిత్తైపోయినట్లు జీవనునకు కూడా రాపిడిలో దెబ్బ తగిలింది. కాని అతడు దానికి తట్టుకొని, కట్టవలె నిలిచిపోయినాడు. వానికి తగిలిన దెబ్బకూడ తక్కువది కాదు. కాని దానిని సహించుకొనే సత్తువ వానికి కలదు. పడియున్న ప్రతిద్వందిని లేవనెత్తవలెనని—సహానుభూతితో అనుకొనండి— యత్నించాడు. బుద్ధిపూర్వకముగనో, లేక ప్రమాదవశముననో తప్పు తనవల్లనే ఘటిల్లినదని ఆతడు గుర్తించాడు. క్రిందపడియున్నవానిని లేవనెత్తవలెనని ప్రయత్నిస్తూ జీవనుడు వాని శరీరంమీది ధూళి దులపసాగినాడు. భూపీ కాళ్ళమీది స్లిప్పర్లు ప్రక్కకు పడిపోయినవి. చేతి కందిన స్లిప్పరును తీసికొని, "అరెగాడిదా! పందీ!" అని అష్టకాలు ఉచ్చరిస్తూ ఆతడు జీవనుని ముఖము మీదను, తలమీదను, వీపుమీదను చిత్తము వచ్చినట్లు వాయించసాగినాడు.

కదనం తీవ్రంగా చెలరేగింది. ఉన్మత్తునివలె జీవనుడు హుంకరిస్తూ భూపీ గుండెమీదికి లంఘించినాడు, దుశ్శాసనుని గుండెమీదికి భీముదురికినట్లు. ఆ రోజున జీవనుడు కడుపులోనికి కొంత విస్కీ ఎక్కించాడు. ఇపుడు వానికి ఒళ్ళు తెలియకుండా ఉన్నది. భూపీ బోసుతో తనకు యుద్ధ మెందుకు పొసగిందో వానికి జ్ఞప్తి లేదు. భూపీ గుండెపై కూర్చుని, బలముకొద్దీ వాని ముక్కుపై గ్రుద్దినాడు. అది మిగుల ఘోరమైన గ్రుద్దు. గ్రుద్దుతో వాని ముక్కు చితికిపోయింది. ఇంచుమించుగా

పచ్చడై పోయింది. ముక్కునుండి జొటజొట నెత్తురు కారసాగింది. ముఖము రక్తముతో నిండిపోయింది. శరీరము రక్తసిక్తమయింది. నలువైపులా నెత్తురు చిమ్మింది. జీవనుని చేతులు నెత్తురులో మునిగినట్లయినవి. వాని గుడ్డలు నెత్తురు ముద్దలైనవి. "ఏం చేశావు? ఎంతపని చేశావూ?" అని బంకిం అరువసాగినాడు. "అమ్మో! అమ్మో! చంపేశాడు! బందిపోటు చంపేశాడు" అని మంజరి భయంతో అరిచింది.

పిచ్చివానివలె చెలరేగిన జీవనుడు కొంతసేపటికి తెప్పరిలినాడు. ఎంతపని జరిగింది! భూపీ స్మృతిలేక పడిఉన్నాడు. చచ్చినట్లే యున్నాడు! ఇక తనపై పడనున్న విపత్తేమో తృటిలో జీవనుడు గ్రహించాడు. భూపీ స్థితిగతులు వానికి తెలియనివికావు. దేవులియా జమీందారుల ఇంట పుట్టినవాడు. వారా భయంకర స్వరూపులు! మనుజులను చంపి తిను పులులు ఏమిచేయజాలవు? ఎదుటివారిని చీల్చి చెండాడమా? మంజరి ఆక్రందనంవల్ల ఆతని స్వప్నము శిథిలమై పోయింది. నిముషములో ఆతడు గగనసౌధమునుండి కూలబడిపోయినాడు. స్వప్నజగతినుండి వానిని ఎవరో వెలుపలకు తరిమికొట్టినారు. ముహూర్తములో ఆత డందుండి ఉరికినాడు. తన ఊరిదిక్కుగా పరుగుపుచ్చుకొన్నాడు. పది క్రోశుల దూరము. ఆ స్థితిలో వానికి దారీ తెన్నూ అగపడలేదు. ఇందందు పరుగులిడి మయూరాక్షీ నదిని చేరుకొనినాడు. ఆ యొడ్డు పుచ్చుకొని చరచర సాగిపోయినాడు. బహుశః అది పదమూడు, పదునాలుగు క్రోశుల దూరము. పిచ్చివానివలె ఆతడు పరుగెత్తుతూ, ఆయాసము వచ్చినపుడు కూలబడుతూ మరల లేచి పరుగెత్తుతూ, నిమిషము తడసి, నెత్తుటిముద్దలైన బట్టలను నదిలో కడిగివేసి, మాపుగాని నెత్తుటి మచ్చలపై బురద పూసి, మరల పరుగుపుచ్చుకొని ఎట్టకేల కాతడు సొంత ఇల్లు చేరుకొనినాడు.

మెడికల్ కాలేజీలో చదువుకొనవలెనను వాని ఊహలు యావత్తు పంచ బంగాళములై పోయినవి.

మంజరిమీది మోహము మింటిమేడలో ప్రవేశించింది. మంజరియే ఆమేడను కూల్చివేసింది.

జీవనుని తలిదండ్రులు కొడుకు విపరీత వైఖరిని పొడగాంచి, ఉలికిపడి, "ఏమిరా బాబూ! ఏమయిందిరా నాయనా?" అని వానిని ఆతరపాటుతో చెంతకు చేరదీసికొని ప్రశ్నించారు. "ఈ వైఖరితో ఇల్లు చేరుకొన్నా వేమిరా?" అని

గ్రుచ్చి, గ్రుచ్చి అడిగినారు. "ఏమైందో చెప్పు బాబూ" అని కన్నీళ్లొడ్చుతూ తొట్రుపాటుతో మాటిమాటికి వా రడిగినారు.

జీవనుడు తలవంచుకొని నిలబడిపోయినాడు. ఏమీ జవాబు చెప్పలేదు.

జగద్బంధు మహాశయుడు దృఢప్రకృతి గల వ్యక్తి. అతనిమ్రోల సహితము తనయుడు అచంచలుడై నిలిచినాడు. అతడు మంజరి మాట ఎత్తనేలేదు. ఎత్తదలచుకోలేదు. "ఒక పెద్దింటివారి పిల్లవాడు నన్ను కాలిజోడుతో కొట్టినాడు. నేను కసి తీర్చుకొన్నాను. వాడికి పెద్ద దెబ్బ తగిలింది. నెత్తురు వచ్చిందికూడా. అందుచేత నేను పరుగెత్తుకొనివచ్చాను. అక్కడ ఉంటే వాడు నన్ను బ్రతుక నీయడు. హత్య చేసితీరుతాడు. నేను మళ్లీ అక్కడకు పోను. అక్కడ చదువు కోను. ఇప్పుడి లేక వర్ధమాను గవర్నమెంటు హైస్కూలులో చదువుకొంటాను. అక్కడికి పోనంటే పోను." అని జీవనుడు నొక్కి చెప్పినాడు.

"నాయనా! అలాగే కానియ్యి. ఇక అక్కడికి పోకు. చదువుకు నిన్నెక్కడికి పంపేది లేదు. ఇంటిపట్టున ఉండి మన కులవిద్యను నేర్చుకో" అని తండ్రి పలికినాడు.

జగద్బంధు మహాశయుని కంఠస్వరము కఠినము. అయినను మృదువైనది. ఆ స్వరమును వినినతోడనే జీవనుని ఒళ్లంతా మంచుగడ్డయైపోయింది. తాను చెప్పినదానికి వేరుగా చేయడను దృఢభావము వాని కంఠనాదములో వ్యక్తమయింది. వాని నుడువు వజ్రముకంటె గట్టిదైనది.

తండ్రి మాట ఎంత గట్టిదో కొందొక ముఖ్యవిషయం వలన జీవనుని గుండెలో బాగుగా నాటుకొనిపోయింది. ఒకనాడు నవగ్రామంలో ఉండే ఒక జమీం దారీ కుటుంబములో ఒక రోగికి జగద్బంధు మహాశయుడు వైద్యం చేయవలసి వచ్చింది. ఆ రోగి అనాచారి. వ్యభిచారి. వాని ఒళ్లు కుళ్లింది. వాని పాడు పోకిళ్ల వలన జగద్బంధు ఒళ్లు తిరిగిపోయింది. రోగి త్రాగుబోతు. "ఈ త్రాగుడు నీవు మానితీరాలి" అని వాని నాతడు హెచ్చరించాడు. కాని వైద్యుని మాట వ్యాధి గ్రస్తుడు సుతరామూ వినలేదు. "ఇక నేను నీకు వైద్యం చెయ్యను" అని గట్టిగా చెప్పి భిషగ్వరుడు అందుండి గిరుక్కున తిరిగి ఇంటికి తిరిగివచ్చాడు. రోగి చుట్ట ములు వాని వెంబడి, వాని కాళ్లూ కడుపు పట్టుకొని "అయ్యా! వైద్యం సాగించండి" అని అతనిని పరిపరి విధముల బ్రతిమాలిరి. కఠిన మృదుస్వరముతో

అతడు 'సనేమిరాః' అనినాడు. వాని మాటకు తిరుగులేదు. ఈ 'సనేమిరా'కు కోటి ఫిరంగుల శక్తి ఉండెను. రోగి కుటుంబము చతికిలపడిపోయింది. వైద్యుని వజ్రసంకల్పము చిట్లలేదు. నేడు కూడ జగద్బంధు మహాశయుని దృఢ నిశ్చయము అట్టిదే: కాఠిన్యమూ, మృదుత్వమూ ఒండొంటితో పెనవేసికొనినవి.

జీవనదత్తు చకితుడై నిమిషముసేపు తండ్రి ముఖమును తేరిచూచి మరల తలవంచుకొనినాడు. తండ్రి తెలిపిన "మరి పంపను" అను మాటలో తీవ్రమైన 'సనేమిరా' కలదనీ, అది మళ్లనదికాదనీ అతడు గ్రహించాడు.

జగద్బంధు మహాశయుడు చతికిలపడినాడు. పంచాంగం తెరచి చూచినాడు. కొంపలో కొడుకు విద్యారంభ తిథిని స్థిరపరచినాడు.

# ఎనిమిదవ ప్రకరణము

శుభకర్మ నిర్వహించడములో ఆలస్యం కూడదు. కర్మహీనుడైన వాని మనస్సులో అశుభసూచన అన్నప్పుడూ తాండవమాడుతునే ఉంటుంది. జగద్బంధు మహాశయుడు సమయము దాటబెట్టలేదు. ఫాల్గుణమాసాంతంలో క్రొత్త సంవత్సరం తొంగిచూసే సందర్భంలో అతడు కొడుకు చేతిలో వ్యాకరణము ఉంచి పాఠం చెప్పడం ఆరంభించాడు.

ఆయుర్వేదము పంచమవేదము. చతుర్వేదములవలె స్వయంప్రజాపతి సృష్టి. అది దేవభాషయందు చెప్పబడింది. దేవభాషయందే వ్రాయబడుతూ వచ్చింది. కావున తొలుదొలుత ఆ భాషయందు అధికారము సంపాదించుకొనుట అవసరము. వ్యాకరణం జీవనుని చేతిలో ప్రవేశించినా నెత్తికి మాత్రం ఎక్కిందికాదు. నరః నరౌ నరాః నుండి సమస్త వ్యాకరణమును కంఠస్థంచేయడం సులభకార్యమా? వ్యాకరణ విషయం దేవు డెరుగును. ఆయుర్వేద విద్యలో ఒక భాగం వాని తల కెక్కే అవకాశం అగపడింది. ప్రతిదినమూ ప్రాతఃకాలమున జగద్బంధు మహాశయుడు రోగులను పరీక్షించేందుకు కూర్చునేటప్పుడు కొడుకును దగ్గర కూర్చుండబెట్టుకొనేవాడు. తన ఆయుర్వేద భవనంలో మందులు తయారయ్యేసందర్భంలో ఔషధ నిర్మాణ కార్యక్రమంలో జీవనునకు కొంత పని కల్పింపబడింది. వనమూలికలను, వేర్వేరు ఆకులు వగైరాలను అతడు గుర్తుపట్టసాగినాడు. చెప్పవలసిన మరొక విషయం ఉంది. నాడీపరీక్ష విద్య అన్నిటికంటె అధికంగా వాని హృదయాన్ని ఆకర్షించింది. ఆ విద్య అద్భుతమైనది. మిగుల విస్మయకరమైనది. కవిరాజు ఇంట బుట్టినవాడు. ఇంటబుట్టిన విద్య వంటబట్టడంలో అమ్మక్క ఏముంది? కిశోర వయసులోనే జీవనుడు అంతో ఇంతో నాడీపరీక్ష చేయడం నేర్చుకొన్నాడు. జ్వరం వచ్చిందా, వచ్చే ఆశ ఉందా లేదా, జ్వరం పోయిందా, పోయే సూచనలు ప్రస్తుత మన్వంతరంలో అగపడతాయా లేవా మున్నగు యావత్తు విషయాలను అతడు నాడీ పరీక్ష చేసి చెప్పగలిగేవాడు.

తండ్రి కుమారునకు నాడిని ఎట్లు పరీక్షించాలో తెలిపిన ముహూర్తమందే దాని మహిమ ఎట్టిదో గుర్తించి, విస్మయసరితచేతస్కుడై నాడు జీవనుడు. ఈ విషయం వాని స్మృతి పథంలో బాగా నాటుకొంది.

దేవతాపూజచేసి జగద్బంధుమహాశయుడు ఇట్లు అనేవాడు : "రోగనిర్ణయం చేసేటప్పుడు తబిసీళ్లను యావత్తూ సంగ్రహించాలి. తర్వాత రోగి గృహమును పరిశీలించి, అందలి పరిస్థితి ఎట్టిదో పసికట్టాలి. తదనంతరం వ్యాధి పీడితుని ఆపాదమస్తకము పర్యవేక్షణ చేయాలి. పిదప రోగిని ఉద్దేశించి "నీవు పడుతూ ఉన్న బాధ యేమి?" అని అడిగి రోగ లక్షణములను తెలిసికోవాలి. పిమ్మట ప్రత్యక్ష పరీక్షలో, ప్రథమ పరీక్ష, ప్రధాన పరీక్ష నాడీ పరీక్ష జరగాలి. అనంతరం జిహ్వాగ్రమును చూడాలి. పిదప మూత్రాదుల పరీక్ష సాగిపోవాలి. కాని అన్నిటి కంటె ముందు నాడీ పరీక్ష జరిగితీరాలి.

ఆదౌ సర్వేషు రోగేషు నాడీ జిహ్వాగ్రే సంభవమ్
పరీక్షాం కారయేద్వైద్యం పశ్చాద్రోగం చికిత్సయేత్.

"ఈ పరీక్ష మిగుల కఠినమైనది. ముఖ్యంగా నాడీ పరీక్ష. మంచి నాడి ఏదియో, చెడ్డనాడి ఏదియో తెలుసుకోవాలి. పరీక్షించి చూడు." అని జగద్బంధు మహాశయుడు నవ్వినాడు. పరక్షణమందే గంభీరుడై జగద్బంధు కవిరాజు ఇట్లు అన్నాడు :

"రోగ నిర్ణయంతో రోగానుభవకాలమును తెలుసుకోవాలి. మృత్యు రోగం దాపురిస్తే, మృత్యుకాల నిర్ణయమును చేయడంకూడా సాధ్యం. సాధారణ విజ్ఞానము వలన ఇది సాధ్యం కాదు. అంతర్వాణి శక్తివల్లనే దీనిని గ్రహించాలి. ఇందుకు ధ్యాన యోగానుష్ఠానము అవసరము. కళ్లు మూసుకొని నాడి చూస్తాము. ధ్యాన యోగంలో మనస్సు లగ్నమైనపుడు నాడీగతి తెలుస్తుంది ధ్యాన సూత్రం తెగిపో రాదు. ఇది ఇంద్రియమునకు అగోచరమగు శక్తి. రహస్యమయమైనది. అంత రంగిక నిగూఢస్థానమున విద్యమాన మయ్యేది. ధ్యానయోగి అనుభూతికే ఆ శక్తి చిక్కుతుంది, దక్కుతుంది. ఉదారాశయ సందీపితమైన ఆయుర్వేదము నెరిగిన వాడు అంతరంగికమైన ఆధ్యాత్మిక శక్తివలన సత్యమును అవలీలగా గుర్తింప గలరు. వాతము, పిత్తము, కఫము - ఈ మూడును రోగి రక్తమును ఎట్లు ప్రచ లిత మొనరించునో, నాడియందు వాని గతి, వాని వేగము ఎట్లు అగపడునో భిష గ్వరుడు తెలిసికొంటాడు."

జగద్బంధు కంఠస్వరము గభీరమైనది. ఆతని ప్రవచన మిట్లు సాగి పోయింది.

"జ్ఞానయోగమువలన నాడిని చేపట్టవలెను. మనః సంయోగమందును, ధ్యానయోగమందును సిద్ధినందిన కవిరాజు వ్యాధి హేతువును వ్యాధి పరిణతిని తెలిసికొనజాలును.... మా నాయన ఇట్లనేవారు. సన్యాసి ఒకడు తనతో ఈరీతిగా చెప్పేవాడట. 'ఇదిగో! సర్పవిషమును నాశనము చేసే ఔషధమును నీ కిస్తున్నాను. సర్పదంశనమువలన కలిగే విషమునకు మందున్నది. కాని ఏ పాము విధి యొక్క ఆజ్ఞవలన కాటు వేస్తుందో, ఆ కాటువలన చావు తప్పదు. దాని కెట్టి ఔషధమూ పనిచేయదు. అదేరీతిగా ఎట్టి గడ్డు తెగులుకైనా మందుకలదు. కాని విధి నిర్ణయంవలన ఘటిల్లే రుగ్మతకు మందులూ, మాకులూ లేవు ఈ వ్యాధిముందు యావత్తు వైద్యము చతికిలపడిపోతుంది. ధన్వంతరి దిగివచ్చి నెత్తి మొత్తుకొని, గుండె బాదుకొని వెక్కి-వెక్కి ఏడ్చి లేచిపోతాడు. మనము వైద్యులమే! చికిత్స చేసి బ్రతుకు గడుపుకొంటూ ఉంటాము. కాని ఫల మగపడుతుందని రాయి గ్రుద్ది చెప్పలేము. భూభారము తగ్గించే బాధ్యత మనపై ఉన్నదేమో! రోగి యాతన అనుభవించవలసినంతకాలము నిలిచి పిదప వ్యాధి అంతర్ధాన మగునో, లేక పరమ పూజ్యుడైన యమధర్మరాజుకు రోగిని సమర్పించేవరకు నిలుస్తుందో నాడినిపట్టి తెలుసుకోవచ్చు."

తండ్రిగారి గభీర వాక్కులను ముగ్ధుడై వింటున్నాడు. విషయము వినిన కొలది వాని గుండె తలక్రిందు లవుతూ ఉంది. ఎన్నెన్నో ఊహలు వాని అంతరంగమున భరతనాట్యము చేస్తున్నవి.

ఆ రోజుల్లో జీవనుని సమక్షమున రంగలాల్ డాక్టరు ప్రతిష్ఠ ప్రత్యక్షమై వుంది. ఆతడు పక్కా దొరవేషంలో సాక్షాత్కరించేవాడు. తళతళలాడే బంగారు గొలుసూ, కన్నుగుట్టే తెల్ల గుఱ్ఱము, పదుగురూ చెప్పుకునే ధనాదాయము, సిరీ, సంపద వాని దృష్టి నాకర్షించినవి. ఈ స్థితిని అందుకోవాలంటే పెద్ద డాక్టరీ పరీక్షలో నెగ్గితీరాలి. ఇప్పుడు ఆ ఆశయము స్వప్నోదంతం అయిపోయింది.

తండ్రిగారి సమక్షమున కూర్చుని, ఆతని గంభీరోక్తులు వినినపుడు తొల్లింటి ఆశలు క్రమక్రమముగ విస్మృతిలో డుల్లిపడదొడగినవి. అద్భుత జ్ఞానాలోక సందీప్త సింహద్వారమును అతని జనకుడు, అతని గురువు వానిముందు నిలిపినాడు. "ఈ సింహద్వారమును తెరచి, లోపల ప్రవేశింపగలిగితివేని అమృతకల

శము నీ చేతికందును. దీనిని చేజిక్కించుకొనే అవకాశము నాకు కొంత లభించింది. ఇక నీవంతు వస్తోంది" అని జగద్బంధు తనూభవునితో తెలిపేవాడు. ఆతని వచనము లివి :

"మా తండ్రికి ఈరీతి విశ్వాసముండేది. నేను కూడ ఆ రీతిగానే విశ్వసిస్తున్నాను. ఏ శాస్త్రమునైనా చదువుట, అందలి జ్ఞానమును అనుభూతిలోనికి తెచ్చుకొనుట - ఇవి రెండును వేర్వేరు విషయాలు. గురుకృపలేనిదే జ్ఞానము లభింపదని మన శాస్త్రములు తెలుపుతూ ఉన్నవి. శిక్షణము సుసాధ్యము కాదు. శాస్త్ర శ్లోకములను కంఠస్థము చేసికోవచ్చు. ఆ శిక్షణము ప్రజ్ఞానమై శిష్యుని అంతరంగములో దీపించునపుడు పృథ్వీరూపమే మారిపోతుంది. సాధారణముగ కన్నుల కగపడని దృశ్యము ప్రత్యక్ష మగును. స్పర్శకందనిది అనుభూతి కందును. నాడీ పరీక్ష సామాన్య విద్యకాదు. చక్కిలిగింత కాదు. అది నీలో పరిణతి నందినయెడల నిక్కముగా నీవు మృత్యుంజయుడవు కాగలుగుదువు."

జీవనుని హృదయము ఆవేశముతో కదలిపోయినది. "నాయనా! నీవన్నది సత్యము! సత్యము! ముమ్మాటికి సత్య"మని ఆతడు కంఠమెత్తి పలికినాడు కాలము గడిచినకొలది విస్తృత జగతియందలి అద్భుత దృశ్యములు మానవుని కన్నుల ముందు విప్పారినవి. కూపస్థ మండూకములు ఒక్క ఉరుకులో కడలి కడుపులో ప్రవేశించినవి. జంబూద్వీపమునుండి పశ్చిమ గోళార్థము, ఉత్తరమందలి మేరు కుధరము, మరి దక్షిణ ధ్రువము చెప్పనేల, యావత్తు పృథ్వీ నవనవోన్మేషమై జిజ్ఞాసువు ముందు చూపట్టినది. ప్రాచీనకాలమున సత్యమని మనుష్యులు నమ్మినది మిథ్య అని నేడు ప్రమాణితమైనది. నూతన సత్యమును గ్రహింపవలసి వచ్చెను. ఈ సత్య మింకను నిరూపణము కాలేదు. భౌతిక ప్రపంచమందలి సత్యములు, నూతన దృశ్యములు దృష్టిబడినపుడు నవ్యాన్వేషణము వృద్ధియైనపుడు అసత్యములని ఋజువుకావచ్చును. కాని ప్రజ్ఞాన ప్రదీప్త దృశ్యములందు చిర సత్యములు, నిత్య సత్యములు - ఇట్లని గ్రహింపవలసిన బాధ్యత జీవనునిపై గలదు.

ఈ కాలమున సింధు గర్భములో మునుగు వారి వృత్తాంతము నాతడు చదివినాడు అంబురాశిలో మునుగుటకై ఉపకరించు దుస్తులను, యంత్ర పరికరములను ధరించి ఒక సాహసోపేతుడు రత్నాకరమున మునిగి, నిమ్నతలమందలి విచిత్ర సౌందర్యము నవలోకించి ముగ్ధుడై ముత్తెములను చేబట్టుక్రియ నాతడు కొంతసేపు ఘరభను అదేరీతిగా ఆనాడు జీవనదత్తు సమస్తమును మరచినాడు. తొల్లింటి

ఊహలు గగన సౌధమందలి రంధ్రములందు దూరు పావురముల వలె అదృశ్యము లైనవి. ప్రతిష్ఠ, ధనార్జనము, సన్మానము చెప్పనేల, మానస దిగ్వలయముపై పిచ్చిగంతులు వేయు వాంఛలన్నీ పటాపంచలైనవి. తండ్రి వానికి విచిత్ర పురాణో దంతమును వినిపించినాడు.

మృత్యువన నేమి? వ్యాధియన నేమి? మృత్యువుతో వ్యాధికి గల సంబంధ మేమి? వీనిని గురించిన ఉదంతము కడుంగడు విచిత్రమైనది. ఇది మేలి పౌరాణిక గాథ.

జగద్బంధు మహాశయుడు భాగవత కథకునివలె మిగుల దక్షుడైన పౌరాణి కుడు. నిపుణమై, గభీరమైన అతని వాగ్విన్యాసమున జీవనదత్తు అభిభూతుడై ఉన్నాడు.

జగద్బంధు తన కథనము నిట్లు సాగించినాడు: "ఒక్కొక్క రోగమందు మృత్యు సంస్పర్శ స్పష్టమై యుండవచ్చును. మృత్యువును గురించిన అద్భుత కథనము మహాభారతమున గలదు. భగవాన్ ప్రజాపతి విశేషానందముతో సృష్టి తరువాత సృష్టిని నిర్వహిస్తూ ఉండెను. విచిత్ర సృష్టినుండి విచిత్ర తర సృష్టి జరుగుతూ ఉండెను. అపుడు పృథివిలో కేవలము సృష్టిమాత్ర ముండెను. లయము గాని, మృత్యువుగాని లేకుండెను. ఇట్లుండ విధాత కర్ణములందు ఎందుండియో ఆర్తనాదము వినవచ్చెను. చెవియొగ్గి దాని నాతడు శ్రద్ధతో విన్నాడు. పిదప విధి నాసికలో ఒకవిధమైన దుర్గంధము ప్రవేశించింది. నలువైపులు చూచి చకితు డైనాడు. ఆశ్చర్యాన్వితుడైనాడు. తాను చేసిన సృష్టిలో పెద్ద భాగము జీర్ణమై, మలినమై, స్థవిరమై కర్కశమై ఉండెను. పృథ్వీ హృదయము పెక్కు జీవులతో పరివ్యాప్తమాయెను. ఒకప్పుడు స్థిమితమైయుండిన జగతి క్లిష్టమై ఆర్తనాద మొన రించుచుండెను. దుర్గంధ మెందుండి వచ్చెను. జీర్ణమై, జరాగ్రస్తమైన దేహము నుండి అది ఉత్పన్నమైనది. ప్రజాపతి గభీరభావమగ్నుడైనాడు.

అతని లలాటమందు చింతా కుంచనరేఖ అగపడినది. చింతా మగ్నత యందు ఆకస్మికముగ అతని ముఖ మండలము కుటిల మైనది. ప్రసన్న లలాట మున భ్రుకుటి గోచరించినది. స్మితముఖమున అప్రసన్నత తోచినది. ప్రసన్న నీలాకాశము మేఘాచ్ఛన్నమై, దిగంతములందు వ్యాపించిరేప లవ తానే అతని అంగములనుండి ఒక ఛాయ రూపు దాల్చినది నారీమూర్తి ఒకటి ఆ జలు మటించి

అతని సమక్షమున తోచినది. పింగళ కేశములతో పింగళ నేత్రములతో, పింగళ వర్ణముతో ఆ మూ_ర్తి యొప్పుచుండెను. దాని గళ దేశమందూ, మణి బంధమందూ పద్మ బీజ భూషణములు వెలయు చుండెను. ఆ మూ_ర్తి శరీరముపై కాషాయ వస్త్రములు గలవు.

నారీమూ_ర్తి ప్రజాపతి పాదములకు మ్రొక్కి భగవంతుని ఇట్లు ప్రశ్నించెను. "పితా! నేనెవతెను? నేను చేయవలసినపని ఏమి? నన్ను ఏల సృష్టించితిరి?"

భగవాన్ ప్రజాపతి "నీవు నా కన్యవు. మృత్యువవు. సృష్టిలో సంహార కర్మ సలుపుటకై నీవు సృష్టింపబడితివి. అదియే నీవు నిర్వహింపవలసిన క_ర్తవ్యము" అని ప్రత్యు_త్తర మిచ్చినాడు.

ఈ మాటవిని నారీమూ_ర్తి ఉలికి పడినది. గద్గద స్వరముతో ఇట్లు పలికింది. "తండ్రివయ్యు నన్నీ కుటిల కఠిన కార్య నిర్వహణకై ఏల నియోగించితివి? ఇది ఆడుది చేయవలసిన కర్మయా? నారీ హృదయము నవనీత హృదయము కాదా? నేను నెరపవలసినది నారీ ధర్మము. హనన క్రియ నెట్లు నిర్వహింప గలుగుదును?"

విధి వచనము లివి. "ఏమి చేయుదును? వేరు దోవలేదు. నీవు సృష్టియైనపుడు నీ కర్మ నీవు చేసి తీరవలెను."

"తండ్రీ! చేయ జాలను."

"చేసి తీరవలెను."

మృత్యువు తపస్సు చేసెను. అది మిగుల కఠోరమైన తపస్సు. భగవంతుడు ప్రత్యక్షమై "కావలసినదేమో కోరుము" అని అడిగెను.

"ఈ నిష్ఠుర క్రియనుండి నన్ను తప్పింపుము."

"తప్పించలేను".

మరల మృత్యువు తపస్సు చేసెను. తొలి తపస్సు కంటె ఇది తీవ్రతరమైనది.

మరల ప్రజాపతి ప్రత్యక్ష మైనాడు. ఈ పర్యాయము కూడ మృత్యువు తొల్లింటి వరమునే కోరినది.

"పితా! ఈ ఘోర కార్యమునుండి నీ బిడ్డను తప్పింపుము" కొంచెము సేపు మౌనము వహించి, తల పంకించి "అట్లు చేయడం సాధ్యం కాదు." అని బ్రహ్మ పలికి అదృశ్యుడైనాడు

కన్యా రూపిణియై ఉన్న మృత్యువు చాలసేపు ఆకాశము దెస తేరిచూచి అనంతరము స్వీయ పీఠముపై అధివసించి మూడవ పర్యాయము తపస్సు చేయ సాగెను. ఇది కఠోర తమ తపస్సు. ఎవ్వరు ఎన్నడు చెయ్యని తపస్సు. మరల చతుర్ముఖుడు ప్రత్యక్షమైనాడు, మృత్యువు పూర్వోక్త వరమునే అర్థించెను. కాని ఈ పర్యాయము ఆమె పెదవులు రెండును కంపించినవి. కన్నుల నుండి అనర్గళధారతో అశ్రుజలము ప్రవహింప సాగినది. చప్పున సృష్టికర్త దోసిలొగ్గి బాష్పవారిని అందు నింపెను.

"అమ్మా! నీ కన్నీరు జగతిపై పడినతోడనే, సమస్త సృష్టియు ధ్వంసమై పోవును" అని తండ్రి పలికెను. చూచుచుండగా ఆ అశ్రు బిందువులనుండి కొన్ని కుటిల స్వరూపములు ఆవిర్భవించినవి.

"అమ్మాయీ! ఇవి వ్యాధులు, ఇవి నీ సృష్టి, నీ సహచరులు" అన్నాడు విధాత.

"నేను నారినై పత్నిపార్శ్వమునుండి పతిని ఎట్లు వెడలింతును? తల్లి గుండె నుండి ఆమె ముప్పదిరెండు నాడులనుండి జనించిన బిడ్డ నెట్లు లాగివేతును? ఇది కడుంగడు నిష్ఠురమైన క్రియ కాదా?"

"సర్వ పాప పుణ్యములకు నీవు ఊర్ధ్వమున నుంటివి. నిన్ను పాప మంటదు ప్రజల కర్మ ఫలము ఈ వ్యాధుల ద్వారా నిన్ను ఆహ్వానించును. అనా చారము, అమితాచారము, వ్యభిచారము, అత్యాచారము - వీనివలన మానవులు వ్యాధి పీడితు లయ్యెదరు. వీరిని దారుణ యాతన నుండి నీవు రక్షింతువు! వెను కటి పుట్టుకనుండి నవ జన్మను జీవికి

వ్యాకులచిత్తయై మృత్యువు ఇట్లనెను: "నేను చెంతకు చేరు తరి తలి దండ్రులు, ఆలుమగలు, కన్యలు, పుత్రులు తలలను మోదుకొనుచు బ్రద్దలు చేసి కొందురు. గుండెలు చరచు కొందురు. పట్టరాని దుఃఖముతో మృత్తికపై దొరలెదరు. ఈ భీషణ దృశ్యములను నే నెట్లు చూడగలను?"

"కన్నులు లేకున్నయెడల నీవు దేనిని చూడలేవు. కావున నీకు నేత్రములు లేకుండ చేయుదును."

"ఇక ఆక్రందనముల నెట్లు సహింపగలను? గుండెలను చీల్చు ఆర్తనాదములను...." "మృత్యువు మాట కడ్డువచ్చి భగవంతుడు "ఆ దారుణానుభూతి నుండి కూడ నిన్ను తప్పింతును. నీవు బధిర వయ్యెదవు. నీ చెవిలో ఎట్టి ధ్వని ప్రవేశింపలేదు" అని పలికెను.

జగద్బంధు మహాశయు డిట్లనినాడు. "మిత్తికి కన్నులు లేవు. చెవులు లేవు. బిడ్డలవలె రోగములు దాని చేతులు పట్టుకొని ఇందందు త్రిప్పుతూ ఉండును. కాని, దానిని శాసించెడి నియమము కాలము. ఎవరికాలము నిండిపోతుందో వారు పోయి తీరాలి. అకాల మృత్యువు కూడ కలదు. తన పాపమువలన మానవుడు ఆయుక్షయ మొనరించుకొని, అకాలమున కాలుని ఆహ్వానించును. మన పంచమవేదమైన ఆయుర్వేదము దుష్కాలమునకు గురి కానియెడల అద్భుతమైన మహిమను ప్రకటిస్తుంది. కాల మెందు రోగమునకు తోడుపడదో అందు రోగములను ఆయుర్వేదము ప్రతిహత మొనరిస్తుంది. వ్యాధులు తొలగిపోవును. అంధ బధిర మృత్యువు కాలముయొక్క చేయూత నంది ముందంజ వేస్తున్నదని గ్రహింపనగును. ఎన్ని క్షణములలో ఎన్ని గడియలలో, ఎన్ని దినములలో, ఎన్నివారములలో, ఎన్ని పక్షములలో ఆ చేత విప్పటిలునో నాడీ పరీక్ష వలన తెలుసుకోవచ్చును."

ఆ సమయమున ఆ ఇంటిమూలనుండి టిక్ టిక్ శబ్దము వినవచ్చింది. ఆ దిక్కుగా పోయి, కాలి బొటనవ్రేలితో తడవిచూచి జగద్బంధు "అదిగోచూడు" అన్నాడు.

తండ్రి మాటలు సత్యము లని ఆ శబ్దము సమర్థిస్తూ ఉన్నదని జీవనుడు తొలుత ఊహించాడు. కాని అది సరియైన ఊహ కాదు. అట్టి చప్పుడు చేస్తూ బల్లి ఒకటి ఒక కీటకముపై దుముకుతూ ఉంది. బల్లి బారినుండి తొలగిపోవాలని కీటకము ప్రయత్నిస్తూ ఉన్నది.

జగద్బంధు వీ దృశ్యముపై చూపుంచి ఇట్లనినాడు :

"ఈ రీతి పరిస్థితిలో మనుష్యుడు ఏ జంతువు పిడికిటనైన పడుచో, లేక రెండు దారుణ సంకటములందు చిక్కుపడుచో వానిని సమీపించి, ఆ క్లిష్ట పరిస్థితిలో

వాని నాడిని పరిశీలించిన యెడల అందు తీవ్ర జీవనానుభూతిని గురించి, పరిస్థితిని గురించి జగద్బంధు ఒక కథ చెప్పినాడు. ఇది ఆతని అనుభవంలోని దొడ్డ విషయం.

"గిరీశుని తల్లి - ఈ నవగ్రామంలో ఉండే గిరీశుని తల్లి - ముసురు బాగా పట్టిన దినాలలో చెరువు ఒడ్డున పాకుడుతో నిండిన చీడీపై జారి పడింది. పడిన వెంటనే ఆమెకుస్మృతి తప్పిపోయినది. మా తండ్రిగారు అప్పటికే పరమపదించారు. వయసులోగాని, వైద్యంలోగాని నేనింకను ముదుర లేదు. కబురు రాగానే పడి పోయిన అవ్వదగ్గరకు పోయాను. నాడి చూచి శంకించాను. కాని, ఏ విషయ మును ఇతమిత్థమని చెప్పలేకపోయాను. పెద్ద దెబ్బవలన నాడి స్పందహీనమై పోయింది. నాడి చేతికెట్లు అందుతుంది? మరి దానిని గుర్తుపట్టు టెట్లు? ఆవలి వీధినుండి మరొక కవిరాజు వచ్చి, ముసలమ్మను పరీక్షించి పెదవి విరిచి 'ఈ కేసులో చావు తప్పవచ్చు. తప్పక పోవచ్చు. పెద్ద తల గల వైద్యున కీమెను చూపడం మంచిది. పాదులియాలో ఉండే ముసలివైద్యుని సాయంకాలం పిలిపించి చూపించడం మంచిది' అన్నాడు. వృద్ధవైద్యుడు ధన్వంతరి తల తన్నినాడని ప్రజ లన్నారు. అతడు అవ్వను పరీక్షించి ఇట్లు సెలవిచ్చినాడు. 'ఈ స్థితిలో ముసలిది మూడు నాళ్లుండ గలిగితే గండం దాటిందని చెప్పవచ్చు. కాని——' అని ఏమో అన బోయి ఊరుకున్నాడు.

'ఏం బాబు ఏం సెలవు?' అని ప్రశ్నించారు సమీపమందలి వ్యక్తులు. భిషగ్వ రుడు మళ్లీ నాడి చూచినాడు. బాహుమూల మందును, కంఠమందును పరీక్ష సాగించి ఇట్లు సెలవిచ్చినాడు. 'అవ్వ బ్రతికి బట్ట కట్టగలిగినప్పటికీ, ఏడాది లోపు గనే పరలోకమునుండి ఆమెకు పిలుపువచ్చే ఆశ కనిపిస్తోంది. చావు మూడకమున్నె దెబ్బతగిలిన తావుల్లో చెప్పరాని మంట పుట్టడం తథ్యము. అప్పుడే దెబ్బతగిలి నట్లుగా ముసలిది బాధపడుతుంది.'

చావు తప్పని పరిస్థితిలో రోగిని గంగాతీరమున చేర్చడం వంగదేశంలో ఆచారం. దానధర్మాలు చేస్తూ రోగి మృత్యువుకొరకై కనిపెట్టుకొని ఉండి అవ లీలగా పరలోకము లోనికి కదలిపోవును. ఒకవేళ రోగిని చూచి మృత్యువు భయ పడి పలాయనం చిత్తగించినప్పటికీ రోగి మరి ఇంటికి మరల రాదు. కాశీ పోయి వేళచూచుకొని కాటికి కాళ్లు చాపుకోవచ్చు.

గిరీశుడు రెండవ దినమందే, అమ్మను సవారీలో (ఏడు కట్ల సవారి కాదు) పరుండబెట్టి, గంగాతీరమునకు తోడుకొని పోయినాడు. మూడు దినాలలో ముసలమ్మ పరలోకానికి టపా కట్టుతుందని ఎల్లరు ఏకగ్రీవంగా చెప్పివేసినారు. గంగాతీరంలో గంగా భాగీరథీ సమానురాలైన తల్లి ఏమైనను ధన్యురాలని మహాశయులు చెప్పినారు. దమ్మిడీ కాసులు తయారుగా ఉంచుకొన్నాడు పరమ భక్తుడైన తనయుడు. నాలుగవ దినమున అవ్వకు జ్ఞానం వచ్చింది. వెఱ్ఱిమొహం వేసుకొని నిట్టూర్పుతో యమధర్మరాజు కింకరులతో కలిసి వెనుకకు దారితీసినాడు. ముసలివి క్రమక్రమంగా తేరుకుంది. అయినను ఎల్లరయొద్ద సెలవుతీసికొని వచ్చిన అవ్వ మళ్లీ గంగనుండి తిరిగి ఇంటి కెలా పోతుంది? అందుచే మృత్యుకాండ చెంపపగులునట్లు చరచి గంగాతీరమందే ఆమె బైఠాయించింది.

సంవత్సరం నడచేందుకు వారము రోజుల వ్యవధి మాత్ర ముంది. దెబ్బ తగిలిన తావున ఆకస్మికముగ మంట పుట్టింది. క్రమక్రమముగా అది హెచ్చిపోయింది. యాతన ఆఖరు డిగ్రీలో ప్రవేశించింది. ఇద్దరు భక్తులు ప్రవేశించారు ఒక శివభక్తుడు. మరొకడు విష్ణుభక్తుడు. పడిఉన్న అవ్వ చెవిలో ఒకడు 'శివ శివా' అన్నాడు. రెండవ భక్తుడు రెండవ చెవిలో 'హరి హరీ' అన్నాడు. ఉక్కిరిబిక్కిరియైన అవ్వ 'అబ్బాయీ!' అని అరిచింది. ఇక దినము గడచిపోయింది. ముసలిదాని చేతనము తప్పిపోయింది. మరి పన్నెండు గంటల్లో ఆమె పాపిష్ఠి ప్రపంచమును దాటిపోయి పరలోకంలో ప్రవేశించింది.

ఇది నా ప్రాక్టీసులోని మొదటి కేసు. నా వైద్య విజ్ఞానమునకు ప్రథమ ప్రత్యక్ష తార్కాణము. తదనంతరము నా హయాములో ఈ రీతి కేసులను లెక్కలేని వానిని చూచి 'హాయన్ మజ్జా' అన్నాను. నువ్వు కూడా చూస్తావు. ఇపుడపుడే వైద్యమహిమ సరిగా నీ కర్థం కాదు. దీనిని గురించి విశేషించి వ్యాఖ్యానించినా, ప్రయోజనం లేదు నాయనా! ఒక మాట చెపుతాను విను. ఎవరి అదృష్టం వారిది. ఒకరి భాగ్యరేఖనుబట్టి ఈ అనుభూతి కలుగుతుంది. అట్టి భాగ్యరేఖ నీ నొసట ఉన్నయెడల గొప్ప అనుభవం సంపాదించుకొని వహావ్వా! అనిపించుకొంటావు. ఒక్క అవ్వకాదు. వెయ్యి అవ్వలు తగుల్తారోయి అబ్బాయీ!"

# తొమ్మిదవ ప్రకరణము

జీవన మహాశయుడు నేడు హఠాత్తుగా తన నాడిని గట్టిగా పట్టి చూచుకొంటున్నాడు. ఎంతోసేపు గడచిపోయింది. నాడిని అలాగే పట్టుకొని కూర్చున్నాడు. చేతికి నాడి అందలేదు. ఎంతో అనుభవశక్తి ఉన్నవాడు. అది ఎక్కడికో పటాపంచలై పోయింది ఈకాలపు పిన్నవయసు డాక్టర్లు ఆడిన సూటీ పోటీ మాటలు అతని గుండెలో గాలములై గ్రుచ్చుకొన్నవేమో!

"ఏం? ఏమొచ్చింది? అలా చెయ్యిపట్టుకొని కూర్చున్నారేం? సొంత నాడి చూసుకొంటున్నారా?" అని అడిగింది ఇల్లాలు.

నాడిమీది నుండి జీవన డాక్టరు చేయి తీసివేసినాడు.

ప్రతిదినమూ భోజనాలు ముగిసినపిదప ఇల్లాలు వచ్చి ఇంటిఆయన ప్రక్కలో కూర్చుంటూ ఉంటుంది. తాంబూలం వేసుకుంటూ విసురుకుంటుంది.

కర్పూరం కలిసిన నీటిని గ్లాసులో నింపి తలదగ్గర ఉంచుతుంది. తన చేతితో తానే సేవ చేస్తోంది. బుద్ధి కుదిరినపుడు ఆమెవంటి ఇల్లాలు మరొకతె అగపడదు. ఆమె వచఃకౌశలము ఉట్టిపడుతూ ఉంటుంది. బుద్ధి కుదరకపోతే విశ్వరూప సందర్శనం ప్రత్యక్ష మౌతుంది. అయితే అమృతవర్షము! లేకపోతే అగ్నివృష్టి! ఆమె పెనిమిటి పేరెత్తి ప్రసంగం సాగించదు. ఆమె ఉపన్యాసం అన్యాపదేశంగా సాగిపోతుంది. నొసలు చరచుకొంటూ, కపాలముపై దెబ్బవేసి కొంటూ ఆమె తన ధోరణి ఉపక్రమించింది. న్యాయశాస్త్రరీత్యా ఆమెను పట్టివేయడం బ్రహ్మకు సాధ్యం కాదు. భర్త ప్రశ్నిస్తే "మీతో నేనేమీ చెప్పలేదు. మీరు ఉడికిపోవడం ఎందుకు? నా తలవ్రాతను ఉద్దేశించి ఏమోమో సణుగుతున్నాను." అని ఆమె పలుకుతుంది. చాలకాలమునకు మున్నే జీవన డాక్టరు తన ధైర్య సాహసాలకు నీళ్లు వదులుకున్నాడు. "నీ తలకాయను దేవుడు నన్ను కట్టిపెట్టేడు. నీవు చరచుకొన్నపుడు దెబ్బ నాకు తగులుతుంది." అని అతడు పలుకుతూ ఉంటాడు. నేడు తన వాడి

చూపు మగనిపై సారిస్తూ "ఏమీ మీకు దెబ్బతగులుతోందా" అని వెటకారంతో అన్నది ఆమె.

"తగిలిందో తప్పిందో నీకు బోధపడడం లేదా?"

ఒకనాడు తటాలున ఒక రాతిముక్కను తీసి నొసలుపై కొట్టుకొన్నది ఆమె. అక్కడ నెత్తురు చిమ్మింది.

"ఏం పని చేశావు? ఏం పని చేశావు?" అని తొట్రుపాటుతో అతడు అన్నాడు.

ఈ క్రియ జరిగినపిదప జీవన డాక్టరు మెట్లవద్ద ధర్మపత్ని అడుగుల అలికిడి వినబడగానే కళ్లుమూసుకొని నిద్రపోతూ ఉన్నట్లు నటిస్తూ ఉంటాడు. ఏదో ధోరణిని స్మరిస్తూ ఉండడంవల్ల ఆమె చరణముల అలికిడి వాని చెవిలో పడలేదు.

"ఏమండీ! ఒళ్లు బాగులేదా?" అని ఆమె భర్తను ప్రశ్నించింది. అబద్ధమాడాలని జీవన డాక్టరు ప్రయత్నించాడు. "ఒళ్లేమో బాగులేనట్లే తోస్తోంది" అని అతడు చెప్పాలనుకొన్నాడు. అలా చెపితే ఆమె మరొక అవతారం దాల్చి ఉండేది. చంటివానిని పట్టివేసినట్లు అతనిని ఉక్కిరి బిక్కిరి చేసేది.

తన ఇంటిఆవిడ మారువేషంతో తన వెంగటకు వేంచేసిన మృత్యుకాంత అని జీవనదత్తు అనుకొన్న రోజులున్నాయి. అసలు మృత్యు మహిళ ఘోలిముసుగు వేసికొని ప్రత్యక్ష మౌతుందనీ, తన వైద్యవృత్తిలో ఆ రీతిగ ఆమె అగపడేదని అతని తండ్రి అంటూఉండేవాడు. దూరంనుండి దానిని గుర్తుపట్టడం సాధ్యం కాదు. దానిని చూస్తే భయం వేస్తుంది. దారుణంగా బాధపెట్టే తెవులు వెంటనంటి అది వస్తుంది. వైశాఖమాసపు తుపాను తరువాత రాలు వర్షధారవలె అది అగపడుతుంది. మిగుల తీవ్రంగా చెలరేగు తెగులు తెలుపరాని నెగులుతో బ్రతుకుపై వ్రాలినపుడు, ప్రశాంత స్నిగ్ధ స్పర్శతో వానచినుకువలె సోకుతుంది మృత్యువు. జీవన డాక్టరు ఇల్లాలు సరిగా అటువంటిది. దూరముగా ఉన్నంతసేపు భయము గొలుపుచు అశ్రురుద్ధ తప్త ప్రసంగం వ్యాధియాతనవలె బాధ కలిగిస్తుంది. కాని జీవనంగారి బ్రతుకులో ఆమె ఒక జాడ్యము. కేవలము జాడ్యము. అతనికి మంజరి లభించలేదు.

మృత్యువు వేరురూపంతో మభ్యపెట్టుతుంది. వచ్చివచ్చి మాయమైపోతుంది. పట్టుపడదు. ఒక్క చరపు చరచిపోతుంది. మంజరి అట్లు చేసింది.

మభ్యపెట్టి ఆమె పోయింది. అమ్మవారివంటి ఇల్లాలు, తీవ్రవ్యాధివంటి పెండ్లాము జీవనంగారికి దాపురించింది.

ఉండి, ఉండి దీర్ఘమైన వేడి నిట్టూర్పు విడి నారు డాక్టరుగారు. అమ్మవారి ప్రశ్నకు ప్రత్యుత్తరం ఏమి చెప్పాలో ఆ పెద్దమనిషికి తోచలేదు. పెనిమిటి నోరు విప్పకపోవడంవల్ల ఆమె లోలోన ఉడికిపోయింది. మలేరియా ప్రకోపం వలె ఆ ఉద్రిక్తత చెలరేగింది. ఇటువంటి ఘట్టాల్లో టెంపరేచరు 105 డిగ్రీలవరకు హెచ్చి పోవుట కద్దు. పెండ్లాము డాక్టరు బ్రతుకులో మలేరియా జ్వరం అనడంలో అతిశయోక్తి ఆ వంతైనాలేదు. క్రమక్రమంగా పెరిగి పెంపొంది కొంచెం ఏమరుపాటుగ ఉన్నయెడల అది ప్రకోపించి పోతుంది. జర్జరజ్వరోత్తాపము విజృంభిస్తుంది. అమావాస్య పూర్ణిమలందు ఆ ఉద్రిక్తత హెచ్చు డిగ్రీలలో చెలరేగుతుంది.

"అలా బెల్లము కొట్టిన రాయి అయిపోయినా రేమి? పెదవి మెదపిన యెడల మీ నాడీ జ్ఞానం మటుమాయమైపోతుందా?" అని అడిగింది అర్ధాంగి.

గుండె గుప్పిట్లో పెట్టుకొని, "శశి నీతో ఏమి చెప్పిపోయాడో కొంచెం సెలవిస్తావా?" అని భర్త మెల్లగా ప్రశ్నించాడు.

నేడు శశి పాజీ వచ్చి, ఆమె స్వరూపమును కదిపివేసినాడు. అతగాడిపై ఆమెకు వాత్సల్యం ఉండడం నిజమే! శశి చాలాదినములు ఈ కొంపలో కాలక్షేపం చేశాడు. ఆమె హుకుమ్ ఏతీరున నడుస్తుందో అత డెరుగును. ఈ ఇంటి బిడ్డలను ఒడిలో ఉంచుకొని, వీపుమీద మోసుకొని ఆతడు ఆడించేవాడు అతడు ఈ ఇంటి నుండి పోయినప్పటికీ వాని సంపర్కం బొత్తుగా మాపు కాలేదు. తరచుగా ఇక్కడకు వచ్చిపోతూ ఉంటాడు.

భర్త ప్రశ్నకు ధర్మపత్ని ఇట్లు చెప్పెను.

"ఎమంటాడు శశి? వాడు చెప్పగలిగే దేమి? విరిగిపోయిన చేటతో ఎంత చెరగవచ్చు? శశిగాడు అటువంటి చేటవంటివాడు. కమ్మరి ముసలిదానికి మీరు చేసిన వైద్యపు వైఖరి ఎవరికి తెలియకుండా ఉంది? సర్కారు డాక్టరు మొహం వాచేటట్లు మీకు చివాట్లు పెట్టేడని ఎవ రెరుగరు? ఇక రోగాలు నిర్ణయించే ఉద్యోగం మానుకో వలసినదని మిమ్మల్ని అతగాడు హెచ్చరించాడట, కాదా? సర్కారువారికి మిమ్మల్ని గురించి ఫిర్యాదుచేస్తా నన్నాడట కాదా? మిమ్మల్ని కోర్టులోకి బరబర ఈడుస్తా నన్నాడట కదా? కాలి జోడు తీశాడని మాటల సందున శశి చెప్పివేశాడు. తెగుల్లు

గురించి ఏమేమో అవాకులూ, చెవాకులూ అఘోరించారట, మీరు? పెద్ద పెద్ద పరీక్షల్లో నెగ్గి పెద్ద పాగాలు ధరించిన వారిసంఖ్య పెరిగిపోతూ ఉంటే ఈ పాత ఘోషలో పడిపోవడం మీకు తగినపని అని ఎవరంటారు? ఆ ముసలిది మీ చేతిలోని రోగి. డాక్టర్లు ఆమెకేమీ చెయ్యలేక పోయారు. మిమ్మల్ని పిలిచేందుకు వచ్చేడు శశి. వాడి తప్పేముంది?"

జీవన డాక్టరు పెద్దవాడై పోయాడు. ఇల్లాలి మహోపన్యాసం చిత్తగించాడు. మాట్లాడలేక పోయాడు. అతడు చెప్పగలిగేదేముంది? కథ తలక్రిందులై పోయింది. మరి వైద్యశాస్త్రమా? చప్పు చప్పున ముందుకు ఉరుకులెత్తింది. అతడు వెనుక పడిపోయాడు. వెనుకటి వైద్యవృత్తిలో అతడు అందె వేసిన చేయి. రోగం నిర్ణయించడంలో అత డెన్నడైనా పప్పులో అడుగు వేశాడని చెప్పగలిగిన వారెవరు? నిజానికి ఆ కమ్మరి అవ్వ పరలోకానికి వేంచేయవలసి యుండెను. తగిలిన దెబ్బవలన టపాకట్టవలసిన బాధ్యత ఆమెపై ఉంది. కాని ఆమె ఆ బాధ్యత తీర్చుకో లేదు. ఈ కాలంలో తలయెత్తిన సర్జరీ పద్ధతి, ఎక్సరేలు వగైరాలు వాని వినికిడిలో పడలేదని బ్రహ్మదేవుడు చెప్పగలడా? చేతినిండా డబ్బుంచుకోక వాని ఊసెత్తడం పొసగుతుందా?

వాని జోలికి అతడు వెళ్లకపోవడం తప్పా? మరొక మాట - ఆ ముసలిది ఇప్పట్లో వెళ్లిపోవడమే సుఖంగా వెళ్లిపోవడం అనిపించుకొనేది. చాలా హుందాగా పోవడం అయ్యేది. చక్కగా, స్వేచ్ఛగా పోయి ఉంటే 'ఓహో!, అనిపించుకొనేది. కాని ఆ అవ్వ మొండి ఘటమై పోయింది. గట్టి పిండమై కూర్చుంది. అతగాడి నాన్న అనేవాడు కదా!

తండ్రిగారి మాటలు తలపునకు తెచ్చుకొనేందుకు అతనికి అవకాశం చిక్క లేదు. వెలుపలినుండి ఎవరో "డాక్టరు బాబూ!" అని అరచినారు.

డాక్టరు ఉలికిపడి లేచి కూర్చున్నాడు. అమ్మవారు కూడ లేచి కూర్చుంది. నవగ్రామ వాసి అయిన కిశోరుని కంఠస్వరం వినవచ్చింది. దంపతుల ముఖములు ప్రసన్నములైనవి. రాత్రివేళ ఎడతెగని వాన కురిసిన పిదప గోచరించు ప్రసన్న శరత్ ప్రభాతము వలె కిశోరుడు సాక్షాత్కరించాడు. వానిది ముదిరిన వయసు అయి నప్పటికీ, కిశోరుడే అని చెప్పాలి. నలభై మీద ఏడేళ్లు దాటేవరకు రాజనైతిక సేవ కుడై అతడు సమాజ సేవకుడై ఉండేవాడు. ఇపుడా ఉద్యోగానికి తిల తర్పణాలు విడిచి చప్పున హోమియోపతిక్ డాక్టరై పాపం రోగులను వెతుకుతూ పోతున్నాడు.

బ్రతుకులో పరోపకారపారీణు డనిపించుకొన్నాడు. వెనుకటి అభ్యాసం వదులుకో లేకపోయినాడు. లోకులు మాత్రం అతగాణ్ణి వదులుతారా? జీవన డాక్టరు జీవన చరిత్రలో అతడొక అధ్యాయమై పోయాడు. అతని జీవితంలో పెద్దతావును అతడు అలంకరించాడు.

"డాక్టరు బాబూ!" అని మళ్లీ కేక వినిపించింది.

"పలకండి. లోపలికి రమ్మనండి" అని మృదువుగా ఇల్లాలు మగనితో పలికింది. మరి ఆతని మాటకై తడయక ఆమె మిద్దెమీద నుండి లోపలికి చప్పు చప్పున దిగి "రా! నాయనా! లోనికి రా!" అన్నది.

వచ్చినవాడు మిగుల ముతుక ఖద్దరుబట్టలు కట్టుకున్నాడు. పంజాబీ జుబ్బా ధరించాడు. బుజంపై కండువా. చాల కాలమునుండి కిశోరుడు ఈరీతి దుస్తులే ధరిస్తున్నాడు. ఎప్పుడూ అతడు ఉల్లాసంగా ఉంటూ ఉంటాడు. తొట్రుపాటెరుగని శాంతమూర్తి, మంచి రూపవంతుడు. అతి దేశకం బట్టలు కట్టితేం గాక, వాని రూపం కన్ను కుట్టూతూ ఉంటుంది. కర్మరుడు. ఒంట్లో సత్తువ గలవాడు. సరళ ప్రదీప్త చిత్తుడు. అతడు లోపల ప్రవేశించిన తోడనే గృహం కలకలలాడి పోతుంది. ఉత్సాహతరంగాలతో నిండిపోతుంది.

కిశోరుడు లోపల ప్రవేశించి నేలపై చతికిలపడినాడు. ఇక ఏ పీఠికలోనికి దిగక "డాక్టరు బాబూ! మీరొక పర్యాయం లేచి, బయటికి రావాలి" అన్నాడు

కూర్చునేందుకు అమ్మవారు ఒక పీటవేసి "క్రింద చతికిల పడ్డావేం? లేచి పీటపై కూర్చో కిశోరూ?" అన్నది.

డాక్టరు నవ్వి "అశోక మహారాజ్ మట్టిమీద కూర్చొని రాజా అయిపోయినాడు. నేలపై కూర్చుని కిశోరుడు మహారాజు కాకపోయినా, మినిస్టరు అవుతాడు. ఏమంటావు కిశోరూ?" అన్నాడు.

కిశోరుడు చేతులు జోడించి "మంత్రిత్వం మాట దేవు డెరుగును, డాక్టరు బాబూ! వయసు బాగా ముదిరి పోయింది. అయినప్పటికీ పెళ్లిచేసుకోవాలనే బుద్ధి బుర్రలో ప్రవేశించి, గట్టిగా తిష్ఠ వేసుకొంది. శని దశలో పడిపోవాలన్నా, వెను కాడను. ప్రస్తుతం ఈ విషయం అలా ఉంచండి. ఇప్పుడు మీరు చప్పున లేచి రావాలి" అన్నాడు.

వాని కంఠస్వరంలో ఉత్కంఠ ఉబుకుతోంది. ఏదో పరిహాసం కోసం అతడు మాట్లాడుతున్నాడనేందుకు వీలు లేదు.

"ఏమయింది? ఎక్కడికి పోవాలి?"

"మీ రిపుడే లేచిరావాలి. హెడ్‌మాస్టరు రతన్ బాబు కొడుకు బిపిన్ మంచం పట్టేడు. వేళ మించనీయక మీరొకసారి వచ్చితీరాలి."

డాక్టరుకు ఆశ్చర్యం కలిగింది. రతన్‌బాబు వృద్ధుడు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనిన హెడ్‌మాస్టరు. దృఢ చరిత్ర గలవాడు. బిపిన్ తండ్రికి తగిన కొడుకు. మంచి గుణం కలవాడు. లబ్ధప్రతిష్ఠుడైన వకీలు. కొంతకాలం నుండి అతడు రక్తపుపోటుతో బాధపడుతున్నాడు. రోగం గడ్డుస్థితిలో పడగానే, చికిత్సకై కలకత్తా పోయినాడు. కొంతకాలం అందుండి మందు పుచ్చుకొని సొంతఊరుకు వచ్చి, విశ్రాంతి తీసికొంటున్నాడు. ఈ రోగానికి విశ్రాంతియే దొడ్డ మందని అన్నారు కొందరు బుద్ధిమంతులు. నవగ్రామంలోని డాక్టర్ హరేన్ చట్టోపాధ్యాయుడు వానితో కలకత్తా పోయినాడు. అచ్చటి పెద్ద డాక్టర్ల వైద్య విధి తెలుసుకొని, దానినిబట్టి నవగ్రామంలో చికిత్స చేస్తున్నాడు. ఇప్పు డేమయిందో కాని కిశోరుడు పరుగు పరుగున వచ్చి జీవన డాక్టరును తీసుకొని పోవాలని పట్టు పట్టుతున్నాడు.

"నడవండి. త్రోవలో పోతూ, పోతూ సంగతి చెపుతాను" అన్నాడు కిశోర్.

రోగి విషయం చెప్పుకొని పోతున్నాడు. త్రోవలో నడుస్తూ నడుస్తూ ఉండగా కథ సాగిపోతోంది.

కలకత్తాలోని పెద్ద డాక్టరు రక్తపుపోటు తగ్గించేందుకై, రక్తం తీసి పరీక్ష చేశాడు. మూత్రాశయంలో దోషం అగపడింది. గ్లూకోస్ ఇంజెక్షన్ ఇచ్చాడు పెద్ద డాక్టరు. అది ప్రధాన చికిత్స. దీనితో ఎన్నెన్నో ఔషధాలు రోగి శరీరంలో ప్రవేశించాయి. వాటి నన్నిటినీ సేవించడం వల్ల కలకత్తాలో రోగం అణిగింది. రోగి ఇంటికి తిరిగి వచ్చాడు. హరేన్ డాక్టరు ఆశ పుట్టించాడు. పెద్ద డాక్టరు కూడ అనుకూలంగానే మాట్లాడి ఆతగాణ్ణి ఇంటికి పంపివేశాడు. కాని ఇంటికి అతడు తిరిగి రాగానే వ్యాధి భయంకరంగా తిరుగ బెట్టింది. విడ్డూరపు చిహ్నమొకటి అగపడింది రోగికి మిక్కుటంగా ఎక్కిళ్లు వస్తున్నాయి. ఐదురోజులనుండి ఒకే మోస్తరుగా

పెచ్చిల్లిపోతున్నాయి. ఆసుపత్రి డాక్టరు ప్రద్యోత మహాశయుని కూడ పిలిపించి చూపించారు రోగిని. కాని ఏ డాక్టరు ఏ మందు పోసినా గుణం అగపడలేదు. చెప్పదగిన విషయం ఏమంటే నాడి ఇంకా అందుతోంది. ఇక గుండె స్థితి అంటారా దడదడ కొట్టుకొంటూ ఉంది. అది నిలిచిపోయిందనేందుకు దాఖలా అగపడలేదు. కాని ఆగిపోవాలంటే ఎంతసేపు పట్టాలి? నిన్న నేను హోమియోపతిక్ ఔషధం ఇచ్చాను. దానివలన గుండె ఆగిపోలేదు. నా వైద్యంవల్ల లాభం ఏమీ అగపడలేదు. అందుచే మీకొసం వగర్చుకొంటూ పరుగెత్తుకొని వచ్చాను."

ప్రద్యోత డాక్టరు పేరు విని జీవన డాక్టర్ హుషారుతో "ఆతడు పేరుపడ్డ ఆసుపత్రి డాక్టరు కాడా? అంతవాడూ ఏమీ చెయ్యలేక పోయినాడు? మరి హరేన్ డాక్టరు ఉన్నాడుకదా! ఆతగాడి సలహా తీసుకొన్నారు కదా!" అన్నాడు.

కిశోరుడు జీవనంగారి దిక్కుగా తిరిగి, "డాక్టరు బాబూ! ప్రద్యోత డాక్టరు పేరు విన్నాను. మనిషైతే చెడ్డవాడు కాడు. మంచివాడనే నా ఊహ. కాని వాని ధోరణిలో మర్యాదకు చోటులేదు" అన్నాడు.

"ఇపుడు మర్యాదకు, అమర్యాదకు చోటు లేదు. వాని మాటెత్తకు. ఇపుడు సత్యాసత్యముల విషయం తేలిపోవాలి. నాడీ పరీక్షచేసి నేను చేసే వైద్యం వైద్యం కాదని ప్రద్యోత డాక్టరు హుంకరించాడు. నన్ను తీవ్రంగా దుయ్యపట్టినాడు. విషయం అలా ఉంచు. ఇపుడు నా మాటకు జవాబు చెప్పు." అంటూ జీవన డాక్టరు నడుస్తూ నడుస్తూ తెరువులో తటాలున నిలబడిపోయినాడు. కిశోరుడు ఇంచుక ఆశ్చర్యపడి డాక్టరువైపు తొంగి చూశాడు.

జీవన డాక్టరు "కిశోరా! నీవు నాకు యావత్తు విషయం విప్పి చెప్పు. నీవు అందరి సమ్మతిపొంది నా దగ్గరకు వచ్చావా? లేక నీ సొంత బుద్ధిని బట్టి వచ్చావా? నీ అంతకు నీవు ఎగిరెగిరి పడుతూ ఉంటావు. నీకీ తెగులుంది. డబ్బున్న వారికి డబ్బు తెగులు ఎంత దొడ్డదై ఉంటుందో, నీలో ఈ రీతిగా విజృంభించడం పెద్ద జాడ్యమై చెలరేగుతూ ఉంటుంది. ఏదో ఉపకారం లభిస్తుందనే ఆశతో ఇతరుల విషయాల్లో తల దూరుస్తూ ఉంటావు. ఇట్టి మనిషికి ఒరుల వ్యవహారాలను తలక్రిందులు చేసే అధికారం ఉంటుంది." అన్నాడు.

కిశోరుడు చిరునవ్వుతో "డాక్టరు బాబూ! ఈ అవసాన సమయంలో అనుమానం తెచ్చి పెట్టుకుంటున్నారా? అనుమానమూ అభిమానమూ అన్నదమ్ములు" అన్నాడు.

"ఇది నా సహజ లక్షణం. దీనిని విడిచి పెట్టలేను. నువ్వు నన్ను ఎప్పు డెప్పుడు ఎక్కడెక్కడకు రమ్మన్నా హుటాహుటి వచ్చాను. కాని ఇపుడు నీ పిలుపును బట్టి నేను రాలేను."

"డాక్టరు బాబూ! నేనొక్కణ్ణే మిమ్మల్ని పిలవడం లేదు. రోగి తండ్రియే నా చేతులు పట్టుకొని, ప్రాధేయ పూర్వకంగా చెప్పి నన్ను నీ వద్దకు పంపినాడు. జీవన డాక్టరు నాడి చూస్తే సంతృప్తి పడతాను అని అత డన్నాడు."

"ఇంకా అత డిట్లన్నాడు. అనిశ్చిత మనస్సుతో ఊగిస లాడలేను. నాకీ గుండె దుడుకేల? నిజమేమో జీవన డాక్టరు చెప్పి వేస్తాడు"

జీవన డాక్టరు ఆంతరంగికముగ ఇంచుక విచలితుడైనాడు. వృద్ధుడైన రతన్ బాబు ఇంచుమించుగ అతనికి సమవయస్కుడు. రెండేళ్లు మాత్రం అతని కంటె చిన్నవాడు. అతనికంటె ఒకే ఒక క్రింద తరగతిలో చదువుతూ ఉండే వాడు. ఏ యేట జీవన డాక్టరు కాందీ పాఠశాలనుంచి, భూపీ బోసు ముక్కు చితుకగొట్టి, పారిపోయి వచ్చినాడో ఆ యేట రతన్ ఎన్ట్రెన్స్‌లోకి వచ్చాడు. చప్పున ఉద్యోగం చిక్క బట్టినాడు. ధీర ప్రకృతి గల వ్యక్తి అతడు. బూటకపు కబురు పంపు వా డాతడు కాదు. 'తనచే కొడుకు నాడి చూపించి, బెంగ లేకుండ ఉండవలెనని అత డూహించి అంటాడు' అని జీవన డాక్టరు తలపోసినాడు.

నిజము చెప్పవలెననిన ఈ యోచన కిపుడు తావు ఉండనే కూడదు. రతన్ బాబు ఏకైక పుత్రుని మృత్యువు విషయం మూడు నెలలకు మున్నే జీవన డాక్టరు నాడీ పరీక్షవలన తెలుసుకొన్నాడు. తెలుసుకొని ఊరుకో లేదు, కంఠ మెత్తి ఘోషించాడు! ఇపుడు?

"ఎలా ఉంది? ఏమి తెలిసింది?" అని రతన్ బాబు మృదుస్వరంతో ప్రశ్నించాడు. అది కంపించలేదు.

చేతులు కడుగుకొని జీవనడాక్టరు లేచి, నిలిచి, "ఎక్కిళ్ళకోసం ఆ దుర్భా పడనక్కర లేదు. రెండు రోజుల్లో ఎక్కడి ఎక్కిళ్ళు అక్కడికి పోతవి" అని అతడన్నాడు.

రతన్ బాబు సుమారు ఎనభై ఏళ్ళు కడచినవాడు. అయినప్పటికీ తిన్నగా నడువ గలడు. స్పష్టంగా పలుక గలడు. ఇంతలో వాని నడుము వంగునవి

చెప్పేందుకు వీల్లేదు. వాని శరీరము బరువైనది కాదు. శుష్కమైనది. సులభంగా వాని కంటికి నీరు రాదు. చూపు విషణ్ణమైనను స్థిరమైనది. అతడు యౌవనంలో ఉన్నప్పుడు ముప్పైఏళ్ళ ప్రాయంలో వానికి పత్నీవియోగం సంభవించింది.

అప్పటినుండి స్వయంపాకం సాగిస్తూ, కేవలం శాకాహారమునే పుచ్చుకుంటున్నాడు. కుమారుని అల్లారు ముద్దుగా పెంచి పెద్దవానిని చేసినాడు. అతడు ఆదర్శ వాది. నీతి పరాయణుడు.

"కేవలం ఎక్కువ్కమాటే నే నడుగ లేదు. నే నడిగిన ప్రశ్న నీకు బోధ పడలేదా?" అని డాక్టరును ప్రశ్నించాడు.

"బోధ పడింది. కాని...."

"కాని అనే పదం నీవు నాకు వినిపించ నక్కరలేదు. చెప్పదగిన దానివి స్పష్టంగా చెప్పి వెయ్యి. ఆతురపాటుతో నా మనస్సు చీల్చుకొని పోతోంది."

డాక్టరు నేలపై చూపు నిలిపి నిలబడ్డాడు.

"జీవన్, మాట్లాడవేమి?"

"ఆలోచిస్తున్నాను."

"ఆలోచింపకము. ఇక్కట్టులో దిగబడిన వానికి మృత్యువు ఆనంద దాయకమే కదా?

డాక్టరు చకితుడైనాడు. గత కాలమందలి వాని అనుభూతి యావత్తూ ఒక్క ముహూర్తంలో దాని స్మృతి పథంలో తళ్కొత్తింది. నాడీ పరీక్షలో అతనికి గురువై ఉండిన వాడు ఈ మాటనే చెప్పి యుండెను.

అయితే బ్రతుకు, లేకపోతే చావు. దుర్దశలో క్రుంగినవానికి మృత్యువు సుఖదాయకమే!

స్మృతి స్రవంతిలో మునిగి పోయినాడు డాక్టరు. ఆతని తండ్రి జగత్ మహాశయుడే వాని గురువు. పొడుం పీల్చుతూ ఆవేశంతో అతడు ఉపన్యాసం సాగించేవాడు. కంఠమైతే బొంగురుగా ఉండేది. అతని మాటలు జీవన డాక్టరు గుండెలో ప్రతిధ్వనించినపుడు వర్షమేఘం వలన పులకిత మగునట్లు ఆతడు పులకిత గాత్రు డగుచుండేవాడు,

తండ్రి మాట లివి. "బాబూ! ఇందు రెండు తత్వము లున్నవి. ఇహాపర ములను గురించిన తత్వము లివి. పరమానందస్వరూపు డెవ్వరో అతడే నాకు మానవుడు, నా ఇష్టదేవత."

"ధ్యానయోగంలో సిద్ధుడైన చికిత్సకుడు గభీరమైన ఏకాగ్రతలో మునిగి, తన్మయుడై యుండి నాడిని పరీక్షించునపుడు జీవన మృత్యువుల యుద్ధము బ్రహ్మాండముయొక్క చిరంతన లీలయై గోచరిస్తుంది. సూర్యు డస్తమిస్తున్నట్లు తోస్తుంది. సుర్యోదయ సూర్యాస్తమయముల ఆనంద మొక్కటే. అవి వేరు కావు."

స్మృతిధునిలో డాక్టరు కొట్టుకొని పోతున్నాడు. "జీవన్" అని రతన్ బాబు పిలిచినాడు.

డాక్టరు సచేతనుడై నిలిచి, రతన్ బాబు మొగము చూచి కంపితకాయ ముతో "అటువంటి లక్షణము ఇంకా నాకు అగపడలేదు. అయినప్పటికీ"— అన్నాడు.

"అయినప్పటికీ అంటే? బాబూ సంశయం ఎందుకు?" అని ఒక రీతి చిరునవ్వుతో రతన్ బాబు అన్నాడు. ఆ నవ్వు విషణ్ణ కరుణభావములతో నిండి ఉన్నది. ఆ నవ్వుమ్రోల నిలుచుట మిగుల కఠినము. మొగమెత్తి కంటిలో కన్నుంచి, బూటకపు సాంత్వనము ఇచ్చుట పొసగదు. తల వంచి మరి మాట్లాడ వలెను. జీవన డాక్టరు అతనితో అబద్ధము చెప్పుటకు ఇష్టపడలేదు. ఏది యథార్థమో దానినే చెప్పదలచినాడు, అందుచే అతడు తల వంచుకొనలేదు. ఇట్లన్నాడు. "ఈ రోగము హటాత్తుగా గడ్డు జాడ్యమై పోతుంది. మెల్లమెల్లగా తప్పటడుగులు వేసే తెగులు కాదు. ఆకస్మికంగా ఎందుకు చెలరేగుతుందో చెప్పడం కష్టమే! దైహికముగనో, మానసికముగనో ఏదో పెద్ద దెబ్బ తగలడంవల్ల తుది ముహూర్తం భయంకరమై సాక్షాత్కరిస్తుంది. ఇది తధ్యము, ఇట్లని నే నెరుగుదును".

"అటులనా?"

"రతన్! ఇంక విశేషించి నేను చెప్పవలసిన దేమీ లేదు. జాడ్యం ఇప్పుడు పదహారణాల నిండురూపం దాల్చింది. అయినప్పటికీ ఇది సాధ్యాతీత మైనదని రాయి గుద్ది చెప్పలేను. దుస్సాధ్యమైతే కావచ్చు. అసాధ్యమని నోరు తెరచి చెప్పలేను. కాని ఈ రోగ లక్షణమునుబట్టి ఏ ముహూర్తంలోనైనా అసాధ్యమై

పోవచ్చు. భగవంతుని దయమాత్రం కలుగవలెను. ఆ దయను పడయుటకు మీ తండ్రి కొడుకులకు నిండు హక్కు కలదు."

"ఆ దయపై ఎవరికైనా హక్కు కలదు కదా!"

జీవన డాక్టరు చతికిలపడ్డాడు.

"నీవు ఎక్కిళ్ళు కట్టివెయ్యి."

"నా వైద్యానికి పెద్ద డాక్టర్ల అభ్యంతరం ఉండదు కదా! ఆలోపతిక్ చికిత్సకంటె నా చికిత్స దొడ్డదని చెప్పలేను. కౌలిక వైద్యపద్ధతిని బట్టి నేను ఔషధ మిస్తాను."

హరేన్ డాక్టరు వచ్చి ప్రక్కనే నిలబడి ఉన్నాడు. అత డిట్లన్నాడు. "మేము ఔషధం ఇస్తే మీ కెట్టి అభ్యంతరం ఉండదు కదా! అవసరమైతే ఒకటి రెండు ఇంజెక్షనులు ఇస్తాం; గ్లూకోస్ ఇస్తాం. నిద్రకు చాలా ఇంజెక్షనులు ఇచ్చినప్పటికీ, రోగికి నిద్రపట్టదు. నెత్తుటిపోటు ఎక్కువైతే, దానిని తగ్గించేం దుకు మందు ఇచ్చి తీరాలి. మరొక మాట."

హరేన్ డాక్టరు చప్పున ఊరుకొన్నాడు. మరల అతడు తన కథనం సాగించాడు. "నూరు చెప్పండి, వెయ్యి చెప్పండి. రోగి ఈ ఊరిబిడ్డ. జీవన డాక్టరుపై వానికి భక్తి విశ్వాస శ్రద్ధలు మెండుగా ఉన్నవి. ఈయన నూరి పోసిన మందులను రోగి మిక్కుటంగా మ్రింగి ఉన్నాడు. ఇపుడు కూడ జీవన డాక్టరు పరంగా ఒకటి రెండు మాత్రలను రోగి మ్రింగడం మంచిది. మా మందుల కంటె ఈయన మందులు ఎక్కువ పని చేస్తాయి."

ఆనాడు ప్రద్యోత డాక్టరుతో రోగ నిర్ణయంగురించి హరేన్ ఏమేమో చెప్పి నాడు. ఏమి చెప్పిననేమి? జీవన డాక్టరు నాడిని పరీక్షించి రోగమును నిరూపించిన యెడల రక్తమును, మలమూత్రములను పరీక్షింపకయే వైద్యం సాగించవచ్చునని అతని ఊహ. కాని అట్లని అతడు చెప్పలేదు.

"నీ ఊహ చెప్పు" అన్నాడు జీవన్.

"మీతో నే నేమీ చెప్ప నక్కరలేదు. అయినను క్షమిన్నించండి" అని హరేన్ ఊరుకొన్నాడు.

జీవన డాక్టరు మనస్సులో కొంత కడుపుమంట లేకపోలేదు. ప్రద్యోత డాక్టరు ముఖము స్మరణకు వచ్చింది. ఇద్దరూ ఒకే కాలంలో పుట్టినవారు. ఇంచు మించుగా ఇరువురూ ఒకే సమయంలో తమతమ పరీక్షల్లో నెగ్గినారు. చాలకాలపు పరిచయం బలమై ఉండడంవల్ల ప్రద్యోత డాక్టరు వెళ్ళగ్రక్కిన ఊహలను పూర్వ పక్షం చెయ్యడం పొసగదు. ఉపదేశం చేసినట్లుగా వాని అభిప్రాయములను కాదన వచ్చును. అలోపతిక్ పద్ధతిని గురించి తన అభిప్రాయములను వ్యక్తీకరింప వచ్చును కదా!

"హారేన్! నీవు ఏమి చెప్పదలచావో చెప్పివెయ్యి" అన్నాడు జీవన డాక్టరు.

"మా దృష్టి హార్టు మీదా, కిడ్నీ మీదా ఉంది. ఈ దృష్టిని బట్టి ఔషధం ఇస్తున్నాం. నల్లమందుతో తయారైన ఔషధంవల్ల ఎక్కిళ్లు ఆగిపోవచ్చు. అయి నప్పటికీ హార్టుపై చూపుంచి, ఆ ఔషధం మే మియ్యలేదు. ప్రిస్క్రిప్షను మీరు చూచి ఉన్నారు కదా!

"నా ఔషధంవల్ల గుండెకు ఎట్టి ధక్కా తగులదు. హారేన్! నల్లమందు వాసనగల ఎట్టి ఔషధమును నే నియ్యబోను. ఈవిషయంలో నీవు నిశ్చింతుడవై ఉండుము."

# పదవ ప్రకరణము

డాక్టరు వడిగా నడక సాగించాడు. మనస్సులో ఉత్సాహం సుడిగాలివలె ప్రకోపించుతూ ఉంది. ఏమి ఔషధం ఇవ్వాలో అంతరంగంలో నిర్ణయించుకొన్నాడు. మందు అతగాడు సొంతంగా తయారుచేయాలి. ఇచ్చట చేతికి దొరికిన సామగ్రులను చిక్కబట్టి ఔషధం తయారుచేయాలి. అలా అని అతడు వారితో చెప్పరాదు. సులభంగా దొరికే వస్తువులపై ప్రజలకు మోజు ఉంటుందా? గచ్చాకు కావచ్చు పుచ్చాకు కావచ్చు. మందు తయారయ్యే విధానం అతడు చెప్పివేయరాదు. రోగి ఎక్కిళ్లు తగ్గిపోగానే, తన అమోఘమైన వస్తువుల వల్లనే అవి పోయినవని ప్రజలు తెలుసుకోగలుగుతారు. నడుస్తూ నడుస్తూ అతడు తటాలున నిలిచిపోయినాడు. సమీపంలో ఉన్న పాతరోగిని చూచి పోవాలని అనుకొన్నాడు. పరధ్యానంలో పడిపోయి, అతడు కొన్ని అడుగులు వెళ్లవలసిన గల్లీనుండి ముందుకు పోయాడు. ముసలి రోగి జ్వరం మళ్లీ ఉంటుంది. వెనకవైపు అరుగుపై కూర్చుని అతడు హుక్కా గొట్టము నోట బెట్టుతున్నాడు. మర్నాడు వచ్చి వానిని చూడవచ్చునని అనుకున్నాడు. ఇపుడు చప్పుచప్పున ఇంటికి పోయి ఔషధం తయారు చెయ్యడం తన తక్షణ కర్తవ్య మని అతడు తలపోసినాడు.

"జీవన డాక్టరుగారూ! డాక్టరుగారూ!" అని ఎవరో వెనుకనుండి కేక వేశారు. కేక సమీపమందలి సందులోనుంచి వచ్చింది. అది ఆడుదాని స్వరము.

"వినండి, వినండి. నిలవండి, నిలవండి."

జీవన మహాశయుడు నిలిచినాడు. గల్లీలోనుండి ఒక ప్రౌఢ విధవ వెలుపలికి వచ్చింది. నవగ్రామంలో ఉండి గౌరవ ప్రపత్తులు సంపాదించుకొంటున్న ఒక బ్రాహ్మణ స్త్రీ ఆమె. గ్రామంలోని కొంటె పిల్లవాండ్రు "మిసెస్ షెరిఫ్ ఆఫ్ నవగ్రామ్" అని ఆమెను పిలుస్తూ ఉంటారు. గ్రామంలో ఆమెకు ఎంతో పలుకుబడి ఉంది.

జీవన డాక్టరు ముందుకు వచ్చి ఆమె "మీరు రతన్‌బాబు కొడుకును చూచి ఉంటారు. అతని కథ ఎలా ఉంది?" అని అడిగింది.

ఏమి చెప్పాలో ఆతనికి తెలియలేదు. ఆమె ద్వారా ఆ ప్రాంతమందలి ప్రజలు సలహా సంప్రతింపులు పొందుతూ ఉంటారు. ఆమె 'దిన పత్రిక' వంటి మనిషి.

"రోగం గడ్డు రోగం. అనుమానం లేదు. సులభంగా వదిలే తెగులు వలె కన పడడంలేదు. ఔషధం చేతబుచ్చుకుపోవాలి."

"అయితే ఈ గుజ్జుపు స్వారి ఏలా? కొంచెం నిలబడండి!"

"అమ్మా! ఆలస్యం చేయక మందు ఇవ్వాలి."

"అలా అని నాకు బోధపడింది. మీకోసం పరుగు పరుగున కొందరు వస్తున్నారు. మించిపోయిన కేసొకటి ఉంది. మా మామయ్య తోడల్లుడు కూతురు చాలా బాధపడుతోంది. ఆమె కడుపునొప్పి ఏమీ తగ్గలేదు. ఒక పర్యాయం వచ్చి ఆమెను చూచిపొండి, ఈ ప్రక్క డాక్టర్లకై దోసెడు రూపాయలు ఖర్చుపెట్టేము. ఏమీ ప్రయోజనం కలగలేదు. మీరు మమ్మలిని విడిచిపెట్టరాదు. (ఎవరినో ఉద్దేశించి) ఒరే! సిహారూ! చప్పున రా! డాక్టరుగారు పోతున్నారు"

"ఎవరినీ పిలువ నక్కరలేదు. నడువుము. వచ్చి రోగిని చూస్తాను. ఐదు నిమిషాలలో కేసు సంగతి కనుక్కొంటాను." ఇంటిలో ప్రవేశించి, నిశీ బ్రాహ్మణి త్రోవ కడ్డముగా నిలిచి, "రతన్ మేష్టారు కొడుకు బ్రతుకుతాడో బ్రతుకడో సరిగా చెప్పండి" అన్నది.

ఆమె స్వభావం ఏమో డాక్టరు బాగా ఎరుగును. జగతిలో ఏమి జరుగుతుందో ఆమెకు తెలిసిపోవాలి. తెలుసుకొనే వరకు ఆమె ఊరుకోదు. ప్రచారం చేస్తుంది. ఆమె దండోరాతో లోకం మ్రోగిపోతుంది. అంత పని జరిగిన గాని ఆమెకు తృప్తి కలుగదు.

"అమ్మీ! నే నేమీ మరుగుపరచి నీతో చెప్పడం లేదు. నాడివలన నాకేమీ బోధపడలేదు."

"మీరు జీవన డాక్టరుగారు. మీకు బోధపడక పోవడం ఏమిటి? మీరు రోగి నాడి పట్టుకొని చూస్తే మృత్యుకాంత రోగికయ్యకు ఎంతదూరంలో ఉందో ఢంకా మీద దెబ్బకొట్టి చెపుతారని లోకులు చెప్పుకొంటూ ఉంటారు. అసలు సంగతిని మీరు దాచుకుతున్నారు."

డాక్టరు కనుబొమలు ముడిచాడు. "అయితే ఇప్పటి కేసేమిటి?" అని అడిగాడు.

నిశి ఉలికి పడింది. "నీహారూ! ఎక్కడున్నావు?" అని పిలిచింది.

"ఏమిటి అత్తయ్యా?" అని లోపలినుండి నీహారు ప్రత్యుత్తర మిచ్చింది కొంచెం తలుపు తెరచి ఇంటిలోనుండి తొంగి చూచింది బాలిక. ఊరగాయ వాసన లోపలినుండి గుప్పున వచ్చి జీవన డాక్టరు ముక్కు పట్టివేసింది. పిల్ల లోపల దాగి, ఊరగాయ మెక్కుతూ ఉంది. కడుపు నొప్పితో, రక్త విరేచనములతో బాధ పడు రోగికి ఊరగాయ మందైనది. అందలి ఊట అనుపానము! రోగం దుస్సాధ్యమై పోయింది. ఆమె నోరు కట్టుట బ్రహ్మాదులకు సాధ్యము కాలేదు.

బాలిక బయటకు వచ్చింది. ఆమె శరీరము శీర్ణమై, జీర్ణమై ఉన్నది. ఎముకలప్రోగే అని తోస్తోంది. దేహవర్ణం అతశీకుసుమం వలె ఉంది. కేవలము కిశోరి! తలమీది పాపిటలో సిందూర తిలకం. వయసులో బాలికయే, కాని పిల్లల తల్లి యైనది. ఆమెను చూచి జీవన మహాశయుడు చకితుడైనాడు. సర్వాంగములు కంపించినట్లైనవి.

"గర్భంలో సూతికారోగం అగపడింది, డాక్టరుగారూ! ఈమెకు ఇద్దరు బిడ్డలు పుట్టినారు. చంటి గుడ్లు ఏమైపోతారో! తలచుకొంటే గుండెలు దడదడ లాడిపోతున్నాయి." అంటూ నిశి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఇద్దరు బిడ్డలా? అయితే ఈమె వయస్సెంత?"

"బాబూ! పద్నాలుగేళ్లండి."

"పద్నాలుగేళ్లకు ఇద్దరు పిల్లలా?" అని అచ్చెరుపాటుతో, తొట్రుపాటుతో ప్రశ్నించాడు డాక్టరు.

కళ్లు మూసికొని, నిమిషములో తెప్పిరిలి నిశి ఇట్లన్నది. "పిల్ల దానికి పన్నెండేళ్లు నిండేటప్పటికి మొదటి బిడ్డ పుట్టింది. చప్పు చప్పున మళ్లీ కానుపు వచ్చింది, పద్నాలుగేళ్లు నిండీ నిండక ముందు రెండవ పిల్లవాడు పుట్టుకువచ్చాడు. నెలవంకలా ఉన్నాడు. కేవలం చంద్రుడంటే నమ్మండి. ఎలా వర్ణించ మంటారు డాక్టరు గారూ!"

"చంద్రుడు కాడు గింద్రుడు గాడు, వాడు యముడు. కన్న తల్లిని కరచి కరచి తినేందుకు పుట్టినాడు."

జీవన డాక్టరు కడుపులో మంట పుట్టింది. 'ఈ రీతి దురాచారములు ఎన్నడైనా తిన్నబడునా?' అని అతడు మనసులో వాపోయినాడు. అతని తండ్రిమాటలు జ్ఞప్తికి వచ్చినవి. "నాయనా! రోగిని చూచినపుడు ఏకారణం చేతనైన గాని ఆగ్రహింపకుము. అసహ్యించుకొనకుము. మానవుని చేతిలో ఏముంది? విధి చేతిలో అతడు క్రీడా వస్తువు మాత్రమే!'

అలోపతిక్ గురువైన రంగలాల్ డాక్టరు ఇలా చెపుతూ ఉండేవాడు. "మానవుడు ఏ సహాయం లేనివాడు. వాని అంతరంగంలో పశు ప్రవృత్తి విజృంభిస్తూ ఉంటుంది. కామక్రోధ లోభములు చెలరేగుతూ ఉంటాయి. అయినను పశు దేహమునకు గల సహన శక్తి వానికి లేదు. అటువంటి అభాగ్యునిపై కోపగించకుము. ఆగ్రహించే అవకాశం అవశ్యంగా నీకు గలదు. కాని ఈ అధికారం చెలాయించే ఉద్దేశం నీకుంటే వైద్యవృత్తికి నీళ్లు వదలుము."

"ఇన్నాళ్లనుండి ఏం చేస్తున్నావు నిశీ?" అని నిట్టూర్పుతో డాక్టరు అడిగినాడు.

"ఇది చేశాను. అది చేశాను. ఇపుడు సూరిక దాపురించింది. ఇలాంటి గడ్డురోగం వస్తుందని కలలోనైనా అనుకొన్నానా? ఈ డాక్టరుకూ ఆ డాక్టరుకూ చూపించాను. వాళ్లు అనరాని మాటలు అన్నారు. ఎంతో డబ్బు గుంజాలని ఎత్తు వేశారు. నే నెక్కణ్ణుంచి డబ్బు తేగలను?"

"హుం!—" అని డాక్టరు ఊరుకొన్నాడు.

నిశి ప్రసంగం ముగియలేదు. "రక్షరేకులు కట్టేను. దేవుళ్లకూ, దేవతలకూ, అమ్మవార్లకూ మ్రొక్కేను. మ్రొక్కుబడులు చెల్లించాను. మందులకూ, మాకులకూ లోపం చేయలేదు."

విషయం డాక్టరుకు అర్థమయింది. రోగి మెడలో తాయెత్తు వేలాడుతోంది. అది గుడ్డ పేలికతో కట్టబడి ఉంది.

"ఒంటిమీద మంత్ర ప్రయోగం బాగానే సాగింది. డాక్టరు ఏమి చేయగలడు? ఇయ్యగలిగిన ఔషధం ఒకటి కలదు. అది సూచికా భరణము" అన్నాడు జీవన మహాశయుడు.

"ఈ మందు పుచ్చుకొనేటప్పుడు పథ్యపానాదులు బాగా కట్టుదిట్టంగా జరగాలి. ఇందుకు సమ్మతిస్తే వైద్యం ఆరంభిస్తాను. నోరు కట్టితేగాని మందు పనిచెయ్యదు. మీదు మిక్కిలి వికటిస్తుంది." అన్నాడు డాక్టరు.

మాట విని నిశి ఉలికి పడింది. "డాక్టరు గారూ! ఏం సెలవిస్తున్నారు? అంత కట్టుదిట్టంగా ఉండాలా?" అని ప్రశ్నించింది.

"అవును. రోగి నీళ్లు ముట్టనే కూడదు. అమ్మడూ! ఏది చెయ్యి ఒక పర్యాయం చూడనియ్యి. ఇది బ్రతకనిచ్చే రోగం కాదు. ఇద్దరు పిల్లల తల్లి అన్నావు కదా!"

డాక్టరుకు చిరునవ్వు వచ్చింది. మరల విషాద రేఖ అతని ముఖంపై అగ పడింది. అతడు నిట్టూర్పు విడిచినాడు.

విషప్రయోగమే ఏకైక ఉపాయము! విషరోగమునకు విషమే ఔషధము! ఆమె నాడిలో మృత్యుకాంతయొక్క పదధ్వని వినబడుతోంది, అది అతనికి స్పష్టంగా వినబడుతోంది.

"డాక్టరుగారూ! మీది దొడ్డచెయ్యి" అన్నది నిశి. ఆమె అబద్ధమాడలేదు.

ఈ దేశంలోని బాలికలు పాదములకు గజ్జెలు ధరించినట్లు మృత్యుమహిళ గజ్జెలు ధరించి వస్తూ ఉంటుంది. ఆమె సవ్వడి జీవన డాక్టరుకు వినబడి తీరుతుంది. తండ్రినాటినుండి అత డలవరచుకొన్న విద్య అది, తండ్రియే అతని గురువు. నాడీ పరీక్ష విద్యలో అతడు సిద్ధపురుషుడు. పుత్రరత్నము దీక్ష గ్రహించిన నాడు, వ్యాకరణ పాఠము ఆరంభించిన తరువాత ఏ ముహూర్తంలో నాడీ పరీక్ష విద్యలో మొదటి పాఠమును తండ్రి కరపినాడో ఆ ముహూర్తము మిగుల శుభ ముహూర్తము. అది చెప్పదగిన దినము. అక్షయ సంవత్సరంలో వైశాఖమాసము. శుద్ధ తృతీయ దినము.

ఈ ముసలితనంలో కూడ ఆనాటి విషయములన్నీ నిన్నటి సంగతుల వలె వాని స్మృతిపథంలో చెరలాడుతూవున్నవి.

డాక్టరు చల్లగా అవలకు దాటినాడు. నడుస్తూ నడుస్తూ జీవన మహాశయుడు యావత్తు సంగతులను మననం చేసుకొంటున్నాడు.

* * * *

ఎక్కిళ్లను హతమార్చే ఔషధం తయారుచేసి దానిని సేవించే ప్రణాళికను కాగితము మీద వ్రాసి రతన్‌బాబు సేవకుని చేతి కందించి, జీవన డాక్టరు తన ఆయుర్వేద భవనపు అరుగుపై కూర్చుని పెద్ద నిట్టూర్పు విడిచినాడు. నిశిబ్రాహ్మణి విషయమూ, పిల్ల బాలింత విషయమూ వాని మనస్సులో ఉరుకు లెత్తుతున్నవి. గృహ పరిచారిక ఇందిర వచ్చి, హుక్కా అమర్చి బొంత నిలబడింది.

డాక్టరు ఆమె మొగము తేరి చూచినాడు. ఆలోచనాస్రవంతి మరొకదిక్కుగా ప్రవహించింది. రతన్‌బాబు కొడుకు బిపిన్ ఎక్కిళ్ల మాట ఆలోచిస్తున్నాడు. మర్నాటి ఉదయానికి అవి తగ్గుమొహం పడతాయని ఆత డనుకొంటున్నాడు. ప్రద్యోత డాక్టరు అప్పుడేం చెప్పగలడు?

"హుక్కా పీల్చండి. తేనీళ్లు మరగిపోతున్నాయని అమ్మగారు చెబుతున్నారు."

ఆ మాట అర్థం ఇది: ఇక లోపలకు రావలసిందని అమ్మగారి సెలవయింది.

హుక్కా గొట్టం చేత పుచ్చుకొని, "టీ నువ్వు ఇక్కడికి తీసుకొని రా. ఇపుడు నేను లేవలేక పోతున్నాను. ఒళ్లు కదపడం ఇపుడు సాధ్యమయ్యే పని కాదు" అన్నాడు.

"అరుబైట కూర్చుని ఉంటారా? ఆకాశంలో మబ్బు కమ్ముకొని ఉంది. వాన వచ్చి తీరుతుంది."

ఆకాశం వైపు చూచినాడు జీవన డాక్టరు. శ్రావణ మాసపు గగనంలో మొయిళ్ల వరుస తేలుతూ తేలుతూ పోతోంది. దానికెదుట మరికొన్ని కారుమేఘాలు తిరుగుతున్నాయి. ఒక కాదంబినీ మాల పోతోంది; వేరొక జలదమాలిక వస్తోంది. మేఘాల చెరలాటము చూచిన డాక్టరు 'ఇది వట్టి ఆర్భాటమే; వానరాదు' అనుకొన్నాడు.

"వానరాదు. నే నిక్కడే కూర్చుంటాను."అయినప్పటికీ ఇందిర అందుండి కదలలేదు. ఆనాటి ఇంటి ఖర్చుకై పరిచారిక నిలిచి ఉందని ఆతడు గ్రహించాడు.

ప్రతి రోజూ ప్రాక్టీసువల్ల వచ్చే డబ్బును ఇంటికి తిరిగి వచ్చిన వెంటనే ఆతడు ఇంటి ఆమెకు ఇస్తూ ఉంటాడు. ఇది నియమానుసారంగా సాగిపోతూ ఉండే అలవాటు. ఈ రోజుల్లో జీవనడాక్టరు ఇంచుమించుగా ప్రాక్టీసు వదులుకొన్నాడు. ఒకప్పుడు రోజు ఒక్కంటికి ఇరవై, ఇరవై యైదు, ముప్పయి

రూపాయలు జేబులో వేసుకొనివస్తూ ఉండే వాడు. కాని ఆతని ప్రాక్టీసుకు ధక్కా తగిలింది. ఒక్కొక్క రోజున నాలుగు, లేక ఆరు, లేక రెండు జేబులో పడు తున్నాయి. ఒక్కొక్కప్పుడు పిలుపు రానే రాదు. చాల దూరమునుండి పిలుపు వస్తే చాలా ఫీజు ముట్టడం నిజమే! కాని అంత దూరం ఒళ్ళు మోసుకొని ఆతడు పోలేక పోతున్నాడు. ఈ వేళ ఆతని చేతిలో ఉన్నది ఇంచుమించుగా శుద్ధ పూజ్యమే! అమ్మవారికి నైవేద్యం సమర్పించడం ఎలా? పరాన్ కొంపనుండి తిరిగి వచ్చిన పిదప నోటిలో రెండు ముద్దలు వేసుకొన్నాడో లేదో ఇంటిలో రచ్చ రేగి పోయింది. తరువాత కిశోరు వచ్చి రతన్ బాబు కొంపకు తీసికొని పోయినాడు. ఇంటికి తిరిగి వచ్చి కుడితిని తీసివేసి వీధి అరుగుపై కూర్చున్నాడు. తీసిన అంగీని ఇందిర చేతి కందించాడు. "చొక్కా జేబులో ఏమైనా రూపాయలు ఉన్నాయో లేవో చూడు. లేవేమో!"

జేబు తడవి చూచి ఇందిర, "లేకేమి? నాలుగు రూపాయలు ఉన్నాయి" అంది.

"ఈ లెక్క మీ అమ్మగారికియ్యి. ఇక నన్ను డబ్బుకోసం తంటాలు పెట్టకు." అని డాక్టరు పలికినాడు, "హుక్కా గొట్టంలో మరి రెండు గంజాయి బిళ్ళలు వేసిపోతాను."

"మంచిది వేసిపో. నువ్వు వడవడ వాగుతూ ఉంటావు."

ఆకాశం వైపు చూస్తూ చూస్తూ జీవనడాక్టరు మాట్లాడుతున్నాడు. మేఘాల మీదికి ఆతని చూపులు ఉరుకులెత్తుతున్నాయి.

వెంటనే ఇందిర మాటకు చెవులొగ్గుతున్నా డాతడు. ఏమేమో జవాబులు చెపుతూ నోరు మెదపుతున్నాడు. కాని ఆతని మనస్సులో బిపిన్‌యొక్క ఎక్కిళ్లు ప్రతిధ్వనిస్తూ ఉన్నాయి. వ్యాధి ప్రకోపం గుండెలో పిడుగులు పుట్టిస్తూ ఉంది. ప్రఖ్యాత డాక్టరు మాట, నిశిమాట ఆతని చిత్తంలో దిద్దిర తిరుగుతున్నాయి!

జీవన మహాశయుడు ఎంతటివాని నాడి చేత బట్టినా ఎందుండియో "కో!" అని పలుకుతుంది మృత్యుకాంత. పిలుపు వచ్చువరకు ఆమె తడయదు. గజ్జెల చప్పుడు ఆమె ఆగమన వార్తను తెలియజేస్తుంది. "తండ్రి శిక్షణ ఎంత ఘనమయింది." అని లోకులు చెప్పుకుంటూ ఉంటారు.

* * *

వైశాఖ శుద్ధ తృతీయ కదా! నాడీ పరీక్షకై ఏర్పడిన శుభదినం. పుత్రుని దీక్షకై పంచాంగం కలయ వెదకి జగత్ మహాశయుడు ఆ దినం పట్టివేశాడు. ఎవ్వరూ లేని మూలగదిలో ఏకాంతవాసమున కొడుకును దగ్గర కూర్చుండబెట్టుకొని, వాని చైతన్యమును ప్రబుద్ధ మొనరించేందుకై వాని జీవితంలో జ్యోతిని వెలిగించేందుకై తండ్రి నిశ్చయించుకొన్నాడు.

"ఎవ్వరూ మమ్మల్ని పిలువ కూడదు. మా గదిలోనికి తొంగి చూడ కూడదు. ఎట్టి విఘ్నమూ కలిగించ కూడదు. ఇంటిలో ఎవ్వరూ కిక్కురు మన కూడదు." అని అతడు కొంపలోని వారిని హెచ్చరించాడు.

ఆరంభించిన ముహూర్తం మిగుల దొడ్డది. పుత్రరత్నమునకు నాడీ జ్ఞానం అంతో ఇంతో అబ్బేందుకు ఆలస్యం కాలేదు. ఇంట బుట్టిన వైద్యం ఒంట బట్టేందుకై ఎంత ఆలస్యం అవుతుంది? పిన్ననాటి ఆటల్లోనే, పాటల్లోనే జీవనం ప్రాక్టీసు మొదలు పెట్టేడని చెప్పవచ్చు.

తాను వైద్యుని పాత్రధరిస్తూ, తోడిబాలుర నాడులు చూస్తూ ఉండేవాడతడు మట్టితో మాత్రలు చేసి, దుమ్ముతో పొట్లాలు కట్టి "ఇవి అమోఘంగా పని చేస్తాయి" అని వారికి ఇచ్చేవాడు. జీవనం తల్లికి కూడ నాడి చూడడం తెలిసి పోయింది. తొలి పాఠంలో నాడిని గురించిన ఉపదేశం చేసిన నాడే మృత్యుకాంత ఎన్నెన్ని రీతులలో నృత్యం చేస్తుందో చెప్పి వేశాడు. తన ఆయుర్వేద భవనం లోనికి వచ్చిన రోగులను తాను పరీక్షచేసి, వారి వారి చేతులు ఎలా పట్టుకోవాలో, నాడులను ఎలా కనిపెట్టాలో రోగస్థితిని ఎలా తెలిసికోవాలో ప్రత్యక్షంగా క్రియాత్మకంగా తండ్రి కొడుకుకు బోధ చేశాడు. కుమారునిచే కొన్ని నాడులు పట్టి వేయించేవాడు.

నాడీ పరీక్ష చేయించి, సంచికట్టులోనికి ఔషధాలు చేర్చడం విషయంలో ఎలా శ్రద్ధ వహించాలో తండ్రి కొడుకుకు చెప్పివేశాడు. జగద్బంధు మహాశయుని శిక్షణ విధానము సర్వతోముఖమై నడిచింది.

ఆయుర్వేదభవనం లోని క్రియా కలాపం జరుగవలసిన పద్ధతి చెప్పి, కొందరు రోగుల ఇళ్ళకు తనూభవుని తోడ్కొనిపోయి, ఇంటికి తరలునప్పుడు కూడ ఈ రీతిగా నూరిపోసేవాడు. "నాయనా! నాడీ విజ్ఞానంలో ఆరితేరిన వైద్యుడు మృత్యు మహిళతో ఒక విధమైన రాజీ కుదుర్చుకోవాలి. మృత్యువుకు

అధికారం ఎక్కడ ఉంటుందో, ఆమె బలము ఏ తావులో జెండా ఎత్తి నిలుస్తుందో 'దారి విడువుము' అని ఆమె అంటుంది. ఏ స్థానంలో మృత్యుకాంతకు అధికారం లేదో, పొరపాటున ఆమె అందు తొంగి చూచినయెడల, చికిత్సకుడు "హే దేవీః నీ రాకకు ఇంకను సమయం కాలేదు. ఇందుండి నీవు నీ సొంత తావుకు పోయి, నీ సమయం కొరకు వేచి ఉండుము.' అని ఆమెతో ఖచ్చితంగా చెప్పి వేయాలి."

"ఈ పద్ధతి అవలంబించడం వలన వైద్యుని రోగ నిర్ణయ శక్తిలో ఎట్టి భ్రాంతి ఘటిల్లజాలదు. తగిన మందును ఏర్పరచడంలో కూడ ఎట్టి ప్రమాదము ఘటిల్లదు. మృత్యువు ఏరీతిగా అమోఘమయిందో ఔషధశక్తి కూడ ఆ రీతిగా అమోఘ మయింది ఆయుర్వేదము పంచమ వేదము. ఇది బ్రహ్మసృష్టి. ఈ సృష్టిలో ఉద్భవించిన ఔషధ శక్తి ఎటువంటిదో నొక్కి చెప్ప నక్కరలేదు. బ్రహ్మభ్రుకుటి కుటిల దృష్టినుండి మృతువు సృష్టి అయింది. బ్రహ్మ ప్రసన్న దృష్టినుండి ఆయుర్వేదం పుట్టింది. చతుర్ముఖుడు ఈ శాస్త్రమును దక్ష ప్రజాపతికి ఇచ్చినాడు. అశ్వినీ కుమారులు ఆయన నుండి దీనివి పడసినారు. వారి నుండి ఇంద్రుడు దీనిని పొందినాడు. ఇంద్రుడు ఈ శాస్త్రమును భరద్వాజునకు ప్రసాదించినాడు, ఆయన నుండి ధన్వంతరి పొందినాడు. అపుడు ఆయుర్వేదము రెండు భాగములైనది. శల్య చికిత్సా భాగమును ధన్వంతరి పడసినాడు. తదనంతరం పునర్వసు ఆత్రేయ, అగ్నివేశులు దానిని పొందిరి. అగ్నివేశాచార్యుడు అగ్నివేశ సంహితను రచించిరి. ఈ సంహితనుండి చరక సంహిత సృష్టి అయింది. పంచ నద సీమయందలి మనీషి చరకుడు. ఈ సంహితను సంస్కరించి, దీనికి నూతన రూపమును సృజించిన వాడతడు. చరకుడు చిరంజీవి.... ...."

ప్రసంగం సాగుతూ సాగుతూ ఉండగా తండ్రి కొడుకులు అడుగులు వేస్తున్నారు. మరొక పల్లెలో అడుగు పెట్టేరు.

జగద్బంధు మహాశయుడు ఈ రీతి పయనంలో సవారిని ఉపయోగించేవాడు కాదు. చాలా దూరం పోవలసివస్తే ఎద్దు బండి ఎక్కేవాడు. తొందరగా ప్రయాణం సాగించాలంటే డోలీ కట్టించుకొనే వాడు. నేడు విశ్వవట్టం అయిన బాల బాలెంత వంటి రోగిని ఆ రోజుల్లో ఒకప్పుడు జగద్బంధు కొడుకుకు చూపించేందుకు సివారు గ్రామానికి తోడ్కొని పోయినాడు.

ఆ రోగి కూడ కొద్ది సంవత్సరాలే మోసిన బాలిక. పెద్దగా లెక్కిస్తే ఆమెకు పదహారేళ్ళ కంటె ఎక్కువ వయసు ఉండదు. అమెకు ఈవరలో రెండు కానుపులు గడచినవి. మూడవ పర్యాయం చూలింతరాలైనది. నెలలు నిండినవి. నేడో రేపో బాలింత కాబోతుంది.

ఆమెను చూచి, ఇంటికి మరలుతూ తండ్రి ఇట్లన్నాడు "ఒక రోగి ఎంత కాలం బ్రతుకుతాడో శాస్త్రంలో చెప్పబడే ఉంది. కర్మఫలం దొడ్డది అనడం నిస్సంశయం. ఆయువుకు హ్రాస వృద్ధు లున్నవి. బ్రతుకులో దారి తప్పి నడిచి అనేకులు మృత్యువును ఆహ్వానిస్తూ ఉంటారు. అందుచే ఆయా సందర్భాలలో చప్పు చప్పున చావు మూడుతుంది. అయినప్పటికీ.... ...."

మాట్లాడుతూ, మాట్లాడుతూ అతడు చప్పున నోరు మూసినాడు. బహుశః అతని మనస్సులో ఏదో సంశయం తల ఎత్తి ఉంటుంది. క్షణమూరకొని యుండి అతడు మరల తన కథ సాగించాడు. "నాయనా! ఒక్కొక్కప్పుడు శాస్త్రవాక్యం గురించి సంశయం కలుగుతుంది. పెనిమిటి చేసిన పాపమును పెండ్లాము పంచుకో దని మన శాస్త్రం చెపుతూంది. కాని ఈ క్షేత్రంలో జరుగుతూ ఉన్న పని ఏమి? మితం తప్పి మగడు నడవడంవల్ల వాని చెడుచేత ఫలం ఇల్లాలు అనుభవిస్తోంది. అందుచే ఆమెకు అకాల మృత్యువు దాపురిస్తోంది."

మరల కొంత సేపు ఊరుకొని ఆత డిట్లన్నాడు.

"పూర్వ జన్మ ఫలం ఆమె అనుభవిస్తోందేమో! ఆ కర్మఫలం వల్ల ఆమెకు అకాలమరణం సంభవిస్తోంది. అట్లు కాదని ఎవరు చెప్ప గలరు?"

ఆనాడు తండ్రి చెప్పిన మాటలు జీవనం గుండెలో బాగా నాటుకొన్నవి. వాటిని అతడు సమగ్రంగా నమ్మినాడు. తన మనస్సులో తన భాగ్యదేవతకు అతడు సహస్ర ప్రణామములు సమర్పించాడు విధాత అతనిని రక్షించాడు. తాను వల చిన మంజరి ఆరోగ్యవతియే! కాని ఆమె పన్నెండేళ్ల బాలిక. అప్పట్లో ఆమె కంఠంపై మూడు ముళ్లూ పడిన యెడల తరువాతి బ్రతుకు ఏరీతిగా తెల్లవారేదో!

పెద్ద నిట్టూర్పు విడిచాడు నేడు వృద్ధుడైన జీవన మహాశయుడు. ఆకాశం దిక్కుగా చూచినాడు. వాని నోటినుండి ఒక విచిత్రమైన నవ్వు వెడలింది. గడ్డం సవరించుకొన్నాడు డాక్టరు. వియత్తలంలో రక్త సంధ్య విరాజిల్లుతున్నది. దిగంత

విస్తృత జలదమాలిక మిగుల ఎఱ్ఱనై ఉన్నది. తెలి కొంగల వరుస ఒకటి మొయిలుగముల దెస ఎగయుచున్నది. హఠాత్తుగా కట్టెదుట గోచరించింది టీ కప్పు ఇందిర ఎపుడో దానిని అందుంచి చక్కాపోయింది. తొల్లింటి విషయాలను జ్ఞప్తికి తెచ్చుకొంటూ టీ మాట అతడు మరచినాడు. టీ కప్పు అచ్చట పెట్టి ఆమాట చెప్పి పోయింది ఇందిర. ఆమె మాటలు చెవిలో పడలేదు.

టీ మాట దేవు డెరుగును. స్మృతి మధు పానమును గ్రోలుచు అతడు మత్తిల్లినాడు. గతవిషయసంస్మరణలో ఒక విధమైన నిషా ఉన్నది. వర్ణ విన్యాసము మనోరమ. మనసులో పడినయెడల దృష్టి నాకర్షించినయెడల, అది మరలి పోదు. గత జీవిత దృశ్యము ఆతని మానసయవనికపై తళ్కొత్తింది. తోడ్తో డనే కట్టెదుట విహాయస రక్త సంధ్యావర్ణచ్ఛటలు సాంద్రము లైనవి.

మంజరీ బంధము నుండి తన్ను తప్పించినందుకు ఆతడు తన భాగ్యదేవతకు ధన్యవాదములు సమర్పించినాడు కదా! ఆ ఘట్టమునుండి మరలి, వచ్చిన పిదప ఆతని కేమి జరిగింది?

మరల ఆతని నోటినుండి విచిత్రమైన నవ్వు వెడలింది. గడ్డము సవరించు కొన్నాడు వృద్ధుడు. మనుష్య కర్మ చక్రసృష్టి. చక్రసృష్టి చిత్ర మైనది. రస బంధుర మైనది. కర్త రసికుడు కదా!

* * *

ఆనాడు తండ్రి కొడుకులు ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి మూడు జాములు గడి చినవి. జీవనుని తల్లి వంటింటిలో పని చూసుకొంటూ ఉన్నది. ఇది వారింటిలో నియమ విరుద్ధంగా జరిగే పనికాదు. వైద్యుని భోజనము అయ్యేందుకు మూడు జాముల వేళ దాటుతూ ఉంటుంది.

ముఖమూ, చేతులూ కడుగుకొని, తడి అంగవస్త్రము వీపుపై వేసికొని గృహ యజమాని ఇట్లన్నాడు :

"జీవనునకు కులకర్మలో దీక్ష ఇచ్చి, ఈవేళ నేను నిశ్చింతుడనైనాను. కాని నీ మొగం అలా ఉన్నదేమి?" అని భార్య నుద్దేశించి ప్రశ్నించినాడు.

"ఎలా ఉంది?"

"ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నావు ఆలోచన ఏమి?"

"ఏమి ఆలోచిస్తున్నాను!" అని ఆమె మాట తప్పించింది.

"ఏమి ఆలోచనా? ఆడవాళ్ల ఆలోచనలు ఎలా ఉంటాయో ఎరగనా? నగలను గురించీ, నాణేలను గురించీ, ఆడపిల్లల పెళ్లిళ్లను గురించీ, మగపిల్లల మనుముఃను గురించీ వాళ్లు తలుస్తూ ఉంటారు కదా! ఈ ఆలోచనలలో ఏదో ఒకటి నీ మనస్సులో దిర్దిర తిరుగుతూ ఉంది."

ఇల్లాలు నవ్వింది. పెనిమిటి ఎదుటినుండి పోయి, పొయ్యిమీది గిన్నెపై ఉన్న మూత తీసి గరిటెతో కొంచెం అన్నపుమెతుకులు తీసి వ్రేలితో వదునుచూస్తూ కూర్చుంది.

జగత్‌మహాశయుని మనస్సు ఆనాడు ప్రసన్నమై ఉంది. నిర్మేఘ శరత్కాల గగనం వలె ఉన్నదంటె అతిశయోక్తి కాదు. ఉల్లాసంతో నవ్వుతూ, "జవాబు చెప్పేవు కాదేమి?" అని ధర్మపత్ని నుద్దేశించి అతడు ప్రశ్నించాడు.

వెనుకనుండి ఆమె ఇట్లుత్తర మిచ్చింది: "ఏమి చెప్పను? మీ కంతా తెలుసు. ఇతరుల మనస్సులలో ఏమేమి ఊహలు ప్రాకుతూ ఉంటాయో మీ రెరుగుదురు. అంత ర్యామి వంటి వారు మీరు. నే నేమి యోచిస్తున్నానో మీరే చెప్పుకోండి."

తన గభీరసంస్మరణలో జీవనమహాశయుడు మునిగి పోయినాడు. ఆనాడు తండ్రి పలికిన గంభీర వాక్కులు వాని గుండెలో నేడును ప్రతిధ్వనిస్తూ ఉన్నవి. వాని హృదయముపై చరపులు పడినట్లైనది. ఉలికి పడినాడు జీవనమహాశయుడు.

భోజనాలు ముగిసిన పిదప, చిన్న పళ్లెంలో వక్కపొడుమూ, తమలపాకులూ ఉంచి జీవనుని తల్లి ఇట్లన్నది. "మీకంతా తెలుసు. మీతో నేను పరిహాసం చెయ్యడం లేదు. కాంది నుండి ఈ వేళ మధ్యాహ్నం ఒక మనిషి ఉత్తరం తీసుకుని వచ్చాడు. ఆ ఉత్తరంలో ఏముందో ఎరుగను. కాని. జాబు వ్రాసిన పెద్ద మనిషి పేరు విన్నంతనే నా మనస్సులో ఊహలు పుట్టినాయి. ఆలోచనలో పడకుండా ఉండలేక పోయాను. లేఖ వ్రాసిన వారు నవకృష్ణంగారు. చూడండి దీనిని."

జగద్బంధు మహాశయుడు జాబు తీసికొని చదవడం మొదలుపెట్టేడు. జీవనుడు చకితుడైనాడు. ఉద్విగ్న చిత్తముతో తండ్రి మొగము తేరి చూచినాడు. ఉత్తరం చదివి తండ్రి వైశాఖ మాసపు ఉత్తప్త వియత్తలమును చూస్తూ కూర్చున్నాడు.

ఆనాటి విషయము జీవన డాక్టరు స్మృతిలో మాటిమాటికి విజృంభింప సాగింది,

సూర్యుడు పశ్చిమ దిశలోనికి మెల్లమెల్లగా దిగుతున్నాడు. మూడవజాము యొక్క తుదిపాదము గడచిపోతోంది. ఆకాశము మిగుల ఎఱ్ఱనై ఉన్నది. తూర్పు దిక్కు వసారాలో జగద్బంధు మహాశయుడు కూర్చుని ఉన్నాడు. కన్టెదుట ఉన్న వకుళ వృక్షము మీది నుండి రౌద్రదగ్ధ వైశాఖ గగనము తపోమగ్నరుద్రుని అర్ధనిమీలిత తృతీయ నేత్ర వహ్నిచ్ఛుల సముదాయమువలె అగపడుతోంది. దిగంతము లందు ఎందును ఎట్టిధ్వనియు వినబడుట లేదు. కల్లోల తరంగములు కూడ కట్టుబడి యుండెను. సంధ్య యందు తీవ్ర ఝంఝూనిలము వీచునని ఆతడనుకొనినాడు. పడమటి కొండపై అట్టి సన్నాహం జరిగే సూచనలు గోచరిస్తున్నవి. ఆ దిక్కుగా చూస్తూ హృదయంలోకూడ పెను తుపాను చెలరేగునని జీవనుడు అడలినాడు. నవకృష్ణుడు ఏమి వ్రాసి యుండును? తనది పెద్ద కుటుంబమని ఆ పెద్దమనిషి ఎరుగును. తన వంశముపై మోజు పుట్టి ఆతడీ ఆట ఆడుతున్నాడేమో! తనతో ఆటలాడవలెనని ఆతడు ఎత్తువేస్తున్నాడా? తన మెడకు ఆ పిల్లదానిని కట్టబెట్టాలని ఆతడు పెద్ద పన్నగడ సృష్టిస్తున్నాడా అని యువకుడు తలపోసినాడు. తాను తెలివి మాలిన కోతియై బంకిం పరిచయంవలన వారింటికి పోయినాడు. పోయి వెఱ్ఱిగంతులు వేశాడు. వారి దృష్టిలో అది భల్లూకదృష్టి యైనది. మంజరి తన్ను 'ఎలుగుబంటి' అని పిలిచేది. ఎలుగుబంటికి కోతికి గల వ్యత్యాస మేమి? రెండూ జంతువులే? రెండును తెలివిలేనివే! ఇపుడు నవకృష్ణగారు ఏమి వ్రాసి ఉంటారు? తనపై ఏదేని నేరం మోపుతూ జాబు వ్రాసి ఉంటాడా? అదేమో చెప్పరాని నేరమై ఉంటుందా? బూటకపు నేరమై ఉంటుంది. ఇపుడు తానేమి చేయాలో జీవనునకు తోచలేదు. ఏమీ పాలుపోలేదు. దేవుడు సాక్షి. కాని సాక్ష్యం ఇచ్చేందుకు దిగినాడు కదా! మన పిచ్చిన ప్రేమ అపరాధమైన యెడల, తాను అపరాధియే అగును. అట్లని ఈశ్వరుడు ఎరుగడా? అంతకు మించి తాను చేసిన దోష మేమి? మరణదండనకై వేచియున్న వాని వలె ఆతడు తడసియుండెను.

ఇల్లాలిపై చూపు నిలిపి యజమాని "అమ్మీ" అన్నాడు.

ఆతని కంఠస్వరం గంభీరమై ఉండెను.

"ఏమో చెప్పండి. ఉత్తరంలో అతగాడేమి వ్రాశాడు? వినేందుకు విల బడ్డాను" అన్నది గృహిణి.

"జీవనుని పెళ్లికి సన్నాహం చెయ్యి"

"ఎవరితో? అతగాడి కూతురుతోనా? నవకృష్ణంగారి పిల్లతోనా?"

"అవును. ఆ పిల్లతోనే మనవానికి పెళ్లి చేసితీరాలి. ఉత్తరంలోని మాటలివి: 'మహాశయా! ఏమి వ్రాస్తాను? ఏమి వ్రాయగలను? ఇక్కడ మా అమ్మాయిని గురించి అపవాదము నాలుగు దిక్కులా పొక్కిపోయింది. మీ అబ్బాయి మా అమ్మాయితో కలసి ఏవేవో ఆలోచనలు సాగించాడు. మంజరి తలపై బుక్కా పోసే వంకతో ఏమేమో పోకిళ్లకు పోయినాడు. ఆమె ఒంటిపై చేయి వేశాడు."

కొడుకును తేరిచూచి తల్లి "ఏం జీవనూ?" అన్నది. ఈ రీతి వైఖరితో జీవనుడు తన కన్నతల్లిని ఎన్నడు చూచి ఉండలేదు.

"నా పాదములంటి ఒట్టుపెట్టుకొని చెప్పు" అన్నది ఆమె కఠోర స్వరంతో.

ఏదో పుట్టి మునిగిందనుకొన్నాడు జీవనుడు. ఏమి దాపురిస్తుందో? వాని గుండె దడదడ లాడింది. చివాలున తల్లి చరణములపై వ్రాలి అతడు "నేనా పిల్ల దాని నెత్తిపై బుక్కా వేశాను. నిజమే! ఇంతకుమించి నేను చేసిన తప్పేమి లేదు" అన్నాడు అడలుపాటుతో.

"అమ్మీ! ఇప్పుడేమి చేస్తాం? పెళ్లి తతంగం జరుగవలసిందే! పాత గొడవ తడవడం ఎందుకు? జీవనుడు మనస్సులో ఆ పిల్లను ప్రేమించి ఉంటాడు. ఇంక ఒట్లూ, సత్యాలూ ఎందుకు? పెళ్లి పనులకు నడుం కట్టు."

"ఇంతలో ముంచుకు పోయిందేమి? జాతకం చూడవద్దా? ఆ అమ్మాయిని మనం చూడవద్దా? కార్యాలూ కథలూ సాగేటప్పుడు ఇచ్చి పుచ్చుకోవడాలు ఉండవా? ఈ మాటలు సాగకుండా పెళ్లి పనులలో దిగమంటారేమిటి? ఏం చాదస్తం?"

"వీటన్నిటితో ఇపుడు పని లేదు. జాతకచక్రం జాబుతో జతపరచి పంపేడు పిల్ల తండ్రి. దీనిని చింపివేస్తాను. దీనిని బట్టి ఏదైనా అద్భుతగులుతుందేమో! ఇచ్చి పుచ్చుకోవడాలు ఎప్పుడైనా జరుగవచ్చు. ఆ పెద్దమనిషి ఎంత ఘాటుగా వ్రాశాడో విను, 'అయ్యా! మీది దొడ్డ వంశం, పేరుపొందిన కులగోత్రాలు మీవి. మీ పేరు ప్రతిష్ఠలు దిక్కులలో ప్రతిధ్వనిస్తున్నాయి. వైద్య వృత్తిలో మిమ్మల్ని మించిన చెయ్యి లేదని సమస్త ప్రపంచం ఎరుగును. ఇక మీ పిల్లవాడో! మీ కడుపున కలిగిన మణిపూస! డాక్టరు పరీక్షకు చదువుతున్నాడు. పొట్టి పిచ్చుక చంద్రుణ్ణి పట్టుకోవాలనే ప్రయత్నంలా ఉంది నా యత్నం. కాని పరిస్థితులు ఇలా నడిచాయి. కథ నడచిన తీరుచూస్తే తక్షణం శుభకార్యం జరిగితీరాలి. తమరు వేరుమాట చెప్ప

రాదు. అట్లు చెప్పేందుకు మీరు సాహసిస్తే మా అమ్మాయిని అమాంతంగా గంగలో పారవేయవలసి వస్తుంది. మహాశయా! మాట చిత్తగించారా?"

"అమ్మీ! ఇంక నువ్వేమీ వేరు మాటలు చెప్పకు. కథ అడ్డం తిరిగిపోతోంది. పెళ్లిపనులు ఆరంభించు. వైశాఖమాసం ఇంచుమించుగా గడచిపోయింది. జ్యేష్ఠ మాసములో జ్యేష్ఠ పుత్రునకు వివాహం చెయ్యడం దేశాచారానికి విరుద్ధం. వంశ మర్యాద ఒప్పదు. ఆషాఢం అడుగుపెట్టగానే పిల్లవానిచే మూడు ముళ్లు పెట్టించి తీరాలి."

# పదునొకండవ ప్రకరణము

గతకాల జీవితానుభూతిని స్మరిస్తూ జీవనమహాశయుడు రసభరిత హృదయుడైనాడు. ఉద్వేగ మధికమైనకొలది అతడు పదేపదే వడివడిగా గడ్డమును మెలివేసి ఎగురగొట్టుతున్నాడు. ముసలితనం పైబడిన పిదప గడ్డము నెరసినది. కాని తరచుగా అతడు తంబాకు పీల్చడంవలన అందలి కొంతభాగం రాగిరంగుతో ఒప్పుతోంది. దాని సంరక్షణ విషయంలో ఆత డంతగా శ్రద్ధవహించలేదు. సంస్మరణ సమయములో ముదిరిన గడ్డముపై లేత నవ్వు మెరిసింది. తొల్లింటి తరుణ వయసుకూ ప్రస్తుతపు పెద్దవయసుకూ గల వ్యత్యాసం అతనికి స్పష్టముగా గోచరించింది. తన్ను తాను వెక్కిరించుకొంటున్నాడు. అతడే యననేల? యౌవనీ ప్రాదుర్భావస్థితికిని జీవన సంధ్యా స్థితికిని గల భేదమును ఊహిస్తూ మానవులు ఆరీతిగా పరిహసించుకొంటూ ఉంటారు.

నదీజలము వంటిది యౌవనము, ఏ అడ్డంకులను అది లెక్కజేయదు. ఒక దిక్కుగా, ఒక వ్యక్తి దెస స్రవించినయెడల, అది మళ్లేదికాదు. శాస్త్రాల నిర్వచనములూ, బాగోగుల సమీక్ష, సంఘ నిషేధములు, ఇంకను ఎన్నెన్నో అడ్డంకులు ధునీగతిని విరోధింపలేవు. ఇసుక తిన్నెలవలె ఇవి ప్రవాహములో కొట్టుకొని పోవును. ఝరీపూరములో నవ్యసలిలము కలిసినపుడు అది పరవళ్లు తొక్కుతూ విజృంభిస్తుంది.

ఆనాడు రోగిని చూచి తండ్రితో ఇంటికి మరలునపుడు మంజరితో జరుగవలసిన తన వివాహం మళ్లినందులకు జీవనుడు విధాతకు ధన్యవాదములు సమర్పించుట నిజమే! చూచి వచ్చిన కేసు వాని మనసుమీద కొంత పనిచేసి ఉంటుంది. కొంత సమయం గడచిన పిదప ఆ అందకత్తె మోము మానసదర్పణములో ప్రతిఫలించినపుడు వాని హృదయములో సమగ్ర పరివర్తనము పొడసూపింది. ఆనందోత్సాహములు వెల్లివిరిసినవి.

ఆషాఢమాసారంభంలో పాణిగ్రహణం జరిగితీరుతుందని తండ్రి నొక్కి చెప్పినాడు. అంతకు మున్ను ఆతని మనసును పీడించిన పెక్కు విషయాలు విస్మృతి గర్భంలో మునిగిపోయినవి. చేయి జాపి, ఆకాశముమీది చంద్రుని అంది పుచ్చుకొన్నవానివలె అతడు కులుకసాగినాడు. కల్యాణ ముహూర్తం కోసం అతడు గ్రుక్కిళ్లు మ్రింగుతున్నాడు.

సమస్త వసుంధర ఆనందసాగరమై పోయింది సుగంధ బంధుర మారుతము వీచుతోంది. అపూర్వ అద్భుత ప్రపంచంలో తాను మసలుతున్నట్లు జీవనుడు ఊహించినాడు.

వాని తండ్రికిని, మంజరి తండ్రికిని నడుమ ఉత్తర ప్రత్యుత్తరములు విశేష సంరంభంతో సాగుతున్నవి. జగత్‌మహాశయుడు ఉచితరీతిని నవకృష్ణునకు శుభలేఖ వ్రాసినాడు. సకాలమున సముచిత ప్రత్యుత్తరం వచ్చింది. అం దాతడు ఈ రీతిగా వ్రాసినాడు:

"బావగారూ! ఈ మాటలు పాటించండి. మామంజరి సిగ్గువలననుశోకంవలనను మంచం పట్టింది. మీ ఉత్తరం చూచుకొన్నతర్వాత ఆమె ముఖం చిరునవ్వుతో వికసించింది. మంచం దిగి నిలబడింది. కన్న తల్లితో ఇలా అన్నది. 'అమ్మా! నేను చేసిన నోములూ, పాటించిన నియమాలూ ఫలించినవి. నా శివపూజ వ్యర్థం కాలేదు; నా బ్రతుకు వ్యర్థం కాలేదు."

ఈ మాటలు వినినపుడు జీవనుని ఉల్లాసమునకు మేర లేకపోయెను. ఉత్సాహంతో ఉబికిన ఉదరము ఆకాశము నంటుకొనినది. తనకోసం మంజరి మంచము పట్టినదట! సిగ్గు దొంతరలు ఆమె మొగముపై దొరలిపోయినవట! దుఃఖ సముద్రంలో అడుగుభాగం వరకు ఆమె మునిగిపోయినదట! తనతో జరుగబోవు వివాహ మహోత్సవ విషయం వినినంతనే మంచముమీదినుండి గుభాలున ఉరికి, ఎగిరి గంతు వేసిందట! ఆహాహా! ఎట్టి అద్భుత సంఘటన! తలచినకొలది జీవనుడు తన్మయుడై పోయినాడు. వాని ముఖము కాంతివంతమై నిండుచంద్రుని వెక్కిరింప సాగినది. దుఃఖశయ్యనుండి తటాలున దిగిన మంజరి మందహాస సంశోభిత వదనారవిందము జీవనుని కన్నులెదుట గోచరించినట్లయినది. ఆమె మొగము మరుక్షణంలో సాక్షాత్తూ నిండు గులాబి పూవువలె అగపడింది. లతవంటి ఆమె తనువును తిలకించి అసలు లతలు సిగ్గుతో తలలు వంచుకొనినవి.

సంతోషం పట్టలేక జీవనుడు పరుగు పరుగునపోయి తన అంతరంగ మిత్రులు సురేంద్ర, సేతాబ్, నేపాలులను కలుసుకొన్నాడు. కలిసికొని కాటోవు మామగారు వ్రాసిన లేఖను వారిచేతులందు పెట్టినాడు. తండ్రి ఎంతో జాగ్రత్తగా దాచిన జాబును ఆత డెట్లో కాజేసినాడు.

సురేంద్రుడు సొంత ఊరువాడు. తక్కిన ఇరువురు నవగ్రామవాసులు. శరీరములు మూడైనను, వారి గుండెలు ఒక్కటే. సురేన్ నేపాలులు తగిన ముహూర్తంలో మధుపానమున అక్షరాభ్యాసం చేశారు. మట్టికూడ మద్యపానం చేసి తీరుతుందని అప్పట్లో, ఆ ప్రాంతవాసులు ఏకగ్రీవంగా అనుకొనేవారు. ఇందు అతిశయోక్తి లేదు. దొడ్డ సూత్రం: పదమూడు పదునాలుగేళ్లనుండి పిల్లలు మద్యపానం యథావిధిగా ఆరంభిస్తూఉండేవారు. తాంత్రికుల సీమ. అందరూ తాంత్రికులు. వీరిలో చాలామంది బ్రాహ్మణులు. దీక్షాగ్రహణం జరిగినతర్వాత అది ధర్మసాధనాంగమై నిలబడేది: బట్టబయలుగా త్రాగేందుకు అధికారం లభిస్తుంది. సేతాబ్ కేవలం త్రాగి ఉండేవాడు కాడు, బ్రాహ్మణ కులప్రాంగణంలో మొలచిన మొక్క అతడు. శాక్త గృహంలో ప్రభవించినవాడు. తగిన కర్మకాండ సలుపుతూ యథావిధిగా తాంత్రిక తర్పణం సాగిస్తూ ఉండేవాడు.

సురేన్ సొంతపల్లెలోనివాడు. ఠాకూర్‌దాస్ మిశ్రుని కొడుకు. జమీందారుల ఎస్టేటులో డబ్బు వసూలుచేసే పని నేర్చుకొన్నాడు. మిగుల చతురుడు.

మంచివార్త చెప్పిన జీవనునితో "శుభవార్త! పెళ్లికొడుకువు అవుతున్నావు. ఈవేళ నీవు నాకు మంచి విందుచెయ్యాలి. మద్య మాంసములపై మాటిమాటికి మనసు వ్రాలుతోంది. డబ్బు బయటపెట్టు" అన్నా డతడు.

నేపాల్ మిగుల గారాబు బిడ్డ. వాని తండ్రి వినోద ముఖర్జి, సబురిజిస్ట్రారు ఆఫీసులో గుమాస్తా పని చేస్తూ ఉంటాడు. ఇళ్లూ, వాకిళ్లూ, పొలాలూ, తోటలూ అమ్ముకొన్నవారిదగ్గరనుండి దస్తావేజులు రిజిస్టరు అయ్యేందుకు ముందు బాగా డబ్బు గుంజుతూ ఉంటాడు. పొడుపుపాటి చొక్కా ప్రక్కజేబుల్లో చిల్లర నింపుకొని ఠీవిగా వీధిలో నడచిపోతూ ఉంటాడు. కొడుకుకు కొదువ ఏముంది? కంఠమెత్తి మాట్లాడి, కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వి, వడివడిగా నడుస్తూ కుండ బ్రద్దలుకొట్టినట్లు మాట్లాడడం వాని అలవాటు. ఒకపర్యాయం రాఘవపురంలో బ్రాహ్మణ సమారాధన జరిగింది. భోజనమునకై ఆహ్వానము వచ్చినది. లొట్టలు వేసుకొంటూ ఎగి

రెగిరి పడుతూ విందుకై బయలుదేరినాడు. కొంతదూరము పోయినతరువాత చూచు కొన్నాడుకదా భుజముపై జందెము లేదు. భోజనం సున్న చుట్టుకొనలేదు. దుర దృష్టవశాత్తూ జందెం ఎక్కడో పడిపోయింది. త్రోవలో వృద్ధ బ్రాహ్మణు డొకడు అగపడినాడు. "అయ్యా! నీ జందెమును కొంచెము సేపు నాకు అప్పుగా ఇమ్ము." అని దానిని ఊడబెరుకుకొని ఆతడు భుజంమీద వేసుకొన్నాడు.

అపుడపుడు అతడు జీవనుని ఇంటికి వచ్చి, మందులగదిలోనికి పోయి చేతికి దొరికిన లేహ్యమును కడుపునిండ మెక్కి ఒళ్లు తిరిగి పడుతూ ఉంటాడు.

జీవనుడు ఆనాడు తన కడకు వచ్చినపుడు "నేను తింటాను; తినిపిస్తాను" అని పలికినాడు.

నేపాల్ కూడ కడుపునింపుకొన్నాడు. మూడు రూకలు ఖర్చుపెట్టేడు. లూచీ, మాంసము, తీపిసారాలతో ఉదరగోళమును పూటుగా నింపినాడు.

మిత్రులు నలుగురు రాత్రి రెండుగంటలవరకు పాటకచేరి జరుపుకొన్నారు. సురేన్ తబలా చేతబుచ్చుకొని చిత్తం వచ్చినరీతిని వాయించాడు. జీవన్ నేపాలులు కంఠాలు జోడించి ఊగుతూ, ఊగుతూ పాటలు పాడేరు. సేతాబ్ శ్రోత.

పాడినవి చండీదాసు, విద్యాపతుల పదావళి. మిత్రులు గానసముద్రంలో మునుగుతూ తేలిపోతున్నారు. "వహవ్వా! బలే! వహవ్వా!" అంటూ శ్రోత వారిని హెచ్చరిస్తున్నాడు.

సంస్మరణకు ఇంచుక అవాంతరం కలిగింది. జీవనడాక్టరు నిట్టూర్పు విడిచినాడు. మరల తొల్లింటి విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు.

ఆనాడు జీవనుడు గులాబులూ, సంపెంగలూ తెచ్చి దండలు గ్రుచ్చినాడు. నాలుగు మాలలు తయారు చేసినాడు. నలుగురు మిత్రులూ తమతమ కంఠాల్లో వాటిని ధరించారు.

నేపాలు, సురేనులు ఆకస్మికంగా లేచి, జీవనుని రెండుకాళ్లూ పట్టుకొని, "సోదరా! కొంచెం తియ్యని సారా పుచ్చుకోనుము. నీకు మంచికబురు అందింది కదా! కొంచెం త్రాగి ఎంత మజాగా ఉంటుందో చూడు. టీ కొంచేమే సుమీ!" అన్నారు.

కాని జీవనుడు ధర్మభ్రష్టుడు కాలేదు.

జీవనుని వంశంవారు వైష్ణవమంత్రోపాసకులు. అందుచే వారు సారా ముట్టరు. "నాకు దీనిని చూపకండి. మా నాన్న సంగతి మీకు తెలుసుగదా! మంజరి ఇంటివారుకూడా సరిగా మావంటివారే! వారు కూడ వైష్ణవులు" అన్నాడు.

ఆ దిక్కున ఇంటిలో పెద్ద ఎత్తున వివాహ సన్నాహాలు జరుగుతూ ఉన్నవి. జగద్బంధు మహాశయుని ఏకాత్మజుని పాణిగ్రహణ మహోత్సవం జరుగుతుంది. బ్రాహ్మణ భోజనము, జాతి భోజనం, నవశాఖవారి భోజనము, గ్రామమందలి ఇతర వర్ణములవారి భోజనము వివిధరీతుల భక్ష్య, భోజ్య, లేహ్య చోష్యములతో జరుగ వలెను. పొరుగు పల్లెలనుండి కవిరాజుగారి వైద్యవృత్తి ప్రాకిన పెద్దతావులనుండి ఎందరెందరో అతిథులు వచ్చిపడెదరు. వారిలో మహమ్మదీయమిత్రులు ఉన్నారు. లూచీలూ, మిఠాయిలూ వారికోసం ప్రత్యేకంగా తయారు కావాలి. ఈ ఏర్పాటులందు ఇంచుకంతైన లోపమును తలయెత్తనిచ్చువాడుకాడు జగద్బంధు. ఇక పాటకచేరీలు, భజనలూ, ఆటలూ రెండుమూడు రాత్రులవరకు సాగించే ఏర్పాటులు ఎలా జరగాలో ఎల్లరతో కలసి అతడు ఆలోచనలు సాగిస్తున్నాడు. సురేన్, సేతాబ్, నేపాలులవంటి యువకులనుండి గ్రామమందలి ఠాకూర్‌దాస్ మిశ్రునివంటి గ్రామ నాయకులవరకు ఎందరెందరో ఈ ఆలోచనలలో కొట్టుకొనుచున్నారు. గాన సభలతోపాటు వివిధ రీతుల వినోదములు జరిగితీరాలి. అట్లు కానియెడల వివాహము మహోత్సవం కాజాలదనీ, వైభవం కొరవడిపోతుందనీ ఎల్లరూ ఏకగ్రీవంగా ప్రకటించారు.

జగద్బంధు మహాశయు డిట్లన్నాడు: "వచ్చేది ఆషాఢమాసం. ముసుళ్లు ముమ్మరంగా చెలరేగితే ఈ సన్నాహాలన్నీ గంగపాలై పోతవి. పందిళ్లూ, పాకలూ, గుడ్డతెరలూ, శామియానాలు వానదెబ్బకు తట్టుకోలేవు. ఊరిలో కాళీ మందిరాన్ని అంటిన పెద్ద శాలలో శుభకార్యం జరపడం మంచిది. ఈ సందర్భంలో ఆ స్థలం కూడా బాగా శుభ్రమౌతుంది."

ఈ శుభ సమయంలో ఎంత ఉల్లాసం ఉంటుందో, అంత ఉద్వేగం ఉంటుంది. దినములు మాసములవలె, మాసములు సంవత్సరములవలె తప్పటడుగులు వేస్తాయి. ఎట్లో రోజులు దొరలిపోయినవి. ఆషాఢశుద్ధ ఏకాదశినాడు వివాహము నిశ్చయించ బడింది. మాసము జోరబడింది. ఆకాశము మేఘాలతో నిండిపోయింది. ఎల్ల రెరిగిన పుష్కర మేఘశకలములు కావవి. అశనిగర్భము దాల్చి, కుటిల మనసు గలిగి అజ్ఞాత నామములతోనొప్పు కాదంబినీ పంక్తులవి. వానినుండి పిడుగులు అవిరళముగా దుబ్లి పడసాగినవి.

ఇంక మంజరి లేదు.

పగలు రెండు జాములవేళ మనిషి వచ్చినాడు ఉత్తరం పట్టుకొని. లేఖలో ఈ వాక్యం ఉన్నది:

"మొన్నటి రాత్రి నాకూతురు మహూచికా రోగంవలన మరణించింది."

ఇది కాబోవు పెళ్లి కూతురును గురించిన వార్త. తాంబూలంలో టపాకాయ ఇమిడివుంది. పెళ్లి పందిరిపై పిడుగు పడినట్లయింది.

వార్త విని వెఱ్ఱికేకలు వేయడం మొదలుపెట్టేడు ఠాకూరుదాసు మిశ్రుడు. "నేను ఠాకూరుదాసు మిశ్రుడను. అతగాడు కంట్లో దుమ్ము పోస్తాడా? ఇటూ అటూ ఉరుకులెత్తుతున్నారా లోకులు. మొగం చూడగానే నాకు అర్థమైపోయింది. గ్రామాధికారిని నేను. నాముందు, నలుదిక్కుల్లోనూ అల్లరులు సాగిపోతున్నాయి! వ్యాజ్యాలలోకి వెల్లంకులలోకి దిగబడాలా? ఎంత ముప్పు! నాకు సందేహము లేదు. ఏం జరిగింది? ఎక్కడికి పోతావు? 'పొలం పోతున్నాను' అన్నాడు. గుండెలో దడ పుట్టింది! అక్కడ కలరా రేగిపోయిందా? పరుగు లెత్తుతున్నారు లోకులు హాహాకారములు చేస్తూ! ఇరుగో! అరుగో; ఆ సందులో ఉరుకులు! ఈ సందులో పిచ్చికూతలు! గొడుగులు విరిగిపోయినవి. పొలాల్లో నాగళ్లు వదలిపోతున్నారు రైతులు; దొంగను పట్టండి! సులేమాన్! కరీమ్! సాతన్! పట్టండి! ఒరే ఈ పాజిని, ఈ ఉత్తరం తెచ్చినవాణ్ణి కొరడాతో కొట్టండి! వీడి ఒళ్లు హూనం చెయ్యండి! అరే! దుర్మతీ! నిజం చెప్పు. చెప్పకపోతే నీ నాలుక కత్తిరించివేస్తా. ఏమీ దాచక చెప్పు."

జాబు తెచ్చినవానిని చిత్తము వచ్చిన రీతిని అతడు కొట్టసాగినాడు.

జగద్బంధు మహాశయునకు మతి పోలేదు. మెల్లగా అతడు ఇట్లన్నాడు: "ఠాకూర్‌దాసూ! వాణ్ణి విడిచిపెట్టు. పాపం వాడిదోషం ఏముంది? వాడేం చెయ్యగలడు? జాబుతో ఆ పెద్దమనిషి ఇతగాణ్ణి పంపేడు. వీడు వచ్చాడు. దూత అవధ్యుడు. ఆ నవకృష్ణుడు చేసిన తప్పుకు వీడెట్లు జవాబుదారి కాగలడు? ఏమి ప్రాయశ్చిత్తం చేస్తాడు?"

ఠాకూర్‌దాసు కంఠమెత్తి ఇట్లరిచినాడు: "దోషమంతా నీది. ఏదో ఒక ఉత్తరంముక్క రాగానే ఎగిరి గంతువేసి పెళ్లి నిశ్చయం చేసికొన్నావు. నువ్వు పోయి చూడలేదు. అతగాణ్ణి రమ్మని రాయలేదు."

జగద్బంధు మహాశయుడు ఒకప్పుడు తండ్రిగారు చెప్పిన వాక్కులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. "ఠాకూర్‌దాసూ! మోసం చేసింది నేను కాదు. అతడు పట్టి దగా కోరని కలలో కూడ నే ననుకోలేదు. ఇందులో నా తప్పేముంది!" అన్నాడాతడు.

జీవనుడు తొట్రుపాటుతో మిద్దెమీది నుండి దిగి వచ్చాడు. మశూచికా రోగం వల్ల మంజరి చచ్చినదనడం శుద్ధ అబద్ధం. గడచిన జ్యేష్ఠ మాసం చివరలో ఆమెకూ, భూపీ బోసుకూ వివాహం జరిగిపోయింది.

జీవను డిట్లనుకొన్నాడు: "హోళీ పండుగనాడు మంజరి రెండు చేతులకు తారు దట్టంగా పటించుకొని నా మొగమునకు పూసేందుకు పూనుకొన్నది. ఆనాడట్లు చేయలేక పోయింది. కాని, ఆమె ఈనాడు నా ముఖమునకు ఆ తారు విరివిగా మెత్తివేసింది. పూసి పూసి, దూరం నుండి నా వెట్టివైఖరి చూస్తూ వెక్కిరిస్తూ పకపక నవ్వుతోంది. ఇక భూపీగాడు! వాడు కేవలం అడవి పంది!"

జగద్బంధు మహాశయుడు కొడుకు మొగం చూచి, ఆదరంతో ట్లన్నాడు. "నాయనా! నిజంగా నీయెడల దేవుడు దయచూపినాడు. ఆ చముకు కాళ్ల పెద్దమ్మ ఈ ఇంటిలో అడుగుపెట్టితే నువ్వు సుఖపడేవాడవు కావు. మన కులగోత్రాలు మంట గలిసిపోయేవి. ఇది పట్టి మోసమే కాదు. బ్రతికినన్నాళ్లు నిన్నామె అశాంతి అగ్నిలో మాడ్చివేసేది బాబూ! ఈ విషయం గురించి ఇంక ఆలోచించకు. ఏ పిల్ల ఎవనికి పెండ్లాము కావాలో విధి రాసి పెట్టి ఉంటాడు. ఇది నీ ఇష్టం వల్లా, నా ఇష్టం వల్లాజరిగే పనికాదు. తండ్రీ! సిగ్గుపడకు! బెంగ పెట్టుకోకు! దుఃఖం వద్దు. గుండె నిబ్బరం చేసుకో!"

తండ్రిగారి తుది మాటలు జీవనునకు నచ్చలేదు. తల వంచుకొని అక్కణ్ణుంచి అతడు వెళ్లి పోయాడు.

"బాబూ! ఇంకా చెప్పవలసి వుంది. ఎక్కడికీ పోకు. సురేన్! నువ్వు కూడ నా మాట విను. నీతో కూడ మాట్లాడవలసి ఉంది. మీరిద్దరూ పక్కగదిలో కూర్చుని ఉండండి. నేను వస్తున్నాను." అన్నాడు జగద్బంధు మహాశయుడు.

ఠాకూర్ దాసు మెల్లగా మాట్లాడటం ఎరుగడు. ఇతరులు తనతో చల్లగా మెల్లగా మాట్లాడటం అతనికి నచ్చదు. చప్పని ప్రసంగం వానికి గిట్టదు. జగద్బంధు మహాశయుని హితవు ననుసరించి అతడు దూతను కొట్టడం మానివేశాడు. కాని

వానిని పెక్కురీతుల తర్జన భర్జన చేసి వదలినాడు. ప్రశ్నోత్తరములలో ఈ వృత్తాంతం తెలియవచ్చింది. ప్రక్కగదిలో కూర్చుని జీవనుడు ఈ ఉదంతం విన్నాడు.

వాస్తవంగా వంచన చేసింది నవకృష్ణ సింహుడు కాడు. మంజరి, బంకిం, వారి తల్లీ దానిని చేశారు.

ఆనాడు జీవనుడు వేసిన పిడిగ్రుద్దువలన భూపీ ముక్కు చితికిపోయింది. అతడు నేల కూలినాడు. వానికి స్మృతి తప్పిపోయింది. ఒళ్లు తెలిసిన తర్వాత అతడు "ఏడీ ఆ దుష్టుడు? వాణ్ణి కూనీ చేసి తీసుతాను. వట్టి పశువు! అడవి పంది! వాడి ప్రాణాలు తీసివేస్తాను. వట్టి పంది!" అని బొబ్బలు పెట్టినాడు. వెంటనే వాని దృష్టి మంజరిపై పడింది. వాని కోపపు ధాటి ఆమెపై పడింది. బంకిమును ఒక ప్రక్కకు త్రోసి, మంజరి ముందు నిలిచి, చేతులు ఊపుతూ వికృతమైన హావ భావాలూ ప్రదర్శిస్తూ ఆత డిట్లన్నాడు.

"ఇది మీరంతా కలిసి చేసిన కుట్ర! ఇది మీ షడ్యంత్రాంగం! నువ్వూ, మీ అమ్మా, మీ అన్నా, కలిసి నన్ను గెంటి వేసేందుకు ఈ రీతి ఎత్తుగడ వేశారు. ఇంత పెద్ద పన్నుగడ పన్నేరు? పాడు డబ్బు కక్కుర్తి పడుతూ, ఆ హీనజాతి వానితో, వట్టి అడవి పందితో పెండ్లి తలపెట్టుకొని ఇంత పని చేశాడు. ఛీ!"

కంఠమెత్తి, వీధిని బడి అరుస్తూ కట్టుకథలతో మంజరిని గురించిన అపవా దములను నలుమూలలందూ చాట సాగినాడు.

మంజరీ జీవనుల మధ్య శృతి మించిన చనవు పెచ్చిల్లి పోయిందని కొన్నాళ్లనుండి ఆతడు పసికట్టినాడు. ఆమెకోసం జీవనుడు చిత్తము వచ్చినట్లు పైకం గుప్పివేస్తున్నాడు. పట్టపగ్గాలు లేక చెలరేగుతున్నాడు. తన మాటలకు ఋజువు చూపుతానని అతడు రాయి గుద్దుతున్నాడు. మంజరి మనుమరాలనీ, తాను తాతనని చెప్పుకుంటూ పకపకలతో వికవికలతో తందానలాడు తున్నాడు! ఎంత రసి కత! ఎంత శృంగారం! ఎంతెంత విత్తమో ఖర్చుపెట్టి రకరకాల అత్తరులూ, సెంటులూ తెచ్చి రహస్యంగా ఆమెకు ఇస్తున్నాడు! ఘుమఘుమలతో ఆకాశం గుప్పు మంటోంది. ఈ ముద్దుల్లో ఈ ముచ్చట్లో వసంతం చిమ్ముతూ చిమ్ముతూ మోటు సరసంలోకి దిగి మంజరి వరుని మొగమునకు చక్కని తారు పులమాలని ఉద్యమించింది.

ఈ రహస్య శృంగార కాండను పెద్ద ప్రబంధంగా భూపీ బోసు వాడవాడలా ప్రచారం చేయడం మొదలుపెట్టేడు! బోర్డింగులోని తన స్నేహితులను వెంటబెట్టు కొని జీవనుడు ఎక్కడ దాగినా పట్టుకొని తీరాలని అతడు పట్టు పట్టేడు. నాలుగు మూలలూ గాలించాడు. సముద్రమథనం చేశాడు.

"ఆ పాజీని చంపి వేస్తాను. చంపి తీరుతాను" అంటూ వ్యాయామశాలలోని డంబుల్సునూ పెద్దపెద్ద కట్టకడ్డీలను జళిపించి జీవనుడు అగపడనందున గొడ్డలితో ఆ కడ్డీలను ముక్కలు ముక్కలుచేసి భూపీ కసి తీర్చుకొన్నాడు.

ఈ మాట విన్నాడు నవకృష్ణుడు. అగాధమైన సముద్రంలో పడిపోయినాడు. ఆ కడలికి ఎందును హద్దు పద్దులు లేవు. నాలుగు వీధుల్లోనూ ఈ మాట తప్ప మరేమీ వినబడడం లేదు.

మంజరి తల్లికి ఒళ్ళు మండిపోయింది. కూతురు నుద్దేశించి ఆమె "ఒసే! నువ్వు ఈ కొంపలో చెడపుట్టినావు. నువ్వు చస్తే మేలు! నువ్వు చావు! చావు" అని అరిచింది.

మంజరి చావలేకపోయింది. కాని చచ్చిన దానివలె మంచముపై పడి వెక్కి వెక్కి ఏడ్వ సాగింది.

బంకిం తొడచరచి "నేను బంకిం సింహుడను. సంగతి ఏమో చూసి తీరుతాను. లేకపోతే మారుపేరు పెట్టుకొంటాను" అని విజృంభించాడు.

తండ్రి చెళ్ళున వాని చెంపపై చరచి "పుండాకోరా! ఈ అనర్థానికంతా మూల కారకుడవు నువ్వు! ఆ ఇద్దరినీ నువ్వే కొంపలోనికి లాగుకొని వచ్చావు" అని హుంకరించాడు.

బంకిం మరింత రెచ్చి పోయినాడు. "వాడిని కూనీ చేస్తాను. ప్రాణాలు ఊడబెరికి వేస్తాను" అని ఫీంకరించాడు.

వక్రదృష్టితో వానిని చూస్తూ తండ్రి "ఎవరి ప్రాణాలు తీస్తావురా? ఎవరిని కూనీ చేస్తావురా?" అని గద్దించాడు.

బంకిం జవాబు చెప్పలేదు. క్రొత్త క్రొత్త విషయాలు చేరుస్తూ భూపీ ప్రచారకాండ సాగిస్తూనే ఉన్నాడు. బుగ్గిని మ్రింగిన అగ్గివలె వాని ఆగ్రహం మరింత భుగుభుగుల్మంటూ ఉంది.

ఉక్కిరిబిక్కిరి యైన నవకృష్ణుడు జగద్బంధు మహాశయునకు జాబు వ్రాశాడు. ఉత్తరమునకు సదుత్తరము పడసి మనసులో అతడు కొంత కుదుట పడినాడు.

భూపీటోను చేస్తూ ఉన్న నిష్ఠుర ప్రచారం వలన మంజరి మిగుల సిగ్గుపడి పోయింది. మంచముపై బోర్లగిలపడి వెక్కివెక్కి ఏడుస్తూనే ఉంది. ఎంత నిష్ఠుర మైన ఆఘాతం! ఎంత పెద్ద దెబ్బ! కాందీ పట్టణమందలి వీథులన్నిటిలో అపవాదం పొక్కిపోయింది!

జగద్బంధు మహాశయుని ప్రత్యుత్తరం వల్ల నవకృష్ణుడు తల ఎత్తినాడు. తల్లడిల్లిన గుండె కొంత కుదుటపడింది. మండుతున్న కడుపులో పన్నీటి చుక్కలు రాలినట్లైనది. కథ విని మంజరి మంచముమీదినుండి లేచి కూర్చుంది. కొంపనుండి కాలు కదపినాడు తండ్రి. సుపరిచితులకు జాబు చూపినాడు. ఆ లేఖలోని ముఖ్య మైన వాక్కు లివి :

"మీ అమ్మాయి సాక్షాత్తూ లక్ష్మీదేవి. మా గడపలో కాలు పెట్టడం మా భాగ్యం కదా! ఆనందంతో లక్ష్మీదేవిని మా కోవలో చేర్చుకోవడం కంటె గొప్ప అదృష్టం ఏముంటుంది?"

ఇక ఆ దిక్కున భూపీ అడవిలో ఆకలితో మసలు పెద్ద పులివలె గర్జిస్తూనే ఉన్నాడు. ఏమేమో చేస్తానన్నాడు. అయినను నవకృష్ణుడు మనసును చెదుర నీయక కాందీ పట్టణమునుండి సొంత వూరుకు మళ్ళినాడు.

కాందిలో శుభకార్యం జరిపేందుకు అతడు సాహసించలేదు. వేసవి సెల వులు గడచిన కొలది దినములలోనే పెళ్ళి జరిగి తీరాలి. "మరి కొన్నాళ్ళు సెల విప్పించండి" అని పాఠశాలాధికారులకు అతడు దరఖాస్తు పెట్టినాడు. దరఖాస్తు చేత బుచ్చుకొని వెళ్ళినాడు బంకిం. అతడు వెళ్ళిన తర్వాత ఏమి జరిగిందో దేవు డెరుగును. భూపేనుకు వానికి బెడిసి పోతుందని అందరూ అనుకొన్నారు. మీదు మిక్కిలి వారి స్నేహసూత్రం పుటుక్కున తెగిపోక మరింత గాఢమై పోయింది. ఇంటికి తిరిగి వచ్చి అతడు కథంతా పాడుచేసినాడు.

"పెళ్ళికొడుకు డాక్టరు పరీక్షకు చదువుతున్నాడు" అని అందరూ హర్షిం చారు. కాని జగద్బంధుమహాశయుడు తన జాబులో ఇలా వ్రాసినాడు." నా

కొడుకు డాక్టరు పరీక్షకు చదవడం లేదు. ఆయుర్వేదం మా ఇంట బుట్టింది. నా దగ్గర మా పిల్లవాడు కులవిద్యలో తరిఫీదు అవుతాడు."

ఈ మాటలు విన్నప్పుడు మంజరి మొగము ముడుచుకొని పోయింది.

"కులవిద్యలో ఆరితేరితే తప్పేముంది?" అన్నాడు గృహయజమాని.

"ఈ కుల విద్య పాతకాలపు వైద్యం. అబ్బెబ్బే! ఈ రోజుల్లో ఈ వైద్యం చేసేవారికి పేరు ప్రతిష్ఠలు ఎక్కడ? వాళ్ళ చేతులకు డబ్బు మాత్రం ముట్టుతుందా? పిల్లవారు ఇంగ్లీషు డాక్టరు పరీక్షకు చదివి తీరాలని వాని తండ్రికి రాయండి" అన్నది ఇల్లాలు.

"చాలు చాలు నీ సలహా. తన కొడుకు చదువు సంధ్యల విషయమై చూచు కొనేవాడు అతడు. ఆ బాధ్యత అతనిదా లేక మనదా? డాక్టరు పరీక్షకు చదివించ డమో, మానడమో నిర్ణయించేవాడు అతడు."

ఈ మాటలు మంజరి తల కెక్కినవి. గోప్యంగా ఆమె శోకించింది. గుట్టుగా ఆమె తల్లడిల్లడం తల్లికి తెలియక పోలేదు.

"ఏమో నాకీ సంబంధం అంతగా నచ్చడం లేదు. పిల్లవాడి వాలకం కూడ నా కంతగా గిట్టలేదు. అంగవస్త్రం బుజంమీద వేసుకొని, మందుకుప్పెలు సంచిలో వేసికొని తిరుగుతాడు కాబోలు, రోగులను వెతుకుతూ. ఈ రీతి వరుడు నా బిడ్డకు వద్దు" అని ఆమె అన్నది.

"ఈ చాదస్తపు ధోరణి కట్టిపెట్టు. ఈ పెళ్ళి జరుగకపోతే నీ కూతురుకు కన్నెచెర వదలదు."

"భూపీబోసు కాలసర్పపు కానుపు. వానిచేత పిల్లకు ముడి పెట్టిస్తావా, దాని బ్రతుకంతా విషమయమైపోతుంది. బిడ్డను ఇప్పుడు తన కడుపులో పెట్టుకొనేందుకు ఒక్క జగత్మహాశయుడే సిద్ధంగా ఉన్నాడు. నాటు వైద్యం చేస్తాడనీ, కవిరా జవుతాడనీ పిచ్చిపిచ్చి కబుర్లు చెప్పి ఆతణ్ణి తోసిరాజనవద్దు."

మగని పలుకులు విని మరి మాట్లాడలేదు. ఏమేమో గొణుగుకొంటూ అందుండి మరలిపోయింది మంజరి తల్లి

ఇంటిలో ఈ ధోరణి చూచి, పోయి, భూపీతో ఏదో ఒడంబడిక కుదుర్చు కొని వచ్చినాడు బంకిం. రెండు రోజులు ఇంటిలో కురుక్షేత్రకాండ జరిగింది,

మూడవనాడు మగడు గుఱ్ఱుపెట్టి నిద్రపోతూ ఉండగా మంజరినీ, బంకింనూ వెంటబెట్టుకొని తల్లి చప్పుడుకాకుండా ఒక ఎద్దుబండిని కుదుర్చుకొని కాందీకి పోయింది. పంచాంగం ప్రకారం మర్నాడే వివాహం జరిగి తీరాలి.

కాందీ చేరి తన బుద్ధికి అనుకూలమైన విడిదిలో ఆమె ప్రవేశించింది. భాజాభజంత్రీలతో పనిలేకుండా భూపీచేత కూతురు మెడలో వేయించింది మూడు ముళ్లు. ఆమె కళ్లనుండి ఆనందాశ్రువులు రాలినవి. పీటలపై కూర్చున్న వధూవరులను దగ్గరవారికి చూపి "చూడండి ఈడూ జోడూ. మదన మంజరి సఖ్యంకాదా?" అన్నది ఆమె.

భూపీ బోసు గొప్ప యింటివాడనీ, వాని వంశంతో వియ్యం కుదరడమే దొడ్డ అదృష్టమనీ ఆమె మురిసిపోయింది. విందు కుడిచి హాయిగా నిద్రపోయింది.

* * *

అక్కడ ఠాకూర్‌దాస్ "యిట్టి వట్టి దగాకోరుపని చీటింగ్‌కేసు. వాణ్ణి కోర్టులోనికి ఈడ్చుకొని రావాలి" అని హూంకరించాడు.

జగద్బంధుమహాశయుడు కదలలేదు. మెదలలేదు. చెక్కుచెదరని మనస్సుతో అత డిట్లన్నాడు. "అంతకుముందు మంచిపాత్రిని వెతకుము. మనం కుదుర్చుకొన్న ముహూర్తంలోనే పిల్లవానికి పెళ్లి జరిగితీరాలి. మంచి వంశంలో పుట్టిన బాలికను వెతకుము. తప్పకుండా శుభకార్యం జరిగి తీరాలి. కేసూగీసూ తరువాత చూచుకొందాం. ఆమోద ఆహ్లాదాలతో అంతరంగం నింపుకొని ఉదరం నింపుకొని, శరీరదార్ఢ్యం పెంచుకొని, ప్రసన్నముఖంతో హృష్టచిత్తంతో 'హుయినర్ మజ్జా!' అని కోర్టులో ప్రవేశిస్తాం. జంకుగొంకులకు ఎడమీయక న్యాయమూర్తి సమక్షంలో అపుడు "అయ్యా ఏలినవారూ! అతడు మోసగించాలని పెద్ద ఎత్తు వేశాడు. కాని మేము బుట్టలో పడలేదు. పప్పులో అడుగు వేయలేదు. ఈ విషయాలన్నీ గమనించి, మీ చట్టాల్లోనుంచి అవసరమైన సెక్షనులనూ, లా పాయింట్లనూ పెల్లగించి కేసు విచారణ చెయ్యండి—అని మనవి చేస్తాము" అంటూ జగద్బంధుమహాశయుడు పకపక నవ్వసాగినాడు. ఎల్లరూ అతని ముఖవైఖరినీ వాక్కుల ధోరణిని గమనించి విస్తుపోయారు ఘోరమైన అవమానమూ, అత్యాచారము జరిగినప్పటికీ అతడు కడుపు చెక్కలు అయ్యేటట్లు నవ్వుతున్నాడు!

"పిల్లవానికి వెంటనే వధువును వెతికితీరాలి. ఏకాదశినాడే శుభకార్యం జరిగి తీరాలి. ఒక్కరోజైనా దాటేందుకు వీలులేదు. నువ్వూ, సురేంద్రా, సేతాబూ నావెంట రండి. మనం ముగ్గురమూ కలిసి పెళ్లికూతురును వెతుకుదాం. పిల్ల మీకు నచ్చితే చాలు. మీరు తల ఊపితే 'నేను మాబాగు' అని ఒప్పుకొంటాను. బాలిక నిరుపేదల యింటిబిడ్డ కావచ్చు. ఆరోగ్యం కలిగి, చక్కనిదై ఉండాలి. మంచి వంశంలో పుట్టిఉండాలి" అన్నాడు జగద్బంధు మహాశయుడు.

ఈ మాటలు వినినపుడు సురేంద్ర, సేతాబు, నేపాలుల ఉత్సాహానికి మేర లేకపోయింది. జెబ్బలు కొట్టి "మేము చక్కని చుక్కను, మేలిమి బంగారు బొమ్మను, తీగను వెతకితీరుతాము." అని వారు ఏకగ్రీవంగా పలికినారు.

సేతాబు నవ్వుతూ "ఒక రాజపుత్రుడూ, మంత్రిపుంగవుడూ సేనాధిపతీ ఎటువంటివాళ్లో మా జీవనుడు అటువంటివాడు. కావ్యాల్లో ప్రబంధాల్లో జరిగే పెళ్లిళ్లవలె వీని వివాహమహోత్సవం జరిగితీరాలి. పేదవారి పిల్లేమి? మే మొక రాజపుత్రికనే పట్టుకొని తీసుకొని వస్తాం. ముత్యాల పల్లకీలో ఎక్కి మనవాడు మురిసిపోతాడు. ఇటుచూడు జీవనా! నువ్వు ఒక్కపర్యాయం నవ్వు. నీ నవ్వు మొగముచూచి మేము చిత్తం వచ్చిన రీతిగా కులుకుతాం" అన్నాడు.

పరక్షణమందే అతడు భేషైన సంబంధం కుదుర్చుమని కోరుతూ తన మేనమామకు యిలా జాబు వ్రాశాడు. "చక్కని చిన్నది, గుణవంతురాలు, మంచి వంశంలో పుట్టింది. కాయస్థుల కుటుంబంలో పుట్టిన పిల్లను వెతకి తక్షణమే తెలియపరచుము. కట్నాలతో, కానుకలతో ఏమీ పనిలేదు. లాంఛనాలు మాట ఎత్తనక్కరలేదు. వరుని తండ్రి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న కవిరాజు. వైద్యులలో మాణిక్యం అంటే నమ్ము. జగత్‌మహాశయుడంటే, అతడు రెండుచేతులతో డబ్బు సంపాదిస్తున్నాడు. స్థిరాస్తీ చరాస్తీ బాగా ఉన్న వాడు. వసతివాళ్ల విషయంలో వ్రేలెత్తి చూపదగినవాడు! పొలాలూ, తోటలూ, దొడ్లు గొడ్లూ, చెరువులూ పంటకాల్వలూ మరి చెప్పేదేముంది? మంచి హుందా తనంతో మసలేవాడు. మూడు పూవులు, ఆరు కాయలూ యింకా ఏమేమో వాని సొమ్ములై ఉన్నాయి. వరుడు తండ్రి నోటిలో పుట్టినవాడు. కవిరాజు వృత్తికై చదువుతున్నాడు. మెరికెలాంటివాడంటే నమ్ము"

సురేంద్రుడు నడుముగట్టి సర్వసన్నాహాలతో బయలుదేరినాడు. జగత్ మహాశయునియొద్దనుండి కొన్ని రూకలు చేతబుచ్చుకొనినాడు. "నే నీ జిల్లాలోని

పట్టణాలనూ, పల్లెలనూ గాలించి విడిచిపెడతాను. ఈ ప్రదేశాలో చెట్టుక్రింది ప్లీడర్లు కొల్లలుగా ఉన్నారు. వారిలో మన కులస్థులకు కొదువ లేదు. వయసు ముదిరిన బాలికలు వారి ఇళ్లలో పెరుగుతూ ఉన్నారు. కంటికి నచ్చిన పిల్లదానిని ఏరుతాను'' అని ఘంటాపథంగా పలికినాడు. మంచిముహూర్తం చూచుకొనే అతడు బయలుదేరినాడు.

''శుభము'' అని జగత్‌మహాశయుడు వానికి సెలవిచ్చినాడు.

ఇక నేపాల్! చిన్నతనంనుండి యితడు సగమువెఱ్ఱితో పెరుగుతూ వచ్చినాడు. వాని జీవితవిధానం మిగుల విచిత్రమైనది. వాని తండ్రి సబురిజిష్ట్రారు ఆఫీసులో మూలస్థానం ఆక్రమించుకొన్న గట్టి ఘటం. తండ్రితో ఆఫీసుకు పోయి నేపాల్ టవుట్ పని చేస్తూ ఉండేవాడు. దస్తావేజులు చప్పుచప్పున రిజిష్టరు అయ్యే వ్యవస్థలు చేస్తూఉండేవాడు. పత్రాల్లో తప్పులుంటే నిమిషంలో పట్టివేసి సవరణలు సూచిస్తూ ఉండేవాడు. అసలు ఆసాములు హాజరు కాకపోతే 'పేళ్లు' జవాన్ ద్వారా పిలిపించి, రప్పించి, తన ఫీజు ఒప్పించి, చెప్పించి చురుకుగా పనిచేస్తూ ఉంటాడు. ''ఈ ఆసామి పేరూ, వీని తండ్రిపేరూ, ఊరిపేరూ, ఏప్రకారంగా చెప్పిఉన్నాడో అది అంతా సత్యం. ముమ్మాటికి సత్యం. నేను నేపాల్ చంద్ర ముఖోపాధ్యాయుడను; నా తండ్రిగారి నామధేయము శ్రీ వినోదలాల్ ముఖోపాధ్యాయుడు. సాకీ— నవగ్రామము. నేను యితగాణ్ణి ఎరుగుదును. గుర్తుపట్టగలను.'' అని ముక్తకంఠంతో పలికి దగ్గర ఉండి దస్తావేజుపై ముద్ర వేయించేవాడు, తక్షణమే రెండు అణాల ఫీజు పుచ్చుకొనేవాడు. సబురిజిష్ట్రారు ఆఫీసు ఆవరణలో ఉన్న మఱ్ఱిచెట్టుక్రింద తిష్ఠవేసి అగపడిన వారిని వేర్వేరు రీతుల వరునికై వాకబు చేసేవాడు.

'ఏమండీ మహాశయుడుగారూ! మీ దృష్టిలో ఎవరైనా కాయస్థుల అమ్మాయి ఉందా అండీ?'' అని అడిగేవాడు.

మళ్లీ ''ఓహో! ఏమోయీ! నీ పేరేమిటి? నువ్వు గోవిందుకాదా? ఎవరైనా పెళ్లికూతురును చూపించగలవా?'' అని అడిగేవాడు.

ఇంకొకతూరి ''ఏమండీ షేక్‌గారూ! మీదేవూరండి? మీఊళ్లో ఎవరైనా కాయస్థుల పిల్ల దొరుకుతుందా? పిల్ల చక్కని చుక్కై ఉండాలి. మంచి వంశంలో పుట్టిఉండాలి. చెప్పగలరా?'' అని వాకబు చేసేవాడు.

తరువాత చెట్టుదగ్గరనుండి కదలిపోయి, వీధుల్లో, బజారుల్లో, చేలల్లో, డొంకలదాపల ఎవరు అగపడినా అదేవిధంగా అడుగుతూ ఉండేవాడు.

"ఏ కొంపలోనైనా మంచి పిల్ల ఆగపడిందా?" అని అంటూ ఉండేవాడు.

చివరకు ఒక గట్టివాణ్ణి పట్టివేశాడు. అతడు ఇతరులవద్ద భూమి కౌలుకు తీసుకొని, కమతం చేసేవాడు. వాని పేరు నవీనుడు. "కొంచెము వయసు మళ్లితే మరీ మంచిది. ఆమె పెళ్లికి తయారుగా కూర్చోవాలి" అని మనవాడు హెచ్చరించాడు.

నవీనుడు కాటోవా అనే యాత్రాస్థలమునకు పోతున్నాడు. కావడితో గంగా జలం తెస్తాడు. "నువ్వు ఎంతోదూరం పోతున్నావుకదా! వచ్చేటప్పుడు పెళ్లికూతుర్ని వెతికి కనుక్కొంటావా?" అని మిక్కిలి ఉబలాటంతో అతనిని ప్రశ్నించాడు.

ఈనాటి జీవనమహాశయుడు ఆనాడు వట్టి జీవనుడే! పెద్దగా చెప్పాలంటే మంజరి విషయమై తగిలిన దెబ్బ జీవనదత్తు గుండెను పగులగొట్టింది. గుండె పగిలింది కాని ముక్కలై క్రింద పడలేదు. ఆగ్రహాన్ని, ఆక్రోశాన్ని అణచుకో లేకపోయినాడు. ఏవిధంగానైనా పెళ్లాడితీరాలని అతడు గట్టిపట్టు పట్టినాడు. వాని వైఖరిచూచి కొందరు నవ్వుకొన్నారు. కొందరు ఏమేమో విమర్శలు సాగించారు. ఎవరెవరు ఎందరెందరు ఏమేమి అనుకొన్నప్పటికీ అతడు లెక్కచెయ్యలేదు. తరుణ వయస్కుడు ఉన్మత్తునివలె వ్యవహరించాడు; విజృంభించాడు.

నేడు వృద్ధుడైన జీవనమహాశయుడు ఆరోజుల్లో జరిగిన కథ తలచుకొని నవ్వుకొన్నాడు. రసజ్ఞుడైన ద్రష్టవలె దీర్ఘ జీవిత కథాంశములను స్మృతిపథంలో పరిశీలిస్తున్నాడు.

పాముకాటువలన పీడింపబడువాని నాలుకపై నిమ్మరసము పోసినయెడల వాని కది తియ్యగా ఉంటుంది. తీపిపదార్థము వానికి పుల్లగా ఉంటుంది.

కాదా? .... ....

ఊహాపరంపర మనసులో దొరలిన కొలది, హావభావములతో తల పంకించుచు తనలో తాను ఒక పర్యాయం "అవునవును" వేరొకమారు "కాదు, కాదు" అనుకొంటున్నాడు.

"మంజరి నాపట్ల విశ్వాసఘాతుకత ప్రదర్శించింది. అటువంటి మోస కత్తెపై నాకంత మోజు ఎందు కుండాలి? ప్రేమను ఎన్నడైనా సర్పవిషమునకు పోల్చవచ్చునా? రెండు చేతులతో విషపాత్రను పుచ్చుకొని అడుగున ఒక్క చుక్క నైనా మిగల్చకుండా గరళమును త్రాగివేశాను" అని అతడు తలపోసినాడు.

హృదయ సంక్షోభంతో పడుచుతనపు ఉద్వేగంతో జీవనదత్తు ఆనాడు రెండు ప్రతిజ్ఞలు చేసినాడు.

"మంచి అందకత్తెను పెళ్ళి చేసుకొని దేవేంద్ర సుఖం అనుభవిస్తాను. రఘువంశములోని ఇందుమతిని అజమహారాజు ఏరీతిగా ప్రేమించాడో ఆరీతిగా నా పత్నిని నేను ప్రేమించి తీరుతాను" ఇది మొదటి శపథము. రెండవ ప్రతిజ్ఞ ఇది: "నేను తప్పకుండా ఇంగ్లీషు పద్ధతిలో డాక్టరునై తీరుతాను. వీలైతే మెడికల్ స్కూలులోనో, మెడికల్ కాలేజీలోనో విద్యాభ్యాసం చేస్తాను. లేకపోతే యింటిలో కూర్చుని నా అంతకు నేనే చదువుకొని డాక్టరు నవుతాను."

వాని మానస నేత్రం మ్రోల ఈ రెండు లక్ష్యాలూ మహోజ్జ్వలములై తేజరిల్లినవి.

ఆ ప్రాంతంలో తొలుత ఖ్యాతి గడించిన డాక్టరు రంగలాల్ ముఖర్జీ. ప్రాతః కాల సూర్యునివలె అతడు జీవన దిగ్వలయంపై లేచినాడు.

అతడు ఆశ్చర్యం కలిగించు మనుష్యుడు, వాని ప్రతిభ విస్మయం పుట్టిస్తుంది. రోమాంచకర సాధన వానిది. అతని చికిత్స కూడ అట్టిదే: వాని శరీరము గౌరవర్ణము గలది, సామర్థ్యమును గురించి ఎంతైనా దొడ్డదని చెప్పవచ్చు. వానిదృష్టి తీక్షణమైనది. నూరుగురు వ్యక్తులలో చూచినప్పటికీ "అడుగో రంగలాల్ డాక్టరు" అని వ్రేలెత్తి చూపవచ్చు. స్వాక్షరము లందు ప్రతిభ ఎవరెవరి వైఖరియందే ఆత్మ ప్రకటన గావించుకొనునో అట్టి వారిలో రంగలాల్ ఒకడు. అట్టివ్యక్తులు దుస్సాహసమందు అజేయులు. అతడు స్వల్పభాషి. అతడు ఉచ్చరించు కొలది మాటలు రూఢములని చెప్పలేము, అవి దృఢములు. కఠినము లని చెప్పలేము. కాని సాధారణ ప్రజలు అవి మిగుల రూఢములని అనుకొంటూ ఉంటారు. హుగ్లీ జిల్లాలోని ఒక పల్లెయందు నిష్ఠా గరిష్ఠులైన బ్రాహ్మణుల కుటుంబములో పుట్టినాడు. హుగ్లీ స్కూలులో చదువు ముగించి కాలేజీలో ఎఫ్. ఏ. వరకు చదివినాడు. అపుడు తండ్రితో పడక యింటి నుండి బయటపడినాడు. కాలేజీలో చదువు ముగించే దినాలలో అతడు హుగ్లీ

మండలంలోని క్రైస్తవ మిషనరీల ప్రభావంలో పడిపోయినాడు. వారి యొద్దకు తరచుగా పోతూ, వారితో కలిసి భోజనం చేస్తూ ఉండేవాడు.

"జాతి భేదములను నేను లెక్క చేయను. మత మంటే నమ్మకం లేనపుడు మతాంతర విషయమును గురించిన ప్రసక్తియే లేదు." అని అతడు రాయిగ్రుద్ది కంఠమెత్తి పలికేవాడు.

ఇంటినుండి బయట పడినపుడు వాని చేతిలో చిల్లిగవ్వయైనా లేదు. ఈ జిల్లాలో మొదట ప్రవేశించినపుడు ఒక పల్లెటూరి బడిలో పంతులుగా ప్రవేశించాడు. అంతకంటె పెద్ద పాఠశాలలో తదనంతరం మేష్టరుగా చేరినాడు. ఒక జమీందారు స్థాపించిన ఉన్నత పాఠశాలలో టీచరుపని ఖాళీగా ఉన్నదని విని దానికి ధరఖాస్తు పెట్టినాడు. ఆ ఉద్యోగం వానికి దొరికింది. ఈ ఉద్యోగంలో ఉండగా హఠాత్తుగా వాని చూపు వైద్యవిద్యలో పడింది. జమీందారుల ఆసుపత్రిలోని డాక్టర్లతో వానికి పరిచయం కలిగింది. వారి కడకు తరచుగా పోతూ ఉండేవాడు. పదేపదే ఆసుపత్రిలోని రోగులను చూస్తూ ఉండేవాడు. డాక్టర్ల కడనుండి పుస్తకాలు తీసికొని శ్రద్ధగా చదువుతూ ఉండేవాడు. రాత్రులందు వారితో చర్చలు సాగిస్తూ ఉండేవాడు. ఒక్కొక్కప్పుడు చర్చలు ముదిరి తార్కికపు ధోరణిలో పడుతూ ఉండేవి. తర్కంలోనుండి కలహానికి దిగుతూ ఉండేవారు. ఈ అద్భుత కార్యక్రమం సాగుతూ ఉండగా రాత్రులు గడచిపోయేవి. భళ్లున తెల్లవారుతూ ఉండేది.

ఒకనాడు కలహం ఏరూపు దాల్చిందో చెప్పలేము. ఆ విషయం రంగలాల్ ఎన్నడూ ఎవరితోనూ తెలుపలేదు.

డాక్టర్లు కూడా ఈ ప్రసక్తి ఎన్నడూ తేలేదు. కాని ఆనాటినుండి వీరికీ, వానికీ గల సంబంధం పుటుక్కున తెగిపోయింది. కొన్ని రోజులు గడచిన పిదప రంగలాల్ తన మేష్టరీ ఉద్యోగానికి తిలతర్పణాలు వీడి తన పుస్తకాలను ఒక బండిలో చేర్చుకొని ఈ ప్రాంతానికి వచ్చి చేరుకొన్నాడు. ఇందుండి ఆరుమైళ్ళ దూరంలో మయూరాక్షీ నదీతీరంలో ఒక చిన్న జనపదంలో ముసల్మానుల కొంపను అద్దెకు తీసుకొన్నాడు. కొన్నాళ్లు పోయిన పిదప నదీ తీరంలో సొంత లోగిలి తయారు చేసుకొన్నాడు. తనయింటి వసారాలో కూర్చుని మయూరాక్షీ ఝరీ సౌందర్యమునకు కన్నులప్పగించే వాడు. అపుడపుడు శ్మశానంలో రాత్రులందు పిశాచసాధకుని వలె మసలుతూ ఉండేవాడు. నడుముకు ఒక పారను

బిగించికట్టి, త్రోపుడు బండిని లాగుకొని పోయేవాడు. వల్లకాటిని కలయచూచి, పూడ్చిపెట్టబడిన పీనుగులను బయటికి లాగి, మరల గోతులను పూడ్చేవాడు. పీనుగులను త్రోపుడు బండిలో వేసుకొని లాగుకొని పోతూ ఉండేవాడు. రెండు మూడు రోజులు ఎవరికళ్ల బడకుండా ఉండేవాడు. పరిశోధనలో మునిగిపోయే వాడు. తనయింటి వెనుక బల్లల కూర్పుతో ఒక గదిని తయారు చేసినాడు. దానిని పెద్దగ్లాసు పలకతో కప్పివేశాడు. ఆ యింటిలో ప్రవేశించేందుకు మానవ మాత్రున కెవ్వనికీ హక్కు లేదు. పీనుగులను ఆ గదిలో పేర్చి, వానిని కోసి, పుస్తకాలను తెరచి చూస్తూ వాటిలోని విషయాలనుబట్టి దేహతత్వమును గ్రహించే వాడు. కొన్నాళ్ళు పోయిన తరువాత తనకు సహచరుని ఒకనిని సంపాదించాడు. అతడు నదిపై పడవలు నడుపుతూఉండే పల్లెవాడు. వానిపేరు భల్లూకం. శ్మశానంలోనే రంగలాల్‌కు మరొక అద్భుత వ్యక్తితో గాఢమైన స్నేహం కుదిరింది. అతడు దారుణమైన త్రాగుబోతు. 'వల్లకాటి రక్కసి' అని ప్రజలు వానిని పిలుస్తూ ఉండేవారు. వాని ఆకలిమంట ఎన్నడూ ఆరిపోయేది కాదు. ఒక కుండెడు అన్నమును అతగాడు నిమిషంలో దిగమింగేవాడు. అంతటితో ఆకటి చిచ్చు చల్లారేది కాదు. శ్మశాన సమీపంలో ఏదేని మేకపోతు అగపడగానే దానిని లాగుకొనివచ్చి పీక నులిమి దానిని చంపి, చితాగ్నిలో వ్రేల్చి, దాని మాంసమును కడుపార మెక్కేవాడు. ఈ మహావ్యక్తి రంగలాల్ డాక్టరుకు ప్రథమ భక్తుడైనాడు. ఒకటి రెండేళ్లు గడిచిన పిదప అతడు రంగలాల్‌కు వంటవాడుగా కుదిరినాడు. వానిచేతి అన్నమునే అతడు పరమసంతోషముతో మెక్కేవాడు. శవాలను సంగ్రహించడంలో యజమానికి అండదండగా ఉండి తోడుపడుతూ ఉండేవాడు. మయూరాక్షీనదిలో కొట్టుకొని వచ్చు పీనుగులను ఈదుకొనిపోయి లాగుకొని వచ్చి ఒడ్డున చేర్చి రంగలాల్‌కు అప్పగించేవాడు. శ్మశానంలో విడువబడిన శవాలను తెస్తూ ఉండేవాడు. నక్కల పాలుబడిన పీనుగులను వానిని తరిమిగొట్టి వశపరచుకొనేవాడు. వీని సాహచర్య సాహాయ్యములతో ఐదు పంవత్సరాల సాధనము ముగిసిన పిదప ఒకనాటి ప్రాతఃకాలమున లేచి రంగలాల్ కంఠమెత్తి "నేను రంగలాల్ డాక్టరును" అని ఘోషించాడు. "ఎవ్వరివల్లనైనా కుదరని రోగాలు కలవారుంటే నాదగ్గరకు రండి. క్షణంలో ఆతెగుళ్లను కుదిర్చివేస్తాను" అని రంగలాల్ ఢంకామీద దెబ్బకొట్టి అరచేడు. వాని మిత్రు లిద్దరూ బలపరుస్తూ ప్రచారం చేశారు.

కొలదిదినాల్లో తనఘోషణ సత్యమని రంగలాల్ ఋజువు చేయగలిగినాడు. వాని ప్రజ్ఞా విశేషములను గాంచి ప్రజలు ఆశ్చర్యాన్వితులై పోయినారు. "ఇతడు సాక్షాత్తూ ధన్వంతరి" అని వారు ఏకగ్రీవంగా పలికినారు.

అచిరకాలములో రంగలాల్ డాక్టరు ఒక సవారిని కొన్నాడు. రోగుల వద్ద నుండి పిలుపు రాగానే సవారిలో పయనించే నిమిత్తము. అతనిహోదా, అతనిదర్జా దశదిశలందు విస్తరించాయి!

భల్లూకం యజమానిని ఉద్దేశించి ఇలా అన్నాడు:

"అయ్యగారూ! సవారీలో ఏం మజా ఉందండి? ఒక గుఱ్ఱాన్ని కొని వెయ్యండి. గుఱ్ఱపు దౌడుకూ బోయీల నడకకూ పోలిక ఏముంటుందండి?"

"ఛీ! ఊరుకో! గుఱ్ఱపు వీపెక్కినపుడు అది దౌడుతీయగా నా ఒళ్లంతా హూనమై పోదా? ఎముకలు చితికి ముక్కలు కావా? మనుష్యుల మెడమీద కూర్చుంటే ఈ బాధలు తప్పుతవి. హాయిగా ప్రయాణం సాగించవచ్చును కాదా?"

"చిత్తమండి."

"అరే! పాజీ! ఇదంతా నీకేం తెలుసు? గుఱ్ఱపు స్వారిలో మోజు చూపి ఒళ్లు గుల్ల చేసుకున్న వారు లేరా?"

జీవనదత్తు ఆదినాల్లో ఆకాశకుసుమాలను ఒళ్లో చేర్చుకోలేదు. వాస్తవమై, సజీవమైన ఆదర్శముమీదనే ఆతడు తనలక్ష్యం నిలిపినాడు. తాను డాక్టరై, పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొని రంగారు బంగారు నగలతో చక్కనైన భార్యను అలంకరించి, ఆమెను వెంటబెట్టుకొని, కాందీ పురమునకు పోవడం వాని ప్రధానోద్దేశం. భార్యను సవారీలో కూర్చుండబెట్టి, తాను తెల్లగుఱ్ఱ మెక్కి మేనా వెంట పోవాలని అతడు ఉద్దేశించినాడు.

మూర్షిదాబాదుకు పోతూ, మార్గంలో కాందీలో భూపీబోసులోగిలి ముందు గుఱ్ఱాన్ని నిలిపి సవారి ఆపి, భూపీని పిలిచి, "ఏమోయీ! భూపీ! ప్రయాణం సాగిస్తూ ఉండగా చీకటి పడిపోయింది. ఈ రాత్రి మీఇంటిలో విశ్రమించేందుకు కొంతతావు దొరుకుతుందా?" అని అడుగవలెనని అతడు ఊహించాడు. ఉద్దేశ పూర్వకంగా రాత్రిజాము కడచినపిదప వాని యింటికి పోవాలని అతడు మనసులో ప్రణాళిక వేసుకొన్నాడు.

భూపీ గృహంలోనికి తనయిల్లాలిని పంపాలని (మంజరికడకు) ఆతడను కొన్నాడు. ఆమె యింటిలో ప్రవేశించి, 'ఈరాత్రికి మా దంపతులకు కొంత చోటిస్తావా అక్కా? నీవు మాకు కావలసినదానవు. చుట్టరికం కలుపుకొనడం ఏమంత కష్టం? వేలు విడిచిన మేనమామగారి అత్తగారి తోడికోడలితో ఏ వంగ తోటలోనైనా సంబంధ బాంధవ్యాలు కలుపుకోవచ్చునుగదా!' అనవలెను.

ఊహా పరంపర ఎన్నెన్ని దిక్కులకో ఎగసిపోగలదుకదా! కాని ప్రత్యక్ష ప్రపంచంలో జరుగవలసిందేదో జరిగిపోయింది.

వివాహం జరిగిన పిదప సమస్తము విపరీతమై పోయింది. "ఇలా జరిగిం దేమిటి!" అని ఆనాడు జీవనదత్తు ఆశ్చర్యాన్వితుడైనాడు.

# పంద్రెండవ ప్రకరణము

ఆనాడు అతడు ఆశ్చర్యపడినాడు. కాని నేడు వాని కట్టి అచ్చెరుపాటు కలుగలేదు.

వివాహామునకు ముందు జీవనవత్తు ఉత్సాహము శుక్లపక్ష చతుర్దశినాటి చంద్రునివలె ఉప్పొంగినది. కాని పెండ్లినాడు కృష్ణపక్షపు కడలివలె ఆ ఉత్సాహము క్షీణించినది. అతడు విషణ్ణ హృదయుడైనాడు. జీవన మందెన్నడు ప్రాయశః ఎవ్వరును పూర్ణిమను వీక్షింపజాలరు, అమావాస్య సందర్శనమూ కలుగదు. నేడు కూడా అది వానికి అగపడలేదు. ఏకైక పుత్రుడు వనవిహారిని మృత్యువు కబళించి నపుడు సయితము ఆ దృశ్యము గోచరింపలేదు.

ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు జీవనుని పాణిగ్రహణమహోత్సవము ముగిసి నది. ఈ సీమలో కన్యలకు లోపమేముంది? కన్నెచెర తప్పించడం మాటలలోని పనికాదు కదా? బలము గలవారు పెండ్లి బరువును మోయగలరు. బలహీనులపై అది దుర్భరమై ఉంటుంది. దానిక్రింద వారు క్రుంగి కూలుతూ ఉంటారు. జగత్తులో దుర్బలుల సంఖ్యయే హెచ్చుకాదా?

పలువురు కన్యకై దశదిశలందు గాలించివేశారు. చక్కని చుక్క తనపాల బడుతుందని జీవనుడు అనుకొన్నాడు. జగత్ మహాశయుని ఆశ కూడ అంబర వీధిని చుంబించింది. తుదకొక అందాల బరణి అగపడింది. ఆమెకు తలిదండ్రులు లేరు. దేవుడే ఆమెకు దిక్కు. పదునాలుగేళ్లయిన పిదప రెండు నెలలు గడచినవి ఆమెకు. తన అన్వేషణలో ఈ బాలికను పట్టివేసిన బుద్ధిమంతుడు సురేంద్రుడు.

వివాహ మహోత్సవ సమారోహమున కెట్టి లోటు ఘటిల్లలేదు. జగత్ మహాశయుడు ఆయుర్వేద వైద్యవృత్తిలో చివరి కొమ్మ అందుకొన్నాడు. వాని ఐశ్వర్యవిషయము ప్రశ్నింప నక్కరలేదు. సామాజిక ప్రతిష్ఠలో జీవన గగనములో సూర్యచంద్రులు ఒకే పర్యాయము ఉదయించినట్లయింది.

జీవనుడు తండ్రికి ఏకైక పుత్రుడు. ఉత్సవం ఎట్లు విజృంభించి ఉంటుందో చెప్పనక్కర లేదు. మీదు మిక్కిలి వివాహమును విచిత్ర పరిస్థితిలో జరుపవలసి

వచ్చెను. కాందీ పురంలో మంజరీ భూపేసుల పెళ్లి చదీచప్పుడూ లేక ముగిసింది. ఇపుడు కృష్ణభామినీ జీవనుల కల్యాణమహోత్సవము బహు విధ వాద్యములతో మిగుల పెద్ద ఎత్తున జరిగింది. బేండు మున్నగు వాద్యవిశేషములు కాందీనుండి రప్పింపబడినవి. మూర్షిదాబాదునుండి కూడ సంగీతసన్నాహములు రావింపబడినవి.

నవగ్రామమునుండి పదిక్రోశముల దూరములో ఉన్నది కాంది. పెండ్లి ముచ్చటల నిర్ణయము తక్కువగా జరుగలేదు. బంతులాట తంతుకై తరుణులు చాల ఉబలాటపడిరి. సుఖాసీనుడైన జీవనుడు తలవంచుకొన్నాడు. దాపల జేరిన అమ్మలక్కల నుద్దేశించి "అమ్మలారా! క్షమించి నన్ను వదలివెయ్యండి. నా ఒళ్లు బాగులేదు." అన్నాడు జీవనుడు అడకువతో. కాని ఆడువాళ్లు వాని వేడికోలు మన్నించిరి కారు. ఏక గీవంగా పెళ్లిపాటలు పాడినారు. ఒక పెద్ద ముత్తైదువు పెళ్లికూతురును ఒడిలో కూర్చుండబెట్టుకొని ఆమెచే తీవ్రముగా బంతులు రువ్వింపజేసింది వరునిపై.

కృష్ణభామిని ఒళ్లు మేలిమి బంగారుతో తయారుచేయబడింది. ఆమె మోము కోమలమైనది. స్నిగ్ధమైనది. కొంద రామెను సౌందర్యతిలక అన్నారు. మరి కొందరు లావణ్యతిలక అన్నారు. ఆమె అత్తవారింటిలో ప్రవేశించిన నాడు 'అత్తరుకోడ' లని పిలువబడింది. "అమ్మా! పరిమళము వెలారించు గులాబి వంటి కుసుమవు నీవు. నీ వ్యక్తిత్వమునుండి అత్తరు స్రవిస్తూ ఉంటుంది." అన్నారు కొందరు విదుషీమణులు.

శోభన నిశీథమున పూలపానుపు చక్కగా ఏర్పాటైనది. జీవనుని ముఖము ఎందుకో ప్రఫుల్లము కాలేదు. ప్రచ్ఛన్నమైన ఉదాసీనభావము దానిపై విస్తరించిందింది. చుట్టములు మరదళ్లు వదినల వరుసలవారు ఎన్నెన్నిరీతుల పరిహాసములో చేశారు. కాని జీవనుడు గుళ్లో విగ్రహంవలె చతికిలపడ్డాడు. ఆరిపోయిన దీపము వలె వాని మొగము నల్లపడింది, ఏదో నిగూఢమైన వేదన వాని హృదయమును పీడింపసాగింది.

తనకు జరిగిన అవమానమునకు ప్రతీకారంగా అతడు పరిణయమాడినాడు. పెండ్లి ముగిసిన పిదప వానికి బోధపడిన విషయము ఇది: అవమానమునకు ప్రతీకారము జరుగలేదు. కాని వివాహము మాత్రము అయిపోయింది.

ఈ ప్రపంచంలో అవమానమువలన అంతరంగములో అగ్నికీలలు రగుల్కొనును. మనస్సు ధగధగ మండిపోవును. కేవలము పగ తీరినంతనే, ప్రతీ

కారము జరిగినంతనే ఆమంట చల్లారదు. ఎదుటిపక్షమువానిని మాడ్చి మాడ్చి బూడిద చేసినగాని లోపలి జ్వాల చల్లారదు. మనస్సు చల్లపడదు. అట్లు జరుగని యెడల లోని మంటవలన వ్యక్తి తనంత తాను మాడి, మాడి బొగ్గయి భస్మమై పోవును. సహనశాంతులు గలవారి విషయం, మహాత్ముల విషయం వేఱు. అట్టి మహనీయులు శాంతసేచనమువలన, క్షమాసలిలధారవలన ఆర్పివేయగలరు.

జీవనుడు మహాత్ముడు కాడు. అట్లని తానే ఎరుగును. వాని మనసులో రగుల్కొనిన అగ్ని నేడును భుగుల్భుగుల్మని చెలరేగుతోంది. ఆ ఆంతరంగ జ్వాల వెలుపల మాత్రం విజృంభించలేదు. ఎవరికిని ఎరుకబడకుండ అతడు తనంత తాను మాడుతున్నాడు. వాని ఆంతరంగిక యాతనను ఒక వ్యక్తి మాత్రం గ్రహింపగలిగింది. ఆ వ్యక్తి వాని యిల్లాలే: ప్రథమ సమాగమమందే ఆమె తెలుసుకొనజాలింది.

జీవనుని ప్రచ్ఛన్నవేదన సంసారమున ఎల్లరమ్రోల ప్రచ్ఛన్నమై యున్నను, నవవధువునకు అగోచరము కాలేదు. అది మొండిజాడ్యమువలె ఆమెకు సంక్రమించింది. శోభన మంగళముహూర్తమున పూలపానుపున వధూవరులు చేరినపుడు జీవనదత్తు అంతరంగమందలి మంట సతికి సోకింది.

అర్ధాంగిని అతడు గుండెమీదికి చేర్చుకొనినాడు. మగని చేతులను విదుల్చు కొని తిక్త కఠినస్వరముతో ఆమె "ఏమిది? నన్ను వదలండి" అని కసరినది.

"ఏమి? ఇట్లంటున్నావేమి?"

"ఏమంటున్నాను? నన్నంటకండి."

"ఎందువలన? నిన్నంటవద్దా?"

"వద్దనే అంటున్నాను, నన్ను వదలండి. మీ పాదములపై పడతాను. వదలండి."

"ఏమి....? ఏమయింది?"

"ఏమి కావాలి? దయతో మీరు నన్ను పెళ్లాడినారు. ఉద్ధరించారు. అందుచే మీ ఇంటికి వచ్చాను. దాసివలె నేను కాలం గడుపుతాను. రెండు కబళములు తిని జీవిస్తాను. నన్ను భార్యగా ఆదరించండి. నన్ను వదలండి."

ఆనాడే కాకుండా నేడు కూడా వారి కాపురము ఈ ప్రకారమే నడుస్తూఉంది. నేడామె అమ్మవారై పోయింది. అగ్నిపర్వత మయింది. అగ్గికొండలో నిప్పు రవులొ్కనినయెడల మరి చల్లారునా?

ఆమె దోష మేముంది? మగని గుండెలోని భీషణాగ్నియే సంస్పర్శవలన ఆమె హృదయమందు సోకింది! అది భయంకరముగా విజృంభిస్తోంది!

సతీపతుల గుండెలలో రవరవలు చెలరేగినను, వారి సంసారము ఎల్లెల్లో సాగుతూ వస్తోంది. సంతాన సమృద్ధి గోచరించింది.

జీవనుని పేరు ప్రతిష్ఠలు వెనుకబడలేదు. అతడు రెండుచేతులతో సంపాదిస్తున్నాడు. నాలుగుచేతులతో ఖర్చుపెడుతూఉన్నట్లు ప్రవర్తిస్తున్నాడు. విస్తృత కీర్తితో అర్థవ్యాప్తి తులతూగుతోంది. సాధారణ సంసారమున ఇంతకంటె కాంక్షింపదగిన దేముంది?

వారికి ఒక కొడుకు, ముప్వురు కూతుళ్లు పుట్టినారు. సురమ, సుషమ, సురీమ అని వారి పేర్లు. పుత్రుని నామము వనవిహారి. పిల్లలకు తల్లిరంగూ, తండ్రి స్వాస్థ్యమూ లభించినవి. ఖ్యాతి ప్రతిష్ఠిత మగుట నిక్కమే. అయినను జీవనుని దృష్టిలోని లక్ష్యమును అది అందుకొనినదని చెప్పలేము. విశాల వారాశిని పోలునది లక్ష్యము. అత డందిన గమ్యము గోష్పాదపరిమితమని చెప్ప లేము. కాని అది కాసారమునకు ఎనయైనది. దిగంతవిశ్రాంతపుష్కరిణి కాదది. ఆచెరువుకు కట్ట లున్నవి. సలిలము నిర్మల మైనది. మీనసంకుల మైనది. ప్రజ లందు ఆప్యాయముగా నీరు క్రోలుతూ ఉంటారు. తృష్ణార్తుల కది యేడుగడ. సరస్సును నిర్మించినవారు మెచ్చుతూఉంటారు. దానిని విశ్వ విస్తృత సరోవర మునకు పోల్చుటెట్లు ? జీవనుని ఆశలకు అవధులు, పరిధులు కలిగినవి.

నేటి పరిణతవయసులో జీవనుని ఆశలన్నీ నేలగూలినవి. ఎరుపు, నీలము, ఆకుపచ్చరంగులు గల వంకాయలో అతడు ఏడురంగుల ఇంద్రధనుస్సును ఇక వీక్షింపలేడు. వాని భావనావిహంగముయొక్క రెక్కలు సగము తెగిపడినవి. కాల్పనిక శక్తి సన్నగిల్లినది. నే డాతని కన్నులముందు రెండురంగులు మాత్రమే అగపడుతూఉన్నవి. ఒకటి తెలుపు. రెండవది నలుపు. ఒకటి వెలుతురు, రెండవది చీకటి. ఆనాడు ఇంద్రధనుస్సువలె వర్ణవైచిత్ర్యమయమై ఉండిన ఆ కాంక్ష ఎట్లు తేజరిల్లినదో అని యోచిస్తూ ఆశ్చర్యాన్వితుడైనాడు.

చింతాపరంపర మనసులో ప్రవిస్తూఉండగా జీవనదత్తు అనుకొన్నాడు. "ఏల యిట్లు జరిగింది?" అని పదేపదే ప్రశ్నించుకొన్నాడు.

'రెండు రంగులు! దినమందలి తెలుపు! నిశిలోని నలుపు. ఇవి తప్ప తక్కిన రంగులను నీచేతితో నీవు కడిగివేసుకొన్నావు. దృష్టిలోని ఇంద్రధనుస్సులు ముక్కలుముక్కలు చేసివేసితివి. కన్నులనుండి వెలారు యాతనోష్ణాశ్రులందు, అపజయ సముద్భవమైన నిట్టూర్పులందు భాస్వదాశయ సందీపిత రాగవల్లరులు కొట్టుకొనిపోవుననుటకు నా జీవనదృష్టాంతమే ప్రత్యక్ష తార్కాణము. అనృతము నీకు అండయై నిలుచునని తలపోసినావు. నీతండ్రి జగత్ మహాశయుని హితోక్తులను విస్మృతికి సమర్పించినావు. ఆతని శిక్షణము నీ మనుగడకు మనుగడ అగునని ఒకప్పు డూహించినావుకదా!' అని జీవనమహాశయుడు తలపోసినాడు.

తన తప్పిదమును తాను సంశోధన మొనరించుకొని అతడు తల పంకించి పదేపదే గడ్డమును సవరించుకొంటూ "బాగు! బాగు!" అనుకొన్నాడు.

ఆకస్మికముగా ఆలోకకిరణ మొకటి వాని కన్నులకు మిరుమిట్లు కొలిపినది. సంధ్య ఉత్తీర్ణమైపోయింది. రాత్రి అవతరించింది. ఇంతవరకు అతడు బాహ్య పరిస్థితులను మరచినాడు. వెనుకటి జీవితఘట్టములను ఆంతరంగికముగ సింహావలోకన మొనరించుకొంటూ ఉన్నాడు. వర్తమాన విషయములకు దూరస్థుడై ఉన్నాడు,

ఇంటిలోనుండి వెలుతురు వస్తూంది. ఇందిరయో లేక నందయో దీపము పుచ్చుకొని వస్తోంది. ఆదిక్కుగా చూపు నిగిడించినాడు జీవనమహాశయుడు. వస్తూవున్నది ఇల్లాలే! ఆతని గుండె దడదడలాడింది! ఆ సమయములో ఆమె రాక వెనుక ఏదియో శంక అడగియుండును.

దీపమును దిగువ దింపి ఆమె మగనిచెంత నిలిచింది. దీర్ఘాంగి! బంగారు వన్నెగలది. ఆమె పాపిటలో సిందూర తిలకము చక్కగా తీర్చిదిద్దబడినది. కఠోరభాషిణియైన స్త్రీ. ఒక రాజ్యమును శాసింప సమర్థురాలు. పరిహాసప్రక్రియలో జీవన మహాశయుడు పత్నితో ఈమాట తెలుపుతూఉంటాడు. "ఒక్క మనిషిని పిడికిట చేర్చుకోలేకపోతున్నాను. రాజ్యమును, గీజ్యమును గుప్పిట్లో ఎట్లు యిముడ్చుకోగలను?" అని ఆమె పక్కన నవ్వుతూ పలుకుతుంది,

వసారాలో ఆమె లాంతరును ఉంచింది.

"ఏమిటి విశేషం?" అని ముఖమెత్తి జీవనమహాశయుడు ప్రశ్నించాడు. నేడు వాని ఇల్లాలిముఖము మిగుల ప్రసన్నమై మధురమై ఉన్నది. వర్షాభిషిక్తమైన ధరిత్రివలె ఆమె వదనము మమతతో మండితమై కోమలమై ఉన్నది.

"ఈవేళ మీరు టీ పుచ్చుకోలేదు; ఎందుచేత?" అని ఉత్కంఠిత కంఠముతో అత్తరు కోడలు ప్రశ్నించింది.

"మరచిపోయాను."

"మరచారా? టీ త్రాగడం ఎవ్వరైనా మరుస్తారా? హుక్కా మీరంటలేదని చిన్నారి చెప్పింది. వచ్చి పిలిచింది. జవాబు చెప్పినారుకారట. ఒళ్లెలాఉంది? మనస్సు బాగాలేదా? ఏమయిందో చెప్పండి——ఒట్టువేసుకొందునా?"

అప్రతిభునివలె నవ్వి ఆత డిట్లన్నాడు: "ఏమీ కాలేదు. ఏదో ఆలోచనలో పడ్డాను. రతన్‌మేస్టరు కొడుకును చూచేందుకు నవగ్రామం వెళ్లేను. తిరిగి వస్తూ ఉండగా నిశి ఠాకూరిణి పిలిచి అన్నకూతురిని కాబోలు చూపించింది. రతన్‌మేస్టరు కొడుకుది గడ్డురోగం. అయినా గట్టిగా ఏమీ చెప్పేందుకు సాధ్యం కాదు. కాని ఈ బాలిక విషయం? ఏమౌతుందో? ఈమెకు——" డాక్టరు తలకాయ ఊపినాడు. "ఆపిల్లకు ఇంకా ముక్కుపచ్చలు ఆరలేదు. పెద్దగా చెప్పవలసివస్తే పావకు పదిహేనేళ్లు నిండలేదు. ఈ చిన్నవయసులోనే ఆమెకు యిద్దరు బిడ్డలు పుట్టేరు. చంటిబిడ్డ నిజంగా నిండుచందురుడే అన్నది నిశి మురిసిపోతూ. చంద్రుడు కాడు యము డని నేనన్నాను. తల్లిని తినేందుకు పుట్టేడు. నామనస్సు బారుగా పాడై పోయింది——"

"అలా అని నిశితో చెప్పివేశారా యేమిటి?" అని అడలుపాటుతో ప్రశ్నించింది ఆమె.

"లేదు. అయినప్పటికి నిశి కట్లని తెలియకపోలేదు. కట్టుదిట్టంగా బ్రతుకు గడపాలి. ఆమె నోరు కట్టివేయాలి. మరి వేరే మందు అవసరం లేదు. ఎవ రక్కడ?"

ఇల్లాలి వెనుక ఎవ్వరో నిలిచినారు. "నువ్వా ఇందిరా?" "అవును. టీ తయారుచెయ్యమని దానితో చెప్పి నేను వచ్చాను. టీ త్రాగండి. మీరు చాలా

మంచివారు. టీ త్రాగితే నిషా పుట్టదు. ఏమీ ఎగ్గుచెయ్యదు టీ. హుక్కా పట్టడం మరచినారా?''

యజమాని ముందుకు టీకప్పు జరిపింది ఇందిర. ఇల్లా లిట్లన్నది: మీరు టీ త్రాగండి. నేను నిలబడిఉంటాను. మీరు త్రాగినతరువాత కప్పు తీసుకొని పోతాను. ఇందిరా! అల్మారాలో ఏలక్కాయల పొడుం వుంది తీసికొనిరా.''

ఇందిర నిష్క్రమించగనే అత్తరుకోడ లిట్లన్నది: ''నిజమేమో చెప్పండి. చెప్పక మీరు మరుగుపరుస్తున్నారు. ఆసుపత్రి డాక్టరు చెప్పిన మాటలవలన మీరు మనసు పాడుచేసుకొన్నారు. అవునా కాదా?''

''ఈకాలపు డాక్టర్లు అనుభవంలేని పిల్లకాయలు. వారిలో అహంకారం బలిసిఉంటుంది. ఎవరితో ఏమి మాట్లాడాలో ఎరుగరు. మీ నాడీపరీక్షలో, మీ నిదానములో ఏమీ పొరపాటు లేదని నే నెరుగుదును. మతి తల్లి చనిపోయిన తరువాత డాక్టరుపిల్లకాయలకు తెలిసిపోతుంది సంగతేమో! నేనుకూడ ఆవేళ అనరానిమాటలు అన్నాను. అ మాడుమొగపు శశిగాడు నాడి చూడడం ఇక్కడ నేర్చుకొన్నాడు. కంపౌండరీ ఇక్కడే గ్రహించాడు. వాడేమో దడదడ వాగినాడు. నాడీపరీక్షలో కాళ్లూచేతులూ విరుచుకోవలసి వస్తుందేమో! నాకేం తెలుసు? వాని మాటల్లో ఏముందో నేనేమి యెరుగుదును? కాని వాని వాగుడువలన నా మెదడు కుతకుతలాడిపోయింది. ''ఇలా అనేందుకు నీకు నాలుక ఎలా ఆడిందిరా? నీకు సిగ్గులేకపోయిందా? కలికాలం కాకపోతే నీ నాలుక ఊడిపడేదికాదా?'' అని మొగం వాచేటట్లు ఆ పాజీతో చెప్పేను.''

జీవనమహాశయుడు నవ్వినాడు. కాని భార్య ఆడిన మాటలకు అతడు జవాబు చెప్పలేదు. శశిపై ఆమెకు ఆగ్రహం బాగా చెలరేగింది.

మగని ప్రత్యుత్తరమునకు బంగారుకోడలు కొంతసేపు వేచిఉంది. అతని మొగముపై వాడిచూపు నిగిడించింది. కాని అది స్పష్టంగా అగపడలేదు.

శ్రావణమాసమున మేఘాచ్ఛన్నమైన రాత్రి మూడువైపుల తెరువబడిన వసారాలో కూర్చున్నాడు జీవనమహాశయుడు. పాత లాంతరునుండి గ్రుడ్డివెలుతురు వెలువడుతోంది. మీదు మిక్కిలి ఇంటి అమ్మవారి చూపు వార్ధక్యం వలన మ్లానమై ఉన్నది. లాంతరును ప్రక్కకు ఒత్తిగించి, మగనిమీదికి వంగి ఆమె ''నవ్వుతున్నారా? మీది ఖడ్గమృగపు చర్మం. వట్టి గట్టి ఘటం మీరు!'' అన్నది.

మగని నవ్వుచూచి హఠాత్తుగా అమ్మవారు రెచ్చిపోయింది.

"నవ్వక ఏమి చెయ్యమంటావు. ఏడవమంటావా?" అని అతడు చిరునవ్వుతో పలికినాడు.

"ఏడుస్తారా?" అని అరిచింది ఆమె.

హఠాత్తుగా అగ్ని రవుల్కొన్నది. అమ్మవారు ఇలా మాటలు విసరివేసింది. "ఏడుస్తారా? మీకు ఏడుపు ఎక్కణ్ణుంచి వస్తుంది? బ్రహ్మదేవుడు మీకంటికి నీళ్లు ప్రసాదించలేదు. మీరు ఎలా ఏడువగలరు? సొంత కొడుకు నాడి చూడడంలోనే ఉక్కిరిబిక్కిరి అయిపోయినారు! పిల్లవాని ప్రాణం పోతూఉంటే వీధి అరుగుపై చతికిలపడి 'ఏంచెయ్యను? ఏం చూడను?' అని చెప్పిన పెద్దమనిషికి గుండెకాయ ఏది? ఇదంతా నాకు ఆరునెలలకు ముందే తెలిసిపోయింది...."

ఆమెమాట కడ్డువచ్చి డాక్టరు ఇలా అందిపుచ్చుకొన్నాడు.

"చాలుచాలు! ఇక నీధోరణి కట్టిపెట్టు. నిన్ను బ్రతిమాలుతున్నాను ఊరుకో! చాలించు నీ మహోపన్యాసం. నన్ను కొంచెం ఆలోచించనియ్యి. రతన్‌బాబు కొడుకును చూచివచ్చాను. నన్ను కొంచెం ఆలోచించనియ్యి. అవగాహము చేసుకోనియ్యి."

వింటినుండి చివాలున ఎగిరిన తూపు వలె ఆమె కోపంతో అన్నది "అన్యాయం! ఘోరమైన అన్యాయం! మోసం! పెద్దమోసం! నేను గొప్ప తప్పు చేశాను. 'మీతో మాట్లాడడమే దొడ్డనేరం! నాకేమి హక్కుంది? దయతో నన్ను చేరదీసినారు. తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములూ లేని అభాగినిని. మేనమామ పంచలో పెరిగినదానను. ఏ కట్నమూ అపేక్షింపక మీ నట్టింటికి నన్ను ఈడ్చుకొని వచ్చారు. దాసి మనిషిలా నన్ను చూడడం మీ ఉద్దేశం, దాసీదానికుండే హక్కు తప్ప నాకేమి హక్కుంది? నూరుమాట్లు పొరపడ్డాను. నూరు కాదు వెయ్యి మాట్లు! మహాశయుడుగారూ! నన్ను మన్నించండి."

అటు పిమ్మట ఆమె అంధకారంలో అదృశ్యమై పోయింది.

ఇంటి అమ్మవారంటే ఈమె! చాలకాలమునుండి ఇలా కథ సాగిస్తూ ఉన్న దొడ్డ ఆడుది ఈమె! మగని మనస్సు కాయ కాచిపోయింది. ఏడువలేక ఆ అదృష్టవంతుడు నవ్వుకున్నాడు. 'టప్' మని ఏదో చప్పుడయింది. చప్పుడువలన నవ్వు నిలిచిపోయింది. అంధకారము అంతకంతకు గాఢమై ఆ చోటున్న

కప్పివేసింది. తన బ్రతుకే చీకటిమయ మయిం దనుకొన్నాడు. మళ్ళీ వెఱ్ఱినవ్వు నవ్వుకొన్నాడు. నిమిషమునకు ముందు ఇల్లాలు దీపపువత్తిని పెద్దచేసిపోయింది. దీపం భగ్గున మండడం తీవ్రమైన మాటల ధోరణిలో దంపతులు గమనించారు కారు.

దీపం భగ్గుమనగానే చిటుక్కున చిట్లిపోయింది లాంతరు చిమ్నీ. గుప్పున దీపం ఆరిపోయింది. ఫక్కున నవ్వుతూ అతడు ఊరుకొన్నాడు. పుటుక్కున తెగిన చింతాసూత్రమూ మరల తొల్లింటి తెరగున చలింప సాగినది.

"మీ కంటికి నీళ్లియ్యక బ్రహ్మదేవుడు పుడమిలోనికి మిమ్ము పంపినాడు" అని కదా ఆతని పత్ని పలికినది. ఈ మాటను మననము చేయునపుడు వాని నవ్వుకు నిరోధం కలిగినది.

నిట్టూర్పు విడిచి ఆతడిట్లు తలపోసినాడు: "అర్ధాంగీ! కంటికి నీరీయక విధాత నన్ను జగతిలోనికి పంపెనని తలపోయకుము. ఆతడు ప్రసాదించిన కన్నీటి కడలి యెట్టిదో నీవు గ్రహించలేకపోతివి. లవణాక్త బాష్పాంబుధిని విధాత నా కన్నుల వెనుక అణచియుంచినాడు. అట్లని నీ వెరుగవు. అగస్త్య మహర్షి సముద్రమును ఆపోశన మొనరించినట్లు బాష్పాంబురాశిని (చికిత్స శాస్త్రమున ఉల్లేఖింపబడిన కొండొక యోగమును పురస్కరించుకొని) అంతరంగములో చేర్చుకొన్నాను. అది అందులో ఇంకిపోయినదేమో! బహుళ ప్రవాళములు, మణిమాణిక్యములు ప్రాయశః అందున్నవి. సర్వాంగములు లవణాక్తములై, తీవ్రానుభూతి బంధురములై యున్నవి. నీ అనుభూతిని నీవు ఎరుగవు. ఎరుగలేవు. నీవూ మరి మంజరీ మీ రిరువురు మృత్యు స్వరూపిణులు. మీ రెన్నడును అమృతమును క్రోలవలెనని యిచ్ఛగించి యుండలేదు. అపేక్షించి యుండి రేని, మీ కది లభించియుండును."

మరల ఆతడు దీర్ఘ నిశ్వాసమును వీడినాడు.

మంజరి మీదను తన యిల్లాలిమీదను అతడేల దోషమును మోపుచున్నాడు? సొంత విషయము నెందుకు తలంపడు? తన జీవితములో ఎన్నడైన అమృతమును గ్రోలినట్లు అనుభూతిని పొందినాడా? ఈ విషయమును గ్రహించిన వ్యక్తి నేడు లేడు. ఆతడు వాని శిక్షాగురువు; దీక్షాగురువును.

ఆతని అతృప్తి ఎట్టిదో జగత్ మహాశయుడు ఎరుగును. తాను కోరిన అమృతము లభించకపోవడం వలన ఆతనికి అశాంతి, అతృప్తి కలిగిందని ఆత్మ

డెరుగును. మృత్యుకాలమున జగత్ మహాశయుడు కొడుకును చెంతకు పిలిచి, విషయమును బోధించినాడు. తనయునకు చికిత్సా శాస్త్రమున దీక్ష ప్రసాదించిన పిదప పదేళ్ళు మాత్రము ఆతడు జీవించి యుండెను. మరణము ఆసన్నమగు టకు ముందు గంగాతీరమునకు పోయి, గంగాతీరమందే ఆతడు అసువులు విడిచి నాడు. అంతకు ముందే జీవనుని తల్లి అస్తమించింది. తనూభవుని అంతరంగ మును మాడ్చివేయు అసంతృప్తిని ఆమె అంతగా కనిపెట్టలేదు. కొడుకు గుండె లోని కడలిలో బుడుంగున మునిగి వెదకు నేర్పు ఆమెకు లేకుండెను.

వివాహమైన తర్వాత జీవనుడు ఆయుర్వేదమునకు అంకితమైనాడు. సమస్త శక్తులు అందుకై ధారపోసినాడు. పాఠశాలలో చదువుకొనే రోజుల్లో చదువు సంధ్యలు వాని కంతగా రుచింపలేదు. కాని బడి మానివేసిన తరువాత చదువుకై చెవి కోసికొన్నాడు. కొడుకులోని మార్పు చూచి జగత్ మహాశయుడు అబ్బుర పడినాడు. ఆత డిట్లన్నాడు: "బడిలో ఉన్న రోజుల్లో మా వాని బుద్ధి మోటైనదని అనుకొన్నాను. ఇపుడో ఆయుర్వేదముపట్ల వాని బుద్ధి క్షురధార అయింది." అయితే వాక్కు ముగించక కొడుకును చూచి మిక్కిలి ఉబలాటంతో ఇట్లన్నాడు:

"నాయనా! కేవలం వైద్యమే ఇలువేలుపు అనుకోకు. గాంధర్వ విద్య కూడ అవసరం. సంగీతం వలన ఆనందానుభూతి కలుగుతుంది. భగవన్నామ సంకీర్తనం చెయ్యక చికిత్సలో బ్రతుకుతెరువెట్లు పొందగలవు!"

ఠాకూరుదాసుమిశ్రుడు ప్రక్కనే ఉన్నాడు. "ఆ అభిలాష మీ వాని రక్తంలో ఉంది. అది వంశ గతమైన విద్య. మా వాడు సురేంద్రుడు వట్టి శుంఠ అయిపోయినాడు. వట్టి త్రాగుబోతు అయినాడు. చదువు సంధ్యలకు నీళ్ళు వది లేడు. జమీందారీ సిరస్తా పనిలో ప్రవేశపెట్టక పూజారి పనిలో దూర్చా లను కొన్నాను. పూజ, అర్చన వగైరా పనులు జరగాలంటే ఏవేవో మంత్రాలను ముక్కున బట్టాలి కదా! దేవగ్రామంలోని విశ్వేశ్వరీ పూజలో కూర్చో పెట్టాలని అనుకొన్నాను. అమ్మవారు చల్లని తల్లి. దేవిని పూజించి బంగారం పండించు కొంటారు ప్రజలు. అమ్మవారి మందిరాన్ని అంటి ఉన్నాయి మడిమాన్యములు. ఈ బుద్ధిమాలినవానికి మంత్రాలు కంఠస్థము కాలేదు. మరి లెక్కా డొక్కా వాని తలకెక్కలేదు." అని విశేషమైన ఉద్రేకంతో ఆతడు చెర్రెగిపోశాడు.

పుత్రుని గురించి ఠాకూరుదాసుకు గంగవెఱ్ఱు లెత్తినవి. జగత్ మహాశయుని ప్రకృతి వేరు. ఆతడు మనసును చెదురనిచ్చేవాడు కాడు. ఎట్టి పరిస్థితులలో నైనను, ఆతడు చల్లగా మాట్లాడగలడు. అతడు జ్ఞానయోగి. అతని కడుపున పుట్టినను, ఆతని చరణముల చెంతనే విద్యారంభమున దీక్షను స్వీకరించినను మనుష్యుడు హృద్గతము చేసికొనవలసిన జీవనతత్వమును జీవనుడు అకళింతలో చేర్చుకొనలేక పోయినాడు.

ఆయుర్వేదములో వాని బుద్ధి క్షురధారయే అని కదా ఆతని తండ్రి పలికినాడు!

అవును. కత్తి పదునుతో ఎకసక్కెము చేయజాలునదే వాని బుద్ధి. రోగిని పీడించు వ్యాధి ఎట్టిదో తృటిలో ఆతడు కనిపెట్టగలడు. గ్రుడ్డిదై మూగతనముతో వెలయుచు పింగళకేశములతో భయంకరమై హిమశీలత హస్తములను చాపి వ్యాధి లక్షణములను వెంటాడించు మృత్యువును కూడ చప్పున గుర్తు పట్టగలడు. నేడు క్రొత్త క్రొత్త డాక్టర్లు ఎందరెందరో బయలుదేరి జీవనుని పరిహాసం చేస్తున్నారు. అట్లా చేసేందుకు ఒకప్పుడు ఎవ్వరూ సాహసించేవారు కారు.

స్మృతిపథంలో సాగిపోతూ, జీవన మహాశయుడు పెక్కేళ్ళు వహించిన స్థవిర అజగరమువలె గోచరించినాడు. తారుణ్య సులభమైన చురుకుతనము కడ తేరినపుడు తరుణ విషధరము, తీక్ష్ణ విషదంతములు రాలిపోయినపుడు, క్రుంగి పోదా? వార్ధక్యం వలన జీవన మహాశయుని శరీరము జీర్ణించినది. వాడి కోరలు విరిగి పడినవి. గతివేగము క్షీణించినది. ముసలితనపు బరువును ఎట్లో మోస్తున్నాడు.

''నారాయణా! నారాయణా! మాధవా!'' అని స్పష్టస్వరంతో ఆతడు వాకొనినాడు. మృత్యుకాలంలో గంగాతీరంలో జగద్బంధుమహాశయుడు వానితో ఇట్లు పలికినాడు:

''నాయనా! నువ్వు అడగవలసిన దేమైనా ఉన్నదా?''

దుఃఖావేగమును జీవనుడు అరికట్టలేకపోయినాడు. వాని కన్నులనుండి ఎడతెరపిలేని అశ్రుస్రవంతి ప్రవహించసాగింది. నోరు తెరచి అతడేమీ పలుక లేకపోయినాడు.

కరుణరసభరితమైన కంఠముతో తండ్రి ఇట్లనినాడు। "తండ్రీ ఏడ్వవద్దు. నీ దీక్ష వేదములో, ముఖ్యముగా ఆయుర్వేదములో ఉన్నది. చావు పుట్టుకలు మానవునకు తప్పవని నీ వెరుగుదువు. అయినను, నాయనా! ఈవిధంగా దుఃఖపడుతున్నా వెందుకు? నీ ధైర్యము సడలిపోతూ ఉన్నది. ఈరీతిగా నీవు గుండెను పగులగొట్టుకొంటూ ఉంటే ఇంతవరకూ నేను నూరిపోసిన యావత్తు ప్రబోధము వ్యర్థమైపోయిందని ఊహిస్తాను. మృత్యువు సాక్షాత్కరిస్తూ ఉన్నదని నేను దుఃఖపడడం లేదు. పరమశాంతి నా అంతరంగంలో విద్యమానమై ఉన్నది. కాబట్టి బాబూ! నువ్వు దుఃఖపడవద్దు."

పొంగి పొరలువచ్చు దుఃఖమును జీవనుడు ఎట్లో అరికట్టగలిగినాడు.

జనకు డిట్లు పలికినాడు : "నాయనా! నీ మనసులో తీవ్రమైన అతృప్తి అణగిఉన్నదనీ, అది నీకు దారుణమైన యాతన కలిగిస్తూ ఉన్నదనీ యెరుగుదును. ఇది నీ గుండెలో నిలువరాదు. వాడికోరలుగల కాంక్షను తొలగించుట సాధ్యము కాదని యెరుగుదును. కాని ఇది హృదయములో ఉన్నంతకాలము, నీకు అమృతము దక్కదు. మానవానుభూతి నందలేవు. కాంక్షించిన వస్తువు చేజిక్కని యెడల, అతృప్తి మరింత బుసగొట్టును. మనసు ఎటువంటిదో ఎవరు చెప్పగలరు? లక్ష్యసిద్ధి పొంది, తృప్తినంది అమృతానుభూతిని పొందెదవుగాక అని దీవిస్తున్నాను. దుఃఖమును సంవరణ మొనరింపగలిగితివేని, పృథ్విలో మృత్యువు నడుమ అమృతమును గ్రోలజాలుదువు. జ్ఞానయోగమును అభ్యాసం చేయుము. ఇది మనము ఆశ్రయించిన సంస్కృతియొక్క ప్రబోధము. జ్ఞానమార్గము మిగుల కఠినమైనది. శుష్కపథము. అయిననేమి? అగ్యమహర్షి మహాజ్ఞాని. దుఃఖ సముద్రమునుపుడిసిట గ్రోలినాడు. స్వేచ్ఛతో కల్యాణసృష్టి చేయుటకై దక్షిణాపథమునకు కదలిపోయినాడు.

మహా జ్ఞానియైన అగస్త్య మహర్షి పుడిసిట అంబురాశిని ఆపోశనం చేయడం వలన, జలరహితమైన కడలి వాలుకామయమైనది. దుఃఖము స్వాధీనమైనపుడు కేవలము లవణాక్తమైన ఇసుకప్రోవువలె నెగులు కొరగానిదే యగును. తండ్రీ! ఈ ప్రబోధంలోని గంభీరార్థమును గ్రహింపుము. ఋషివగుటకై ప్రయత్నింపుము. దుఃఖము నిన్నేమి చేయగలదు?" జనకుని ప్రబోధమును జీవనుడు మననము చేస్తూ ఉన్నాడు. ఈ మననమునకును, ప్రలోభ సంస్మరణమునకును సమరము పొసగుచునే ఉన్నది. వాని ఇల్లాలు ఆతని అంతరంగమున

ప్రవేశింపలేకపోయినది. అది మరుభూమియే అని ఆమె ఊహించింది. పెద్ద నిట్టూర్పు విడిచింది.

తండ్రి అస్తమించిన తరువాత జ్ఞానయోగమందు నిమగ్నుడగుటకై జీవన దత్తు నడుముగట్టినాడు. డాక్టరు పరీక్షకు చదువుటకు మిక్కిలి మక్కువ పడినాడు. అప్పుడు విదేశచికిత్సయొక్క అభినవత్వము దేశమునకు మిరుమిట్లు గొలుపు చుండెను. దేశమంతయు చకితమైనది. రంగలాల్ డాక్టరు పల్లకీలు మోయు బోయీల అరపులతో సమస్త దిశలు ప్రతిధ్వనిస్తున్నవి. నవీనముఖర్జి స్వారిచేయు గుఱ్ఱల గిట్టల వలన పుట్టిన ధూళి నలుదిక్కులను నింపుతూ ఉన్నది. అంతేకాదు. కవిరాజు మనస్సులో వీటియలికిడి మిక్కిలిగా చెలరేగుతున్నది. ఆదినుండి ఈ విద్యపై వాని మనసు మొగ్గియుండెను. తండ్రి దివంగతుడైన పిదప దానికై ఆతడు మరింత చెవికోసికొంటూ మెలగుతున్నాడు.

వృద్ధుడైన జీవనమహాశయుడు అంధకారములో మరల నవ్వుకొన్నాడు. గడ్డమును సవరించుకొన్నాడు. ఆహా! మానవుడు జగతిలో తన్నుతాను వంచించు కొనుచుండును కదా! జీవితము మిథ్య. ఇందుకైనా ఎరుగడుకదా. మిథ్యలోని సహస్రాంశమునకై ఆతడు అవగతుడు కాడుగదా!

వృద్ధుడు మాటిమాటికి ఉత్తమాంగమును పరికిస్తూ ఉన్నాడు. చంటిపిల్ల వాని ముద్దుపలుకులను, బుడిబుడి నడుపులను విని, ముద్దుతో, మురిపెముతో ముదముతో ఒడిచేర్చుకొని వానిని కనినవారు తలలూపునట్లు జీవనమహా శయుడు తన శీర్షమును కదిలిస్తూ ఉన్నాడు.

ఆనాటి ఆత్మప్రపంచనోదంతమును ఆతడు మననము చేస్తున్నాడు. కేవలము జ్ఞానము సంపాదించుటకై జ్ఞానయోగమందు నిమగ్నుడగుటకై ఆలో పథిక్ డాక్టరుపరీక్షలో చదువవలెనని ఉద్దేశించాడా? తాను గుఱ్ఱముపై స్వారిచేస్తూ, ఇల్లాలిని సవారిలో కూర్చుండబెట్టుకొని కాందీపురం పోయి, భూపీబోసు ఇంటికి పోవాలని అతడు మిక్కుటముగా ఉబలాటపడడంలేదా? ఈ వాంఛ వానిని మిగుల వేధించుటలేదా? వీటిలోనా వాని యావత్తు సత్తువ ఇముడవలసిఉన్నది? వాని తండ్రి ప్రబోధమంతా ఈ వాంఛాసిద్ధికై మాత్రమే ఉద్దేశించబడిందా?

ఆంతరంగికముగ జీవనమహాశయుడు ఊగిసలాడుతున్నాడు. ఆతనితండ్రి పరమపదించిన తర్వాత నిర్దిష్టమై ఉండిన కొందరు రోగుల ఇళ్లు వాని చేతుల నుండి జారిపోయినవి. క్రొత్తగా డాక్టరు పరీక్షలో నెగ్గిన కుర్రవాళ్లు బల్లలుకట్టి

స్ప్రింగులను చెవులకు వేళ్లాడునట్లు అమర్చి వీధులందు విజృంభిస్తున్నారు. కృష్ణదాసు, హరీష్‌లు ఇట్టివాళ్లు.

వీరిని పరిశీలిస్తూ వెంటనే జీవనమహాశయుని వైఖరిని చూస్తూ, ప్రాక్టీసులో చెయ్యి తిరిగిన డాక్టర్ రంగలాల్ ఇట్లన్నాడు :

"జీవనూ! నీవంటే నాకు నిండుప్రేమ కలదు. ఎందుకో తెలుసునా ? నీ వెన్నడూ అపజయమును అంగీకరింపవు. అప్రతిభుడవు కావు. తరచుగా కవిరాజులు తమ ఇళ్లల్లో కూర్చుని వెట్టివెట్టి లొట్టలు వేస్తూ, మెటికలు విరుస్తూ, నిట్టూర్పులు విడుస్తూ అలోపథిక్ డాక్టర్లను ఆడిపోస్తూ ఉంటారు. తమ శాస్త్రమును అంబరవీధికి ఎగురకొడుతూ, తత్త్వాన్వేషణ చేస్తూ, మరల చేతికి చమురు అంటుకున్నదే అని హాహాకారములు చేస్తూ ఉంటారు. నీవో ? ఆ తెగకు చెందినవాడవు కావు. ఎవ్వడూ తాను చేతకానివాడని అనుకోరాదు. అట్టివాడు చచ్చినవానితో సమానుడే అంటాను."

పొడవైన పొగచుట్టను చేతబట్టి ఒంటిమీద ఒక అంగవస్త్రమును వేసికొని రంగలాల్‌డాక్టరు మయూరాక్షీ దిక్కుగా చూపులు సారిస్తూ కాళ్లు ఊపుతూ ఇట్లు ప్రసంగించాడు :

రోగులు వచ్చినప్పుడు ఏవిధంగా ప్రవర్తించాలో రంగలాల్ చెప్పినవిధం జీవనమహాశయుడు తలపోయసాగినాడు.

ఒకప్పుడు మిగుల బలసిన ముసల్మానురోగి ఒకడు డోలీ చేసుకొని రంగలాల్ డాక్టరుకడకు వచ్చినాడు. మిగుల తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతూ అతడు అరుస్తున్నాడు. వానిని తేరిచూచి రంగలాల్ "ఏమోయి ! వెలికిల పడుకో! నా పాదాలదగ్గర పడుకో" అన్నాడు.

జీవనునితో ఆతడిట్లన్నాడు : "వీని నాడి చూస్తావా? నీ నాడీజ్ఞానం ఏం చెపుతుందో చెప్పు చూస్తాను. వాణ్ణి పీడించేది పైత్యమంటావా? శైత్యమంటావా? మరేమి అంటావు?"

"డాక్టరుబాబూ! నువ్వే చూడు. నన్ను ఇతగాడికి అప్పగించకు. నువ్వే చూడు బాబయ్యా! చచ్చాను! నేను చచ్చిపోయాను. కొంత విషమైనా గొంతుకలో పొయ్యండి బాబూ! పూర్తిగా చచ్చి ఊరుకుంటాను. అరుగో! పీర్లూ పైగంబరులు అగపడుతున్నారు." అని రోగి అరచినాడు.

వాని అరుపుకు అడ్డు వచ్చి రంగలాల్ ఇట్లన్నాడు: "నీకిపుడు పైగంబరు లేం చేస్తారు? కడుపు నిండుగా పూటుగా మాంసం ఎక్కించావు గదా! ఇపుడు దేవుళ్లేమి చేస్తారు? ఒక్క కబళంలో ఎంత మాంసం తినగలవు? సేరున్నరా? లేక రెండు సేర్లా? నీ కడుపులో పాములు యుద్ధం చేస్తున్నాయి. మూడు నాలుగు మూరల పొడవుగల పాములు!"

"బాబయ్యా! ముందుగా మందివ్వండి. ఈ నొప్పితో ఇక బాధ పడలేను."

"అలాగే యిస్తాను. అయితే డబ్బేది? ఫీజు రెండు రూపాయలు ఔషధం ఖర్చు వేరుగా ఇవ్వాలి. డబ్బు ముందుగా చేతిలో పెట్టు. లేకపోతే నీకేసు చూడను."

"బాబు! ఒక్క రూపాయ మాత్రమే నా దగ్గర ఉంది." "అయితే తక్కింది రేపు యియ్యి" అన్నాడు జీవనుడు.

రంగలాల్ "యు ఆర్ ఎ ఫూల్. ఫీజు చేతిలో పడనిదే ఎన్నడూ వైద్యం చెయ్యకు. అరువుకు మందిస్తే చచ్చి ఊరుకొంటావు. ఊరికే మందిస్తే 'ఈ డాక్టరు బాగా చదువుకొన్నవాడు కాడు; ఏమీ ప్యాసైనవాడు కాడు.' అని రోగులు అనుకొంటారు. మనుష్యుడు బ్రతకాలంటే డబ్బు కావాలి. కష్టపడి పనిచేసి బ్రతుకుతెరువు చూచుకునేందుకు చేతిలో పైకం పడితీరాలి. దాక్షిణ్యం చూపితే నువ్వు కేవలం మూర్ఖుడవే కాక అపరాధివై పోతావు. నీవంటి డాక్టరు జీవనయుద్ధంలో కూలిపోతాడు. నీవంటివాళ్ల కథలు ఎనెన్నో మన చరిత్రలో ఉన్నాయి కదా! యుద్ధం కొంత సాగించి కొందరు విశ్రాంతి తీసికొంటారు. సంధు చేసుకుని శత్రువులపైబడి హతమార్చుతూ ఉంటారు. మన వాళ్ళకు పరాజయమూ, వాళ్ళకు విజయమూ దక్కుతవి. 'రేపు పోరాడుదాం గాక' అని మన వాళ్లు అనుకుంటే, నోటీసివ్వక రాత్రివేళ వాళ్లు మీదికి ఉరుకుతారు. ఇక మనవాళ్లు చచ్చి స్వర్గలోకంలో ప్రవేశిస్తారు. నాకు స్వర్గంలో ప్రవేశించే కోరిక లేదు. తెలిసిందా?" అని జీవనునితో పలికి, రోగి వెంటవచ్చిన వారితో "మీరు పోయి మరొక రూపాయి తీసికొనిరండు. రోగి ఇక్కడే ఉంటాడు. భయం లేదు. చావడు." అన్నాడు.

వారు పోయిన తరువాత జీవనునితో రంగలాల్ ఇట్లు అన్నాడు. "జీవనూ! పైకం కావాలి. డబ్బు అడగడం తప్పు కాదు. ఎవరి దగ్గరకూ పోయి భిక్ష మెత్తకు. ఎవరినీ మోసగించకు. ఎక్కడా దొంగతనము చెయ్యకు. ఎవరినీ

ఊడ్చి, ఊడ్చి కడ ముట్టించకు. కాని ఎందుకు నీవు కష్టపడుతున్నావో గ్రహించి కష్టానికి ప్రతిఫలం పొందుము. ఫీజు పుచ్చుకొనడం, మజూరీ చేతిలో వేసికొనడం తప్పు కాదు. సందేహ మెందుకు? సందేహిస్తే నీకు చావు తప్పదు. స్వర్గానికి పోతావో మరెక్కడికి పోతావో చెప్పలేను.''

# పదుమూడవ ప్రకరణము

రంగలాల్ డాక్టరు ఒక అద్భుత వ్యక్తి. అతడు మహా దాంభికుడనీ, అర్థపిపాసువనీ, హృదయహీనుడనీ లోకులు అనుకొంటూవుంటారు. తండ్రి ప్రకృతికి అతని ప్రకృతి విపరీతమైనదని వారి తలంపు. అసామాజిక వ్యక్తి అనియే వారి నిశ్చితాభిప్రాయము. వాని కంఠస్వరము రూఢము; అప్యాయహీనము.

జీవనునితో ప్రథమ పరిచయము కలిగిన ముహూర్తమందే వాని కర్కశ స్వరము వినవచ్చినది.

జగత్ మహాశయుని మరణానంతర విషయము తనయుని అంతరంగమున తలసూపినది. అప్పు డతని మనస్సు అశాంతితో నిండి యుండెను. సుప్త అతృప్తి ప్రచండ తృష్ణవలె చెలరేగింది. జగత్ మహాశయుని వాత్సల్యమును అతడు కోల్పోయినాడు. గంభీరమైన జనకుని ప్రభావము కరముట్టినది. అతని వాత్సల్యము ఎట్లు ప్రసన్నమై ప్రగాఢమై ఉండెనో, అపు డపుడు అతడు ప్రయోగించు శాసనములు కూడ అట్లే గంభీరమై, అలంఘనీయమై ఉండెను. జీవనుని అంతరంగమున అడగి మడగి యుండిన అసంతృప్తి శిథిలగిరి హృదయమును భేదించుకొని జ్వలించు భీషణానలమువలె విజృంభించింది.

తొలుత అది ప్రకోపించిననాటి అనుభూతి జ్ఞప్తికి వచ్చినది.

అత్తరు కోడలు అత్తవారింట అడుగుపెట్టినది. చాల కాలమునుండి ఆమె గుండెలో కుమిలి కుమిలి యుండిన వేంద్రము క్రమక్రమముగా భుగుల్భుగుల్మన సాగినది. వివాహము తరువాత శోభన నిశీథమున పుష్పశయ్యనుండి వెడలిన ఆయుత్తాపమును భర్త సహించుచునే యుండెను.

చిరుతప్రాయమున తలిదండ్రులను గోల్పోయిన బాలిక మేనమామయింట పెరిగి పెద్దదైనది. ఆటపాటలందే మంకుతనమూ, గయ్యాళితనమూ పెంపొందినవి. అవి ముదిరిన—ఏమందును— ప్రచండ ప్రవర్తన మందునా? అది అద్భుత జీవనాశక్తి అనుకొందమా? అప్పటినుండి తలబిరుసుతనము భగున మండు

చునే ఉన్నది. అధికార ప్రకటనము; హాహాకార విజృంభణము, ఆక్రందనము వెనువెంటనే వ్యక్తమవుతూ వున్నవి.

మామ యింటిలో అత్తపనుపున ఆమె యింటిపనులకు చేయి చేసికొన వలసి వస్తోంది. విశ్రాంతి హుళక్కి. వాచాలత్వము బలసినది. ఉడుకుబోతు తనముతో ఉపవాసములు హెచ్చినవి; కనీసము నెలకు ఏడెనిమిది ఉపవాసములు నిర్వహించబడుతూ ఉండేవి. పస్తులుండి, ఉండి, దైనందిన కురుక్షేత్ర కథనములో ఎదుటివారు 'హతోస్మి' అన్నప్పుడు ఆమె ఎంగిలి పడేది.

శోభన సమయపు పూలపానుపుమీద ఇల్లాలి గుండెనుండి అగ్గిసెగ జ్వలించినదని చెప్పలేను. కాని శయ్య అగ్నితాప వికీర్ణమైనదనిన విస్మయ పడనేల?

అత్తింటి కోడలు మంచి పేరు తెచ్చుకొనునట్లే అగపడింది. పగటివేళ దూరమునుండి జీవనుడు ఇల్లాలిని చూచినపుడు ప్రసన్న ప్రశాంత ముఖముతో మందహాసముతో అగపడేది. అత్తగారి సమాదరము వలన ఆమెకు అట్టివైఖరి అలవడింది. కోడలిని ఆమె నిండు గారాబముతో వీక్షించేది. అట్టి అడకువ గల పడుచు పుడమిలో మరొకతె పుట్టలేదని ఆమె గట్టి నమ్మకము. పెండ్లియైన పిదప తండ్రియొద్ద ఎంతో బుద్ధితో ఆయుర్వేదమునకు జీవనుడు మనసు నప్పగించి నపుడు నవ్య పరిణామ స్వర్ణరేఖ వాని జీవన దిగ్వలయమున గోచరించినట్ల య్యేను. కోడలి ప్రభావము ప్రభాకలితమైనదని అత్తగారు ఊహించినది. అంతకు మున్ను జీవనుడు పడకనుండి లేచినది మొదలు అవ్వలికి దౌడుతీసి అల్లరిమూకతో మసలుతూ, గసైక్కి, పుట్టలమీద కెగబ్రాకి, ఊరి చెరువున ఈదులాడి, బురద యొంటితో ప్రొద్దు తిరిగిన పిదప ఇంటికి మళ్లుతూ ఉండేవాడు. బడి పిల్లలతో తరచుగా భీషణ ఖండనము సాగనిచ్చేవాడు. ఆతడెన్నడు పుస్తకముల నంటిన పాపమునకు పోలేదు. అతడు మనుష్యుడు కాడని అందరి అభిప్రాయము. అట్టి వాడు పూర్తిగా మారిపోయినాడు. నవ వధువు వలన ఈ నవోదయము కలిగినదని, గుమ్మములో ఆమె అడుగుపెట్టిన ముహూర్తములోనే ఈ శుభంకర పరివర్తనము అగపడిందని అత్తగారు మరిమరి మురిసిపోసాగినది.

ఇరుగు పొరుగువారు సయితము ఈ పరిస్థితిని అవలోకించి తమ ఆనంద మును ప్రకటించిరి. తేనెలో మీగడ తరకలు కలిసినట్లు అత్తగారి మనసు ఘన తర మాధుర్యముతో వెల్లి విరిసినది.

ఈ సమయంలో జగత్‌మహాశయుని జీవనం ప్రవీణతమ మైనది. ప్రవీణతకు విచక్షణత తోడుపడింది. దానికి బహుదర్శిత సహకరించినది. నలుదిక్కులందు ఆతని ఖ్యాతి విస్తరించింది. రోగులను చూచుటను అతడు మానివేసినాడు. కేసులు చూచేందుకు కొడుకును పంపేవాడు. "నేను రావలసిన పనిలేదు. మా వాడు వచ్చి చూస్తాడు. వాడు చూసినా నేను చూసినా ఒక్కటే. మా వాడు బాగా తరిఫీదయినాడు" అని చిరునవ్వుతో ఆతడు అనుచుండువాడు. కాని కఠిన రోగమును ఎదుర్కొనవలసి వచ్చినపుడు అతడే కదలిపోవువాడు. తన మాటలు ఎదుటి వారికి నచ్చకపోయినయెడల నచ్చచెప్పేందుకై ఆతడు మక్కువపడేవాడుకాడు. రసికతను గ్రహింపజాలని గుండెలో రసికతాధారను పోయుటకు ఆతడు ఉద్యమించేవాడు కాడు. మామూలు మాటలనే ఉచ్చరించేవాడు. "మా జీవనుడు కేసు చూసి చెపుతాడు. చాలును .. ఏమేమి చేయాలో మా వానికి నేను చెప్పి పంపుతాను. వైద్యం విషయంలో సందేహపడ నక్కర లేదు. హృదయంలో ఆదుర్దాకు చోటీయవద్దు. లోతుగా ఆలోచించియే కేసు నడుపుతాం" అని ఆతడు పలికేవాడు.

తండ్రి చెప్పినప్పుడు, ఆతనిమాటను శిరసావహిస్తూ జీవనుడు రోగులను చూచేందుకు వెళ్ళేవాడు.

ఇతర చికిత్సకుల వలన వైద్యము పొందుతూ వున్నవారు సయితము అపుడపుడు ఆతని మందులు కోరుతూ ఆతనిచే నాడి చూపించుకొనేందుకు ఉబలాట పడుతూ వుండేవారు. అటువంటి సందర్భములలో సయితము జీవనుడు ముందంజ వేస్తూ ఉండేవాడు.

ఒక సంఘటన జ్ఞప్తికి వస్తూ ఉన్నది. దాని వలన జగత్‌మహాశయుని కీర్తి పరిపూర్ణమైనది. నవగ్రామవాసి అయిన వరదాప్రసాద్ తీవ్రవ్యాధి వలన బాధపడుచుండెను. పూర్వపు జమీందారీ వంశములో పుట్టిన పెద్దమనిషి అతడు. ఒక తరమునకు ముందు జగత్‌మహాశయుని తండ్రి దీనబంధు ఆ జమీందారీ దివాణంలో లెక్కా డొక్కా వ్రాస్తూ ఉండేవాడు. వారి యింటి పిల్లలకు చదువు చెపుతూ ఉండేవాడు. వారికి జబ్బు చేసినపుడు సేవచేస్తూ ఉండేవాడు. సుప్రసిద్ధ కవిరాజు కృష్ణదాసు వారికి మందులిచ్చేవాడు. ఆయన దీనబంధు చాకచక్యమును గమనించి వాత్సల్యముతో వానిని పిలిచి ఆయుర్వేదమున వానిని దీక్షితుని చేసినాడు. పూర్వపరిచయమును మనసులో ఉంచుకొని ఫీజు తీసుకోకుండా ఆ జమీందారీ కుటుంబమునకు వైద్యము చేస్తూ ఉండేవాడు. మందువెచ్చము నైన జమీందారు లాతని

కిచ్చేవారు కారు. పైగా అతనిని చిన్నచూపు చూచేవారు. నవగ్రామమందలి రాయచౌదరీలు ఎన్నడూ అతనిని పిలువలేదు. హరిహర పురమందలి హీరలాల్‌ను తమ ఇంటివైద్యునిగా నియమించుకొన్నారు. తీవ్రవ్యాధి ఘటిల్లినపుడు రాఘవ పురంలోని గుప్త కవిరాజును పిలుస్తూ ఉంటారు. దీనబంధు కొంత ప్రతిష్ఠ సంపాదించుకొనుటకు చిన్న జమీందారీని సంపాదించాడు. వరదాబాబు దీనబంధు కొడుకు జగత్‌ను తప్పని పరిస్థితిలో చికిత్సకోసం ఆహ్వానించినాడు. వరదాబాబు కొడుకు కలకత్తాలో వర్తకం చేస్తున్నాడు, తండ్రి అస్వస్థతను తెలిసికొని హుటాహుటి యింటికివచ్చి రోగప్రకోపమును గ్రహించి గుప్త డాక్టరును పిలిచినాడు. "మూడు, ఏడు లేక తొమ్మిది రోజులలో రోగి స్వర్గము నలంకరించుట తథ్య" మని ఆ భిషగ్వరుడు సెలవిచ్చినాడు. "మా తండ్రిగారిని కలకత్తా తీసికొని పోతాను." అన్నాడు కొడుకు. "ఇతని ప్రాణం కాస్త దోవలోనే గుటుక్కు మంటుంది. కదిపితే చావును రూ! దూ! అని పిలిచినట్లు అవుతుంది." అని గుప్త సెలవిచ్చాడు.

ఆ తర్వాత వరదాబాబు కుమారుడు రంగలాల్‌ను పిలిచినాడు. "చెయ్యి చూచేందుకు కవిరాజును కూడా పిలవనా" అని అడిగెను.

"చెయ్యి చూడడం నా కంతగా సరిపడదు. అందులో నాకు సుతరామూ నమ్మకం లేదు." అన్నాడు రంగలాల్.

"మూడు లేకపోతే ఏడు రోజులలో మృత్యువు అనివార్యమని గుప్త సెలవిచ్చినాడు" అన్నాడు వరదాబాబు కొడుకు.

"అలా అని రాయిగుద్ది నేను చెప్పలేను. మృత్యువు దాపురించకపోతే ఆ గుప్తమీద వ్యాజ్యెం వేస్తావా? అంగీకరిస్తే నే నతనిని కోర్టుకు ఎక్కించగలను."

"వైద్యముకోసం మా తండ్రిగారిని కలకత్తా తీసికొనిపోవాలని అనుకుంటున్నాను."

"అలా అయితే నన్నెందుకు పిలిచినావు. తప్పక తీసికొనివెళ్లు."

"దోవలోనే ప్రాణం పోతుందని గుప్త చెప్పినాడు."

"ప్రాణం పోవచ్చును. పోకపోవచ్చును. నేను మందిస్తాను, ఇదేమో గడ్డురోగమే. బ్రతుకునో బ్రతుకడో నేనెల్లా చెప్పగలను?"

రంగలాల్ డాక్టరు నిష్క్రమించిన తరువాత రోగి బంధువులు జగత్‌మహాశయుని పిలిచినారు. జగత్ నాడిచూచి "మంచివైద్యం కోసం ఇతనిని కలకత్తా

తీసుకునిపోవడమే మంచిది నేను అడ్డుపెట్టను. చింతింపవలసిన పనిలేదు. ఇట్లని నొక్కి చెప్పుతున్నాను.'' అన్నాడు.

''బాగా పరీక్షించి చెప్పండి'' అన్నాడు కొడుకు.

''పరీక్షించక, రోగం ఎటువంటిదో గ్రహించక, ఇంతపెద్దమాట చెపుతానా? నామాట అబద్ధమైతే లోకులముందు ఎట్టి అపరాధమునకైనా గురిఅయ్యేదను. నావైద్యవృత్తికి నీళ్లువదులుతాను మరి....''

మరల అత డిట్లన్నాడు; ''అచికిత్సవలన ప్రమాదము ఏర్పడవచ్చును. మంచి చికిత్సవలన ప్రమాదము ఘటిల్లదు. కలకత్తా తీసుకొనిపోవడం మంచిది.''

ఆతని హితవువలన మేలు కలిగింది. రోగిని బంధువులు కలకత్తా తీసికొని పోయిరి. మృత్యుదేవత ఎదురు కాలేదు. వరదాబాబు స్వస్థుడై జగత్‌మహాశయునకు చక్కని మిఠాయిలు పంపినాడు. దేవఘర్ మృష్టాన్నమును తెప్పించి పంపినాడు. అంతేకాక మంచి హుక్కాగొట్టమును, అందులో ఉపయోగించే తంబాకు, ఒక పంచెల చాపు బహూకరించినాడు. ''ఇకముందు ఫీజును బాగా ఎక్కువ చేయాలి. నాలుగురూకలయినా చెల్లించవలెనని పట్టుపట్టాలి.'' అని తండ్రితో జీవనుడు అన్నాడు. జగత్ అందుకు అంగీకరించలేదు. కాని జీవనుడు తన పట్టుదలను వదలలేదు. ''పేదల యిళ్లకు ఫీజు లేకుండానే వెళ్లి వైద్యము చెయ్యండి. ధనవంతుల వద్దనుండి డబ్బుతీసుకొనడం మంచిది. మర్యాద నిలుపుకోవాలికదా!'' అని ఆత డన్నాడు.

అది దత్తుకుటుంబమున మిగుల మంగళకరమైన సమయము. ''ఇదంతా మా కోడలి పాదమహిమ'' అన్నది జీవనుని తల్లి.

కోడలు ''ఔనా'' ననుకొన్నది.

రోగులను చూచేందుకు జీవనుడు వెలుపలకు పోవువేళ, నియమానుసారముగా క్రొత్తకోడలు మగని చెంత నిలిచేది. భర్త జరుపు వైద్యము శుభమై తీరునని అందరూ ఊహించేవారు. ఆమె చెంత నిలుచుటే మంగళసూచకము కాదా? ఇది నిశ్చయము.

జగత్‌మహాశయుని మరణంతో దత్తుకుటుంబపు పేరు ప్రతిష్ఠలు క్షీణింపసాగినవి. వారి కుటుంబంతో స్థిర సంబంధములు ఏర్పరచుకొనిన కొన్ని యిళ్ల

నడలిపోయినవి. ఇతర డాక్టర్లపై వారి దృష్టి పారింది. కామదేవపురంలోని ముఖర్జీ, హరిహరపురంలోని పాతక కవిరాజు మిక్కుటముగా రోగులను ఆకర్షింప సాగిరి. నవగ్రామంలోని పెద్ద లోగిళ్లవారు ఒక క్రొత్తడాక్టరును తీసికొనివచ్చి ఊరిలో నిలుపుకొనిరి. వచ్చిన డాక్టరు దుర్గాదాసు. జీవనుడు సామాన్య వైద్యుడు. ప్రజ లాతనిని గౌరవమర్యాదలతో చూచుట లేదు. తెలివితేటలు దేవు డెరుగును. పేరు చివర డిగ్రీని చేర్చుకొనిన కసుగందు కళ్లబడితే చాలు గంగవెఱ్ఱులతో ప్రజ లాతనియండ చేరదొడగిరి.

జీవనదత్తు సుప్తవాంఛ దుర్దినఝంఝానిలములో భస్మ నిర్ముక్తమైన అగ్నికణమువలె జ్వలింపసాగినది. ఇంగ్లీషు వైద్యమును తన సొత్తు చేసుకోవాలని మక్కువ పడినాడు. రంగలాల్ డాక్టరు దృష్టాంతము కళ్ళెదుట కనిపిస్తూ ఉన్నది. నవగ్రామంలో ఈ సమయంలో క్రొత్త డాక్టరు ఒకడు అడుగు పెట్టి నాడు. కృష్ణదాసు వాని మనుగడకు పంచి యండను ప్రసాదించినాడు. వాని ప్రాక్టీసు అందుకొనేందుకై కావలసిన సన్నాహములు ఏర్పరచినాడు. ఊరిలోని వ్రజలాల్ తన ధనమును సద్వినియోగము చేయ విశ్చయించి, ఛారిటబుల్ డిస్పె న్సరీ (ఉచిత వైద్యశాల) స్థాపించినాడు.

'వైద్యశిక్షణము', 'మెటీరియామెడికా' అనే గ్రంథాలను జీవనుడు సంపాదింప గలిగినాడు. రంగలాల్ రూఢభాషి. వాని యొద్దకు పోయేందుకు జీవనుడు సాహసించలేదు.

మూడు నెలలు గడచిన వెనుక హఠాత్తుగా రంగలాల్ డాక్టరు తారసిల్లి నాడు. సహకార సూత్రమున మొదటి ముడి పడినట్లాయెను.

ఆకస్మికముగ నవగ్రామమందలి కృష్ణదాసు కుమారుడు వ్యాధి పీడితు డాయెను. పది దినములనుండి జ్వరప్రకోపము హెచ్చుతూ ఉంది. క్రొత్తగా వచ్చిన హరీష్ డాక్టరు రోగికి వైద్యం చేస్తున్నాడు. నవగ్రామమునకు అతడు వచ్చి నెలయైనది. ఆతని కాశ్రయ మిచ్చినవాడు కృష్ణదాసే! పాట్నాలో చదువు సాగించి, డాక్టరు డిగ్రీ సంపాదించుకొని వచ్చినాడు. ప్రాక్టీసు అందుకొనేవరకు అతని ఖర్చు యావత్తు తానే వహించేందుకు కృష్ణదాసు పూనుకొన్నాడు. రంగ లాల్ పిల్లవానిని చూచేందుకు నేడు రావలసి యున్నది.

జీవనదత్తు విస్మితుడైనాడు. శంకించినాడు కూడ. రోగిని చూడలేక పోయి నాడు. కృష్ణదాసు వయసున అతని కంటె పెద్ద. అతని అంతరంగ మిత్రుడు

నెపాలుకు పరమాత్మీయుడు. ఆ విషయమట్లుండ, కృష్ణదాసు కొడుకు కిశోర్‌పై వానికి గాఢానురాగము గలదు. క్రొత్త డాక్టరు ఊళ్లో ప్రవేశించేందుకు ముందు, తాత తండ్రుల నాటినుండి సాగుతూ వచ్చిన వైద్యమును జీవనదత్తే కృష్ణదాసు కుటుంబంలో నిర్వహిస్తూ వస్తున్నాడు. అందుచే రోగిని చూచే బాధ్యత వానిపై ఉండెను. వైద్యం చేసేందుకు కాకపోయినా మర్యాదకోసమైనా వారింటికి పోవలసిన ధర్మము వానిపై నుండెను. ఆ ప్రాంతమునకు పోయినపుడు వారి గృహంలో ప్రవేశించి ఆతడు వారి యోగక్షేమాలు కనుక్కొంటూ ఉంటాడు. కిశోరుడు ఆరేడు సంవత్సరాల పిల్లవాడు. శ్యామవర్ణముతో శోభిల్లుతూ ఉంటాడు. చురుకైనవాడు. నిశితబుద్ధి గలవాడు. బుద్ధి కుశలతవలన ఎల్లరకు ఆశ్చర్యం కలిగిస్తూ వుంటాడు. అతడు రసగ్రహణ పారీణుడు కూడ.

జీవనదత్తు కిశోరుని చూచుటకు పోయినాడు. "దొంగచాటుగా పాయసం త్రాగి పిల్లవాడు రోగం తెచ్చుకొన్నాడు. ఆమ్లరోగం తెచ్చుకొన్నాడు. ఆమ్లదోషం ఘటిల్లి వుంటుంది." అని బాలకుని మేనత్త పలికింది.

"దొంగచాటుగా పాయసం తాగేవా?" అని జీవనదత్తు పిల్లవానిని ప్రశ్నించాడు.

జంకుగొంకులు లేకుండా కిశోర్ "అవును, తాగినాను." అన్నాడు.

"దొంగచాటుగా తాగితే పాపం వస్తుందని యెరగవా?"

"మరేదైనా తాగితే పాపం రావచ్చు. పాయసం తాగితే రాదు కదా!"

"ఇలా అని నీతో ఎవరు చెప్పేరు?"

"భాగవతంలో చెప్పి ఉంది కదా! కృష్ణుడు పాలూ, వెన్నా, మీగడ దొంగిలించి తినేవాడట కదా! పాయసం పాలతో తయారైన పానీయమే కదా? దానిని తాగితే పాపం ఎలా వస్తుంది?

జీవనదత్తు ఓడిపోక తప్పినది కాదు. "భాగవతం మాట దేవుడెరుగును. వైద్యశాస్త్రంలో మిక్కుటముగా పాయసం త్రాగకూడదని స్పష్టంగా చెప్పబడి ఉంది."

దత్తుమాటలను పిల్లవాడు శ్రద్ధ గావిని "ఇకమీదట కొంచెంగానే తాగుతాను" అన్నాడు.

కిశోరుని కలిసికొనినపుడు ముద్దుముచ్చటలతో పురాణంలోని కథలను గురించి జీవనదత్తు ప్రసంగిస్తూఉంటాడు.

"రావణునకు ఎన్నితలలు, ఎన్నిచేతులు ఎరుగుదువా?" అని జీవనదత్తు బాలకుని అడిగినాడు.

"పది తలలు, ఇరవై చేతులు. రావణాసురుడు ఎన్నడూ నిద్రించి ఎరుగడు."

"ఎందువలన ?"

"అన్నితలకాయలూ, అన్నిచేతులూ ఉన్నవాడు ప్రక్కకు ఎలా ఒత్తిగిల గలడు ?"

దత్తుకు, పిల్లవానికి ఈరీతి గాఢమైన చనువు కలిగెను. ఇపుడు బాలుడు జ్వరపీడితుడైనాడు. ఇతర వైద్యులు వానిని చూస్తున్నారు. పిలువకపోయినను కృష్ణదాసు ఇంటికి దత్తు తనంత తాను వచ్చినాడు. కృష్ణదాసు సిగ్గుపడినాడు.

"అన్నా! నీవు బ్రాహ్మణుడవు. నేను కాను. అయినప్పటికీ మనం అన్న దమ్ములము. మనలో మనకు మాటపట్టింపు లేముంటాయి ? కుఱ్ఱవానిని చూసేందుకు వచ్చాను." అన్నాడు జీవనదత్తు కృష్ణదాసు నుద్దేశించి. క్రొత్త డాక్టరు కూడ ప్రవేశించాడు. ఇద్దరు వైద్యులూ బాలకుని చూచినారు. "వ్యాధి నిమోనియాలోనికి విజృంభించేది. కాని మొదటనే దానిని అణచివేశాను. అయి నప్పటికీ ఇంకా ఎందుకు ఒళ్లు వేడిగా వుందో యెరుగను" అన్నాడు డాక్టరు.

జీవన డాక్టరు బాలకుని రెండు చేతులను పట్టుకొని, విశేషశ్రద్ధతో నాడి పరీక్షించాడు. చేతులు కడుగుకొని, కృష్ణదాసు ప్రక్క చతికిలబడి "కృష్ణదాసు అన్నయ్యా! ఇరవై ఒక్క రోజుల్లోనో లేకపోతే నలభై రోజుల్లోనో జ్వరం తగ్గుతుందనేందుకు ఆశ కలుగుతోంది. భయపడవలసిన పనిలేదు ; కాని జ్వరం పెంకి జ్వరం! వ్యాధి మిక్కిలి గడ్డురోగం! సన్నిపాతంతో కూడిన తెగులు! ఇది ప్రాణాలు తీస్తుందని రాయిగుద్ది చెప్పేందుకు వీలులేదు. శ్లేష్మ దోష మున్న దనడం తథ్యం." అన్నాడు. "ఈ క్రొత్త డాక్టరుగా రేమంటారో?" అన్నా డాతడు. అతడు మౌనము వహించెను.

"అయితే సన్నిపాతం ఆనుషంగికము, అసలు వ్యాధి అది కాదు." అన్నాడు జీవనదత్తు.

క్రొత్త డాక్టరు హరిస్ ఇంచుమించుగా సమవయస్కుడు. జీవనదత్తుకంటె నాలుగైదేళ్లు చిన్నవాడు. కర్మజీవనములో ఇది గణింపదగిన తేడా కాదు. అందు వలన వానితో దత్తు కొంచెం చనువుతో ప్రసంగించాడు. హరిస్ మెడికల్ డిగ్రీ కలవాడు. అందుచే అత డిలా అన్నాడు. ''అయ్యా! మీరు నాడి చూచినారు. నేనో? స్టెథెస్కోప్‌తో పరిశీలించాను. ఇది జలుబు వలన పుట్టిన వ్యాధి అన డంలో సందేహం లేదు. మీరేమో సన్నిపాతం అంటున్నారు. అంటే టైఫా యిడ్ అన్నమాట కాబోలు! నా వుద్దేశంలో ఇది ఆ జబ్బు కానే కాదు. కవి రాజుగారూ! మీరు చాలా పెద్దమాట ప్రయోగించారు.''

జీవనదత్తు ధ్యాన నిమగ్నుడై నాడిని పరీక్షించెను. ఆతడు చెప్పిన దానిలో పొరపాటు ఉండనే ఉండదు. చిరునవ్వుతో అతడు తల ఊపినాడు. సరిగా అదే సమయంలో అవ్వల సవారిమోసిన బోయీల అరుపులు వినిపించినవి.

హరిస్ డాక్టరు ఒక్క పరుగులో వెలుపలికి పోయినాడు. ఆమె వచ్చి వేసింది.

జీవనదత్తు కూడా వెలుపలకు పోవాలని ఉద్యమించినాడు. హఠాత్తుగా కిశోరుని తల్లి ఆతని కంట బడింది. మేలిముసుగు వేసికొని ఆమె కొడుకు తల దగ్గర కూర్చుని ఉంది. జీవనదత్తు ఎంతో నమ్మకంతో, ఎంతో ఆదరంతో ఇలా అన్నాడు.

''భయ మేమీ లేదు. ఎవరేమి చెప్పినా సరే జ్వరం ఇరవై యొక్క రోజుల్లో గాని, నలభై రోజుల్లోగాని వదలిపోతుంది. పిల్లవాడు లేచి కూర్చుంటాడు''

ఇరవై యొక్క రోజులా లేక నలభై రోజులా అనే విషయం గురించి రంగ లాల్ డాక్టరుతో ఆతనికి కొంత పేచీ కలిగింది.

రంగలాల్ రోగిని పరిశీలించినాడు. ''అయిన వాళ్ళూ కానివాళ్ళూ రోగి మంచం దగ్గర గుమిగూడరాదు. వైద్యుడూ, రోగికి సేవ చేసేవాడూ, మరొకడూ తప్ప ఎక్కువ మంది ఇక్కడ ఉండరాదు. మూక కూడనే కూడదు'' అన్నాడు.

జీవనదత్తు వెలుపలకు పోవ నుంకించినాడు. కాని కృష్ణదాసు ''జీవనూ, నువ్వు ఉండుము'' అని పలికినాడు.

అతడు వాని చేయి పట్టుకొన్నాడు. భయము వలన కృష్ణదాసుకు ముచ్చె మటలు పట్టినవని జీవనుడు గ్రహించి ''భయపడవద్దు'' అని అన్నాడు.

రోగిని చూచి రంగలాల్ డాక్టరు నోరు విప్పలేదు. 'ప్రిస్క్రిప్షన్ చూడండి' అన్నాడు. దానిని చదివి చూచి తిరిగి యిచ్చివేసి, తాను స్వయంగా ప్రిస్క్రిప్షన్ వ్రాసి, హరిస్ డాక్టరు చేతిలో పెట్టి "పథ్యం బాగా జరగాలి. బార్లీ మజ్జిగతేట, మారేడుపండు రసం తప్ప రోగి మరేమీ పుచ్చుకోరాదు. గట్టి పదార్థమేమీ రోగి కంఠంలో పడరాదు. పిల్లవానికి టైఫాయిడ్ జ్వరం వచ్చింది." అన్నాడు.

హరిస్ డాక్టరు ముఖము మ్లానమై పోయింది. వెంటనే అందరి చూపులూ జీవనుని మీద పడినవి. అతడు హరిస్ డాక్టర్ మొగమును చూడలేదు. ఛిక్! అతడు ఓడిపోవునా? ఇంటి నుండి వెలుపలకు వచ్చి రంగలాల్ డాక్టర్ హరిస్‌కు విషయమంతా విప్పి చెప్పినాడు.

జీవనదత్తు సాగించే కవిరాజ వైద్య పద్ధతిని అతడు సమగ్రంగా ఆమోదించడు. కొంత అభిప్రాయభేదం కలదు. కాని తన ఊహలను గురించి అతడేమీ పలుకలేదు. తన సిద్ధాంతములను ఏకరువు పెట్టే అధికారం అతని కేమి కలదు? తదనంతరము రంగలాల్ డాక్టరు ఔషధం తయారు చేసేందుకు చతికిల పడినాడు. అతని వైద్యవిధానంలో గమనింపవలసిన విశేషతత్వ మది ఒకటి. తన చేతితో తాను ఔషధాలు తయారు చేసే అతడు తన వృత్తి సాగిస్తాడు. మరే డాక్టరు ఇచ్చేమందును గాని, లేక మరే ఔషధాలయంలో తయారైన మందును గాని అతడు సుతరామూ ముట్టనే ముట్టడు.

హఠాత్తుగా రోగిస్థితి విషమిస్తే విరుగుడుకై వలసిన మందును సయితము అతడే సిద్ధం చేస్తాడు. "దానితల దన్నిన మందిది" అని అంటూ ఉంటాడు. ఒరుల వైద్యంలో దోషం ఘటిల్లినప్పుడు వారిని చూచి మోమోటమునకు ఎడ మీయక అత డిట్లనను: "ఔషధంలో విషం చేర్చి రోగిని చంపి వేయకండి. విషానికి కూడా ఖరీదున్నది. వట్టిరంగు నీళ్ళతో వ్యాధిపీడితుని కడుపు నింపినను ప్రయోజన మేముంటుంది?" తదుపరి సొంత ప్రిస్క్రిప్షన్ వ్రాసి విషయమును విప్పి చెప్పును.

ఇపుడు రెండు మందు సీసాలను పరిశీలించి హరిస్ డాక్టరు చేతిలో పెట్టి "ఇదిగో! ఈసీసాలోని మందును సాగనిమ్ము. పరాకు మాటలు హెచ్చిన యెడల, లేక జ్వర ప్రకోపం అధికమైన యెడల ఈ రెండవ సీసాలోని మందిమ్ము. బోధ పడిందా? రోగి ఒళ్ళంతా యిన్ని గుడ్డలతో మూట కట్టే వెందుకు? వీటితో పిల్లవానిని కడ ముట్టించి వేస్తావా? దీనికి ఊపిరాడ నక్కర లేదనుకొన్నావా?

ఈ విధంగా తలుపులూ, కిటికీలూ మూసి వెయ్యకు. గదిలోనికి వెలుతురు రావాలి. గాలి రావాలి. తెలిసిందా ? అని రంగలాల్ పలికి లేచినాడు.

కృష్ణదాసు ముందుకు వచ్చి "వ్యాధి టైఫాయిడ్ జ్వరమా ?" అని ప్రశ్నించాడు. "అవును, ఇది మిగుల కఠినమైన వ్యాధి."

"అంతే నంటారా ?"

"చావు బ్రతుకుల మాట దేవు డెరుగును. వీటి విషయం నే నేమీ చెప్ప లేను"

కృష్ణదాసు మిగుల సాహసవంతుడు. సూటిగా తక్షణం ప్రత్యుత్తరం చెప్పడంలో ఆతడు మిగుల నేర్పరి.

"చావు బ్రతుకులు దేవుని చేతిలో ఉన్నవనే వేదాంతం నాకు కూడా తెలియును. రోగిని పరీక్షించినపుడు మీకు బోధపడిన విషయమేమి ? సన్నిపాత జ్వరంవల్ల రోగి చచ్చి తీరునని చెప్పలేము. ఈ వ్యాధిలో వ్యత్యాసము లున్నవి. మృదు, మధ్యమ, కఠిన స్థితులు కలవుకదా!"అని ఆతడు పలికెను.

తీక్ష్ణదృష్టి ఆతనిపై సారించి "కృష్ణ దాసంటే మీరేనా ? పిల్లవాడు మీ అబ్బాయి కదా ?" అన్నాడు రంగలాల్.

"చిత్తం. అతడు మా అబ్బాయే."

"రోగము మధ్యమ రకమైనదే కాని గడ్డుజబ్బు అనడం తథ్యం. క్రుతి మించేందుకు ఎంతసేపు పడుతుంది ? సరియైన సేవ జరిగి తీరాలి. మంచి మందు కడుపులో పడాలి. లేకపోతే వ్యాధి ప్రకోపం అధికం కావచ్చును. ఈ వ్యాధిని అరికట్టడానికి సేవయే మిగుల గణనీయమైనది."

"ఆ విషయమై ఎట్టి లోపమూ ఘటిల్లదు. అందుకు నేను ఉత్తర వాదినై ఉంటాను. ఇంటిలోని వారంతా అందుకు ఉద్యుక్తులై ఉంటారు. తెవులు తగ్గు మొగం పట్టేందుకు ఎన్ని దినములు పట్టును ?"

"ఇందుకు నే నేమి జవాబు చెప్ప గలను ?" ఈ ప్రత్యుత్తరం జీవన దత్తుకు గిట్టలేదు. "కృష్ణదాస్ అన్నా! ఇరవై రెండు రోజులనుండి ఇరవై నాలుగు రోజులలో మీ అబ్బాయి జ్వరం బాగుగా సడలి పోతుంది. ఇట్లని నేను ఖాయిగ్రుద్ది చెప్ప గలను. నీవు ఆదుర్దా పడవద్దు" అన్నాడు.

దెబ్బ తినిన త్రాచువలె రంగలాల్ క్రుద్ధుడైనాడు. ఔషధమును కాల్ బాక్స్‌లో గట్టిగా జొనిపి, లేచి నిలిచి జీవనదత్తు నుద్దేశించి, "మీ రెవరు? జ్యోతిష్కులా?" అని అడిగినాడు. "కాదు. ఇతడు ఇచ్చట నివసించే ఒక కవిరాజు. మీరు జగద్బంధు మహాశయుని పేరు వినివుంటారు" అన్నాడు కృష్ణదాసు.

"తప్పక విన్నాను. విచక్షణ శక్తిగల కవి రాజాయన; రోగ నిర్ణయంలో ఆశ్చర్యకరమైన శక్తి గలవారు. ఆయనను తలచినపుడు ఈ ప్రాంతములో ఉండే వరదాబాబు విషయం జ్ఞాపకమునకు వస్తూ వుంటుంది."

"ఈతడు ఆయన కుమారుడు. జీవనదత్తు." రంగలాల్ మరొక పర్యాయం జీవన దత్తును తేరిచూచి, "ఇరవై రెండు మొదలు ఇరవై నాలుగు దినాలలో జ్వరం మళ్లుతుందని మీకెలా తెలిసింది? నాడి చూడడం వల్లనా" అన్నాడు.

"నాడి చూడడం వల్ల నా కట్లు బోధ పడింది. జ్వరం ఇరవై నాలుగు దినములలో తగ్గిపోతుందని నా గట్టి నమ్మకము. కాని తరచుగా ఈ వ్యాధి మన దేశంలో మొదటి రెండురోజుల్లో కనబడీ కనబడనట్లుంటుంది. అందువలన ఇరువది రెండు మొదలు ఇరువది నాలుగు దినములు పట్టునని అంటిని."

"నీకు సాహస మున్నది. అల్ప వయసు గలవాడవు. ఉడుకు నెత్తురు నీలో ప్రవహిస్తూ ఉన్నది" అని చిరునవ్వుతో పలికి రంగలాల్ డాక్టరు "మీ వంశంలో నాడీజ్ఞానంలో గట్టిచేతు లున్నాయని విన్నాను. వరదాబాబు హస్త మహిమను స్వయంగా చూచాను కూడా. కాని, యీ నాడీ జ్ఞానం మా శాస్త్రానికి ఆవల ఉన్నది." అన్నాడు.

సరిగా ఇరవైనాలుగు రోజులలో కిశోరుని జ్వరం బాగుగా మళ్ళిపోయింది.

కృష్ణదాసు జీవనదత్తుని పిలిచి కౌగిలించుకొన్నాడు. రంగలాల్ డాక్టరు వద్దకు మనిషిద్వారా ఉత్తరం పంపినాడు. జాబులో ఇలా వ్రాసినాడు. 'ఇరవై నాలుగు రోజులలో జ్వరం వదలిపోయింది. ఇకముందు ఔషధంతోపాటు పథ్యాది నిర్ణయం తాము తెలిపిన చాలును. ఒక పర్యాయం తాము వచ్చి పిల్లవానిని చూడడం మేలు. ఎప్పుడు దయ చేసేదీ తెలుపుడు.'

రంగలాల్ డాక్టరు మరి రాలేదు. వలసిన ఔషధంతో పథ్యపానాదుల నిర్ణయం వివరించినాడు. "జగద్బంధు మహాశయుని కొడుకునకు నా ఆశీర్వాదములు చెప్పండి." అంటూ ఆతడు తనలేఖ ముగించినాడు.

ఈ మాట వినినమొదలు జీవనదత్తు ఉత్సాహమునకూ ఆనందమునకూ మేర లేకపోయెను. ఆయనకు ప్రణమిల్లుటకై ఆతడు నాలుగుమైళ్లు కాలి నడకను పోయెను.

వహ్నిగర్భ శమీ వృక్షములు రెండు పరస్పర సాన్నిధ్యము వలన తేజోవంతము లగును. రంగలాల్, జీవనదత్తు లిరువురు కలియుటవలన వారి అంతరంగములందు విద్యమానమై ఉండిన ప్రతిభాగ్ని విశేష విజృంభణముతో జ్వలించినది.

రంగలాల్ జీవనదత్తు వీపు నిమిరి ఆశీర్వదించెను. ఆ హస్తస్పర్శయందు ఆత డెంతేని ఆనందానుభూతి నందెను. అది విస్మయకరమైన అనుభూతి.

తాంత్రిక శవసాధకుని వంటి వ్యక్తి రంగలాల్ డాక్టరు. వామాచారి వలె ఆత డెట్టి ఆచార నియమములను పాటింపడు. కఠిన ప్రకృతి కలవాడు; రూఢ స్వభావుడు. నిష్ఠుర భాషణములను ఉచ్చరించువాడు. మయూరాక్షీ జలమందు కొట్టుకొనిపోవు శవములను ఒడ్డుకు లాగి ముక్కలు ముక్కలుచేసి ఆతడు పరీక్ష చేస్తూ ఉంటాడు. గోరీలలోనుండి శవములను త్రవ్వి తీసి పరిశీలిస్తూ ఉంటాడు. తల్లి యొడిలో బిడ్డ మరణించుట చూచినను, ఇంచుకైన ఆంతరంగికముగ విచలితుడు కాడు. పృథ్విలో ఎవరిమ్రోల తలవంచుకొని ఆతడు నిలబడడు. ఆతడు తంత్ర ప్రధాన పద్ధతులను అవలంబించువాడనీ, ప్రచ్ఛన్న తాంత్రికుడనీ, వామాచారి అనీ ప్రజలు రంగలాల్‌ను గురించి చెప్పుకొంటూ ఉంటారు.

"ఇతడు నాస్తిక వాది. హృదయము కేవలము పాషాణము." అని మరి కొందరి అభిప్రాయం.

రంగలాల్ డాక్టరు జీవనదత్తుతో ప్రథమ ప్రసంగమందే ఇట్లు చెప్పినాడు. "నీవు డాక్టరు పరీక్షకై చదవడం మేలు. నీలో స్వతస్సిద్ధముగా చికిత్సకుడున్నాడు. ఆయుర్వేద శాస్త్రంలో ఏమీ లేదని నేను చెప్పుట లేదు. కాని మనజాతివలె ఆ శాస్త్రము కాలప్రవాహముతో కదలి పోలేదు. ఏ కాలంలో ఈ శాస్త్రము సృష్టియైనదో, చరమోన్నతి నందినదో ఆకాలములో కెమిస్ట్రీ

అంతగా వృద్ధి నందలేదు. బహుళ వైజ్ఞానిక విషయము లప్పుడు ఆవిష్కార ములు కాలేదు. ఇంకను ఈ విషయం గమనింపుము, ఎన్నెన్ని దేశముల నుండియో ఎందరెందరు ప్రజలో మన దేశమందు ప్రవేశించారు. వారితో వారి వారి సీమలరోగములు ఈ దేశములోనికి దిగుమతి యైనవి. నీటిలో, గాలిలో మట్టిలో వింత వింత మార్పు లగపడినవి. ఆయుర్వేద పరిశోధనము నిలిచిపోయిన పిదప యూరపు చికిత్స విద్య చరచర ముందంజ వేసినది, అనుమానావధులను, ఊహాగానములను దాటి చాల దూరము సాగిపోయినది.''

ఆధునిక కాలమున రోగచికిత్సను గురించి ఆతడు విశేషముగ ప్రసంగించినాడు. తన్మయుడై జీవనదత్తు వాని భాషణములకు వీను లొగ్గినాడు!

తండ్రియును, మహా గురువునైన జగత్‌మహాశయుని స్మరించుకొనినాడు. ఇరువురి ప్రబోధమందలి సార్థక్యమును అవలోకించినాడు. తండ్రి బోధతో భగవంతుని గురించిన ఉల్లేఖనమూ, నియతికి సంబంధించిన ఉదంతమూ, అదృష్టమును గురించిన ప్రచవనమూ ఉండేవి. ఆతని ధోరణిలో రోగవిజ్ఞాన వ్యాఖ్యానము మాత్రమేగాక ఉదాత్త తాత్త్విక భావ ముండేది.

రంగలాల్ డాక్టరు వక్తవ్యములో ఈశ్వరుడు లేడు, అదృష్టము లేదు ; అది శుష్కవృత్తాంతము మాత్రమే ! అది కేవలము బుద్ధికి అందుబాటులో ఉండిన విషయము మాత్రమే ! వట్టిమాటల అర్థమును మించిన భావ మందు హుళక్కి. రంగలాల్ ఇట్లు అంటూ ఉంటాడు. ''మనుష్యుడు మరణించిన పిదప మేము మరే దిక్కున దృక్కులు సారించము. దేహపంజరమును భేదించుకొని ప్రాణ విహంగము హఠాత్తుగా ఎచటి కెగిరి పోతుందో తెలిసికోవాలనే మక్కువ మాకు లేదు. అట్టి ప్రయత్నమేమీ చెయ్యము. (నడుమ, నడుమ నవ్వుతూ)ప్రాణము పక్షి యైన యెడల, దానిని తుపాకితో కొట్టి చంపే వేటకాడు కూడా ఉంటాడు. అతడు పిట్టమాంసము మెక్కుతూ ఉంటాడు. అప్పుడు పునర్జన్మ అనేది ఎక్కడ ఉంటుంది ? ఎలా ఉంటుంది ?''

ఆనాడే అవకాశం చూచుకొని, జీవనదత్తు ''నా ప్రార్థన ఒకటి ఉన్నది. దయయుంచి ఆంగ్లచికిత్సను నాకు నేర్పండి'' అని రంగలాల్‌ను అర్థించాడు.

''ఆంగ్లవైద్య శాస్త్రం అంటే నీ కెంతో ప్రీతి ఉన్నదా ?'' అని రంగలాల్ వాడిచూపును జీవనదత్తుపై సారించాడు. ఆ తీక్ష్ణదృష్టి హృదయమును

భేదించు నట్లున్నది. రంగలాల్ మొగము చిట్లించుకొన్నాడు. విస్మయ సంభరిత ప్రశ్న లెన్నెన్నో వాని మనస్సులో ఉన్నవి.

"ఆయుర్వేద చికిత్స బాగా నడవడం లేదా? నీవు కవిరాజువు కదా!"

నవ్వుతూ జీవనదత్తు ఇట్లన్నాడు: "చదువు సంధ్యలు వచ్చిన వారిలో ఆయుర్వేద మంతగా పని చెయ్యడం లేదు. కాని సాధారణ ప్రజలందు అది బాగానే నడుస్తున్నది."

"అయితే ఇకనేమి?"

"చిన్నప్పటినుండి ఇంగ్లీషు వైద్యశాస్త్రం చదవాలనే మక్కువ నాలో మిక్కుటముగా ఉన్నది. కాని" అని చెప్పుతూ జీవనదత్తు వేడినిట్టూర్పు విడిచినాడు.

"అయితే ఇంగ్లీషు వైద్యశాస్త్రం ఎందుకు చదివినావు కావు? మీ నాన్న మంచి ధనవంతుడు కదా!"

మ్లానహాసనము సలిపి, జీవనదత్తు ఇట్లన్నాడు:

"మేమైతే ధనవంతులమే. ఒప్పుకొంటున్నాను. అందువల్లనే ఇంగ్లీషు వైద్యశాస్త్రం చదివి తీరాలనే కోరిక నాలో ప్రగాఢమై ఉన్నది. కాని—"

"అయితే దానిని చదివేందుకు మీ తండ్రిగారు అంగీకరింపలేదా?"

"ఇందు మా నాన్నగారి ఆటంక మేమీ లేదు. అపరాధమంతా నాదే!"

జీవనదత్తు మంజరిని గురించిన విషయం విడిచివేసి భూపీ బోసుతో తనకు వాటిల్లిన పోరాటమును గురించిన ఉదంతమును తెలిపి యిట్లన్నాడు. "ఇంటికి తిరిగి వచ్చాను. 'ఇక నీ చదువు సంధ్యలు కట్టిపెట్టు. నిన్ను విదేశములకు పంపి, నిశ్చింత మనస్సుతో నే నుండలేను. కుల విద్యలో, వంశమునకు సహజమైన చదువులో, దీక్షను స్వీకరింపుము.' అని మా నాన్నగారు సెల విచ్చినారు.

బండరాతిగుట్ట వంటి మనుష్యుడు రంగలాల్ డాక్టరు. జీవనదత్తు మాటలు వినిన తోడనే కడుపు చెక్కలయేటట్లు పకపక నవ్వ సాగినాడు. తృణ పాదప రహితమైన నల్లని కొండ బ్రద్దలైనట్లయింది. అందుండి కడువడిగా ప్రవహించు

సెలయేటివలె కౌతుక సహిత వాగ్ఝరి వెడలినది. ఈ రీతిగా అతడు నవ్వుటను ఎవ్వరునూ ఎన్నడునూ చూచియుండ లేదు. కొంతసేపు నవ్వు సాగించి ఆత డిట్లన్నాడు :

"ఆ భూపీబోసుముక్కు గరుత్మంతుని ముక్కువలె ఉండేది. అట్టి దానిని నువ్వు పచ్చడిచేసి వదలినావు? అంతపని చేసేందుకు ఎందుకు పూనుకున్నావు? బొత్తిగా చితికిపోయిన వాని ముక్కును నేను చూచి ఉంటిని. తగిన చికిత్స చేయించేందుకై వాని మామగారు తన యింటికి తోడ్కొని వచ్చినాడు. వైద్యం కోసం అల్లుని ముక్కును నా చేతిలో పెట్టినాడు. వాని ఒళ్ళంతా తనిఖీ చేయ మన్నాడు. అన్ని విధాల అల్లుడు దొడ్డవాడే. అతడు అపరిమితంగా మద్యపానం చేస్తూ ఉంటాడు. అందువలన వాని లివర్ పూర్తిగా చెడిపోయింది. ఆ వ్యాధిని కూడా కుదుర్చ వలసినదని కన్నీటితో మామగారు నన్ను ప్రార్థించాడు. కుఱ్ఱ వాడు మేడిపండు మేలిమివన్నె గలవాడు. కుళ్ళిన నేరేడు పండై పోయినాడు. (ఆకస్మికముగ గంభీరుడై) సిఫిలిస్ వ్యాధివలన వాని ఒళ్లు కుళ్ళి కూర్చుందని గ్రహించాను."

రంగలాల్ డాక్టరుకి చప్పున రోగమును పట్టివేసే అనుభూతి కలదు. నిలదీసి నిక్కచ్చిగా అల్లుని, మామను వ్యాధి పుట్టు పూర్వోత్తరాలు చెప్పమని అడిగినాడు. మొట్టమొదట వారు నిజమును కప్పిపుచ్చారు. తరువాత ఒప్పుకొనక తప్పిందికాదు ఈ రీతి నడవడి అచటవారికి అలవాటు. డాక్టరు అగ్నిహోత్రుడై పోయినాడు. నోటిలో ఉండిన చుట్టను వెలుపలికి తీసి "ఎంత అద్భుత మయింది ఈ దేశము : ఎంత అద్భుత మయింది! రొంపిలో ప్రాకులాడి ఒళ్లు కుళ్ళబెట్టు కొని జాడ్యమును దాచి పెడుతూ ఉంటారు. తాము అనుభవించడం మాత్రమే కాక తరతరముల వంశమును నాశనము చేసి వదులుతూ ఉంటారు. శరీరాలు రక్త మాంసములతో తయారైనవి కావా? ఆకలికి దాసులు! లోభమునకు దాసులు! కామమునకు దాసులు!" అని ఒక ఉపన్యాసం సాగించాడు.

లేచి అత డిట్లన్నాడు. "ఆ పంది ఏమన్నాడో ఎరుగుదువా? ఈ రోగం నాకు ఎలా సంక్రమించిందో నే నెరుగను. నా పెండ్లాము మొగమును తప్ప నేనే ఆడుదాని ముఖమును చూచి యెరుగను."

"ఈ మాటలు విని నేను ఉద్రేకమును అడచుకోలేక పోయాను. గట్టిగా ఒక చెంపపెట్టు పెట్టి నువ్వు వట్టి పోకిరివి! నీ నెత్తిని ముక్కలు చేసి వదులుతాను, అని నేను లేచి వచ్చినాను."

కొంచెము సేపు పచార్లు చేసి, శాంతము నంది, రంగలాల్ డాక్టరు తన ఆసనముపై కూర్చున్నాడు. చుట్ట నోట బెట్టుకొని, రెండు దమ్ములు లాగి, చిరునవ్వుతో ఆత డిట్లన్నాడు :

"వ్యాయామమునకై ఉపయోగపడే ముద్గర సదృశమైన నీ చేతి గ్రుద్దు యొక్క చిహ్నమది కాదా? నీవు భయానక వ్యక్తివి. భూపీ బోసు పట్ల గొప్పదైన మిత్ర ధర్మమును నిర్వహించావు. ఆ చిహ్నమునుబట్టి వాని వైఖరి కనిపెట్టి, వాని పాపపు రోగమును కనిపెట్టే అవకాశమును నీవు ఒసగినావు"

ఇంచుకసేపు ఊరకొని ఆత డిట్లన్నాడు :

"ఇంగ్లీషు వైద్యశాస్త్రమును పఠించాలని అనుకొంటున్నావు. మంచిది. నేను నేర్పుతాను. నా వద్ద ఉండి ఎంత నేర్చుకో గలిగితే అంత నేర్చుకో. నీవేదో ఆలోచిస్తున్నట్లు అగపడుతున్నావు. ఏమి ఆలోచిస్తున్నావు?"

మంజరీ భూపీబోసుల విషయం జీవనదత్తు ఆలోచిస్తున్నాడు. భూపీ బోసును గురించి రంగలాల్ చెప్పినంత సేపు చింతా శక్తిహీనుడైన మనుష్యుని వలె వాని ముఖమును విలోకింపసాగినాడు. ఆంగ్లవైద్య శిక్షణమును గురించి రంగలాల్ చెప్పిన దానికి ప్రత్యుత్తర మీయక "భూపీబోసుకు లివరుజాడ్యము వచ్చినదా? ఏమైనా తగ్గినదా?" అని జీవనదత్తు ప్రశ్నించాడు.

"భూపీబోసుపై నీకు మమత ఉన్నది కాబోలు!"

జీవను డిపుడు సచేతను డైనాడు; లజ్జితుడైనాడు.

"మీరు వైష్ణవులా

"అవును."

"ఆలాగా? భూపీ బోసు వ్యాధి ప్రస్తుతం లొంగుబాటులోనికి వచ్చింది కాని మళ్ళీ తిరుగబెట్టక మానదు. వాని పెండ్లామూ, తల్లీ చాల విడ్డూరపు వ్యక్తులు. చాటుననుండి రోగికి దొంగతిళ్ళు పెడుతూ ఉంటారు. భూపీ మద్యపానమును అలవరచుకొన్నాడు. బ్రతికి బాగుండాలంటే ఈ దురభ్యాసమును

వదిలిపెట్టాలని నే నన్నాను. నౌకరుకు ఇనాము ఇచ్చి మరుగునుండి సారాబుడ్డి తెప్పించి వాని యిల్లాలు దానిని భర్తచేతికి అందించి 'ఆశే తాగకుము. మందు మోతాదువలె కొంచెం సేవింపుము' అన్నది. ఆ బాలిక మిగుల ఆశ్చర్యకరమైన వ్యక్తి. తన యొంటిమీది నగలను అమ్మి భర్తచేత సారా వగైరాలను త్రాగించు తోంది. మృత్యువుతో యుద్ధముచేసి తమ భర్తలను బ్రతికించుకొనిన యిల్లాండ్రు ఉన్నట్లు పురాణములందు చదువుతూ ఉంటాము. ఇక ఈ బాలిక అనురాగంలో వారిని తల దన్నింది! మృత్యుకాండను పిలిచి తన మగని ఆమె చేతులందు పెట్టుచున్నది. ఇది మిగుల ఆశ్చర్యకరమైన విషయం కాదా?''

జీవనదత్తు ఏమీ పలుకక చతికిల పడివున్నాడు. స్థాన, కాల, పాత్రలను యావత్తూ ఆతడు మరచినాడు. ఇవి అన్నీ వాని సమ్ముఖమునుండి తుడిచి వేయ బడినవి. అర్థహీన ఏకాకారమై పోయినవి.

రంగలాల్ డాక్టరు జీవనదత్తును పరధ్యానమునుండి మేల్కొలిపినాడు. ''కుళ్ళిపోయిన ఆ ధనికుని కొడుకు విషయం మరి తలపోయకుము. మనుష్యుడు తన పాపమువలన ఈశ్వర సృష్టిని అపవ్యయ మొనరించిన వ్యక్తి అగును. ఇప్పుడు నేను చెప్పుమాటలను శ్రద్ధగా వినుము. ఇంగ్లీషు వైద్యగ్రంథములను చదవాలని నీవు మక్కువ పడుతున్నావు కదా! దీనిని పఠించుటకును, అభ్యసించు టకును నీకేమీ కష్టము కాదని నా తలంపు. నీవు వైద్యం ఎరుగని వాడవు కావు. రోగ నిర్ణయం చెయ్యడంలో ఆరితేరిన వాడవు. ఇక నీ దృష్టి నూతన గ్రంథము లపై బడినను, నిమిషంలో అందలి విషయములు నీకు పట్టుబడి తీరును. ఇచ్చటి వారికై ఇంగ్లీషు వైద్యశాస్త్రగ్రంథములను కొన్నింటిని నేను అనువదించియుంటిని. వీటిని నీవు అవలీలగా చదివివేయగలవు. నీకు నేను తగిన సహాయము చేస్తాను. విషయము లన్నీ నీకు బోధ చేస్తాను. అవి నీ తలకెక్కక మానవు.''

ఈ పర్యాయం జీవనదత్తు చెవులు పెరదిక్కుగా మళ్ళలేదు. నిమిషంలో వాని పరధ్యానము తొలగి పోయింది. వాని హృదయంలో అగ్గి రవుల్కొన్నది.

జీవనదత్తులోని ప్రజ్వలిత వహ్నిపై జలదవాతూలములు కలిసినట్లు మంజరీ, భూపీ బోసులు ఇద్దరూ కలసి దురదృష్ట వర్షమును కురిపించిరి. ఆ అనలమును ఆర్పివేసిరి. కాని వనస్పతియొక్క మొదలునుండి శాఖా గ్రమువరకు ప్రసుప్త వహ్నిధార ఆరిపోలేదు. ఇపు డది జ్వలించినది. ఆతడు

మంజరీ భూపీ బోసులను విస్మృతీ గర్భంలో కూల ద్రోసినాడు. ఈ సమయంలో అత్తరు కోడలు సయితము మనస్సులో లేదు. ముందున్నవాడు ఒక్క రంగలాల్ డాక్టరు మాత్రమే! చేతిలో ఉన్నది వైద్యగ్రంథముల సంపుటి! కన్నులెదుట నున్నది భవిష్యత్తు! ఉజ్జ్వలమై, నవ్యాశయదీప్తమైన భవిష్యత్తు!

# పదునాలుగవ ప్రకరణము

నాలుగేళ్లు గడచినవి. జీవనదత్తు జీవనోదయలగ్నము దృగ్గోచరమై నూతన జన్మాంతరము లేక నూతనజన్మ తపస్సు ఆవిర్భవించినది.

రంగలాల్ డాక్టరు అపుడపుడు పరిహసిస్తూ ఉంటాడు. ఒకప్పుడు ఇట్లన్నాడు. ''ఇది పెళ్ళిపందిరివలె ఉన్నది. క్రొత్త వేడుక. మేలి ముచ్చట అగపడుతూ ఉన్నది. శుభకార్యమేల చేయరాదు?''

ఈ రీతి కులాసా కబుర్లు రాత్రివేళ సుఖముగా కాలక్షేపము జరిగే సమయంలో సాగుతూ వున్నవి. వసారాలో కూర్చుని నియమిత పరిమాణంతో కొన్ని బ్రాంది చుక్కలు గ్రోలి, ఆతడు చుట్ట నోట బెట్టుకునే వాడు. జీవనదత్తు ఎదుట ఉన్నప్పుడు వానితో మధుర ప్రసంగములు చేసేవాడు. లేకున్న ఏదేని గ్రంథమును పఠిస్తూ ఉంటాడు. చదువుపై మనసు పోని సమయంలో ఇరుగు పొరుగు వారిలో ఒక్కనిని పిలిచి, కథలు వింటూవుంటాడు. భూత ప్రేతముల కథలంటే ఆతడు చెవి కోసుకొంటూ వుంటాడు. వింటూ వింటూ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతూ వుంటాడు.

వైద్య శాస్త్రమునకు సంబంధించిన తన వ్రాత ప్రతులను ఆతడు జీవనదత్తు కిచ్చినాడు. వానిని తన యింటికి తీసికొనిపోయి అతడు చదువుతూ ఉన్నాడు. యథారీతిని ఆయుర్వేద పద్ధతిని చికిత్స చేయుచు ఇందందు మసలుతున్నాడు. చప్పు చప్పున తనపని చూచుకొని రెండు మూడు దినములు గడచిన వెనుక రంగలాల్ కడకు పోతూ ఉంటాడు. ఆంగ్ల చికిత్స శాస్త్రంలో తనకేది తెలియదో అతనిని అడిగి బోధ పరచుకొంటూ ఉండేవాడు. తనకు తెలిసిన దానిని రంగలాల్ ముందు ఏకరువు పెట్టుతూ ఉంటాడు. ఒక్కొక్కప్పుడు అర్జంటు కేసులు వచ్చినప్పుడు తాను కూడా పెద్ద డాక్టరు వెంట పోతూ ఉంటాడు. గురువు పాలకీలో పోయినపుడు, వానివెంట జీవనదత్తు నడచిపోతూ ఉంటాడు. అతడు దృఢ కాయుడు. మంచి సత్తువ గలవాడు. ముప్పయి యెనిమిది అంగు

శాల ఛాతి కలవాడు. వాని యొంటి తూకము సుమారు రెండుమణుగులు. అతడు మంచి వ్యాయామము చేసినవాడు. ఎంతో బలముగల గున్న యేనుగువలె అడుగులు వేస్తూ బోయీలను అనుసరించువాడు.

ఆంగ్ల వైద్య శాస్త్రమును ఆకళించుకొనడం సాధ్యాతీత క్రియ అని కొలది దినములలో జీవనదత్తు గ్రహించాడు. ఈ పూనికలో అతడు చాల వెనుకబడినాడు. గురుశిష్యుల సంబంధమందు పొర పొచ్చెములు తల సూపినవి. తన అసుపత్రిని అంటియుండిన గాజు గదిలో ఒక శవమును కోయుమని దత్తుతో రంగలాల్ తెలిపినాడు. దత్తు ఎట్లో ఆ పనికి ఒడంబడి శవమును కోసినాడు. రాత్రి ఇంటికి మరలి వచ్చి భోజనము చేసిన తరువాత తిన్న దానిని పూర్తిగా డోకి వేసినాడు. పిదప ఐదారు దినములవరకు గురువుగారి యింటి దిక్కుగా కాలు కదుప లేదు. ఆరవనాడిట్లు తలపోసినాడు. "కుళ్ళిపోయిన ఆ శవాన్ని డాక్టరు పారవేసినాడు. నన్నెంతో అవజ్ఞతో చూచినాడు, మరొక శవాన్ని తీసుకొనిరా" అని తన నౌకరును ఆజ్ఞాపించాడు.

గంటలోపున ఆతడు పోయి మరియొక మృత కళేబరమును తెచ్చినాడు. రమారమి అయిదేళ్ళ వయసుగల ఒకఆడుబిడ్డ శవమును అతడు తెచ్చినాడు. ఈ ప్రాంతాల్లో ఐదేళ్ళ పిల్లల శరీరములను దహనము చేయరు; భూమిలో పూడ్చిపెట్టెదరు. జీవనదత్తు చేతులు జోడించి ఇట్లన్నాడు: "అయ్యా! ఈ పని నేను చేయ జాలను. ఈ శిశువు శరీరముపై ...." అంటూ వెక్కి వెక్కి ఏడ్వ దొడగినాడు. డగ్గుత్తికతో ఆత డిట్లన్నాడు : "నా బిడ్డ సరిగా యిలాగే ఉండేది. ఇట్లే ఉండేదంటే నమ్మండి. దాని వెంట్రుక లిట్లే ఉండేవి. శరీర వైఖరి కూడా ఇదే మాదిరిగా ఉండేది".

రంగలాల్ వానిపై ఉగ్రదృష్టిని సారించాడు. వాని కన్నులు విస్ఫారితములైనవి. నిమిషములో కోమల స్వభావుడై ఆతడిట్లన్నాడు. "పోనిమ్మా. నువ్వు బంగాళా లోనికి పోయి కూర్చో. దీనిని నేను డిసెక్షన్ చేసి వదులుతాను. ఈ బిడ్డది మిగుల ఆకస్మిక మరణ మని తోస్తోంది. దీని దేహములో రోగ చిహ్నము లేమీ లేవు".

ఈ శిశువు జీవనదత్తు మొదటి దానివలె ఉన్న దనుట నిజము. అత్తరు కోడలుకు అప్పటికి ఇరువురు పిల్లలు పుట్టిరి. మొదటి బిడ్డ ఆడుది; సుషమ. తరువాతి శిశువు మగవాడు, వన విహారి. జీవనదత్తు చరచర ఇంటికి వచ్చినాడు.

కొన్ని దినములు గడచిపోయినవి. గురుశిష్యులు కలసికొనిరి. చుట్ట నోటి నుండి తొలగించి, రంగలాల్ ఇట్లన్నాడు. "జీవన్! నిన్ను పైకి తీసికొని రావాలని నే నెంతో ఉబలాట పడినాను. కాని నా ఉద్దేశం సిద్ధించలేదు. నే నను కొనిన సత్తువ నీలో లేదు. ఇది లేకున్న యెడల ఇంగ్లీషు వైద్యశాస్త్రం నీకెట్లు బోధపడుతుంది? నీలోని లోపమును తీర్చవలెనని యత్నించాను. కాని సాధ్యం కాలేదు. ఈ చికిత్సలో నీకు రుచి కలుగలేదని నాకు బోధపడింది. నీ తండ్రి నీ ధాతువును కాల్చి కాల్చి మిగుల గట్టి పరచినాడు మరల ఈ ధాతువును కరిగించినగాని, అది క్రొత్త రూపము దాల్చలేదు. తరవారి, ఖడ్గము—ఈ రెండును ఆయుధములే! కాని రెండింటిలో వ్యత్యాస మున్నది. తరవారితో మహిషబలి కాదు. ఖడ్గంతో ఈ యుగమున యుద్ధం కాదు."

సరిగా ఈ సమయంలో ఒక పిలుపు వచ్చినది. ఈ ప్రాంతంలో ఒక గొప్ప ఇంటినుండి వచ్చిం దా పిలుపు. వైద్యవృత్తి నారంభించినప్పటినుండి ఆ యింటితో రంగలాల్‌కు సంబంధ మున్నది. ప్రీతి బంధురమైన సంపర్కము ఆ యింటివారికిని రంగలాల్‌కును కలిగింది. చిన్నయింటివారి సంపర్కమును అతడు చిన్న చూపుతో చూస్తూ ఉంటాడు.

ఈ ఇంటిలోని గృహిణి కఠిన వ్యాధితో పీడింపబడుచుండెను. రోగము మిగుల విచిత్ర మైనది. ఒకటి రెండు గంటలలో అది ముంచుకొని వచ్చింది. మొదటినుండి ఆమెలో పైత్యప్రకోపం అధికంగా ఉన్నది. రెండు గంటలకు మున్ను తూలిపోయి ఆమె బొయ్యిపై పడిపోయింది. బాణమువలె వంగిపోయింది. చెప్పనలవిగాని యాతన! మాటలాడుట కూడ కష్టముగా నున్నది.

రంగలాల్ డాక్టరు మిగుల విస్మితుడై "పడి ఎంత సేపయింది?" అని సమీపమందలి వారిని ప్రశ్నించినాడు.

"ఒకటి రెండు గంటలకు ముందు పడిపోయింది."

"అంతేనా?"

"అవునండి."

రోగి మూతి బిగుసుకు పోయింది. దారుణంగా మూలుగుతూ ఉన్నది. బాధ దుస్సహమై ఉన్నదని బోధపడుతూ ఉన్నది. "పడినప్పుడు నెత్తురు కారిందా?" అన్నాడు రంగలాల్.

"కుడికాలివేలికి మోపుగా దెబ్బ తగిలింది. కాని నెత్తురు కారలేదు."

దెబ్బతగిలిన బొటనవ్రేలును డాక్టరు ముట్టినాడు. భయంకరముగ ఆమె ఆర్తనాదము చేసింది.

రంగలాల్ నాడి చూచినాడు. తరువాత ఆమె చేతిని జీవనదత్తు కందించి "నాడీ పరీక్షలో నీకేమి తెలుస్తోందో చెప్పు" అని ప్రక్కకు తప్పుకొన్నాడు.

సావకాశంగా చతికిలపడి ఎంతో శ్రద్ధతో నాడిని పరీక్షింప సాగినాడు జీవనదత్తు. భయం వలన ఆతని గుండె దడదడలాడింది.

శుక్రాచార్యుని వంటివాడు రంగలాల్ డాక్టరు. ఆతనియొద్ద జీవనుడు తన ప్రజ్ఞను చూపవలెను. నాడీ పరీక్షలో అనుభవం లేనివాడు రంగలాల్. స్పందన సంఖ్యను ఆతడు లెక్కించి చూస్తాడు. వాటిలో అవాంతరం ఘటిల్లినదేమో అని అనుకొంటాడు. అంతకు మించిన నాడీ జ్ఞానమాతనికి లేదు. దానిని పడయవలెనను ప్రయత్నం కూడా ఆతడు చేయలేదు.

రోగిచేయి పరుపుపై పడివున్నది. జీవను డామె మణికట్టును స్పృశించి నాడు. గాలిలో ఇటు నటు ఎగురు ఎండు రావియాకును ముట్టినట్లు దానిని ముట్టి నాడు. ధ్యానమగ్నుడైనట్లు కూర్చున్నాడు.

'పరమ సూక్ష్మ శక్తి వలన అనుభూతి నందవలె నని' ఆతని తండ్రి చెప్పువాడు.

మిగుల క్షీణమైన స్పందనమును అనుభవము వలన ఆతడు గ్రహింప గలిగినాడు. ఒక్కొక్కప్పుడు నాడి జారిపోవుచున్నట్లే ఆతనికి తోచింది.

"నాడి చేతికి దొరికిందా?" రంగలాల్ ప్రశ్నించెను.

"కొంచెం దొరుకుతున్నట్లే వుంది."

"ఏమైనా బోధ పడుతోందా? బాగా పరీక్షింపుము." ఈ పర్యాయం జీవన దత్తుకు ఎట్టి యింగితం తెలియరాలేదు. ధ్యానయోగమును మరింత నిష్ఠతో అను ష్ఠించాలని ఆతడు నిశ్చయించాడు. బుద్ధి ప్రదీపశిఖను ఉజ్జ్వలతర మొనరించి రోగియొక్క అంతరాత్మను ప్రత్యక్ష మొనరించుకొన వలెనని ఆతడు నిశ్చయించి నాడు.

ఎంతసేపు తాను నాడిని పట్టియుంచినాడో జీవనదత్తు ఎరుగడు.

రోగి ఎత్తు తావునుండి పడిపోయినది. ఎముకలపై పెద్ద దెబ్బ తగిలింది. ఇట్టి సందర్భములో అతిసారమూ, అజీర్ణరోగమూ, వాతరోగమూ ఆమె స్వాస్థ్యముపై దాడి వెడలుట తథ్యము. ఇది సంయుక్తమైన దాడి. ప్రబల నదుల వేగము ఒక్కుమ్మడిగా మార్కొని నట్లాయెను.

"ఏం చూస్తున్నావు?"

"ధ్యాన నిమగ్నుడనై పరిశీలిస్తున్నాను."

రంగలాల్ రోగి చుట్టములతో ఇట్లన్నాడు. "నాకైతే ఆశ అంతగా అగపడడం లేదు. జీవను డింకను ఆశను వదలలేదు. కొంచెం రోగిలో కదలిక పుట్టిన వెంటనే నాకు కబురు పంపండి."

సమస్త రాత్రివేళ జీవనదత్తు నిలబడి ఉన్నాడు. అర్ధరాత్రి యగునప్పటికి బాధ కొంత తగ్గినట్లు తోచింది. జీవనదత్తు నాడిని పట్టి చూచినాడు. వాని ముఖము ప్రపుల్లమైనది. "ఒంటిపై కొంచెము ఫోమెంట్ చేయడం మంచి"దని అన్నాడు.

వేడి నీళ్ళలో గుడ్డ ముంచి ఆమె చేతిపై ఉంచినాడు. శరీరముపై కంపనము పుట్టునేమో చూచినాడు.

"వేడి తగులుతోందా?" అని అడిగినాడు.

సమ్మతితో రోగి తల ఊపెను. దత్తుకు కొంత ఆశ కలిగెను. "ఈ విధంగానే ఫోమెంట్ చేయాలి" అని అత డన్నాడు.

ఒకామె చెంతనిలిచి, రోగి నోటిలో కొంచెం కొంచెంగా ఔషధం వేస్తూ ఉన్నది. చావు బ్రతుకుల నడుమ మెల్ల మెల్లగా పోరు జరుగుతూ ఉన్నది.

రాత్రి మూడు జాములు గడచి పోయినవి.

ధనుష్టంకారము కాద'ని నాడు జీవనదత్తు. మరొక మోతాదు ఆమె నోటిలో ఉంచినాడు. "ఇక భయం లేదు. సూర్యు డుదయించు నప్పటికి వ్యాధి పూర్తిగా సడలి పోతుంది. వాయుకాలము గడిచిపోయింది. ఇప్పుడు కాల మనుకూల మయింది. అనుకూల మృదువాయుసంచలనము వలన నౌక తీరమును చేరునట్లు, రోగి జీవనతరి ఒడ్డును చేరుకొంటుంది" అన్నాడు.

అట్లే జరిగింది. జీవను డెంతో ఆనందించినాడు. అతడు రంగలాల్ డాక్టరుకు ఆశ్చర్యం కలిగింపగలిగినాడు.

ఉదయం ఎనిమిది గంటలైనది. రంగలాల్ రోగిని చూచినాడు. ఈ సమయంలో ఆతడు ఫీజు తీసుకోడు. రోగిని చూస్తూ ఉత్సుకదృష్టితో ఆతడు జీవనదత్తును చూడ నవలోకించి, చెవినుండి స్టెతెస్కోపును తీసి, "బ్రతుకుతుందనుకుంటున్నావా ?" అని అడిగినాడు.

"అట్లే అనుకుంటున్నాను. ప్రస్తుతం విపత్తు తొలగినట్లు తోస్తోంది."

"అయితే నేటికి నీ విక్కడే ఉండు. కొంచెం విశ్రాంతి తీసుకో."

మధ్యాహ్న సమయంలో రంగలాల్ మరొక పర్యాయం వచ్చి రోగిని చూచినాడు. "జీవనూ ! ముప్పాతిక క్రెడిట్ నీది. నా ఔషధంలో ఏమీ లేదు. ఏమైనా ఉంటే అది పాతికపాలు మాత్రమే !" అన్నాడు.

రాత్రివేళ అతడు కొంచెం బ్రాంది పుచ్చుకొన్నాడు. కులాసా కబుర్లతో నవ్వుకొన్నాడు.

"నువ్వు నన్ను దైత్యగురువు శుక్రాచార్యునితో పోలుస్తూ వుంటావు. అయినా నాకు కోపం రాదు. శుక్రాచార్యుడు మహాపురుషుడు. అతని కన్నొకటి గ్రుడ్డిదైతేంగాక ! నిన్ను కచునితో పోల్చవలెనని అనుకొంటున్నాను. నీకు మంచి కల్యాణయోగం ఉన్నదోయ్ ! దేవయాని నీకు దక్కడం తథ్యం ! మరీ తథ్యం !" అని రంగలాల్ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వ సాగినాడు.

# పదునేనవ ప్రకరణము

సంవత్సరం గడచిపోయింది. రంగలాల్ జీవనదత్తుకు గురువై యుండెను. ఇపు డాతనికి సెలవిచ్చినాడు. తన వృత్తికి కూడ ఆతడు సెలవిచ్చినాడు.

"ఇక నేను వైద్యం చెయ్యలేను. ఇక చదువుతాను. ఆలోచిస్తాను. జీవన మంటే ఏమి? మృత్యువంటే యేమి? లైఫ్ అండ్ డెత్—వీని వెనుక నున్న ప్రచండ శక్తి యేమి? ఈ విషయాలను గురించి ఆలోచించేందుకు ప్రయత్ని స్తున్నాను. మన దేశమందలి వృక్షలతాదులను గురించి ఒక ఉద్గ్రింథం వ్రాస్తాను." అన్నా డాతడు జీవనదత్తు నుద్దేశించి.

"జీవనూ! ఇంగ్లీషు వైద్యం నీకు పట్టుపడలేదు. నమ్మదగని నాడీజ్ఞాన మును గురించి గవేషణ చేస్తూ ఉంటావు. అంతే! అది కూడా స్వాధీనంలోనికి వచ్చిందని నే ననుకోను. నీది వైజ్ఞానిక మనస్సు కానే కాదు. ఏదో విధంగా మందు పట్టిస్తే ఉబ్బిపోతావు. ఎందుకు ఎలా పట్టిచ్చిందో హేతుపూర్వకంగా తెలిసికోలేవు. పోనిమ్ము. దానికేం? ఇంగ్లీషువైద్యం అంతో యింతో చవి చూచావు. ఆయుర్వేదంలో బాగా కాలుపెట్టేవు. నాడీజ్ఞానం కొంత సంపాదించావు. ఈ మూడింటితో ఒక ట్రైసికిల్ (మూడు చక్రాలబండి) తయారు చేసుకో! దాని నెక్కి నీ యాత్ర సాగించు." అని అన్నాడు. ఒక స్టెథస్కోప్ అతని కిచ్చి నాడు. థర్మామీటర్ ఇవ్వలేదు. కొనవద్దని కూడ హెచ్చరించాడు. దీని వలన నీ కేమీ ప్రయోజనం కలుగదని అన్నాడు.

ఆ తర్వాత కూడా జీవనదత్తు అప్పుడప్పుడు రంగలాల్ వద్దకు పోతూ వస్తూ ఉన్నాడు. మరి వైద్యం గురించిన ప్రసక్తి ఏమీ జరిగేది కాదు. చికిత్సను గురించిన ప్రశ్న ఎప్పుడైన జీవనదత్తు వేసినపుడు "నాయనా! ఇక దాని మాటెత్తకు. దానిని బాగుగా మరచిపోయాను. ఇపుడొక తోట తయారుచేశాను. చెట్లను గురించీ, మొక్కలను గురించీ అడుగవలసిన దేమైనా ఉంటే అడుగు" అనేవాడు.

రంగలాల్ ఉద్దేశించింది పూలతోట కాదు. తన సమాధి క్షేత్రమును తయారు చేసుకొన్నాడు. తాను మరణించిన పిదప తన శరీరమును అక్కడ పూడ్చి పెట్టవలెనని వీలు వ్రాసినాడు. దానిని తానే వ్రాసికొన్నాడు. అతడు పరమ పదించినపుడు దగ్గరలో ఎవ్వరూ లేరు. ఈ రీతిగా అస్తమించడమే ఆతని ఉద్దేశం. వాని ముఖ్య పరిచారకుడు వీధిగుమ్మము కడ కావలా ఉన్నాడు. పాపము! అతడు ద్వారంవద్ద కూర్చుని గోడుగోడున ఏడ్చినాడు. కాని ఎవ్వరినీ లోనికి పోనిచ్చి నాడు కాడు. "అయ్యగారి హుకుం ఎవ్వరూ లోనికి వెళ్ళరాధు," అని ఆతడు వెక్కివెక్కి ఏడుస్తూ పలికినాడు.

తదనంతరం రంగలాల్ శవం అతడు తయారు చేసుకొనిన తోటలో సమాధి చేయబడింది. రంగలాల్ డాక్టరు ఇచ్చిన స్టెథెస్కోపును చెవికి వ్రేలాడ గట్టుకొని జీవనదత్తు ఆలోపథిక్ చికిత్సను ఆరంభించాడు. ఆయుర్వేద వైద్యమును ఆతడు విడిచివేయలేదు. నాడీ పరీక్ష ఎప్పటివలెనే సాగుతుంది. అపుడే దత్త మహాశయుని చికిత్సాలయమునకు "ఆరోగ్యనికేతనము" అను నామకరణము చేయబడింది.

నవగ్రామంలో హరిశ్ డాక్టరు "హరిశ్ ఫర్మసీ" అను వైద్యశాలను తెరచినాడు.

ధనవంతుడైన వ్రజలాల్ ధర్మ అసుపత్రిని ప్రతిష్ఠించి, "పియర్సన్ చారిటబుల్ డిస్పెన్సరీ" అని పేరు పెట్టినాడు. హోమియోపథిక్ వైద్యంలో ప్రవేశించిన ఒక వ్యక్తి ఆ ఊళ్లో బల్ల కట్టినాడు, అతడు వట్టి పిచ్చివాడు. తన పేరు 'కె. ఎం. బ్రారోరి లేక క్షేత్ర మోహన్ భాదుడే' అని అతడు చెప్పుకుంటూ వుంటాడు. వాని డిస్పెన్సరీ పేరు 'బ్రారోరీ హోమియో హాల్.'

ఆలోపథిక్ ఔషధాలు కొనేందుకు జీవనదత్తు కలకత్తా పోయి, ఆరోగ్య నికేతన మను సైన్‌బోర్డు వ్రాయించుకొని వచ్చినాడు.

ఈ కథ, ఈ ప్రయత్నం ఇంటి అమ్మవారికి చెప్పరాని ఆగ్రహం కలిగించింది.

ఆలోపథిక్ ఔషధాలను, బీరువాను, తక్కిన సరంజామాను ఐదువందల రూకలు వెచ్చించి జీవనదత్తు కొన్నాడు. ఈ పైకం కొరకై అతడు తన కున్న కొంౘను అమ్మివేయవలసివచ్చెను. ఇల్లాలి హృదయంలో రవులుకొంటూవున్న అగ్ని ఈ కాండవలన జ్వలించి పోయింది,

జగత్ మహాశయుని కాలమునుండి ఇప్పటివరకు రోగులకు చేసిన వైద్యం వల్ల మందుల ఖర్చువలన సుమారు మూడు నాలుగువేల రూకలు రావలసి యుండెను. డబ్బులేనివారికి చేసిన చికిత్సవలన ముట్టవలసిన ధనం ఇంకా అధికంగా ఉంది.

ఈ పరిస్థితి జీవనదత్తు జీవనంలో విషాదయోగమును దర్శించింది. ఇక ఆతని ధర్మపత్ని ఘోష యెట్లుండునని వేరే చెప్పవలెనా? అంతకు మున్నే అనిర్వాణ చితివలె రవులుకొనిన అసంతోషాగ్ని జ్వాల ఆమె అంతరంగమును కాల్చివేస్తూ వున్నది.

ఉన్న నేల కాస్తా భస్మమై పోయింది. ఇల్లాలి మాటలు అగ్నికీలలై దత్తు మనసును మాడ్చివేసినవి. "చేసిన ఖర్చు ఐదువందలా? ఇంత డబ్బు మింగిన ఔషధం ఏం ఔషధం? అది బంగారు భస్మమా? ఏవేవో నూరి రససింధూరం సిద్ధం చేసి ఐదువందలను గోతిపాలు చేశారా? ఇష్టం వచ్చినట్లుగా పద్దు పుస్తకంలో ఏవేవో లెక్కలు ఎక్కిస్తున్నారా? హరి! హరి!" అని ఆమె యధారీతిని బీభత్స భయానకరసబంధురమైన మహోపన్యాసం చేసింది.

ఈ విషయం గురించి ఇల్లాలితో జీవనదత్తు వాద ప్రతివాదములకు దిగలేదు. రంగలాల్ యింటినుండి తిరిగివస్తూ మార్గమధ్యంలో శివసాహా యింటికడ నిలిచి వానిని వెంటపెట్టుకుని సొంత కొంప చేరుకొన్నాడు. ఆతని హృదయము ఆశా భరితమైనది. పెక్కు ఆకాంక్ష లందు గూడు గట్టికొనినవి. రంగలాల్ డాక్టరు ఏ స్థానమున నుండెనో ఆ స్థానమును తాను పొంది తీరవలెనని ఉద్దేశించినాడు. తాను ఏ రోగి గృహమునకు పోయినను, అక్కడ ఆశాకిరణములు తేజరిల్లునని ఆతడు గ్రహించాడు. తాను రోగినాడి పరీక్షించిన వెంటనే వ్యాధి ఉలికిపడి పలాయనము చిత్తగిస్తుందనీ నవగ్రామమున నివసించు జమీందారులకు శృంగ భంగమై తీరు ననియు, తనముందు వారు విధేయులై ఉందు రనియు అనుకొన్నాడు. కేవలం నవగ్రామమందలి వారే కాక ఆ ప్రాంతమందలి జమీందారులు అందరూ నతమస్తకములతో తన మ్రోల నిలిచితీరుదు రని ఆత డూహించినాడు. తాను పెద్ద గుఱ్ఱమును కొనును. అది శ్వేతాశ్వము. ఒక పల్లకిని కూడ అతడు సిద్ధము చేసికొనును. దూరము పోవలసిన సమయంలో అతడు సవారినే యెక్కును. వాని హయాములో ఉన్న వైశాల్యము తక్కువది కాదు. కాందీ పోయినపుడు భూపీబోసును చూచి తీరాలి. వాడు తెగులుతో పొగులువేళ పోయి నిజంగా దానిని

కుదిర్చి తీరవలెనని ఉద్దేశించాడు. ఇంకను ఎన్నెన్నో కోరికలు వాని మనస్సులో చిందులాడుతన్నని. వాని చంటిపిల్లవాడు వనవిహారి వయస్సు అపుడు మూడేళ్లు. వానిని పెద్ద డాక్టరుగా తయారుచేసి తీరవలెను. డాక్టరంటే సామాన్య ఛాయాలోని డాక్టరు కాక పెద్దయెత్తు డాక్టరు కావాలి. మెడికల్ కాలేజీలో చదివి, అతడు ఎల్. ఎం. ఎస్. డిగ్రీతో బయటపడి పెద్ద గౌను తొడుగుకొని పచారి చేసి తీరుతాడు.

ఎవ్వరెవ్వరు తన కీయవలసిన పైకమును ఎగవేసి, తన్ను కొద్ది చూపుతో చూచినారో, వారే విపత్తులందు తన పంచ జేరి తన మందుకై తహతహలాడడం తథ్యం. చీవాట్లతో తన పంచనుండి వారిని తాను వెళ్ళగొట్టడు. తన వంశగౌరవ మును నిలబెట్టి, తాను దొడ్డవాడై నిలుస్తాడు.

ఇల్లు చేరకొని "రెండు మెతుకులు కొరికి వస్తాను. కొండ్ర అమ్మకానికి వలసిన దస్తావేజు రిజిస్టరు కావాలి." అని శివసాహను కూర్చుండ బెట్టినాడు.

"దస్తావేజు రిజిస్ట్రేషను తరువాత చూచుకొందాం" అని తెలిపి ఆ సాయం కాలం సాహ వానికై ఐదువందల రూకలు తెచ్చి యిచ్చినాడు.

కొంపలో గంపగయ్యాళి మళ్ళీ అగ్గి ముట్టించింది. "ఇదంతా నా తలరాత. అమ్మను మింగేను. అయ్యను మింగేను. పిన్ననాటినుండి మేనమామ మేనత్త లకు వెట్టి చాకిరి చేసి బతికేను. అత్తవారింటికి వచ్చాను. వెంటనే అత్తగారిని కబళించాను. మామగారిని కూడా దిగమింగేను. ఇప్పుడు ఉన్న నేల కాస్తా గంగ పాలై పోయింది. కడుపున మొగమొక్క మొలిచింది. ఆడపిల్ల కూడా పుట్టుకు వచ్చింది. వారి చేతులు పుచ్చుకొని వీధి వీధీ తిరిగి నే నింక తిరిపె మెత్తుకోవాలి. రోడ్డుప్రక్క గుడ్డ పరచుకొని కూర్చోవాలి." అని ఆమె కంఠమెత్తి స్వగత వచనా లుచ్చరించింది.

జీవనదత్తు బుర్రలో కూడా చిటచిటలు రేగినవి: కాని ఎంతో కష్టముతో అతడు లోని రవరవలను లోపలనే నిలుప గలిగినాడు. "ఛీ: అమ్మీ: ఛీ:" అన్నాడు.

"ఛీ: ఛీ: అంటున్నా రెందుకు? నా తలరాత యిలా ఉందనుకొన్నాను. ఇందులో అబద్ధ మేముంది? మామగారు పోయేందుకు నెల్లాళ్ళకు ముందే నే నింట్లో కాలుపెట్టేను. ఆయన పోయి నాలుగేళ్లైనాయో లేదో ఆస్తిపాస్తులు అగ్గిలో పడి బుగ్గై పోయినాయి."

"అవును. అయిదు ఎకరాల నేల పోయింది. ఈ నెల గడచిపోక ముందు ఐదు రెళ్లు—పది యెకరాల భూమి కొని నీకు చూపించి తీరుతాను."

"కొని చూపించకే? ఎంత పెద్ద డాక్టరుగా తయారైనారు? విదేశాల్లో చదివి వచ్చిన డాక్టరై పోయారా?"

ఈ పర్యాయం జీవనదత్తు సహింపలేకపోయినాడు. ఎకసక్కెపుమాట యీ పెపోటై వానిగుండెలో గ్రుచ్చుకొన్నది. కంఠమెత్తి "అమ్మీ?" అన్నాడు.

ఆ అరుపువలన ఇల్లాలు ఉలికిపడింది. కొంతసేపు ఆమె మాట్లాడక ఊరు కొంది. తరువాత మొదలుపెట్టింది గోల. ఆ గోల పుట్టుపూర్వోత్తరాలు మగ డెరుగడు. ఆమె యావత్తుజన్మ గోలతోనే నిండిపోయింది. నేడే ఆ యేడుపు ఆరంభం కాలేదు. పుట్టుకతో ఆరంభమైన ఆలాపన అవాంతరం లేక సాగిపోతోంది. పాపము! అతడేమి చేయగలడు?

ఆరాత్రి ఇక ఇంటియొద్ద నిలువక అతడు కలకత్తా పోయినాడు.

కలకత్తానుండి ఔషధాలబీరువా కొని ఇంటికి చేర్చినాడు. 'ఆరోగ్యనికేత నము' అను పేరుగల బల్లను వీధిగోడపై వ్రేలాడగట్టినాడు. సేతాబ్ ముఖోపా ధ్యాయుడు ఒక గణేశ విగ్రహం తీసుకొని వచ్చినాడు.

"శ్రీ శ్రీ గణేశాయనమః" అని దాని దిగువ సిందూరముతో వ్రాసినాడు సురేన్.

పిచ్చివాడైన నేపాల్ ఆరోజుల్లో వాడుకలో ఉండే చిట్టాబుక్కు తెచ్చేడు. అది పొడవైన త్రాటితో కట్టబడివుంది. పసుపుకుంకుమలతో దానిపై "గణేశాయ నమః" అను అక్షరాలు వ్రాయబడినవి.

వ్రజలాల్ అల్లుడు ఇంజనీరు. అతనితో నేపాల్‌కు చుట్టరిక ముండెను. అతని వద్దనుండి చిట్టాబుక్కు నేపాల్ తెచ్చాడు. "రంగలాల్ ఏరీతిగా లెక్కలు వ్రాసేవాడో ఆరీతిగా లెక్కలు వ్రాయాలి దీనిపైన" అని దానిని అతడు జీవన దత్తుకు అందించాడు.

స్థానికులైన డాక్టర్లు కూడా నాటి ఉత్సవానికి వచ్చారు. కృష్ణలాల్ యింటి వైద్యుడు హరీశ్ విచ్చేసినాడు. స్కూలు హెడ్‌మాస్టరు వేంచేసినాడు. ఠాణాలో పనిచేసే కొత్వాల్ వచ్చినాడు.

శశిని తోడ్కొని వాని మేనత్త వచ్చింది.

"నాయనా! జీవనూ!" అని ఆమె యించుక డగ్గుత్తికతో పలుకరించింది.

"అమ్మా! మీరా?" అన్నాడు జీవనుడు. 'శశికి ఏదైనా జబ్బుచేసి వుంటుంది' అని అత డనుకొన్నాడు.

"నాయనా! అంతో యింతో వైద్యం నేర్చుకోవాలని శశి ఎంతో ఉబలాట పడుతున్నాడు. వీడికి చదువుసంధ్యలైతే అబ్బలేదు. నీ దయవలన కాస్త సంచి కట్టు చేతబట్టగలిగితే బ్రతుకుతెరువు చూచుకొంటాడు వెర్రినాగులు" అన్నది మేనత్త. శశి అప్పుడు మిగుల పిన్నవాడు. వయస్సు ఎంతో ఉండదు. పదిహేడేళ్లు లేక పద్దెనిమిదేళ్లు. వానిది కొంచెం వెర్రివాలకం కాదని ఎవ్వరు చెప్పగలరు? అచ్చంగా నేపాల్ మోస్తరు ఉంటాడు. కిలకిల నవ్వుతూ ఉంటాడు.

ఆహా! అది ఒక మనోహర రాత్రి. విందులూ, ఎన్నెన్నో పసందులూ! ఆటలూ, పాటలూ! బాజాలూ! పలు మజాలూ! వికవికలూ, పకపకలూ! అన్నీ హెచ్చుడిగ్రీలో సాగిపోతూన్నవి. ఈ మహాసంరంభంలో పిచ్చినేపాల్ ఒక కాండ సాగించాడు. ఔషధాలతోపాటు కొన్నిబుడ్ల గులాబీనీళ్లన్నవి. మరుగున కూర్చుని అతడు గులాబీనీళ్లు నెత్తికి పూసుకొన్నాడు. అలా చేయడంలో తొందర పాటువలన ఒక సీసాలోని ఫ్రెంచివార్నిష్‌ను బుర్రకు పట్టించుకొన్నాడు. బీరు వాకు పూసేందుకై దానిని జీవనదత్తు తెచ్చినాడు. ఇపుడు జరిగిన కాండ ఏమి? నేపాల్ తలవెంట్రుకలు దట్టమైన వార్నిష్‌తో బిర్రబిగిసిపోయినవి. వాని దుర్గతి వర్ణనాతీతమై పోయింది. దానిని చూచి ఎల్లరూ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వసాగి నారు. అందరికంటె అధికంగా నవ్వినాడు శశి. అతడు తరుణవయస్కుడు. జీవనమహాశయునకు ఉల్లాసం కలిగించేందుకై అత డెంతో ముచ్చట పడు తున్నాడు.

* * *

ఆనాడు శశి జీవనమహాశయుని నాడీజ్ఞానమును గురించి వెక్కిరింతలోనికి దిగినాడు. వృద్ధు డొక వేడినిట్టూర్పు విడిచినాడు.

"అయ్యా! జీవనమహాశయా!" అని యెవ్వరో పిలిచినారు.

చకితుడై ఆదిక్కుగా చూచినాడు. ఇంతవరకు అతడు చీకటిలో చతికిల పడి ఉన్నాడు. ఇంతలో లాంతరు వెలుతురు వానిమొగంపై పడింది. తన్ను

పిలిచిం దెవరు? ఆహా! ఇంతవరకు అతడు గతకాలపు స్మృతిలో మునిగి ఉన్నాడు. ఇప్పటికి వర్తమానకాలము లోనికి తిరిగివచ్చినాడు. ఇపు దెవరో వచ్చి నారు; వానిని పిలుస్తున్నారు. హరికేన్‌లాంతరు వెనుకమూతి నీడపడుతోంది.

"ఎవరు? అని ప్రశ్నించాడు జీవనదత్తు. రతన్‌బాబు ఇంటినుండి ఎవరో వచ్చి ఉంటారని ఊహించాడు. బిపిన్ వ్యాధి ముదిరిపోయి ఉంటుంది.

కాదు కాదు. వచ్చినవాడు రతన్‌బాబు యింటిమనిషి కాడు. అతని ఒళ్లూ గుడ్డలూ కంపుకొడుతున్నవి. బైరాగుల మఠానుండి వచ్చిన వ్యక్తియై ఉండాలి. గంజాయి, బూడిద, బిరబిగిసిన శరీరచర్మము, తలవెంట్రుకలనుండి వెడలు వాసన కలిసినపుడు వెలువడే ఒకవిధమైన కంపువలె ఉన్నదది! బహుశః చండీ అమ్మవారి మహంతు దూతయై ఉండవచ్చును. పెద్దసన్యాసి తెవులు గురించి కొన్నాళ్లనుండి వింటున్నాడు జీవనదత్తు.

అతని అనుమానము మిథ్య కాదు. అతడు చండీఅమ్మవారి మహంతు కొడుకు. వచ్చి అతడు "సాధు బాబాను తమరు ఒక పర్యాయం వచ్చి చూడాలి" అన్నాడు.

"ఇంతరాత్రివేళనా?"

"చిత్తం; అవునండి. సంధ్యాకాలమునుండి రక్తవిరేచనాలతో ఆతడు బాధ పడుతున్నాడు. చాలా కష్టపడుతున్నాడు. నీరసంతో పడివున్నాడు. ఒక పర్యాయం మిమ్మల్ని తీసుకొని రమ్మన్నాడు. రాత్రివేళ వచ్చితీరాలంటున్నాడు. ఒకసారి దయచేసి చూడండి."

ఆ సన్యాసిది గడ్డుప్రాణం! అతడు గట్టిపిండం! ఈవిధంగా ఆత డెన్ని మారులో బాధపడ్డాడు. పదునేను ఇరవై పర్యాయములు ఈ తెవులుతో అతడు పొగిలినాడు. రక్తవిరేచనాలు, చెప్పనలవికాని యెక్కిళ్లు! నాడి జారిపోవడం! ఎన్నెన్నియాతనలు పడుతున్నప్పటికీ ఆతడు బ్రతికి బట్టకడుతున్నాడు.

ఈ తెవుళ్ల గుంపుకు ఏకైకమైన కారణం గంజాయి. కాని యెన్నెన్ని బాధలు పడినప్పటికీ ఆ ముసలివాడు గంజాయి వదలడు. మధుపాన మంటే వానికి గిట్టదని చెప్పేందుకు వీలులేదు. సాదాదానికి అతడు దాసు డనేందుకు ఆధారం దొరకలేదు. పండుగరోజుల్లో మాత్రం పీపాలోనికెక్కించినట్లు ఉదరగోళంలోనికి సారాయి యెక్కిస్తాడు. తంత్రానియమము పాటిస్తాడు. మొదటినుండి జీవనదత్తు

మందిచ్చి వానిని నిలబెడుతూ ఉన్నాడు. ఇంగ్లీషుమందులను సన్యాసి త్రాగడు. ఇంజెక్షన్ అంటే ఉలికిపడుతూఉంటాడు. జీవనదత్తు చేతిమాత్రపై వానికి నమ్మకం అధికం. రోగం ముదిరినపుడు అతడు దత్తుకు కబురు చేస్తాడు. "సోదరా! జీవనూ! నీచెయ్యి పడితేగాని నా ఒళ్లు కుదరదు" అని అంటూ వుంటాడు. ఇప్పుడు మరల ఆ ముసలివాడు పడిపోయినాడు. ప్రస్తుతం వానిపని మిగుల విషమించి పోయింది.

జీవనదత్తు లేచినాడు.

పెద్దవాడు! రాత్రి చాలవేళ గడచిపోయింది. పదిన్నరగంట లై ఉంటుంది. శ్రావణమాసము. పగ లెక్కువ. రాత్రి తక్కువ. తప్పకుండ పదిన్నర అయి వుంటుంది. అయినప్పటికీ వెళ్లితీరాలి. వేరు తెరవు లేదు. "నడువు; దారితియ్యి" అని బాలుని ఉద్దేశించి జీవను డన్నాడు.

ఇంటిలోనికి చూచి, "అమ్మీ!" అని దత్తు అరచినాడు. "ఏం? ఎందుకు?" అని లోపలినుండి రూక్షస్వరం వినబడింది.

"వెలుపలికి వెళ్లవలసివస్తోంది. ఇప్పుడే తిరిగివస్తాను."

"ఇంతరాత్రివేళ ఎక్కడికి పోతారు? పోయేది ఎవరింటికి? మీరు వెళ్లేందుకు వీల్లేదు. ఊళ్లో డాక్టర్లు చాలామంది ఉన్నారు. చిన్నవాళ్లు, విద్వాంసులు! పెద్దపెద్ద పరీక్షల్లో పేపై వచ్చినవాళ్లు. వారిలో ఎవరైనా పోవచ్చు. ఈ వయసులో మీరు వెళ్లేందుకు వీల్లేదు. డబ్బు యివ్వదలచుకోనివాళ్లు మిమ్మల్ని పట్టుకొని పీడించి వదులుతారు. మీరు వెళ్లవద్దని చెపుతున్నాను."

కోమలస్వరంతో జీవనడాక్టరు "చండీమందిరంలో వుండే ముసలి సన్యాసికి జబ్బుచేసింది అమ్మీ!" అన్నాడు.

ఈమాట వినినతోడనే అత్తరుకోడలు కోపం కొంత ఉపశమించింది. మనిషి కొంచెం మెత్తపడింది. ఆకస్మికంగా మరొకమనిషివలె మారిపోయింది.

"ముసలిసన్యాసికి జబ్బుచేసిందా? ఏం వ్యాధి?" అని ప్రశ్నించింది.

"ఏమవుతుంది. అది మామూలు తెగులే! రక్త విరేచనములు, కడుపు నొప్పి. ఈ పర్యాయం ముసలిబాబా బహుశః శరీర త్యాగం చేస్తాడు. వయసు తక్కువది కాదు. పోయి చూచి వస్తాను. రావలసిందని కబురు వచ్చింది. ఉసురు లుంటాయో ఉండవో ఈశ్వరు డెరుగును."

మిగుల పెద్దవియైన కాలిజోళ్ళ చప్పుడు వలన పల్లీ పథమున కిరు పార్శ్వములందు గల గోడలందు ప్రతిధ్వనులు పుట్టుచుండగా ముసలి యేనుగు వలె జీవన డాక్టరు నడువ సాగినాడు. పల్లెను దాటి పోయినాడు. తదుపరి చిన్న పొలములో ప్రవేశించి, దానిని కూడ దాటి నవ గ్రామపు తూర్పు దిక్కునగల దట్టమైన అడవిని చుట్టిపోయి దేవస్థానము దెస నడచి పోయినాడు. వర్షాకాలపు రాత్రివేళ; తెరువు బురదతో నిండియున్నది. అడుగు అప్రమత్తతతో పడని యెడల జారి పడడం తథ్యం. చేతిలో లాంతరు పుచ్చుకొని సన్యాసి బాలుడు చరచర నడవసాగినాడు. జీవనడాక్టరు చీకటిలోనే అడుగులు వేస్తున్నాడు. అతని కంతగా కష్టము కలుగుట లేదు. చీకటి మూకలను నెట్టివేసి పల్లె పుంతల్లో నడవడం వానికి అభ్యాసమే! కాని ముందు నడచు సన్యాసి బాలకుని చేతిలోని లాంతరు ఇటూ అటూ ఊగిసలాడుచున్నందు వలన వానికి ఇబ్బంది కలుగుతూ ఉన్నది. కన్నులకు ఆ వెలుతురు మిరుమిట్లు గొలుపునట్లు వానికి తోచింది. అరే! భోలానాధ్! లాంతరును అలా ఊగిసలాడుస్తూన్నావేమి? చేయి కదపకుండా నడక సాగించు, నా కొరకైనా'' అన్నాడు.

"ఆ వచ్చే వారెవరు? జీవనం గారా?'' అను ప్రశ్న యెదుటి నుండి వినిపించింది.

దేవస్థానము దిక్కుగా ఏర్పడిన దారినుండి ఈ ప్రశ్న వచ్చింది. దట్టమైన ఆ అడవి నడుమ కారు చీకటిలో ఎవరు నిలిచి ప్రశ్నించినారు? కంఠస్వరం పరిచిత మైనదే! అయినను ఫలనావారి స్వరమని దత్తు గుర్తింపలేక పోయినాడు. అన్యమనుస్కుడై సన్యాసి విషయమునే ఆతడు యోచింప సాగినాడు. చాల కాలము నుండి ఆ సన్యాసి ఈ ప్రదేశంలోనే నివసిస్తున్నాడు. ఎన్నెన్ని సంస్కారణముల తోడనో అది లగింపబడియున్నది.

"రోగికి నేను గాఢనిద్ర కలిగించి వచ్చినాను." అని ఆ వ్యక్తి పక పక నవ్వసాగినాడు.

"ఓహో! శశివా నీవు?" అని ఆశ్చర్యంతో పలికి, "ఏమిచ్చి వాని కంత నిద్ర కలిగించావు" అని అడిగినాడు జీవనదత్తు. శశి పిచ్చి నవ్వు నవ్వుతూ "రాక్షస వైద్యం రాక్షస కృత్య మన్నారు ఎవరో" అన్నాడు.

"అయితే ఇక్కడకు రావలపినదని నీకు ఖబురు చేసిన వారెవరు?"

"హఠాత్తుగా వచ్చిపడ్డాను. రామహరిని చూచేందుకు పోయినాను. ఆ పిచ్చి పుల్లాయి గడ్డు తెగులుతో బాధపడుతున్నాడు. మధ్యాహ్నం తిరిగిన తర్వాత మిమ్మల్ని పిలుచుకు పోయేందుకు వచ్చాను. మతి తల్లి నాడీ పరీక్షచేసి మీరు చేసిన వైద్యం విషయం గురించి ఆలోచిస్తూ, ఆలోచిస్తూ, మీవద్దకు రావడం మరచిపోయినాను. రేపు మీరొక పర్యాయం రామహరిని చూచేందుకు పోవాలి. మీ భార్య ఈ విషయం మీతో చెప్పలేదా?"

"ఇది వేరు విషయం. దీనిని గురించి రేపు ఆలోచింప వచ్చును. ఇప్పుడు ఇచ్చటి కథయేమో చెప్పు. మహంతుగారికి ఏమి వైద్యం చేశావు?" అని డాక్టరు మహోత్కంఠతో ప్రశ్నించాడు.

"ఏం వైద్యమని చెప్ప మంటారు? చండీగుడినుండి కదలి తిరిగి వస్తున్నాను. ఒక పర్యాయం అమ్మవారికి మ్రొక్కుకొని వస్తే మంచి దనుకొన్నా. కొత్త ఒళ్లు వస్తుందని ఆశ పడ్డాను. ముసలివాని వద్దకు పోయి ఒక దమ్ము గంజాయి పట్టి చూశాను."

"సరే. ఇక తరువాతి విషయము?"

"ముసలివాడు పడివున్నాడు. వాని శరీరంలోని రక్త ప్రవాహం నిలిచి పోయింది. నాడి లేదు. బాధతో కొట్టుకొని పోతున్నాడు. మూడు నాళ్ళనుండి అతడు గంజాయి ఉపయోగించ లేదని విన్నాను. ఈ గంజాయి ఇంచు మించుగా నా ప్రాణాలు తీసివేసింది. ఇక నేను వైద్యం చేసేందుకై పూనుకొన్నాను. కేనా బిసిండికా అనే నిద్రమందు వాని గొంతుకలో పోశాను. సమయానికి మందు దగ్గరే ఉంది. ఔషధం పట్టిచ్చింది. రెండు మూడు నిముషాలలో ముసలివానికి గాఢంగా నిద్ర పట్టింది. నాడి కొంచెం చప్పుడు చేయడం మానలేదని గ్రహించాను...."అంటూ పిచ్చివాడు కడుపు చెక్కలయ్యేటట్లు పకపక నవ్వ సాగినాడు. "గంజాయి పూటుగా కడుపులో ఎక్కించిన ఘటం! వాని ధాతువు ఒక ప్రత్యేక విధంగా పని చేస్తోంది. రెండు మూడు గంటల్లో అతడు గాఢ నిద్రలో పడిపోయాడు." ఈ రీతిగా తన ప్రాక్టీసు గురించి మహోపన్యాసం చేసి ఆతడు పకపక నవ్వసాగినాడు.

# పదునారవ ప్రకరణము

పిచ్చివాడు అబద్ధ మాడలేదు. ఒకడోసు కేనాబిసిండికా మందుతో సన్యాసికి నిద్ర వచ్చింది. నిద్ర రాగానే యాతన ఉపశమించింది. నాడీ స్పందనము చేతికి అంద సాగింది. కాని ఏమీ బోధపడడం లేదు.

సాధువుల, సన్యాసుల ధాతు ప్రకృతి, శరీరస్థితి ప్రత్యేక మైనది. సాధారణ మానవుల దేహపరిస్థితికిని వారి దేహ పరిస్థితికిని చాల బేధ మున్నది. జీవన విధాన మందును, ఆచారవ్యవహారము లందును విధినియమ పాలన మందును గల ప్రభావము దేహముపై అమోఘంగా ఉండి తీరుతుంది. దీనివలన శారీరక సహనశక్తి అద్భుతంగా వృద్ధి అవుతుంది. అట్టి దేహముపై ఔషధం కూడా విస్మయకరంగా పనిచేస్తుంది. అకర్షిత మృత్తికలో నాటబడిన గింజవలె అట్లు జరుగును. అందుచే సాధారణ దృష్టితో సన్యాసుల శరీరము లందలి బాగోగులను గురించి ఇదమిత్థమని చెప్పేందుకు వీలులేదు. మృత్యు దేవత వీరికి ప్రత్యక్షమైనను, వీరి ప్రాణశక్తి మ్రోల అపజయ మంది వెనుకకు మరలిపోతుంది. ఈ రీతి సంఘటనలను పెక్కు తావులందు జీవనదత్తు చూచి యుండెను. ఈ విచిత్రోదంతమును గురించి ఆతని తండ్రి పెక్కు తూరులు వానికి చెప్పి యుండెను." ఇట్టివారి నాడిచూచి చప్పున అభిప్రాయం తేల్చవద్దు నాయనా! దేహ రక్షణముదెస వారికి అనుకూలమైన అభిప్రాయ మున్నదో లేదో ముందుగా తెలుసుకొనుము. మనుష్యుని అభిప్రాయమున అత్యద్భుతమైన క్రియ నివ్వటిలును. ఏరోగి హతాశుడై విరిగి పడినాడో వానిని బ్రతికించడం మాటలలోని పనికాదు. సాధువులు సాధారణముగా హతాశులు కారు. వారి మనస్సులు మిక్కిలి గట్టివి. ఇచ్ఛాశక్తి ప్రబలమైనది. మృత్యువును దూరముగా నెట్టించ వచ్చునని వారు ఊహిస్తారు. వారి గుండెలో దడ పుట్టించడం కష్టం."

ఇప్పుడు సన్యాసి గాఢముగా నిద్ర పోతున్నాడు.

డాక్టరిట్లు పలికినాడు : "భోలానాధ్ ! నీవు ఈ రాత్రి మేలుకొని ఉండాలి. ఇతనికి మెలుకువ వచ్చినయెడల, త్రాగేందుకు కొంచెం నీళ్ళియ్యి. ఇక నీవేమీ చేయ నక్కర లేదు. తెల్లవారిన వెంటనే నేను వస్తాను."

శశి మిక్కుటముగా నవ్వ సాగినాడు. వాని ఆత్మ సంతోషమునకు అవధి లేదు. డాక్టరు వానిని వెంట బెట్టుకొని పోయినాడు. "కలిసి పోదాము" అన్నాడు.

శశి వెంటబడి "రామహరి కేసు ముందే చెపుతున్నాను. మీరు రేపు వానిని చూచి తీరాలి." అన్నాడు.

"నేడు నీవేమీ చేశావో చేశావు. ఇక ఇటువంటి పని మరిచెయ్యబోకు."

"ఏమి? ముసలివానిచే కేనాబిసిండికా మందును తినిపించడమా?"

"అవును. తగని పనిచేసి విడిచినావు."

"నేను తగని పనిచేసి వుంటే ముసలివాడు చావక ఎలా మిగిలినాడు?"

"అతడెలా బ్రతికినాడో వివరించి చెప్పడం కష్టం. ఇతడు గంజాయి త్రాగడంలో మిగుల నేర్పరి. రోగి యాతనతో గంజాయి త్రాగక పోవడం వల్ల ఘటిల్లిన యాతన తోడుపడింది. అది ఉపశమించింది. పైగా మద్యపానం క్రియ ఉండనే ఉంది. ఇపుడు వీని నిద్రకు భంగం కలిగిన యెడల భయంకర మైన ఫలం అగుపడుతుంది."

"ఊహూ. ముసలివాడు లేచి కూర్చుంటాడని నేను చెప్పి వేస్తున్నాను. కుడోబావుడీ కూతురుకు నిమోనియో రోగం వచ్చినప్పుడు నేను కిరసనాయిలు మర్దన చేశాను. అందరూ అప్పుడు నన్ను తిట్టి పోశారు. కాని ఆ పిల్ల చావలేదే!"

"శశీ! ఈరీతి పిచ్చి కూతలు కట్టిపెట్టు. పిచ్చి పనులు మానివేసెయ్యి. లేకపోతే చాలా చిక్కుల్లో పడి పోతావు."

"అయితే నేను పిచ్చివాణ్ణి అని అనుకొంటున్నారా?"

"ముమ్మాటికి పిచ్చివాడవు. ఇందులో సందేహం లేదు."

"మంచిది. వెర్రివాణ్ణే అనుకోండి. అలా ఉండడం మేలే అంటాను. అయితే రేపు రామహరిని చూసేందుకు పోవాలి సుమండి. నేను చెప్పి వచ్చాను.

"రామహరికి ఏమయింది?"

"వాడికి పధ్నాలుగు తెగుళ్లున్నాయి. ఈపర్యాయం అతడు చచ్చి తీరుతాడు."

"అయితే నన్నెందుకు ఈడ్చుకొనిపోతున్నావు? పోనిమ్ము. ఈ వయస్సులో పోవడమే మంచిది."

"బ్రతకాలనే ఆశతో రామహరి మిమ్మల్ని పిలవడం లేదు. ఇక గంగాతీరానికి పోవచ్చునో లేదో మిమ్మడుగవలెనని ఉద్దేశిస్తున్నాడు."

అత డింకను ఏవేవో వాగసాగినాడు. వానిమాటలను చెవిబెట్టక దత్తు రామహరి విషయం యోచింపసాగినాడు. శశి తనలో తాను కంఠమెత్తి ప్రసంగిస్తున్నాడు. ఆకస్మికముగ ఆగి మరల తనధోరణి తాను సాగింప దొరకొనినాడు. "గంగాతీరమున మరణించేందుకు రామహరి ప్రయాణం చేస్తాడు. ఎన్ని దినాలలో ఊపిరి విడుస్తాడో ముందే ఆతడు లెక్కలు తేల్చుకోవాలి. ఈ రోజుల సంఖ్యనుబట్టికదా వెంటగొనిపోవలసిన పప్పు, ఉప్పు, బియ్యం వగైరాల పరిమాణం ఉంటుంది. గంగాతీరంలో మరణిస్తే స్వర్గానికి పోతాడు. స్వర్గవిమానంలోనుంచి జారిపడతాడని ఎందుకనుకోవాలి? గంగాతీరాన ఊపిరి విడిస్తే భూతప్రేత గణాలలో చేరుతాడు. అనేందుకు ఆధారమేముంటుంది?" అనుకొంటూ శశి పకపక నవ్వసాగినాడు.

శ్రావణ మాసపు గాఢాంధకార బంధురమైన రాత్రివేళ ఇద్దరు తెరువునుబట్టి పోతున్నారు.

రామహరి విషయమునే జీవనదత్తు యోచిస్తున్నాడు.

"మృత్యుకాంత దెస ఈవిధంగా యాత్ర సాగింపగలడా? గంగాతీరంలో ప్రాణాలు విడిచేందుకై ఆతడు సర్వసన్నాహాలూ చేస్తున్నాడట! ఏ చింతకు, ఏ కోరికకు మనస్సులో తావీయక వైరాగ్యభావము నవలంబించి ఆతడు శ్మశానమునకు పయన మగునా? నేను మరణిస్తాను అని ప్రసన్నమైన మనస్సుతో పలికి, ఇహజగత్తులోని తన యావత్తు సామగ్రిని వెనుక బడవేసి అభిసారికవలె నడువగలడా? చాలకాలం ప్రతీక్షించి యువతియైన వధువు భర్తృసందర్శనమునకై పోవుసమయంలో తండ్రియొద్ద అంతయు పరిత్యజించిపోవునట్లు ఆతడు పోజాలునా?"

రామహరి జీవిత స్రవంతి పలురీతుల పరవళ్లు తొక్కుతూ ప్రవహించింది. చిన్నచిన్న వస్తువుల దొంగతనంతో ఆతడు బ్రతుకుతెరువులో ప్రవేశించాడు. క్రమక్రమంగా దొంగరికం ముదిరింది. రెండుపర్యాయములు

ఖైదులో ప్రవేశించాడు. ఖైదులోనుండి వచ్చినపిదప వానిలో పెద్దమార్పు అగ పడింది. ముఖమున ఎర్రని పెద్దబొట్టు తీర్చిదిద్ది, మెడలో రుద్రాక్షమాలతోపాటు తులసిమాలను కూడ ధరించాడు. గడ్డకట్టిన పవిత్రతవలె, రూపుదాల్చిన మహా మహిమవలె సంఘసమక్షమున మహాశయుడు ప్రత్యక్షమైనాడు. జీవన నిర్వహ ణముకొరకై వర్తకం ఆరంభించాడు. అది కూరగాయల వ్యాపారం. పొలాలలో కూరలు కొని, సంతలలోనికి మోసుకొనిపోతూవుండేవాడు. పుట్టుకతో అతడు వదరుబోతు. ఈ వ్యాపారకాండలో వాని వాగ్ధోరణి హెచ్చిపోయింది. పైకం ముందే రాబట్టేవాడు, నదీతీరమందు అడవినేలలో గంజాయిమొక్కలు నాటి, కావలసినవారికి వాటిని సప్లయి చేస్తూ ఉండేవాడు. సారాపానీయమును తయారు చేయడంలో సిద్ధహస్తుడైనాడు. గంజాయి టిన్నులను, సారాయి బుడ్లను విక్ర యానికి సిద్ధము చేసేవాడు. ప్రదేశం తాంత్రికప్రదేశ మయింది. సిద్ధపురుషులు ప్రత్యక్ష మయ్యేవారు. వారి ప్రసాదం వలన రామహరి లక్ష్మీసామ్రాజ్యంలో సింహ ద్వారం కాకమానె ఒక పెద్దద్వారమును తెరచినాడు. నానారీతులు అవలంబించి తన సరకులను అమ్ముతూ ఉండేవాడు. గుమ్మడికాయలను పగులగొట్టి, లోని గింజలను, గుజ్జును తీసి ఆ డొల్లలో గంజాయిని అమర్చేవాడు. తనయింటిలో దేవప్రతిష్ఠ చేసినాడు. పవిత్రమైన వేపకొమ్మతో ఆరాధ్యవిగ్రహమును తయారు చేశాడు. ఎంతో నేర్పుతో దేవతార్చనపు గదిని తయారు చేశాడు. దాసులకు దాసు వలె విగ్రహం ముందు చతికిల పడేవాడు. మరల వ్యాపారం మానివేసి చిల్లర దుకాణానికి ప్రారంభోత్సవం చేశాడు కొంత ధాన్యం కూడా అందు చేర్చాడు. గ్రామంలో తానొక గౌరవనీయుడైన మనిషివలె అందరి ముందు సాక్షాత్క రించాడు. కాషాయ వస్త్రమును కట్టక పోయినను మొదటి తరహా సన్యాసి తానని అందరితో చెప్పి వేశాడు. తన జాతివారి పొంతపోక, అగ్రవర్ణంలోని వితంతు వును తన యింటిలో ప్రవేశపెట్టి ఆమెకు దీక్షను ప్రసాదించినాడు. భక్తురాం డ్రైన మరి యిరువురు మగువలకు ఆశ్రయ మిచ్చినాడు. పాపం వీరు తలదాచు కొను నెలవును సంపాదించారు. ఒకామె కొన్నాళ్లుండి పలాయనం చిత్తగించింది. రెండవతెరవ రాణీ స్థానమును అలంకరించి, తన పదవికి తగినట్లు విశేషవైభవంతో పరిఢవిల్లుతూవుంది.

రామహరి జీవిత చరిత్రలోని కొన్ని ప్రధానాంశములు మాత్రమే ఉల్లే ఖింపబడినవి. ఇప్పుడు ఉద్దేశ పూర్వకముగా మృత్యువును కాంక్షించి, విశేష సంరంభంతో గంగాతీరమునకు కదలి పోతున్నాడు. ''ముక్తికై అతడు పాపం

తపించి పోతున్నా" డని లోకులు అచ్చెరుపాటుతో వాని సన్నాహమును చూస్తున్నారు.

తంబాకును పీల్చి పీల్చి హుంక్కాగొట్టమును చేబూని, "అయ్యగారా! మీరు రేపొక పర్యాయం వాని దగ్గరకు పోయి తీరాలి. ఐదు రూపాయల ఫీజు యివ్వవలసివుంటుందని ఆకుంకమ్మతో చెప్పివేశాను. ఆ పైకం స్వీకరించేందుకు మీరు సమ్మతించాలి" అన్నాడు శశి జీవనదత్తుతో. గత జీవితమును సింహావలోకన మొనరించుకొంటూ, కొంతసేపటిలో వర్తమాన కాలంలో ప్రవేశించా డాతడు. ఇంచుక చిరునవ్వు వాని ముఖారవిందంపై తళుక్కొత్తింది.

శశి:—నవ్వుతున్నా రెందుకు?

జీవనదత్తు:—నవగ్రామంలోని జమీందారులకు వైద్యం చేస్తూ, ఔషధాలకై కలకత్తా పోవాలని అనుకొంటున్నాను.

శశి:—ఇక మీరిలా చెప్పకండి. రామహరి సవారి యెక్కి ప్రయాణం సాగిస్తున్నాడు. గృహదేవతకు నమస్కరించి బయలుదేరినాడు.

జీవన:—గంగాయాత్రకై పోవునపుడు సన్నాహం ఇలా ఉంటుంది కదా!

శశి:—తరుణియైన భార్యను విడిచి, సమస్త సంపదకు దిగదుడుపని ఆతడు పోతున్నాడు.

"రాత్రి చాల సాగిపోయింది. రేపు తప్పక వాని వద్దకు పోతాను. అపరాహ్ణ సమయంలో బండి పంపుమని చెప్పు. శశీ! నీ నిషా కొంచెం తగ్గించాలి."

"ప్రయత్నిస్తున్నాను. కాని నాకది సాధ్యపడడం లేదు."

నెల దినములకు మున్ను శశి తల్లి మరణించింది. ఇంత రాత్రివేళ ఒక్కడూ పోయేందుకు శశి భయపడుతున్నాడు. వచ్చేటప్పుడు భయపడి గుళ్లో ప్రవేశించి, అందు ఆతడు కొంతసేపున్నాడు

దత్తు:—శశీ! నిజంగా నీకు భయం వేసిందా?

శశి:—అవునండి. మా అమ్మ కనిపించి నట్లయింది. నన్నామె భయపెట్టలేదు.

ఏమేమో ప్రసంగిస్తూ చీకటిలో శశి అదృశ్యుడైనాడు. దత్తు తన తెన్నును తాను పట్టినాడు.

# పదునేడవ ప్రకరణము

ప్రద్యోత డాక్టరు కూర్చుని ఉన్నాడు. శ్రావణమాసం. రాత్రి మేఘాచ్ఛన్నమై ఉన్నది. ఎక్కువగా గుమాయిస్తూంది. ఇంటిలో పరుండడం అసాధ్యమై పోయింది. ఈ పరిస్థితికి తోడు దోమలదాడి మిక్కుటముగా ఉన్నది. దోమ తెరలేక ఎవరైన శయనించిన యెడల, దోమలన్నీ కలపి వారిని లేవనెత్తి ఎందో కొనిపోవునని ప్రజలు అనుకుంటూ ఉంటారు.

ఈ మశకములను మార్కొనేందుకు గడచిన యేటనుండి యుద్ధ సన్నాహము ఆరంభ మయింది. ఒక్కొక్క దోమకాటువలన దాపురించు చేటు మాటల కందనిది.

ఇంటికి వెలుపల పరుండినపుడు దోమల దాడి కొంచెం తగ్గుతుంది. కాని బయట పరుండేందుకు డాక్టరు భార్య మంజు చాల భయపడుతుంది. పట్టణంలో పెరిగి పెంపొందిన ఆడుది. ఈ ప్రాంతాలను గురించిన కథలను ఎన్నెన్నో ఆమె విని యుండెను. ఈ పల్లె ప్రాంతాల్లో అనేకరీతుల దొంగలు సంచరిస్తూ ఉంటారనీ, భూతప్రేత పిశాచగణములు చెలరేగుతూ ఉంటాయనీ, తేళ్ళూ పాములూ కాళ్ళకు అడ్డంగా పడుతూ ఉంటాయనీ ఆమె విన్నది. ఆమె తల్లి మాతామహుని గృహం ఈ ప్రాంతాల్లో ఉన్నది. అయన పరలోకమునకు వేంచేసెననుట నిర్వివాదాంశము. ఆమెకు మేనమామ అనేవాడు ఏ కాలంలోనూ లేడు. అనగా మంజు తలిదండ్రులకు కలిగిన ఒకే ఒక బిడ్డ. ఇంచుకకాలం ఆమె అమ్మమ్మ బ్రతికి ఉంది. ఆమె చెవులు పనిచేయడం మాని చాలకాల మయింది. కంటిచూపు తగ్గింది. మనమరాలిని ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఈ కథలు ఆమె చెపుతూవుండేది. బూచివాడు లేని కథను ఆమె యెన్నడూ చెప్పి యుండలేదు. భూతప్రేతములు లేవని కొంతకాలం మంజు తలపోసింది. కాని అమ్మమ్మ బోధ వలన ఆమెకు వాటిపై గట్టి నమ్మకం కలిగింది. చీకట్లో ఏదైన శబ్దం వినబడిన యెడల "అమ్మో!" అని ఆమె ఉలికిపడేది. ఆ అదటుకు ఆమె గుండెలో అందర్ధారికింది,

ఆమెకు నిద్ర పట్టేవరకు ప్రద్యోతడాక్టరు మేలుకొని చతికిలపడి వుండే వాడు. దోమలను సంహరించే మందును ఇందందు చిల్కరించేవాడు. డి. డి. టి పవుడరును, బ్లీచింగ్ పవుడరును పరిసరములందు చల్లుతూ ఉండేవాడు. ఇందు వలన పాములుగాని, తేళ్లుగాని మరే విషక్రిములుగాని అచ్చటికి వచ్చిపోతూ ఉండేవే కాని స్థిరనివాసం ఏర్పరచుకొనేవి కావు.

ప్రాతఃకాలమునుండి ప్రద్యోతుని బుర్ర పాడైపోయింది. రతన్‌బాబు కొడుకు బిపిన్ కేసును ఈ తావులో వుండే హరేన్ డాక్టరు నిన్న ఈతని చేతుల్లో పెట్టినాడు. హఠాత్తుగ ఎక్కిళ్లు ఉత్పన్నమై ఆతనికి ఎప్పుడూ చెప్పరాని నొప్పి కలిగిస్తున్నాయి. ఏ నిమిషంలోనైనా ముంచుకొని వస్తుందని అందరూ అడలు తున్నారు. ఇద్దరు డాక్టర్లూ కలసి జాడ్యంతో హోరాహోరిగా యుద్ధం చేశారు. కాని కృతకృత్యులు కాలేకపోయారు. జీవనమహాశయుని పిలుచుట మేలని కొందరు హిత వొసగిరి. ఈ సలహా ముక్తకంఠంతో వ్యక్తీకరించినవాడు కిశోర బాబు. అతనిని ప్రోత్సహించినవాడు రతన్. "మీ అభిప్రాయ మే"మని వారు ప్రద్యోతుని అడిగినారు. "ఇది దొడ్డ ఊహయే! నే నిక రాను" అని ఆతడు జవాబు చెప్పినాడు.

అత డీరీతిగా చెప్పుటకు మున్ను కిశోరు ఇట్లనినాడు; "నేనిక రానని మీరు పలుకుదురని నా ఊహ. ఇట్లనవద్దని నేను వేడుతున్నాను. ఆతనియెడల మీరు సంతుష్టులై ఉన్నారని నేను విన్నాను. కాని ఆతడు అసంతోషము కలిగించే వాడుకదా!"

"ఇందు సంతోషాసంతోషాలవిషయం ఏమీలేదు. రోగి మీవాడు. ఇష్టమైతే భూతగణంలోనుంచి పెనుభూతాన్ని మీరు పిలిపించుకోవచ్చు" అన్నాడు డాక్టరు.

"అయ్యా! ప్రద్యోత్‌గారూ! మీరు పెద్దమాటలు ప్రయోగిస్తున్నారు. ఎవరి మర్యాదను వారు కాపాడుకోవాలనికదా పెద్ద లంటూవుంటారు. సత్యమును గౌరవ దృష్టితో చూడాలికదా! కిశోరబాబు ఒక విచిత్రమైన మనిషి. ఆతని మాటలు అలంఘనీయములని నా ఊహ. వాటిని త్రోసిరాజనచెల్లదు. ఆతడు అందరికీ ప్రీతిపాత్రుడు. ఆ జీవనము దేశమునకు సేవ చేస్తున్నాడు. ఇచ్చటికి మీరు వచ్చి నప్పటినుండి అతడు చాల ఆసరాగా ఉంటున్నాడని లోకు లందరూ చెప్పుకొం టున్నారు. ఇచ్చటివాళ్లు సామాన్యులు కారు. మంజు ఆధునిక నాగరికతను ఎరిగిన ఆడుది. సైకిలెక్కి ఇక్కడకూ, అక్కడకూ పోతూఉంటుందని ఆమెను

గురించి లేనిపోని అపవాదములు చాటుతూఉంటారు ఇచ్చటివారు. లోకులు కాకులు కదా! మీచుట్టం ఒకడు ఈజిల్లాలో ఒక లేబరీటరీలో ప్రాక్టీసు చేస్తున్నాడు. ఆత డిచ్చటికి అపుడపుడు వస్తూవుంటాడు. అతనివద్దకు పోయి ఆమెనుగురించి నానా ప్రబంధాలు ఏకరువు పెట్టడం ఆరంభించారు. ఆస్పత్రిలోని మందులూ, మాకులూ, సన్నసన్నగా ఎలాగో కాజేసిందని కథ అల్లేరు. ఆ చుట్టపులేబరీటరీలో కొందరు రోగుల రక్తపరీక్ష జరిగినపుడు తోడుపడినందులకు మరికొంత అల్లిక జరిగింది. ముక్కుమీద వ్రేలు వేసికొని ప్రజలంతా విడ్డూరపు ప్రశ్నలు వేయసాగినారు. "ఇవేమి పరీక్షలు. ఇంత హంగామా జరిగితే గాని రోగాలు కుదరవా?" అంటూ ఉంటారు. ఈరీతి అపవాదములను దూరముగ నెట్టించినాడు. ఇటువంటి సందర్భాలలో ఆతడు ముందంజ వేస్తూఉంటాడు."

ప్రద్యోత్‌తో ఆత డిట్లన్నాడు: "ఇపుడొక అమూల్యజీవనం కాపాడాలి. జీవనమహాశయుడు మీ తలదాటిన మనిషి అని మేము పిలువదలచుకొనలేదు. మీకు చేదోడు కాగలిగే వ్యక్తి అని మా ఊహ. నాడీపరీక్షలో, ఎక్కిళ్ళ తగ్గించడంలో అతడు నేర్పరి అని అనుకుంటున్నాం. హరేన్, చారుబాబులు అతని తోడ్పాటును ఎన్నడూ త్రోసిరాజనలేదు. నల్లమందు మాత్రం అతడు ప్రయోగించకుండా కనిపెట్టండని వారన్నారు."

జీవనదత్తు వచ్చి రోగిని పరీక్షించినాడు.

"నా అభిప్రాయం నేను వ్యక్తీకరిస్తాను. వారిఊహ వారిది. నాఊహ నాది. నేనిక ఇచ్చటికి వచ్చుటేల?" అని ప్రద్యోతడాక్టరు పలికినాడు.

కాని ఆతనిహృదయంలో కలవరపాటు కలిగింది. మఱొక రోగి దురదృష్టవశాత్తూ ఆనాడు అతని చేతిలో ఆస్తమించింది. తొలుత రోగిని చూచి అతడు "రోగి బాగుగనే ఉన్నది. జ్వరం పోయింది. రేపు పథ్యం ఇయ్యవచ్చు" అన్నాడు.

రోగి పడియుండెను. అందులకు కారణము దుర్బలత అని ఊహించినాడు. రోగి పసివాడు. వాని అమ్మమ్మ యిట్లన్నది: "అయ్యా! డాక్టరుబాబూ! పిల్లవాడు బాగుగనే ఉన్నాడంటున్నారు! ఎందు కిలా అంటున్నారు? జ్వరం పోతే బాలుడు తలయెత్తడం లేదు. ఎందువలన? అన్నంమాట ఎత్తనే యెత్తడు. ఎందువలన?"

"తలయెత్తి తీరుతాడు. కొంచెం నీరసంగా ఉన్నాడు, అంతే! నీరసస్థితి పోతే తలకాయ తనంతతానే లేచితీరుతుంది. నామాట నమ్మండి. నమ్మకపోతే, నేను వైద్యం ఎలా చెయ్యగలను?"

అపరాహ్ణ సమయంలో రోగిస్థితి పాడైపోయినది. పిలుపుమీద డాక్టరు పరుగెత్తుకొని వచ్చినాడు. మూడు పర్యాయములు ఇంజెక్షన్ ఇచ్చినాడు కూడా. కాని పిల్లవాడు సంధ్యాసమయంలో మరణించినాడు.

"ఇందు నా పొరపాటు ఎచ్చట జరిగింది? పొరపాటు మొదట్లో జరిగిందా? తుదిదశలో కలిగిందా? రోగ నిర్ణయంలోనే జరిగిందా?" అని అనుకొన్నాడు.

అవును! అదే! అది మలేరియా జ్వరమని ఆత డనుకొన్నాడు. కాని అది సామాన్యపు మలేరియా కాదు. మేలిగ్నెంట్ మలేరియా అది. నిర్దుష్టంగా వ్యాధి నిర్ణయం జరుగకపోయెను. ఆతడు క్వినైన్ ఇంజెక్షన్ కూడా ఇచ్చినాడు. ఇన్ట్రావీనస్ ఇంజెక్షన్ యిస్తే బాగుండేది.

ఆకస్మికముగ చకితుడై డాక్టరు పడకకుర్చీపై నిలువున కూర్చున్నాడు. మందు క్వినైన్ ఔషధమే! అందులో సరియైన క్వినైన్ ఉన్నదా? వినయుని అంగడినుండి దానిని తెప్పించినారు. ఈరోజుల్లో వ్యాపారస్థులకు దానిపై తగినంత లాభం లేకపోయింది. కలకత్తాలో కృత్రిమమైన ఔషధం తయారవుతూ ఉన్నది. దానిని కొనినపుడు కొంత నాలుకపై డాక్టరు వేసికొని చూచినాడు. అది చేదుగా ఉన్నది. అంతే! వేడినిట్టూర్పు విడిచి, వెలుపలికిపోయి పడకకుర్చీపై చతికిలపడి "మంజూ! మంజూ!" అని పిలిచినాడు. ఆమె అసలుపేరు మంజుల! 'మంజూ' అని ఆతడు ముద్దుగా పిలుస్తూఉంటాడు.

మంజు వంటింటిలో ఉన్నది. పూర్వకాలపు వంటమాత్రమే ఆమె యెరుగును. ఈకాలపు వంటపై మగనికి ప్రీతి మెండు.

"మంజు" అని పిలిచినాడు.

వంటను వంటకప్పగించి ఆమె పతిమ్రోల నిలిచినది.

సౌందర్య సౌష్ఠవములతో ఒప్పు శరీరముగలదామె. ఆమె మేనిరంగు బంగారముతో ఎకసక్కెము సలుపుతూ వుంటుంది. అందు మేలికాంతి కలదు. కన్నులపండువొనరించు కోమలాంగి నుపలక్షించి భర్త మురిసిపోతూఉంటాడు. ఆమె చక్కగా పాడనేర్చినది. ఐ. ఏ. వరకు చదువు సాగించింది. సైకిలు

త్రొక్కుట డాక్టరు ఆమెకు నేర్పినాడు. పిస్తోలు పేల్చడం కూడా ఆమెకు తెలుసును.

"ఎందుకు పిలిచారు? నే నిక్కడ నిలబడితే వంట పాడైపోతుంది."

"ఏమి వండుతున్నావు?"

"వేపుడుకూర చేస్తున్నాను. అమ్మమ్మ నేర్పినమాదిరిగా తయారు చేస్తున్నాను."

"వేపుడుకూరను వేగనియ్యి. నువ్వు ఇక్కడ కూర్చో. ఒక్కణ్ణి కూర్చో లేకపోతున్నాను. ఏదైనా పాటపాడు. మనస్సు బొత్తిగా పాడైపోయింది. వారింటి పిల్లవాడు హఠాత్తుగా చచ్చిపోయినాడు."

"అవును; విన్నాను.

"ఏమి విన్నావు?"

"ఐదుగురు ఐదురకాలు చెప్పుతున్నారని."

"అయితే మంచిది, ఐదుగురు ఏభైరకాలు చెప్పలేదుకదా?" అని ప్రద్యోతు నవ్వినాడు.

"రేపు పథ్యంపెట్టవచ్చునని మీరు చెప్పివచ్చినారటకాదా?"

"అవును. అలా చెప్పడం నిజమే. అయితే?"

"ఈమాటనే లోకులు పదేపదే చెప్పుకుంటున్నారు. వారిమాటలు విని చారుబాబు ఇట్లన్నారని విన్నాను. చావురాకను గురించి రాయిగ్రుద్ది యెవ్వరు చెప్పగలరు? డాక్టర్లు నోరువిప్పి చెప్పగలిగినదేమి? వారిఅధికారం యేముంది?"

ప్రద్యోతడాక్టరు దీర్ఘనిశ్వాసము విడిచినాడు. మేఘాచ్ఛన్న ఆకాశమును చూస్తూ కూర్చున్నాడు.

అది నిశ్ఛిద్ర వియత్తలము. ఈ రాత్రికాలమందు సయితము అది పృథ్విపై ఛాయను విసరివైచినది.

చకిత విద్యుదాభాస మొకటి కడలెరుగని మొయిలుగమివలన కప్పబడిన నింగిపై ఉరుకు లెత్తినది. దూరమునుండి మేఘము మృదుగంభీర గర్జన మొన రించుచున్నది. మృదుస్వరమున డాక్టరు ఇల్లాలితో "మంజూ! శ్రావణమాసపు మధురగీతాపంక్తులు ఆలపింపుము" అన్నాడు.

"ఇప్పుడే వస్తాను. పొయ్యిమీది పులుసుగిన్నెను దింపి వస్తాను."

"పులుసు మరుగనీ! దానిని దింప నక్కరలేదు."

మంజు గీతాపంక్తులు శ్రావ్యమైన కంఠస్వరంతో ఆలపించినది :

శ్యామసుందర యామినీ సమయమందు
రమ్ము, జలదమా! ద్రుతగతి రమ్ము నీవు;
తాపనిచయము నుడిపి, చింతల నడంచి
మధుర సుధబోసి విరహిణీ మనసునందు.

డాక్టరు కన్నులు మూసినాడు. నిజముగా వానచినుకులు రాలుచో నేల చల్లబడును. ప్రాణము తెప్పిరిలును. గీతాలాపనమును ముగించి "వస్తాను" అని పలికి మంజు లేచింది. "ఇంతలో రేడియో పెట్టుతున్నాను. ప్రోగ్రాములో రవీంద్ర సంగీతమును గురించిన ఐటమ్ ఉన్నది."

ఆమె మనస్సు వంటింటి మీదికి దుమికింది. సకాలమున పొయ్యిమీదినుండి గిన్నెను దింపకపోతే పులుసు బాగుగా మరిగిపోతుంది.

కన్నులు మూసికొని డాక్టరు వెలకిల పడియున్నాడు. చారుబాబు తనకు విరుద్ధంగా ఏమీ అనలేదు. "వెలుపలకు బండమనిషివలె అగపడినను, వాని హృదయము కరుణరససింధువు" అని ఆతడు తలపోసినాడు.

రేడియోనుండి వాద్యసంగీతం వినిపిస్తోంది. గిటార్ వాద్యం ముఖారిని ఆలపిస్తూవుంది.

"మృత్యువుపై డాక్టర్లకు అధికారం ఏముంది?" అన్నాడు చారుబాబు. ఈ మాటను ప్రద్యోత డాక్టరు మననం చేసుకుంటూ యిట్లు తలపోసినాడు.

డాక్టర్లకు బొత్తుగా అధికారం లేదని చెప్పలేము. ఇక్కడ ఒక క్లినిక్ ఉంటే బాగుండేది. ముందే కొంత నెత్తురు తీసి పరీక్ష చేయవలసి వుండెను. దానినిబట్టి సరిగా రోగనిర్ణయం జరుగవలసెడిది. అపుడు సరియైన చికిత్స జరిగేది. కేసుమాట అపుడు దక్కేది. పిల్లవాణ్ణి కాపాడే వాళ్ళం.

రేడియోలో మృత్యుగీతిక ఒకటి ఆలపింపబడుతూ ఉంది. కనుబొమలు ముడిచి లేచి డాక్టరు రేడియోను ఆపివేసినాడు.

దొడ్డి ద్వారంవద్ద హారన్ శబ్దం వినిపించింది. అది సైకిల్ రిక్షాయొక్క హారన్. వచ్చిన దెవరు? ఎందుకు వచ్చారు? రోగిని చూచేందుకు వచ్చిన పిలుపా?

డాక్టరు లేచి నిలిచినాడు. ఇంటిలోనుండి లాంతరును వెలుపలకు తీసినాడు. గేటు దగ్గర రెండు రిక్షాలు అగపడుతున్నాయి. ఒక రిక్షాలో ఒక తరుణి ఒరిగిపడి యుండెను. అజ్ఞానావస్థలో ఉన్నట్లు అగపడుతూ ఉంది. నర్సు ఒకతె ఆమెను పట్టుకొని యుండెను. ఆమె సర్వాంగములు దుప్పటితో కప్పబడియుండెను. ఆమెతల నర్సు భుజముపై ఒదిగియుండెను. అవ్యక్తయాతన వలన మధ్యమధ్య మూలుగు తున్నది. శరీరము నీలవర్ణముతో పూయబడినట్లు పుట్టమునకు దిగువ నెత్తుటి మరకలు అగపడుతున్నవి. అది డెలివరీ కేసై ఉండును. తొలి కానుపై ఉండును. చేతిలో లాంతరు పుచ్చుకొని డాక్టరు విచ్చేసినాడు. ' హరిహర బాబూ! మిస్ దాస్!'' అని పిలిచినాడు.

కాంపౌండర్ మిడ్వైఫ్‌తో అగపడినాడు. కాని ఆత దెవరు? వెనుక నున్న రిక్షాలో ఉన్నవా రెవరు? అతడు స్థూలకాయుడు! వృద్ధుడు. మరెవరు? జీవన మహాశయుడే!

జీవన మహాశయుడు శశిని వాని యింటియొద్ద విడుచుటకై పోయినాడు. శశియింటి సమీపంలో వుండే గణేశ భట్టాచార్యుని మొదటికూతురు పురుటింటిలో పడివుండెను. జీవనదత్తును చూచి, ఆతనిని పట్టివేశారు. కానుపు కేసులో ఆతడు చేయగలిగిన దేముంది? అయినను ఆ యింటివారు ఆతనిని వదలలేదు. ''అయ్యా! జీవనదత్తుగారూ! మీరొక పర్యాయం ఈమె చెయ్యి చూడండి'' అని గోల పెట్టేరు.

''చెయ్యి చూచి ఏం చెయ్యగలను? ముందుగా ఈమె ప్రసవించాలి. ఇందుకై తోడుపడేవారిని పిలువవలెను. లేకపోయినయెడల ఈమెను ఆసుపత్రిలో చేర్చవలెను.'' అని జీవనదత్తు పలికినాడు.

అందుచే ఆమెను అచటికి తీసికొని వచ్చారు. కాని జీవనదత్తును వారు విడువలేదు.

''అయ్యా! జీవనదత్తుగారూ! మీరు వెళ్ళకండి.'' అన్నా డొకడు. కంఠ స్వరమునుబట్టి ఆతడు ఆతరుణి తండ్రి అని బోధపడుతోంది. జీవన మహాశయుడు ఉపేక్షింప లేకపోయినాడు. కాదనక వారివెంట వచ్చినాడు.

షర్టు చేతులు వెనుకకు చుట్టి, నియమానుసారము చేతులు కడుగుకొని, లోషన్‌లో ముంచి, డాక్టరు గదిలో ప్రవేశిస్తూ హఠాత్తుగా నిలిచి, జీవనదత్తు

నుద్దేశించి "అయ్యా! ప్రసవము కొఱకై మీరేమైనా మందిచ్చారా?" అని అడిగి నాడు.

"లేదు"

"మంచిది. కొంతసేపు ఇచ్చట కూర్చుంటారా?"

"మంచిది. ఇంచుక సేపుంటాను" అని నవ్వుతూ చెప్పినాడు జీవనదత్తు.

"మంచిది మీరీ కుర్చీపై కూర్చోండి. నాడి చూచి ఏమైనా చెప్పదల చారా?

"నాడి చూచాను. కాని—"

గదిలోనుండి యాతన పడుచున్నట్లు స్వరం వినిపించింది. "డాక్టర్ బాబూ!" అని మిస్ దాస్ కేక వేసింది.

ప్రద్యోత డాక్టరు ఎదుట నిలిచినాడు. జీవన మహాశయుడు మేఘాచ్ఛన్న మైన శ్రావణాకాశమును చూస్తూ నిలిచి వున్నాడు. వాని మనసులో గగ్గోలు పుట్టింది. తానెందుకు వచ్చినాడో ఆత డెరుగును. ప్రసవించిన పిదప అతడు నాడి చూడవలెనని అచటి వారూహించినారు. కాని ప్రసవించేవేళ, ఏమైన ఘటిల్లినయెడల చేయవలసిన దేమి? అని అతడు తలపోసినాడు.

"మహాశయా" కూర్చోండి! అన్నాడు హరిహర కాంపౌండరు. వేడి నీటిని తెల్లని తువాలు మొదలైనవాటిని చేతు లందుంచుకొని అతడు ప్రక్క గది లోనికి పోతున్నాడు.

"సరే కూర్చున్నాను" అని నవ్వుతూ. "ఆ అమ్మాయికి బాగా వయసు వచ్చిన తరువాత కానుపు వచ్చింది. ముప్పైయేళ్లు నిండాయి" అని పలికి జీవన దత్తు ఏమో యోచింప సాగినాడు.

ఇంతలో ఆత డులికిపడినాడు. తరుణి మరింత బాధపడుతూ వున్నట్లు శబ్దం వినిపించింది. మరేమో మాటలు వినవచ్చినవి. "జయగోవిందా! జయ గోపాలా! అను నుడువులు చెవి బడినవి.

"హరిహర బాబూ! వేడినీళ్లు కావాలి! తువాలు కావాలి!" అని ప్రద్యోత డాక్టరు మెల్లగా పలికినాడు. ఆ స్వరము ప్రశాంతమై, గంభీరమై ఉన్నది.

తువాలుతో చేతులు తుడుచుకొంటూ డాక్టరు వెలుపలకు వచ్చినాడు. ఆమె తండ్రి "ఏం డాక్టరు బాబూ!" అని ఆతురపాటుతో పలికినాడు.

"సేఫ్ డెలివరీ అయింది. (సుఖంగా ప్రసవించింది) మగపిల్లవాడు పుట్టినాడు."

"నీహారుకు స్మృతి వచ్చిందా? అమ్మాయికి తెలివి వచ్చిందా?"

"లేదు"

"రాలేదా?"

"రాలేదు. నేటికి మీరు యింటికి పొండు. చేయవలసిన పని నేను చేసి వస్తాను. ఇక్కడ ఉండి అల్లరి సాగిస్తే ఏమీ ఉపకారం జరుగదు. ఇక ఇంటికి దయ చేయండి. క్షమించండి. ఇక్కడ ఉండి నాడీటాడీ చూడ నియ్యను. ఏమీ అనుకోక కదలండి ఇక్కణ్ణించి. నా దృష్టిలో ఈమె నాడి బాగానే కనిపిస్తోంది. ఇట్లని నేను చెప్పగలను." అని పలికి డాక్టరు తన బసకు పోయినాడు.

"మంజూ"!

"టీ వడబోస్తున్నా."

"సంతోషం. త్వరగా తీసికొనిరా. టీ త్రాగి మరొక పర్యాయం పోయి, అవసరమైతే ఇంకో ఇంజెక్షన్ ఇస్తాను."

"అదేమి కేసు?"

"నాట్ గుడ్. అయినా మిగుల పాడు కేసని చెప్పేందుకు వీలులేదు. బట్ షి మస్ట్ లివ్ [ఆమె బ్రతికి తీరాలి]. ఆమెను బ్రతికించి తీరాలి."

కొంచెము కొంచెముగా టీ త్రాగుతూ డాక్టరిట్లన్నాడు: "మొదట నాకు పట్టరాని కోపం వచ్చింది. దట్ ఓల్డ్ మేన్ ఆఫ్ దిస్ ప్లేస్....ఈ ప్రదేశంలో పలుకుబడిగల ఆ వృద్ధుడు రోగివెంట బడ్డాడు."

"అతగాడు ఏమీ అవాకులూ చవాకులూ చెప్పలేదు కదా!"

"లేదు. కాని అతణ్ణి మూటగట్టుకొని తీసుకొచ్చారు. ఆ మహాశయుడు ఒక పర్యాయం నాడి చూచాడు. మరి ఆమె చెయ్యి ముట్ట నిచ్చినాను కాను."

"అతగాణ్ణి టీ తాగేందుకై ఎందుకు పిలిచినారు కారు."

"పిలువ వలసిందే కాని పిలువలేదు. పిలువవలసిందేనా?"

"తప్పకుండా"

టీ కప్పు క్రింద నుంచి, సిగరెట్టొకటి వ్రేళ్ళ నడుమ నిలిపి, ప్రద్యోత డాక్టరు మళ్ళీ డిస్పెన్సరీ దిక్కుగా పోయినాడు. మరొక ఇంజెక్షన్ ఇచ్చితీరాలి, జీవనదత్తు అందుండి కదలిపోయినాడు. కొంచెం అన్యాయం జరిగింది. 'టంగ్' 'టంగ్' శబ్దం చేసింది గడియారం. రాత్రి పన్నెండయింది. రోగి పరుండి యుండిన గదినుండి మెల్లని మూలుగు వినబడుతోంది. నొప్పి తగ్గుతోంది. "షి మస్ట్ లివ్. ఆమె బ్రతికితీరాలి." హరిహరుడు వెలుపలికి వచ్చినాడు.

"ఇప్పుడామె ఎలా ఉంది?"

"బాగానే ఉన్నట్లు తోస్తోంది."

"బాగానే ఉంటుంది. ఇంజెక్షన్ వెలుపలికి తియ్యి." డాక్టరు సిరింజిని పైకెత్తి దీపము దగ్గర పట్టి చూచినాడు. మరల గేటు తీయబడింది. మరల వచ్చిందెవరు?

హరిహరుడు ముందుకు పోయినాడు. వచ్చినవాడు రతన్‌బాబు మనిషి.

"ఏమి? ఎక్కిళ్ళు బాగా ఎక్కువైనాయా?"

"లేదండి. అక్కణ్ణించి రిపోర్టు వచ్చింది. అందుచే డాక్టరుగారు మేలు కొనివుంటే ఒక పర్యాయం తీసుకొని రమ్మని. అని ముసలాయన అన్నారు."

"బిపిన్ యొక్క యూరిన్ రిపోర్టా? ఎక్కిళ్ళెట్లున్నాయి?"

"అలాగే ఉన్నాయి. కొంచెం తగ్గుముఖం పట్టేటట్లున్నాయి."

"ఇక్కడ ఒక క్లినిక్ ఉంటే బాగుండేది. ఎక్సురే, ఎలెక్ట్రిసిటీ లేకున్న యెడల, ఉపాయం లేదు. మయూరాక్షీ స్కీమ్ జరిగేందుకు ఇంకా కొన్ని సంవత్సరాలు పట్టును. అంతకుముందేమీ జరుగదు. కాని క్లినిక్ ఒకటుంటే బాగుండేది. ఎందరెందరు రోగులో బ్రతికేవారు. అటువంటి ఉపాయం లేక పోతే ఈ అమ్మాయి నేడు బ్రతికేదా? ఆసుపత్రిలో ఉండవలసిన సామగ్రి ఇక్కడ లేకపోయిన యెడల ఈ అమ్మాయికి చావు మూడేదే!"

జీవనమహాశయుడు "ఏమి చేస్తావు? ఇదెవరిచేయి? నీదా లేక నాదా?" అని చేయిచూచి తల ఊపి పలికేవాడు.

# పదునెనిమిదవ ప్రకరణము

జీవనదత్తు రోగులను చూచేందుకు పోయినపుడు ఇంటి యిల్లాలు నిద్ర పొయ్యేందుకు ప్రయత్నించదు. "నిద్రాదేవీ! కనురెప్పలు దించడం నీ తరమా?" అంటుంది. మంచముపై ఒళ్లు వాల్చినను, ఎట్లో మెలకువగనే ఉంటుందామె. నిద్ర తోసుకొని వస్తే కనురెప్పలు మూతలు పడితే 'రాధాగోవిందా' అని ఇష్ట దేవతా ప్రార్థన సాగిస్తుంది. అంతకూ నిద్రను అరికట్టడం అసాధ్యమైతే, లేచి కూర్చుని తాంబూలం నోట బెట్టుతుంది. అపుడపుడు కొడుకు నందుని ఆడి పోస్తుంది. తిట్టి పొయ్యడం నందుని కాదు—ఆతడు పెట్టే గుర్రుకు! "ముక్కైతే మనుష్యుని ముక్కే! కాని ఇంత గందరగోళం చేస్తుందెందుకు? తూతూ బాకా కూత కూడా ఈ గుర్రుముందు సిగ్గుపడి పోతుంది. ఇది కేవలం బాకా చప్పుడే కాదు. శబ్దం మారుతుంది. ఎవరో గొడ్డలి పుచ్చుకొని ఇంటిని యావత్తూ ముక్కలూ, చెక్కలూ చేస్తున్నట్లుంది. నందా! ఆనందా? విన్నావు బాబూ! కొంచెం గుర్రు తగ్గించు నాయనా! ఒత్తిగిల్లి పడుకో బాబూ!" అని ఆమె యథా ప్రకారం ఘోషిస్తుంది.

జీవనదత్తు ఇంటికి రాగానే ఈ సమస్య కొంతవరకు పరిష్కార మవుతుంది. మగని చూచి ఒక్కొక్కప్పు డామె "ఎల్లా వున్నారు. మీరు చూచి ముట్టిన రోగులు?" అని గ్రుచ్చి గ్రుచ్చి అడుగుతుంది. ఇంకొకప్పుడు ఏమీ ప్రశ్నింపక, నిశ్చింతతో పండుకొంటుంది. మరి అరనిమిషంలో తన గుర్రు ఆరంభిస్తుంది. అది క్రమక్రమంగా హెచ్చు స్థాయిలో ప్రవేశిస్తుంది.

నందుడు లేచి కాళ్లూ చేతులూ కడుగు కొనేందుకై తండ్రికి నీళ్ళిస్తాడు. జీవనదత్తు కాళ్లూ చేతులూ కడుగుకొని, పద్మాసనం వేసికొని, కొంచెం సేపు ఇష్ట దైవమును స్మరించుకొని, వంటింటిలో ప్రవేశించి వంటకముల మూతలను తానే తెరచి, తానే వడ్డించుకొని కిక్కురు మనక దీక్షతో యావత్తు సామగ్రిని యథా ప్రకారం ఉదర గోళంలో ప్రవేశపెడతాడు. కొడుకు ఈలోపుగా హుక్కా గొట్టంలో తంబాకును అమర్చి, తండ్రి కుర్చీ పొంత నిలిపి తానుకూడా నిద్ర

పోతూ వుంటాడు. భోజనం ముగించి మహాశయుడు హుక్కాపీల్చి పరిపరి రీతుల తలపులలో పడుతూ ఉంటాడు. చావుబ్రతుకుల విషయమూ, రోగుల విషయమూ, యోచిస్తూ ఉంటాడు. ఏరోజున రోగి యెవరైనా మాట దక్కించక పరలోకయాత్ర సాగిస్తే, ఇంటికి తిరిగివచ్చి "ఈ చికిత్స ఇలా అయిపోయిందే? మరొకవైద్య విధానం అవలంబించాలా? కాని, యీ చావు నా పొరపాటు వల్లే వచ్చింది." అని అతడు అధమపక్షం పది పేడినిట్టూర్పులు విడుస్తూ వుంటాడు. కొంతసేపైన పిదప "అసలు ఈ చావంటే ఏమి? బ్రతుకంటే ఏమి? చావు బ్రతుకుల నిర్ణయం చేసేదెవరు? చావుల్లో ఎన్ని రకాలున్నాయి? బ్రతుకుల్లో మాత్రం రకాలు లేవని యెవరు చెప్పగలరు?" అని తత్త్వ విచారం చేసి "గోవింద! గోవింద!" అనుకొంటూ పరుంటాడు. ఏయే రోజుల్లో రోగుల యిళ్ళనుండి పిలుపు రాదో ఆయా రోజుల్లో మిత్రుడు సెతాబును పిలిచి, వానితో చతురంగం ఆడుతూ వుంటాడు. ఆ సమయంలో చతురంగంలోని చాకచక్యం గురించి ప్రసంగం సాగిస్తాడు. రాత్రి ఒంటి గంటకు ముందెన్నడూ ఆతడు పరుండి యెరుగడు. ఈవేళ గడియారం రెండు కొట్టింది. అతడు కూర్చుండగనే తరువాతి అరగంట కొట్టింది.

*   *   *

మరునాడు చాల ప్రొద్దైన పిదప జీవనదత్తు నిద్రనుండి మేల్కొన్నాడు.

గణేశ భట్టాచార్యుని కూతురు విషయం మొదట అతని జ్ఞప్తికి వచ్చినది. ఆమె ఎలా ఉన్నదో? "ఆతని యింటినుండి ఎవరైనా వచ్చినారా?" అని కొడుకు నందుని ఆతడు ప్రశ్నించాడు.

చేతులు జోడించి కిటికీ దెస తేరిచూచి—

"నమః వివస్వతే బ్రహ్మణభాస్వతే విష్ణుతేజసే, జగత్ సవిత్రే సవిత్రే కర్మదాయినే—నమః" అని అత డుచ్చరించినాడు.

కాళ్లూ చేతులూ కడుగుకొని చతికిలపడి ఆతడు టీ త్రాగడం ఆరంభించాడు. హుక్కాగొట్టంలో తంబాకు అమర్చి తండ్రికి అమరుస్తూ "నాయనా! ఈవేళ ఎనమండుగురు, పదుగురు రోగులు వచ్చారు" అన్నాడు కొడుకు నందుడు. హుక్కా పీలుస్తూ మహాశయుడు "నాయనా! నవగ్రామమునుండి ఎవరైనా వచ్చారా? గణేశ భట్టాచార్యుడు రాలేదా?" అని పిల్లవానిని అడిగినాడు.

"నాన్నా! రాలేదే!"

మహాశయు డించుక ఖిన్నుడై 'హుం' అన్నాడు. గడచిన రాత్రి పన్నెండు గంటలవరకు ఆతడు గణేశుని కొరకు వేచియుండెను ప్రద్యోత డాక్టరు అడిన అవాకులూ, చవాకులూ, విని వచ్చినాడు. ఈవేళ ఇంకా కబురు రానేలేదు. ఆ అమ్మాయి బాగుపడి ఉంటుంది. ఆతురపాటు తగ్గి ఉంటుంది. అని ఆత డను కొన్నాడు. తోడ్తోడనే అతడొక నిట్టూర్పు విడిచినాడు.

"దాంతు ఠాకూరనే ఆ బ్రాహ్మణుడు వచ్చి ఎగిరి పడ్డాడు. ఏమేమో వడవడ వాగిపోయినాడు."

"ఎందుకు ఈ రభస? ఈరట్టు? వారం రోజులకు సరిపడే ఔషధం నిన్ననే కదా వానికిచ్చాను."

"అతడు మళ్ళీ వచ్చాడు. గంజా త్రాగకపోతే అతగాడికి నిద్ర పట్టదట. గంజాయి త్రాగనీయవలెనట. లేకపోతే నిద్రపట్టేందుకు వాని కేమైనా మందియ్యా లట. ఇలా అని నీతో అతడు చెప్పమన్నాడు. ఏవేవో చెరిగిపోశాడు."

"చెరిగిపోస్తే పొయ్యనియ్యి. పరాన్‌ఖాన్ వచ్చాడా?"

"రాలేదు. ఇంతవరకు రాలేదు. ఇకముందు వస్తాడేమో!"

కొన్ని పర్యాయములు పీల్చి హుక్కా గొట్టాన్ని నందుని చేతి కందించి, మహాశయుడు లేచి నిలిచి, "ఆ వచ్చిన రోగులను కూర్చోమని చెప్పు. బాబూ! మఠంలోని మహంతుని ఒకసారి చూచివస్తాను." అన్నాడు.

కొడుకు తలకాయ ఊపి "ఎంతోసేపటి నుంచి కనిపెట్టుకొని వున్న రోగులను పరీక్షించి, మందు చీటీలు వ్రాసి పెడితే బాగుంటుంది నాన్నా. పరాన్ ఖాన్ బండిచేసుకొని వస్తాడు. ఆ బండిమీద పోయి సన్యాసిని చూసివస్తే మంచిది కదా" అన్నాడు.

మహాశయుడు జవాబీయలేదు. కుడితినీ తొడుగుకొని, జేబులో స్టెతొస్కోప్ పెట్టుకొని, పాతచెప్పుల జోడులో పాదాలు ప్రవేశపెట్టేందుకు గట్టిప్రయత్నం చేయసాగినాడు.

నందుడు తడబడుతూ అవలికి పోయినాడు. "ఇదేమిపని? రోగులు పంచలో పడివున్నారు. ఇలా చేస్తే వాళ్లు మళ్ళీ ఈ గడప తొక్కి చూస్తారా? ఆ మిత్ర మహాశయుడు ఊరికే విసుక్కుపోయినాడా? వారి మాటలు నాయన చెవిలో పడవు కాబోలు" అని అతడు గొణుగుకొనినాడు.

మహాశయుడు నవ్వుకొంటూ ఇట్లనుకొనినాడు :

"గౌరహరిమిత్ర ప్రౌఢప్రకృతిగల జమీందారు. విసుగుదల వానికి సహజం. వాని మాటలు విని నందుడు చికాకు పడుతున్నాడు."

* * *

ఆరోగ్యనికేతన మపుడు జనసంకులముగా ఉండేది. నలువది మంది, వేరొకప్పుడు ఏబదుగురు, ఇంకొకప్పుడు అరువది మంది రోగులు అందు సమావేశ మవుతూ ఉండేవాళ్లు.

జగత్ మహాశయుడు పరమపదించిన తరువాత ఆరోగ్యనికేతనమునకు దైన్యదశ దాపురించింది. ఆ దైన్య దశను జీవనమహాశయుడు పోద్రోలి, ఆ సంస్థకు సమృద్ధిని చేకూర్చెను. రంగలాల్ డాక్టరువద్ద తన శిక్షణమును ముగించిన తరువాత అతడు మూడు తరహాల వైద్యమును చేపట్టినాడు. అలోపథిక్, ఆయుర్వేదము, నాడీ పరీక్ష; ఈ మూడింటిని ఒక్క చేతి మీదుగా ఆతడు నడుపుతున్నాడు. గురువు రంగలాల్ చాటుకు పిలిచి, జీవనదత్తుతో ఇట్లన్నాడు:

"ఏమోయీ! నీ విపుడు మూడు చక్రాల బండెక్కి విజృంభిస్తున్నావు. కారులూ, వేనులూ, నీ బండి ముందు దిగదుడుపు అని నమ్ము."

ఆరోగ్యనికేతనపు ప్రశస్తి దశదిశలను చుంబించింది. ఒక్కొక్క డిపార్టుమెంటులో ముగ్గురు వ్యక్తులు పని చేస్తున్నారు. అలోపథిక్ డిపార్ట్ మెంటుకు శశి కాంపౌండరై తేజరిల్లుతూ ఉన్నాడు. "ఆహా! ఇది ఎటువంటి ప్రాక్టీసు!" అని అలంకారిక భాషలో అతడు ప్రసంగిస్తున్నాడు. మధుపానమున పరవశుడైన ముహూర్తములో ఆతడు "జీవనమహాశయుని ప్రాక్టీస్ కడవ మీది నుండి పొంగిపోతూన్న సురాసముద్రమే!" అని ఊగిసలాడుతూ పలికేవాడు.

పిన్నవయసులోనే ఆతడు పానపాత్రను చేబూనినాడు. నవగ్రామంలో బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినవాడు.

జీవనమహాశయుని దృష్టిలోని ఆశాలతలు ప్రాకిపోయినవి. రంగలాల్ స్థానమును తానే నింపవలెనని ఆత డుద్దేశించాడు. కాని వాని ఆశ అడియాసయై పోయినది. నవీన డాక్టరు కొంతవరకు ఆ శక్తిని చూపగలిగినాడు. మరొక గట్టి చేయి అగపడింది. గోకుల డాక్ట రనువాడు చాకచక్యంగల ఘటం! మెడికల్ కాలేజిలో బంగారు పతకమును పడసినవాడతడు. కాని వాని తల్రవాత యెట్టిదో

కాని, వానిని గురించిన దుర్నామము నలుదెసలందు ప్రాకిపోయింది. రోగిపై ఆతనిచేయి పడిన వెంటనే యమసదనంలో అతడు తప్పకుండా ప్రవేశిస్తాడు. నాడీ జ్ఞానమహిమను గురించి జీవనదత్తును పదేపదే ప్రశ్నిస్తూ అతని మహోపన్యాసమును గోకుల డాక్టరు విశేషశ్రద్ధతో వింటూ వుంటాడు.

నవగ్రామ పరిసరాలలో అతడే అప్రతిద్వంద్వి. జగత్ మహాశయుడు విశేష సంరంభంతో స్వర్గంతో ప్రవేశించిన పిదప ఇచ్చటకు ముగ్గురు డాక్టర్లు వచ్చి కూర్చున్నారు. దుర్గాదాసు అనునాతడు మెడికల్ డిగ్రీతో మొదట ప్రవేశించిన ఘటికుడు. "ఆకులూ, అలములూ, గడ్డిపోచలూ, వేళ్లూ, మూలికలూ, నీ కిష్టదైవము"లని అతడు జీవనుని పరిహాసం చేస్తూవుండేవాడు.

రెండవ వాడుగా లెక్కింపబడినవాడు హరీశ డాక్టరు. కిశోరుడు రోగ పీడితుడైనపుడు దత్తు చెంత నిలిచి "హయిసర్ మజ్జా" అని వ్యాధిని డయొగ్నసిస్ (రోగ నిర్ణయమును) చేసిన ప్రజ్ఞాధురీణు డాతడు.

ఆచట వచ్చి చేరుకొనిన మూడవ డాక్టరు పిచ్చివాడు. వానిపేరు ఖాతు బాదుడే. కె. ఎం. బ్రారొరీ, హోమియోపథిక్ అని తన్ను గురించి అతడు కంఠమెత్తి చెప్పుకునేవాడు. అతడు మంచివాడే, సరళస్వభావుడే! ధోరణి మాత్రం పిచ్చి ధోరణి. చుట్టలు కాల్చడంలో ఆతడు దిట్ట! రంగురంగుల చొక్కాలు తొడిగి మురిసిపోవువాడు.

"ఆ పక్క హరీశ్ డాక్టరు. ఈ దిక్కున నేను మహామహులమై ఉన్నాము. మధ్యలో ఇరుకుకొని పోయినవాడు జీవనదత్తు. ఇతగాణ్ణి పిలిచే పెయ్యమ్మ లెవ్వ రున్నారు? నాడి చూచి మందిమ్మ అనే వాళ్ళు ఇప్పు డెవరూ లేరు. ఇహిహీ! ఉహుహూ!" అని తన ధోరణిలో పడిపోయేవాడు.

అందరి కంటె ముందు వచ్చిన వాసు. అందరి కంటె ముందుగనే అక్కడనుండి నిష్క్రమించిన వాడు దుర్గాదాసు. "గొడ్లూ గొడ్డెలూ మాత్రం ఉండదగిన దేశమిది. గరికపోచలు ఆకులు తించేనే ఇక్కడ వారి తెగుళ్ళు కుదురుతవి. విదేశాలకు సంబంధించిన అలోపథిక్ వైద్యమునకు ఇక్కడి గుడ్డి గవ్వకున్న విలువలేదు." అని అతడు చెప్పి, మడమ త్రిప్పినాడు.

తరువాత పలాయనం చిత్తగించిన వాడు బాదుడే! హరీశ్ బైరాయించాడు. నవగ్రామంలోని వ్రజలాల్ బాబు స్థాపించిన ఛారిటబుల్ డిస్పెన్సరీలో వానికి

పని దొరికింది. జీతం నెలకు ముప్పయి రూకలు.

జీవనదత్తు అపుడే పెద్ద యెత్తు ప్రాక్టీసులో పడినాడు. ఆదాయ మెంతో చెప్ప లేము. దానికి సంబంధించిన లెక్కలూ, డొక్కలూ లేవు. రేయింబవళ్లు అతగా డికి విశ్రాంతి అనేది లేనేలేదు. ఆరోగ్యనికేతనమునకు వచ్చిచేరిన రోగులను పరీక్ష చేసి లోనికి పోయేటప్పటికి అపరాహ్ణము మూడుగంటలు దాటిపోయేవి.

హిందువులేమి, ముసల్మానులేమి, సర్వ మతములవారు, సమస్త జాతుల వారూ కులములవారూ, వర్తకులూ, కమతముదారులు—చెప్పనేల—ఎల్లరూ అన్ని దిశలనుండి ఎడ్లబండ్లు చేసుకుని వచ్చేవారు. కొంతమంది డోలీలు చేసికొని, మరి కొందరు సవారులెక్కి బిలబిల వచ్చిపోతూ ఉండేవాళ్లు. ఆనాడు ఉత్తరదిశనుండి ఐదు క్రోసులదూరమునుండి వచ్చినాడు గౌరిహరి మిత్ర. అతడు పెద్ద కుటుంబం లోని ఘరానామనిషి. అతడు సవారి చేసుకొని వచ్చాడు. సవారితలుపు తెరిచేఉంది. అతగాడు సవారిలో వెలకిల పరుండి ఆకాశం మీదకు చూపులు గుప్పుతున్నాడు.

ఆరోగ్యనికేతనములోనికి తొలుత వేంచేసిన వాడాతడే! జీవనమహాశయుడు గడచినరాత్రి ఎవరో రోగిని చూచేందుకై నవగ్రామము పోయి యుండెను. గౌరంగ చౌదురీ ఆకస్మికముగ స్మృతి కోలుపోయినాడు. అది గడ్డు రోగము. ఆతనిని చూచినంతనే జీవనదత్తు కర్తవ్యం ముగియలేదు. ఊపిరి గొంతులోనుండి పోకమున్ను ఆతనిని గంగా తీరమునకు చేర్చవలసిన ధర్మ నిర్వహణములో కూడా దత్తు మహాశయుని పాలు ఉండనే ఉన్నది. ఆ ముసలివానిని గంగాతీరమునకు పంపిన పిదపనే జీవనదత్తు తన కొంపకు, తిరిగి రాగలిగినాడు. పరోపకారపారీణుడు కదా అతడు! ఇంటిలో కాలుపెట్టిన తడవుగా మిత్ర మహాశయుని ఆతడు వీక్షించి నాడు. మరి పలుకరించినాడు. 'క్షమించండి' అని కూడ చెప్పివేసినాడు. "తాము చాలా సేపటినుంచి వేచి ఉన్నారు కాబోలు! కాని నేనేమి చెయ్యగలను? ఈ ప్రాం తంలో, పూర్వకాలమునుంచీ, తల యెత్తుకొని బ్రతికిన జమీందారీ కుటుంబంలోని పెద్ద ఘటంనుండి ఆహ్వానం వచ్చింది. పరలోకయాత్రకు ముందు ఆహ్వానం వచ్చింది." అంటూ జరిగినదాని నాతడు (నిర్మల చిత్తుడు కావున) విప్పిచెప్పినాడు.

మిత్ర నవ్వుతూ యిట్లన్నాడు : "దత్త మహాశయా! తమరు కేవలం దత్తు గారు కారు. పూర్వంనుండి తమకు సంక్రమిస్తూ వచ్చిన మహాశయత్వమును వహించి యున్నారు. ఇది దొడ్డ ధర్మ మనుట నిశ్చయము. కాని మహాశయా! ఈ వైపున మావంటివారిపై తమరు కటాక్ష వీక్షణమును సారించవలసి వుంటుంది.

ఎంద రెందరో ఎంతో దూరమునుండి వచ్చి చేరుతున్నారు మీ పంచకు. వీరు మీ సమక్షమున ప్రత్యక్ష మయ్యే లక్ష్మీ దూతలు. కష్టపడి వచ్చినపిదవ మీ సాదర దృష్టి వారిపై పడనియెడల తమ గుమ్మమును త్రొక్కేందుకై వారిక మక్కువ పడరు.''

ఈ మాటలు జీవనదత్తు గుండెలో గ్రుచ్చుకొన్నవి. అవును! గ్రుచ్చుకో దగిన మాటలవి. ''అయ్యా! నేను నిర్లక్ష్యం చెయ్యలేదు. అలా చేస్తే నేను పాపినే అవుతాను. నేను పాపానికి ఒడిగట్టేవాణ్ణి కాను. ఒరుల కష్టమును తగ్గించేందుకై సాధ్యమైనంతవరకు నేను ప్రయత్నిస్తాను.'' అని అత డన్నాడు.

అతని మాటల్లో అతిశయోక్తి లేదు. రోగులు చాలసేపు తడయవలసివచ్చి నపుడు వారికి షర్బతూ, బార్లీనీరూ, సాగోజావా ఆతడిస్తూ ఉంటాడు. ఆరోగ్య నికేతనమునకు మిక్కిలి దగ్గరలో డిస్ట్రిక్టు బోర్డువారు ఒకనుయ్యి త్రవ్వించారు. కావలసిన సరకులను విక్రయించే అంగడి సమీపంలో ఉంది.

మహాశయు డింకా ఇలా అన్నాడు. ''ఇక బాగోగులూ, చావు బ్రతుకులూ వీటిమాట అంటారా? ఇవి భగవంతుని దయపై ఆధారపడి వుంటాయి. గురువు గారు ప్రసాదించిన శిక్షణమునకూ, నా నిష్ఠకూ వాటిలో కొంత చోటుండడం కూడా తథ్యం. అన్నిటికంటె మిక్కిలి గణింపదగింది భాగ్యరేఖ! ఎంతకాలం గీటుండాలో అంతకాలం ఉండి పోతుంది. ఇపుడిక సెలవియ్యండి. మీ తెగులు విషయం చెప్పండి. మీకు కలిగిన విషయం చెప్పండి. మీ రీవరలో ఎవరైనా వైద్యునకు మీ ఒళ్లు చూపి వుంటారు. ఏం జబ్బని చెప్పేరు వారు?''

''చెప్పవలసిన దానిని కొంచెం గుట్టుగా చెప్ప దలస్తున్నాను. అట్టి పరిస్థితి బాగుంటుంది.''

నందుడు ఇంచుక దూరంలో ఉన్నాడు. అవతలికి పొమ్మని కొడుకుకు సైగ చేసినాడు.

మిత్ర తన కథనము నిట్లు చెప్పినాడు: ''అమ్మాయి అత్తవారింటికి పోతు న్నాను. ఈ అవసాన కాలంలో నాభారం ఆమె భుజాలపై వెయ్యవలసి వచ్చింది. ఆస్తి పాస్తులు యావత్తూ వ్యాజ్యాలలో వెల్లంకులలో నష్టమై పోయినాయి. (దగ్గుత్తికతో) మా యింటిఆమె స్వర్గస్థురాలైంది. ఏలాగునో ఒక లాగున బ్రతు కీడ్చుకు వస్తున్నాను. మద్యపానం మస్తుగా అలవాటై పోయింది. ఆత్మహత్య

చేసుకుందా మనుకొన్నాను. కాని భయపడి పోయాను. అమ్మాయిని అత్తింటికి తీసికొని పోతున్నాను. నేను వెంట వెడితేకాని వీలులేదు కదా! త్రోవలో పోతూ పోతూ మిమ్మల్ని ఒక పర్యాయం చూచి పోవాలనే బుద్ధి పుట్టింది. అయ్యా! వైద్యుడుగారూ! నే నింకా యెంతకాలం బ్రతుకుతానో చెప్పగలరా! నాడీ జ్ఞానంలో తమకు పెద్ద పేరుందని నేను విన్నాను. నాచెయ్యి ఒక పర్యాయం చూడండి."

ఈ మాటలు విని డాక్టరు ఇంచుక అప్రతిభుడైనాడు. ఇట్లన్నాడు: "మీరెంత కాలం బ్రతుకుతారో చెప్పేశక్తి నాకు లేదు. ఎవ రెవరికో ఎప్పుడెప్పుడో ఆసత్తువ ఉండవచ్చు. మీ కేమీ రోగమనేది లేదనుకొంటాను.'' అన్నాడు.

"రోగం లేదనేందుకు వీలులేదు. అది ఉండితీరాలి. నాకు లివర్ కంప్లయింటు ఉంది. తలకాయలో ఏదో కంగారు పుట్టుతూ వుంటుంది. అది దిర్దిర తిరిగిపోతూ వుంటుంది.''

''అది మద్యపానంయొక్క ఫలం. మీరు దీక్షతో త్రాగుడు సాగిస్తే అది హెచ్చుతూ ఉంటుంది. దానిని తగ్గిస్తే ఈ బుర్రతిరుగుడు కూడా తగ్గిపోతుంది."

రొంటినుండి మెల్లగా రెండు రూపాయలు తీసి, దత్తు ముందుంచి మిత్ర లేచినాడు.

"అయ్యా! నన్ను మన్నించండి. నేను ఫీజు తీసుకొనేవాణ్ణి కాను. ఇంటిలో, ఈ ఆరోగ్యనికేతనంలో, ఫీజు తీసుకొనడం మా పూర్వీకులు నిషేధించారు" అన్నాడు జీవనదత్తు.

''ఈ రెండు రూకలూ ఎవరైనా పేదరోగికై ఖర్చుపెట్టండి. ఫీజు ఇవ్వకుండా నాడి చూపించుకోను." అని చెప్పి మిత్ర అందుండి మెల్లగా కదిలినాడు. ఆతని వైఖరి మానసనేత్రము మ్రోల స్పష్టంగా అగపడుతూ ఉన్నది.

తదనంతరం ఒక పెద్ద కుటుంబపు రోగి మించ అనునాతడు వచ్చి హాజరైనాడు.

''డాక్టరుబాబూ! ఆదాబ్ (సలామ్)".

''ఆదాబ్! ఆదాబ్! ఏమి విశేషం? ''

ఒకప్పుడు మించసాహేబులు యీ ప్రాంతపు నవాబులుగా ఉండేవారు. ముసల్మాన్ మతస్థుల గురువులు. విశేషవిలాసముతో బ్రదుకు గడపడం వలన

వారు తమ సర్వస్వమును గోల్పోయినారు. ఆరోగ్యమును కూడ పోగొట్టు కొనినారు.

ఇంచుక ఊరకొనియుండి మించ యిట్లనినాడు: "డాక్టరు బాబూ! ఒంటి నిండా దట్టంగా మచ్చలు అగపడుతున్నాయి చూడండి."

"మంటగా ఉందా?"

"ఉందండి".

డాక్టరు వానిని తేరిచూచినాడు. ఎర్రని పుండ్లూ, మచ్చలూ అగపడుతున్నాయి వాని ఒంటినిండా.

ఇది వానివంశమును పీడించు శాపము! దానివలన కొందరు వ్యక్తులు చచ్చిరి. ఇద్దరు ఈ చెప్పరాని జాడ్యం వలన బాధపడుతున్నారు.

"డాక్టర్‌సాబ్"

"ఏమి కథ?"

"ఇపుడేమి గతి?"

"ఏం చెప్పను? ఇది మీ యింట బుట్టి ఒంటబట్టిన తెగులు. కొంచెం నిదానం మీదకాని వైద్యం జరుగదు. ఈ జాడ్యానికి కావలసిన ఔషధం నావద్ద ఇపుడు లేదు. తయారు చేయాలంటే చాలా ఖర్చవుతుంది. మీరు కలకత్తానుంచి మంచిది తెప్పించి వాడండి."

"వ్రాసి ఇవ్వండి బాబూ!" అని మించ సాహేబు లేచినాడు.

నారాయణపురంలో ఉండే భట్టాచార్య మహాశయుడు డోలీ చేసుకొని అప్పుడే వచ్చినాడు. అతడు బహుమూత్రవ్యాధివలన బాధపడుతూ ఉన్నాడు. వాతము, కొత్త జ్వరం, పాతజ్వరం, గ్రహణి, అతిసారము వగైరాలు బహుమూత్రమునకు సహాపారులై ఉన్నవి.

వెంటనే మరో రోగి వచ్చినాడు. ప్రహ్లాదు డనేవాడు. కర్రసాము నేర్చిన వాడు. ఒకప్పుడు బందెపోటులందు పెద్దరికము వహించినవాడు. జైళ్లలో కాలక్షేపం చేసి వచ్చిన గట్టిఘటం.

వానిని చూచి డాక్టర్ "ఏమిరా నీకు మళ్లీ ఏమయింది?" అని అడిగినాడు.

"ఏం చెప్పను? అదే సుఖరోగ మండి."

"మళ్లీ ఆరోగమేనా?"

ఐదవపర్యాయం ఈ వ్యాధివలన అతడు బాధపడుతున్నాడు.

"తినకూడని గడ్డి తినే యెద్దు ఎలాఉంటుంది?" డాక్టర్ నవ్వినాడు.

నవగ్రామంలోని పెద్దకుటుంబం వారి యింటికి పోవాలి. పిలుపు వచ్చింది ఆ కుటుంబంలోని పసివానికి నాలుగవపర్యాయం ప్రమేహవ్యాధి వచ్చింది. వాని తండ్రిమాట జీవనదత్తు జ్ఞాపకమునకు వస్తోంది. 'జీవనంలో ఆయువూ, పరమాయువూ అనే మాటలు ప్రయోగింపబడుతూవుంటవి. వాని అర్థం చాలా లోతైనది. దీర్ఘాయువు పరమాయువు కాదు. అల్పాయువు పరమాయువు కాదని చెప్పలేము. ఎవరి జీవనము పవిత్రమైనదో, పరమానందమైనదో వారి జీవనము పరమాయు శోభితమని చెప్పవచ్చు'.

ప్రహ్లాదుడు చాలకాలమునుండి రోగముతో పోరుతున్నాడు. ఒంటి జిగిని నిలుపవలెనని పట్టు పడుతూవున్నాడు. ఇంకా కర్రసాము చేస్తూవుంటాడు. తాలింఖానాలో దుముకుతూ, దొర్లుతూ, దెబ్బలు తగిలించుకొంటూ ఉంటాడు.

"ఏం మందు తింటే వెంటనే యీ వ్యాధి పోతుందో ఆ మందివ్వండి,డాక్టరు బాబూ" అన్నాడు ప్రహ్లాదుడు.

ఆరోజుల్లో ఇంజక్షనులు బయలుదేరలేదు. ఔషధం పుచ్చుకొని ప్రణామం చేసి పోతూవుంటాడు ప్రహ్లాదుడు. ఒకరూక ఫీ కూడా యిచ్చి పోతూవుంటాడతడు.

"ఇదేమిరా! ఫీ యిస్తున్నావు. ఇంటిదగ్గర నేను ఫీ తీసుకోను కదా!"

"ఫీ తీసుకుంటేగాని తెగులు కుదరదు బాబయ్యా!" అని అతడు డబ్బిచ్చి పోతూవుంటాడు.

ఇంతకాలంనుండి బాకీల జాబితా సాగుతూ ఉంది. అందులో ప్రహ్లాదుని బాకీ ఎన్నడూ అగపడలేదు.

తరువాత ఒకరితరువాత ఒకరు రోగులు బిలబిల వచ్చారు. రకరకముల జ్వరములవారు, మలేరియా, టైఫాయిడ్ మున్నగు వ్యాధులతోను, రక్తగ్రహణి వగైరాలవారు వస్తున్నారు. కొందరు తెగుళ్ళపుట్ట మోసుకొని వస్తున్నారు. జీవనదత్తుతండ్రి చెపుతూ వుండేవాడు. 'నాయనా! సమస్తరోగముల ఆవిష్కారము

వైద్యశాస్త్రంలో వ్రాయబడివుండలేదు. క్రొత్తరోగం మూటగట్టుకొని ఎవరైనా వచ్చినయెడల సంకోచింపకుము. లక్షణములు చూచి, చికిత్స చేయుము.'

ఈ రోజుల్లో పాశ్చాత్య చికిత్స విశేషంగా ముందంజ వేసింది. విజ్ఞాన శాస్త్ర ప్రభావం వల్ల ఎన్నెన్ని లేబరేటరీలో నెలకొనినవి. ఆ రోజుల్లో ఇవి అంతగా తలసూపలేదు. తరువాత 'చిల్లర మల్లర' రోగులపరీక్ష సాగుతూ ఉంటుంది. 'చిల్లరమల్లర' అనే శబ్ద ప్రయోగం శశి సహజ శక్తినుండి పుట్టింది.

రోగులు రాగానే ఎవరి వ్యాధులు ఏయే భాగంలోనికి వచ్చునో కంపౌండరులు కనిపెట్టి విభజిస్తూ వుంటారు. స్థూలదృష్టి వలన రెండు భాగము లేర్పడినవి. చిన్న చిన్న రోగులు 'చిల్లర మల్లర' భాగంలోకి వస్తారు. వా రొక వైపున నిలువబెట్ట బడుదురు. గడ్డు జాడ్యంతో పీడింపబడేవారు వేరువైపున కూర్చుండబెట్ట బడుదురు. డాక్టరు ముందుగ వీరిని చూస్తూ ఉంటాడు.

'చిల్లర మల్లర' రోగుల పరీక్ష జరిగే సమయంలో డాక్టరు వెలుపలి వసారాలోనికి వచ్చి కూర్చుంటాడు. గోపాల్ కంపౌండరు దాపున వచ్చి నిలబడతాడు. రోగులను పరిశీలించి డాక్టరు ప్రిస్క్రిప్షన్ చెపుతూ వుంటే అతగాడు వ్రాస్తూ వుంటాడు. శశిపై ఎల్లభారము మోపే సాహసం డాక్టరుకు లేదు. అన్యమనస్కుడై యుండు శశి ఏం వ్రాస్తాడో, ఏం వ్రాయడో యెవ రెరుగుదురు? మధ్య మధ్య వ్రాయడం మాని అతడు "అయ్యా! ఏం చెప్పినారో మళ్లీ చెప్పండి. ఏమి వ్రాశానో నాకే తెలియడం లేదు. నా రాత బ్రహ్మ రాతకు అన్నయ్య లాంటిది కదా!" అని అంటూ ఉంటాడు.

ఆ రోజుల్లో ఆరోగ్యనికేతనంలో ముగ్గురు కంపౌండరులు ఉండేవారు. వీరు శశి, గోపాల్, చరణదాసు సింహుడు. చరణదాసు ముసలివాడు. జీవనదత్తు తండ్రి నాటినుండి పని చేస్తున్నాడు. బాగా చెయ్యి తిరిగినమనిషి. ఆయుర్వేదౌషధముల విభాగంలో ఉన్నవాడు. లోపలిగదిలో కూర్చుని కల్వములందు మెల్లగా మందులు నూరుతూ ఉంటాడు. లేహ్యములు చేస్తూ వుంటాడు. వంటౌషధములను తయారు చెయ్యడంలో సిద్ధ హస్తుడు. అతడు పొట్లాలు కూడా కట్టుతూ వుంటాడు.

ఇంగ్లీషు మందుల మిశ్చరు తయారు చేయడంలో కూడా వాని సత్తువ తక్కువది కాదు. "క్వినైన్ సల్ఫేట్ 10 గ్రెయినులూ, ఏసిడ్ నైట్రిక్ 20 గ్రెయినులూ, మేగ్సల్ఫ 10 గ్రెయినులూ, స్పిరిట్ ఏనిస్‌తో 5 చెంచాల నీరు

ఇత్యాది దినుసులు కలిపి మిశ్చరు తయారు చేయుము" అని డాక్టరు ఆతనితో తెలుపుతూ వుంటాడు.

"ముందుగా ఒకడోస్ ఆముదం మింగించు" అని ఆతడు అంటూ వుంటాడు.

ఆ రోగి నిష్క్రమించగనే మరొకడు ముందుకు వస్తాడు. ఇతడు రక్త విరేచనములతో బాధపడేవాడు. పెక్కునాళ్ళ తెగులు!

'సింహమహాశయా' అని డాక్టరు పిలిచినవెంటనే చరణదాసు వచ్చి నిలబడును.

"అందులోని ఆయుర్వేదపు ఔషధం వీనికిమ్ము." ఇది నాడీపరీక్ష వలన నిర్ణయింపబడిన ఔషధం.

"మరి నీ కథ యేమిటి?" అని ఆతడు మరొకరోగిని ప్రశ్నిస్తాడు.

"బాబూ! పార్శ్వపునొప్పి నా ప్రాణాలు తీస్తోంది. ప్రొద్దెక్కినకొద్దీ ఈ యాతన హెచ్చుతూ వుంటుంది. సూర్యాస్తమయంతో పోతుంది. ఈ మధ్య కాలంలో నేను పడే బాధ చెప్ప నలవి కానిది."

సింహమహాశయుని పిలిచి "వీనికి తలనొప్పి పోగొట్టే ద్రావకం ఇయ్యి" అని, మరొకరోగిని చూచి, చకితుడై వానిని పరిశీలించును.

ఇతడు మూడుదినములనుండి అల్పజ్వరంతో ఉన్నాడు.

"ఏది, నీ నాలుక చూపించు." నాలుక చూచి, చతికిలపడి, "ఏది బాబూ! నాడి చూడనియ్యి" అని వాని చేయి పట్టుకొని కొంచెంసేపు కళ్లు మూసినాడు జీవనదత్తు.

"సరే! బోధపడింది. చూడు బాబూ! ఈ బల్లపై పడుకో! ఏది, కడుపు చూడనియ్యి. లోపల పాములపుట్ట ఉన్నట్లున్నది. అవును, ఉన్నది" అన్నాడు.

"ఏమోయీ! నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి, రెండు రోజులు ఇక్కడకు వచ్చి పరీక్ష చేయించుకోవాలి తెలిసిందా? నాడిలో గడ్డు జాడ్యపు జాడలు అగపడుతున్నాయి. స్పష్టంగా అవి నాడికి అందడం లేదు. నాలుకనూ, కడుపునూ, పరీక్షించగా టైఫాయిడ్ అని తోస్తోంది."

"గోపాల్! ఏది? కాగితం యిలా తీసుకొనిరా!" ప్రిస్క్రిప్షన్ వ్రాస్తూ వ్రాస్తూ "చూడు. రెండు రోజుల్లో జ్వరం సంగతి తెలిసిపోతుందో లేదో కని పెట్టు" అని వానితో చెప్పెను.

"అయ్యా! జ్వరం అంతగా లేదు."

"సరిగా పరీక్ష చెయ్యి" అని. రోగితో "కొన్ని రోజులపాటు అన్నం ముట్టవద్దు. సగ్గుబియ్యంజావ తాగు. ఇక పాలంటావా? ఊహూ, పాలు వద్దు. ఈ మాదిరిగా విచ్చలవిడిగా రావద్దు" అన్నాడు.

తదనంతరం పల్లెప్రాంతంలోని రోగులను చూచేందుకు అతడు కదలి పోయినాడు. పిదప నవగ్రామం పోయినాడు. సాహకుటుంబంలో ఒక నెమో కేసుంది. సువర్ణబాబు కొడుకు రెమిటెంట్ ఫీవర్‌తో బాధ పడుతున్నాడు. రమేంద్ర బాబు చిన్నకొడుకు ప్రమేహంతో పొగులుతున్నాడు. మిత్రుడైన నేపాల్ పెండ్లాము సూతికతో పడి వుంది. కొందరు ఫీ యిస్తారు. కొంద రియ్యరు. ఇయ్య దలచుకొన్నవారు సయితం బాకీ పెడుతూవుంటారు.

వీరే కాక మార్గంలో మరికొందరు రోగులు తారసిల్లుతూ వుంటారు. తమ తమ యిళ్ళనుండి జీవనదత్తును పిలుస్తూ వుంటారు. "దత్తుమహాశయా! ఒకసారి వచ్చి మా వాణ్ణి చూచి పొండి" అని ఒకడనును. మరొక గేస్తురాలు చంటిబిడ్డను చంకబెట్టుకొని నిలబడుతుంది. మరొకతె ఏడ్చు బాలికను లాలించి, వీధిలోనికి తీసుకొని వస్తుంది. కొందరి ఇళ్ళకు జీవనడాక్టరు పోవలసి వస్తుంది. ముసలివాళ్లూ, మంచమును పట్టినవారూ త్రోవపొంత వైద్యుని ఎట్లు చూడ జాలుదురు?

"డాక్టరు బాబూ! ఒక పర్యాయం మా అమ్మను చూచిపొండి".

ఆ వేళ సేతాబ్ ఆతనిని బాండుసన్యాసిని చూచేందుకై పిలిచిన విషయం జ్ఞాపకమునకు వస్తూంది.

"జీవనబాబూ! ఒకసారి బాండుసన్యాసిని చూచిపోండి. ఏ దిక్కూలేని సన్యాసి. ఒక పర్యాయం బ్రతిమాలి మిమ్మల్ని తీసుకు రమ్మని ఆతడు మరీమరీ చెప్పినాడు. చారిటబుల్ డిస్పెన్సరీ మందు వలన వాని కేమీ ప్రయోజనం కలుగ లేదు" అని అతడు ప్రాధేయపూర్వకంగా పలికినాడు.

సేతాబు నేపాలులు ఈ రోగులను ఒక కంట చూస్తూ ఉంటారు, జీవన దత్తుకై ఎదురుచూస్తూ వుంటారు.

"కాకితో కబురంపితే చాలు. నేను వచ్చి వాళ్ళను చూచిపోతాను." అని నవ్వుతూ ఆత డంటూ వుంటాడు.

"హరిహరడోమ్ మిగుల బాధపడుతున్నాడు. ఒకసారి వాణ్ణి చూచేందుకై రండు. గోపాల బావుడీ తల్లి ఉష్ణంతో పడి వుంది. ఆమెను కూడా చూడాలి." అని వా రంటూవుంటారు.

హరిహరుని రోగం మళ్ళిన వెంటనే వాని వద్దనుండి నేపాల్ ఒక ఆడు మేకను సంగ్రహించి తెస్తూ వుంటాడు. ఇట్లని జీవనదత్తు ఎరుగును. తరువాత రకరకముల మృష్టాన్నముతో విందు జరుగుతూ వుంటుంది.

దత్తు ఇంటికి మళ్ళేటప్పటికి అపరాహ్ణ మవుతూ వుంటుంది. జేబులో పది పన్నెండు రూకలు చేరుకొంటాయి. ఒక్కొక్క రోగిని చూచేందుకై రూక చొప్పున ఫీ వసూలు చేస్తూ వుండేవాడు. అప్పట్లో దత్తుమహాశయుడు. రోగిని మొదటిపర్యాయం చూచినపుడే అతడు ఫీ తీసుకొంటూ ఉండేవాడు. రెండవసారి పోయి చూచినపుడు ఫీ తీసుకొనే రివాజు లేదు. ఇంటికి రాగానే అతడు చొక్కా విప్పి యిల్లాలి కిస్తూ వుంటాడు. కొడుకు వనవిహారి, కూతురు సుషమ వచ్చి దగ్గర నిలుస్తూ వుంటారు.

"నాన్నా! నాకు డబ్బులు! నాకు డబ్బులు." అని వాళ్ళు తండ్రిని అడుగుతూ వుంటారు.

జీవనదత్తు ఇంటికి తిరిగి వచ్చువేళ రూక మార్చి చిల్లర తెస్తూ వుంటాడు. అందువల్ల పిల్లల కిచ్చేందుకై పైసలు వుంటాయి వాని వద్ద. పిల్లవానికి నాలుగు పైసలూ, పిల్లదానికి రెండు పైసలూ ఇస్తూ వుంటాడు. అతగాడికి డబుల్‌పైకం ముట్టి తీరాలి. "నాకు రెట్టింపు కావాలి" అని అతడు అంటూ వుంటాడు. బాలిక ఎక్కువ, తక్కువలేమో యెరుగదు. రెండు పైసలు చేతిలో పడిన తోడనే ఆమె సంతుష్టి చెందుతుంది.

జీవనదత్తు నోటు బుక్కు తెరిచి "రామేంద్రబాబు యింటి తాలూకు ఫీ బాకీలో ఉంది" అని వ్రాసుకొంటూ ఉంటాడు.

అపుడు ఆరోగ్యనికేతనమున కవ్వల ఎవరిదో ఒక బండి వచ్చి నిలిచింది. కృష్ణపురమునుండి ఎవ్వరో వచ్చినారు. కాయస్థ సంఘంవారు విశేషంగా అందు నివసిస్తూ వుంటారు. మిత్రకుటుంబమునుండి జాబు తెచ్చి జీవనదత్తు చేతి కందించి

నాడు బండి ఆసామి. "దత్తమహాశయా! ఒక పర్యాయం దయచేయండి. మా పెద్ద పిల్లవాడు తీవ్రజ్వరంతో బాధపడుతున్నాడు. రాఘవపురములోని కవిరాజు వచ్చి వానిని చూస్తున్నాడు. కాని ఏమీ గుణం అగపడలేదు. ఇట్లు, భవదీయుడు, సురేశ చంద్రమిత్ర" అని లేఖలో వ్రాయబడి ఉన్నది.

గౌరహరి విషయం నందుడు తండ్రికి జ్ఞాపకంచేసి వుంచినాడు. ఎవరెవరి విషయం మనసున పడునో తోడ్తోడనే ఆతడు జనకునివద్ద ఏకరువు పెట్టుతూ వుంటాడు. కొడుకు ఉబలాటం చూచి దత్తు నవ్వుకొంటూ వుంటాడు. క్షోభ విశేషించి నందునిదైపోయింది. ఆ కాలమున ఆరోగ్యనికేతనమునకు చేకూరు గౌరవ మర్యాదలలో ఆదాయ వ్యవహారములలో అంతో యింతో వానికి పాలుంది. వానికి రావలసిన బాకీ కూడా చాలా మిగిలి ఉండేది. అప్పుడు కాల్ బాక్సు ఒక కర్రపెట్టె. ఎక్కడెక్కడికి దత్తుమహాశయుడు కాలినడకను పోతూవుండేవాడో, ఆ పెట్టెను తలపై పెట్టుకొని బిడ్డ లిరువురు తండ్రి వెంటబడుతూ వుండేవాళ్లు.

ఒక యింటియొద్ద రెండణాలు, మరొకయింట నాలుగుపైసలూ వారికి లభిస్తూ వుండేవి. ఈ రోజుల్లో వారికి ముట్టవలసిన నెలసరి రొక్కం సరిగా చేతుల్లో పడడం లేదు.

దినములు గడచిపోతున్నాయి. కాలస్రవంతి ప్రవహిస్తోంది. సమయం గడచుకొలది వ్యక్తుల వయస్సు పెరుగుతూ వుంటుంది. వారు పెద్ద లవుతూ వుంటారు. వారి శరీరములు జీర్ణములౌతూ వుంటాయి. జీర్ణము లయ్యే దేహములు, శిధిలము లయ్యేకాయములు నేలపై దొర్లిపడును. ఖ్యాతి కూడా పటాపంచ లయ్యేదే! అయితేం గాక! కాని ఒక్క విషయమున దుఃఖం వస్తూ వుంటుంది. ఉపేక్ష సహింపరానిది. వ్యక్తులకు దాపురించు ఉపేక్ష అంతగా గణింపదగినది కాదు. విద్యకు దాపురించే ఉపేక్ష శోచనీయమైనది.

మనుష్యజీవన సింహావలోకనమున బోధపడు విషయ మిది. జీవనదత్తు హృదయంలో అపుడపుడు ఈ చింతాస్రవంతి ప్రవహిస్తూ ఉంటుంది.

మహంతు శిష్యుడు భోలానాథుడు దత్తు మ్రోల నిలిచి "ఒక పర్యాయం మీరు దయచేయాలి" అన్నాడు.

సన్యాసి స్థలమును గురించి దత్తు తలపోయ సాగినాడు. ఆతని పీఠమునకు నలువలంకులందు వనభూమి వెలయుచున్నది. ఆ వనమున పలువిధముల పూలును,

లతలును విరాజిల్లుచున్నవి. అందుండి సుగంధము పరవళ్లు త్రొక్కు సరిల్లలామము వలె పలు దిశలందు వెలారుచున్నది. అది అనంత సౌందర్య సామ్రాజ్యము కదా!

"జీవన మహాశయుని ఒక పర్యాయం పిలుచుకొనిరా అని ప్రాతఃకాలమునుండి వృద్ధుడు చెవినిల్లు కట్టుకొని పోరుతున్నాడు. తక్షణమే వచ్చి నాడి చూడవలెనట" అని భోలానాథుడు పలికినాడు.

# పందొమ్మిదవ ప్రకరణము

సన్యాసి ప్రాతఃకాలమున లేచినాడు. ఇంచుక తేరుకొన్నాడు. కొంచెము ఒత్తిగిలి పరుండినాడు. ఇపుడు బాధ లేదు. కిటికిలోనుండి ఆకాశమును తేరి చూచినాడు. జీవనదత్తును చూచి ఇట్లన్నాడు. "సోదరా! నిన్న రాత్రి నీవు వచ్చు నప్పటికే నేను నిద్రపోయినాను. ఆ శశిగాడు ఏమి మందిచ్చాడో కాని, ఐదు నిముషములలోపుగనే స్మారకం తప్పి పడిపోయినాను."

"ఈ వేళ మీ ఒళ్లు కుదుటపడింది. మంచి మందే పడింది కడుపులో" అని నవ్వుతూ పలికినాడు జీవనదత్తు.

"ఏమో యేమందని చెప్పను?"

"ఏమి అలా అంటున్నారు? బాధ నిమ్మళించలేదా? ఇక జబ్బేముంది"

"నా కేమీ బోధపడడం లేదు. నాడీ పరీక్ష చేస్తే నీకు బోధపడుతుంది. ఇక ఈ లోకమునుండి సెలవు పుచ్చుకొనిపోవు సమయం రాదా?"

"అంతగా ఇష్టపడక పోయినయెడల సెలవు ఎలా దొరుకుతుంది?"

"సోదరా! అటువంటి పుణ్యమే నాకు లభిస్తుందా?"

ఆ పున్నె మింతలో చేకూరదనే జీవనదత్తు ఊహించాడు. ఆతని సూక్ష్మను భూతి గతించినది. వాని మనస్సు జీర్ణ మైపోయినది. యోగసాధన గలవారి మనస్సు అద్భుతశక్తి గలిగి ఉంటుంది. శారీరక జీర్ణతను అది అంతగా గణింపకుండును. మనసున తలసూపిన వాసనలు జీర్ణదేహమును త్యజించి నూతన శరీరమున ప్రవేశించును. ఈ విషయము ఈ దేశమందలి పురాణములం దుల్లేఖింపబడినది. దీనిని తండ్రికడ జీవనదత్తు వినియుండెను. ప్రద్యోతుడు మున్నగువారు దీనిని విశ్వసింపరు. నవ్వెదరు. కాని జీవనుడు నమ్మును. అతడు సన్యాసి నాడిని చేబూనెను.

క్షీణస్వరముతో సన్యాసి ఇట్లనెను: "మనస్సులోని గగ్గోలు అంతకంతకు అధిక మవుతూ ఉన్నది. ఆ వైపునుండి పదిపన్నెండు భూతముల సంయుక్త

స్వరము వినబడినది. అందు రఘువరజీ స్వరము కలసియుండెను. వనమందు పంచాగ్నుల మధ్య కూర్చుని అతడు 'తమ్ముడూ!రా రా!' అని కేక వేసినాడు."

ఈ మాటలలోని అర్థమును గ్రహించేందుకు జీవనదత్తుకు ఆలస్యము కాలేదు.

ఆ వైపున అరణ్యమందు ఇప్పటి మహంతుకు పూర్వ ముండిన మహాంతు సమాధి ఉండెను. అచటి నుండి సన్యాసి వికృతపు ధ్వనులను వినుచుండెను. రమ్మని సన్యాసిని అవి పిలుచు నట్లుండెను. రఘువరజీ ఈ సన్యాసి గురుస్థానము నలంకరించి యుండెను. వీనికి ముందటివాడు. అతడు సత్యసంధుడైన యోగి. యోగసాధన వలన దేహమందలి యాతనలను ఆతడణచువాడు. వ్రతవిచిత్రపాలనము వలన బాహ్యప్రకృతి ప్రభావమును సహింపజాలువాడు. వైశాఖమాసమందు పంచాగ్నుల వ్రతమును మిగుల దీక్షతో నెరపువాడు. సూర్యోదయము మొదలు ఐదు హోమకుండములు జ్వలిస్తూ వుండేవి. వాని మధ్య ఆతడు ఆసీను డయ్యేవాడు. దిన మంతయు కదలక మెదలక ఆత డక్కడే కూర్చుని యుండువాడు. ప్రతి హోమకుండమందు సమిధలు వేసి, సూర్యు డస్తమించిన పిదప హోమమును చాలిస్తూ వుండేవాడు. శీతకాలమందు అనావృత దేహముతో వృక్షతలమున అధివసించి, ఆతడు జప మొనరించువాడు. తొలికోడి కూసిన వెంటనే తన పీఠమును వదలి హిమశీతల పుష్కరిణిలో దిగి, పగలు జాము ప్రొద్దెక్కువరకు అందే కూర్చుని యుండువాడు. అతడు కూడ ఇపుడు సన్యాసిని పిలుస్తున్నాడు.

సాధారణ మానవులు మరణించిన పిదప మృతులైన స్వజనులను చూతురు. వారు తమ చుట్టములను ఆహ్వానింతురు. సన్యాసుల చుట్టపక్కములు విస్మృతి గహనములో అడగి యుందురు. ఇప్పటి మహంతు తన పూర్వ పురుషులను వీక్షింపగలిగెను.

నాడి చూచి జీవనదత్తు "బాబూ! మీ రిక సెలవు తీసికొనవలసిన ముహూర్తం వస్తూవుంది. నేడు సంధ్య గడచిన వెంటనే మీరు విశేషవైభవముతో స్వర్గము నలంకరిస్తారు. స్వర్గ మందలి భవనములు తమకు అగుపడుతునే ఉన్నవి. వాటిని గుర్తుపట్ట గలుగుతున్నారు కదా!" అన్నాడు.

సన్న్యాసి 'విశీర్ణ వార్ధక్య శుష్క అధరోష్ఠములపై ఇంచుక మందహాసము అగపడెను. ఆత డొక వేడినిట్టూర్పు విడిచినాడు.

నలభై యేండ్లనుండి సన్న్యాసి యిచ్చట నివసిస్తున్నాడు. సుమారు ముప్ఫై యేళ్ళనుండి ఈ దేవస్థానమునకు మహంతై ఉన్నాడు. ముప్పదియైదు నలభై యేండ్ల వయసున అత డిచ్చటికి వచ్చినాడు. కాని ముప్ఫైయేళ్ళ యువకునివలె ఉన్నాడు. కుస్తీలు పట్టడంలో ఆరితేరడం వలన వాని కాయములో కండలు పెరిగివి. అతడు దృఢశరీరుడైనాడు. శాస్త్రములను గీస్త్రములను ఆత డెన్నడునూ తొంగిచూడలేదు. ఏవేవో కొన్ని నీతివాక్యములను కంఠంలో ఇముడ్చుకొన్నాడు. సన్న్యాసి చహరా ప్రకటింపగలిగినాడు. అతగాడు పెద్ద బావాజీ అని చెప్పలేము. కాని మామూలు బైరాగి అనడంలో సందేహం లేదు.

దేశవాసులకు వాని ప్రథమ పరిచయము కలిగింది, మిగుల విడ్డూరపు పరిస్థితులలో.

దేశముయొక్క అవస్థ అప్పుడు భయావహమై యుండెను. మహామారి ఎల్లచోటులందు తైతక్కలాడుతూ వుంది. ఒకపల్లెనుండి ఇంకొకపల్లెకు, అందుండి వేరొకపల్లెకు అది భయంకర నృత్యము సలుపుతూ చెలరేగుతున్నవి. భయంకర వైశాఖసమయ గ్రీష్మాగ్నిని పోలు నాలుకను చాపి అది నాట్య మాడుతూ వుంది. ఆకాలమున అచ్చట కలరా ఔషధ మేమీ లేదు. క్లోరోడాయిన్ కొంత అగపడుతూంది. కవిరాజుల కల్వములలో నూరబడిన మందు మరిడెమ్మను భయపెట్టలేకపోయింది. క్లోరోడాయిన్ ప్రయోగింపగలిగే చికిత్సకు డెవ్వడూ లేడు. ఉన్న వైద్యులు భయంతో గడగడలాడుతున్నారు. హరిశ్ డాక్టరు కలరాకేసులు పట్టేవాడు కాడు. హోమియోపథిక్ బల్ల కట్టుకొని ఎచ్చటికో పలాయనం చిత్తగించాడు. ఎవరో ఒక కొత్త డాక్టరు అపుడు నవగ్రామమునకు వచ్చినాడు. అతడు కూడా ఒకనాటిరాత్రి ఎవరికీ చెప్పక కాలుకు బుద్ధి చెప్పినాడు, కలరాకేసుల పిలుపులకు భయపడి.

నలుదిక్కులందు భయాందోళనములు చెలరేగినవి. ఆకాలపు విశ్వాసములు భీతిగొలుపునవి. కలరా అమ్మవారు స్పష్టముగ ప్రత్యక్ష మయ్యేడిది. గ్రామగ్రామమునందు అది సంచారము చేస్తూ ఉండేది. సంధ్యాసమయంలో అమ్మవారు ఇష్టవిహారమునకై బయలుదేరేది. శీర్ణకంకాళశరీరము; అమ్మవారి కళ్ళనుండి అగ్నికణాలు వెడలుతున్నాయి. పింగళవర్ణపు తలవెంట్రుకలు నలుదిక్కులందు చెల్లాచెదరుగ ఎగురుతున్నవి; ఎవరో ఒక బాలిక ఆమె దంతముల నడుమ నలుగుతూ ఉన్నది. నెత్తుటితో తడిసి, చిరిగినబట్టను ఆమె కట్టుకొనినది; ఒకచంకనుండి శవ మొకటి

ప్రేలాడుతున్నది. వేరొక చంకనుండి తాటియాకుల చాప ఒకటి గాలిలో ఎగిరెగిరి పడుతూంది! ఈవేషంతో అమ్మవారు పల్లెలో ప్రవేశిస్తూంది! అందుండి పీనుగులను మూటగట్టుకొని, గంతులు వేస్తూ వల్లకాటినేలలోనికి ఉరుకు లెత్తుతూంది! సంధ్యా సమయంలో ఎవ రామెను చూస్తూవుండేవాళ్లో ఆ హతభాగులు ఇంటికి వచ్చి మంచమున పడేవాళ్లు! ఆ రాత్రివేళ కలరాకు గురి అయ్యేవాళ్లు; చచ్చేవాళ్లు. తదనంతరం ఇంటింటా, వీధివీధినీ, ఊరూరా కలరా అమ్మవారు ఉరుకు లెత్తుతూ ఉండేది.

ఊళ్లు విడిచి గోలపెడుతూ ప్రజలు సర్వదిశలందు పరుగు లెత్తుతూ ఉండిరి. ఈరీతిగా పారిపోయినవారిలో నవగ్రామంలోని పెద్దకుటుంబపువారు, సామాన్య జనులు వారివెనుక పరుగు లెత్తేరు.

నిరుపేదలలోను, దిక్కులేనివారిలోనూ త్రాగుబోతు లుండిరి. గంజాయి పీల్చేవా రుండిరి. వీరి సంఖ్య హెచ్చుగా వుండెను. త్రాగి తందానాలాడుతూ "అమ్మా! కాళీ! అమ్మా! హరేరామా! హరేరామా!" అంటూ అరిచేవారు.

అతడు కూడ హరినామసంకీర్తనము సలుపువాడు. చాలాకాల మాతడు సంకీర్తనదళమున ముఖ్య గాయకుడై ఉండెను. అతనికి కంఠం లేదు, వాని గొంతుకలో తీపి సున్న; కాని పాటలో తేనె నాతడు గ్రోలగలడు. తోచిన రీతిగా పాడగలడు. ఉత్సాహమునకు కరువు లేదు. అందు వానికి ఉజ్జి మరొకరు లేరు. ఇపు డిపుడు కొత్త రకపు వాద్య విశేషములు రంగ స్థలములో విజృంభింప సాగినవి. హార్మోనియమ్, గ్రామఫోన్, రేడియోలు ప్రజలలో ఉత్సాహం రేకెత్తించినవి. నవగ్రామంలో కొందరి ఇళ్ళలో రేడియోలు నిత్య మాధుర్యమును సృష్టిస్తూ వున్నవి. "శ్యామ సుందరా! వ్రజధామవాసా! నీ నామ మెంత మధురము! స్వర్ణలతా సంశోభితమైన తమాలమును అవలోకించి రాధ శ్యామ సుందరుడని భ్రమించి దాని నాలింగన మొనరించుకొనినది. శరీర మంతా గాయములతో నిండిపోయి నేల గూలినది. దేహము ధూళియందు ధూసరిత మైనది. హతచేతనయై పాంసు పటలమున పడిపోయినది." 'ఆహా!' ఎట్టి యూహాలు!'

ప్రతి దినము సంధ్యా సమయంలో భక్త బృందమును వెంట బెట్టుకొని అతడు సంకీర్తనము సలుపుచు వీధులందు సంచరించువాడు. నామ సంకీర్తనము ఫలన సమస్త పీడలు పటాపంచ లగునని అతని విశ్వాసము. గ్రామ గ్రామము

నందు మద్యపానమత్తులు తమ అమ్మవారిని పూజిస్తూ వుంటారు. వారికి కూడ ఈ రీతి నమ్మకము కలదు. ఎట్టిదైనను అది గభీరమైనది.

గభీరరాత్రివేళ కుక్కలు వీధులందు అరుచుచుండును. ఆ అరపులు అధిక మైనవి. వాటి అరుపులందు గూఢార్థము కలదు. అందు క్రోధము లేదు. భయ మున్నది. పింగళ కేశిని వీధులందు సంచరించుట జూచి అడలుతో అవి మొరుగుచుండును. భయార్తమైన అరపులు వీధులందు ప్రతిధ్వనిస్తూ ఉంటవి. ఇళ్ళలో శయనించి యుండువారు ఉలికిపడి లేస్తూ ఉంటారు.

జీవన డాక్టరుకు మృత్యు భయము లేదు. వీధినిబడి అతడు సంచరిస్తూ ఉండేవాడు. సంచరించి ఆతడు చేసేదేమి? తిరిగి తిరిగి అతడు రంగలాల్ డాక్టరు కొంప చేరుకొనేవాడు. ''ఔషధం నిర్ణయించండి'' అనేవాడు.

దీర్ఘకాలము గడచిన తరువాత ఆతని మొగమును తేరిచూచి రంగలాల్ లేచి నిలిచినాడు. అంతకు ముందు ఒక మెడికల్ జర్నల్ చదువుతూ ఉండెను. పిదప ప్రిస్క్రిప్షన్ ఒకటి వ్రాసి యిచ్చినాడు. $\frac{1}{6}$ గ్రెయిన్ క్యాలొమెల్‌ని సోడా బయికార్బ్‌తో కలిపి గంట గంటకు త్రాగింపుము. ఈ అవస్థలో దీనిని మించిన మందిపుడు లేదు.

ఈ ఔషధం వల్ల చాలా ప్రాణాలు కాపాడబడినవి. పగలనక, రాత్రి అనక జీవనమహాశయుడు సంచరిస్తూ ఉన్నాడు. పితృ వంశ సంప్రదాయ సంరక్షణము; గురూత్తముడైన రంగలాల్ ఆదేశము, తన గుండెలోని యాతన—అన్నియు కలిసినవి.

ప్రిస్క్రిప్షన్ వాని.చేతిలో పెట్టి రంగలాల్ డాక్టరిట్లు పలికినాడు! ''జీవనూ! ఆకాశము పగులునట్లు కంఠమెత్తి సంకీర్తనం చేస్తూ నీవు కలరాను తరిమి కొట్టుతున్నావా?'' అని ఆతడు పక్కున నవ్వినాడు.

ఆ ధోరణి చూచి జీవనుడు సిగ్గు పడలేదని చెప్పలేము. అయినను ఆతడు అప్రతిభుడు కాలేదు. ''ఏం చేస్తాను? ప్రజల నమ్మకం బట్టి నడవాలి కదా!'' అన్నాడు.

''నీ నమ్మకం మాటేమి?''

''నేను నాస్తికుడను కానని మీ రెరుగుదురు కదా!''

"నీ నడక నాకు అసంతృప్తిని కలిగించడం లేదు, జీవనూ! అందుకు నేను అభ్యంతరము కలిగించడమూ లేదు. నీవు నామసంకీర్తనము చేసినపుడు నేనేల అడ్డు నిలుస్తాను? కాని యీ సంకీర్తనము ప్రేమతో భక్తితో కూడిన సంకీర్తనమై ఉండాలి. నాకు దీని నిమ్ము. నన్ను బ్రదికించు; నా శత్రువులను నాశనము చేయుము—అంటూ చేసే సంకీర్తనము కేవలము నిరర్థక మైనది."

"వనమందు అగ్ని రవుల్కొనినపుడు, భయంకరముగ మంటలు లేచి ఆకాశమును కబళిస్తూ ఉన్నప్పుడు అడలుతో వనమందలి పశువులు నలుదిక్కులందు పరుగులు పెడుతూ ఉన్నట్లు, నేడు మనుష్యులు హాహాకారములు సలుపుతూ దశదిశలందు ఉరుకు లెత్తుతున్నారు. ఈ ఘోరదృశ్యమును నేను కనులార చూస్తున్నాను." అని జీవనమహాశయుడు ఉత్తేజితుడై, ఆవేగ పూర్వకముగ తన దార్శనిక ప్రభావమును రంగలాల్ ముందు ప్రదర్శింపసాగినాడు.

"మృత్యుదేవత వానిని తరిమి కొడుతున్నది. విరియబారిన తలవెంట్రుకలతో భయంకరియై, చేతులు చాపుతూ, తీరని ఆకటి బాధతో వొగులుతూ మనుజులను కబళించుటకై ఇందందు ఉరుకు లెత్తుతున్నది మహామారి. జగతిలోని ప్రాణులన్నియు పిచ్చి పట్టినట్లు నలుదెసలందు చెల్లాచెదరవుతూన్నవి. పరుగు లెత్తుతూ, మృత్యుకాంత సమక్షమున బోరగిల పడుతున్నవి. మృత్యుమహిళ తటాలున పట్టి వాటిని కబళిస్తూ ఉన్నది. రేయింబవళ్లు ఈ భీషణకాండను ఆమె నెరపుతున్నది. ఇట్టి దారుణ పరిస్థితులలో ఈశ్వరనామ సంకీర్తన మొనరించి భగవాన్! కాపాడుము తండ్రీ! అని గుండెకు దిటవు కలిగించడం కంటె వేరు మార్గ మేమున్నది?" అని జీవనమహాశయుడు వాకొనినాడు.

రంగలాల్ పూర్వపక్షము చేయలేకపోయినాడు. ప్రసన్నభావంతో చిరునవ్వు నవ్వి ఆత డిట్లనినాడు: "జీవనూ! యుద్ధము జరుగుతూ వుంటుంది. మృత్యువునుండి పారిపోక ధైర్యముతో ఎదుర్కొనినయెడల అది విశ్వమోహినియై అగపడుతుంది. మనుష్య డెన్నడూ కూలిపోడు. ఈ మహామారి ఎంతకాలము నాట్య మాడుతుంది? అది మహాగజము వంటిది. రానురాను అదే సుక్కి సుక్కి క్రుంగిపోతుంది. ముసలితనము పైబడినప్పుడు బ్రతుకుమీది తీపికంటె చావుమీది తీపి అధిక మవుతుంది. జరాభారమును వహించు దంతావళము నిబిడకాంతారమున ప్రవేశించి, పెక్కు శతాబ్దములు బ్రతికితినను ఆత్మవిశ్వాసముతో ఆకసమును చీల్చు బృంహితమును సలిపి ధృతితో దేహత్యాగము సలుపును. ఏనుగు లీరీతిగా

పురుషానుక్రమిక శ్మశానభూమిలో ప్రవేశించి తమ శరీరములు విడుచును. అట్లేల చేయునో యెరుగుదువా? తమ యొడళ్లందు పుట్టు తెవుళ్లు తమజాతి జంతువులకు అంటకుండుటకై అవి అట్లు చేస్తూవుంటవి."

మహామారి జాడ్యము సడలిపోయినవెంటనే జీవనమహాశయుడు సన్న్యాసిని కలిసికొన్నాడు. ఈ విపత్తు తరువాత మహాశయునకు సంఘములో చెప్పదగిన ప్రతిపత్తి లభించింది. నవగ్రామమందలి పెద్దతలకాయలను త్రోసిరాజని ప్రభుత్వము వా రాతనిని పంచాయత్ అధ్యక్షునిగా నియోగించారు. ఆ పదవిని నిర్వహిస్తూ ఏదో కలహమును గురించి సమాలోచన సలిపేందుకై ఆతడు సన్న్యాస పీఠము వద్దకు వచ్చినాడు.

"జీవనమహాశయా! నీవు మహావీరుడవనే వినికిడి కలదు. నీవు బాణా కర్ర బాగా త్రిప్పగలవని విన్నాను." అన్నాడు సన్న్యాసి.

ఇరువుర నడుమ వివిధములైన ప్రసంగాలు నడచినవి.

చండీ మందిరమువద్ద ఉత్సవాలు జరుగునపుడు జూదము జోరుగా సాగుతూ వుంటుంది. అవసర మగునపుడు సన్న్యాసి చేతితడి లభిస్తూఉంటుంది. ఆ సమయంలో దేవస్థానపు ఖజానా సన్న్యాసికి ఏడుగడ అవుతుంది. జీవనునకు అక్కరైనవేళల్లో డబ్బు చిక్కుతూ వుంటుంది. జీవనమహాశయుడు పెద్దడాక్టరు, పంచాయతు ప్రెసిడెంట్, ఘరానామనిషి కావున సన్న్యాసి ఆతనికి వలసిన మొత్తము ఇస్తూవుంటాడు. "డాక్టరుబాబూ! పెద్దకుటుంబంలో పుట్టిన పెద్దమనిషివి. రాత్రులందు చతురంగపు ఆటలో మైమరచి ఉంటావు. మరి జూద మంటే చెవికోసుకుంటూవుంటావు. ఈ కర్మకాండ నీకెపుడు పట్టుపడింది?" అని మహంతు జీవనుని అడుగుతూవుంటాడు.

"గోస్వామీజీ! ఒకప్పుడు నా స్థితి మూడు పూవులూ ఆరు కాయలూ అన్నట్లుగా వుండేది. నా శరీరంలో కండలు పెరిగివుండేవి. మనసులో చెప్పరాని సాహసం చెలరేగేది. పలుకుబడిని గురించి చెప్పేదేముంది? సంఘంలో గౌరవ మర్యాదలు చక్కగా లభిస్తూ వుండేవి. సాంసారికబాధ అంతగా కలిగేది కాదు. కాని ఎవ్వరికీ నేను అన్యాయం చేసి యెరుగను. జూద మంటారా? ధర్మరాజులవారు, నలమహారాజుగారు...." అంటూవుండగా జీవనుని చింతాసూత్రం పుటుక్కున తెగిపోయింది.

రతన్‌బాబు కొడుకు బిపిన్‌మాట జ్ఞప్తికి వచ్చింది. సంసారజీవనమున గోపన దుఃఖము వాని మనసును దుఃఖ మొనరిస్తూ ఉంటుంది. అందు అశాంతి పెచ్చిల్లుతూ ఉంటుంది. తలయెత్తి యిందందు తిరుగుతూవున్నప్పటికీ, వాని తృష్ణ చల్లారునది కాదు. క్షుధ తీరునది కాదు. వాని చిత్తము ఇందందు ఉరుకు లెత్తుతూ ఉంటుంది. సాధన సక్రమంగా సాగినపుడు కుసుమితాశయము వలె సిద్ధి దృగ్గోచర మగును. సిద్ధి చేపడుటకు మున్ను ప్రతిష్ఠ కరతలామలక మగును. లాలస ఫణ మెత్తి బుస్సు మనును. ఆకాంక్ష అధిక మవుతూ ఉంటుంది. ఇది అంతశ్శత్రు వనుట నిస్సంశయము. దీనిని తరిమికొట్టు పూనికలో మొగము ముక్క లగును. ఆ పింగళికేశిని ఎదుట సాక్షాత్కరిస్తుంది.

* * *

రతన్‌బాబు కొడుకు బిపిన్ యెక్కిళ్లు పూర్తిగ తగ్గిపోలేదు. కొంచెము తగ్గినవి. రక్తపుపోటు కూడ తగ్గుమొగం పట్టింది. ప్రసన్నహసనముతో రతన్ "బిపిన్? నీ ఔషధం దొడ్డది. రామబాణంలా పనిచేసింది. నీ వాకపర్యాయం నాడి చూడుము. మేలు కలిగిందనే నా ఉద్దేశం" అన్నాడు.

జీవనమహాశయుడు కూడా మందహాసం చేశాడు. మధురవైఖరిని ప్రదర్శించుటకై అతడు చిరునవ్వు నవ్వినాడు. కాని వేరుతీరు ఊహలు వాని అంతరంగములో చెరలాడదొడగెను. 'ఈపాటివైద్యంతో లోకులు వ్యాధిముక్తులైన ఎంత మేలగునో!' అని అనుకొనినాడు.

రతన్‌బాబు ఒక విచిత్ర వ్యక్తి. పండితుడు, జ్ఞాని. ఏకైక పుత్రుడు మంచము పట్టిన తోడనే అతడు వైద్యగ్రంథములను తెప్పించి సమస్త విషయములను గ్రహించేందుకై పద్మాసనం వేసికొని కూర్చున్నాడు. కొన్ని ముఖ్యాంశములు వానికి హృద్గతములు కాకపోలేదు. పృథ్విలో మనుష్య జీవనమున క్షీణస్థాయియై యుండు దారుణ యాతనాబంధురమైన తత్వ మెట్టిదో కూడ అతడు గ్రహింపగలిగినాడు. ఇంచుక ఆశాన్వితుడు కాజాలినాడు.

"కవిరాజువలె వైద్యం చేయాలనే వాంఛ ఎంతకాలమునుండియో నా మనసున ప్రగాఢమై వున్నది. విదేశ చికిత్స అద్భుతోన్నతి నందడం నిక్కమే! కాని, యీ అన్యదేశ ఔషధములు మనదేశవాసుల ధాతువులకు సరిపడవు. వాటి పట్ల ఉగ్రములై పనిచేయును. మనము ఆ ఉగ్రతను సహింపలేము. క్రియకంటె ప్రతిక్రియయొక్క ఫలము గురుతర మగుచుండును."

నైరాశ్యపు తుపానులో గడ్డిపరకవలె నెగయు ఆశను పట్టుకొని వృద్ధు డుల్లసితుడైనాడు. కావున ముచ్చటతో ప్రసంగింపసాగినాడు.

వాని ధోరణి యిది: "నా మనసులోని మాటను హృదయమును విప్పి నే నెవ్వరితోను చెప్పను. తమ్ముడూ! విషయం తెలిసినదా? ఇది నా ప్రకృతిధర్మమని ముక్తకంఠంతో చెప్పలేను. నా మనస్సు ఎట్లు చెరలాడుతుందో బిపిన్ యెరుగడు. వానితల్లికిని తెలియదు. బిపిన్ పెద్దకొడుకు ఎం.ఏ. చదువుతున్నాడు. ఆధునికపంథి అతడు. వానికి కూడ ఈరీతి మనస్తత్వము సంబోధకము కాదు. నేను చెప్పినదానిని వారు కాదనెదరని చెప్పలేను. ఇట్లని నే నెరుగుదును. నోరు తెరచి ఎవ్వరూ ఏమీ పలుకరు. కాని లోలోపల వారు నా మాటలను వంట బట్టించుకోలేరు. తమలో తామేమో గొణుగుకొంటూ వుంటారు. బలవంతముగ నా ఊహాలను వారి చిత్తములపై రుద్దవలెనని నే నెన్నడూ ఊహింపను. ఈ విషయముల నిట్లుండనిమ్ము...."

"ఈ యెక్కిళ్లు తగ్గించేందుకు నా వద్ద ఔషధ మేమీ లేదని నిన్న డాక్టర్లందరూ ఏకగ్రీవంగా చెప్పినపుడు నీ మాట వారితో చెప్పినాను. ఈ ఉదయమున రమ్మని వారి కాహ్వానము పంపినాను. వారు వస్తారు. ఆసుపత్రి డాక్టరు ప్రద్యోతుడు, హరేన్ మున్నగు వారు కూడా వస్తారు. సోదరా! మీరందరూ బాగా ఆలోచించి సరియైన వ్యవస్థను నిర్ణయం చేయండి."

జీవన మహాశయుడు గభీరుడై ఇట్లనినాడు: "నీ కొడుకు యెక్కిళ్ళను పోగొట్టేందుకై నన్ను పిలిపించినారు మీరు. అందుకై తగు వ్యవస్థ నేను చేయనే చేసినాను. అవి తగ్గిపోయినవి. సాయంకాలము లోపుగా అవి పూర్తిగా తగ్గిపోగలవని ఆశపడుతున్నాను. పిదప ఈ వ్యాధి మరల ప్రకోపించకుండేందుకై ఒక మార్గమును కనిపెట్టవలెను. ఆయుర్వేదవైద్యము మా యింట బుట్టినది. నా యొంట బట్టినది. ఆలోపథిక్ వైద్యంలో చేయి దూర్చినాను. సోదరా! ఒక మాట చెపుతాను వినుము. రెండింట చేయి జొనుపువాడు రెంటికి చెడిన రేవడియై తీరును. రెండు పడవలలో రెండు కాళ్ళుంచి ప్రయాణం సాగించడం ఎలా ఉంటుంది? ఐతే ఆయుర్వేదము లేకపోతే ఆంగ్లవైద్యం, రెండింటిలో దేనినో ఒక దానిని చేపట్టవలెను, ఎవరైనా ఈ మాట చెప్పి తీరుతారు."

ఇంచుక ఊరుకొని అత డిట్లనినాడు.

"నేనిక ఈ చోటున ఉండలేను. నా యింటిలో కొందరు రోగులు వచ్చి కూర్చున్నారు. చండీమందిరమండలి మహంతును చూచేందుకై ప్రాతఃకాలమున పోతిని. బిపిన్‌ను ఒక పర్యాయం చూచిపోవాలని మార్గమధ్యంలో మనసులో తట్టింది. వాని యెక్కిళ్లు తగ్గినందుకు నా మనస్సు కొంచెం కుదుట పడింది. నేను మరియొక పర్యాయం అతగాణ్ణి చూచి పోతాను. తరువాత తక్కిన డాక్టర్లు వచ్చి వాణ్ణి పరిశీలిస్తారు. వారేమి చెప్పుతారో తరువాత నాకు వినిపింపుము."

వృద్ధుడైన రతన్‌బాబు విషణ్ణుడైనాడు. కాని సాధ్య మగువరకు హృదయస్థమైన ఉద్వేగమును అణచినాడు. ప్రసన్న వైఖరితో ఇట్లనినాడు.

"మరొకమారు మా వాణ్ణి చూచిపో. నీవేమి చెప్పెదవో దానిని తక్కిన వైద్యులకు తెలుపుతాను."

బిపిన్ నిజముగ ఇంచుక తేరుకొన్నాడు. అతడు పూర్తిగా బాగుపడ గలడనే ఆభాస జీవనదత్తు నాడియందు చూచినాడు. కాని యీ మాత్రపు ఆభాసను పురస్కరించుకొని ఆశాన్వితుడు కాజాలు వయస్సు దాటిపోయినది.

"అతడు బాగుపడుననే నేను ఆశపడుతున్నాను. కాని యీ నయము చిరస్థాయి కావలెను గదా!" అన్నాడు జీవనుడు.

"ఇపుడు నాడివలన ఏమి బోధపడుతోంది!"

"బోధపడిన దానిని చెపుతున్నాను. నీవంటి వానివద్ద దేనినిగాని మరుగు పరచడం అసాధ్యం. దాపరికం నా ప్రకృతికి ప్రతికూలం. నిన్ను నే నెరుగక పోను."

రతన్‌బాబు పెద్ద నిట్టూర్పు విడిచినాడు.

చిరునవ్వుతో జీవను డన్నాడు. "రతన్! నిరాశ కలిగించే మాటను నే నేమీ చెప్పలేదు. ఈ సుగుణం సుస్థిరమైతే, బిపిన్ లేచి తిరుగుననే ఊహను నేను ప్రకటించాను. ఎక్కిళ్లైతే నేడే నిలిచి పోవును. మరి దుష్టగుణము లేమీ చెల రేగని యెడల పది పన్నెండు రోజులలోనే అతడు జెబ్బ కొట్టి మసలగలడు. మరి రోగము మళ్ళకుండా వుండేందుకు ఒక్కటే ఉపాయం. రోగి అప్రమత్తుడై వుండాలి. ఈ మందనీ ఆ మందనీ చేతికి దొరికిన గడ్డిని నోట గరచుచు చిత్తము వచ్చిన రీతిగా మసలరాదు సుమీ. ఇంటిపట్టున ఉండాలి. శ్రుతిమించిన పరిశ్రమకు అతడు దిగరాదు."

రతన్‌బాబు "అసలు తెవులుకు కారణ మది. మాటిమాటికి హెచ్చరిస్తూనే ఉన్నాను. కాని వాడు నా మాటను చెవిబెట్టడు. ఏం చేస్తాను? చేతి కందినవాడు. పదుగురిలో గణింపదగినవాడు. వాడి జీవితంలో ఎక్కడా, ఏ ఘట్టంలోనూ దోమ వాలలేదు. అమితాచరణ గాని, దురాచరణ కాని, అన్యాయం గాని యెరుగడు. నోటి చపలత్వం యెరుగడు. అన్యాయపథంలో అర్థోపార్జన చేయాలనే మక్కువ లేనివాడు. విషావస్తువు దేనినీ అంటడు. ఎన్నడూ సిగరెట్టు ముట్టి ఉండలేదు. మా నాయన కోప మంటూ యెరుగడు. అల్లరచిల్లర బ్రతుకుకు దూరస్థుడు. తన ప్రాక్టీసేమో తానేమో! అంతకు మించి అతడేమీ యెరుగడు. అయితే నీతో మనసు విప్పి చెపుతున్నాను. డబ్బు కక్కుర్తికై దిగేవాడు కాదు. కాని కేసులమ గురించిన పిచ్చి మాత్రం ఉన్నవాడు. ఈ కోర్టునుండి ఆ కోర్టు, ఆ కోర్టునుండి యీ కోర్టూ, వీటి మధ్య తిరుగుతూ వుంటాడు. నెలకు రెండు మూడు పర్యాయములు హైకోర్టు తొక్కి చూస్తాడు. పెద్ద కోర్టులో కేసు నెగ్గించుకోవాలని పట్టు పడుతూ వుంటాడు .. ఈ ఉన్మాదం కొంచెమైనా తగ్గలేదు. ఇల్లు తొక్కి చూడడు, సంసారం చూడడు. పెండ్లాము బిడ్డలను కన్నెత్తి చూడడు. సంసారభారము యావత్తూ నా తలపై పడవేసి తిరుగుతూ వుంటాడు. నే నెన్నిపర్యాయములో చిలుకకు చెప్పి నట్లు చెప్పి చూచాను. బిపినూ! ఈ పద్ధతి నీకు శత్రువు సుమా! శత్రువుకి ఆశ్రయం ఇవ్వకు. ఇచ్చిన యెడల, రిపురోగమై దేహమును పట్టి వేస్తుంది. మన స్సును నొక్కి వేస్తుంది. తుదకు తండ్రినై ఏ పుట్టి మునుగుతుందో చెప్పలేక పోతున్నాను సోదరా!" అన్నాడు.

జీవనదత్తు "ఈ విషయాలు మనసులో పెట్టుకొని బెంబేలుపడకు. ఇపుడు లేచి బట్ట కట్టుకొని తిరుగనియ్యి; తనంత తానే జాగ్రత్త పడతాడు" అన్నాడు.

కుర్రవా డొకడు వచ్చి నిలిచి, "డాక్టరుగారూ! మీ ఫీజు మీరు తీసు కోండి" అన్నాడు.

అతగాడు బిపిన్ పెద్ద కుమారుడు. ముద్దు ముచ్చటలు గొలుపువాడు.

"బాబూ! నాలుగు రూపాయలు తెచ్చినావెందుకు? నా ఫీ రెండు రూకలు మాత్రమే!"

రెండు రూకలను పిల్లవాని చేతినుండి తీసికొని, జేబులో వేసుకొని జీవన దత్తు వీధిని బడినాడు పిల్లవాడు అతని వెంటబడి "అయ్యగారూ! డాక్టర్లు వచ్చేటప్పుడు మీ రెక్కడుండరా?" అని అడిగినాడు.

"నేనా? నే నుండి ఏమి చేస్తాను?"

"మీ అభిప్రాయ మేమో చెపుతారు కదా!"

"నేను కేవలం ఎక్కిళ్లు తగ్గేందుకై మందిచ్చాను. రోగచిహ్నాములలో అవి ఒక్కటని గణించాలి. మూలచికిత్సను వాళ్ళు చేస్తారు." అని జీవనడాక్టరు నవ్వినాడు.

ఏమీ పలుకక బాలుడు నిలిచియే యున్నాడు. "వారు వచ్చునప్పటికి ఒక పర్యాయం దయచేయరా,"

"వస్తాను, మంచిది. వస్తాను,"

డాక్టరు నిష్క్రమించాడు.

బహుశః బిపిన్ ఇక బ్రతుకడు. శారీరక స్థితి ఇంచుక మెరుగుగా ఉండడం నిజమే; కాని జీవనదత్తు నేడు నాడీ పరీక్షచేసిన తరువాత మృత్యువు ఆసన్న మవుతూన్నదని గ్రహించాడు. ఆసన్న మవడమేమి? వచ్చి సమక్షమున నిలిచి ఉన్నది. చావు ఛాయ పడుతూంది. రతన్‌బాబు విషయం దత్తు ఆలోచించాడు. పాపము వాని గుండెపై గట్టి దెబ్బపడి తీరుతుంది. డాక్టరు తన సొంత విషయం ఆలోచించుకొన్నాడు. తన కొడుకు వనవిహారి మరణించాడు. వానిది బిపిన్ వయసే. తరుణవయసులోనే ఆతడు జారిపోయినాడు. తెన్ను దప్పి నడచి దురాచారములకు చిక్కి, మద్యపానమునకు మరగి, దానికి అనుషంగికములైన అనాచారములందు బ్రతుకును దొరలించి అతడు మిక్కిలి స్రుక్కిపోయినాడు. మీదుమిక్కిలి మలేరియా పాలబడినాడు. అందుచే అతడు మరింత క్షీణించి పోయినాడు. బిపిన్ సత్తువకు మీరిన క్రియాకలాపమందు తలదూర్చి ఒళ్ళు పాడు చేసికొన్నాడు.

రతన్‌బాబు మాటలు దత్తు స్మరణకు వచ్చినవి. "ఇంటిలో కాలు పెట్టడు. సంసారముపై చూపు లేదు. ఆలుబిడ్డల మాటెత్తడు. ముద్దుముచ్చటలతో వారితో కాలక్షేపము చేయడు. అన్నప్పుడూ పనులే, దావాలే. నాయనా! బిపిన్! ఈ పనులన్నీ నీ రిపులే సుమా!" అని ఎన్నెన్ని పర్యాయములో కన్న తండ్రి అభినయ పూర్వకముగా కొడుకుతో చెప్పినాడు.

అవి శత్రువు లనుట వాస్తవము. మిగుల భయంకరములైన శత్రువులు. వాటి అనుభూతి యెట్టిదో దత్తు స్వయంగా పరీక్షించాడు. వాని నాడిచూచి మృత్యు

కాంత సాక్షాత్కరిస్తున్నదని ఆతడు గ్రహించాడు. కొడుకు అస్తమించిన పిదప జీవనదత్తుకు మతిపోయింది. మందులపై వానికి వెగటు పుట్టింది. కాలము త్రోసు కొనివచ్చి వాని బ్రదుకు కృశించి, క్షీణిస్తున్నదని ముక్తకంఠంతో ఘోషింప సాగింది. నేడాతని అవస్థ గజభుక్త కపిత్థము వలె ఉన్నది. నిజము చెప్పవలె నంటే ఇదియే ఆతని మృత్యువు.

"రతన్‌బాబు పిల్లవా డెలా వున్నాడు?"

"ఓహో! సెతాబా!"

సెతాబు యింటిదరి దత్తు చేరుకొన్నాడు. అట్లని గుర్తు పట్టలేకపోయినాడు.

"ఎలావుంది వానికి?"

"ఎలా ఉందని చెప్పను! నేను వానిని పరీక్షించడం లేదు. పెద్దపెద్ద డాక్టర్లు పరీక్షిస్తున్నారు. ఎక్కిళ్లు తగ్గించేందుకై నన్ను పిలిచినారు. అవి తగ్గి పోయినవి. సంధ్య అగునప్పటికి అవి బారుగ సర్దుకొనిపోవచ్చును."

"నాడి చూచినావుకదా!"

"చూచాను"

"ఏమి చూచావో మరుగుపరుస్తున్నావేం?"

"ప్రద్యోత డాక్టరు కేసు చేపట్టినపుడు నోరు తెరచి నే నేమి చెప్పినా బాగుండదు. ఈరోజుల్లో వారి మందులు ఏం పనిచేస్తాయో నేనేం చెప్పగలను?"

"అవును. నీవు చెప్పింది వాస్తవమే! అయినప్పటికీ మనం జ్ఞాపక ముంచుకోవలసిన విషయ మిది: రతన్‌బాబు మన ఊరివాడు. మన ఇంటివాడు. అందుచే మరింత మనసుంచి పని చేయాలి. అతడు మంచి సంపన్నుడు. గట్టి వైద్యం చేయించగల సమర్థుడు. పిల్లవానిని కలకత్తా తీసుకొనిపోయి వైద్యం సాగించ వచ్చును గదా?"

"అసలు కలకత్తానుండి రోగిని రప్పించడం గొప్ప తప్పైపోయింది. అచట ఉండిపోయినయెడల అతడు బాగుపడేవాడు. విశ్రాంతికై ఉబలాటపడి వచ్చినాడు. కాని హఠాత్తుగా తెగులు ముంచుకు పోయినయెడల ఏమవుతుందో అత డూహింపలేదు. తుదకు అట్లే అయింది! ప్రపంచంలో దీర్ఘకాలం వైద్యం చేసి, చేసి నేను గ్రహించిన విషయ మిది: ఒక్కొక్కప్పుడు మనుజుడు భ్రమలో

పడవచ్చును. తప్పటడుగులు వేయవచ్చును. సేవలో లోపము ఏర్పడవచ్చు. అది కావచ్చు. ఇది కావచ్చు కలకత్తామాపెత్తడంసబబుకాదు. వానిని కదపడమే కష్టం. అయితే''

మాట కడ్డువచ్చి "అయితే ఏమి?'' సేతాబు అన్నాడు. తానేమో చెప్ప దలచుకొన్నాడు. కాని వాని నోరాడలేదు. ''నేను చెప్పగూడనిది చెప్పడం లేదు. ఏమి చెప్పాలో నాకు తెలియడం లేదు." కాని నాకు ఆశ ఆవంతైనా అగపడడం లేదు. అని జీవనదత్తు వేడినిట్టూర్పు విడిచినాడు.

పిదప ఇరువురు ఏమీ మాట్లాడక కూర్చున్నారు.

ఆకస్మికంగా డాక్టరు లేచి ఇట్లన్నాడు: 'ఇక నేను వెళ్లాలి. ఇంటిలో రోగులు వచ్చి కూర్చున్నారు. చండీమందిరం దాపున నుండి పోతాను. మహంతు బ్రతుకు కూడా అట్టిట్టు లాడుతూంది, తెలుసా?''

''అవును. విన్నాను. ఈ వేళ సన్యాసి కొంచెం బాగుపడవచ్చు. విశి బ్రాహ్మణి చండీమందిరానికి అమ్మవారిమందిరంలో నీళ్లు పోసేందుకు వెళ్ళింది. మహంతు మాట ఆమె చెప్పుతోంది. ఒక్క మోతాదు మందిచ్చి శశి ఆతని ఒళ్లు కొంతకు కుదుట పరిచినాడని విన్నాను. రేపు ఏదైనా పథ్యం పెట్టవచ్చునని డాక్టరు చెప్పినట్లు ఆమె తెలిపింది. బహుశ శశియే రోగిని చూచుకొంటాడు.''

మాట విని జీవనదత్తు చకితుడైనాడు. శశియే రోగిని చూచుకొంటాడా?

హతభాగినియైన బాలింత విషయం దత్తుకు జ్ఞాపకమునకు వచ్చింది. క్షీణించిన ఆమె మొగము వాని కన్నులెదుట సాక్షాత్కరించి నట్లాయెను. పాపము వయసురాని పచ్చి బాలింతరాలు. ఆమెను మట్టు పెట్టేందుకై శశి నడుము కట్టినట్లున్నది. అతడు పాపియై పోతున్నాడు. వెంటనే మరొక తరుణీముఖము వాని అంతర్దృష్టికి గోచరించింది.

సెతాబు "నిన్న నీవు శశి సోదరుని చూచినావా? లంఖణాల విషయ మేమైనా చెప్పినావా?" అని అడిగెను.

''చెప్పినాను. మా ఆయుర్వేదములో అదే ప్రసిద్ధి కెక్కిన ఔషధం. కాని ఆ మాట అటుండ నిమ్ము. గణేశ భట్టాచార్యుని కూతురు విషయం ఏమైనా తెలియ వచ్చిందా? నిన్న రాత్రి....''

''తెలిపింది. ఇప్పటి అవస్థ ఏమో ఎరుకపడింది. నాడి చూచి నీవు నిన్న నేమో చెప్పినావట కాదా?''

దత్తు చకితుడైనాడు. ''ప్రసవించిన పిదప నేను నాడి చూడలేదే! ఆసుపత్రి డాక్టరు........''

మాటల సందర్భంలో సెతాబు ఇట్లన్నాడు;

"ఆసుపత్రి డాక్టరు ఆమె నడుమును బిగించి వేశాడని విన్నాను. ఇంజెక్షన్ మీద ఇంజెక్షన్ ఇచ్చినాడట! ఆక్సిజన్ ఇచ్చినారట. ఇంకా ఆక్సిజన్ అవసరమై ఉందని గణేశ్‌తో అతడు చెప్పినాడట."

"ఇక వెడుతున్నాను" అని జీవనమహాశయుడు కదలినాడు ...'అతడు తరుణవయస్కుడు. వీరుడు. శక్తిగలవాడు. వ్యాధితో పోరుతున్నాడు. పోయి వానిని చూడటం మేలు' అని అతడు బిపిన్‌ను గురించి తలపోసినాడు.

పోతూ, పోతూ అతడు ప్రద్యోతడాక్టరును చూచినాడు. అతడు గంభీర ముఖుడై తన ఆఫీసులో కూర్చున్నాడు. గణేశుడు లేడు. వాని ఇల్లాలు వసారాలో జోగుతూ జోగుతూ కూర్చుని ఉన్నది. తటాలున ఉలికిపడి మేల్కొని దత్తుమహాశయుని చూచి గద్గద స్వరంతో ఏడుస్తూ ఆమె "బాబయ్యా! డాక్టరు బాబూ! నా మొర ఆలకించరా? ఒక్క పర్యాయం" అన్నది

"ఏడవవద్దు." అని గంభీరస్వరమున ప్రద్యోతు డన్నాడు. "అమ్మా! ఏడవవద్దు. దేవుడేమి చేస్తాడో చూడు. అంతా ఆయన చేతిలోనే ఉంది. అమ్మా!" అన్నాడు జీవనడాక్టరు. ప్రద్యోతడాక్టరు కనుబొమలు ముడిచి "మీరు ఒక పర్యాయం నాడి చూచిపోరా?" అన్నాడు.

"ఇక నాడీ గీడీ అవసరం లేదు. నేను ఈ దోవను పోతున్నాను. పోతూ, పోతూ ఒక్కసారి కబురు తెలుసుకొని పోవాలనుకొన్నాను." అని జీవనదత్తు చరచర సాగిపోవగలిగినాడు.

"కొంచెంసేపు కూర్చుని పోరా?"

"వీలుపడదు. ఇంటివద్ద ఇద్దరు ముగ్గురు రోగులు కూర్చుని ఉన్నారు. పోయి వాళ్ళను చూడాలి కదా?"

"మతి తల్లియొక్క ఎక్సురే రిపోర్ట్ వచ్చింది. చూస్తారా? విశేషం ఏమీ జరుగలేదు." అని చిరునవ్వుతో ప్రద్యోతడాక్టరు పలికినాడు.

"మంచిదేకదా! మీ దయవల్లనే ముసలిది బ్రతికింది." అని జీవన మహాశయుడు చరచర నడక సాగించాడు.

'బిపిన్ యెక్కిళ్ళు పూర్తిగా పోయి వుంటాయా?' అని ఆలోచిస్తూ అతడు నడుస్తున్నాడు. అట్లని ఆతడు రాయిగ్రుద్ది యెట్లు చెప్పగలడు?

# ఇరువదవ ప్రకరణము

దాంతుఘోసాల్ అరుస్తున్నాడు:

"ఉదయం ఎనిమిది తొమ్మిది గంటలవేళ వచ్చి కూర్చున్నాను. ఇప్పుడు పదిన్నర గంటలాయెను. నవగ్రామమునకు పదిన్నర గంటలకు పోవు రైలు కదలి పోయింది. ఇంకా ఇక్కడ చతికిలపడి కూర్చుండవలసివస్తోంది. ఏల జీవన మహాశయుడు ఇంకా బండనిద్రలో పడి ఉన్నాడు? అతగాడి ఉద్దేశమేమో? దేశంలో డాక్టర్లు కరవై పోయినారా? దాంతుఘోసాల్ అంతగా పనికిమాలినవాడా?"

"నవగ్రామంలో నలుగురు డాక్టర్లు గోళ్లు గిల్లుకొంటూ కూర్చున్నారు. ఛారిటబుల్ డిస్పెన్సరీ ఉంది. అందులో ఒకప్పుడు నాలుగే నాలుగు మంచా లుండేవి. తరువాత యుద్ధసమయంలో పది మంచాల ఆసుపత్రిగా తయారయింది. ఈ అభివృద్ధి బాగా ఛారిటబుల్ డిస్పెన్సరీలో అగపడింది. ఆ ఆసుపత్రిలో ఒక ప్పుడు ఒక చిన్న డాక్టరు ఉండేవాడు. ఇప్పుడు ఇద్దరు డాక్టర్లున్నారు. నర్సు కూడా వచ్చింది. అక్కడికి పోయి వచ్చానని చెప్పి ఒక మంచంపై పడిపోతే చాలు. వేళకు భోజనం తయారు. సమయానికి ఔషధం! ఎన్నిపర్యాయములు పిలిచినా డాక్టర్లు అగ్గగ్గలాడుతూ ఎదుట నిలుస్తారు. జాతికులభేదాలు మాత్రం సున్నై పోతాయి. గౌరవమర్యాదలను గురించి అంతగా చెప్పుకోనక్కర లేదు. ఈ తతంగం గాక ఇద్దరు కవిరాజులు పడి ఉన్నారు. వారిలో భూదేవ కవిరాజు ఆయుర్వేద పరీక్షల్లో చెప్పుకో తగినట్లుగా నెగ్గినవాడే. హోమియోపథిక్ వైద్యం చెయ్యగలవారు కూడ ఇద్దరున్నారు. అలిమహమ్మద్ అనే వైద్యుడొకడు తల యెత్తి నాడు. ఎచ్చటికి పోయినా ఎవ్వరూ సొమ్ముమాపెత్తరు. జీవనదత్తుకు పిచ్చెత్తి నట్లున్నది. లేకున్న రోగులు ఇంతసేపు పడిగాపులు పడుతూ గంటల కొలది కూర్చుండవలసి వస్తుందా? పాతకాలపు వైద్యుడనీ, నాడీపరీక్షలో గట్టివాడనీ, పెద్ద కుటుంబంలో పుట్టి పెరిగిన పెద్ద మనిషి అనీ వచ్చి వచ్చి అతగాడి పంచ చేరుకొంటున్నాం. ఈ విధంగా కాళ్లు పార జాపుకొంటూ గడియలు లెక్కపెటు

కొంటూ ఊరోగ్చేవలసివస్తే, ఇక ఈ గుమ్మం తొక్కేవా రెవరు? రేపు ఉదయమే లేచిపోయి భూదేవకవిరాజు కొంప చేరుకొంటాను. లేకపోతే హరేన్ డాక్టరు లేడా? ఏ దేశంలో చెట్లూ చేమలూ లేవో ఆ దేశంలో ఆముదపుచెట్టే కల్పవృక్షమై పోతుంది. ఒకప్పుడు డాక్టర్లకూ, వైద్యులకూ కొరత ఉండేది. కాబట్టి జీవన మహాశయుడు ధన్వంతరి అయిపోయినాడు, నాడీ విధానం తెలిసిన ఘటం! చేపట్టిన కేసు నెగ్గితే డప్పు వాయించేస్తాడు. పట్టిన కేసు పాడైతే నోరు మూసుకుంటాడు. ఒక్కొక్కప్పుడు కర్మఫల మని వేదాంతం చెపుతాడు. చావక ఎవడైనా బ్రతికి బట్టకడితే మరి పేచీయే లేదు. ఇపుడు ఈ ప్రాంతం అంతా ప్రద్యోతడాక్టరు చేతుల్లో పడిపోయింది. ఇపుడు మజా తెలిసిపోతుంది....మతి అనే కార్మికుడు తన తల్లిని వర్ధమాను ఆసుపత్రిలో ప్రవేశ పెట్టినాడు. ఆమె పాదము ఫోటో తీయబడింది. విరిగిన పేడు అగపడింది. డాక్టర్లు దానిని కోసి బయటికి తీస్తారు. దానితో ఆ నొప్పి సర్దుకుంటుంది. ముసలిది బ్రతికి బాగుంటుంది. ఆమె వచ్చిన పిదప మళ్ళీ దత్తుగారిచే నాడి చూపిస్తాం. అపుడతడు హయిసర్‌మజ్జా అని మింటి మీదికి ఎగిరి గంతువేస్తాడు కాబోలు!" అని ప్రద్యోత డాక్టరు పక్కన నవ్వుతూ పలికినాడు. సంపాదనము శుద్ధ పూజ్యము. ఇంటిలో తండులాలు మరింత పూజ్యము. వంటింటిలోని కుండలు డీడిక్కీ కొట్టుకొంటున్నాయి. రోగుల మంచాలు మరింత మూలుగుతున్నాయి" అని ఏమేమో దాంతుఘోసాలు తన ధోరణి సాగించాడు.

నంద్ వెలుపలికి వచ్చి, "ఏమోయీ ఠాకూర్! ఈ పిచ్చివాగుడు కట్టిపెట్టడం మంచిది. చిత్తము వచ్చిన రీతిగా నాలుకను ఆడించడం తగునా? అని అడిగినాడు.

కాని వాని మాటలు ఘోసాల్ చెవికందు పడలేదు. "అరే అబ్బీ! గడకర్రవలె గిడసబారి ఉన్నావు. రుబ్బురోలు కంటె నీవు గట్టిఘటమవు. ప్రొద్దున నుండి ఒకేరీతిగా అరుస్తున్నాను. గొంతు ఎండిపోయింది. కాస్త తంబాకు నామొగమున పడవేయుమని మొరపెట్టుకొంటున్నాను. నా మొర నీ నెత్తి కెక్కలేదేమి? నీవు కడుపునిండా మెక్కుతూ తైతక్క లాడవచ్చునా? దత్తుగారి కొంప గుల్లచేసి వేస్తున్నావు. రోగులను ఇక్కణ్ణుంచి తరిమికొట్టి లక్ష్మిని వెడలకొట్టి తదనంతరం నువ్వు మోళీ కట్ట దలచినావా?" అని ఘోసాల్ మళ్ళీ అందుకున్నాడు.

పరాన్‌ఖాన్ అక్కడే ఉన్నాడు. వానికి కూడ ఇతగాడి ధోరణి నచ్చలేదు. "చూడు ఘోసాల్ బాబూ! నీ పంచాంగశ్రవణం బొత్తిగా బాగులేదు. గడ్డు జాడ్యాలు చూచేందుకై దత్తు డాక్టరు పోయినారు. అందుచేత ఆలస్యం అవడం అమ్మక్కా కాదు. ఈ విషయాలు తెలుసుకోక నువ్వు తారాజువ్వలాగు ఎగిరి పోతున్నావు. నీవు ఏమంటున్నావో ఎరుగవు. ఈ మిడిపిపాటు అన్నప్పుడూ తగుతుందా? ఎవరిని గురించి ఏమంటున్నావో యెరుగుదువా?"

"చిత్తం వచ్చినట్లు వాని ధోరణిని సాగనియ్యి. ఈ రీతి ప్రసంగం కాక మరొక రీతి ప్రసంగం వానికి సాధ్యం కాదు! సహజంగా అతగాడు విపరీత బుద్ధితో పుట్టినాడు. సర్వనాశనం విరుచుకుపడే సమయంలో అది మరింత ముదిరి పోతుంది. వినాశ కాలమంటే మృత్యుకాల మని వేరే వ్యాఖ్యానం చెప్ప నక్కర లేదు. ఈ ఘోసాలుకు పోయేకాలం వచ్చింది. అది ముంచుకు రావడం వల్ల యీ ధోరణి మించి పోతోంది." అని నవ్వుతూ జీవనమహాశయుడు పలికినాడు. ఈ మాటలు చెపుతూ అతడు ఆరోగ్యనికేతనమునుండి వెలుపలికి వచ్చినాడు. చండీ మందిరమునుండి వచ్చునపుడు, దొడ్డి దారిని ఆతడు పట్టవలసి వచ్చింది. పెరటి త్రోవలోనుండి కొంపలో ప్రవేశించి యిపుడీవల ప్రత్యక్ష మైనాడు.

దాంతు ఘోసాల్ ఒక ముహూర్తంలో కఠినమైన కొయ్యయై పోయినాడు. భయార్తవిస్మయ విస్ఫారిత దృష్టితో జీవన మహాశయుని చూడసాగినాడు. వాని నోటినుండి మాట రాలేదు. రెండుచేతులు శిథిలములై వ్రేలాడినవి.

జీవనదత్తు కుర్చీ దగ్గరకు లాగుకొని కూర్చుని ఇట్లన్నాడు; "ఈవేళ కొంచెం ఆలస్యం అయిపోయింది. చండీ మందిరములోని గోపాయి అస్వస్థుడై పడి ఉన్నాడు. ఆతనిస్థితి పరీక్షింపవలసి వచ్చింది. ప్రాతఃకాలమున లేచి ఆతని వద్దకు పోవలసివచ్చింది. నవగ్రామంలోని రతన్‌బాబు కొడుకు బిపిన్ పరిస్థితి కూడా మిగుల కఠినమై ఉన్నది. అందువలన అతగాణ్ణి కూడ చూడవలసి వచ్చింది. ఇక్కడకు వచ్చి కూర్చున్న రోగులస్థితి అంత అధ్వాన్నంగా లేదు."

దత్తు గడ్డము సవరించుకొనసాగినాడు. రోగులు అప్పుడు కూడా ఏమీ పలుకలేక పోయినారు. వారు తమ చూపులను యావత్తు దాంతు ఘోసాలుకు అప్పగించారు. మృత్యు శాసనమును తలపై వహించిన అభాగ్యునివలె ఘోసాల్ నిలిచియున్నాడు.

ఆకస్మికముగ గద్గద స్వరంతో ఆతడు "డాక్టరు బాబూ! ఏమంటున్నారు? నేను బ్రతుకనని చెబుతున్నారా?" అన్నాడు.

జీవన మహాశయుడు నిరాసక్తునివలె ఇట్లు అన్నాడు: "అయితే అబ్బీ ఈమాట విను. నీ రోగం కుదిరేది కానేకాదు. ఈ వ్యాధితో నీవు తుది యాత్ర సాగించవలసి వస్తుంది. ధన్వంతరి వచ్చినా నీ గొంతుకలో ఆయువు పోయలేడు. బ్రతికి బట్ట కడితే రెండు నెలలు లేక ఆరు నెలలు కాలం మాత్రమే! ఏళ్ళలో పడినప్పటికీ రెండు లేక ఐదేళ్ళకంటె ఎక్కువకాలం నీవు భూలోకంలో ఉండవు. ఈ ఘోషంతా నా కెందుకు?"

ఘోసాల్ కెవ్వున అరచినాడు. "చావు తప్పదా?"

"నీకు చావు మూడకపోతే తిండికై త్రాగుడుకై ఇంత ఉబలాట పడతావా? గంజాయికై, తంబాకుకై ఇంత ఉబలాట పడతావా? ఈ లక్షణాలన్నీ మృత్యువును సూచిస్తాయి. రోగంతో ఈ అవలక్షణాలు కలిస్తే మరణము ముందుకు దూసుకొని రాదా? నువ్వు ఇప్పుడు చచ్చినవారిలో జమ అయినావు."

ఘోసాల్ ఈ పర్యాయం తన యజ్ఞోపవీతం పుటుక్కున త్రెంపి "ఇదిగో! నా ప్రతిజ్ఞ వినుము. నా శాపం వినుము. నేను అసలైన బ్రాహ్మణ్ణి అయితే ఆరునెలలు దాటీ దాటకుండానే నీకు వినాశకాలం దాపురించి తీరుతుంది. ఒక బ్రాహ్మణుని కూతురు అభిశాపంవల్ల నీ కొడుకు చచ్చి ఊరుకొన్నాడు. ఇప్పుడు ఈ బ్రాహ్మణుని శాపంవల్ల నీవు నాశనమై పోతావు" అని హుంకరించాడు.

వెంటనే ఆరోగ్యనికేతనపు మెట్లమీదనుండి గుభాలున క్రిందికి దుమికి, రెండడుగులు ముందుకువేసి నిలిచి, వెనుకకు తిరిగి "నేను ఆసుపత్రిలోని పెద్ద డాక్టరు వద్దకు పోతున్నాను. ఈవేళే నేను ఆసుపత్రిలో రోగశయ్యపై ప్రవేశిస్తాను. నేను బ్రతుకుతానో లేదో నువ్వే చూస్తావు" అన్నాడు.

జీవన మహాశయుడు నవ్వుకొన్నాడు. "చూస్తానులే, పో" అన్నాడు.

కామిలరోగి ఒకడు ప్రత్యక్షమైనాడు. పసుపు పూసికొని వచ్చినట్లు అగపడినాడు. ఎన్నెన్నో మందులూ మాకులూ పుచ్చుకొని వచ్చినాడు. ఎవరో మంత్రించి మెడకు త్రాడు కట్టినారు. త్రాడు మిగుల పెద్దది. కాని దానివల్ల ప్రయోజనమేమీ కలుగలేదు. ఆసుపత్రికి పోయినాడు. అందువలన కూడా ఏమీ కలుగలేదు. తుట్ట తుదకు జీవనదత్తు దగ్గరకు హుటాహుటి వచ్చి పడినాడు.

"ఆసుపత్రివలన నీకు ఏమీ కలుగనప్పుడు, తెప్పిరిల్లేందుకు నీకు సమయం పడుతుంది. ఆయుర్వేదం మీద అభిమానం ఉండబట్టి ఇక్కడకు పరుగెత్తుకొని వచ్చినావు. కాని, నేను నా వైద్య వృత్తి వదలివేశాను. కొంతకాలం ఎట్లాగైతేనో వైద్యవృత్తి సాగించినాను. దానికి నీళ్లు వదలుకోవలసినవేళ వచ్చింది. ఇపుడు రోజులు మారిపోయినవి. కొత్త కొత్త చికిత్సలు బయలుదేరినవి. కొత్త రుచులూ, కొత్త పద్ధతులూ విజృంభిస్తున్నాయి. ఇవి ఏవీ నాకు గిట్టవు. మీదు మిక్కిలి నా ఉత్సాహం అడుగంటి పోయింది. ఏదో సంచికట్టు పుచ్చుకొని కొంత కాలం మిడికినాను. ప్రాతకాలపువారు ఒక రిద్దరు ఇంకా నన్ను పట్టుకొని ప్రాకు లాడుతున్నారు. అందుచే వారిపై ఒక చూపు వెయ్యక తప్పడం లేదు. నామాట నీ నెత్తి కెక్కిందా?" అని వాని నుద్దేశించి జీవనదత్తు పలికినాడు. చిరునవ్వు నవ్వినాడు. ఘోసాల్ వెఱ్ఱి కూతలు బహుశః ఇంకా పనిచేస్తున్నాయి.

"ఏమోయీ! ఒక సలహా చెపుతా విను. నువ్వు భూదేవ్ కవిరాజువద్దకు పో. వానిదగ్గర మంచి సంచికట్టు ఉంది. అంతేకాకుండా యీమధ్య ఆయుర్వేద కళాశాల ఒకటి తలయెత్తింది. కొందరు అందులో ఉత్తీర్ణులై వెలుపలికి వచ్చారు. ఆయుర్వేద వైద్యుడు తాను సొంతంగా తయారుచేసే ఔషధాలను వాడినపుడే ఏమైనా ప్రయోజనం అగుపడుతుంది. ఈ రోజుల్లో ఈ సూత్రం గమనించే వాళ్లెవళ్లు?" అన్నాడు జీవనదత్తు.

"బాబయ్యా! డాక్టరుగారూ! మీరు నన్ను ఒకకంట చూడాలండి. లేకపోతే నాప్రాణా లింక నిలువవండి. మా నాన్నా, మా అన్నయ్యా, మా కుటుంబం వాళ్లంతా ఈ వయసులోనే చచ్చిపోయినారండి. ముప్పది ఐదేళ్ళు, నలభైయేళ్ళ మధ్య జారి పోయినారండి. నాకు కూడా అలాంటిగతి పడుతుందని భయపడిపోతు న్నాను. నన్ను ఎలాగైనా బ్రతికించండి." అని అతడు వెక్కి వెక్కి ఏడ్వ దొడగినాడు.

"అబ్బీ! నువ్వు అలా బెంబేలు పడరాదు. చచ్చేరోగం నీ కేమీ లేదు. ఇక చావుబ్రతుకుల మాటంటావా? ఇదొక ఆశ్చర్యకరమైన విషయం. వాటిపై మనుష్యుని ఆధిపత్యం ఏమీ లేదు. వినలేదా? ఇంతకుముందే దాంతు ఘోసాల్ ఏమనిపోయినాడో? నా కొడుకుమాట చెప్పినాడుకదా! వాడు ఆయుర్వేదం చదువు కొన్నవాడు. అప్పుడే వైద్యవృత్తిలో ప్రవేశించాడు. ఇదేమి? నువ్వింకా ఏడుస్తున్నావు? మంచిది! మంచిది! నీకేసు నేనే చూస్తానులే. నువ్వు కూర్చో!

మనస్సు కుదుటపరచుకో! నేను మందు వ్రాసియిస్తా. భూదేవు దగ్గర కొని పుచ్చుకో! తరువాత నేనే యింటిలో తయారు చేసి ఇస్తాను. తెలిసిందా? అడల వద్దు. నీ రోగం కుదిరిపోతుంది. ఇంతగా భయపడుతున్నా వెందుకు?'' అని దత్తు గడ్డము సవరించుకొన్నాడు.

“పాపం ఇతడు బాగా భయపడినాడు. ఈ భీతి రోగం వల్ల పుట్టింది కాదు. వీడి తండ్రీ, అన్నా మొదలైనవారు సరిగా ఈవయసులోనే మరణించడంవల్ల భయం వీణ్ణి పీడించివేస్తోంది. పాపం వీడి అడలుపాటుకు కారణం లేకపోలేదు. ఇది విడ్డూరపు విషయమే!''

పరాన్ దగ్గరే ఉన్నాడు. ఇంచుక నవ్వుతో ఆ వ్యక్తి నుద్దేశించి ఆత డిట్లన్నాడు : “అబ్బాయీ! నువ్వింక భయపడ నక్కర లేదు. దత్తుమహాశయుడు ఇక భయం లేదని చెప్పివేసినాడుకదా! డాక్టరుబాబు వాక్కు వేదవాక్కు.''

పరాన్ గట్టినమ్మకం గలవాడు. ఈ నమ్మకమే వానిలో పని చేస్తుంది. అతనిలో కృతజ్ఞత కలదు. ఒకప్పు డతడు టైఫాయిడ్ జ్వరంవల్ల బాధపడినాడు. ఆ గడ్డువ్యాధినుండి అతగాణ్ణి జీవనదత్తు బ్రతికించాడు. అప్పుడాతని ఆర్థికపరిస్థితి ఏమీ బాగులేదు. ఏరోజు వెచ్చమునకు వలసిన పైకం ఆరోజున సంపాదించుకొనే వాడు. జీవనదత్తు యింటిలోనే పని సాగిస్తూవుండేవాడు. అప్పు దేమీ డబ్బు పుచ్చుకోక అతడు వానికి వైద్యం చేశాడు. ఆవిషయం నేడు కూడా పరాన్ మరచిపోలేదు. ఇష్టమైతే ఇపుడాతడు తన అవసరమునకై డాక్టరును పిలువగలడు. రోజులు వచ్చి బడ్డాయి. కాబట్టి రోజుకు నాలుగురూకలు డాక్టరుకు ఫీజు యివ్వవలసివచ్చినప్పటికి వానికి చీమ కుట్టదు. అయినప్పటికీ అతడు జీవనదత్తును విడిచి ఏ డాక్టరువద్దకు పోడు. అతడు కనబరచేది కేవలం కృతజ్ఞతయే కాదు. ఒక్కొక్కప్పుడు జీవనంతో దారుణయుద్ధం చేసే గడ్డుతెవుళ్లు శరీరాన్ని ఆక్రమిస్తాయి. అపుడు కృతజ్ఞత అంటూ రోగి ఏఒక్క వ్యక్తినీ పట్టుకొని ప్రాకులాడలేడు. గాఢమైన విశ్వాసము అప్పుడు చాల పనిచేస్తుంది. పరానులో అటువంటి విశ్వాసము కలదు.

తన్నింతగా విశ్వసించేవానిని,వాత్సల్యంతో చూడక ఎవరైనా ఉండగలరా? అయినను పరాన్ బీబీవిషయంలో జీవనదత్తుకు కొంత ఆతురపాటు కలిగింది. వానితో ఇట్లన్నాడు : “పరాన్! బీబీని ఒకపర్యాయం కలకత్తా తీసికొనిపోవడం మంచిది, ఇక్కడ అన్నివిధముల పరీక్షలూ ముగిసిపోయినవి. అక్కడ పరీక్ష చేయించి ఆమెను తీసుకొనిరా?''

దత్తు హితోక్తులు గంభీర భావబంధురములైనవి. ఏవేవో చులకనమాట లాత డుచ్చరింపలేదు.

"ఒకమాట చెపుతా విను. ఒకపర్యాయం ఆసుపత్రిలోని పెద్దడాక్టరుకు బీబీని చూపుము. ఎవరిచేత ఏమి వైద్యం చేయిస్తే మంచిదో అతడు చక్కగా సలహా చెపుతాడు" అన్నాడు దత్తు. ఆ హితవు ననుసరించి పరాన్ బీబీని ప్రద్యోత డాక్టరుకు చూపినాడు. ఆతడు చిరునవ్వుతో "ఈవ్యాధి మానసికమైనది. శారీరక మైనది కానేకాదు. మానసిక జాడ్యం కుదిర్చే డాక్టరు వద్దకు ఈమెను తీసికొని పోవడం మంచిది" అన్నాడు.

ఈ హితవులోని అర్థము జీవనదత్తుకు బోధపడింది. కాని పరాన్‌కు బోధపడలేదు. వాని హితవు అతగాడికి సరిపడలేదు. వాని బీబీ వానిముందల బాధ పడుతూ ఉంది. తా నామెకు సేవ చేస్తున్నాడు. కళ్ళతో చూచి చేతితో తాకి ఆమె వ్యాధి నాతడు పరీక్షించి గ్రహిస్తున్నాడు. ఆమెకు వ్యాధియే లేదని పెద్దడాక్టరు చెప్పుతున్నాడు!

ప్రద్యోతడాక్టరు మీద వానికి నమ్మకం కుదురలేదు. బీబీని కలకత్తా తీసికొని పోవడంకూడా వాని కిష్టం కలుగలేదు. జీవన డాక్టరును ఉద్దేశించి పరాన్ "స్వామీ! మీ యిష్టం వచ్చినట్లు చెయ్యండి. ఇది మృత్యువు కలిగించే రోగమా? అన్నాడు.

"ఆ భయమేమీ లేదు. ఆమె బాధపడుతోందని నీకీ హితవు చెప్పినాను."

"కొద్దిరోజులు బాధపడితేంగాక! మీ వైద్యం కాక, మీ మందూ గాక మరెవ్వరీ వైద్యమును, మందునూ నేను తలపెట్టను."

జీవనదత్తు వాని బీబీకి చికిత్స చేస్తున్నాడు. మూడురోజుల కొకపర్యాయం పోయి ఆమెను ప్రతిదినము చూస్తూనే వున్నాడు. "మందేమైనా మారుసారా? అని అతడు దత్తును ప్రశ్నిస్తూ వుంటాడు.

"మార్చనక్కర లేదు. ఇప్పు డేమి మందు నడుస్తున్నదోదానినే నడవనియ్యి."

"అది నడుస్తూనే వుంది. నిద్రపట్టేందుకు ఏమైనా మందియ్యండి. ఆమె కన్నులు ఒక్కపర్యాయమైనా మూతలుపడవు. రాత్రివేళ ప్రక్కపై దొర్లుతూ ఉస్సు రుస్సు రనుకొంటుంది. గడియ గడియకు చెంబెడేసి నీళ్లు తాగుతుంది. దాహ మంటే నమ్మండి. దాహం కట్టేందుకూ, నిద్ర పట్టేందుకూ ఏమైనా

ఔషధం యిస్తే సంతోషిస్తా" నని అతడు జీవనడాక్టరును ప్రార్థిస్తున్నాడు. ఈ వేళ కూడా అతడు మందుకొరకే వచ్చినాడు. కామిలరోగముతో బాధపడుతూ దుఃఖ పడుతూన్న రోగితో జీవనమహాశయుని ఔషధంలోని మహిమను గురించి అతడు నచ్చచెప్పుతూ ఉన్నాడు.

డాక్టరు రోగి తరువాత రోగిని చూస్తున్నాడు. అప్పు డొక దీర్ఘకాయుడు ఆతని సమక్షమున తటాలున నిలిచినాడు. సుమారు ఆరడుగుల పొడవుగల వ్యక్తి అతడు. "డాక్టరుగారూ: మీ రొక పర్యాయం నన్ను చూడాలండి." అని గంభీర మైన గళముతో అన్నాడు.

"ఏమోయీ పైల్మాన్! నీ కేమి వచ్చింది?"

"డాక్టరుబాబూ! ఏమి వచ్చిందో నాకు బోధపడడం లేదు. దగ్గూ, పడి సెమూ, మధ్యమధ్య జ్వరమూ! ఇవి నన్ను పట్టి పల్లార్చి వేస్తున్నాయి. వదలడం లేదు." ఇట్లని ఉతడు తన చేతిని చాపి డాక్టరు కందించినాడు.

అతడు దృఢకాయుడు. పరిణత వయసులోని వ్యక్తి. మహేశ పురము వాని నివాసస్థానము. పేరు రాణాపాఠక్. ఈ ప్రాంతాల్లో అతడు పెద్ద శాండో అని కీర్తి సంపాదించాడు. కుస్తీలో అత డజేయుడు. కర్రసామూ, కత్తిసామూ బాగా నేర్చినవాడు. నదీ ఘట్టాల్లో పెద్దపెద్ద పడవలను కదిలిస్తూ, తోస్తూ నడిపిస్తూ ఉంటాడు. అమ్మవార్ల ఆలయాల్లో మృగాలను బలి వేస్తూ వుంటాడు. వాని ఉద్యోగాలివి. కుస్తీ పోటీలు జరిగే పెద్దపెద్ద ప్రదర్శనము లందు రాణాపాఠక్ పేరు అందరి నోళ్ళ నలుగుతూ వుంటుంది. కాళీపూజా సమయములందు సయితము వాని పేరు ఉచ్చరింపబడుతూ ఉంటుంది. మహిషబలి నిర్వహించడంలో అతడు ప్రదర్శించే ధైర్యసాహసములను గురించీ, కౌశల ప్రజ్ఞలను గురించీ ప్రజ లెన్నెన్నో కథలు చెప్పుకొంటూ ఉంటారు. అతడు వసతి వాళ్ల కలవాడు. ఫలసాయ మిచ్చే నేలకు లోపం లేదు. వలసిన ధాన్యపు బస్తాలు వాని యిల్లు చేరుతూ వుంటాయి. నౌకాస్థలములందు కూడా అతడు జేబులు నింపుకొంటూ ఉంటాడు. అందుచే ఐహికమైన సుఖసంపదలలో ఆత డెట్టి లోపమును ఎరుగడు. మహేశపురంరేవు ఆతని చేతియందే ఉన్నదని చెప్ప వచ్చును. ఆ రేవునుండి మరే పడవ ఆవలకు దాటేందుకు వీలు లేదు. అత డెన్నడైనా, తలనొప్పివలనగాని, జ్వరంవలనగాని బాధపడినట్లు జీవనమహాశయుడు విని యుండలేదు. అతడు మొండిఘట మనీ గట్టి పిండ మనీ దత్తు ఎరుగును.

కావున రాణా నేడు ముందు నిలవడం చూచి ఆతడు మిగుల విస్మితు డాయెను. వాని చెహరాలో వైఖరిలో నేడు పెద్ద మార్పు అగపడుతోంది. కంటి కొలుకు లందు నల్లరంగు అగపడుతోంది. కండలు తిరిగిన వాని ఒంటినుండి యెముకలు ఒరుల కళ్ళబడుతున్నవి. వదలు అంగీ నుండి కంఠం కనబడుతోంది.

"బాబూ! నీ శరీరానికి మంచి పరీక్ష చేయించుకోవాలి. వర్ధమాను (బర్ద్వాన్) పోయి యావత్తు పరిశీలన జరిగేటట్లు చూడు. వెళ్లేందుకు వీలు లేకపోతే ఇక్కడే ఈ రోజుల్లో పెద్దపెద్ద పరీక్షల్లో ఉత్తీర్ణులైన డాక్టర్లచే దేహాన్ని పరీక్ష చేయించుకో! నీ వంటి వానికి ఈ నాటువైద్యం పనికిరాదు." అన్నాడు అతనిని ఉద్దేశించి. తల పంకించి రాణా ఇట్లన్నాడు. "ఆ పెద్దమనుషుల దగ్గరకు పోతే ఏవేవో పెద్ద కబుర్లు చెపుతారు. ఏమేమో అయిందంటారు. ఎన్నెన్ని పోకిళ్ళకో పోతారు. పెద్ద ప్రిస్క్రిప్షన్ జాబితా వ్రాస్తారు గుండె ఫోటో తీయక తప్పదంటారు. ఉచ్ఛిష్ట పరీక్ష అంటారు, మలమూత్ర పరీక్ష అంటారు. ఇలా చెయ్యి, అలా చెయ్యి అంటారు. ఈ తతంగాలు జరిగిన పిమ్మట చికిత్స ఆరంభిస్తారు. నా శరీరంలో కొంత లోపం ఘటిల్లిందనడం నిజమే! ఒక ఆడుదానితో పరిచయం కలిగినది. ఇప్పు డింత పరీక్ష యెందుకు? ఇన్ని పరీక్షలు అవసరములై ఉంటే, ఇక వైద్యం ఎందుకు? మీరు నా చెయ్యి చూడండి. ఇప్పు డేమి చెయ్యాలో చెప్పండి. ఔషధం ఇవ్వండి. మీరు చెప్పినట్లు మందు తాగుతాను. తరువాత తమ హస్తమహిమ యెలా వుంటుందో, నా ఆయుర్దాయం ఎలా నడుస్తుందో దేవు డెరుగును ఆ డాక్టర్లు సూది మందులు నాకు గిట్టవు. ఇంజెక్షనులంటూ ఒంట్లో పొతర్లు తవ్వుతారు. నా ధాతువుకు ఏ మందు అవసరమో యోచించి యివ్వండి.'' అన్నాడు రాణా.

"నా సంచికట్టు నా దగ్గరే ఉంది. కాని యిపుడు మంచిమంచి మందులు బయలుదేరినవి. అవి చాలా దొడ్డవి.''

"ఏమంటున్నారు మీరు?"

"ఆ ఔషధములు సేవించడంలో నీవు సిగ్గుపడ నక్కర లేదు రాణా! హరేన్ డాక్టరు వద్దకు వెళ్లు. గుండె ఫోటో తీయడం మంచిదని ఆతడు చెప్పిన యెడల నువ్వు కాదన వద్దు. ఎక్సరే తీయించుకొనిన, కళ్ళ కెదుట కనపడుతుంది శరీరస్థితి. వ్యాధి ఏ స్థితిలో ఉన్నదో స్పష్టంగా బోధపడుతుంది. ఒళ్లు బాగుపడిన పిదప కూడా మరొక పర్యాయం ఎక్సరే ఫోటో తీయించుకొన్నయెడల, వ్యాధి

బాగుగా పోయినదీ, లేనిదీ బోధ పడుతుంది. ఇప్పుడు నీవు ఉపేక్ష చేసిన యెడల బుట్టలో అడుగున త్రాచువలె అది తరువాత బుసకొడుతుంది."

రాణా పాఠక్ తల ఊపినాడు. మరల మరల ఊపి ఇట్లన్నాడు: "అలా అయితే నేను భూదేవ కవిరాజు వద్దకు పోతాను. పెద్దపెద్ద డాక్టర్ల మందులు నా శరీరానికి పడవు. మీదు మిక్కిలి వారు ఎక్కువ దాహం కలవా రనడం నిస్సం దేహము. మేమూ మనుష్యుల మనేమాట వారు జ్ఞాపక ముంచుకోరు. పెద్దపెద్ద పరీక్షల్లో పాసై వారు ఎక్కువ ఫీజు గుంజుతూ వుంటారు. మొదట్లోనే వారికి నైవేద్యం సమర్పించాలి. మీరు రోగిని బట్టి ప్రసంగం చేస్తారు. మీ మాటల్లో ఆదరం ఉంది. ఇంటిలోని వారిని చూచినట్లు రోగులను మీరు చూస్తూ ఉంటారు. పైగా నా బుర్ర సరిగా ఉండదు. అది గిర్రున తిరుగుతూ ఉంటుంది. ఎప్పు డెప్పుడు ఎవరితో నాకు కయ్యం పొసగుతుందో చెప్పలేను. కవిరాజులముందు కయ్యానికి చోటుండదు. రాళ్ళూ, గుళ్ళూ తలకు కట్టుకొని ఎవ్వరూ పుట్టరు. పుట్టినవాళ్ళు చచ్చి తీరాలి. నేడు గాకున్న రేపు. అటువంటప్పుడు వాడి నుడువులు చెవిబెట్టి, పాడుమాటలు విని విని చావడం యెందుకు?"

ఇట్లని రాణా అందుండి కదలినాడు.

"రాణా! ఓ రాణా!"

"ఏమండి?"

"విను. నేను మరొక సలహా చెవుతాను. ఆయుర్వేదం కోసమే చెవి గిల్లు కుంటానంటావేమో, అలా అయితే పాకుడియా వెళ్లు? సెన్ మహాశయులు మంచి కవిరాజులు. పెద్ద పేరు సంపాదించినవారు. విచక్షణశక్తి గల వైద్యులు. వారి వద్ద మంచి మంచి ఔషధాలు ఉంటాయి. వారి వద్దకు పో. బోధ పడిందా? నీ రోగము నిర్లక్ష్య పెట్టదగినది కాదు."

"చికిత్సకై పాకుడియా వెళ్లమంటారా?"

"అవును. వెళ్ళడం మంచిది. భూదేవ కవిరాజు చిన్నవాడు. అనుభవం లేనివాడు. అతగాణ్ణి వెంటబెట్టుకొని పోవడం మంచిది."

"చూస్తాను. చేతినిండా పైకం ఉండాలికదా! మీ వద్దకు వస్తే అంతగా చెయ్యి దులుపుకోనక్కరలేదనే కదా! కొద్దిపాటితో మీరు వైద్యం చేస్తారు. మరొక్క చోట ఈ ఆటలు ఎట్లు సాగుతవి?"

ఇట్లు పలికి రాణాపాఠక్ నిష్క్రమించాడు. అతడు శక్తిశాలియైన వ్యక్తి. విపులదేహము కలవాడు. భయం లేనివాడు. వన్యమృగాలతో సయితం కుస్తీ పట్ట గలవాడు. భీషణమైన తుఫానుతో పోరగలవాడు. అట్టివాడు నేడు అసహాయుడై పోయినాడు. మృత్యువు ఎదురైనపుడు మనుష్యు డేమి చేయగలడు?

జీవనమహాశయుడు దీర్ఘ నిశ్వాసమును విడిచినాడు. రాణావిషయం యోచి స్తున్నాడు. అత డనిన మాట అబద్ధం కాదు. దరిద్రదేశము. దరిద్రులైన దేశ వాసులు. డబ్బు ఎందుండి వచ్చును? డాక్టర్లు మాత్రం ఏమి చేయగలరు? వారు మాత్రం ఏమి తినగలరు? తన అవస్థను అతడు తలపోయసాగినాడు. నేడు ప్రొద్దుననుండి కష్టపడగా చేతికి నాలుగురూకల ఫీజు లభించింది. అతని తాత, తండ్రి, తాను—ఇంతకాలంనుండి సంపాదించిన యావత్తు సంపత్తి విశేషభాగం పటాపంచలై పోయింది. ఈ కాండ యీ పదిహేను, యిరవై యేండ్లలో జరిగి పోయింది. నే డతడు నిస్సహాయు డైనాడు. చెప్పుకోదగిన డబ్బు చేతిలో హుళక్కి. దౌర్భాగ్యం అతణ్ణి వరించింది. జీవనదత్తు యింటి అమ్మవారు తరు చుగా నొసలు చరచుకొంటూ ఉంటుంది. ఈ దారుణ పరిస్థితికి తానే ఉత్తరవాది అని ఆత డెరుగును. అతడు కాక మరెవ్వరు ఉత్తరవాదులు?

చప్పుడు చేస్తూ ఒక యెద్దుబండి వచ్చి గుమ్మం ముందు నిలిచింది.

"ఏరీ గురుదేవ్" అంటూ ఒకడు అందుండి దిగినాడు.

దిగినవాడు శశి. వాని కళ్లు ఎర్రగా ఉన్నవి. నేటి అపరాహ్ణసమయంలో అతడు మస్తుగా మద్యపానం చేశాడు. రామహరిని చూచేందుకై అతడు బయలుదేరి నాడు. రామహరి పరలోకయాత్రసలిపేందుకై సర్వసన్నాహాలు చేసుకొన్నాడు. "జ్ఞాన గంగ"కై (గంగాతీరమునకు పోయేందుకై) యావత్తు తతంగం యేర్పాటు చేసు కొన్నాడు. గతరాత్రి విషయాలు జీవనమహాశయుని జ్ఞప్తికి వచ్చినవి. మృత్యు కాంతను వరించేందుకై రామహరి పోతున్నాడు.

శశి నాలుగురూకలు జీవనదత్తు చేతిలో పెట్టినాడు. నాలుగురూకలు ముట్ట చెప్పి రామహరి యథేచ్ఛగా పరలోకయాత్ర సలుపగలడా? జీవనమహాశయు డాతనిని పోయి చూడవలెను. వాని స్థితి యెట్టిదో కనుగొనవలెను. శశి కడుపు నిండ మద్యమును పోసినాడు. రామహరి విషయం చెపుతూ శశి "అతగాడు వీలునామా వ్రాసినాడు. జీవనమహాశయుడు సాక్షిగా ఉండాలని" అన్నాడు.

"దాంతు ఘోసాల్ టపా కట్టితీరుతాడు. వానికి ఎందుకు వైద్యం చేశారు? ప్రద్యోతడాక్టరు వానిని తరిమికొట్టినాడు. అతడు ఏడుస్తున్నాడు." అని ప్రసంగం మార్చి శశి పలికినాడు.

"వాని ప్రకృతి మారునది కాదు. ప్రద్యోత డాక్టరు మాత్రం ఏమి చెయ్య గలడు? ఇంటిలో మీఅమ్మ అరుస్తున్నట్లుంది. ఎందుకో చూచి వస్తాను." అన్నాడు. అమ్మవారి అరపులు వానిచెవిని పడినవి.

ఆజన్మము దేనిని ఆమె ఆడిపోస్తూవుందో దానిని ఇప్పుడూ ఆడిపోస్తోంది. అతని తలవ్రాత నామె తూర్పార పడుతూంది. "ఏమి నా దురదృష్టం! నా మొగం మీద దేవుడు ఇలా వ్రాసిపెట్టినాడేమి?" అని నుదుటిని చరచుకొంటూ వున్నది.

నందుడు ఆప్రక్క ఏమీ పలుకక కూర్చున్నాడు. తల వంచుకొని కాలి గోటితో నేల త్రవ్వుతున్నాడు. వాడు ఉక్కిరిబిక్కిరియైపోయినాడు.

ఇద్దరిని పరిశీలించి మహాశయుడు "ఏమయింది?" అని ప్రశ్నించాడు.

"ఏమవుతుంది? ఏమీ కాలేదు".

"ఆ దాంతుగాడితో అలా ప్రసంగించడానికి మీ కేమి అవసరం కలిగింది? ఆస్పత్రికి పోయి. వాడేమేమో కూతలు కూసినాడు. డాక్టర్లు ఏమేమో వాగినారు. ఆ మాటలన్నీ నా చెవిలో పడినాయి." అని నందుడు పలికినాడు.

"చెయ్యి చూడడమే మీ పని అయితే నా చెయ్యి చూచి చెప్పండి" అని ఇల్లా లన్నది.

"నీ చెయ్యి చూడకుండా నీ సంగతి చెప్పివెయ్యగలను" అని అన్నాడు జీవనదత్తు.

"అయితే నే నెప్పుడు చచ్చిపోతానో చెప్పివెయ్యండి. ఈ యాతన నే నిక సహించలేను. ఇక ఓర్వలేను. మీరు న్యాయమునకు అవతారస్వరూపులై కూర్చున్నారు. రతన్‌బాబు నాలుగురూకల ఫీజు యిచ్చేందుకు సిద్ధపడినాడు. మీరు రెండు రూపాయలు మాత్రం పుచ్చుకొని రెండు యాకలు తిరిగి యిచ్చివేసి యింటికి వచ్చినారు. ఎవరైనా రోగి వైద్యమునకు వస్తే 'నువ్వు చస్తావు. చచ్చితీరుతావు' అని శాపనార్థాలు పెడతారా."

జీవనమహాశయుడు పకపక నవ్వి అందుండి లేచినాడు. ఆ నవ్వు విన్నప్పుడు అమ్మవారు నోరు మూసుకొన్నది. "అమ్మో! చచ్చేందుకుకదా

మనుష్యుడు పుడుతూ వుంటాడు. అందరూ మరణించేవారే! ఎవ్వరూ అమరులు కారు'' అన్నాడు మహాశయుడు.

''ఈ వేదాంతం నా దగ్గర కట్టిపెట్టండి. ప్రపంచంలోనివారి మాటను నే నెత్తడం లేదు. నాకు చావు ఎప్పుడు మూడుతుందో చెప్పండి'' అని అమ్మవారు అరిచింది.

''నేను మరణించిన తర్వాతనే నీవు కాటికి కాళ్లు చాచుతావు.''

ఈ మాట నిష్ఠురమైన పిడుగువలె ఆమెకు వినిపించింది. ఆమె నోటినుండి మాట రాలేదు. చతికిలపడిపోయింది.

''నీకు మృత్యువు ఎప్పుడు తారసిల్లుతుందో చెప్పలేను. చెప్పగలిగితే ఏ దినమున, ఏ తిథినాడు, ఏ ఘడియలప్పుడు నా ఊపిరి పోతుందో చెప్పగలిగేవాణ్ణి. మన వనవిహారి ఆయువు ఎప్పుడు అంతమౌతుందో నీతో చెప్పివేశాను. నీకు నమ్మకం కలుగలేదు. ఇప్పుడు నేనుచెప్పునది నమ్ముము'' అని జీవనమహాశయుడు అవ్వలకు పోయినాడు. శశి ఎర్రని కళ్ళతో ఆతనిని తేరి చూడసాగినాడు.

''శశీ! ఇక నడువుము.''

ఇంతలో శశికి స్పృహ వచ్చినట్లాయెను. ''నడవండి'' అని పలికి హఠాత్తుగ నవ్వి ''అయ్యా! మీరు నిజం చెప్పినారు. చావనివా రెవరు? అందరూ చచ్చేవారే! ఆ ఆసుపత్రిలో వున్న ఆ డాక్టరుగాడున్నాడే అతడు కూడా చావడా? '' అన్నాడు.

''నోరు ముయ్యి. ఈరీతిగా ప్రసంగించకు.''

''ఆహా! మనుష్యుడా! నువ్వెంత? నీ బ్రతుకెంత? ఈ రామహరే ఉన్నాడు. నవ్వుతూ నవ్వుతూ అతగాడు చావబోతున్నాడు,''

నిజముగా ప్రద్యోత డాక్టరు అగ్నిహోత్రునివలె మండిపడినాడు. గణేశ భట్టాచార్యుని కూతురును ఒకపర్యాయం చూచి, ఇంచుక ఆశాన్వితుడై అతడు తన ఆఫీసులో వచ్చి కూర్చున్నాడు. కూర్చున్నతడవుగా దాంతుఘోసాల్ వెక్కి వెక్కి యేడుస్తూ వాని కాళ్ళమీద పడినాడు.

ప్రద్యోతడాక్టరు పాదములను గట్టిగా పట్టివేసి ''ఓ డాక్టరుబాబూ! నన్ను బ్రతికించండి'' అని గోలుగోలున ఏడ్వదొడగినాడు.

''కాళ్ళమీదనుండి లే. నీ కేమయింది? నోరు విప్పి స్పష్టంగా చెప్పు. అలా అరుస్తావెందుకు?''

డాక్టరుబాబూ! నన్ను బ్రతికించండి. నే నింక బ్రతుకను."

"చచ్చేందుకు నీ కేమి కలిగింది?"

"మహాశయుడు చెప్పినాడండి—జీవన మహాశయుడు."

"ఎవరు? జీవనదత్తా?"

"అవునండి బాబూ! అవునండి. ఈ రోగం వల్ల చావు తప్పదన్నాడండీ అతగాడు. శివునిబాబు వచ్చినా, నన్ను బ్రతికించ లేడట.!"

"శివునిబాబు మాటెత్తుతున్నాడా ఆ కవిరాజు? అంతదూరం పోయినాడా? వాని తలకాయ పాడై ఉంటుంది."

"చిత్తమండి" అని దాంతు వెర్రి చూపులు నిగిడింప దొడగినాడు.

"లే, లే, నిన్ను సంక్రమించిన తెగు లేమో పరీక్ష చేస్తాను. ఈ గదిలో ప్రవేశించి, బల్లపై వెలకిలపడి ఉండు. ఏమయిందో చెప్పు."

ఘోసాలు చెప్పిన వృత్తాంతం యావత్తూ విని, కను బొమలు ముడివేసి, ప్రద్యోత డాక్ట రిట్లన్నాడు. "ఇదంతా వ్రాసి నా కియ్యగలవా?"

"చిత్తమండీ; వ్రాసి యివ్వగలను. వాడి జాతిని బట్టి ఆతడు అలా ప్రసంగించాడు."

"ఆ మాట ఉచ్చరించకు. జాతి మాటెత్తుతావెందుకు? అతడు మా జాతి వాడని ఎరుగవా?"

నాలుక కరుచుకొని దాంతు ఇట్లన్నాడు. "జాతి మాటెత్తనండి. నేను జీవనదత్తు మాట చెపుతున్నానండి. అతగాడు వట్టి రాయి. బండరాయి. కాని నేను బ్రతుకుతా నంటారా?" అంటూ ఘోసాల్ వెక్కి-వెక్కి యేడ్వ సాగినాడు.

"నీకు చచ్చేరోగం ఏమీ రాలేదు. ఔషధ మిస్తాను. పుచ్చుకో! నియమమును బట్టి నడుచుకో."

కంపౌండరు హరిహరుడు ప్రక్క గదిలో మందు తయారు చేస్తున్నాడు. ఆత డిట్లన్నాడు. "ఇతడు నియమమును బట్టి నడవలేడు. పిలిచి పిలిచి ఇతడు రోగం తెచ్చుకొంటాడు. నోరు కట్టలేని తిండిపోతు. రెండు రోజులు కుదుట పడితే చాలు ఎవరింటికైనా పరుగు పరుగున పోయి నేను ఈవేళ మీయింట్లో తిష్ఠ వేస్తాను. విస్తరి వేస్తారా? అంటాడు" అని పక్కున నవ్వినాడు.

"ఏమోయీ! నువ్వు ఆసుపత్రిలోనే ఉండి పోవాలి. ఉంటావా?" అన్నాడు డాక్టరు.

"అలాగే ఉంటానండి."

"దాంతు బ్రతకాలని అనుకొంటున్నాడు. చావడం వీనికి సుతరామూ యిష్టం లేదు. వీని నొక మంచంమీద పరుండ బెట్టుము" అని కంపౌండరుతో చెప్పి ప్రద్యోత డాక్టరు ఒక కాగితమును తీసికొని "ఈ కథ యావత్తూ మేజిస్ట్రేటుకు వ్రాసి పంపాలి. ఈ రీతిగా నాడి చూస్తూ అతడు మనుష్యులను పీడించి. పీడించి వదలుతున్నాడు. ఈ కాలంలో ఇది సహింపరాని ప్రవర్తన. ఇందుకు తగిన ప్రతీకారం జరిగి తీరాలి. "అన్నాడు.

కొన్ని నిముషాలు గడచిన తర్వాత సగము వ్రాసిన ధరఖాస్తును చింపి పార వేసి "చూస్తాంగాక!" అన్నాడు ప్రద్యోత డాక్టరు. "ఆ దత్తుకు కొంచెం పిచ్చెత్తి నట్లుంది. మృత్యుఘోషణ మొనరించి చావు పాటలు పాడుతూ అతగాడు మురిసి పోతున్నాడు. ఎంత అబ్బురపాటు! మృత్యువు పృథ్విలో ఉండడం నిజమే. ఇలా అని ఎరుగని వారెవరు? చావును చంపేందుకు మనుష్యుడు ఎన్నెన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. ఈ ప్రయత్నాలకు అంతు లేదు. అవి సాగి పోతూనే ఉన్నాయి. ఆవిష్కారము తరువాత ఆవిష్కారము తల యెత్తుతున్నది. ఇంతవరకు మృత్యువును ఎవ్వరూ దూరంగా నెట్టివెయ్యలేక పోయారు. నేడును మృత్యువు ధ్రువమే! తలచినపుడు గుండెలు దడదడలాడవచ్చును. ఈ ఘట్టంలో ఏదో ఒక ఆధ్యాత్మికమైన అర్థ మున్నదని గ్రహించాలి. మృత్యుదిన ఘోషణ ఉలికి పడజేయునది. ఇది. రోమేంటిక్ అనజెల్లును. కాని మిగుల నిష్ఠుర మైనది. సరిగ పశువును బలి చేయడం వంటిది. పూజ, అర్చనలు సలిపి భక్తికి సంబంధించిన ఆడంబరమును ప్రదర్శించి, ఆధ్యాత్మికతా ధూమ్రజాలాచ్ఛన్నమైన కథను ఒక కల్పమందలి వ్యక్తులు సృష్టిచేసి, మృత్యువుకు ముక్తి అని పేరుపెట్టి ఘోషణ మొనరించి, ఖడ్గాఘాత మొనరించుట ఎట్టి ఘోరాచారము! జీవనదత్తు ఈ క్రూర కాండలో పురోహితుడై కూర్చున్నాడు" అని ప్రద్యోత డాక్టరు తలపోసినాడు.

'హి మస్ట్ స్టాప్. అతనిచే ఈ పనిని మానిపించి తీరాలి. తనంత తాను బుద్ధి తెచ్చుకొని అతడీ కాండను ఆపక పోయిన యెడల ఆపించి తీరాలి. హి మస్ట్ బి స్టాప్డ్.' అనుకొన్నాడు.

"అర్చన చేసే పిల్లదాని నాడిని ఆతని చేతిలో పెట్టిన యెడల, అత డెట్టి అవాకులూ, చవాకులూ పలికేవాడో! ఆమెను ఆయనకు చూపక పోవడమే మంచి దయింది. ఈ దేశంలో మాంత్రికులకూ, రక్షరేకులు కట్టేవారికి కొదువ లేదు. వారి చికిత్స కూడా నడుస్తూంది. వా రే మేమో త్రాగిస్తూ ఉంటారు. ఈ వెర్రివాడు తన కొడుకు చచ్చి తీరుతాడని తన యిల్లాలి ముందు రాయిగ్రుద్ది చెప్పినాడు. ఎట్టి కఠినుడు. ఇది ఊహాతీతమైన ప్రవర్తన!" అని ప్రద్యోత డాక్టరు నిట్టూర్పు విడిచి, చేత సిగరెట్టు పుచ్చుకొని, తన గదిలో నుండి వెలుపలికి పోయి, నర్సుల ఆఫీసు దెస పోయినాడు. ఒక నర్సును బయటికి పిలిచి "క్రొత్తగా ఒక పేషంట్ వచ్చినాడు. ఆ ముసలిబ్రాహ్మణుని ప్రవేశపెట్టినాము. వానిపై ఒక చూపుంచి కనిపెట్టాలి. వాని స్టూల్స్ ఎగ్జామినేషన్ అవసరం. ఈవేళే పరీక్ష చేసి ఉంచు" అన్నాడు.

తరువాత వార్డు లన్నిటిని తనిఖీ చేసి, క్రొత్తగా తయారవుతూ వున్న భవనం ముందు నిలిచినాడు. ఈ భవనం చక్కగా నిర్మాణ మవుతూ ఉన్నది. డీసెంట్ బిల్డింగ్! నాలుగు వైపులందు నాలుగువింగు లున్నయెడల, అది మరింత చక్కగా ఉండేది. అలా కావచ్చు. అందుకు స్కీము న్నది. తరువాత ఆ భాగ ములు కూడా నిర్మాణ మగును.

నూతనకాలము విజ్ఞానయుగము. అదృష్ట, దురదృష్టములకు సంబంధించిన ఊహలు పిచ్చి నమ్మకములని కొట్టివేయు సమయము, వ్యాధులను మనుష్యుడు జయించి తీరవలె నను పట్టుదల ప్రాముఖ్యమును పడసిన కాలము. మృత్యువుతో మనుజుడు యుద్ధము చేయవలె నని ఏ సాహాయ్యమును పడయక మృత్యువుతో అమృతము నన్వేషించుచున్నాడు జీవనమందు అమృతసంధాన మొనరించు కాల మాసన్న మైనది. నే డెన్నెన్ని సన్నాహములో అవసరములై ఉన్నవి. వెంటనే వాటివలన సముచిత ప్రయోజనములను సంగ్రహింపవలెను.

జీవన మహాశయని నాడీ పరీక్ష తొల్లింటి సంప్రదాయము లోనిది.

ఈ దేశములో మృత్యువుతో కొందరు ప్రేమసంబంధములు కుదుర్చుకొని కుదురుగ కూర్చునియున్నారు గంగాఘట్టమునకు పోయి, శరీరమును గంగోదక మందు ముంచి మరణించటమే జీవన లక్ష్యమని పలువురు విశ్వసించుచుందురు.

మతి తల్లిని గురించిన ఎక్సురే రిపోర్టును చూచినపుడు ప్రద్యోత డాక్టరు కొండొక ఉత్సాహమును గమనించ గలిగినాడు. ఎక్సురే రిపోర్టును చేత బుచ్చు కొని, మతి బర్ద్వాన్ నుండి తిరిగి వచ్చినాడు. బర్ద్వాన్ డాక్టరు ప్రద్యోతనుని కంటె సీనియర్ అయినప్పటికీ, ఇరువురుకు గాఢ స్నేహము కలదు. ప్రద్యోతు డాతని కిట్లు వ్రాసినాడు. "యావత్తు రిపోర్టు తాము దయతో నా యొద్దకు పంపుడు. కారణ మేమంటే నే నీ కేసులో మిగుల ఇంటరెస్టెడ్. ఈ ముసలిదాని మరణము ధ్రువ మని ఒక వ్యక్తి రాయిగ్రుద్ది చెప్పి, బాజా బజంత్రీలతో ముందుగనే గంగా యాత్రకై శ్మశాన వాటికకు పంపేందుకు సర్వ సన్నాహాలు చేశాడు. ఇచ్చట తన ప్రభావమును మిక్కుటముగా చెలాయించే ఒక ఆయుర్వేదవైద్యుడు జ్ఞానవృద్ధుడు నాడి చూచి అప్పుడే టపా కట్టేందుకు ఏర్పాటు లన్నీ చేశాడు. కొన్ని నెలల్లో, కొన్ని రోజుల్లో, కొన్ని నిముషాల్లో, కొన్ని సెకండ్లలో ముసలిదాని ప్రాణ విహంగము పంజరమునుండి ఎగసి పోవునని అతడు ఘంటా పథంగా చెప్పి వేశాడు. ఘూటైన యీ ప్రవచనం వల్ల ముసలిది మరింత మంచము పట్టినది. పట్టుపట్టి బలవంతం మీద ఈ కేసును నేను ఆసుపత్రికి పంపుతున్నాను. నాయీ పూనికను చూచి ఇచ్చటి వాళ్లు నవ్వుకొంటున్నారు. నాడి పరీక్షించి, అవ్వ చావడం తథ్య మని జీవన డాక్టరు చెప్పివేసిన పిదప ఆమె ఇక ఎలా బ్రతుకుతుంది? ఎవ్వ రామెను బ్రతికించగలరు? అని వాళ్లు చెప్పు కుంటున్నారు."

ఈ కథలు యావత్తు ప్రద్యోత డాక్టరు గుండెలో పెద్ద అల్లరి చేస్తున్నాయి. అతని వేడికోలును మన్నించి, బర్ద్వాన్ డాక్టరు ఎక్సురే రిపోర్టు నకలును మతి చేతి కిచ్చి పంపినాడు. ఆ రిపోర్టును పరిశీలించినపుడు ప్రద్యోతనుని ముఖమున వ్యంగ్యహాస్యము కూడా ప్రస్ఫుటించింది. దానితో కొంత అసహ్యాభావము కూడా అగపడినది. పొంత నున్న పల్లెలో ఒక చెరువు పావంచాలపై పాకుడు వలన ముసలిది పడిపోయింది. కాలుకు దెబ్బ తగిలింది. చీలమండలం వాచింది. ఎముకకు దెబ్బ తగిలింది. ఆ ఎముక తొలగిపోయింది. అందుచే అవ్వకు ఈ గతి పట్టింది. దెబ్బతగిలిన తావును పరిశీలించి, కొంత శస్త్రచికిత్స చేసి మిగిలిన ఎముకముక్కను ఊడబెరికి వేయవలెను. మరేదైన యెముకభాగమును తీసివేయవలెనంటే, తీసివెయ్యవచ్చు. తదనంతరము ముసలిది లేచి కూర్చుంటుంది. ఈ మాత్రం పని చేయడంలో భయపడవలసిన దేమున్నది?

"నాడీ పరీక్ష! నాడీ పరీక్ష! నాడీ పరీక్ష!" ఈ మాటలు ఆ ప్రాంతమందు మారుమ్రోగుతున్నవి.

కడచిన సంధ్యాసమయమునుండి ఈ ప్రతిధ్వనులు అధికమైనవి. ప్రద్యోత డాక్టరు చెవియందా మాటలు గింగురుమనినవి. బి. కె. మెడికల్ స్టోర్స్ యజమాని వినయుని దుకాణంలో ఈ ప్రసంగధోరణి విశేషంగా పెచ్చిల్లిపోతోంది. ఆ వ్యక్తి ఒక విడ్డూరపు మనిషి. రక్తశోషణ మంటే వానికి మిక్కుటమైన ప్రీతి కలదు. ఒక అభాగ్యునకు వ్యాధి సంక్రమించిన యెడల వానిని పిల్చి పిప్పిచేసి, వాని నెత్తురును కడుపునిండ త్రాగుటకై సిద్ధపడేవారు కొందరుందురు కదా! ఈ అంగడి యజమాని మోసగాడు. మాయమందులు అమ్ముతూ ఉంటాడు. వాని నోరంత తేనె పెర. ధారలు ధారలుగా అందుండి తేనె కారుతూ ఉంటుంది. తప్పనిసరి పరిస్థితులలో ప్రద్యోతడాక్టరు వాని అంగడికి పోతూ ఉంటాడు. లేకున్న వాని దుకాణపు గుమ్మము త్రొక్కవలెనన్నా, వాని మొగం చూడవలెనన్నా ప్రద్యోతునకు రోత పుడుతుంది.

మిగుల జరూరైన ఇంజెక్షనుకు ఆర్డరుయిచ్చేందుకు ప్రద్యోతడాక్టరు నేడచ్చటికి పోయినాడు. రేపు సాయంకాలములోపుగా అది అంది తీరాలి. మరి రెండు మూడు ఔషధముల అక్కర కూడా ఉన్నది. వినయుని అంగడిలో ఒక విశేష వ్యవస్థ ఉన్నది. ప్రతి దినము రాత్రి పది గంటల రైలులో ఆ అంగడివాడు కలకత్తా పోతూ ఉంటాడు. ఉదయమున అచ్చట చేరుకుంటాడు. ఆర్డరు వస్తువులను కొని, అపరాహ్ణపు రైలులో తిరుగు ప్రయాణం సాగించిన యెడల, సాయంకాలమునకు నవగ్రామమును చేరుకోవచ్చును. ఈ పని యావత్తూ ఇరువదినాలుగు గంటల లోపుగానే జరిగిపోతుంది. అంగడివాడు హావురా వరకు నెలవారీ సీజన్ టికెట్టు కొని, యెప్పటి కప్పుడు పని నెగ్గించుకొంటూ వస్తాడు.

ఆ దుకాణంలో సమావేశమైనప్పుడంతా అన్వ విషయమే చర్చింపబడుతూ ఉండేది. మతి తల్లి కథ మహా భారతమై పోయింది. నిన్న ఉదయం జీవనదత్తు చేతిలో మరణించిన పిల్లవాని విషయం కూడా ప్రసక్తిలో ఉన్నది. బిపిన్ యెక్కిళ్ల సంగతి కూడా ప్రసంగధోరణిలో తల యెత్తింది. వినయుడు మందు అమ్ముతూ యెక్కువ లాభం చేపట్టుతూ ఉంటాడు. కాని అలోపథిక్ ఔషధము లంటే వాని కంతగా నమ్మకం లేదు. ఆయుర్వేద మంటేనే ఆతడు చెవి కోసుకొంటాడు. అపుడపుడు పెద్ద డాక్టర్ల నుద్దేశించి అలా యిలా చెపుతూ వుంటాడు. "మహాశయులారా! మీరు సాగించే వైద్యం మాట చెవి బెట్టుటకైనా నేను సమ్మతింపను. మీ రేమేమో పెద్దపెద్ద తతంగాలు చేస్తూ వుంటారు. రక్తపరీక్ష, మలమూత్ర

ఉచ్ఛిష్టముల పరీక్ష, ఎక్సురే యీ పనులు యావత్తూ జరిగిన మీదట మీరు చికిత్స ఆరంభిస్తారు. ఇక ఆయుర్వేద మంటారా ఒక పర్యాయం నాడి చూచి చెప్పి వేస్తారు. శరీర పరిస్థితిని కవిరాజులు పదునెనిమిది నెలల్లోనో, ఆరు నెలల్లోనో, లేక ఒక వారం రోజుల్లోనో, ఇంతలోనో, అంతలోనో వ్యాధి చేజిక్కే విషయము లేక చెయ్యిజారే విషయం చెప్పి వేస్తారు. చూడండి. మా జీవన మహాశయుని మాటే చెపుతాను....."

జీవనమహాశయుని నాడీ పరీక్షకు సంబంధించిన కథ లెన్నెన్నో ఏకరువు పెడుతూ ఉంటాడు "మతి తల్లి మాట. దత్తు ఫలానా ఫలానా అని చెప్పినప్పుడు...." అని ఏమేమో అతడు ఉపన్యసించాడు.

ఎక్సురే రిపోర్టునూ బర్ద్వాన్ డాక్టరు జాబునూ చూచుకొన్నప్పుడు ప్రద్యోత డాక్టరు మనస్సులో కొంత ఆశ పుట్టడం నిజమే. కాని యిందరిందరు ఇన్నెన్ని రీతుల ప్రసంగాలు చేస్తూ ఉంటే వాని మనస్సు చివుక్కు మంటోంది. చారు బాబు పదుగురాడు మాటలకే భళాభళి అంటూ ఉంటాడు. హరేన్ డాక్టరు పిన్నవాడు. అతడీ వాతావరణంలో పుట్టి పెరిగినవాడు. ఎల్లర సిద్ధాంతములు నిజ మని అతడు నమ్మెనని చెప్పలేము. తనకు నమ్మకం లేదని చెప్పే గుండెదిటవు వానికి లేదు. వాని బాల్యస్మృతి వానికి హృదయ దార్ఢ్యము నిచ్చేది కాదు. మృత్యువు చేతినుండి జీవనమహాశయు డతనిని కాపాడెనని అందరూ చెప్పుకుంటూ ఉంటారు. ఆశ్చర్య కరములైన కథ లెన్నెన్నో అతడు విన్నాడు. తన బాల్యజీవనమును గురించి అచ్చెరుపాటు కలిగించే వృత్తాంతములు అతడు విన్నాడు. కృతజ్ఞతతో అతడు మహాశయునకు ప్రణమిల్లుతూ ఉంటాడు.

మతితల్లి జీవిస్తుందనీ, దాంతు బ్రతుకుతాడని ఆ ప్రద్యోత డాక్టరు ఆశ పడుతూనే వున్నాడు. అతడు తన యింటిదెసకు మళ్లినాడు.

మధురగీతికారవము వాని చెవిలో పడినది. మంజు పాట పాడుతూంది. రమారమి ఒంటిగంటసమయ మది. వంటపని ముగిసింది. ఇక పనిలేదు. అందు వలన మంజు రాగాలాపనము చేస్తోంది. ఆమె జీవనము అబ్బురపాటును కలి గించేది. అది భావబంధుర మైనది. ఆమె జీవిత ప్రవంతి తరంగసంకులమై పొంగి పొరలుతూంది. ఎన్నెన్ని యుద్ధములో చేసి డాక్టరు ఆమెను చేపట్టగలిగినాడు. కాని వానియింటిలోనివారికి ఆ కాండ అంతగా నచ్చలేదు. వారి సంప్రదాయ ఘునతకు అనుకూలంగా ఆమె లేదు. "ఈ త్రిప్పులాడి ఎలాగో జొరబడింది

నట్టింట" అని వా రంటూఉంటారు. కాని డాక్టరుకు ఆమెపై మక్కువ యెక్కువగనే వుంది. సైకి లెక్కి తొక్కడం అత డామెకు నేర్పినాడు. పిస్తోలు పేల్చడం కూడా నేర్పించినాడు. మోటారు డ్రైవింగు కూడా నేర్పించేందుకు సిద్ధంగా ఉన్నాడు. ఆమె ముద్దుముచ్చటలకు ఆతడు అడ్డు వచ్చువాడు కాడు.

జీవిత మిట్లే ఉండవలెనని ఆత డెంచినాడు. 'గతిశీల, ఉల్లాసమయమై అది ఉండవలెను. సమస్తజీవానందము ఇందే వున్నది. దిస్ ఈజ్ లైఫ్' అని ఊహించినాడు. చీడీలపై బ్లీచింగు పవుడరు చల్లబడింది. దానితో కాలిజోళ్ల పరిశుభ్రం చేసికొని డాక్టరు మీది కెక్కినాడు. పైన ఒకప్రక్క సబ్బు, నీళ్లు, లోషన్, తువాలు తయారుగా వున్నవి.

ఏదో బండి చప్పుడు చేస్తూ మెల్లమెల్లగా వీధిగుండా వస్తోంది. బండిపై ఒక గుడ్డ కప్పబడి వుంది. ఈ ఆసుపత్రి ప్రక్కనుండియే రోడ్డు పోతుంది.

అది శ్రావణమాసము. ఆకాశములో మేఘములు సంచారం చేస్తున్నవి. రెండుజాములవేళ, ఛాయాచ్ఛన్నమై ఉండడం వలన వియత్తలమూ మ్లానమై వున్నది. మబ్బునుండి చినుకులు నడుమ నడుమ రాలుతున్నవి. బండిలో యవనికకు ఇంచుక మరుగున కూర్చున్న వారెవరు? పండిన గడ్డము, నెరసిన కురులు, మిగుల స్థూలమై వదలిన దేహము—అలా ఆ వ్యక్తి అగపడుతున్నాడు. మింటి మీది మబ్బును తేరిచూస్తూ ఆతడు కూర్చున్నాడు.

బండిచక్రాలు ఎక్కువ చప్పుడు చేస్తున్నవి. ఇటుకలపై ఇటూ అటూ ఊగుతూన్నవి. బండిలోని పెద్దమనిషి కూడా ఊగిపోతున్నాడు. వాని కన్నులందు పెరచూపు లేదు.

ఓహో! అతడు జీవనమహాశయుడు! పిలుపు రాగానే ఏ రోగినో చూచేందుకు పోతున్నాడు. ఎచ్చటికో!

# ఇరువదియొకటవ ప్రకరణము

అవును. అతడు జీవనమహాశయుడే! చండీగ్రామమునుండి పిలుపు రావడం వల్ల అతడు పోతున్నాడు. శశి తన రోగియైన రామహరిని చూచేందుకై పోతున్నాడు. జీవనదత్తు ఆకసము దిక్కునకే చూస్తున్నాడు. వాని చూపులు మబ్బుకు బిగింపబడినట్లున్నవి. గతుకుల తాకిడి వలన బండి కర్కశశబ్దంతో ఊగాడుతూ వున్నది. దానిని అతడు పట్టించుకోవడం లేదు. ఏమీ జరుగనట్లే కూర్చున్నాడు. ఇటులనే జీవనదత్తు బ్రతుకు నడుస్తూ వుంది. ఎద్దుబండెక్కి నపుడు ఈరీతిగా గభీరచింతామగ్నుడై లేక శూన్యమనస్కుడై మింటిదెస చూడ్కులు నిగిడిస్తూ అతడు కూర్చుని వుంటాడు. శశి వెనుకతట్టున కూర్చున్నాడు. ఏమేమో వాగుతున్నాడు.

''ఆడవాళ్ళంతా ఇదేరీతిగా వుంటారు. డబ్బు దండుగ. వారికి సుతరామూ ఇష్ట ముండదు.''

ఆ మాటలు జీవనమహాశయుని చెవులందు పడలేదు. నోరు విప్పక బండిలో అతడు చతికిలబడి వున్నాడు. ఇంటినుండి బయలువెడలేందుకు ముందు ఇంటి అమ్మవారితో అతడు చెప్పిన మాటలు శశి విన్నాడు. ఆ మాటలే వాని మనసులో అల్లరి పెడుతున్నాయి. 'ప్రద్యోతడాక్టరు కూడా ఎప్పుడో ఒకప్పుడు చచ్చితీరుతాడు.' వగైరా మాటలు ఇంకను వానికి వినబడుతున్నట్లున్నవి. రోగుల వద్ద ఫీజు పుచ్చుకోవడం విషయం గురించి కొంపలో గగ్గోలు పుట్టింది. పెద్దకాండ జరిగింది.

ఇంచుకసేపుండి శశి యిట్లన్నాడు. "వాళ్లు తమంత తాము వచ్చి చేతిలో పైకం పెడుతూ వున్నప్పుడు మీ రెందుకు పుచ్చుకోరు? ఇందులో దోష మేముంది? ''

ఇప్పుడు కూడ జీవనమహాశయు డేమీ ప్రత్యుత్తర మీయ లేదు.

"అమ్మవారికి ఆగ్రహం వస్తే ఆమె నాలుక అల్లల్లాడి పోతుంది. దానికి అడ్డుండదు; గడియ వుండదు. ఆమెలో ఉన్న ఈ దోషం పోకుండా వుంది" అన్నాడు శశి.

జీవనమహాశయుని చూపులు ఇంకను మింటితో బిగింపబడి ఉన్నాయి. ఇంటి అమ్మవారి మాటలు వాని మనస్సులో దిర్దిర తిరుగుతున్నాయి. అవి మాటలు కావు. బాణములు. ఆ తూపులు తగిలినను, వాని కవి తగులనట్లే ఉండెను. ముసలి యేనుగువలె ఆతడు నడుస్తున్నాడు. చూపులు గ్రుచ్చుకొనడం నిజమే! కాని అతని కెట్టి స్పర్శానుభూతియు కలిగినట్లు లేదు. తదనంతరము ఆ చూపులు తమంత తామే సడలి పోవును. సమస్త దేహము చిన్నచిన్న చిల్లులతో కప్పబడి ఉన్నది.

శశి పలుకులు స్వగత ప్రసంగము వలె ఉన్నది. దత్తుపై వెర్రి చూపులు సారిస్తున్నాడు. వాని మనసులో ఇంచుక వెగటు పుట్టి ఉంటుంది. ఇట్లు తలపోసినాడు. "ఈ ముసలివాని బుర్ర ఎప్పుడూ ఒకేమాదిరిగా అఘోరిస్తోంది. ఇతగాడిది ఒక ప్రత్యేకమైన మెదడు. నూరు మాటలు చెపితే ఒక దానికి జవాబు చెపుతాడు. ఏం చెపితే వీని మనస్సు కదులుతుందో; లేచివున్నా ఎపుడు వీనికి మెలకువ వస్తుందో తెలియదు. వడవడ వాగడం అమ్మగారికి అలవాటు. కాని తన పెనిమిటి వల్లనే అలా తయారయింది. ఎంతసేపు, ఎంత తీవ్రంగా ఆమె కయ్యమాడినను భర్త తోడనే, ఇతరులతో ప్రసంగించేటప్పుడు ఆమె మరొక మనిషి అయిపోతుంది."

శశి తొలిజీవనం ఈ యింటనే గడిచింది. మూడేళ్లు పూర్తిగా అతడిందు గడపినాడు. అమ్మగారపుడు తన యెడల ఎట్లు కనికరించి, ఎట్టి వాత్సల్యం చూపేదో ఆతడు మరువలేదు. పిలిచి అన్నము పెట్టేది. తినకపోయి నపుడు చీవాట్లు పెట్టేది. ఏమనినను ఆదరంతో అనేది. "వేళకు గుప్పెడన్నం తిను నాయనా! లేకపోతే ఒళ్లు పాడై పోతుంది." అని ఆమె చల్ల చల్లగా పలికేది.

ఇంతేకాదు. ఇంటిలో ఎప్పు డెప్పుడు ఏమి పిండివంట జరిగినను, మిఠాయిదినుసులు తయారైనను, అతగాణ్ణి పిలిచి ఆమె వానిచే తినిపించేది. "శశీ! నాయనా! వీటిని తినిచూడు. ఎలా ఉన్నాయో చెప్పు" అనేది.

మంచిమంచి మిఠాయిలు తయారైనపుడు వాటిని ఒక గుడ్డ పేలికతో మూట గట్టి "బాబూ! వీటిని యింటికి తీసికొని పోయి, మీ ఆవిడకు తినిపించు. అంటూ ఉండేది.

శశి అంతకుముందే పెండ్లికొడుకైనాడు పెండ్లి కూతురు ముఖమును చూచి ఆమె వ్రేలికి ఒక ఉంగరం తొడిగింది అమ్మగారు, ఎంతో ముద్దుతో, మురిపెంతో

అమ్మగారిని గయ్యాళి చేసినాడు వృద్ధుడు. ఈ పిచ్చి యేనుగు నిజంగా పిచ్చియేనుగే! వెనుకనుండి శశి ఎన్నెన్నో పర్యాయములు పిలిచినాడు. ఏమేమో చెప్పినాడు. వేటిని చెవి పెట్టడు. కన్నెత్తి చూడడు. మొద్దు రాచిప్ప! పోత పోసిన విగ్రహం! శశి యేం చేస్తాడు? ఉబలాటంతో ఉపాఖ్యానము సాగిస్తున్నాడు, ఒళ్లు గోకుకొంటూ. "అయ్యా! జీవనంగారూ! అమ్మవారి దోషం ఏమీ లేదు. అప్పటి రోజులు జ్ఞాపకం చేసుకుంటే గుండె నీరై పోతుంది. ఏడుపు రాక యేం చేస్తుంది? ఎన్నెన్ని పిలుపులు! రేయింబవళ్లు తినేందుకు, కన్ను మూసేందుకు వేళ లేదు. ఇక ఆ తెల్ల గుఱ్ఱం! అదెంత పెద్దగుఱ్ఱమో! అటువంటి జంతువు నడుము విరిగి రెండేళ్లలో క్రుంగి పోయింది. దేశమంతా జ్వరంతో వ్యాపించిపోయింది. ప్రజ వడకిపోయింది. అమ్మయ్యో! ఏమి హాహాకారాలు! లోకం అట్టు ఉడికినట్లు ఉడికిపోయింది! ఆ సంరంభంలో మహాశయునికి లభించింది పంచాయతీ ప్రెసిడెంట్ గిరి. ఓరి బాబో అదేం హయాం! అది చెప్పుకోతగ్గ విజృంభణ! గంగలో పడవమీదికి ఉరుకు లెత్తడం వంటిది. అయ్యా! ఆ హరీశ్ డాక్టరు కొడుకు చావుమాట మీకు జ్ఞాపకం ఉందండి? ఈ వైపున సొంతకొడుకు అవస్థ గడియ గడియకూ మంచంమీదినుండి దింపనూ, మంచం యెక్కించనూ. ఇక ఆ హరీశ్ డాక్టరు! మతిమరపు వలన ఒంటికి రుద్దుకునే తైలమున్న సీసాలో గొంతులో పోసుకునే మందు పోశాడు. 'ఓహోహో! ఏమి ప్రిస్కిప్షన్! అది త్రాగి పొరుగింటికోడలు కుక్కిమంచంపై కూలి పడిపోయింది! అర్ధరాత్రివేళ ఆమె చంటికూన 'మొర్రో!' 'మొర్రో!' అని మొత్తుకుంటూ ఉరుకులెత్తుకొని వచ్చాడు. ఆ ఆడకూతురు కంఠానికి తాడు బిగించుకుందని బొబ్బలుపెట్టేడు కుంకమ్మ! పరుగు పరుగున వచ్చాడు పెద్ద పోలీస్ ఉద్యోగి, యేదైన లంచం మింగుదామనే ఉబలాటంతో. అప్పుడు మీరేం చేశారు? పంజాబీ పెద్దమనిషి యేదో ఆటలాడుతుంటే ప్రక్క బైఠాయించారు, రొంటినుండి రూపాయలు విడదీస్తూ. ఓరి నాయనా! అదేం రాత్రి! మీకు జ్ఞాపకం ఉందాండీ?"

శశి స్వగత ప్రలాపం నడచిపోతోంది అడ్డులేక! జీవనమహాశయునకు కొంచెం కదలిక పుట్టింది. ఏ లోకంనుంచో గుభాలున దిగినట్లున్నాడు. పెద్ద నిటూర్పు విడిచినాడు. కొంచెం కదలినాడు! కాని పద్మాసనంలోనే బిగించుకొని కూర్చున్నాడు!

లేవు! ఆనాటి కథలు అతగానికి జ్ఞాపకం లేవు. అవి సులభంగా మనస్సులో తల యెత్తడం లేదు. కదిపితే లోపల అవి కదలవచ్చు! ఆ కదలికతో గంగవెర్రులు

పుట్టుకొని రావచ్చు! ఆ చిన్నెలు అగపడుతున్నాయి! ఎందువల్ల ఆ రోజులు అలా అయి పోయినాయి? ఎందువల్ల? ముసలివాడు చంచలచిత్తుడై పోయినాడు. అనాటి గోపన సంకల్ప విషయం జ్ఞప్తికి వచ్చినది. గుఱ్ఱం కొని, తాను గుఱ్ఱంపై స్వారీ చేస్తూ యిల్లాలిని పాలకిలో కూర్చుండబెట్టి, కాందీ పోవాలని ఆత డుద్దేశించి యుండెను. అశ్వమునైతే కొనినాడు. పెండ్లాము ఒంటినిండ నగలు అమర్చి వేశాడు. కాని కాందీ వెళ్ళడం పడలేదు. ఎందుకు పోలేక పోయినాడో యెరుగడు. నేడు కూడ ఎరుగడు. సంకోచమువలన పోలేక పోయినాడా? లేక భయం వలన పోజాలక పోయినాడా? బహుశః రెండును వాని మనస్సును పీడించి వేసినవి. ఏ కారణం చేతనైన నేమి అతడు ఆ ప్రయాణం సాగించలేక పోయినాడు. ప్రతిష్ఠను పురస్కరించుకొని సంపద వలన పుట్టిన మత్తునుబట్టి యీ ప్రదేశంలో ప్రమత్తుని వలె అతడు తిరుగాడుతున్నాడు. ప్రతిష్ఠ విజృంభణమునకు అది తగిన అదను. చికిత్సలో తాను పడసిన ఖ్యాతివలన ఆతడు ఎల్లర తలలో నాలుకయై పోయినాడు. సర్కారువారు కూడా ఆతని యెడల విశేష ఆదరాభిమానములు చూపి వానిని పంచాయతుకు ప్రెసిడెంటును చేసి వేసిరి. కాని వాని మనస్సుకు సంతుష్టి కలుగ లేదు. అందు సంతృప్తి హుళక్కి. చేతికి దొరికిన దానిని రెండు చేతులతో ఆతడు ఖర్చు పెట్టినాడు. మనసులో సంతోషము లేనపుడు సొమ్ము కూడబెట్టవలె నను వాంఛ వాని కేల కలుగును? ప్రతిష్ఠకు సంబంధించిన ఆశ అడుగంట సాగింది. అలా జరుగక ఏమగును? ప్రతిష్ఠకై చెవికోసికొనిన యెడల అది మిధ్య అని కాల క్రమమున తెలిసిపోవునని అతని తండ్రి చెప్పువాడు. రంగలాల్ డాక్టరు కూడా అదే ధోరణిలో ప్రసంగించేవాడు. చేతిలో బ్రాంది బుడ్డి పుచ్చుకొని నవ్వుతూ "అటువంటి ఆశ యీ బ్రాంది మత్తు వంటిది" అంటూ వుండేవాడు. "నవ దంపతుల ఆకర్షణ వంటి" దని ఒకనా డాతడు పలికినాడు. రూపయౌవనములు నిలుచునంతకాలము ఆ ఆనందము పొంగుతూ ఉంటుంది. అది నశించినంతనే ఆ రీతి బ్రతుకు వలన చేదు పుట్టును. కాని అది నిస్తులప్రణయ మైన యెడల జీవన మం దెపుడును అది నశింపజాలదు. ఈ రెండింటిలో దేని రుచిని నే నెరుగను" అని ఆతడు పకపక నవ్వుకొనినాడు.

మాధవ సంస్మరణ సంకీర్తనముల వలన పరమానందము కలుగునని ఆతని జనకుడు తెలుపుతూ వుండేవాడు. మాధవుని పడయజాలనివాడు దేనిని పడయనే లేడు. మాధవుని పొందడం సాధ్య మగునో కాదో జీవనమహాశయు డెరుగడు. అట్టి భాగ్యము వానికి కలుగలేదు. సంపదయందు గాని, ప్రతిష్ఠ యందుగాని,

సంసారమున ఇంటి ఇల్లాలి యందుగాని, సుషమ, సురమ, నిరుపమ, వనవిహారి అను బిడ్డలందుగాని ఆతని కది లభించలేదు.

మత్తుపదార్థముపై వానికి మక్కువ లేనేలేదు. ఒక్కొక్కప్పుడు వైద్యము కొరకు రోగులను బ్రతికించేందుకు ఆతడు దానిని ఉపయోగించేవాడు. చతురంగపు ఆటపై వానికి ప్రీతి మెండు. ఉత్సవ సమయాల్లో జూదమాడుట వాని కిష్టము. కఠినరోగపీడితులు తన్నాశ్రయించినను జూద మునకై అతడు పరుగు లెత్తుతూ ఉండేవాడు. నెగ్గినయెడల బ్రతికినట్లు, నెగ్గకపోయినయెడల చచ్చినట్లే. అయినా ఆటమీది పట్టుదల పోయేదికాదు. ఆ రోజుల్లో జూద మొక దోషంగా గణింప బడేది కాదు. మీదుమిక్కిలి గొప్పవాళ్ళ పిల్లలు ఆడితే అసలే తప్పుగా ఎన్నబడేది కాదు. పిన్ననాటినుండి యీ ఆటలో అభ్యాసం ఆరంభమయ్యేది, ప్రతిష్ఠ పెరిగిన కొలది ఆ అలవాటు ముదిరిపోయేది. ఇంటి అమ్మవారిని చూచుకొని జీవనమహాశయుడు జూదంలో అంతకంతకు ఆరితేర సాగినాడు.

ఒకనాటి రాత్రి విషయం శశి ఏకరువు పెట్ట సాగినాడు. అది జ్ఞాపకం ఉంచుకోవలసిన ఘట్ట మనడం నిజం. కథంతా మనస్సులో దిర్దిర తిరుగుతూ ఉన్నది.

ఆనాటి పరిస్థితి మిగుల పచ్చగా ఉండేది. పొలములో బంగారు పైరు, శాంతపరిచ్ఛిన్నములైన పల్లెలూ, సంతోషంతో అంజలు వేసే మనుష్యులూ, మధురప్రసంగములూ, పశువులశాలలో కామధేనువులవంటి ఆవులూ, చెరువుల నిండా చేపలూ, గాదెలనిండా ధాన్యమూ, దైనందిన జీవితానికి వలసిన సంభార ములూ, యే దిక్కుగా చూచినా ప్రజల బ్రతుకు పచ్చ తోరణాలతో కన్నుకుట్టుతూ వుండేది. ఇప్పుడో ఆ రోజులు తలక్రిందులై పోయినవి.

ఆ దినాల్లో మలేరియా అనేది అసలే లేదని చెప్పలేము. తొల్లింటి విడ్డూరపు జ్వరబాధతో ఒక రిద్దరు పొగులుతూ వుండేవారు. ఏదో కషాయం త్రాగితే వెంటనే జ్వరం తొలగి పోయేది. తదనంతరం మలేరియా చెలరేగింది. అంటు వ్యాధివలె విజృంభించింది.

విషయం తలపోసుకొంటూ శశి 'అబ్బా' అనుకొంటున్నాడు. ఆ రోజులు తలచుకొంటే జీవనమహాశయుని అంతరంగం యాతనతో పీడింపబడుతూ వుంటుంది. పసివాళ్లు ఎందరెందరో మరణించేవారు. తల్లుల ఆక్రందనముతో ఆకాశము చిల్లులు పడిపోయేది.

ఆ దినాల్లో జీవనుని చేతినిండ పని ఉండేది. అతడే కాక, హరీశ డాక్టరు ఉండేవాడు. కృష్ణదాసు తొలుత వానికి తన యింట బస యేర్పాటు చేసినాడు. అపు డాతడు వ్రజలాల్ యొక్క ధర్మ ఆసుపత్రిలో డాక్టరుగా ఉండేవాడు. శశి అక్కడ కంపౌండరుగా పనిచేస్తూ వుండేవాడు. చూస్తూ చూస్తూ వుండగా మరి యిద్దరు డాక్టర్లు వచ్చి చేరుకొన్నారు. ఈ నవగ్రామంలో వుండే నరపతి రాయచౌదరి ఒక హోమియోపథిక్ పుస్తకం కొని, కొన్ని హోమియోపథిక్ మందులు కొని, వైద్యం సాగించేవాడు. వందారాయచౌదరి చిన్న పిల్లవాడు. స్కూలు చదువు విరమించుకొని కలకత్తా పోయినాడు. మెడికల్ కాలేజిలో ప్రవేశించాడు. పిచ్చివాడైన నేపాల్ తమ్ముడు తానూ పిచ్చివాడైనప్పటికీ మరొక పిచ్చివాడైన సీతారామ్‌వలె ఔషధాల అంగడి యేర్పాటు చేసుకొన్నాడు. నవగ్రామ మంతా వైద్యానికి ఆట పట్టైపోయింది. చిల్లర మందుల షాపులూ, టోకుధరలకు మందులు విక్రయించే షాపులూ ఊరంతా నిండిపోయినవి.

ఊరిలో అంటువ్యాధి ప్రకోపించిన సమయంలో వైద్యవృత్తిలోని వ్యక్తి విస్తృతమైన ప్రాక్టీసును విలోకింప జాలును గదా!

ఇంటింట మనుష్యులు మంచము పట్టిరి. ఉదయము మొదలు సాయం కాలము వరకు వీధులందు డాక్టరు సంచారము చేయవలసి వస్తోంది. పేటపేట లోనూ అడుగు పెట్టవలసిందే! హరీశ్ డాక్టరు జేబులు రూకలతో నిండిపోయినవి. వాని అంగీకి ఉన్న జేబులు మూడు మాత్రమే! నాలుగు జేబులైనా పూటుగా ఉండేవే! కాని నాలుగవ జేబు నాతడు కుట్టించుకోలేదు. వంశమర్యాదకు, సంప్ర దాయమునకు విరుద్ధముగ ఆత డెన్నడు ప్రవర్తింపలేదు. ఆతనికి అర్థాపేక్ష లేదని చెప్పుట నా ఆశయము కాదు. అర్థము మీదనే రెక్కలు వాల్చుకొని ఆత డుండ లేదు. పరమార్థ మనిన కూడ ఆతనికి విశేష ప్రీతి కలదు. ఉన్నత కుటుంబము ఉదారాశయసందీప్తము కదా!

జీవన మహాశయుడు ఆకోవలోనివాడే! రతన్‌బాబు కొడుకు నాలుగు రూకల ఫీ యీయ బోయినపుడు దానిని స్వీకరించుటకై ఆతడు సమ్మతించెనా? అ ట్లొనరించిన పరువుకు నష్టము ఘటిల్లదా?

పిలుపు వచ్చినపుడు ఆతడు వెలుపలికి పోతూ వుంటాడు. త్రోవలో పోతూ వుండగా ఏ యింటినుండి ఎవరెవరు పిలిచినా అతడు సంకోచింపక ప్రవే

శిస్తాడు. ఎవరు ఏమి ఇచ్చినప్పటికి దానిని కన్నెత్తి చూడక జేబులో వేసుకొంటాడు. క్షేత్ర విశేషమును బట్టి సాహాయ్యము సలుపుతూఉంటాడు.

హరీశ్ ఇక్కడ క్రొత్తగా ప్రవేశించినవాడు. డబ్బు సంపాదించుకొనేందుకై వచ్చినాడు. మరి జీవనదత్తు? మూడు పురుషార్థములనుండి వైద్యం చేస్తూవున్న కుటుంబములోని వాడు. మహాశయుల వంశములోనివాడు. అంతే కాదు. తన ఊరిలో జమీందారీహోదాతో మసలుతున్నాడు. డబ్బు సంపాదించడం వానికి పరమాశయ మెట్లగును? పైకమును గురించిన చింతన ఆతని చిత్తమున ఎన్నడూ ప్రవేశింపనే లేదు. జేబునుండి గలగల లాడే ఏవో కొన్ని నాణెములు వెలుపలకు తీసినపుడు ఇంటి అమ్మవారు వెక్కిరించినపుడు ఆతడు నవ్వుకొంటూ వుంటాడు. ఒక్కొక్కప్పుడు లోలోన కులుకుతూ వుంటాడు.

"ఎందుకా నవ్వు? మీరు నవ్వుతున్నపుడు నా ఒళ్ళు మండి పోతుంది" అంటుందా యిల్లాలు.

ఆ మాటలు విన్నప్పుడు వాని నవ్వు హెచ్చి పోతూ వుంటుంది. శారీరక జ్వాల తన భార్యయొక్క స్థాయీ వ్యాధి అని ఆత డెరుగును. ఆ జ్వాల చితాకాష్ఠయందు కలసి భుగుల్బు గుల్మమని మండిన అనంతరమే చల్లారి పోవునని వానికి తెలియును.

అటు పిమ్మట రెండు గుఱ్ఱాలను కొనినాడు జీవనదత్తు. ఒకటి పెద్ద గుఱ్ఱం. రెండవది సామాన్యపు ఎత్తుగలది. ఒకనాడు, స్వారీ చేస్తూ వుండగా అది కూలి పడిపోయింది. మూడేళ్ళలో గుఱ్ఱాలు రెండూ ఏ పనికీ కొరగానివై పోయినవి. వాటి నడుములో దారుణమైన వాతము పుట్టింది. జీవనదత్తు మహాకాయుడనుట అతిశయోక్తికాదు. ఆ అతికాయుని మోసి మోసి అవి క్రుంగి పోయినవి. మరి స్వారీకి పనికిరాకపోవడం వలన సంత బజారులో ప్రవేశించాయి. పొగాకు వర్తకుల మూటలు మోసేందుకు పనికి వచ్చినవి.

తదనంతరము జీవనమహాశయునకు అశ్వముల మీది మోజు తొలగి పోయింది. మరే గుఱ్రమును కొనలేదు. కొనే స్తోమతు పోయిందని చెప్పేందుకు వీలులేదు. మహాకాయమును, పాపం ఆ పశువులపై పడవేసి వాటిని హత్య చేయడం తగనిపని అని ఆతడు తలపోసి యుండును. దేవు డిచ్చిన దానితో అయిదు వ్రేళ్ళతో ముద్ద చేసికొని నోట బెట్టుకొంటున్నాడు. కుటుంబ పోషణ చేసుకొంటూ ఈ రోజుల్లో, త్రోవలో నడుస్తూ, నడుస్తూ దుమ్ము రేగగొట్టుతూ ఉంటాడు,

అతగాణ్ణి చూచి లోకులు "అదిగో ఏనుగు నడుస్తోంది, ఏనుగు నడుస్తోంది" అని కడుపు చెక్కలయ్యే టట్లు నవ్వుతూ వుంటారు. ఏనుగు! అవును ఏను గనడంలో అతిశయోక్తి ఏముంది? మాట వినినపుడు ఏ యేనుగుకైనా కోపం వస్తేంగాక!

ఒక రోజున ప్రొద్దున కాలిజోడు నంటిన బురదను తుడుస్తూ, తుడుస్తూ ఇందిర తటాలున ముందుకు దూకి "అమ్మోయి! బాబో! పాము! పాము" అని అరచింది. జోళ్ళు వుండే మూలనుండి పామొకటి పడగ యెత్తింది. ఇంటిలో సంచరించే గజపాదము చీకట్లో నడుస్తూ నడుస్తూ పాము ప్రక్కనుండి అడుగు వేసింది. ఇందిర కెవ్వు మనినపుడు జీవనదత్తు నవ్వుకొన్నాడు. మూలనున్న అమ్మవారు ఉలికిపడింది. మగనిని ఆడిపోసింది. ఏ కలుగులో దూరిందో మరి పాము అగపడలేదు.

అమ్మవారి మాటలు విని యథాప్రకారము ఆతడు నవ్వుకొన్నాడు. ఫీ రాబట్టుకోవలసిన విధమును గురించి ఇల్లా లేమేమో నూరి పోసింది. కాని దాన కరుని తాతయ్యవలె అతడు ప్రవర్తించినాడు.

కొందరు మిత్రులు "ఇది ధనుర్మాసము. లోక కల్యాణం ఘటిల్లవలె నంటే వనసంతర్పణ జరిగి తీరాలి. వనం మాట దేవు డెరుగును. జీవన మహాశయా! నీ ద్వారా ఒక పెద్ద ఫీస్టు(విందు) జరగాలోయ్." అని ఆతనిముందు హృదయం విప్పి పలికినారు. ఆ మాట విని ఎప్పటివలె నవ్వుకొన్నాడు జీవనమహాశయుడు. "అవును. ఇది సంతర్పణ మాసం. ఉదర గోళంలో పిండివంట పడవలసిన సమయ మిది. ఫీస్టు అవసరమైనదే! ఫీస్టుమాట దేవు డెరుగును. చేస్టుకై సర్వ సన్నాహాలు జరపండి" అన్నాడు, దత్తు కడుపు చెక్క లయ్యేటట్లు పకపక మంటూ.

"అయితే, రొంటిలోని డబ్బు బయటపెట్టు" అన్నారు మిత్ర మహాశయులు.

సేతాబ్, సురేంద్ర, నేపాలులు విందుకై భారీ యెత్తున యేర్పాటు చేశారు. శశి కూడ పెద్ద ఉబలాటంతో బృందంలో చేరినాడు. విందుకై దయచేయవలసిం దని మిత్రులు హరీశ్ డాక్టరుకు ఆహ్వానము పంపినారు.

ఈరీతి విందు కార్యక్రమాలు అప్పుడప్పుడు జరుగుతునే వుంటాయి.

ఈ విందులు రాత్రివేళ జరుగుతూ వుంటాయి. పగటిపూట అవకాశ మేముంది? జీవనమహాశయుడు ప్రాతఃకాలమున మంచమునుండి దిగి, ఆరోగ్య

నికేతనంలో అడుగు పెట్టి, రోగులను చూచి, పిలుపులను బట్టి రోగులను చూచేందుకు పోయి, కొంపకు మళ్లేటప్పటికి అపరాహ్ణ మై పోతుంది. ఒక్కొక్కప్పుడు సాయంకాలము నాలుగుగంటలవేళ అగును. అపు డేవో కొన్ని మెతుకులు కరచి దూరస్థలాల్లోని రోగులను చూచేందుకై పోవాలి. తిరిగి యింటిమొగము చూచేటప్పటికి రాత్రి తొమ్మిది, పది, పన్నెండు గంటలై పోవును. ఒక్కొక్కప్పుడు తెల్లవారుజామున మూడుదాటుతూ వుంటుంది. విందు రోజుల్లో రాత్రి పన్నెండు గంటలవరకు సేతాబు, సురేన్, నేపాలులు అతగానికొరకు వేచివుంటారు. ఆరోగ్యనికేతనంలో మందుల షాపులో దీపం వెలుగుతూ వుంటుంది. తండ్రి రాగానే ఇందిర టీ తంబాకులు చప్పున తయారు చేస్తుంది. అప్పటివరకు మిత్రమహాశయులు చతురంగం జూదపు ఆటలో నిమగ్నులై పోతారు. చౌకీదారులు (కావలివాండ్రు) కూర్చుని వుంటారు. జీవనమహాశయుడు పంచాయతీ ప్రెసిడెంటు కదా! ఇంటికి రాగానే ఆటలో ఒకపర్యాయం చేయిపెట్టి, చౌకీదారుల హాజరు పుస్తకంలో సంతకం చేసి, శయ్య చేరుతూవుంటాడు. ఒక్కొక్కప్పుడు అతగాడు ఇల్లు చేరేటప్పటికి భళ్లున తెల్లవారిపోతుంది.

విందు యేర్పాటయ్యే రోజుల్లో శశీ యిందిరలు నవగ్రామమందలి బజారుకు పోతూవుంటారు. మహాశయుడు చీటీ యిస్తూ వుంటాడు. దానినిబట్టి నూనె, నెయ్యి, ఉప్పు, మసాలా సరుకులు వాళ్లు తెస్తూవుంటారు. సాహావంశీయుల దుకాణంనుంచి కొంత మత్తునీరు, సారా వగైరాలు వస్తూవుంటాయి. సురేన్, నేపాల్, హరీశ్‌డాక్టరు, శశి, వీరికి కొంత మత్తు(త్రాగుడు)లభిస్తే నే గాని సంతృప్తి వుండదు. నేపాల్, సురేన్‌లు విందుకై చక్కని మేకను తెస్తూవుంటారు. మరి కొన్ని అవసర సంబారములను చౌకీదారు సంపాదిస్తూ వుంటాడు. చెరువుకు పోయి చేపలు పట్టి తెస్తాడు. జీవనదత్తు తన్ను తాను మరచి పడివుంటాడు. ఆ మత్తు ప్రభావం వల్ల పడిపోయినట్లుంటాడు.

ఆనాటి రాత్రి విషయం జ్ఞప్తికి వస్తోంది. అది జీవితంలో స్మరణీయమైన రాత్రి అనడంలో సంశయం లేదు. నాటి అపరాహ్ణ సమయంలో అతగాడు వెలుపలికి పోయినాడు. మొదట హరీశ్‌డాక్టరు ఇంటికి పోయినాడు. హరీశ్ కొడుకు మంచము పట్టినాడని విన్నాడు. తరువాత తీర్థంలోకి ఉత్సవం చూసేందుకై వేంచేసినాడు. అప్పుడు తీర్థం సాగుతోంది. ఇప్పుడు జరిగే వంగపంచాంగం బట్టి జరుగుతోంది. అది భాద్రపదమాసం. నాగపంచమి రోజున మనసా పూజకు

సంబంధించిన ఉత్సవం. తీర్థం సాగించే పెద్దలు వచ్చి ఆహ్వానించి పోయారు. జీవనమహాశయుడు పోయి, పోలీసులకు ఏదో ముట్టచెప్పి, జూదమునకై తగిన బందోబస్తు చేసినాడు. ఆటలో పది, పదిహేను రూకల చేతి చమురు మాత్రం వదులుకొనేవాడు. ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి అమ్మవారు సాక్షాత్కరించేది. చొక్కా విప్పి మగడు పెరట్లో ప్రవేశించిన వెంటనే ఆమె జేబులు తడిమిచూపింది. నోట్లు, నోట్లతో గీట్లూ సున్నైపోయినాయి. ఏవో చిల్లర డబ్బుల శబ్దం విని పించింది. ఆమె మొగం ఎఱ్ఱబారింది. పెనిమిటి ప్రత్యక్షం కాగానే అది మరింత కందిపోయింది. దత్తు అవాక్కైపోయినాడు. "జూదంలో ప్రవేశించి కొంప గుల్లచేసి వదులుతున్నారు. సిగ్గులేక జూదం ఆడుతూవుంటారు."

"జూదం గీదం ఎరగను. అందుకై చిల్లిగవ్వ ఖర్చుపెట్టడం ఎలా పొసగు తుంది? తీర్థం చూస్తామని పిల్లలూ, నౌకర్లూ వేపుకొనితిన్నారు నన్ను. చూపేం దుకు వాళ్ళను తీసికొనిపోయాను. తీర్థంలో ఒకరిద్దరు ఎదుట నిలిచి చేయి జాపేరు. జేబులో వుండిన లొడ్డూ లొసగూ దులిపి వారి చేతుల్లో పెట్టేను. ఏవో చిల్లర డబ్బులు మిగిలినాయి. తీసి ఇనుపపెట్టెలో దాచివెయ్యి" అన్నాడు జీవన మహాశయుడు.

"ఉన్న ఖజానా యెంత?" అని అడిగిం దామె.

"చిల్లర మల్లర లెక్కపెడితే ఐదురూపాయ లుండవచ్చును."

"దీనితో రోజెలా గడుస్తుంది?"

"గడవకపోతే దానికర్మ అదే కాల్చుకొంటుంది. నా ఒళ్లు పిండినా యింత కంటె లభించేది లేదు."

"మంచిది."

అంగీ లాగుకొని మిగిలిన పైకం విసిరికొట్టి, దానిని తొడుగుకొని బయట పడ్డాడు మహాశయుడు. ఆవల నిలబడివున్నాడు కొడుకు వనవిహారి. క్రొత్త బైసికిల్ పట్టుకొని తండ్రికై వున్నాడు అతగాడు. తీర్థం చూచేందుకు పోతున్నాడు. పైకం కావాలి అతగాడికి. డబుల్‌బ్రెస్టు కోటు ధరించాడు. కొత్త రకపు జోడు తొడిగినాడు. పెద్ద తరహా జమీందారుల పిల్లలు నడిచేటట్లు ఛాతీయెత్తున అతడు పోతూవుంటాడు. విలాసపురుషుడు. నౌకరూ, ఇందిరా నిలబడివున్నారు. నంద అపుడు పసికూన, ఆమె కూడా నిలచివుంది. తీర్థంరోజున

తండ్రి తమకు యినాం ఇస్తాడని వారికి తెలుసు. లోపలినుండి గంగపెఱ్ఱలెత్తుతూ బయటపడినపుడు దత్తు బుఱ్ఱ మరింత ఉడికిపోయింది. క్రిందపడిన ఐదురూకలను ఏరి అమ్మవారిచేతిలో పెట్టింది.

"ఇందిరా! నావెంట రా!" జీవనదత్తు అన్నాడు. హరీశ్ కొడుకు రోగ శయ్యపై వున్నాడను విషయము ఆతడు మరచినాడు. గడచిన రాత్రి విందుకై రాలేక "పిల్లవానికి ఆకస్మికముగ చలిజ్వరం వచ్చింది. ఇంటిలో ఆడువాళ్లు అడలుతున్నారు. విందుకై రాలేకపోతున్నాను." అని ఆతడు జాబు వ్రాసి పంపినాడు.

పోయి వానిని ఒకపర్యాయం చూచి రావలెనని జీవనమహాశయు డుద్దేశించి నాడు. ఉద్భ్రాంతుడై పోలేకపోయాడు. నవగ్రామంలోని సాహావారి సారా దుకాణము కడకు పోయి, "సాహా! నాకు ఏబయి రూపాయలు కావాలి" అన్నాడు.

సాహా కేవలం సారా అమ్ముకునే జీవించడం లేదు, అప్పుసప్పు లిచ్చి వడ్డీ వ్యాపారం చేస్తూవుంటాడు. సాధారణులనుండి ఏ నగనో తాకట్టుగా పుచ్చుకొని ఋణం ఇస్తూ వుంటాడు. గౌరవనీయులైన వ్యక్తులకు చేబదుళ్లు ఇస్తూవుంటాడు.

సాహా అవాక్కై- "అయ్యగారికి డబ్బు జరూరుగా వుందా?"అన్నాడు.

"అవును. రేపో యెల్లుండో వచ్చి, తిరిగి తీసికొనిపో. రూపాయలు తీసుకొనిరా."

మారుమాటాడక ఆతడు రూకలు తెచ్చి వానిచేతిలో వుంచినాడు. తాకట్టు వాకట్టు ఏమీ లేవు. స్మరణచిహ్న మేమీ లేదు.

రెండు రూకలు ఇందిర చేతిలో పెట్టి మిగిలిన పైకంతో జీవనదత్తు తీర్థంలో ప్రవేశించాడు. ఈ దుకాణమూ, ఆ అంగడీ చూచుకొని అతడు జూదపు కొట్టులో ప్రవేశించాడు. అపుడు రాత్రి యెనిమిదిగంటలవేళ. పద్మాసనం వేసికొని కూర్చున్నాడు అతగాడు. జూదంలో తానెంత ఓడెనో వానికి జ్ఞాపకం లేదు. ఒకసంవత్సరకాలంలో తాను మరణిస్తే, ఆటలో నెగ్గ వచ్చునని ఆత డనుకొన్నాడు. రాత్రి పది గంటలవేళ ఉరుకు లెత్తుకొని వచ్చాడు శశి. అపుడు హరీశ్ ఆధ్వర్యంలో. నడిచే ఛారిటబుల్ డిస్పెన్సరీలో శశి కాంపౌండరుగా ఉన్నాడు. తీర్థంలో ఉండవలసిన బాధ్యత కూడ ఆతడు తలపై వేసుకొన్నాడు. కాని హరీశ్ కొడుకుస్థితి విషమిం చడం వలన ఆతని యింటనే ఆత డుండి పోవలసివచ్చెను. పిల్లవాడు చావు బ్రతుకుల మధ్య వ్రేలాడుతున్నాడు. ఆ దిక్కున హరీశ్ చేతిలోని రోగి—పొరుగు

వాని కోడలు — బాధ సహింపలేక నేలపై పొరలుతూ వున్నది. ఆమెకీ దుస్థితిని తెచ్చి పెట్టినవాడు హరీశ్. కొడుకు తీవ్ర జ్వర పీడితుడై ఉండడం వలన హరీశ్ మతి పోయింది. ఒంటికి పట్టించుకోవలసిన మందును అతడు ఆ యిల్లాలి కిచ్చి "దీనిని మ్రింగు" అన్నాడు. మ్రింగడం వల్ల ఆమె ఇంచుమించుగా చచ్చి ఊరు కొంది.

"ఇకనైనా మీరు బయలుదేరి రావాలి" అన్నాడు శశి జీవనదత్తుతో.

దత్తు లేచినాడు. జూదానికి మ్రింగ బెట్టగా ఏకొద్ది రూకలో అతగాని రొంటిలో మిగిలినవి. బ్రతుకు బ్రద్ద లయింది, పుట్టి మునిగింది అనుకొని ప్రక్క నెవరి చేతిలోనో ఆ పైకం వుంచి "రేపు తీసుకొంటా"నని చెప్పి అందుండి బయలుదేరినాడు. జూదంలో పుట్టి మునుగునని ఆత డెరుగును. తన సాంగేతిక వాక్యం బట్టి ఏడాదిలో కాటికి కాలు చాపడు. ఇంకా అత డెన్నెన్నో కథలు చూచి తీరాలి. హరీశ్ కొడుకును చూచేందుకై కదలిపోయినాడు.

అతడు నడుస్తూ వుండగానే హరీశ్ కొడుకు పరలోకంలో ప్రవేశించాడు. జీవన మహాశయుడు ప్రత్యక్షం కాగానే హరీశ్ గుండె పగిలి పోయింది. నెత్తి కొట్టుకుంటూ వెక్కి వెక్కి యేడుస్తూ అతడు "జీవనా! నాపని యేమై పోయిందో చూడు. నువ్వు ఒక్క పర్యాయం ప్రొద్దున్న వచ్చివుంటే నా పిల్లవాడు నాకు దక్కే వాడు." డగ్గుత్తికతో పలికినాడు. మృదూక్తులతో ఆతనిని ఓదార్చి జీవన మహాశ యుడు "ఎందుకీ వెర్రిభ్రాంతి. నువ్వు డాక్టరువు కావా? బాబూ! ఈ రీతిగా నువ్వు బెంబేలు పడవచ్చా? నీవే యిలా క్రుంగిపోతే యింటిలోని ఆడవాళ్లు ఏమై పోతా రనుకొన్నావు. నీకు తెలియని దేముంది; 'అహన్యహని భూతాని గచ్ఛంతి యమ మందిరం, ఈ వాక్కు నియంత కెరుక. మరి తత్త్వజ్ఞాని కెరుక. అర్థం తెలిసినా తెలియక పోయినా మనవంటి డాక్టర్లు యీ మాటనే ఏకరువు పెడుతూ వుంటారు. నాయనా! ఇక ఊరుకో! ఆడువారిని ఓదార్పుము. నోటన్ గడంబీ కోడలు చావు బ్రతుకుల్లో ఉందట. పోయి ఆమెను చూచి వస్తాను" అని పలికి నాడు.

కొంచెం సేపటిలో పొంగి పొరలుతూ వున్న హరీశ్ దుఃఖము కొంచెము ఉపశమించింది.

గడంబీ ఇంటిలో పెక్కు రీతుల గవేషణ జరుగుతూ ఉన్నది. హరీశ్ అదృష్టవంతుడు. అది తీర్థపు సమయం, ప్రజ అందరూ తీర్థంలోనికి పోయినారు.

లేకున్న యెడల హరీశ్‌ని పోలీసు స్టేషనులోనికి బరబర యీడ్చుకొని పోయేవారు. జీవన మహాశయుడు వచ్చి చతికిల పడినాడు. రాగానే మందుసీసా పుచ్చుకొని జేబులో పెట్టుకొన్నాడు. తరువాత ఆ అమ్మి నాడి చేత బట్టినాడు. విషక్రియ ఆమె శరీరంలో సాగుతూ ఉంది. రోగిని చూచి, "అయితే, అమ్మాయీ! నువ్వు యీవత్తు మందును మ్రింగివేశావా? గుటక పడిందా? ఆ మందు నీ కడుపులో ప్రవేశించి ఉండదు. డోకుతో అది బయట పడిపోవలసిందే! భయం లేదు." అని పలికి, శశిని పిలిచి, "డిస్పెన్సరీలో స్టమక్‌పంపు ఉంది. చప్పున పోయి తీసికొనిరా" అన్నాడు.

ఆ రాత్రి పన్నెండు గంటలవేళ ఛటర్జీ కుటుంబంలోని కుఱ్ఱవా డొకడు పరుగు పరుగున వచ్చి యేడుస్తూ, "అయ్యా! మా అక్క నళిని మెడకు తాడు బిగించుకొంది" అన్నాడు. చికిత్సకై బాలుడు ఆరాటపడడంలేదు. వేరు కారణం వల్ల ఉరుకు లెత్తుతూ వచ్చినాడు.

జీవన మహాశయుడు పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు. పోలీసుల పిడికిళ్ళ నుండి క్లిష్ట సమయాల్లో దోషులను కాపాడగల అధికారి. చేయజాలిన పనిని అతడు చేసినాడు. గడంబీ కోడలు ఒంటికి మర్దించవలసిన తైలమును త్రాగి చావు బ్రతుకులలో ఊగాడినపుడు మహాశయుడు పోయి ఆమెచే డోకించి, సరియైన మందు ఆమె కడుపులో పోసి, వేకువజామున రెండున్నర గంటలవేళ ఛటర్జీ యింటికి పోయి వీధి అరుగుపై చతికిల పడినాడు. రిపోర్టు వ్రాసి పోలీసులకు పంపి "ఇక పీనుగును వల్లకాటికి పంపే యేర్పాటు చెయ్యండి. నే నిక్కడే ఉంటాను." అని లోనికి కబురు పంపినాడు జీవనదత్తు.

పిదప సేతాబుతో ఇట్లన్నాడు. "ఏదీ ఒక ఆట వేసి చూస్తాము. బల్ల తీసుకొనిరా. జూదానికి తగిన వేళయింది." అన్నా డాతడు.

ఆనాటి విషయాలన్నీ ఇపుడు వాని మానస వీధిలో ఉరుకు లెత్తుతున్నవి. వేకువజామున నాలుగు గంటలవరకు దీక్షతో ఆట సాగిపోయింది. గెలుపు ఓటముల నడుమ డోల్లు పుచ్చకాయ వలె దొరలి పోయినాడు. "జీవన్! ఈ వేళ నీ రొట్టె విశేషంగా నేతిలో పడిపోయిందోయి" అన్నాడు సేతాబ్.

ఇంతలో హఠాత్తుగా ఆటకు ధక్కా తగిలింది. ఆనాటి తీర్థంలో వనవిహారికి తగని రోగం సంక్రమించింది. అతగాడు తీర్థ సమారోహంలో కడుపులో పూటుగా సారా ఎక్కించాడు.

కొడుకును పిలిచి మహాశయుడు వానిని చడామడా తిట్టిపోశాడు. వనవిహారి నోరు విప్పక, మొగ మెత్తక సిగ్గుతో నిలబడి పోయినాడు. వాని వైఖరి చూచి నపుడు తండ్రి మరింత రెచ్చి పోయినాడు. "ఒరే! పాజీ! వంశానికి కళంకము తెచ్చి పెట్టినావు. కులమర్యాదకు నిప్పంటించావు. నీ తలి దండ్రు లిక సంఘంలో తలెత్తుకొని తిరుగరు. నీ తాత ముత్తాతలు ఏడేడు తరములవారు పరలోకాల్లో గడగడ వడకి పోతున్నారు. పరలోక సమాజంలో వాళ్లు బిడియంతో క్రుంగి పోతున్నారు." అని మహాశయుడు తన మహోపన్యాసం సాగిస్తున్నాడు. వెనుక గుమ్మంవద్ద ఇంటి అమ్మవారు నిలబడి తన వచః కౌశలమును చెవి బెట్టుచున్నట్లు అతడు గుర్తింపలేదు. అప్పు డామె తన నాలుకకు కావలసినంత పని అప్పగించింది. "అయితే! పిల్లవాడేమో ఒక తప్పు చేశాడని యిలా కడిగి పోస్తున్నారా? మీ తప్పుల జాబితా చూసుకోండి. అవి తండోపతండంగా లేవా? పాడు స్నేహాల వల్ల కుర్రనాగులు బురదలో కాలు వేసి వుంటాడు. ఇక మీరో? ఎన్నితూరులు రొంపిలో దిగబడినారు కారు? మంజరి కొరకై మీ రెన్ని పోకిళ్లు పోయినారో జ్ఞాపకం చేసుకోండి."

జీవనమహాశయుడు స్తబ్ధుడై పోయినాడు. "ఇక రారా వెర్రినాయనా" అని కొడుకుముందు మంజరి మాటెత్తి వాని చేయి పట్టుకొని లోనికి తటాలున పోయింది ఇంటి అమ్మవారు.

అపరాధి వలె జీవనమహాశయుడు చతికిలపడిపోయినాడు. అపరాధివలెనే మంజరిని జీవనపథమునుండి అతడు సడలించి వేశాడు. ఇప్పుడు ఇల్లాలి ప్రసంగం వలన ఆమె మానసనేత్రం ముందు సాక్షాత్కరించింది.

ఉత్సవ సమయంలో ఆమె స్మరణకు వచ్చింది. మద్యపానం చేసి, చేసి దాని ఫలము ననుభవించి భూపీ బోసు నీతి బాహ్యంగా ప్రవర్తించి మంజరిని తెవుళ్ళపుట్ట చేశాడు. జీవనునకు ఆ ఉపాఖ్యానము తెలియకపోలేదు.

అ తీర్థం నాటినుండి వనవిహారి శరీరంలో మృత్యుబీజం నాటుకొనిన దని తండ్రి గుర్తించాడు. మనుష్యునకు మృత్యువు రాక మానదు. పుట్టినదాది పులుగు వలె చావు రెక్కలు విసురుకొంటూ యెగిరివస్తూ వుంటుంది. పిచ్చుకను ముక్కున పట్టుకొని యెగయు పాడు పులుగువలె మానవుని అది యెగుర గొట్టుకొని పోతుంది. ప్రద్యోతడాక్టరు తన యింటినుండి ముప్పును తప్పించుకొన గలిగెనా? ఇక జీవనమహాశయుడు మాత్ర మేమి చేయగలడు?

స్మరణస్రవంతిలో కొట్టుకొను జీవనమహాశయునకు హఠాత్తుగా ప్రస్తుత జ్ఞానం కలిగింది. గగన సౌధమునుండి కూలిపడినట్లు చకితుడై అత డిటు నటు చూడ దొడగినాడు.

బండిలో వెనుక కూర్చునియున్న శశి తనలో ముసలియేనుగును ఆడిస్తూ సణుగుతున్నాడు.

ఈ లోపుగా జేబునుండి కేనాబిసిండియా మిక్చరు బుడ్డీని వెలుపలకు తీసి అత డొక మోతాదు దిగ మ్రింగినాడు. బండిలో ప్రయాణించువేళ తంబాకును సేవించడం వల్ల కొంత ముప్పు ఘటిల్లడం తథ్యం. ధూమపానం వలన ఆ ముప్పును కొంత తప్పించుకోవచ్చును. జేబునుండి గోల్డుఫ్లేక్ సిగరెట్టును తీసి చప్పున దాని కాతడు అగ్గి ముట్టించాడు. వెనుకనుండి బండిలో ఖాండవ దహనం చెలరేగిన నేమి? జీవనదత్తు కదలడు. మెదలడు.

అతగా డిపుడు కొంచెం కదలడం చూచి శశి "అయ్యగారూ! ఒక పర్యాయం వెనక్కి తిరిగి వస్తారా?" అన్నాడు.

సరిగా ఆసుపత్రి మ్రోల నిలబడింది బండి.

మధుర సంగీతం వినబడుతోంది. గేయం కూడా తీయని తలపులతో నిండి వుంది. డాక్టరు వసారాలో నిలబడి వున్నాడు.

విశేషోత్సాహంతో శశి బండి వెనుకభాగంనుండి క్రిందికి ఉరికినాడు.

డాక్టరుగారి భార్య పాట పాడుతోంది. మగనికి తగిన ఇల్లా లామె. దొరసానిలా ప్రవర్తిస్తూ వుంటుంది. బైసికిల్ మీదనే ఆమె తిరుగాడుతూ వుంటుంది. నడుస్తూ వున్నప్పుడు నాట్యం చేస్తున్నట్లు కనిపిస్తుం దామె. ఎప్పుడు నోరువిప్పినా గానలహరి వెలువడుతుంది ఆమె నోటినుండి.

వసారాలో డాక్టరు దంపతులు పిన్నవయసువారి వలె కులుకుతూ, కులుకుతూ ఆడుతున్నారు; వినోదిస్తున్నారు. ఆమె తరుణి. మగని చేయి గట్టిగ పట్టుకొని, రెండవ చేతితో నీళ్లు పోస్తోంది. ఆతడు కాళ్ళూ చేతులు కడుగుకొంటున్నాడు. పెనిమిటి ముఖం తువాలుతో తుడిచింది. తృటిలో లోనికి పరుగున పోయి ఏదో డబ్బాతెచ్చి. వాని మొగంపై ఆత డుక్కిరి బిక్కిరి యగులాగున పౌడరు చల్లి గట్టిగా రుద్దింది. ఆ ముఖారవిందం తృటిలో తెల్లబడిపోయింది. శశి ఆ దృశ్యం చూచి కడుపు చెక్క లయ్యేటట్లు నవ్వ సాగినాడు.

డాక్టరు ముఖం మీద కూడ మందహాస చంద్రికలు తళ్కొత్తినవి. బండి మెల్లగా కదులుతోంది.

గణేశ భట్టాచార్యుని కూతురు బ్రతికి బట్టకట్టి ఉంటుంది. లేకపోతే ఇల్లాలితో డాక్టరు ఈ విధంగా వినోద కాలక్షేపం చెయ్యగలుగుతాడా? వానిధైర్య మెంత? ఆత్మ విశ్వాస మెంత? క్రమ క్రమంగా గొప్పవాడు కాజాలు చిన్నెలు వానిలో అగపడుతున్నాయి. వానిలో ఒక లోపం మాత్రం అగపడుతోంది. ఇతరుల ఉద్దేశాలు వానికి సుతరామూ గిట్టవు. తరచుగా తన్ను తాను మోసగించు కొంటాడు. అతడు కటుభాషి.

వానిని అవలోకించి జీవనమహాశయు డొక వేడి నిట్టూర్పు విడిచినాడు. గట్టిగా బండిలో బైఠాయించి వున్నాడు. ఆతని రోగులలో ఒక్కొక్కరిని స్మరించుకొంటున్నాడు.

నవ గ్రామంలో కనైబాబు అనే ఆసామి వుండేవాడు. చాల కాలమునకు ముందు పరలోకమునకు ప్రయాణించినాడు. ఆతనిని జీవనదత్తు చూచినాడు. అతడు త్రాగుబోతు, గుణ రహితుడు. నిరంతరం దుర్దాంతవ్యాధి పీడితుడు. ఆత డెన్నడు మృదువుగా మాట్లాడి యెరుగడు. మొదటి యిల్లాలు శ్మశాన ప్రవేశం చేయగానే రెండవ భార్యకు గృహ ప్రవేశం చేయించాడు. రెండవ పెండ్లాము హస్త స్పర్శ మంచి ముహూర్తంలో జరిగింది. అతడు మరొక మానవుడై పోయినాడు. త్రాగుడుకు నీళ్లు వదలినాడు. వ్యభిచారమునకు కూడ జలాంజలి యిచ్చినాడు. మాటల తీరు కూడ మారి పోయింది. ఆ క్రోధాగ్ని సలిలమై పోయి నట్లయింది. సదాచార సంపన్నుడై ఆతడు కూర్చుండలేదు. చదువుసంధ్యలందు ఎంతో శ్రద్ధ వహించాడు. శాస్త్రచర్చ యందు మిక్కిలి ముచ్చట చూపినాడు. నూతన వధువు వలన జీవనము మధురాస్వాదన మయింది. మాధవ సంస్మరణ. సంకీర్తనలు వాని కలవడినవి.

జీవన మహాశయుని స్మృతిశైవలిని కొట్టుకొని వచ్చిన విషయములలో ఇది ఒకటి.

ఆకస్మికముగ మరొక సంగతి వాని జ్ఞప్తికి వచ్చింది. 'ల్యూక్స్' అని శశిని పిలిచినాడు.

అంతకుముందే బండినుండి శశి గుభాలున ఉరికి అరుగుపై కూర్చుని హుంక్కా పీలుస్తునాడు. ఇంతలో 'ల్యూక్స్' అను పిలుపు విన వచ్చింది. అచ్చెరు

పాటుతో అతడు వృద్ధుని వీక్షించినాడు. ల్యూక్స్ అని అతడు తన్నేల పిలిచినాడు?

ఆ రోజుల్లో కొంద రాతనిని ల్యూక్స్ అని పిలుస్తూ ఉండేవారు. మలేరియా చెలరేగే దినాల్లో నేపాల్ సోదరుడు సీతారాం నవగ్రామ మెడికల్ హాల్ నెలకొల్పి నప్పుడు పరిహాసముతో శశిని అట్లు పిలుస్తూ వుండేవాడు. అన్నవలె అతడు కూడ సగము పిచ్చివాడే! డెబ్బయ్యేళ్ళ ముసలివాడు మొదలు, పదునారేండ్ల బాల కుని వరకు - అందరు ఆతనికి సన్నిహితులు. ఎల్లరతో అతడు కలసిమెలసి మెలిగే వాడు. అతని చరిత్రలో ఏదో వింత పోకడ చూచి అందరు వాని దెస ఆకర్షింప బడుతూ వుండేవారు.

కలకత్తాలోని పెద్దపెద్ద డాక్టర్లకు గల పేళ్లెరిగి ఆతడు, ఆయా పేళ్ళతో పల్లెవారిని పరిహాసముతో అతడు పిలుస్తూ ఉంటాడు. జీవనదత్తుని డాక్టర్ బార్డ్ అని పిలుస్తూ ఉంటాడు. హరీశ్ డాక్టరును డాక్టర్ మేనార్డ్ అని పలుకరిస్తూ ఉంటాడు. శశిని ల్యూక్స్ అనేవాడు.

కలకత్తానుండి ఒక క్రొత్త డాక్టరు వచ్చినాడు. మిత్రవంశీయుడు. డాక్టర్ బ్రావున్ అను నామధేయ మాతనికి స్థిరమైనది.

సీతారాం ప్రదర్శించు ఈ రసికత ఎల్లరకు వినోదము కలిగిస్తోంది. డాక్టర్లు కడుపుబ్బునట్లు నవ్వుకొంటూ ఒకరి నొకరు ఈ పేళ్ళతోనే పిల్చుకొంటున్నారు.

క్రొత్త పేరు ఇపుడు శశి చెవినిబడింది. అతడు విస్మితుడైనాడు. ఇంగ్లీషు పేరుతో పిలువబడినపుడు ఇంగ్లీషులో ప్రత్యుత్తర మిచ్చుటకై ఆతడు మరువలేదు. తల యించుక వంచి, ఇంగ్లీషువానివలె "ఎస్ సర్" అని అతడు జవాబిచ్చినాడు.

"ఆ రోజులు చాలా దొడ్డరోజులు కావటోయీ శశీ!" అని జీవనమహా శయుడు పలికినాడు.

"అందుకు సందేహ మేముందండి? అది కేవలము సత్యయుగము."

జీవనదత్తు కులాసాగా నవ్వుకొన్నాడు.

శశి ఊహలు ఒక్కొక్కప్పుడు మిన్నుముట్టుతూ వుంటాయి. ఒక్కొ క్కప్పుడు అధోగతికి పోతూవుంటాయి. వాని నోరు అతిశయోక్తులతో ఊరుతూ వుంటుంది. అయిన వైకుంఠము దెస, లేకున్న నరకము దెస వాని మనస్సు పారుతూ వుంటుంది.

"సీతారాముడు శాపభ్రష్ట దేవత."

"అవును. రామహరి మాటేమిః"

"వాడు పథ్యపానములు పాటింపడు. ఏమీ తినక చచ్చుటకంటె, తిని చచ్చుట మేలని వాని వూహ।"

"పోయి చూచివస్తాను. చెప్పిచూస్తాను. క్రొత్తగా పెళ్లిచేసుకొన్న ఘటము."

"వాని మతిగతి వంకరగా పోతూంది."

"వాని పెండ్లాము వేరొకరీతి వ్యక్తి. ధార్మిక చింతన గలది. చూపులకు చక్కని చుక్క కూడ" అన్నాడు జీవనదత్తు.

"మీ మాట ఎవరు కాదనగలరుః"

మరల నగుమోముతో జీవనడాక్టరు నింగిపై చూపులు నిగిడించినాడు.

బండి నవగ్రామపు బాటలో ప్రవేశించింది.

"బాబూ! ఈ రద్దీ త్రోవనుండి బండి తప్పించు. ఈ గొడవ నాకు తల నొప్పి పుట్టిస్తోంది. ప్రక్కతెరువులోనికి తప్పించు" అన్నాడు జీవనదత్తు.

# ఇరువదిరెండవ ప్రకరణము

మట్టిత్రోవ ననుసరించి బండి పోతూవుంది.

జీవనమహాశయు డీపర్యాయము ఒళ్లు కదల్చి ప్రక్కకు ఒరగినాడు. "కొంచెముసేపు ఒంటికి విశ్రాంతి ఇవ్వండి. నేను క్రిందికి దిగి నడచి వస్తాను. ఆహా! ఈ సమయంలో విశ్రాంతి తీసుకోకపోతే బ్రతు కెట్లు నడుస్తుంది? అన్నాడు" జీవనమహాశయు డీవేళలో ఇల్లు విడిచి ఎక్కడకు కదలి వెళ్లలేదు. ఏ డాక్టరు కూడ వెళ్లివుండడు. డాక్టర్లు కూడా మానవులే కదా!

శ్రావణమాసపు అపరాహ్ణసమయము. ఆకాశము మేఘాచ్ఛన్నమై ఉన్నది. వాన లేదు. నెన్ను చదునుగా లేదు. గతుకులతో, డొంకలతో నిండి వున్నది. పొంతనున్న చెరువునుండి ఏతామువలన నీళ్లు తోడుకొంటూ తమ పొలాలలోనికి పట్టిస్తూ సేద్యం చేస్తున్నారు రైతులు. ఎత్తుగట్టుమీదినుండి బండి నడుస్తూ ఉంది. దిగువ పల్లపు నేలలో కమతము సాగుతోంది. కాని సాగుబడి ప్రోత్సాహకరంగా నడవడం లేదు. తగినంత వర్షము లేదు. వాన ఉండినయెడల రోగాలూ, రొషలూ అంతగా తలసూపేవి కావు. మలేరియా అంతగా చెలరేగేది కాదు. దానికి తోడుగా కలరా; దానివెంట నంటింది కాలా జ్వరం. విజ్ఞానశాస్త్రము ననుసరించి పరిశోధనలు సాగుతున్నాయి. ఎక్సరే ద్వారా శరీరంలోని యావత్తు నిర్మాణం కళ్లకు కట్టినట్లు అగపడుతోంది. మతితల్లి పాదమునకు తీయబడిన ఎక్సరే ప్లేటు నొకమారు చూడాలని మక్కువ పడ్డాడు జీవనదత్తు.

హఠాత్తుగా జీవనమహాశయుని చింతాసూత్రము పుటుక్కున తెగిపోయింది చేయి వూపుతూ శశి ఎవరినో పిలుస్తున్నాడు.

"ఎవరిని పిలుస్తున్నావు శశీ?"

"చేపలు ఎగురుతున్నాయి."

"చాలు. చాలు. బండెక్కు."

క్రమక్రమంగా తెరువు ఎత్తుగుతోంది. ఎడ్లబండి మాత్రం కష్టంమీద పోయేందుకు వీలుంది. ఇపుడిపుడు కష్టంమీద జట్కాలు నడుస్తున్నాయి. ఎవరో ఒక ఆసామి సైకిలెక్కి పోతున్నాడు.

ప్రద్యోత డాక్టరు ఒక మోటారు కొనాలని అనుకొంటున్నాడు. అధమ పక్షం ఒక మోటారుసైకిలైనా కొనడం వాని ఉద్దేశం.

జీవనదత్తు బండి చూచి ఎవరో "ఏమండోయ్ త్వరగా రండి" అని అరచినారు.

రామహరి ఇంటి గుమ్మంవద్ద శుష్కముఖులై కొందరు నిలిచివున్నారు. వారిని చూచి జీవనడాక్టరు చకితుడు కాలేదు. గుండె ఆగిపోయి అతడు చచ్చి వుంటాడు. ఆశ్చర్య పడవలసిన దేముంది? కాని వెనుక కూర్చుండిన శశి "ఏమి? ఏమయింది?" అని అచ్చెరుపాటుతో అరచినాడు.

"డాక్టరుబాబూ! మీరు వెళ్లిన పిదప రెండుసారులు ఉక్కిరిబిక్కిరి అయి పోయినాడు. ఇంతలో ముంచుకువచ్చింది" అన్నారు అచ్చటివారు.

మహాశయుడు బండిలో లేచి కూర్చున్నాడు. తన కాల్‌బాక్స్ వెలుపలికి తీశాడు. ఆలోచనలో పడినాడు. అతనివద్ద మకరధ్వజ మున్నది. మృగనాభి లేక పోలేదు. కాని యీనాటి వైద్యంలో విశేషంగా పనిచేస్తున్నాయి ఇంజెక్షనులు. రామహరి ఇంకా చచ్చేందుకు సందేహిస్తున్నాడని దత్తుడాక్టరు గ్రహించాడు. శశి ఇంజెక్షన్ పెట్టైకై తహతహలాడినాడు. వానివద్ద సిరంజి ఉన్నది. ఇక సూది మాట. దట్టమైన వేషంలో ఎందో అది అడగిమడగి దాగుడుమూత లాడుతోంది. కోటు జేబుల్లో తంబాకు వగైరాల నడుమ అది అధివసించి వుంటుంది. ఇక ఔషధం మాట. అది ఏజేబులోనూ ప్రవేశించివుండదు. అయినప్పటికీ శశి చప్పు చప్పున రోగులకు ఇంజెక్షనులూ ఇస్తూవుంటాడు. మందేమో యెరుగడు. కాని సూదిపోటుతో దానిని ప్రయోగిస్తూ వుంటాడు. అందుల కిపుడు అతడు వుద్యుక్తుడైనాడు. కాని జీవనదత్తు అతనిని వారించి, "సూదిపోటు వద్దు. మకరధ్వజము ప్రయోగిద్దాము. రామహరి పరలోకయాత్రకు సర్వసన్నద్ధుడై వున్నాడు. ఇంజెక్షనిచ్చి ఆ యాత్రను ఆలసించిన కలుగు ప్రయోజన మేమి? జ్ఞానగంగ ఆచారము ననుసరించి అవసాన సమయమున గంగాతీరమును చేరవలసినదే కదా! తీర్థయాత్రల యెడల, దేవతా దర్శనములయెడల రామహరి విశేష విశ్వాసము గలవాడు. ఇపుడాతడు వలచిన సాక్షాత్కారము వానికి లభించితీరును". అన్నాడు.

రామహరి శయ్యపై పడియుండెను. వివర్ణ పాండుర దేహవర్ణము స్పష్టముగ అగపడుతూ వున్నది. వాని చూపులో ఎట్టి వెలుగు లేదు.

అజీర్ణ అతిసారములు చాలకాలమునుండి వానిని పీడిస్తున్నవని వాని వైఖరి చెప్పక చెపుతోంది. వీని తెవులు 'ఇంటెస్టైనల్ ట్యూబర్కులోసిస్' అని ఈకాలపు అలోపథిక్ వైద్యులు చెబుతూవుంటారు. క్షయ కూడ లేకపోలేదని డాక్టర్లు తెలిపిరి. తెవుళ్లసంపుటి దృగ్గోచర మవుతూంది.

శశి వాని చెవిదగ్గరకు పోయి "రామ్! రామ్! డాక్టరు బాబు వచ్చారు రామ్!" అన్నాడు.

"శశీ ఊరుకో! నీ కతడు జవాబు చెప్పలేడు. నువ్వు వెనక్కి రా. నేను చూస్తాను" అన్నాడు జీవనదత్తు.

రామహరి చెల్లెలు అన్నను చూచేందుకై వచ్చినది. డాక్టరు ఉండగనే వానిచే వీలునామా వ్రాయించాలని ఆమె గట్టి పట్టు పట్టింది. లేవలేని వానిచే వేలుముద్ర వేయించింది. సాక్షుల సంతకాలు ముగిసినవి.

రోగి తలపొంత కూర్చుని తరుణి యొకతె మొగమును మేలి ముసుగుతో కప్పుకొని, వెక్కి వెక్కి యేడుస్తూంది. డాక్టరు ఆమె నొక పర్యాయము తేరిచూచినాడు. తరువాత ఆమె నాడి చేబూని కన్నులు మూసికొనినాడు. నాడి మిగుల క్షీణమై ఉన్నది. అది మిగుల దుర్బలము. మందగతిలో కొట్టుకొంటూన్నది. ప్రాణం ఉన్నంతవరకూ అది అలా కొట్టుకొంటూ ఉండాలికదా! అది నిలిచిపోయేందుకు వీలు లేదు. అధికారము లేదు. అవకాశము లేదు. వేరు తెరవు లేదు. గ్రహణ సమయంలో చంద్రుడెలా కంపించునో అపుడపుడు అది కంపిస్తూన్నది మిగుల సూక్ష్మానుభూతికి అది అందును. క్షయరోగ కీటకము గుండెను అహరహము ఎలా తినివేస్తుంటుందో, పట్టుపురుగు తన గ్రాసము నెట్లు నోట గరచునో ఆ విధంగా వాని దేహ పంజరమును విసపు పురుగు లోపలినుండి తినివేస్తున్నది. ఇందుకు సందేహం లేదు. కాని తక్షణమే మృత్యుకాంత వానిని దిగమ్రింగునని రాయి గ్రుద్ది జీవనమహాశయుడు చెప్పలేక పోతున్నాడు.

స్టెతెస్కోప్‌తో అతడు రోగి గుండెను పరిశీలించినాడు. వాని అవస్థలో ఆకస్మికపరిణతి ఏమియు అగపడలేదు. నాడి లక్షణముతో గుండె గుణము సరిపోలియున్నది. శశి చిత్తము వచ్చినట్లు వాగడం ఆరంభించాడు. "ఇదంతా ఖలవ్యాధి. ఇతగాడికి ఏదేని ఒక ఏర్పాటు చేయాలని చెవినిల్లు కట్టు కొని చెప్పినాను. గంగా

తీరమునకు పంపవలసివస్తే చప్పున చెయ్యండి. లేక ఇంకా డాక్టరునే పట్టుకొని ప్రాకులాడాలంటే, అలాగే ప్రాకులాడండి. మరణం ఎవరికి తప్పుతుంది?....''

పొంతనున్న తరుణి మరల ఏడుపు ఆరంభించింది. శశి తన ధోరణి సాగించాడు. "చెప్పినట్లుగా జరుగలేదు. ఎందుకు జరుగుతుంది? ఏదైనా తలరాతను బట్టే సాగిపోతుంది. కర్మఫలమును అనుభవించి తీరాలికదా! గంగాతీరంలో జ్ఞానంతో మరణించడం ఎంతటివారికి లభిస్తుంది? అందుకు నోచుకొని పుట్టాలికదా! చికిత్సకుడు మాత్రం ఏం చేస్తాడనికదా మన శాస్త్రాలు చెపుతున్నవి. ఆ భిషగ్వరుడు సాక్షాత్తూ ధన్వంతరి కావచ్చును. ఈనాటి నీలరతన సర్కారు కావచ్చు. లేక డాక్టరు రాయ్ కావచ్చు. ఇక మందులూ, మాకులూ, మాత్రలూ ఏం చేస్తాయి? అది అమృతమే కావచ్చును. పెద్ద మొత్తానికి లభించిన కొత్త మందు కావచ్చు. ఆయుర్దాయం లేక పోయిన యెడల ఏం చేసినా కొరగానిదే అవుతుంది కదా! డాక్టరుది గట్టి బుర్ర కావచ్చు. ఇంతలో మించిపోయినట్లు మతి భ్రమ దాపురించి సమస్త వైద్యమును తలక్రిందులు చేసివేయవచ్చును.''

మహాశయుడు లేచినాడు. ఇక అంతా మునిగిపోతుందని గ్రహించాడు.

ఈ పర్యాయం ఆ తరుణి అతని కాళ్లపై పడి "ఏమండి డాక్టరుగారూ! ఇక నేను ఏ గంగలో మునిగేది బాబూ!" అని గోల పెట్టసాగింది.

మహాశయుడు ఒక పర్యాయం ఎల్లర ముఖాలను తేరిచూచినాడు. "భయం లేదు. అమ్మా! లే! నీవు లే'' అన్నాడు.

''ఏమమ్మో! లెమ్మంటే నువ్వు లేచి తీరాలి. డాక్టరుగారు భయము లేదని చెప్పినప్పుడు ఏడుస్తున్నావెందుకు? ఈయన ఏవో రెండు మాటలు చెప్పిపోయే వైద్యుడు కాడు. జరిగిందేమో జరిగింది. అంతా బాగానే జరిగిందనుకోవాలి. ఇంకా బాగా జరుగుతుంది. తప్పుకో! తప్పుకో! లే! లే!'' అని శశి స్పష్టంగా చెప్పివేశాడు.

జీవనమహాశయుడు వెలుపలకు వచ్చినాడు. తొలుత ఆయన కంట బడింది సైకిల్. "శశీ!'' అని అతగాడు కేకవేశాడు.

శశి ఈ ధోరణిలో ప్రసంగం చేశాడు. "అవు నవును. పాప మామె ఆడు కూతురు. గొప్పయింటి బిడ్డ. ఆమె మతి పోయింది. కాపాడగలవాడు కేవలం దేవుడు. మనం మనుష్యమాత్రులము. అయినప్పటికీ విడిచి పెట్టి వేస్తామా?"

బొంగురు గొంతుకతో డాక్టరు ఇట్లన్నాడు.

"శశీ! నీ ధోరణితో ఆమెను చంపి వదలకు. బుద్ధిపూర్వకంగా అంతపని చెయ్యరాదు. నా మాట నీ చెవికి ఎక్కడం లేదా?"

"చిత్తమండి. ఎక్కుతూ యెక్కుతూ వుందండి."

"ఈ అవస్థ మూడురోజులనుండి సాగుతోంది. ఇటువంటి సందర్భంలో నన్నెందుకు కొంచెము పిలిచినారు కారు."

"కాళీమాత కటాక్ష మండి." అని అన్నాడు శశి.

"ఏమంటున్నావు?"

"కాళీమాత కటాక్షమంటున్నానండి. గంగాదేవి దయ. మరి గురువుగారి ఆశీర్వాదము."

మహాశయు డిట్లు సెలవిచ్చినాడు. "మీలో కొందరిని పోలీసులకు అప్పగించి తీరాలి. ఇక నోళ్లు ముయ్యండి. అరవకండి. ఇపుడు నామాట వినండి. సైకిలు తొక్కుతూ మా కెదురైన ఆ కుర్రవాడేడి? ఇదిగో! ఇక్కడే వున్నాడు. మాట విను. సిరాబుడ్డీ కలం పట్టుకొనిరా. కావలసిన ఔషధం రాసి యిస్తాను. మందుల షాపులోంచి చప్పున తీసికొనిరావాలి. బజారు డాక్టరు—హరేన్ బాబుకు ఈ జాబియ్యి. తెలిసిందా? ఒక్క ఉరుకుగ పోయిరావాలి."

శశి మిగుల చురుకైన ఘటం. శక్తియే వాని బ్రతుకును నిలపెడుతూ వుంది. అతగాడు ఆ కుర్రవాని చేతినుండి జాబును, ప్రిస్క్రిప్షనును తీసికొని చూచి, గ్లూకోస్ యిన్‌జెక్షన్ యిస్తారా? ఇన్ట్రావీనస్ ఇంజక్షనా?" అన్నాడు.

"అవును. దానివలన కొంత ఉధృతం తగ్గి తీరుతుంది. అంతకు ముందు కొంత మకరధ్వజం తినిపిస్తాను."

"ఉధృతం తగ్గిపోతుందా? రామహరి తెగులు చావు తెగు లనడం తథ్యం. దేవుడు దిగివచ్చియైనా కాదనలేడు. కాని యింతలో ప్రాణం గుటుక్కు మంటుందని రాయి గ్రుద్ది చెప్పలేను."

"అయితే మీరు ఇంజెక్షను యిస్తారుకదా?"

"రావలసిందని హరేన్ డాక్టరుకు రాశాను. ఇన్‌జెక్షన్ అతగాడిస్తాడు. అతడు రాకపోతే నేనే ఇస్తాను."

"ఇంతలో వీడు చస్తేనో?"

"ఇంతలో చావడమో, మానడమో నేను చూసుకొంటాను. వీలూ గీలూ రాసుకొనేందుకు టైముండక పోదు. నేను సాక్షిగా ఉంటాను. వీలుకొరకై రోగి తలకాయను కొంచెం నిలబెట్టితీరాలి."

ఈ పర్యాయం శశి నోరు మూసుకున్నాడు. మహాశయుడు మరల ఇట్లు తెలిపినాడు. "వీలులో ఎక్కవలసిన విషయమేమో నాకు బాగుగా తెలియదు. ఇప్పుడున్న పెళ్లాము ఆఖరు యిల్లాలు. ఈమెకై ఏమైనా రాసితీరాలి కదా!''

ఇంచుక సేపూరకొని, తల పంకించి, ఆత డిట్లన్నాడు. ''శశీ! అదెంత వరకు సాధ్య మవుతుందో చెప్పలేను. రామహరి అభిప్రాయమేమో తెలుసుకోవాలి. అతగాడి మొదటి భార్యకు పుట్టినవాడు ఒకడుండేవాడు. అతడు పరలోకంలో ప్రవేశించాడు, కాని వాని కొక కొడుకు. రామహరి మనుమడున్నాడు. కోడలు కూడ ఉంది. ఆమె చస్తుందని చెప్పలేను. చావదని చెప్పడమెలా? ఆమెకు యీ సందర్భంలో కావలసిన వైద్యం నేను చేసితీరుతాను. ఆ భారం తలపై వేసు కొంటాను.''

''జ్ఞాన గంగాయాత్రకై పోవాలని రామహరి ఉద్దేశించాడు. మొదటినుండీ అతగాడు పీనుగురాయడై కూర్చున్నాడు. అడుగడుగుకు మృత్యు మహిశ అగ పడుతూంటే భయ మేముంటుంది? భయపడితే మృత్యువు ముందు కురుకుతుంది. అపుడాతడు ''కుయ్యో! మొర్రో!'' అని గోల పెట్టక మానడు. ఆ సందర్భంలో అతడు జ్ఞానగంగా యాత్ర ఎట్లు చేయగలడు? వనవిహారి కట్లు చెయ్యడం సాధ్యం కాలేదు. రామహరి శరీరం చిక్కి చిక్కి పోయింది. నోటినుండి సరిగా మాట రావడం లేదు. మాటి మాటికి కన్నులలో వెర్రిచూపు అగపడుతోంది. ఆ చూపు చూస్తే భయం వేస్తోంది.''

హరేన్ డాక్టరు వచ్చు వరకు కూర్చుని ఉన్నాడు జీవనమహాశయుడు. ఇంతలో మరొక పర్యాయం రోగి నాడి చూచినాడు. నాడి కొంత ఆడుతోంది. మొగంపై తెలివి అగపడుతోంది. హరేన్ రాగానే వానికి రోగస్థితి యావత్తూ విప్పి చెప్పినాడు. "నీ వొక గ్లూకోస్ ఇన్‌జెక్షన్ ఇచ్చి తీరాలి, ఇచ్చి తీరాలని చెపుతున్నాను. నేను బాధ్యుణ్ణై వుంటాను. నీకు భయం లేదు'' అని జీవనదత్తు పలికినాడు.

అతడు రోగిచేతిని మరొక పర్యాయం పరీక్షించినాడు. మకరధ్వజం యొక్క ఉష్ణత, శక్తి వాని నాడియందూ, శరీరమందూ అగపడుతోంది. రోగి

చేతిని వదిలి "నువ్వు ఇన్‌జెక్షనియ్యి. నా మాటవిను" అని దత్తు హరేన్‌తో పలికినాడు.

ఇంజెక్షను ఇచ్చి హరేన్ చేతులు కడుగుకొని, రోగిస్థితి గమనించి చిరు నవ్వుతో ఆతడు "మహాశయా! మీ కాండ అద్భుత మైనది. మిగుల అద్భుత మైనది." అన్నాడు.

జీవనమహాశయుడు నవ్వినాడు. నవ్వక మరేమి చేయగలడు? ఆ మాటకు ప్రత్యుత్తరము ఏమి ఈయగలడు?

హరేన్ ఇట్లనినాడు: "మరొక శుభవార్త తెలుపుతున్నాను. బిపిన్‌బాబు యెక్కిళ్లు ఆగిపోయినవి. ఇక్కడకు వచ్చేందుకు ముందే ఈ వార్త తెలిసింది. ఆతని యెక్కిళ్లు చూచి నేను ఆశ పోగొట్టుకొన్నాను. నాలుగు రోజులు నా కన్నులు మూతపడలేదు. నోట కబళము పెట్టలేకపోయాను. కబురు తెలిసి, పోయి చూచి వచ్చాను. బాగా నిద్రపోతున్నాడు. మీకు కబురు పంపినారు. అప్పుడు మీ రింటిలో లేరు. ముసలివాడు రతనబాబు సంతోషమునకు మేర లేదు. కృతజ్ఞతతో లెక్కలేని ధన్యవాదాలు సమర్పించాడు. ప్రద్యోత డాక్టరు కూడ వచ్చి నాడు. వాని అచ్చెరుపాటుకు కూడ మేర లేదు. ఈ విషయమై నే నిపుడేమీ చెప్ప లేక పోతున్నాను. మరల ఆరంభమైనా కావచ్చు. ఈ ఔషధానికి రీయాక్షన్ వుండును కదా! కాని యిపుడు క్రైసిస్ దాటి పోయింది. ప్రద్యోత డాక్టరు అవాక్కై పోయినాడు. వస్తూ వస్తూ దారిలో ఆత డిట్లన్నాడు: 'ఈ వృద్ధుని పద్ధతి నాకు బోధపడడం లేదు. ఈ విషయమును గురించి నాకెందుకు సందేహం కలుగుతుందో యెరుగుదురా? ఇపుడొక డిస్పెప్సియారోగి వచ్చి కూర్చున్నాడు. మిగుల గడ్డు పరిస్థితిలో పడియున్నాడు. నువ్వు బ్రతకవోయీ! అని చెప్పి వేశాడు. ఎన్ని దినాలలో ప్రాణం గుటుక్కు మంటుందో చెప్పివేశాడు. హరేన్ ఈ పర్యాయం మహాశయుని దిక్కుగా తిరిగి "అలా చెప్పి వేసినారా?" అని ప్రశ్నించాడు.

దృఢ స్వరంతో దత్తు ఇట్లనినాడు. "హరేన్! నా మాటలో ఎప్పుడూ పొర పాటుండదు. రోగానికి మృత్యు వెంత దూరంలో ఉందో చెప్పడం అమ్మకక్క కాదు. కాని అన్నప్పుడూ నేను రాయిగ్రుద్ది చెప్పలేను. ఈ వ్యాధితో వానిని అన వరతము పీడించు గడ్డు అలవాటు కలదు. కొంప తగులబడుచుండగా మరికొన్ని కొరకచ్చులు మంటలపై వేస్తే ఎలా ఉండును? మరి పెనుగాలి వీచినయెడల

ఆ మంటలు మరింత చెలరేగవా? రెండు చెంబులనీరు పోస్తే మంటలు చల్లారునా? రోగి పట్టిలోభి. అయితే ఏమవుతుంది? మా నాయనగారిలా చెపుతుండే వారు.''

'నాయనా! మనుష్యుని పీడించు దుష్ట శక్తులు మిక్కుటముగా ఉండును. అన్నిటిని అడచుట సాధ్యం కాదు....ఏ ఒక్కటో మిగిలి ఉంటుంది. అది మృత్యువును దూ! దూ! అని పిలుస్తూ ఉంటుంది. ప్రవృత్తి పెడత్రోవను బట్టకపోయిన యెడల అది రక్షణ మొనరించునదే! అప్పుడది అపథ్యము చేయదు కూడని ఖాద్యపదార్థముల పొంత పోదు. అది పెడ త్రోవను బట్టినయెడల, గుప్పిట ముప్పును చేర్చుకొనినదే యగును. ఆ ముప్పు మృత్యువునకు అంగరక్షకుడుగా ఉండును.'

తిరిగి పోవు నపుడు ప్రసంగం సాగుతోంది. కాలినడకనే ఆతడు పోతున్నాడు. శశి అదృశ్యుడై పోయినాడు. బండి మరి దొరకలేదు. హరేన్ సైకిలు పట్టుకొని అతగాని వెంట నడుస్తున్నాడు; మౌనముగా నడుస్తున్నాడు. మహాశయుని మాటలను చెవిలో జొనుపుతున్నాడు. ఇంత సైన్సులో ప్రవేశం పొంది అవి సంపూర్ణంగా వేదవాక్కు లని ఆతడెట్లు నమ్మును? అయినను జీవనమహాశయుని వంటి ప్రవీణునితో ఆత డెట్లు తర్కింప సాహసించును? వాని మౌన ముద్ర జీవనదత్తుకు మరింత ఉత్సాహము కలిగించింది. ఆతడు తన ధోరణి యిట్లు సాగనిచ్చాడు. ''చూడు బాబూ! ఆ రాణా పాఠక్ విషయం. వాని బల మెంత ఉండేదో చెప్ప నలవి కాకుండెను. వాడొక దైత్యుడు. వాని శత్రువు కామ మైనది. వానికి ప్రమేహ వ్యాధి సంక్రమించింది. వానిలో అది జీర్ణించుకొని పోయింది, నా చేతనైన పని నేను చేసి, మణిపూరు డాక్టరు వద్దకు ఆతగాణ్ణి పంపినాను. ఒక యువతి పాలపడినాడు. ఒళ్లు చెరచుకొనినాడు. ముప్పు ముంచుకొని వస్తుందని తెలిసి కూడ పంకిలంలో దిగబడినాడు.''

హరేన్ చిరునవ్వు నవ్వినాడీ పర్యాయం.

జీవనమహాశయుడు కథ యిట్లు చెప్పుకొని పోయినాడు. ''మరొక అద్భుత వ్యక్తి విషయం చెపుతాను. బహుశః నీ వతణ్ణి చూసి వుండవు. పేరు విని వుంటావు. గొప్ప గాయకుడు. మంచి మంచి పాటలు పాడుతూ వుండేవాడు. పేరు సుందరదాసు. పేరెట్టిదో కంఠం కూడా అట్టిదే! రూపము సుందర మైనదే! వానిని చూచిన వెంటనే ఎవ్వరి హృదయ మైనను ప్రసన్నము కాక మానదు. అతడు మేలి సాధకు డని లోకులు చెప్పుకొంటూ వుండేవాళ్లు. కోప తాపాలు వాని మనస్సు

నంటలేదు. వానిలో ఆవంత లోభం లేదు. తియ్యగ మాటాడగలడు. వినయ విధేయతలతో మెలగువాడు. మోహ మాత్సర్యములు వానిలో లేవు. కాని ఆతడు కామ పీడితుడు. కామము నాతడు జయింపలేక పోయినాడు. కాలము గడచు కొలది ఆతడు పిచ్చివాడై పోయినాడు. కుంటివాడైనాడు! ఏదేదో సాధన చేస్తుం డగా అత డట్లై పోయినాడని ప్రజలు చెప్పుకొంటూ వుంటారు. మే మంతా అట్లనే నమ్మినాము. కాని యిట్టి సందర్భాలలో మా నాయనగారు చెప్పే మాటల ప్రతిధ్వని రంగలాల్ డాక్టరు ధోరణిలో వినబడేది. అతడు పోయి సదరు సుందర దాసును చూచినాడు. అప్పటికి వాని ఒళ్ళు కుళ్లి వుంది. కామమునకు దాసైనాడు సుందరదాసు. ప్రమేహ విషయము వాని శరీరమున పూటుగా ఎక్కింది. పిచ్చి వాడై అతడు మరణించినాడు"

మహాశయు డింపక తాళి మరల ఇట్లన్నాడు "బాబూ! రతనబాబు బిపినుల కేసులు చూచినావు కదా! వీనికి కూడ దాపురించిన తెవులు అట్టిదే! ఆత్మ ప్రతిష్ఠపై బుద్ధి నిలుపనివాడు. స్వగౌరవ సంరక్షణ చేసికొన నిచ్చగించని వాడొక మనుష్యు నిగ గణింపదగినవాడా, మనుష్యత్వము మంట గలిసిన యెడల, ముముక్షుత్వము గగనకుసుమ మైనయెడల, బ్రతుకు మరు భూమి కదా!" చకితుడై హరేన్ ఇట్లు ప్రశ్నించాడు. "అయితే బిపిన్ విషయం మీకు నమ్మకం——"

"ఆ నమ్మకం విషయమై కంఠ మెత్తి ఏం చెప్పగలను? కాని అది అత్యంత కఠినమైన సమస్య! అత్యంత కఠిన మైనది."

"ఈ వేళ అతడు బాగానే వున్నాడే! అతడు బాగుగా తేరుకొన్నట్లే నాకగ పడినాడు. ఎక్కిళ్ళు నిలిచి పోయినాయి. తెప్పరిలినాడు. నిద్ర పోతున్నాడు."

"భేష్! అతడు బాగా ఉండుగాక! బ్రతికి బట్టకట్టుగాక! కాని హరేనూ! అతడు నేడు లేచి నిలిచినను, మరి నిలువలేడు. మరల పడిపోతాడు. ప్రవృత్తి పగ సాధింప నెంచినపుడు, వానిని పిడికిట పట్టడం కష్టం."

"అయితే వాని గంగా యాత్ర మళ్లేది కాదన్నమాట."

"గంగ ఎక్కడికి పోతుంది? యాత్ర ఎక్కడికి పోతుంది? మానసికమైన నిలుకడ నిలుస్తుంది రెండునాళ్లు. మరల మనస్సు కోతివలె ఉరుకు లెత్తుతుంది. రతనును చూస్తున్నాను. బిపినును చూస్తున్నాను. రతను పిల్లవానిని చూచినపుడు వనవిహారి విషయం జ్ఞాపకానికి వస్తోంది."

మహాశయుఁడు పెద్ద నిట్టూర్పు విడిచినాడు. మందహాసరేఖ కూడ ఆతని వదనముపై అగపడింది.

ప్రసంగం హఠాత్తుగ మార్చి "ఒక పర్యాయం చండీ మందిరానికి పోవాలి. వస్తావా? మహంతు ఈవేళ పరలోక యాత్ర సాగిస్తాడు. ఒకసారి పోయి చూసి వస్తాను. ఈరాత్రి ఆతడు నిష్క్రమిస్తాడు." అని మహాశయు డన్నాడు. ఇరువురు వానికడకు పోయినారు.

మహంతు అపసన్నుడై పడివున్నాడు. ఇంచుమించుగా కాళ్లు చేతులు చల్లబడినవి. మూతలుపడిన కన్నుల నాతడు తెరచుట లేదు. మధ్య మధ్య వాని మొగము వికృత మౌతూ వుంది. ఏదో నిష్ఠురయాతన వలన ఆతడు బాధపడుతూ వున్నట్లు వాని ముఖవైఖరి చెప్పక చెపుతోంది. "మీరు అనుజ్ఞ యిస్తే మహంతుకు ఒక ఇన్‌జెక్షను ఇస్తాను" అన్నాడు హరేన్.

"వైద్యుడనై నేను వద్దని యెలా అనగలను? ఇవ్వదలిస్తే యియ్యి."

మహంతు శిష్యు డిట్లన్నాడు: "సూది వైద్యం వద్దని మా గురువుగారు మాటిమాటికి చెపుతూ వుంటారు. ఈవేళ వీరు సెలవు పుచ్చుకొంటారని మహాశయు డంటున్నారు. శరీరం చీకి చివికిపోయింది కదా."

"నువ్వు ఊరుకో." అని జీవనమహాశయుడు హరేన్‌తో పలికెను.

హరేన్ ఇన్‌జెక్షను మానెత్తక సన్యాసిని చూస్తూ నిలిచినాడు. హరేన్ ఈ గ్రామంలో పుట్టి పెరిగినవాడు. ఆతడు డాక్టరైనను, ఈరీతి చావుకథలను పెక్కింటిని విన్నాడు. నేడు కూడ మరణసమయంలో కొందరు కొందరు మందు మాకులను ప్రక్కకు పడవేసి, రోగి నోటిలో గంగాజలమును, పాలచుక్కలను, పోస్తూ వుంటారు. పూర్వ దినములలో జరిగిన సంఘటనలను గురించి ఆతడింకను చిత్ర విచిత్రపు కథలను వినియున్నాడు. అయినను, నేటి ఈ మృత్యు దృశ్యము వానిముందుల అపూర్వమై, విస్మయమై చూపట్టినది.

మహంతు మహాకాయుడు. ఏనుగు పీనుగైనట్లు పడివున్నాడు. ఊపిరి ఆడడం కష్టంగా వుంది. అది మెల్లగా మెల్లగా నిలిచి పోతూ వున్నట్లు తోచింది. పెదవులు ఇంచుక కదలుతున్నవి.

ఆతని వైఖరి చూచి "మహంతు ఇష్టమంత్రముమ జపిస్తున్నాడు. లోపల జ్ఞానం వుంది. గ్రహణి వ్యాధి పీడితులకు జ్ఞానము తుదిముహూర్తం వరకు

వుంటుంది." అన్నాడు మహాశయుడు. హరేన్ కాదనలేదు. కాని వాని గుండెలో అభిప్రాయభేదము నడయాడుతూ వుంది.

''వాని చేతిని కనిపెట్టి చూడు'' అన్నాడు మహాశయుడు.

జపక్రియలో మహంతు వ్రేళ్లు కదలుతున్నట్లు అగపడినవి.

"అలా అయితే ఈయనను అవ్వల చేర్చివేతునా?"

"అవును. ఇక ఆవల చేర్చడం నిక్కమే! మహంతు దేహమునే వదలుతున్నాడు. ఇక గేహములో వుండడం ఎందుకు? ధరిత్రీదేవి నాశ్రయించాలి. మొగము ఆకాశము దిక్కుగా వుండాలి'' అన్నాడు జీవనమహాశయుడు.

అవ్వల అపుడనేకులు గుమిగూడి వున్నారు. ప్రాతఃకాలమున జీవన మహాశయుని నాడీపరీక్ష నెరిగి మహంతు శిష్యునితో "అరే! భోలా! రెండుమూడు గ్రామాల భజన దళములవారికి కబురు పంపు. నాకీవేళ సెలవు దొరకుతోందని వారికి తెలియజెయ్యి. ఇక నేను పరలోకయాత్ర సాగిస్తాను. ఇక సంకీర్తన జరిగి తీరాలి. రామనామ సంకీర్తనలను ఆలపించాలి. సంకీర్తన వింటూ వింటూ నేను పోతాను. బంధనము తెగిపోతుంది. సద్గతి లభించి తీరుతుంది." అన్నాడు.

జీవనమహాశయుడు అవ్వలకు వచ్చి "అనండి! హరేరామ! హరేరామ! రామరామ హరేహరే! కంఠమెత్తి సంకీర్తన చెయ్యండి. జయగోవింద! జయ గోవింద!'' అన్నాడు అచట గుమికూడిన ప్రజలతో.

చప్పట్లతో సంకీర్తన ఆరంభమైనది. భజనదళమునకు ముందు నిలిచినాడు జీవనమహాశయుడు. ''హరినామమే సంసారసముద్రంలో నావ. హరి, హరి అని నావను తొయ్యండి అని, హరి! హరి గోవింద! గోవింద! నారాయణా! నారాయణా" అని సంకీర్తనము చేయసాగినాడు.

మహంతు శరీరమును భక్తులు మిగుల భక్తిశ్రద్ధలతో లేవనెత్తి అవ్వలకు గొనిపోయి, చండీదేవీ మందిరప్రాంగణంలో పరుండబెట్టినారు. సన్యాసి ఊపిరి వడివడిగ ఎగువకు పోతోంది.

హరేన్ నిశ్చేష్టుడై నిలిచినాడు. చికిత్సకుని దృష్టితో బ్రతుకంత అసారమని ఆత డనుకొనలేదు. అతని మనస్సు ఎలాగో అయిపోయింది. విచిత్రము! విడ్డూరము!

# ఇరువదిమూడవ ప్రకరణము

నేలమీద పదునేను దినములు గడచినవి.

జీవనమహాశయుడు సేతాబు నెదుట కూర్చుండ బెట్టుకొని చతురంగపు బల్లను నడుమ అమర్చెను.

అది భాద్రపదమాసము. ఆకాశ మిపుడు నిర్మేఘమై నీలమై యున్నది. సుమారు వారము దినములకు మున్ను కుంభ వృష్టివలన నేల జలమయమై పోయినది. చతురంగపు బల్లపై ఆతడు చూపు నిలిపినాడు. నేడు జన్మాష్టమి పుణ్య దినము. వివిధ రీతుల మృష్టాన్నము ఇంటిలో తయారైనది. రెండు పళ్లెములందు మిఠాయీలను, టీ పాత్రలను ఇల్లాలు అమర్చి భర్తకును, మిత్రునకును దాపల పెట్టినది. కొంత పాయసము చేర్చబడినది. సాధారణ పరిస్థితులలో మహాశయుడు వీని నంటడు. ఆ సమయములో ఒక్క టీ తప్ప మరి దేనిని ఆతడు ముట్టడు. డాక్టరు పరీక్షకై చదువుకొనే కాలంలో రంగలాల్ డాక్టరువద్ద ఈ రీతి అలవాటును ఆత డలవరచుకొనినాడు. ఏదైన భుజించి, టీ త్రాగుమని ఇతరుల కాతడు హిత వాసగుతూ వుంటాడు. కాని అపరాహ్ణ సమయంలో ఆతడు ఖాళీ కడుపులో తేనీరు మాత్రము పోస్తూ వుంటాడు. భోజన మయ్యేటప్పటికే ఆతనికి చాల సమయమై పోతుంది. అందుచే అపరాహ్ణమున ఆతని కంతగా ఆకలి కలుగదు. ఇది ఒక కారణ మగుట నిశ్చయమే. కాని అసలు కారణ మింకొకటి కలదు. సంధ్య కడచిన పిదప లేక చతురంగపు ఆట ముగిసిన పిదప (ఏడు గంట లైనను, ఎనిమిది గంట లైనను, రాత్రి పన్నెండు గంటలైనను) కాళ్లు చేతులు కడుగుకొని, బట్టలు మార్చుకొని ఇష్ట దైవమును ధ్యానించి. అనంతరము భోజనము చేస్తూ వుంటాడు. మాధవనామ మాతనికి మిగుల ప్రీతికర మైనది.

ఇల్లాలి మనస్సు నేడు కొంచెము కుదుట పడివుంది. జన్మాష్టమినాడు ఉపవాసము చేసి, సేతాబును పిలిచి, నేడు బ్రాహ్మణ సమారాధనము సలిపినది. అపరాహ్ణమున మరల ప్రత్యేక ఫలహారముల యేర్పాటు చేసినది. కేవలము బ్రాహ్మణ సమారాధనమే కాదు. దంపతి భోజనము ఏర్పాటు చేసి పాయసముతో దంపతు

లను ముంచెత్తి వేసింది. వ్రతములు సలిపినపుడు, ఉపవాసములు జరిపినపుడు ఆమె ప్రసన్న చిత్తయై ఉంటుంది. పరలోకమునకు సంబంధించిన ఊహా పరంపర ఆమెలో విశేషముగా విజృంభిస్తూ వుంటుంది. ఇంటిలోని సన్నాహముల కెట్టి లోపము ఘటిల్లదు. ఆమె చేత యందెట్టి తృప్తి అగపడదు. మహాశయుని భక్తుడు పరాన్ ఈ ఉత్సవ సమయమునకు వలసిన బహు సంబారములను పంపెను. రామహరి పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, వేర్వేరు కూరలు, పిండి సమృద్ధిగా పంపెను. మృత్యుముఖమునుండి తొలగి ఆత డిపుడు స్వస్థుడై ఉన్నాడు. ఆతని కోడలూ, మనమలు వచ్చి భక్తి శ్రద్ధలతో ఆతనికి సేవచేయ దొడగిరి. జీవనమహాశయుని యెడల వారు వ్యక్తీకరించిన కృతజ్ఞత అనిర్వచనీయమై ఉండెను. రామహరి సాధారణముగా చిడిముడిపాటుతో వ్యవహరిస్తూ వుంటాడు. అపుడపుడు శాంతచిత్తుడవుతూ వుంటాడు. జీవన దత్తుతో "మహాశయా! పూర్వ జన్మలో మీరు నాకు కన్నతండ్రియై యుందురు. లేకున్న యెడల నాపై మీ కింత కటాక్ష మేల కలుగుతుంది." అని అంటూవుంటాడు.

"అవును బాబూ! అయినా నిజం చెప్పాలంటే నీ రోగం చాలా గడ్డు తెగులు. ఆలస్యం చేయక నువ్వు వీలునామా వ్రాసి వుంచడం మంచిది. నీ భార్య తరుణి. ఆమె యెడల అన్యాయం వహించకు సుమీ."

ఆ తరుణి మహాశయుని ఇల్లాలితో కలిసి కిటికీ యొద్ద కూర్చుని యావత్తు ప్రసంగం వింటూవుంది.

బిపిన్ సుఖంగా వున్నాడని డాక్టర్లు చెబుతున్నారు. అయినను మహాశయుడు అపుడపుడు పోయి వానిని చూడవలసి వస్తోంది.

మహాశయుడు సేతాబుతో ఆట సాగిస్తూ వున్నాడు. వాని ప్రసంగధోరణి దశదిశల సాగిపోతోంది. రామహరి మాట చెపుతూ "అతడు మంచి పైల్మాను. మృత్యువుతో యుద్ధం చేసి నెగ్గినాడు" అన్నాడు.

* * *

అప్పుడు వెలుపలనుండి ఎవ్వరో కేక వేసినారు.

"మహాశయా! మహాశయా! ఎక్కడున్నారు?"

జీవనదత్తు ఇంచుక చకితుడైనాడు. కిశోర్ కంఠస్వరము!

కిశోర్ కలకత్తా పోయియుండెను. ఆతడు తిరిగి వచ్చియుండును. ఆతడు కలకత్తానుండి తిరిగి వచ్చేటప్పుడు వట్టి చేతులతో రాడు. ఏమైనా చేత బుచ్చుకొని

వస్తూవుంటాడు. 'కేవలము జీవన మహాశయుని కొరకే కాదు. అబాల వృద్ధవనితల కతడు ప్రియుడు. కిశోరుడు పిల్లలకై పెన్సిళ్లూ, పుస్తకాలూ, ఆడపిల్లలకై కుట్టు పని సామగ్రి, ఎదిగిన మగపిల్లలకై పంట్లాములు, చొక్కాలు ఆతడు తీసుకొని వస్తూవుంటాడు. ప్రిస్క్రిప్షన్ రాసేందుకై నాలుగైదు పర్యాయములు మహాశయు నికి అతడు ఫౌన్‌టెన్ పెన్నులు తీసుకొని వచ్చినాడు. కాని దురదృష్ట వశాత్తూ ఇప్పు డవి యెక్కడో పోయినవి. అపుడపుడు అతగానికై ఆతడు కాలిజోళ్లు తెస్తూ వుంటాడు. ఒక్కొక్కప్పుడు పళ్లు తెస్తూ వుంటాడు.

కిశోర్ చాలకాలమునుండి నవీన కిశోరదులాల్ అను పేరుతో పిలువ బడుతూ వున్నాడు.

"కిశోర్!" అని మహాశయుడు పిలిచినాడు.

"రండి. బయటికి రండి. చాల మంది మీ కొరకై వేచియున్నారు."

జీవనమహాశయుడు వెలుపలకు వచ్చినాడు. ఏయే రోగులను, ఏయే దశ ముల వారిని కిశోర్ తీసుకొని వచ్చినాడో యెవ్వ రెరుగుదురు? ఒక్కొక్కవూరిలో మహామారి చెలరేగవచ్చును. కొన్నికొన్ని పల్లెలలో దొమ్మి జరిగి వుండవచ్చును. అన్ని వ్యవహారములను తలపై మోసుకొని రావడం కిశోర్ అలవాటు.

వెలుపలికి వచ్చి, దృశ్యమును చూచినవెంటనే మహాశయుడు విస్మితు డైనాడు. ఆతని కేమియు బోధపడలేదు. వచ్చినవారు పట్టణ మందు నివసించే నాగరకులు. కోటు, ప్యాంటు, షై వగైరాలు ధరించినవారు. శిక్షితులైనవారు. బుద్ధి దీప్తదృష్టి విశిష్టులైన వ్యక్తులు. పోలీసు ఇన్‌స్పెక్టరు వారివెంట ఉన్నాడు. మరికొందరు సర్కారు ఉద్యోగు లున్నారు. ప్రద్యోతడాక్టరు కూడ ఉన్నాడు. నవగ్రామ మండలి ధనికుడు వ్రజలాల్ ఉత్తరాధికారు లున్నారు. వ్రజలాల్ పెద్ద మనుమడును ఉన్నాడు. యూనియన్‌బోర్డు ప్రెసిడెంటు కూడ వున్నాడు. వీరందరు ఇచట ఎందుకు గుమిగూడినారు? మహాశయుని గుమ్మముపొంత చేరినా రెందుకు?

అయితే ప్రద్యోత డాక్టరు ఆ దరఖాస్తు పెట్టినాడా యేమి? హృదయ హీనుడై నిష్ఠురమైన నాడీపరీక్ష చేస్తూ రోగులను జీవనదత్తు మృత్యువు నోటిలో పడ్రతోయును——అను అభియోగము వాని తలపై మోపబడియుండెను. మహంతు నాతడు చావు తప్పగించివేసినాడు. ఇంతకు మున్నేకదా ఆతడు అంత పని చేసి వచ్చినాడు.

జీవనదత్తు ఏమియు పలుకలేదు. విస్మితుడై నిలిచినాడు. అచట చేరిన పెద్ద మనుష్యులతో కిశోరు డిట్లనినాడు. ''ఈతడే మా జీవన మహాశయుడు. మూడు తరములనుండి దత్తు మహాశయుని కుటుంబమువారు ఆర్తులకు మిత్రులైయున్నారు. 'ఆతురస్య భిషఙ్మిత్ర'. కూలి క్రుంగుతూవున్న ఆరోగ్యనికేతనము రమారమి నూరేళ్లనుండి మా హెల్త్ సెంటరు.''

పెద్దమనుష్యులు చిరునవ్వు నవ్వుకొన్నారు. అది కృత్రిమ మందహాసమై వుండును. వారు జీవనమహాశయునకు నమస్కరించారు. ఆతడును ప్రతి నమస్కారము చేసినాడు.

ఆతని తరపున కిశోర్ వకాలత్ వహించాడు. "ఈవరలో జీవనమహాశయుడు సంఘానికి విశేషసేవ చేసినాడు. ఆ మహోపకారమును మనస్సులో ఉంచుకొని ఇప్పటి అపరాధములను క్షమించాలి'' అన్నాడు. ప్రద్యోతుడు గంభీర వదనముతో నేలపై చూడ్కి సాగించి నిలిచినాడు. మరొకడు కోటు, ప్యాంటు వగైరా ధరించినవాడు అతనితో ఏమేమో చెపుతున్నాడు. ఒకదిక్కున నిలిచినాడు హరేన్.

కిశోర్ తన కథనము నిట్లు సాగించినాడు. ''వీరంతా గొప్ప దేశసేవకులు. ఇంజనీరులని చెప్పవచ్చు. ప్రపంచసేవ చేసేందుకు పుట్టినవారు. ఈ రోజులలో అందరి నోళ్లలో ఆడే కమ్యూనిటీ ప్రాజెక్టు విషయం విన్నారు కదా! నూరు గ్రామాల్లో క్రొత్త రీతిని పునరుద్ధరణ కార్యానికి వీరు దిగుతారు. ఇక్కడ కూడ ఒక ప్రాజెక్టును నిర్మింప బోతున్నారు. నవగ్రామం సెంటరు అవుతుంది. క్రొత్త రోడ్లు, క్రొత్త ఘట్టాలు, క్రొత్త స్కూళ్లు, క్రొత్త ఆసుపత్రులు, ఎలెక్ట్రిసిటీ యేర్పాటులు ఎన్నెన్నో జరుగుతవి. అందుచే ఈ ప్రాంతాన్ని చూచేందుకు వీరు వచ్చారు. పోతూ, పోతూ, మీ 'ఆరోగ్యనికేతన'పు సైన్ బోర్డు చూచి, దీని వృత్తాంతం నన్నడిగినారు. 'ఆరోగ్యనికేతనం' ఇంచుమించుగా కూలిపోయింది. కాని అందులో ఇంకా ప్రాణం వుంది. మహాశయు డింకా వున్నాడు. ఆయన దర్శనం చేయనియెడల ఈ స్థలప్రాణం విలువ యెంతో, ఇచటి శక్తి యెట్టిదో మీకు తెలియదు- అని వారితో తెలిపినాను.''

ఆకస్మికముగ మహాశయుడు అపూర్వానుభూతి నందినాడు. శుష్క సముద్ర మందలి వాలుకా రాశివలె ఆతని అంతరంగమున కొండొక అంతరతమ తలము నుండి ఉచ్ఛ్వసిత లవణాక్త జలరాశి ఉబికి వెడలుతున్నది. ఆతని పెదవులు రెండును వడివడిగ కంపింప నిచ్ఛగించుచున్నట్లు అగపడుచున్నవి. ఎంతో కష్టముతో ఆత్మసంవరణ మొనరించుకొని జీవనమహాశయుడు నిర్వాక్కై నిలిచినాడు.

కిశోరుడి ట్లనినాడు: "నాడీ జ్ఞానమును గురించిన మీ శక్తి సామర్థ్యము లెట్టివో వీరి కెరిగించినాను. కలకత్తానుండి డాక్టరు సెన్ గుప్త వచ్చినారు వ్రజలాల్ బాబు మనుమని చూచేందుకై. ఐదురోజులు ప్రథమ పరీక్ష చేశారు. రోగిని నిశితంగా పరిశీలించినారు. నేను వెంట వున్నాను. ఒకప్పుడు ఇచటి సంఘము యొక్క సెక్రటరీనని తెలిపినాను. నర్సింగ్ పనిలో ఆరితేరినట్లు వివరించాను. వారి వృత్తాంతం యావత్తు అడిగి తెలిపికొన్నాను."

* * *

ఇది చాలకాలమునాటి మాట. ఎన్నాళ్ళమాటో! టైఫాయిడ్ జ్వరమును కుదుర్చుపట్ల 'పాజ్' పద్ధతి అపుడపుడే యీ దేశములో ఆరంభ మైనది.

వ్రజలాల్ బాబు మనుమని వ్యాధిని ఎదుర్కొన్నప్పుడు మహాశయుడు ఈ చికిత్సా విధానము నవలోకించినాడు. కలకత్తాలోని విఖ్యాతడాక్టరు సెన్ గుప్త ఇచ్చటకి వచ్చి యీ విధానము నవలంబించినాడు. ఈ డాక్టరు యెడల జీవన మహాశయునకు విశేష భక్తిశ్రద్ధలు గలవు.

అపుడు మహాశయుడు ఈ ప్రాంతమందు ధన్వంతరి అని ప్రశస్తి నందెను. వ్రజలాల్ బాబు లక్షాధికారి. యశస్తిలకుడు విలియమ్స్ చారిటబుల్ డిస్పెన్సరీని ప్రతిష్ఠించినవాడు. ఆతనికి జీవనదత్తుపై మిక్కిలి ప్రీతి కలదు. అంతరంగ బంధువని చెప్పజెల్లును.

ఆధునికులైన చికిత్సకులను, విద్యాధికులను ఆతడనుసరించవలెనని వ్రజలాల్ ఉద్దేశము. మహాశయు డెదురైనపుడు ఆత డిట్లు అంటూ ఉంటాడు. "జీవనూ! నీవు పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనిన వైద్యుడవు. పెద్ద డాక్టరు డిస్పెన్సరీకి పోయినాను. అచ్చట అద్భుతమైన సంరంభ మగపడింది. ఒక పెద్ద కుటుంబం లోని రోగిని చూచేందుకై డాక్టరు పోయినాడు. డాక్టరు గొప్పవాడే. ఆతనిని చూచి రోగి, "ఈ డాక్టరు కాళ్ళకు జోడే లేదు. ఇత డెటువంటి డాక్టరు? నాలుగు రూకలఫీజ్ వీని కెన్నడు ఇయ్యలేను'' అని అన్నాడు. జీవనూ! ఈ రోజుల్లో వేషభాషలకు విలువ ఎక్కువ కలదు. వాక్కులలో చమత్కారము ఉట్టి పడాలి!''

మహాశయు డిట్లుత్తరమొసగును! ''ఆర్యా! ఈ వాంఛ ఈ జన్మలోనే ఫలించిపోతే, వచ్చే జన్మకు మిగిలే కోరిక మరేముంటుంది?''

సెన్ గుప్త కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతూ, "జీవనూ! నువ్వు ఒకటో రకం సూట్ వెయ్యాలి. విదేశాలనుండి ఇప్పుడే దిగి వచ్చిన గొప్ప డాక్టరని ప్రజలంతా నిన్ను చూస్తారు. నీ ప్రాక్టీసు అధిక మవుతుంది.'' అంటూ వుంటాడు.

చమత్కార సంభాషణలో మహాశయుడు ఓడిపోవువాడు కాడు. "అప్పుడు నాకు ప్రాక్టీసులో, బ్రతుకులో డబుల్ ప్రమోషన్ లభిస్తుంది. అంత భారము నేనెట్లు భరించగలను? ఆర్యమహాశయా! ఈ విషయమును వేరుగా చూడాలి. మీరు కర్మయోగులు. ముక్తి మీకు ముంజేతి కంకణమై వుంది. మీ యింటిలో కాశీ ధామము ప్రతిష్ఠింపబడింది. బృందావనం సృష్టి అయింది. దేవుణ్ణి మీ ఇంటిలో కట్టివేసుకొన్నారు. స్కూలొకటి నిర్మాణం చేయించారు. ఔషధాలయం ప్రజల కందించినారు. మోక్షం మీకు అరచేతిలోని ఉసిరిక అయింది. నేనా సాధారణ మానవుణ్ణి. భక్తి మార్గం అవలంబించి పరిత్రాణం పొందేందుకు ప్రయత్నిస్తూ వుంటాను. దట్టమైన డ్రెస్సు వేసుకుంటే నా భక్తి ఉష్ణంలో ఉడికిపోతుంది. నా కది దక్కదు. ఈ దుస్తులు నావంటి వానికి సరిపడవు" అని మహాశయుడు ప్రత్యుత్తర మిస్తూ వుంటాడు.

సెన్ గుప్త ఒకప్పుడు కలకత్తాలో విందుభోజనమునకు పోయి కడుపునిండ పిండివంటలు వగైరాలు పూటుగా ఎక్కించాడు. దానితో వాని కడుపు ఉబ్బిపోయింది. గ్రహణవ్యాధి దాపురించింది. ఆ తెవులును యావత్తు జీవనమహాశయుడు కుదిర్చి వేసినాడు. అది శీతకాలము. ఒళ్లు బాగుపడిన పిదప మిత్రుడు ఒక కుట్టుపనివానిని మహాశయుని ఇంటికి పంపి అది తీయించుకొని కలకత్తానుండి మిగుల విలువైన చైనా కోటు తెప్పించి, జీవనమహాశయునిచే తొడిగించెను. వ్రజలాల్‌బాబు ఇంటిలో రోగమూ, రొష్టూ ముదిరితే తక్షణమే మహాశయుని వద్దకు పిలుపు పోతోంది. సాధారణవైద్యం కొరకై ఆతడు ఛారిటబుల్ డిస్పెన్సరీపై ఆధారపడుతూ వుంటాడు. అటువంటి సందర్భాలలో సొంత డిస్పెన్సరీని ఆతడు త్రోసిరాజనడు.

వ్రజలాల్ మనుమడు (దౌహిత్రుడు) రోగపీడితుడైనాడు. ఆ జ్వరము మిక్కుటమై ఆతనిని పీడిస్తూ వున్నది. కలకత్తాలో అమ్మమ్మ యింటికి పోయి తిరిగి వచ్చి మంచమున పడినాడు. డిస్పెన్సరీ కపుడు తరుణ వయస్కుడైన డాక్టరు వచ్చి యుండెను. హరీశుడు రమారమి ఎనిమిదేళ్ళకు మున్ను అందుండి నిష్క్రమించాడు. తరువాత మరి ఇద్దరు డాక్టర్లు వచ్చినారు. ఇద్దరూ మెడికల్ పట్టా పొందినవారు కారు. అందుచే వారు తిరిగి పోవలసి వచ్చెను. తరువాత చక్రధారి అనే యువకుడు వచ్చినాడు. ఇపు డాతడు వైద్యవృత్తికి నీళ్లు వదలి ఇంచుమించుగా సన్యాసియై పోయినాడు.

చక్రధారి మహాశయుని కొడుకైన వనవిహారికి మిత్రుడు. ఐదురోజు లతడు రోగిని పరీక్షించినాడు. వ్యాధిని పిడికిట పట్టలేక పోయినాడు. వ్రజలాల్‌బాబు ధనవంతుడు. పేరు పొందిన మరి యిద్దరు డాక్టర్లను పిలిపించి వైద్యం చేయించి నాడు. శీతకాలంలో జీవనమహాశయుడు కొత్త కోటు తొడుగుకొని, రోగిశయ్యా పొంత హాజరైనాడు. ఆతని క్రొత్త వేషం చూచి సెన్‌గుప్త పరిహాసం చేశాడు.

"జీవనూ! కొత్తకోటు ధరించావు. నీ భక్తి ఉడికి, ఉడికి, ఉబికి ఉబికి, అంతర్థానమై పోయిందా?" అని అతడు నవ్వుతూ ప్రశ్నించాడు.

"ఆర్యా! నా భక్తిని ప్రస్తుతం జుట్టు ముడిలోనికి ఎక్కించాను. వచ్చే జన్మలోనికి అది ఎగబ్రాకవచ్చు. భక్తి నెత్తి మీది కెక్కినప్పుడు ఒంటిపై కోటు ధరిస్తే కలిగే ప్రమాద మేముంది?" అని మహాశయుడు తడుముకొనక ప్రత్యుత్తర మిచ్చినాడు.

పిల్లవాని నాడి నాతడు పరీక్షించేందుకు ముందు, ఆతని చెవిలో ఏవేవో గుసగుసలు పడినవి. కలకత్తా వైద్యంలో ప్రయోజనం పొందక చేతులు కడుగు కొని వచ్చి, ప్రక్కయింటిలో బస చేశారు. వైద్యం మీదనే వారికి అవిశ్వాసం పుట్టింది. "ఏమి వైద్యం చేయిస్తున్నారు వీరు? ఎవరో చచ్చుపుచ్చు వైద్యునకు రోగిని వీ రప్పగిస్తూ వున్నారు. ఇటువంటి చేతలవలన చెరుపు ఘటిల్లదా?" అని వారనుకొన్నారు.

జీవనమహాశయుని కాలి బొటనవ్రేలినుండి రక్తము మీదికి వెడలి నెత్తి మీదికి ప్రవహింపసాగింది. ఎంతో కష్టంతో తన ఉద్వేగము నాతడు అడచుకొని రోగినాడిని పరీక్షింప సాగెను.

'ధ్యానయోగముతో నాడిని పరీక్షింప వలెను.' అని ఆతని తండ్రి చెప్పు చుండువాడు. ఆనాడు ఆ యోగము ఆ ముహూర్తమున సిద్ధియోగముగా పరిణతి నందినది. ధ్యానయోగావస్థలో కఠిన సన్నిపాతిక దోషదుష్టమై నాడి ఉన్నదని ఆతడు గ్రహించాడు.

నాడి వీడి, వెలుపలకు పోయి, చేతులు కడుగుకొని దృఢస్వరముతో ఆతడు "పిల్లవాడు సన్నిపాతజ్వరముతో బాధ పడుతున్నాడు" అనగా, "అది టైఫాయిడ్ జ్వరము" అని సెన్ గుప్తతో మహాశయుడు పలికినాడు.

"జీవనూ! ఏమంటున్నావు?"

"టైఫాయిడ్‌లోను మిగుల గడ్డు జాడ్యము. గట్టి వైద్యం జరిగి తీరాలి అనుభవశాలియైన వైద్యుని నగరమునుండి రప్పించడం మేలు."

ప్రక్కయింటివారి గుసగుసలు వారి చెవిలో పడకుండినయెడల అతడీ ధోరణితో ప్రసంగింపకుండెడివాడు. ద్రావిడ ప్రాణాయామముతో ఏమేమో ముచ్చటించేవాడు.

పెద్ద డాక్టరు వచ్చి చూచినాడు. "టైఫాయిడ్ అనడం నిజమే; కాని గడ్డు రకం కాదు. నయం కాక మానదు." అని ఆత డనినాడు.

పొంతనున్న జీవన మహాశయుడు తలఊపి, "అయ్యా! తమరు పొరపడినారు. జ్వరం గడ్డు జ్వర మనియే నా ఊహ. నేను చచ్చు పుచ్చు డాక్టరును అంటారా. ఆ విషయం వేరు." అన్నాడు.

కిశోరుడు యువకుడు. అతడు మహాశయునితో అవ్వల కరిగి, "డాక్టరు బాబూ! తెగులు నిజంగా దారుణ మయిందా?" అని ప్రశ్నించాడు.

"సందేహం లేదు. విషయం మిగుల జటిల మైనది. నాగరిక వైద్యుడు కనిపెట్టలేక పోయినాడు. నాలుక చూచి, కడుపు కనిపెట్టి, రెండుసారులు ఉష్ణమధిక మవడం మారడం చూచి, జ్వరపు డిగ్రీ పరిశీలించి, ఆతడు తన ఊహను ప్రకటించినాడు. నేను నాడిని పరీక్షించాను. అది త్రిదోష దుష్టమైనది. మరి కిశోరూ! ఇకే మంటాను? ఈ రోగము బ్రహ్మ విష్ణుల చేతిలో లేదు. ఉన్నది శివుని చేతిలో; మృత్యువున కధీశ్వరుడైన మహేశ్వరుని చేతిలో వున్నది. ఆయన కాపాడితే దుఃఖపడడం యెందుకు?"

పది దినములైన పిదప రోగము మిగుల కఠినమై పోయింది. పట్టణపు వైద్యుడు మరల వచ్చి "ఈ రోగము రెండవ వారములో తీవ్రతర మౌతుంది. ఇది దీని లక్షణము. కాబట్టి జ్వరప్రకోపం హెచ్చింది. అయితేనేంగాక; మందిచ్చి పోతున్నాను. ఈ ఔషధంతో తగ్గిపోతుంది" అని చెప్పినాడు.

పదమూడవనాడు జ్వరం మరింత హెచ్చిపోయింది. కిశోర్‌తో డాక్ట రిట్లన్నాడు. "వికారము అగపడుతోంది బాబూ! పదునెనిమిది లేక పందొమ్మిదవనాడు పిల్లవాడు మరణిస్తాడు. అంతకు ముందు సన్నిపాత దోషమువలన ఒక అవయవము పడిపోవచ్చును. కుంటివాడు కావచ్చు. ఈ లక్షణము నా కిపుడే అగపడుతోంది. సన్నిపాత జ్వరము ఈ రీతిగా పూర్తిగా చెలరేగడం నే నీనరకో చూడలేదు."

పదునాలుగవ దినమున పిల్లవానికి స్మృతి తప్పింది. మెనిన్‌జయిటిస్ జ్వర మునకు తోడైనది. పెద్ద డాక్టరుకై కలకత్తాకు వ్యక్తి పోయినాడు. ఏమి జరిగిన జరుగుగాక!

"ఆ పెద్ద డాక్టరు తక్షణమే ఎగిరి రావాలి. లేకున్నయెడల దుఃఖపడవలసి వస్తుంది. రోగము మిగుల కఠినమైనది" అని జీవన మహాశయు డన్నాడు.

కలకత్తానుండి పెద్ద డాక్టరు వచ్చినాడు. అతడు ఎం. డి. డిగ్రీ పుచ్చు కొన్నవాడు. వయస్సు చిన్నదైనను, విచక్షణ శక్తి గల చికిత్సకుడు. కవిరాజ కుటుంబంలో పుట్టినవాడు. నాడీజ్ఞానం కలవాడు, ధీరుడు. స్థిరచిత్తము గలవాడు. మధురముగ మాట్లాడ జాలువాడు.

రోగ వివరణ మెరిగి 'ఫాజ్' పద్ధతి నవలంబించినాడు. ఈ ప్రాంతంలో ఈ విధానము నవలంబించడము ఇదే తొలితూరి.

జీవన మహాశయునితో ఆతడు సమాలోచనము సాగించాడు. నాడి పరీ క్షించి "మీ ఊహ సరియైనది. అయినను నేను ప్రయత్నించి చూస్తాను. తుది ముహూర్తం వరకు పూనిక సాగించాలి కదా!" అన్నా డాతడు.

పదునెనిమిదవ నాటికి వ్రజలాల్ బాబు దౌహిత్రుడు మృత్యుముఖమున ప్రవేశించాడు. పదునెనిమిదవనాటి ప్రాతఃకాలమున వాని యెడమ అంగములు పడి పోయినవి. కుడి కన్ను గ్రుడ్డిదై పోయింది.

ఈ సంఘటనము తరువాత జీవన మహాశయుని నాడీ పరిజ్ఞానపు ప్రశస్తి దశదిశల యందు విస్తరించి పోయింది.

కిశోర్ దానిని మరింత వ్యాపింపజేసినాడు.

కేవలము ఖ్యాతి మాత్రమే కాదు అప్పటినుండి జీవన మహాశయుని దృష్టి మరింత విప్పారినది. నాడి చూచిన వెంటనే సులభముగా ఆతడు సత్యసందీప్తమైన రోగ లక్షణములను పరిశీలింపజాలును. క్షేత్ర విశేషమువలన నేమి, రోగి తల గీటు వలన నేమి ఆతడు విషయమును స్పష్టముగ చెప్పుచుండును.

మణిచాటర్జితల్లి విషయం అత డలా తేల్చినాడు.

రామ మిత్రుని తండ్రి జాడ్యం విషయం తొలినాడే ఆతడు చెప్పివేసినాడు. "రామా! మీ నాయనగారివద్దనుండి వినదలచినదేమో చప్పున వినడం మంచిది. ఇక ఆతడు మంచమునుండి లేస్తాడని ఆశ పెట్టుకోకు."

వ్యాధిగ్రస్తుడు అల్ప వయస్కుడైనయెడల ఆత డిట్లు తెలుపును. "బాబూ! నీ రోగము బాగా ఊదుతోంది. నీ శరీర స్థితిని మంచి డాక్టరుకు చూపడం మంచిది."

ఇతరుల కతడు మరొక రీతిగా అభిప్రాయమును వ్యక్తీకరిస్తూ ఉంటాడు.

ఇట్లుండగా ఒకనాడు సురేన్ కొడుకు శశాంకుని అన్నగారు వచ్చి "బాబయ్యగారూ! మీ రొక పర్యాయం శశాంకుని చూచి పోవాలి" అన్నాడు.

"శశాంకున కేమయింది?"

"నాలుగు రోజులనుండి జ్వరంతో పీడింపబడుతున్నాడు."

"వచ్చి చూస్తాను. రేపు ఉదయం బయలుదేరి వస్తాను బాబూ! ఈ వేళ కలకత్తానుండి వసు వచ్చినాడు. తబలా, సితార్ మున్నగు సామగ్రిని తెచ్చాడు. సంగీత కాలక్షేపం సాగుతోంది. ఇపుడు భోజనం కానిస్తాము, నువ్వు కూడ కాళ్లు కడుగుకో!

వనవిహారి మిత్రుడు శశాంకుడు. వానికంటె ఏడాది చిన్నవాడు. బాల్యకాలమందు వానికి తల్లి కరవై పోయింది. సురేన్ బ్రతికి ఉండగనే ఆతనికి పెళ్లి చేసి ఒక యింటివానిని చేసిపోయినాడు. పిల్లవాడు యోగ్యుడు. శశాంకుడు మధురముగ మాట్లాడ గలవాడు.

* * *

మర్నాడు ప్రాతఃకాలమున శశాంకుని చూచేందుకై జీవనమహాశయుడు వెళ్లినాడు.

సురేన్ భార్య అస్తమించిన పిదప కోడళ్లు తమ తమ భర్తలను సేవిస్తూ కుటుంబమును నిర్వహిస్తున్నారు. శశాంకుని తల పొంత కూర్చుని వుంది యిల్లాలు. శశాంకుని జ్వరాతప్త కపాలముపై తన ముఖముంచి ఆమె పరుండి యుండెను. మహాశయుని కాలి జోడు చప్పుడు వినినంతనే ఉలికిపడి ఆమె లేచి కూర్చున్నది. ఆమె నొసట నున్న కుంకుమ బొట్టు శశాంకుని ముఖముపై అద్దుకొని వుంది. డాక్టరు చిరునవ్వు నవ్వినాడు. ఇంటిలోని కోడళ్లిరువురు ఆతని ప్రేమాస్పదులు. వారు ఆతనికి మిగుల పరిచితులైన కుటుంబమునుండి వచ్చిన ఆడపడుచులు. వారిని చిరుత ప్రాయమునుండి చూస్తూనే ఉన్నాడు. వాత్సల్యముతో మహాశయు డామెను తేరి చూచినాడు. సిగ్గుతో ఆమె కన్నులు మూసికొనినది.

వెడల్పైన ఎర్రని అంచుగల తెల్లచీర కట్టుకొన్నది. రంగారు బంగారు పూతతో తేజరిల్లుతున్నట్లున్నది ఆమె శరీరము. ఆమె సుందర స్వరూపము మహాశయుని దృష్టికి విందొనరించినది. అపరూప విగ్రహము సాక్షాత్కరించినట్లైనది వానికి. మహాశయుని చూచినంతనే ఆమె ముఖము రాగరంజితమైనది. మొగముమీదికి మేలిముసుగును లాగుకొని, ఆమె ప్రక్కకు తొలగి నిలిచినది. సౌందర్య సౌష్ఠవ సందీప్తమైన ఆమె శరీరము సర్వోత్కృష్ట విభూతివలె అగపడినది.

డాక్టరు రోగిపొంత కూర్చుని వాని చేతిని చేపట్టినాడు. మహాశయుని చేయి వడకిపోయినది. వాని చకితనేత్రములు విప్పారినవి. ఒక పర్యాయము ఆతడు కోడలును వీక్షించినాడు. మరల కళ్లు మూసినాడు.

ఏమి ఆశ్చర్యము? ఈ వేళే మూడవ దినముకదా! ఇంతలో లక్షణము లింత స్పష్టముగా అగపడుతున్నవే! మళ్లీ నాడిని పరీక్షించాడు. కాదు. అది భ్రాంతి కాదు. ఎన్నటికిని అది భ్రాంతి కాదు. ఇట్టి లావణ్యరాశిని గుండమున గూల్చి ఆతడు ప్రపంచపు పొలిమేరను దాటిపోవలెనా? రెండు వారములలోనే ఆతడు తప్పని సరిగా దివంగతుడు కావలెనా?

అవును! అట్లు జరిగి తీరవలెను. అది భ్రాంతి కాదు. ఆతడు విమూఢుడు కాడు. అన్యమనస్కుడై ఆతడు నాడిని పరిశీలింపలేదు. శశాంకుడు ఇక పోయి తీరవలెను. ఈ రీతి స్పష్టమృత్యులక్షణము అపుడపుడు నాడియం దాతనికి ప్రత్యక్షమవుతూ వుంటుంది. శేషనిశీథినీ పాండుర విహాయస మండలి దక్షిణ పూర్వ కోణమున, అగ్నికోణమున, శుక్రాచార్యప్రదీప్తస్పందితోదయము శేషరాత్రిని ఘోషణ మొనరించునట్లు శశాంకుని నాడీలక్షణము అచిరములో రానున్న సంఘటనమును సూచిస్తున్నది.

మహాశయుని మనసులోని అశాంతికి అవధి లేదు. వేదనకు అంతము లేదు. శశాంకుడు వనవిహారి కీడైనవాడు. జోడైనవాడు. వానికంటె వయసున ఇంచుక పిన్నవాడు మాత్రమే; తల్లిలేనివాడు. మహాశయుని డిస్పెన్సరీ సమీపమున ఆడుతూ పాడుతూ తిరుగుతూ వుండేవాడు. ఆతని కన్నుల ముందు పెద్దవాడైనాడు. ఇక ఈ నవవధువు? కన్నులకింపగు చీరకట్టి, నొసట సిందూరపు తిలకమును దాల్చి, ప్రత్యక్ష రమాసుందరి వలె అగపడు యీ చిన్నదాని బ్రతు కేమగును?

ఈ సౌందర్యరాశి భావి జీవితము ఏమగును? మేనిపై సైనువలువ దాల్చి, నగలకు నాణ్యములకు నీళ్లు వదలి రూపుదాల్చిన శోకమై సంఘమున చూపట్టునా?

విపత్తును తలచినకొలది, పాపము, జీవనమహాశయుని కడుపు తరుగుకొని పోయెను. పిల్లదాని చిరుత ప్రాయపు బుడిబుడి నుడువులు అతని చెవులందు వినబడునట్లుండెను. దగ్గరి పల్లెలో పుట్టిన బాలిక, ఉన్నత కుటుంబమున ఉత్తమ వంశమున ప్రభవించిన చిన్నది. పిన్నవయస్సులో తలిదండ్రులు "మణీ! మాణిక్యమూ!" అని బాలికను పిలుస్తూ అల్లారు ముద్దుగా పెంచుచుండిరి. కిలకిల నవ్వుతూ ఆమె ఆడుతూ వుండేది.

రెండు దినములు గడచిన వెనుక శశాంకుని నాడి చూచి ఆతడు మరింత అధైర్యముతో క్రుక్కిన్నాడు. శశాంకుడు గతించుట నిశ్చయ మని వానికి బోధపడింది. నాడియందు మృత్యుకాంత పదధ్వని వినబడుతూ వున్నది. ఆమెకై నూరిపోసిన మందులు యావత్తు వ్యర్థమై పోతున్నవి.

అతని ఆర్తమానసికా వేగములో ఒక ఊహ ఉదయించినది. ఇంటి అమ్మవారిని పిలిచి, "అమ్మీ! నేనొక విషయం చెపుతాను చెవిబెట్టుము. నిన్నరాత్రి నేనొక కలగంటిని. కాళీమాతకు భోగము సమర్పిస్తున్నాను, దేవి ఆభోగమును తనచేతితో తాను ఆరగింపసాగింది. నాకు ఎంతో ఆశ్చర్యము కలిగించిన విషయ మేమో వింటావా? మన శశాంకుని భార్యయే కాళీమాతవలె నా కగపడింది" అన్నాడు.

"ఇందు ఆశ్చర్యపడవలసిన విషయ మేముంది? శశాంకుని పెండ్లాము దుర్గాదేవి అంశలో పుట్టిన బాలిక. అందువలన—"

"అమ్మీ! ఒక పనిచెయ్యి. రేపు ఆ బాలికను పిలిచి, విందారగింప జేయగలవా?"

"మంచిది అట్లే చేస్తాను."

వివిధరీతుల భక్ష్యములతో పిండివంటలతో బాలికకు విందొనరింప మహాశయుడును, ఇల్లాలును నిశ్చయించారు. శశాంకుడు అప్పటికి ఆరురోజులనుండి రోగశయ్యపై పడి వున్నాడు. జ్వరప్రకోపము అంతకంతకు హెచ్చుతోంది. ఇతర అవలక్షణము లింకా అగపడడం లేదు. కాళీ మందిరమునుండి మహాప్రసాదము వచ్చింది. అప్పు డతనికి అట్టి భ్రాంతి కలిగింది! ప్రసాదము స్వీకరింపబడునపుడు నవవధువు ఏలకో ఉలికిడిపడది! విందుకై ఆమె రావింపబడింది. స్థిరదృష్టితో సమస్త పదార్థములను అవలోకించి, ఆమె చేతులెత్తి నేలపై కూలి పడింది. తత్తరపాటుతో ఇంటి యిల్లాలు "అదేమి? అదేమి?" అని అరచినది.

"నా ఒంట్లో ఏదో మంట పుడుతోంది. నే నింటికి పోతున్నాను." అని స్థిరకంఠంతో బాలిక పలికింది. సంధ్యాసమయంలో జీవన మహాశయుడు శశాంకుని ఇంకొక పర్యాయము చూచి వెలుపలికి వచ్చినాడు. మృత్యులక్షణము నాడియందు క్రమక్రమముగా స్పష్టము కాజొచ్చెను. 'తబలా వాయించునపుడు దెబ్బ సరిగా మధ్య పడింది' అంటూ వుంటారు. అప్పుడు శబ్దము మరింత స్పష్ట మగును. అదే గతిలో జ్వరాఘాతము పడుతూ వున్నది. రేపటితో వారము తీరిపోతుంది. మరొక వారములో మహాశయుడు నిర్ణయించిన గడువు గడచిపోయింది.

ఇంటి సమ్ముఖమున సందొకటి కలదు.

బరువైన డాక్టరుపాదము మరింత బరువెక్కినది. వెనుకనుండి ఎవరో "నిలవండి" అని అరచినారు. వెనుకకు తిరిగి చూచినాడు డాక్టరు. చేతిలో ఒక కిరసనాయిలు బుడ్డిని చేతపుచ్చుకొని వస్తోంది శశాంకుని పెండ్లాము. బుడ్డినుండి ప్రసరించు దీపము ఆమె మొగముపై పడుతోంది. పచ్చనిమేని ఛాయపై ఎర్రని కాంతి తళుక్కు మంటోంది. నుదుట నున్న సిందూరపు బొట్టు మరింత తళతళ లాడుతోంది. ఆమె కన్నులందు స్థిరదృష్టి గోచరిస్తూ వుంది. అది ప్రశ్న గర్భితమై వున్నది. ఆ చూపును సహించుట మహాశయునకు సాధ్యము కాలేదు. చూడ్కులు నేలమీదికి వాల్చినాడు.

"ఏమైన పలుక దలచినావా?" అని ఆతడు ప్రశ్నించాడు. "ఆయన బ్రతుకరా? నా వద్ద దాపరిక మెందుకు?" ఆశ్చర్యాన్వితమైన ధీరత ఆమె మాటల నుండి వ్యక్త మవుతూ వుంది.

ఆ ప్రశ్నకు డాక్టరు ప్రత్యుత్తర మీయలేకపోయినాడు. బాలిక యిట్లు పలికినది. "బ్రతుకుతారనే ఆశ లేకపోయినయెడల, నే నేమి చేయగలను? నేను మాత్రం ఏమి చేయగలను? కాని ఈ విధంగా మీ అబ్బాయి మరణిస్తాడంటే విందు భోజనపు సన్నాహం చేస్తారా? మహాశయా! ఈ విషయం నా మనస్సులో గాలమై గ్రుచ్చుకుంటూ వుంది."

మాట మహాశయుని మనస్సులో గ్రుచ్చుకొన్నది. ఆనాడు ఆతడు మరొక మనిషివలె అగపడినాడు. గరళాభరణుడైన నీలకంఠునివలె దృక్పాత హీను డైనాడు. జీవనమహాశయుడు సత్యవాది అనీ, అది ప్రియమైనను, అప్రియమైనను ఆతని నోటిలో దాగదనీ ప్రజలు చెప్పుకొంటూ వుంటారు. శశాంకుని మృత్యువును ప్రత్యక్షముగ ఉపలక్షించి అట్లై పోయినాడని ప్రజలు చెప్పుకొంటున్నారు.

ఎవ్వరి మాట అసత్యము గాదు మాట లన్నీ నిజములే! కాని సత్యములు పూలమీది దళములు వోలెనవి, కాని ప్రసూన గర్భమందలి సత్యము నెవ్వరు ఎరుగరు. అందొక వైపున విష ముండును. వేరొక దిక్కున అమృత ముండును.

సంసార మందలి అశాంతి, ఇంటి అమ్మవారి వలన కలుగు పీడ, మంజరి ఉచ్చరించిన అభిశాపము మిగుల దుస్సహములు. ఆ అభిశాపము వనవిహారికి తగిలి తీరింది. ఆ బాలకుని మృత్యువుతో కవిరాజు కుటుంబ మందలి గౌరవ ప్రతిష్ఠలు గంగపాలై పోయినవి. వనవిహారి చిరంజీవి కాడని ఆత డెరుగును. అతని ధ్యానయోగమున నాడీ జ్ఞానము అద్భుతవికాస మందినది. ఆ పరిస్థితి వలన వాని జీవితము కడుంగడు విచిత్రమై పోయినది. అది నిష్ఠుర సత్యమే!

వేడి నిట్టూర్పు వీడి జీవనమహాశయుడు బాలికతో "అమ్మా! శశాంకుని బ్రతికింప గలిగినయెడల, నీ మాటకు సరియైన జవాబు చెప్పగలను. కాని అమ్మా! నా కొడుకు మాటను చెపుతున్నావు కదా! నీ మగడూ, మా వాడూ కలసి ఆడుకొనేవారు. కలసి చదువుకొన్నారు. ఆ సంగతులన్నీ నీకు తెలుసు. శశాంకుడు మా అబ్బాయి వంటివాడు. కాని యిరువురి గతులు ఒకే దిక్కుగా పోయినవి. ఎవరి విషయ మైనను నిజం చెప్పడం నా ధర్మం కాదా? మృత్యువు ముందు మన మెంతటి వారము?" అన్నాడు.

ఆధునిక పాశ్చాత్య విజ్ఞానుల కీ ధోరణి హాస్యము కలిగించడం తథ్యం. కాని యెల్లరు ప్రాచీన సంప్రదాయమును వెక్కిరించలేరు. జీవనమహాశయుడు సత్యవాది అనీ, ఎన్నెన్ని ప్రలోభములు సమ్ముఖమున ప్రీతితో కన్నుగీటినను, ఒరుల మనసులను రంజింప జేయుటకై జీవనమహాశయుడు సమ్మతింపడని యెల్ల రెరుగుదురు.

ఇంతలో సేతాబ్ వచ్చి మహాశయుని వెనుక కూర్చుండెను. పొగ చూచి నపుడు అగ్ని నూహింప జాలునట్లు కిశోర్ హృదయమున ఏదియో ఊహ రవులు కొనుచున్నది.

మహాశయుడు నేడు చిన్నపిల్లవానివలె బిడియపడినాడు, తల వంచి ముదు సలి యగుట ముప్పే అగును. బాలురు చిరంతనసుఖ మనుభవింతురు గదా! "కిశోరూ! నీ విట్టి సుఖమును అనుభవిస్తున్నావు."

ప్రసంగిస్తుండగా అతని కనులనుండి రెండు అశ్రుబిందువులు రాలినవి. చాల కాలమునకు పిదప వాని మనసు కరుణరస సంభరితమై పోయింది.

పిదప ఎల్లరు నిష్క్రమించారు. జీవనునితో హరేన్ మాత్రము నిలిచినాడు. మహాశయుని ఉద్దేశించి అతడి ట్లన్నాడు. "మీకొక మంచి మాట చెపుతున్నాను. బిపెన్ యూరిన్ గురించిన రిపోర్టు మళ్ళీ వచ్చింది. దోషము చాలా వరకు తగ్గిపోయింది. అతనిని చూచేందుకు ఆనక పోతారు గదా! మన మంతా కలసి పోవడం మంచిది. నేడు ప్రాతఃకాలమున ముందుగ ఒక పర్యాయం చూచి వస్తాను. బాగుగ వానిని పరిశీలిస్తాను."

"అందరము కలసి పోదాము" అని అన్యమనస్కునివలె జీవన మహాశయుడు పలికినాడు.

# ఇరువది నాలుగవ ప్రకరణము

బిపిన్ స్వస్థుడైనాడు. "బాగా వున్నట్లు నాకు తోస్తోంది" అని అతడే అన్నాడు.

"ఈవేళ యూరిన్ రిపోర్టు వచ్చింది. ఈవరలో వున్న దోషం చాలా వరకు తొలగిపోయింది" అని రతన్‌బాబు అన్నాడు.

జీవనమహాశయుడు అక్కడున్నప్పుడు తక్కిన డాక్టర్లు రాలేదు. నాడి పరీక్షించేందుకై మహాశయుడు చేయి చాపి "బాగుపడేట్రాత వున్నట్లైన యెడల తెగులు ఈ విధంగా తగ్గుతూ వుండాలి. మా కవిరాజ వృత్తిలో మేమిలా అంటూ వుంటాము. నీకది జ్ఞాపకం వుండి వుంటుంది. వ్యాధి అధికమైన సమయంలో తాటి ప్రమాణమున కది పెరుగుతుంది. తగ్గుమొగం పట్టిడి అది తప్పటడుగులు వేస్తుంది."

"నీ వాక పర్యాయం నాడి చూచి నాతో చెప్పు. నీకేమి బోధ పడిందో? నీ చేతి కేది అందిందో తెలపాలి" అన్నాడు రతన్‌బాబు.

"ప్రతి రోజూ చెపుతునే వున్నాను కదా!"

"ఆ మాట అట్లుంచు. ఇప్పుడు నాడి ఎలా వుందో నాకు నీవు చెప్ప నక్కర లేదు. చిరంతన నాడీ పరిజ్ఞానము ననుసరించి మాట చెప్పు. బిపిన్ ఎన్నాళ్ళలో లేచి తిరగ గలడు?"

బిపిన్ మాట అంది పుచ్చుకొని యిట్లన్నాడు. "ఇక నేను మంచముపై పడి ప్రమగ్గలేను. ఇన్‌వేలిడ్ చెయిర్ ఒకటి వరండాలో వేయించండి. కొంచెం ఇందందు తిరుగాడిన యెడల కీళ్ళు సడలుతవి. కొంత ఉత్సాహం కలుగుతుంది. సిగ్గుతో కుళ్ళిపోతున్నాను. విశ్వము కరుణ భరితమైనది. ప్రజలు 'ఆహా!' 'ఊహూ' అంటున్నారు. ప్రజాభిప్రాయం భారము గుండెను క్రుంగ దీస్తోంది. దీనిని నేను సహించలేను."

మహాశయుడు ఆంతరంగికముగ చకితుడైనాడు. బిపిన్ ప్రతిష్ఠగలవాడు. ఆంతరంగిక ప్రజల ఊహాలు రంజన మరీచులవలె రంజితచ్ఛటలవలె ఉద్భాసితము లగుచుండెను. వీని నించుక ఉపలక్షించినాడు జీవనమహాశయుడు.

బిపిన్ ముఖమును తేరి చూచి వాని చేతిని తన చేతి యందిడికొనెను. నాడియందు ఉత్తేజనాభాస గోచరిస్తోంది.

చేయి విడిచిన పిదప బిపిన్ "స్వామీ! నే నెపుడు లేచి తిరుగ గలను?" అని ప్రశ్నించాడు.

"రేపు చెపుతాను. ఈ వేళ నీ మనసు చంచలమై వుంది."

"అతడు అనవరతము చంచలచిత్తుడై వుంటాడు. అలా మనసులో ఆందోళన కలిగించుకోరాదని మీరు చెప్పండి" అన్నాడు తండ్రి.

బిపిన్ మంచమునకు ఆవలివైపున ఒక ఆడుది నిలిచి వుంది. ఆమె వాని పెండ్లాము ప్రతి దినము భర్త మంచముపొంత ఆమె కనిపెట్టుకొని వుంటుంది. ఆమె అధికప్రసంగం చేయదు. మౌనముద్ర వహించియే యుండును. నే డామె ఊరకొని వుండలేకపోయింది. భక్తి శ్రద్ధలతో ఆమె పతిని సేవిస్తూ వున్నది. హృదయ మందలి ఉద్వేగము నిక అరికట్టలేక పోయింది.

ఆమె యీడు ఇరువదియైదు, ఇరువది యారేండ్లుండును. శాంతస్వభావము కలది. నిరంతరము శ్రమపడునది. ఆమె పాపిడిలో సిందూరపు తిలకమూ, నొసట కుంకుమబొట్టూ ఉజ్జ్వలమై ఉన్నవి. ఎర్రంచు చీర కట్టుకొన్నది. మేలి ముసుగును తప్పించి, తన ప్రాణావేగమును ప్రకాశ మొనరించుకొంటూ నిలిచివుంది.

జీవనమహాశయుడు జవాబిచ్చేందుకు ముందు బిపిన్ ఇట్లన్నాడు. దుర్బల మైన వాని కంఠస్వరము కంపించింది. అతని కన్నులించుక ప్రదీప్తములై వున్నవి. "మనసు చంచలము కారాదని అంటున్నారు. వద్దంటే మనసు వింటుందా? ఈమె ఆవేగమును అడచుటెలా? మానసిక ఆవేదనను ఎలా అణచడం?"

తత్తరపాటుతో మహాశయుడు "నాయనా! బిపినూ! తొట్రుటు పడవద్దు బాబూ! నా మాట విను." అన్నాడు.

"నాయనా! మాట విను" అన్నాడు రతనబాబు.

బిపిన్ కన్నులనుండి నీరు స్రవించింది. డగ్గుత్తికతో ఆతడు "నాకీ ఆరాటము తగ్గదు. దీనిని నేను అడచుకోలేను. ఇది సాధ్యము కాదు" అని ఆతడన్నాడు.

కొడుకు శిరమును వాత్సల్యముతో నిమురుతూ రతన్‌బాబు నిలిచినాడు. విసనకర్ర చేత పుచ్చుకొని ముందుకు వచ్చింది కోడలు. "వద్దు, నాకు విసరవద్దు!" అన్నాడు భర్త.

"విసరనియ్యండి" అన్నది ఇల్లాలు. తరువాత కొడుకు చేతికి దాని నిచ్చి "నాయనా! శ్రీమంతూ! నాన్నకు నువ్వు విసరు" అన్న దామె.

శ్రీమంతుడు బిపిన్ కొడుకు. తల్లి చేతినుండి ఆతడు విసనకర్ర తీసుకొన్నాడు.

స్తబ్ధుడై జీవనమహాశయుడు కూర్చుని ఉన్నాడు. రోగిని చూస్తూ ఆతడట్లే చతికిల పడినాడు. ఇంచుక సేపటిలో బిపిన్ కంటిరెప్పలు తపతప కొట్టుకొన్నవి. మహాశయుని చేతిని స్పృశించినాడు. ఇరువురి కన్నులు కలుసుకొన్నవి. బిపిన్ నాడిలో ఉత్తేజనము స్పష్టమై ఉన్నది. చాలా సేపు వాని నాడిని పరిశీలించి, జీవనమహాశయుడు వెలుపలకు వచ్చినాడు.

"జీవనూ!" అని వెనుకనుండి రతన్‌బాబు మెల్లగా పిలిచినాడు.

"రతన్! కంగారు పడపలసిన అవసరం లేదు. చెప్పదగిన వికార మేమీ లేదు. కాని జాగ్రత్తగా ఉండడం మంచిది. ఈ విధంగా ఆవేశ పడరాదు. ఇలా అని మీతో నేనంతగా చెప్పనక్కర లేదు."

బిపిన్ ధైర్యశాలి. సాధారణంగా బెంబేలు పడేవాడు కాడు. ఈవేళ తొట్రుపాటు పడినాడు. "కాని నేను తెలుసుకోదలచిన విషయం ఉన్నది. నాడీ పరీక్షలో మీ వంశము విశేష ప్రసిద్ధి నందినది. ఆ ప్రజ్ఞలో నాకు విశ్వాస ముంది. అందుచే సత్యము నెరుగుటకై తహతహ లాడుతున్నాను." అన్నాడు.

వికటహాసముతో మహాశయు డిట్లన్నాడు: "బాబూ! ఆ నాడీ పరీక్షకు సంబంధించిన రోజులు నడచిపోయినవి. రోజులు మారాయి. ఈ రోజుల్లో ఎన్నెన్ని రకాల ఔషధాలో చికిత్సలో ప్రబలిపోయినవి. తొల్లింటి విద్యకు, వైద్యానికి నేడు గుడ్డిగవ్వవిలువ వుందా? చూడు. మలేరియా జ్వరం! తొమ్మిది రోజుల్లో అది తొలగిపోతుందని వెనుకటి పద్ధతిలో మే మంటూ ఉంటాము, ఇప్పుడు

ఇన్‌జెక్షనుల వల్లా, పెలుడ్రిన్ ప్రయోగం వల్లా మూడు రోజుల్లోనే జ్వరం మటు మాయమై పోతోంది, టైఫాయిడ్ పదునెనిమిది, ఇరవై ఒకటి, ఇరవై యెనిమిది, ముప్పై రెండు, నలువదిఎనిమిది రోజుల్లో పోతుందని మేమంటూ ఉంటాము. కాని యీ నాటి వైద్యంవల్ల పది పన్నెండు రోజుల్లో సన్నిపాత జ్వరము సమసిపోతుంది. ఇపుడు నాడి చూచి నేనేమంటాను? ఇద్దరు పెద్ద డాక్టర్లు చూస్తున్నారు. వారి నడిగి తెలుసుకో!''

''నిజం మీరు చెప్పడం లేదు. విషయం మరుగు పరుస్తున్నారు. కాని మీ అబ్బాయి విషయం మీ రేమీ దాచలేదు.''

ఈ మాటలు విని ఆడకూతురు ఉలికిపడింది. వెక్కి వెక్కి యేడ్చింది. మామగారు వెనుకకు తిరిగి చూచినాడు. వెనుక ఆమె అధీరయై క్రుంగి కూలుతూ ఉన్నది. ఆమె పాపటయందు సిందూరరేఖ, ఫాలతలమున కుంకుమ తిలకమూ సముజ్జ్వలమై వెలయుచున్నవి. ఉత్కంఠితమైన సుఖముతో, స్థిర దృష్టితో ప్రశ్నార్థకమైన చూపుతో ఆమె అట్లే నిలిచివుంది. స్మృతి ఆమె మనసును బాధిస్తూ వుంది. ఉద్వేగము నెంతో పూనికతో అడచుకొంటూ వున్నది.

జీవనుడు తన ఆవేశమును కూడ అడచుకొని, ''అమ్మా! నేను నిజమాడు తున్నాను. నా కేమీ స్పష్టంగా తెలియడం లేదు. మీ యింటికి వచ్చినప్పుడు మా అబ్బాయి జ్ఞాపకానికి వస్తాడు. నా మనస్సు ఆరాటంతో నిండిపోతుంది. నాకేమీ సరిగా బోధపడడం లేదు. ఇందులో దాపరికం ఏమీ లేదు. నా మాటలను మీరు వేరుగా అర్థం చేసుకోరాదు.'' అన్నాడు.

పిదప ఆత డందుండి చరచర నడచి పోయినాడు. ''డాక్టరు బాబూ? ఛీ! ఛీ! డాక్టరు బాబూ!''

''రేపు. రేపియ్యి. రేపు!

* * *

మిగుల తీవ్రమైన స్మృతి భయదమై కట్టెదుట గోచరించినట్లైనది. కేసు ఇంచుమించుగా అట్టిదే. కొంత మాత్రము ప్రభేద మున్నది. ఆమె యింకను పిన్నవయసు గల తరుణి. పదునారు, పదునేడేండ్ల వల్లెపడుచు. ఈ దృష్టితోడనే ఆమెను చూడవలసి వచ్చెను. శశాంకుని భార్య దాని నెరుగును.

ఆమె శపించినది. ఆ శాపము తగిలి తీరినది. వనవిహారి చచ్చి స్వర్గమును చేరుకొన్నాడు. అనుకొనని రోగము వలన పీడితుడై శశాంకుడు అస్తమించాడు. ఆతని గుణదోషముల వలన అది సంక్రమించినది కాదు. ఇక బిపిన్ విషయం. వాని ప్రవృత్తి వానికి శత్రువై మృత్యువును 'దూః దూః' అని పిలిచినది. ఈ కాలమందలి జర్మ్స్—పరీక్ష ప్రయోగము, జర్మ్స్‌ను నాశన మొనరించు ఔషధము ఆతనికి ప్రయోగింప బడిన యెడల—బహుశః యోచిస్తూ, యోచిస్తూ మహాశయుడు తల ఊపినాడు. శశాంకుడు వచ్చి తీరాలి. ఇప్పుడు కూడ పెన్సిలిన్ ప్రయోగించి అన్ని రోగములను నివారణ మొనరించడం సాధ్యమగుట లేదు. జర్మ్స్—బీజాణువుల స్వరూపమును నిర్ణయ మొనరించిన పిదప కూడ రోగ కారణమును కనుగొనుట సాధ్యమగుట లేదు. శశాంకుడు చేసిన అపరాధ మేమియును లేదు. ఆతని మృత్యువు మానవుని చికిత్సా విజ్ఞానముయొక్క అపూర్ణతను, అసంపూర్ణతను దృష్టాంతీకరించింది. మృత్యువు ధ్రువము. సూర్యాస్తమయము వంటిది. ఆతని యిల్లాలిపై మహాశయునకు మమత కలుగుటకు హేతువు ఆ సంఘటన వాని మనసును కరుణరస సంభరిత మొనరించుచే! ఎందుకు పిలిచి, మానసిక యాతనమును వ్యక్త మొనరింప నాత డుద్దేశించినాడు. కాని ఆ బాలిక మిగుల విచిత్రమైనది! ఈ అద్భుత దేశమందలి అద్భుత బాలిక! ఎవ్వ రెవ్వరు పూర్వ జన్మనుండి వైద్యము ననుభవించుచున్నారో దైహిక భోగములను పరిత్యజించి నిలువజాలుచుందురో ఆ వర్గమునకు చెందిన దామె. అసాధారణ బాలిక. అట్లని మహాశయుడు గుర్తింపజాలక పోయినాడు.

ఆమె ఆతనిపై శాపవృష్టి కురిపించినది.

ఆ శాపము ననుసరించుటకో యన వనవిహారి క్రమక్రమముగ సుక్కిపో దొడగినాడు. ఆ తీర్థమునకు పోయినప్పటినుండి, ప్రమేహము దాపురించు నప్పటి నుండి, ఆతడు మరి తేరుకొనలేదు. అభిశాపము దానికి సహకరించినది.

విషయము తలచిన కొలది జీవనమహాశయుని హృదయము యాతనాగ్ని యందు రవులుకొన సాగినది.

దేహము జీర్ణము కానంత వరకు మృత్యువు నపేక్షించుట పాపమే అగును. ఆ యపేక్ష ఆత్మహత్యాపేక్షను పోలునది. మహాశయుడు అట్టి అపేక్షకు హృదయములో చోటు ఒసగినాడు ఆహార విహారములందును సమస్త దైనందిన జీవన విధానములందును ఆతడు మరొక వ్యక్తియై పోయినాడు. కులధర్మము నాత డుల్లం

ఘింప లేదు. ఆయుసంరక్షణ విధుల నుల్లంఘించినాడు. దానిని దీర్ఘమొనరించుటకు వలసిన నియమములను పుటుక్కున త్రెంచినాడు. కాని వీధులందు ఆతడు కాలిడలేదు. వంశమర్యాదకు భంగము రానీయలేదు. కాని తన్ను తాను నిర్లక్ష్యము చేసికొన్నాడు. ఆతని మనస్సు ఉద్భ్రాంతమై పోయినది. రెండు చేతులతో సంపాదించి, నాలుగు చేతులతో వెచ్చించినాడు. ఆంతరంగిక జ్వాల వ్రేల్చి వేసినను. బాహ్య సమారోహమును సమధిక మొనరించి, అవ్వలిజీవనమున పచ్చదనమును ప్రదర్శించినాడు. కేవలము చికిత్సాధర్మమందే తన బ్రతుకును ఆతడు బంధించి యుండలేదు. వివిధ జీవితధర్మములను నిర్వహించి పరితృప్తి నందినాడు. మనస్సును దుఃఖము పీడించినప్పుడు మద్యపాన మొనరించి, మత్తిల్లి కొందరు తమ శోకమును మరతురు. కాని జీవనమహాశయుడు కర్తవ్యనిర్వహణము వలన కలుగు నిషాలో పేరుప్రతిష్ఠల మత్తులో మునిగి పోయినాడు.

ఆతని ఆరోగ్యనికేతనము పొంత వివిధ ధర్మ నిర్వహణ సంస్థ ఏర్పడినది. అతడు పంచాయతు ప్రెసిడెంటు అయినాడు. సర్కారు సొమ్ముకు తన సొమ్ము చేర్చి, రూకలో నాల్గవ వంతున చేర్చి, దేశహితమునకై ఖర్చుపెట్టినాడు. ఊరినుండి ఆసుపత్రికి పోవు తెరువు దుర్గమపథము—మిశ్రుపల్లములతో, ముండ్లతో నిండి వుండేది. ఆ తెరువును బాగుచేయించినాడు. అందుకై కూడ నాలుగవ వంతు ధనమును తానే వ్యయ మొనరించినాడు.

రెండు మూడు ఊళ్లలో కూలినాలి చేసికొని బ్రతుకువారు పనులు పోగొట్టుకొని ఆరోగ్యనికేతనమునకు కట్టెదుట ఆర్తులై, అభాగులై నిలుచువారు. వారికి జీవనమహాశయుడు తక్షణమే తగు సహాయ మొనరించి, సముచితమైన పనులందు వారిని ప్రవేశపెట్టుచుండును.

మహాశయుడు వంశమహత్త్వమును సంరక్షించినాడు. కాని మహాశయత్వము అస్తమించుట ఎప్పటికైన తథ్యము. అస్తమించుటకు మున్ను రక్తసంధ్యను పోలి ఉజ్జ్వల కాంతితో ఆతడు కాలనభమున క్రుంకుగాక!

స్వీయ శరీరముపై ఆతనికి గల అవజ్ఞకు అవధి లేదు. కబళము ముట్టక దినమంతా అతడు ఇందందు సంచరిస్తూ వుంటాడు. ఏ రోగుల వద్దనుండి యైన పిలుపు వచ్చినను, రాకపోయినను ఆతడు మసలుతూ వుంటాడు. నేపాల్ సోదరుడు నడుపు మందుల షాపులోనికి పోయి, ఒక పూటంతా కబుర్లు చెబుతూ కాలక్షేపము చేస్తూ ఉంటాడు. ఎవరు పిలిచినా కాదనక ఆతడు పోతూవుంటాడు. వైద్యం చేస్తూ వుంటాడు, ఎవరైనా ఫీ యిస్తే పుచ్చుకొంటాడు. ఈయకపోతే నమస్కరించి

పోతాడు. మర్నాడు పిలిస్తే ఉల్లాసంతో పోతూవుంటాడు. చతురంగపు బల్ల ముందు కూర్చుని, యావత్తు రాత్రి గడుపుతాడు. ఒక్కొక్కప్పుడు తన యింట సంగీతపు కచేరి నిలుపుతాడు. ఎవరైన గొప్ప పాటకుడు వచ్చినయెడల ఆతనిని ఆదరానురాగములతో ఆహ్వానించి, పాడించి, సన్మానిస్తూ వుంటాడు. ఆతని పేరిట గొప్ప విందు చేయించి బంధుమిత్రులతో మహోల్లాసముతో కాలక్షేపము చేస్తాడు. కాని సంధ్య యైనంతనే కాళీమందిరమందు ప్రవేశించి కొందరు మిత్రులతో కలసి హరినామ సంకీర్తన మొనరించుట ఆతడు మరువడు. రోగులను చూచి, తిరిగి వచ్చేందుకు రాత్రి చాల ప్రొద్దుపోయినను, ఒక పర్యాయం దేవీ మందిరములో ప్రవేశించి, అమ్మకు ప్రణమిల్లి, ధ్యానించి, కీర్తిస్తూ వస్తూవుంటాడు జీవనమహాశయుడు.

"రాధాగోవిందా! జయ రాధాగోవిందా!" అను సంకీర్తనము ఆతని కెంతో ప్రీతికర మైనది. ఇది ఆత డెన్నడు మరువడు. వంశ ప్రథ ననుసరించి వైష్ణవ మంత్ర పునశ్చరణమున బద్ధ దీక్షితుడై ఉండుట ఆత డెరుగకపోవచ్చును. పరమానందముతో నృత్య మొనరించు మాధవుని సాక్షాత్కారమును పడయు భాగ్యము వానికి కలుగక పోవచ్చును. అయినను స్మరణ సంకీర్తనముల నొనరించుట ఆతడు విస్మరింపలేదు. ఉద్దామ ఉద్భ్రాంత స్థితియందు సయితము ఈ అభ్యాసమున మనసు నిలిపి ఆతడు ప్రశాంతి నందుచుండును.

"తిండితిప్పల మాటెత్తక మసలుతున్నారు. డబ్బు మిగిలిస్తున్నారా?" అని యింట ప్రవేశించినప్పుడు ఇల్లా లంటూ వుంటుంది.

మహాశయుడు నవ్వుతూ, సొంత ఎవ్వరూ లేనపుడు ఇలా అంటూవుంటాడు. "మంజరికోసము యీ వైపు బజారు యావత్తు గుత్తకు తీసుకొని ఖర్చుపెట్టినప్పుడు డబ్బు మిగిలేది కాదు. ఆమెకు బదులు నిన్ను పొందినాను. ఇప్పుడు సంపాదించి వెచ్చిస్తున్నాను. పైకం మిగల కేమవుతుంది?"

"మీ రెంత సంపాదిస్తున్నారు? ఎంత సంపాదిస్తారు?" ఇల్లాలి మొగము ఎఱ్ఱబారిపోయింది.

"నీ కెంత కావాలో చెప్పు. ఎన్ని రూకలు? నీకు కావలసినంత పైకము చేత పెడతాను. ఏమేమి నగలు కావాలో చెప్పు. ఎన్నెన్ని నాణేలు?"

"నాకు నగలూ వద్దు. నాణేలూ వద్దు. మీరు నాకేమీ యీయనక్కర లేదు. ఆడపిల్లల పెళ్ళిళ్ళూ, మగపిల్లల చదువుసంధ్యలూ సాగితే చాలు. నేను

మీ కొంపలో దాసీవృత్తి చేసుకొనేందుకు వచ్చాను. దాసినై వున్నాను. దాసినై వుంటాను.''

''నీవు నిజమాడడం లేదు. శాసనదండమును చేత పుచ్చుకొని వచ్చావు. ఆ చట్టమును మొదటినుండి అమలుపరుస్తున్నావు. నీ పిల్లలకై ఉన్నతస్థానము లను సిద్ధం చేసి పోతున్నాను. తెలిసికొనడంలేదా? పిల్లవాడు నీవలె నావలె చచ్చు పుచ్చుకాయ కాడు. పెద్దపెద్ద పరీక్ష లందు ఉత్తీర్ణు డయ్యే। గొప్ప డాక్టరవుతాడు. నేడు మనయిల్లు నవగ్రామమందలి బ్రాహ్మణ జమీందారుల కొంపకు లొచ్చుగా అగపడవచ్చు. దీని నుద్ధరించి వారితో సమానము చేసి వదులుతాను. వారికంటె హెచ్చు చేస్తాను.'' ఈ సందర్భములో ఇల్లాలు మౌనము వహించి ఉంటుంది. స్తబ్ధయై విశ్వాస అవిశ్వాసముల నడుమ ఊగాడుతూ భర్తను చూస్తూ వుంటుంది.

అట్లుండక పోయినయెడల వేరు వెరవేముంది? వనవిహారిని గురించి ఆమె మిగుల బెంబేలు పడిపోయింది. కడుపు తరుగుకొనిపోయింది. పెనిమిటితో చీటికి మాటికి కయ్యమును పెంచడం గాని, వాదులాడడం గాని ఇంచుమించుగా ఆమె మానుకొన్నది.

దుర్దినములు రాకమున్ను గారాబముతో వనవిహారి పెరుగుతున్న సమయంలో అతని యుదంతము కొంత వారి సాంసారిక యవనికపై చిత్రింపబడింది. ఒక నాడు కొడుకు తండ్రితో ''నాన్నా! బడికి పోవడం నా కిష్టంలేదు.''సంస్కృతమూ, లెక్కలూ – ఇవి నా తలకెక్కవు" అన్నాడు.

"తతః కిమ్?'' అని నవ్వుతూ జీవనమహాశయుడు ప్రశ్నించాడు.

లోపలనుండి తల్లి వెలుపలకు వచ్చి "కలకత్తాలో క్రొత్త డాక్టరీ స్కూలు యేర్పడిందని వింటున్నాను. అక్కడ పిల్లవాణ్ణి చదవనియ్యండి. ఇక్కడ ఏటేటా ఎందరెందరో ఫేలై పోతూ వుంటారు'' అన్నది.

"అక్కడ కూడ ఫేల్‌చేస్తే మరి గతేమి?"

''అప్పుడు మీవంటి వైద్యుడై కూర్చుంటాడు. మీ రీ ప్యాసుఫూసులు లేకుండా, యీ చదువుల దెస తొంగిచూడక రెండు చేతులతోనూ డబ్బు సంపాదిస్తున్నారు. కులవిద్యను కన్న తండ్రి పిల్లవానికి నేర్పుతాడు.''

''ప్రాణేశ్వరీ! మా కులవిద్యలో అంతో యింతో సంస్కృత జ్ఞానం అవసరమై। ఉన్నది.''

"ఏమని పిలుస్తున్నారు? ప్రాణేశ్వరీ! అంటున్నారా?"

"అవును. మరి ధర్మపత్నీ అని కూడా పిలుస్తాను నిన్ను. ఇవి మంచి మాటలే కదా!"

"ఇది వట్టి పరిహాసము. మీవంటి కఠిన హృదయులు ప్రపంచములో మరెవ్వరూ లేరు. కన్న తండ్రికి కన్న బిడ్డపై మమత లేకపోవడం మీలో మాత్రం నేను చూస్తున్నాను."

జీవనమహాశయుడు మాట్లాడ లేదు. ఏమన గలడు? కన్న పిల్లవానిపై మమతయా? వనవిహారిచే ఎమ్.డి చదివించాలనే ఉద్దేశం ఆతని కుండేది. ఆ ఆకాంక్షను ఇల్లా లెరుగదు. ఆ రోజుల్లో ఎల్. ఎం. ఎస్. పోయింది. ఎం. బి ఆవిర్భవించింది. ఆ చదువు ఆరంభించిన వెంటనే పెళ్ళి ప్రయత్నం చేయాలని ఆత డనుకొన్నాడు. జాతకమూ, సర్టిఫికెట్లూ తయారుగా ఉంచాలనుకొన్నాడు. కాందినుండి ఏదేని జమీందారీ కుటుంబంలోని పిల్లదానిని తేవలెనని అభిప్రాయ పడినాడు. సొంతవూరు జమీందారుల కంతగా ప్రతిష్ఠ లేదు. ఎం. బి. పరీక్షకై చదువుతున్నాడు పిల్లవాడు అనినంతనే ఎగిరి గంతులువేస్తూ పెద్ద కుటుంబాలవారు పిల్లదానిని ఉబలాటంతో ఒళ్లో కూర్చుండ పెడతారు, కాందీ వెళ్ళితీరాలని ఆతడు నిశ్చయించుకొన్నాడు. ఆ భూపీ వంశీయుల జ్ఞాతులనుండియే బాలికను తేవలెనని ఆత డుద్దేశించినాడు.

వేడి నిట్టూర్పు వీడి జీవనమహాశయుడు "మంచిది, నువ్వు చెప్పినట్లే చేస్తాను. పిల్లవాని మొగమును తేరిచూచి ఆతడు "బాబూ! నువ్వు బెల్‌గేబియా మెడికల్ కాలేజీలో ప్రవేశించేందుకు దరఖాస్తు పెట్టు" అన్నాడు.

"అక్కడ ప్యాసు పూసులు అవసరం లేదా?" అన్నది ఇల్లాలు.

"నాయనా! నా కంతా తెలుసు. అక్కడ కూడ ఫేలు చేస్తూ వుంటారు. మన నవగ్రామంలోని రాయ్ కుటుంబంలోని బాలు దొకడు అక్కడ వరుసవెంబడి దండయాత్రలు కొడుతున్నాడు. స్కూలులో నెగ్గినకాని అక్కడ కాలు పెట్టేందుకు వీలు లేదు."

"మనవాడు తప్పకుండా పేసై తీరుతాడు. మూడుతరములనుండి వైద్య విద్య మన వంశములో జీర్ణమై వుంది. నాయనా! నీవు బుద్ధిమంతుడవు. బాగా ఛదువు కోవాలి. ప్యాసు కాని డాక్టరు మొగము నెవ్వరు చూడరు. మహాశయుల

వంశంలో అపఖ్యాతి ఘటిల్ల కూడదు గదా!'' అన్నది తల్లి. ఆ మాటలనే తండ్రి నిండు గారాబముతో ఉచ్చరించాడు.

డాక్టరు ఆర్. జి. కార్ మహాపురుషుడు ఎక్కువ చదువు సంధ్యలు లేనివారి యెడల ప్రత్యేకమైన కనికరము చూపుతూ వుంటాడు.

దేశమం దపుడు మలేరియా తీవ్రముగా చెలరేగుతూ వున్నది. విదేశము లందు చదువుకొని వచ్చిన సర్కారు డాక్టర్ల చేతులనిండ పని కలిగింది. కవి రాజుల నోటిలో కరక్కాయ పడిపోయింది.

జాడ్యం ముమ్మరమై పోయింది. సగపు డాక్టర్లని పిలవబడుతూ వుండేవారి చేతికి కొంత పని చిక్కక మానలేదు. వ్యాధి ప్రకోపం వలన చావు బ్రతుకులు సాగుతూనే వున్నాయి.

అతని కొడుకు ఆర్. జి. కార్ స్కూలులో చదివేందుకు వెళ్ళినాడు. వాని ఆంతరంగిక మిత్రుడు రామసుందరుడు వెంటబోయినాడు. ఆరునెలలు గడచిన పిదప మొదటి సెలవలలో ఆత డింటికి మరలినాడు. ఒంటి మీద డబుల్ బ్రెస్ట్ కోటు, ఫ్రెంచి ఫేషన్‌తో కత్తిరింపబడిన గడ్డము—మరొక మనిషివలె ఆతడు తయారై నాడు. వాని నోటిలో సిగరెట్ అలరారుతూ వున్నది. సిగరెట్ కంపు దుస్తులందు గుప్పుమంటూ వుంది. కుడిచేతి తర్జని, మధ్య వ్రేలూ రంగుతో ఒప్పుతున్నవి. సిద్ధ జ్యోతిష్కుడు ఏరీతిగా వ్యక్తుల ఆచారములందు, ఆచరణలందు, వాక్యములందు, రూపమందు, తన గణనమునకు వలసిన ఊహలను గ్రహింపజాలునో, అనివార్య ముగ జరుగు సంఘటనలను గురించి చెప్పగలుగునో, చిరునవ్వుతో భవిష్య ద్వాణిని చెప్పజాలునో, అదే రీతిగా అతనివైపు నుపలక్షించినపుడు వాని జీవిత గతిని యథాతరముగ చెప్పుట సాధ్య మగును. వైఖరి హాస్యాస్పదమై యుండెను. హార్మోనియంబాక్సు, తబలాజోడు, ఇత్తడి సన్నాయి మొదలైన సంగీత సామగ్రిపై అతడు కొంత మక్కువ చూపినాడు.

ఇది వాని వంశములో జీర్ణమైన విద్యయే. సతంగీనృత్యములు అరువది నాలుగు కళలలో చేరినవి. అవి నాదబ్రహ్మోపాసనకు సంబంధించిన మధుర క్రియలు. దీనబంధుమహాశయుడు నామ సంకీర్తన మొనరిస్తూ వుండేవాడు. జగత్ మహాశయుడు పదములు పాడడం నేర్చినాడు. జీవనునకు నేర్పినాడు. మూడు పురుషార్ధములనుండి మృదంగ శబ్దము వారి గృహమందు ప్రతిధ్వనిస్తూ వుంది. ఇవి ఆరోగ్యనికేతనపు అటకపై అమర్చబడి వున్నవి. ఆధునిక వాద్య విశేష ములు కొన్ని వానితో చేరినవి.

కొడుకు రుచుల నెరిగినాడు తండ్రి. కొన్ని దినములు గడచినవి. వెనుకటి దినములు అపుడపుడు జ్ఞప్తికి వస్తూవున్నవి. సంధ్యాసమయము, ఏకాదశీ చంద్రుడు ఆకాశముపై వెలుగొందుచున్నాడు. పండువెన్నెల సర్వదిశలందు కాంతిలుతూ వుంది. చెట్లజొంపముల దిగువ, దట్టమైన కొమ్మలక్రింద నీలవసన వరంపర వ్రేలాడుతున్నట్లు గోచరిస్తున్నది. ఆ ఛాయను విడ్డూరముగా చూస్తున్నాడు జీవన మహాశయుడు.

హఠాత్తుగ మంజరి అతని స్మరణకు వచ్చినది. ఆమె అస్తమించలేదు. ఛాయారూపమున ఆమె యెట్లు సాక్షాత్కరిస్తుంది? ఆమె దురదృష్టవశాత్తూ వితంతువై పోయినది. భూపీబోసు మరణించినాడు. వారి కొక కూతురు కలిగినది. తండ్రి శరీర ఛాయవంటి బంగారుపూత గలది. తల్లిని మించిన ముఖశ్రీ పరిఢవిల్లుతూ వుంది. సమస్తము కోల్పోయి, భూపీబోసు ప్రాణములు కోల్పోయినాడు. వంశగౌరవమును బట్టి, రూపసంపదను బట్టి బాలిక గొప్ప ఇంటివారి కోడలైనది. కూతురు వలన మంజరి పోషింపబడుతూ వుంది. మనుమరాలిని చూచి ఆమె సమస్తమును విస్మరించింది.

విషయముల నన్నిటిని జీవనమహాశయుడు తలపోసినాడు. ఆత డవ్వల చతికిలపడి వున్నాడు. ఇల్లాలు వచ్చి పిలిచింది. "అబ్బాయి వచ్చాడు. మీ రింకా ఇక్కడే వున్నారా?'' అన్నది.

"చుట్టాలనూ, పక్కాలనూ పరిచితులనూ పిలిచి, విందు చేయాలని అనుకొంటున్నాను.''

''మంచిది. కలకత్తానుండి వచ్చిన అబ్బాయిని అందరూ ఆశీర్వదిస్తారు."

విందుకు వలసిన యావత్తు సామగ్రిని అంగడినుండి అప్పుగా తెప్పించినాడు మహాశయుడు. కూతురు ఇందిర ఈ సామగ్రి సేకరణకై నడుము గట్టింది.

నందుడు అపుడు పిన్నవయసువాడు. పొరుగువారి ద్వారా కూరగాయలను రప్పింపు మని అతనితో తెలిపినాడు తండ్రి.

విఖ్యాత గాయకుల పాటకచేరి ఏర్పాటైనది. శేషించిన కాలము ఆనందముతో గడచుగాక! మాధవ సాక్షాత్కారమైనను, కాకపోయినను 'జీవనము పరితోషప్లావితము కావలెను కదా!' అని జీవనమహాశయు డెంచినాడు.

# ఇరువది యైదవ ప్రకరణము

ఆకాశము మీది చందురుడు మెల్ల మెల్లగా మొయిలుగములను తప్పించుకొని ప్రాకుచుండగా, ఎదుటి సందులోని వెన్నెల రేకలు వెలుపలికి ప్రాకినవి. గల్లీని చూచినపుడు ప్రవేశపథమున ఎవ్వరో నిలిచినట్లు తోచుచుండెను. సందుగుండా పోయినపుడు శశాంకుని యిల్లు అగపడుతూ వుంటుంది. అందుండి శశాంకుని భార్య వైద్యునిపై అభిశాపము కురిపించింది.

కావున వనవిహారి అకాలమృత్యువు వాతబడిపోయినాడు. విచలిత విహ్వల చిత్తుడై ఆ శాపము తగిలియే తన తనూభవుడు గతించెనని ఆత డెన్నడు తలప లేదు.

స్వయముగ తాను డాక్టరైనను, వనవిహారి మృత్యువును ఆహ్వానించినాడు. ముందంజ వేసిన మృత్యుకాంత ఏల వెనుకకు తరలును? పిలిచిన దానిని చూచి ఆతడేల ఉలికిపడును? బ్రతికించవలెనను వ్యాకులత అతని హృదయములో తలసూపలేదు. ఇట్టి అనుభూతులను అతడు ఎందరో రోగుల సంపర్కమందు పడసి యుండెను. దాంతుకేసు ఆత డెరుగును. మతి తల్లి సంగతి ఆతనికి అవగతమై యుండెను. గతానుభూతి మనసున పునశ్చరణ మైనప్పుడు హృదయము దుఃఖభరిత మగును. ఎవనికి బ్రతుకుపై తీపి కలదో జలమగ్న మనుష్యునివలె రెండు చేతులు వెలుపలకు చాపి "నన్ను రక్షించండి" అనుచు నీటిలో మునిగి పోవును. అట్టి వానికై కలుగు పరితాపము మిగుల తీవ్రమై యుండును. లేకున్న శోకము శుభశాంత మైనది. అది జీవనముయొక్క మహాతత్త్వము. శాంతశోకము జీవితమునకు కొన్నాళ్లు వైరాగ్య చిహ్నమైన కాషాయాంబరమును కప్పి మనోహర మొనరించును. చెవిపొంత సత్య సంగీతము ధ్వనించును. ఇది ఉన్మాదుని వైరాగ్యము బోలునది.

"అహన్యహని భూతాని గచ్ఛంతి యమమందిరం". అన్యవంశమందు, అన్య కులమందు బహుశః ఇది సంభవము కాదు. కాని మహాశయుని వంశములో అది అసంభవము కాలేదు.

ప్రథమ యౌవనమున దారుణ ప్రవిదారుణమున ఘటిల్లిన అభిమన్యు వధ జీవనుని స్మరణకు వచ్చింది. ఆ ఉదంతమును వివరిస్తూ చండీ మందిరమునందలి సాధకుడు మహంతు రఘువర ఘోసాయి,సమక్షమున అధివసించిన యాత్రికులతో కొన్ని మాటలు తెలిపినాడు. వానిని మహాశయుడు జ్ఞాపకము చేసికొన్నాడు. సప్త రథికుల అస్త్రాఘాతమువలన క్షత విక్షత శరీరుడై, కురుక్షేత్ర మందలి మృత్తికలో పడిపోయి, పదునారేండ్ల కిశోరుడు అభిమన్యుడు ఆక్రందన మొన రించెను.

అధర్మయుద్ధమున, ఘోర సమరమున, అకాలమున బాలకుని ప్రాణము అంతరించినది. పాండవమధ్యముడు ఎవ్వని తండ్రియో, గోవిందు డెవ్వని మాతు లుడో ఆతని కట్టి గతి పట్టినది. మాతృదేవి సుభద్రను స్మరించి ప్రేయసి ఉత్త రను మానసపథమున నిలిపి ఆతడు వ్యధ చెందినాడు. ఆ సంఘటనమును తలపోసి నపుడు రాతిగుండెలు సయితము కరిగిపోవా?

వీరపుత్రుడు అంగలార్చువాడు కాడు. విషయమును మనసులో ఉంచుకొని మహంతు ఆ నా డిట్లు వ్యాఖ్యానించినాడు.

ఏడ్పు మంచిదే; మనసులోని మాలిన్యము నది కడిగివేయును. అంతరం గము పరిష్కార మగును. కాని మస్తకముపై గదాఘాతము వేసికొని ఏడువనేల? ఏడ్చిన ప్రేమతో ఏడువవలెను. ఆనందముతో ఏడువవలెను.

అర్జునుడు మహావీరుడు. కిరాత వేషముతో శివుడు అతనితో సమరము నలుపుటకై వచ్చెను. ఏ కదన మందును నరుడు అడలలేదు.

మృత్యువును మార్కొనుచున్నాను. జెబ్బ గొట్టి "హే! మృత్యువా! రమ్ము." అని వీరుడు సవాలొనరించును.

యాత్రికుల ముందర వర్ణింపబడిన అభిమన్యునికంటె పెక్కుమడుగుల హృదయావేగముతో వనవిహారి మరణించినాడు. మలేరియా జ్వరము వలన ఆతడు మరణించినాడు. చిన్న నిప్పు కణము రవుల్కొని భీషణాగ్ని జ్వాలయై విజృం భించునట్లు మలేరియా మృత్యురోగమై చెలరేగును. విలాస మందు మనసుంచి, తరళచిత్తుడై కొంత కాలమెట్లో కలకత్తాలో వైద్య విద్య నభ్యసించి ధనికుని తన యుడనని జమీందారుని గృహమున పుట్టితినని ఊహిస్తూ వనవిహారి గతించినాడు.

వాని దృష్టి సదాశతో కాంతిల్లినది. పెద్ద జమీందారుని కూతురును పెండ్లి చేసికొన్నాడు. ఆతనికి మగపిల్లలు లేరు. వన విహారియే ఉత్తరాధికారి. కోడలిని తనంత తాను ఎన్నుకొన్నది అత్తరుకోడలు. వెలలేని, తులలేని నగలతో ఆమెను అలంకరించింది. అల్లుని అందలమునుండి దిగనీయ దలచుకొనలేదు మామగారు. "మణిపూస'' మావాడని మురిసిపోయింది అత్తగారు. అలక పాన్పుపై అల్లుడు కూర్చుండకమునుపే ముద్దు ముచ్చట లన్నీ తీరిపోయినవి. మోటారుసైకిలు ఎదుట అమరింది. బంగారపు రిస్టువాచి అల్లునిచేతి నలంకరించింది. రోగుల గుండెలను స్టెతెస్కోపుతో పరిశీలించేటప్పుడు ఆ గడియారముపై చూపుంచి చెవికి వినబడు గుండెచప్పుడుల నాతడు విని వ్యాధి స్థితిని గుర్తింపవలెనని మామగారి మక్కువ. ఔషధాలకై వార్నిష్ చేయబడిన మంచి అల్మైరా డ్రాయింగ్ రూములో నెలకొనినది. 'సంజీవన ఫార్మసి' అను సైన్‌బోర్డు వీధి గుమ్మము పొంత కట్టబడింది. పూలజల్లు వలె ఎన్నెన్ని ఆశలో అల్లుని బ్రతుకును చుట్టుముట్టినవి. అతిథులకూ రోగులకూ సముచిత సపర్యలు సలుపుటకై సామగ్రి సరంజామ ఏర్పడింది. వందలకొలది టీ కప్పులు ఎప్పటి కప్పుడు తయారు.

దాతవ్య చికిత్సాలయ డాక్టరు చక్రధారి ఘోష్ వనవిహారికి మిగుల గూర్చు నెచ్చెలి. ఇరువురు కలకత్తా మహానగరమందలి విలాస వేషములందు మునిగితేలిన వారే! మధుపానమునకును, వేశ్యా సంపర్కమునకును దూరస్థులు కారు. నగర మందలి అభ్యాసములను వారు నగరమందే పరిత్యజింపలేదు. వారి డిస్పెన్సరీలో రోగులు గుమిగూడి వుండేవారు. సంశయాపన్నులైన రోగుల స్థిమిత జీవన దీప శిఖను సముజ్జ్వల మొనరించేందుకై శాస్త్రోక్త సంజీవనీ తైలమువలె బ్రాంది యిపుడు అందు ప్రవేశించింది. ఉల్లాసముకొరకై యిప్పు డది ప్రయోగింపబడుతూ వున్నది.

విహారి ఒళ్లు పాడుచేసికొనియే ఇంటికి వేంచేసినాడు. రక్తపరీక్షాది వ్యవస్థలు అప్పు డంతగా పొడసూపలేదు. క్రొత్త క్రొత్త ఇంజక్షనులైతే తలసూప సాగినవి. కాని ప్రథమ ప్రపంచ యుద్ధము ముగిసిన పిదప వాటి ఖరీదులు హెచ్చినవి.

చక్రధారి ఘోష్ విహారికంటె వయసులో కొంచెము పెద్ద. చదువు సంధ్యలు సాగునపుడే ఇరువురు తరచుగా కలుస్తూ వుండేవారు. ఒండొరుల యింట ఆటపాటలు నిరుద్వేగ నిరుపద్రవ ఉల్లాసముతో సాగుతూవుండేవి. రాత్రి

చాల ప్రొద్దుపోయిన తరువాత మిత్రునియింటనుండి విహారి సొంతయింటికి మరలు వాడు. ప్రాక్టీసు సాగించేందుకై సొంత మకాము చేరిన పిదప, విహారి జడిత కంఠస్వరము జీవనమహాశయుని చెవులందు పడేది. సంజీవన ఫార్మసి రాత్రివేళ విలాస గృహమై వుండేది. ప్రాతఃకాలమున మహాశయుడు లేచి చూచునప్పుడు ఉచ్ఛిష్టపాత్రలూ, పులి విస్తరాకులూ, భుక్తావశేష పదార్థములూ గుమ్మము వొంత పడివుండేవి. స్థలము దుర్గంధమయమై వుండేది. వమనముల చిహ్నాము లుండేవి. ఆమ్లగంధముతో వికృతమద్యగంధము గుప్పుమంటూ వుండేది. కుక్క లందు నడ యాడుతూ మహాశయుని చూచి తోకలు ఆడిస్తూ వుండేవి. చెప్పేడిదేమి? సురమ, సుషమల పెళ్లిళ్లు అప్పటికి అయిపోయినవి.

కాని సంబంధాలు చెప్పుకోదగినవి కావు. అల్లుళ్లిద్దరు ధనవంతుల కుటుంబంలో పుట్టినవారే! కులీనులే! మంచి పాత్రలని చెప్పుకొన్నవారు కొందరు. ఒక అల్లుడు స్కూలు మేస్టరు. నెలకు నలువది రూకల జీతము తెచ్చుకుంటూ వుంటాడు. మహాశయుని కుటుంబమునకు యోగ్యుడు దొరకలేదని యెల్లరు విమర్శింపసాగినారు. ఎల్లరికంటె అధికముగా గొణుగుకునేది అత్తరుకోడలు. బావమరదిని చూచి వెక్కిరించేవాడు విహారి. పెళ్లికి ముందు 'ఊకొట్టి' పిదప 'ఊహూ!' అని అతడు వికృతముఖమును ప్రదర్శించినాడు. కాలము యొక్క ప్రవంచనమునకు గురియైతి మని తండ్రీ కొడుకులు అనుకునేవారు. పురోహితుడు వారి ఊహను పంచుకొనేవాడు.

మహాసంరంభముతో మహాశయుడు ఆడపిల్లల పెళ్లిళ్లు చేసినాడు. పుట్టింటికి వారు వచ్చిపోతూ వుంటారు. వారికై ఆత డెన్నెన్నో రుచ్యపదార్థములు చేయిస్తూ వుంటాడు.

గడచిన సంఘటనలను స్మరిస్తూ, స్మరిస్తూ వృద్ధుడైన జీవనమహాశయుడు గభీర దీర్ఘ నిశ్వాసమును విడినాడు. చక్రధారి నుద్దేశించి ఆత డిట్లు ప్రశ్నించాడు. "బాబూ! వనవిహారి సరసపరిల్లా మిక్కుటంగా తింటూవుంటా డెందుకు? వాణ్ణి అడిగిచూడు."

నవ్వి ఆతడు "వనవిహారి స్వయముగా డాక్టరు. ఆయా విషయాలన్నీ అతనికే వదలివెయ్యండి" అన్నాడు.

"అదా! అయితే...."

"ఆ విషయం గురించి మీరంతగా లోతుగా ఆలోచించకండి. అవన్నీ అంతరించిపోయినవి. ఒళ్లు బాగుంటుందనే ఊహతో అతగాడు సరసపరిల్లా పుచ్చుకుంటూ వుంటాడు. నేనూ పుచ్చుకుంటాను.

"మంచిది."

కాని ప్రకృతి అనాచారమును, అవినీతిని సహిస్తుందా? అజాగ్రత్తతో, అమితాచరణములందు బ్రతుకు గడుపు వనవిహారికి సంక్రమించింది మలేరియా. విచిత్ర సంఘటనము: వనవిహారి క్వినైన్ తినువాడు కాడు. దానికి బదులు బ్రాంది త్రాగుతూ వుంటాడు. మహాశయుడు ఆసురసమును త్రాగుతూ వుంటాడు. అపుడపుడు క్వినైన్ కూడా పుచ్చుకొంటూ వుంటాడు. తండ్రిని చూచి కొడుకు నవ్వుతూ వుంటాడు. దేశమందపుడు మలేరియా మిగుల ప్రబలింది. ఏడు గడచిన వెనుక ఏడు, కొండవరియనుండి కడువడిగ వెలారు వెల్లువ వలె దేశమును విధ్వస్త మొనరిస్తూ వుంది. దాంతు ఏమై పోయినాడు? జ్వరము వచ్చినప్పుడు వన విహారి మలేరియా మిక్శ్చరుతోపాటు ఒకటి రెండు ఔన్సుల బైనామ్గ్లేసియా కలిపి తీసుకొంటూ వుంటాడు. తనకు తాను ప్రిస్క్రిప్షన్ వ్రాసికొని, తన డిస్పెన్సరీలో ఔషధము తయారు చేసుకొంటాడు. తన డిస్పెన్సరీలో లభించక పోతే నవగ్రామమందలి సీతారాముని దుకాణమునకు పంపి మందు తెప్పించు కొంటాడు.

సీతారాముడు వనవిహారికి అంతరంగ మిత్రుడై పోయినాడు. ఆతడును అకాల మృత్యువునకు కబళమై పోయినాడు. చెడుతిరుగుడులో బ్రతుకీడ్చి మనిషి కుళ్ళిపోయినాడు. కుళ్ళిన ఒళ్లెంతకాలం నిలుస్తుంది? ఆతడు కుష్ఠరోగ పీడితు డైనాడు. అది శరీరములో ప్రవేశించినను, దానిని దాచి పెట్టినాడు. విషజర్జరిత కాయుడైన వాడు కుష్ఠ రోగియైనాడు. అభాగ్యుడు సీతారాముడు.

వనవిహారియు అట్టివాడే! క్రమక్రమముగ అమితాచార, అనియమ జీవితము వలన వాని వ్యాధి జటిలమై పోయింది. ఆయువు క్షీణించింది. దేహము జీర్ణించింది.

లివర్, తొల్లింటి మలేరియా, రక్తహీనత విశృంఖలములై, విజృంభించిన ఆహార విహారములు సంయుక్తముగ వాని శరీరముపై దాడి సలిపినవి.

కొడుకు అకాల మృత్యువు పాల్పడునని జీవనమహాశయుడు అనుమానించి నాడు. మహాశయుని వంశీయుల ఆయుష్కాలము తక్కువది కాదు. మహత్తర

మైన సాధన చేయువారు వారు. ఆ భాగ్యము యీ నాటి వారి కెట్లు లభిస్తుంది? లభించే అధికారము వారికి లేదు. కాని యింత త్వరలో వాని బ్రతుకు తెల్లవారు తుందని కలలోనైన తండ్రి తలపలేదు. ఆకస్మికముగ ఒకనాడు కొడుకు తండ్రి కన్నులందు పడినాడు. ప్రాతఃకాలమున ఇంటిలో గోడకు ఆనుకొని ఆతడు టీ త్రాగుతున్నాడు. ఆరోగ్యనికేతనమునుండి ఏదో అక్కర తీర్చుకొనేందుకు పైకము కోసము అందు ప్రవేశించినాడు. తూర్పు దిక్కున పంచపాళిలో కూర్చునివున్నాడు. నిండైన యెండలో చలిపోగొట్టుకొనడం ఆతని ఉద్దేశం.

ఎండలో వాని ముఖమును తేరి చూచి మహాశయు డులికిపడి నిలిచినాడు. వాని ముఖము రక్తహీనమై, వివర్ణమై పోయినది. దృష్టి క్లాంతమైనది. వివర్ణ పాండురతపై ఎర్రనికంగు గోచరిస్తోంది.

ఆ నాడు మహాశయుడు విధిలంఘన మొనరించి, కొడుకు నాడిని రహస్యముగ పరీక్షించినాడు మెల్లగా చేతిని దింపి మూకముగ నిష్క్రమించాడు. వెంటనే చక్రధారి వద్దకు వెళ్ళి "వాని వ్యాధి యెట్టిది? ఏమని గ్రహించినావు?" అని ప్రశ్నించాడు.

అత డించుక యోచించి, "వాని తెవులు వేరు రీతిగా నడుస్తోంది. మీతో చెప్పివేయాలని అనుకొంటున్నాను. నీ జాడ్యం కాలాజారై వుంటుందని మీ వానితో తెలిపినాను" అన్నాడు.

"కాలాజారా?"

"అవును. మీ అబ్బాయిని ఒక పర్యాయం కలకత్తా పంపండి. అచట ఎవరికైన ఆరితేరిన డాక్టరుకు చూపండి"

"నువ్వు చెప్పినట్లే చేస్తాను. నువ్వు చెప్పిన తర్వాత పంపకుందునా?"

"మీరు కూడ ఒక నాతు జాగ్రత్తగా పరిశీలించండి!"

"వద్దు. నేను చూడడం మంచిది కాదు. మరి—పోనిమ్ము. కలకత్తా పోయి చూపించడమే మంచిది."

వనవిహారి కలకత్తా పోయినాడు. వానితో కూడా తల్లి వెళ్ళింది. "కోడలిని కూడా వెంటబెట్టుకొని పో" అన్నాడు జీవనమహాశయుడు.

"కోడలినా? ఎందుకు? వద్దు. ఈ పాపిష్ఠి పిల్లను కట్టుకొనే నా పిల్లవాడు రోగపీడితుడైనాడు. దీని నిశ్వాసము వానిని సోకనియ్యను."

"అమ్మా! నువ్వు ఈ రీతిగా ప్రసంగించకూడదు. నీ మాటలు అబ్బాయి మనసును కోడలి మనసును పీడించి వేస్తాయి. కోడలిని వెంటబెట్టుకొని పో. నా మాట విను. నీకు కూడా వలసిన తోడు లభిస్తుంది. ఇల్లాలు దగ్గరవుంటే మనవాని మనస్సు సంతోషముతో వుంటుంది. ఈ రీతిగా మనస్సు బాగుండడం చాల ఆవశ్యకము. హృదయ ప్రసన్నత వలన మందు పట్టిస్తుంది."

శశాంకుని వధువు విషయం ఆనాడు జ్ఞప్తికి వచ్చింది. "నీకు విందు బెట్ట దలచినాను. మగనితో అనుభవించుటకై కోడలిని పంపవలెనని ఊహిస్తు న్నాను" అని ఆత డనుకొనినాడు.

కాలాజారు! మలేరియాయే రోగిని మృత్యువు ఒడిలో వేయునని అనుకొనేవారు ప్రజలు. ఇప్పుడు అంతకంటె భయానక మైనది కాలాజారు జీవాణువులు ఆవిష్కరింపబడినవి. బంగాళా డాక్టరు యు. యన్. బ్రహ్మచారి దాని ఔషధమును కనిపెట్టినాడు.

ఆతని తండ్రి యిలా చెపుతూ వుండేవాడు. "అస్సాంలో ఒక రీతి జ్వరం విజృంభిస్తోంది. అది సాక్షాత్తూ మృత్యువే! మహామారివలె అది చెలరేగుతోంది."

ఆ జాడ్యమే వనవిహారికి సంక్రమించింది. చక్రధారి క్రొత్తరకపు డాక్టరు. నూతనకాలపు రోగముల నెరిగినవాడు. క్రొత్త ఔషధాలపై నమ్మకము గలవాడు. నాడి చూచి, జ్వరము జీర్ణించినదని ఆతడు గ్రహించాడు. జీవనమును క్షీణింప జేస్తోంది. మృత్యులోకపు ఆభాసను సూచించు స్థితి ప్రత్యక్ష మైనది.

రక్త పరీక్ష వలన కాలాజారు బీజాణువును కనుగొనుట సాధ్యము కాదు. కలకత్తాలోని శిక్షకులు విశేష శ్రద్ధతో పరీక్షించి ప్రిస్క్రిప్షన్ వ్రాసి, గాలి మార్పుడం అవసర మని హిత వొసగిరి.

కాని కలకత్తానుండి తిరిగి వచ్చునప్పటికి జ్వరం జీర్ణతర మైనది.

రోగము మృత్యురోగముగా ముదిరినపుడు శత్రువే జీవనపు బుద్ధిదాత యగును. అపుడు విషము అమృతము వలె పనిచేసినను చేయును. పోర్టువైన్ డాక్టరు రోగిచే త్రాగించినాడు. ఈవరలో వనవిహారి రెండు రోజులకొక బుడ్డి త్రాగుతూ వుండేవాడు.

మూడు రోజులలో కొడుకు మరణించునని యెరిగి, జీవనమహాశయుడు ఇల్లాలి నుద్దేశించి "ఇక నడుము కట్టాలి. అబ్బాయికి పిలుపు వచ్చింది" అన్నాడు.

ఇల్లాలిపై పిడుగు పడినట్లైనది. స్తంభితయై లేచి, తీవ్రముగ మండిపడినది. "ఈ విధంగా మాట్లాడేందుకు మీకు నోరెట్లు వచ్చింది? తండ్రి నోరా ఈ రీతిగా కూయవలసినది?"

"అమ్మా! నేను మర్యాదస్థుల కుటుంబములో పుట్టిన వాణ్ణి. ఈ సందర్భంలో వంశధర్మము, మతధర్మము నిర్వహణం కావాలి. అబ్బాయికి ప్రాయశ్చిత్తం చేయించడం నా ప్రస్తుత ధర్మము."

"అది వనికిరాదు. అందుకు నేను అంగీకరింపను."

తలిదండ్రుల మాటలు వనవిహారి చెవిలో పడినవి. అతడు వెక్కి-వెక్కి యేడ్చినాడు. "అమ్మా! నాన్నా! నన్ను బ్రతికించండి. నన్ను బ్రతికించండి. నాచే ప్రాయశ్చిత్తం చేయించండి. చేయిస్తే నా చావు తప్పనిసరి అయిపోతుంది" అని అతడు దుఃఖావేశముతో పలికినాడు.

"అలా అయితే వాడి చేత ఏదైనా తినిపించు. తిని తీరాలి! అన్నాడు డాక్టరు.

అందుకు ఇల్లాలు సిద్ధపడలేదు.

వనవిహారి ఎట్లెట్లో, ఏమేమో నోట బెట్టినాడు. అది యైన తల్లి పెట్టలేదు. పెట్టినది వాని పెండ్లాము.

మర్నాడు చక్రధారి క్వినైన్ ఇన్‌జెక్షన్ ఇచ్చి పోయినాడు. ఇక మిగుల ప్రబలమైన జ్వరం వస్తుందని జీవనమహాశయు డెరుగును. దినము గడవకమున్నే పొంచినది పైబడక తప్పదు. కడుపులోని ఊహను యథాతథముగా అతడు వెడల గ్రక్కినాడు.

మాట విని విహారి "నాన్నా! పొంచినది ముంచుకొని యెపుడు వస్తుంది?" అని మిగుల దీనుడై ప్రశ్నించాడు.

పాపము వానికి నిద్ర పట్టలేదు. తీవ్రమైన తలపోతలో పడిపోయినాడు.

గభీర రాత్రివేళ ఆనాడు ఎవరో పిలిచినారు.

"డాక్టరు బాబూ! డాక్టరు బాబూ!"

"ఎవరు?"

"పడమటి వీధిలో నిహాజీ సాహేబు యింటినుండి వచ్చానండి,"

"ఏమి? పిల్లవాడు ఎలా వున్నాడు?" అని అరచి లేచి కూర్చున్నాడు డాక్టరు. సాహేబు కొడుకు సన్నిపాతజ్వరమునకు అతడే వైద్యం చేస్తున్నాడు.

"డాక్టరు బాబూ! వెంటనే వచ్చి తీరాలి. రోగి స్థితి మిగుల పాడై పోయింది."

"వస్తున్నాను. నడు."

పథము గతుకులతో నిండినది. పోవలసిన చోటు మైలున్నర దూరంలో వుంది. ఎల్ల తావులందు అంధకారము దట్టముగా అలముకొని ఉన్నది. వరి చేలలోనుండి సన్నని చేనుగట్టుపై పదిలముగ అడుగులు వేసి నడవాలి. మహాశయుడు మహాకాయుడు. ఆయన అడుగులు మిగుల బరువైనవి. ఎట్లెట్లో అడుగు తీసి అడుగు వేస్తూ అత దేమేమో ఆలోచిస్తున్నాడు. వచ్చిన వాని చేతిలో గ్రుడ్డిలాంతరు ఊగిసలాడుతోంది. వ్యక్తి కూడ ఊగుతూ నడుస్తున్నాడు. డాక్టరు గారి మందులపెట్టెను, కాల్‌బాక్సును తలపై పెట్టుకొని కునుకుతూ తూలిపడుతూ అతడు నడుస్తున్నాడు. "ఏమేమి మందులియ్యాలి? డిజిటాలిన్, ఎడ్రినెలిన్, స్ట్రిక్నిన్ వగైరా మందులను గురించి ఆలోచిస్తున్నాడు డాక్టరు. హార్టు, నాడి. రెస్పిరేషన్—యివి యేరీతిగా నడుస్తున్నాయి? గభీర చింతయందు మగ్నుడైన జీవన మహాశయుడు గాఢనిద్రా ప్రపంచమందు నడచుచున్నాడు. సూది గ్రుచ్చుటకు సయితము సాధ్యపడనితీరుగా చీకటి మరింత దట్టమై పోయినది. ఇరువైపులందు సాంద్రమైన వరిచే నున్నదని మహాశయుడు మరచినాడు. అపుడపుడు నింగిమీది చుక్కలదెస అతడు కన్నులు మరలిస్తున్నాడు. మరల తల వంచి కన్నులు మూసి, తెరువుపై చూడ్కులను సారిస్తున్నాడు.

రోగి ఇల్లు చేరి, వాని దాపల కూర్చుని, నాడిని పరీక్షించి, దీపమెత్తి, వ్యాధి లక్షణములను పరికించి, వ్యక్తిముఖమును చూచి, తేరితేరి చూచి దత్తుమహాశయుడు ఆలోచించి మందిచ్చినాడు. కొంత సేపు కూర్చుని, మందెట్లు పట్టిచ్చిందో చూచి అత డందుండి మరలినాడు. రోగి క్రైసిస్‌నుండి గట్టెక్కగలడు.

అవసన్నమనస్సుతో నింగిపై చూపు నిగిడించి, కొడుకు బ్రతుకుకై అతడు దేవుని తలచినాడు. కావలసిన కారణాంతము లవమైన తప్పదని అత డెరుగును. అయినను గుండెనుండి కోరిక నాతడు పెకలించి వేయలేదు.

పూర్వ దిగంతమునుండి పాండుర జ్యోత్స్నను గ్రసించి, అంధకారము ప్రసారిత మగుచున్నది. దూర మందలి పల్లెలో చీకటి చిందులాడుతూ వుంది,

రోగి దేహమందలి మృత్యులక్షణమును ప్రకృతి సూచిస్తూ వున్నది. గోళ్ళ చివళ్లు నీలము లైనవి. అరకాలు, అరచేతులందలి పాండురత శరీర మంతయు వ్యాపించినది,

ఇంటికి మరలి వచ్చి జీవనమహాశయుడు తటాలున నిలిచినాడు. అపుడు జ్వర ప్రకోపము విజృంభింపలేదు. ఇంటిలోని వా రందరు గాఢనిద్రలో ఉన్నారు. మహాశయుడును మేను వాల్చినాడు. ఆకస్మికముగ అతని నిద్రకు భంగము కలిగినది. ఎవరో తలుపుకడ పిలిచినట్లైనది. "నాన్నా"

"నాయనా!"

ఏమైనది? తత్తరపాటుతో అతడు తలుపు తెరచినాడు. అంధకారము సాంద్రమై ఉన్నది. గాఢ నిర్జనతయందు ఝిల్లీరవము వినబడుతూ వుంది. వను ఏడి? ఎవరు పిలుస్తున్నారు? బహుశః వాని మనస్సులోని వను పిలిచినాడు. వేడి నిట్టూర్పు పీడి అతడు కొడుకు గది వద్దకు పోయి "అమ్మీ!" అని భార్యను పిలిచినాడు.

"ఏమి? ఏమండీ?" అని ఆమె పలికింది. ఆమె మేలుకొనియే యున్నది. పతిదెస వచ్చింది.

"వను ఎట్లున్నాడు?"

"చలి వీస్తోంది అంటున్నాడు. జ్వరం వస్తుందేమో?"

వస్తుందేమో కాదు. జ్వరం వచ్చింది. అయ్యో! అదెట్టి భీషణ కంపము! అదే వాని తుది కంపము.

* * *

ఆరోగ్యనికేతనపు గుమ్మముముందు నిలిచి, మహాశయుడు ఆనాటి కడరేయి వింటిదెస ఏకాకియై తేరి చూచినాడు. ఉత్తర పశ్చిమ దిక్కున ఖాళీస్థలము కలదు. భిత్తికనంటి వుంది బావి. దాని సమీపమున కవలల వలె రెండు కరవీర తరువులు కలవు. అవి ఫలములతో నిండియున్నవి. సమీపమున శిశిర సంసిక్తమైన ధూళితో నిండినది శాద్వలతలము కంటి చూపును వింటిదెస పుత్తెంచి, చుక్కలను అవలోకించినాడు. వేర్వేరుగా నక్షత్రములను పర్యవేక్షింప సాగినాడు. ఏ తార ఎందున్నది? సప్తర్షి మండల మెందు కలదు? అరుంధతీ నక్షత్ర మెచట? ధ్రువతార యేది? అదెచటికి పోయినది? కాలపురుష డేడీ? పూర్వదిగంతమున అప్పటికి రెండు నిమిషములకు మున్నే చంద్రు డుదయించినాడు. కృష్ణపక్ష ద్వాదశ

చంద్రుడు జీవనుని కుటుంబమువలె క్షయరోగగ్రస్తుడైనాడు. పాండు వివర్ణుడు. క్షయిత కళేబరుడు. ఐదు భాగములలో నాలుగు భాగములు క్షీణించినవి. క్లాంతి కిక అవధి లేదు కాబోలు. జ్యోత్స్న కూడ మ్లాన మైనది. ఆకాశమున అది విస్తరించుట నిజమే; కాని మింటిపై వెన్నెలపూత అంతగా కానరాకున్నది. నీలి మాభ్యంతరమున పాండురతా ఛాయ పడినది. ఆకాశముదెస మహాశయుడు చూస్తూ చూస్తూండగా, శశాంకుని అవలోకించుచుండగా, శశాంకుని ఇల్లాలి మాట జ్ఞప్తికి వచ్చినది. మీదినుండి చూపు దింపి ఆమె యింటి దెసగల సన్నని తెరువు నాతడు విలోకించినాడు. ఆనాడు కూడ సందుముందు వెన్నెల పడి మలినమైన సైను వలువను ధరించిన విషణ్ణనారీ స్వరూపమువలె గోడ నంటి గోచరించినది. ఆ స్వరూపము శశాంకుని భార్య యని గాని, మంజరి యనిగాని ఆతడు భ్రమింపలేదు.

సరిగ అదే సమయమున విహారికేక వినబడినది.

"పోయింది! పోయింది! పోయింది! పట్టుకో! పట్టుకో! పట్టుకో! అహా! అయ్యో! అయ్యో! అమ్మా! అమ్మా!" అని వను ప్రలాపింప దొడగినాడు.

"బాబూ! వనూ! వనూ!" అని అమ్మ ఆవేదనతో అరిచింది.

తుది ముహూర్తంలో అతని కొక పర్యాయం జ్ఞానం మరలినది. అతడు ఏడ్చినాడు.

"అమ్మా! నాన్నా! నన్ను బ్రతికించుకోలేక పోయినారేం?" అని అంగలార్చినాడు.

జీవనమహాశయుడు స్తంభము వలె నిలిచినాడు.

"ఒక సారి చూడండి. ఏదైన మందియ్యండి బిడ్డకు. మీ మందు వలన మరణము మరలిపోతుందని లోకులు చెప్పుకొంటూ వుంటారు" అని దేవులాడింది ఇంటి యామె.

"అలా మళ్ళిపోదు. ఎవ్వరి మందూ మృత్యువును మళ్ళింపదు. నన్ను పిలువకు" అని గద్గదస్వరముతో అరచినాడు మహాశయుడు.

చక్రధారి వచ్చినాడు. నెచ్చెలి నెత్తి పొంత కూర్చున్నాడు. రెండు ఇంజక్షను లిచ్చినాడు. కాని- మృత్యువును పిలిచినపుడు ఆమె ఏ అభ్యంతరమును గణింపదు. ఆమెను నిరోధించు శక్తి ఇంకను ఆవిష్కరింప బడలేదు. ఎన్నటికిని ఆవిష్కారము కానేరదు. ఎంతకాలము వ్యాధి విజృంభించునో అంత కాలమ్ము

'నేనున్నా'నని ఔషధము నిలుస్తుంది. కాని ఔషధము యొక్క హస్తమును చేబూని మృత్యువు ఆసనముపై అధివసించినయెడల సమస్తము వ్యర్థమై తీరును.

వను కొరకు దుఃఖపడుచున్నాము. పాప మాతడు ఏడ్చినాడు! మరి యేడ్చి నాడు! ఇంకను ఏడ్చినాడు.

మందహాసముతో మృత్యువును వరించిన వా రున్నారా?

* * *

అట్టి వారిని జీవనమహాశయుడు చూచినాడా? చూచినాడు. ఎప్పుడో కాదు. ఒక రిద్దరిని కాదు. బహు సంఖ్యాకుల నాతడు వీక్షించినాడు. ఈ కాలమందలి డాక్టర్లు అట్టి వారిని చూడలేదు. చూడ జాలరు. జీవనమహాశయుడే చూచినాడు. సాధారణ మానవులందే విలోకించినాడు.

నవగ్రామంలో రాయ్ కుటుంబం కలదు కదా! ఆతని వంశమందలి భువన రాయ్ విషయ మాతని స్మరణకు వచ్చినది.

అది మహాశయుని తండ్రి కాలము. అప్పు డాతడు తరుణవయస్కుడు. భువనరాయ్ అప్పటికి సర్వస్వమును కోల్పోయినాడు. జగత్ మహాశయునకు "ఒక పర్యాయం చూచి పొండ"ని కబురు పంపినాడు.

జగత్‌మహాశయునికంటె భువనరాయ్ వయసులో చాల పెద్ద. ఆతడు దరిద్రుడై పోయినాడు. వృద్ధుడై పోయినాడు. ఆతని యిల్లు ఇంచుమించుగా కూలి క్రుంగుచున్నది. నేలకు నొరగు పంచపాళి పంచలో హుక్కా చేత పుచ్చు కొని కూర్చుని ఉండేవాడు. ఎవరైనా హుక్కా గొట్టము చేత పుచ్చుకొని పోతూ వుండగా సాదరముగ వారిని కూర్చుండబెట్టి, కుశల ప్రశ్నలు వేసి "ఏదీ గొట్టము లోని గంజాయిని కొంచెము నా హుక్కా గొట్టంలో వెయ్యండి" అంటూ వుండే వాడు. ఆతని నిప్పచ్చర మంత దారుణమై పోయింది.

ఆతని ఆహ్వానమును జీవనుడు విని ఆశ్చర్యపడినాడు. ఆ కబురుమాట తండ్రితో చెప్పేందుకు ఆతడు సాహసించలేదు. 'ఆహా! బ్రతుకుపై మానవున కెంత తీపి కలదు! సంసారమందు దేనిని గాని అనుభవించు సత్తువ పూర్తిగా సన్న గిలిపోయినను, బ్రతికి బట్టకట్టాలని ఆ ముసలి తహతహ లాడుతున్నాడు.' అని అనుకొన్నాడు. ఎట్లో తండ్రికి కబురు తెలిపినాడు. తాను కూడ తండ్రితో భువనరాయ్ ఇంటికి పోయినాడు.

భువనరాయ్ మలీమసమై వున్న కుక్కి నులకమంచముపై వ్రేలాడు తున్నాడు. "రా? నాయనా! రా!" అని సాదరముగ జగత్‌ను ఆహ్వానించినాడు.

"ఏ మయింది?"

"ఇక సెలవు పుచ్చుకొన వచ్చునో లేదో చూడు తమ్ముడూ."

"అందరూ వెళ్ళవలసిన వారే. వయసు మళ్ళిన పిదప."

రాయ్ నవ్వి యిట్లన్నాడు. "బాబూ! ఈ మాట నేను మరచిపోయాననుకొన్నావా? పిలుపు వచ్చిందో లేదో చూడు. అకాల మరణము పాపమును తెచ్చిపెట్టును గదా! కైదునుండి ఎవ్వరైనా అకాలమున పారిపోగలరా? పారిపోయినను ఎక్కడకు? మళ్ళీ కైదీ కారాగృహంలో పడి మ్రగ్గి తీరవలసిందే కదా! ఇంక నేను చేయవలసిన పనులు కొన్ని వున్నాయి."

అతడు పచ్చగా ఉండిన రోజుల్లో మిత్రుని వద్దనుండి ఐదువందల రూకలను అప్పుగా తీసుకున్నాడు. అందుకై జగత్ ఎన్నడూ వానిని పీడింపలేదు. అడుగనూ లేదు. కాని రాయ్ ఆ అప్పుమాట మరువలేదు. ఋణం తీర్చాలని అనుకున్నాడు. కాని అట్లు చేయడం వానికి సాధ్యం కాలేదు. మిత్రునియొద్ద క్షమాభిక్ష వేడుకోవాలనే వాంఛ వానిలో కలదు. కాని అది సులభ కార్యమా? నేడు కట్టెదుట మిత్రుడు నిలిచినంతనే "నాయనా! నాకు ముక్తి ప్రసాదింపుము" అని సాభిప్రాయముగా రాయ్ జగత్‌ను వేడుకొనినాడు.

అతని చేతిలో కొంత బంజరునేల వుంది. ఆ కొంత్రడను స్నేహితున కీయవలె నను సంకల్పము ముసలివాని మనసులో ఉండెను.

దిండు దిగువనుండి ఒక రూకను వెలుపలకు తీసి మహాశయుని చేతిలో రాయ్ దానిని ఉంచినాడు. చేతులు జోడించి మహాశయుడు "స్వామీ! నన్ను క్షమించండి" అన్నాడు.

"జగత్! అలా అనకు. వైద్యపు ఖర్చు యీయనియెడల, నాకు ముక్తి లభించదు" అని పిదప నవ్వుతూ, "నా శ్రాద్ధ సమయంలో ఒక రూకకు బదులు రెండు రూకలు తీసికొందువులే" అన్నాడు.

మిత్రునికడ నుండి ముక్తినంది భువనరాయ్ నగుమోముతో కన్నులు మూసి, ధ్యానమగ్నుడైనాడు.

మరొక దృష్టాంతము గలదు. అది గణేశునకు సంబంధించినది. అది ఇరవై యేళ్ల నాటి విషయం. గణేశుడు ఎనుబదియైదేళ్ల ముసలి పండు. బ్రహ్మచెముడు వాని నెన్నడో ఆశ్రయించింది. ఇంచుమించుగ విరిగిన బండి ఎక్కి వచ్చి, ఆరోగ్యనికేతనమున కెదుట బండిని ఆపి అతడు అరుస్తూ వుండేవాడు. తన మాటలు తానే వినజాలువాడు కాడు. కాబట్టి, అవి తనకు వినిపించువరకు, ముసలివాడు బొబ్బలు పెడుతూ వుండేవాడు.

''అయ్యగారూ! నాకు మందు మందియ్యండి'' అని యెడతెరపి లేక ఆతడు అరుస్తూ వుండేవాడు. అతడు బక్కవాడు. మిగుల చిక్కిపోయినాడు. జగత్ మహాశయుని పెళ్లి సమయంలో ఆతడు డోలు వాయించాడు. ఆతని తండ్రి దీన బంధు మహాశయునికాలంలో కూడ బాజా వాయిస్తూ వుండేవాడు. గణేశు జగత్‌ను 'చిన్న మహాశయుడా' అని పిలుస్తూ వుండేవాడు.

జీవనమహాశయు డాతని నుద్దేశించి "తాతా! నీకేమి వచ్చిందిః" అని అడిగి నాడు. ఆతనిది బ్రహ్మచెముడను విషయమును ఆతడు మరచినాడు. ముసలివాడు చెవి నులుముకొని ''చిట్టిబాబూ! ఏమంటున్నారుః'' అని బిగ్గరగా పలికినాడు.

జీవనునకు అరుపు సూచన యైనది. ''ఏమయింది నీకు తాతా!'' అని ప్రశ్నించాడు.

''బాబూ! జబ్బు చేసింది. తెగులుగొంటువాణ్ణి అయిపోయినాను'' అని వడకుచుండు కంఠముతో పలికినాడు.

''నీకు కూడ జబ్బు చేసిందాః''

''చిట్టిబాబూ! ఎందుకు చెయ్యదండిః''

''అయితే చేసిందన్నమాటే!''

''అవునండి. గుండెలో తుఫాను పుట్టిందండి.''

''నీరోగ మేమో ముందు చెప్పు.''

''కడుపులో ఏదో అల్లరి పుట్టిందండి. ఇంకా ఆరు నెలలైనా బ్రతకాలని అనుకొంటున్నాను. కాని బాబూ, కదలలేకుండా మెదలలేకుండా ఉన్నానండి.''

''ఈ అవస్థలో ఎందుకొచ్చావుః రాకుండా ఉంటేనే మంచిదై వుండేది. కబురు చేస్తే వచ్చి వుండేవాణ్ణి'' అన్నాడు జీవనమహాశయుడు.

"బాబూ! చెప్పండి ఎన్నాళ్లు బ్రతుకుతానో"

"బ్రతికి నన్నాళ్లు."

* * *

బిపిన్ వనవిహారీల అవస్థలందు కొంత భేదము కలదు. వనవిహారి వలె బిపిన్ ధైర్యమును కోల్పోయి ఆరాటపడలేదు. ఆతడు కర్మవీరుడు. కాని ప్రసన్న ప్రశాంత భావముతో ఆత్మ సమర్పణ మొనరించుకొను శక్తి వానికి లేదు.

ఇంటికి మరలుతూ అంధకారములో మహాశయుడు అడుగు వేస్తున్నాడు. స్థలకాల చైతన్య మాతనికి లేదు. నవగ్రామ మందలి విపణిమార్గమున ప్రవేశించి నపుడు, దీపములు దృష్టి నాకర్షించినపుడు ఆతనికి జ్ఞానము కలిగెను.

హరేన్ డాక్టరు డిస్పెన్సరీలో పలువురు గుమిగూడి యుండిరి. ప్రద్యోత డాక్టరు తన తావున స్వక్రియలో నిమగ్నుడై యుండెను. సౌందర్య సంశోభిత యైన ఆతని పత్ని చెంతనుండి తన కర్తవ్యమును నిర్వహిస్తూ వున్నది.

నలుదిక్కులనుండి కోలాహల ముత్పన్న మైనది. బజారులో క్రయవిక్రయ ములు సాగుతున్నవి. అడుగులు వేసినకొలది అంధకారము అలముకొనసాగినది. బిపిన్ విషయము నెవ్వరు మహాశయుని ప్రశ్నింప లేదు. 'బ్రతుకు జీవుడా' అను కొన్నాడు.

చీకటిలో రోడ్డుమీది కంకరమీదను, ఇసుకమీదను పాదరక్షలతో జీవన మహాశయుడు నడుస్తూ వున్నప్పుడు శబ్దము సృష్టి అవుతూవున్నది. పోయినకొలది తెరువు నిర్జనమైనది. వసతి హీనమైనది. చాల వెనుక నవగ్రామ విపణిలోని ఆలోకఛట శూన్యలోకమున స్రవిస్తూ వున్నది. అందల ధ్వనులు క్రమక్రమముగ సమసిపోతున్నవి. అపు డేదో ఆక్రందనము వినిపించినది. ఇంచుక నిలిచి, ఆతడు మరల నడువసాగినాడు.

ఆసుపత్రి నంటియున్న వసారాలో వెలుతురు అగపడింది. ప్రద్యోత డాక్టరు ఆగారమున పెట్రోమాక్సు జ్వలిస్తూ వుంది. చారు బాబూ మున్నగువారును మరి కొందరు అందు గలరు.

"ఈ సమయంలో తిరిగి వస్తున్నారేం?" అని ఎవరో లోపలనుండి ప్రశ్నించారు.

దత్తు ప్రత్యుత్తర మీయలేదు.

ఆసుపత్రి నుండి ఎవరో వెలుపలకు వచ్చిరి. ఆతనిని గుర్తించి మహాశయుడు "ఎవరు? వినయుడా?'' అని ఆశ్చర్యముతో ప్రశ్నించినాడు.

అతడు బి. కె. మెడికల్ స్టోర్సు యజమాని.

''నాయనా! ఇక్కడున్నావేం?'' అని మహాశయుడు ప్రశ్నించాడు.

''ఇక్కడ డాక్టర్ల సభ జరుగుతోంది.''

"ఏమి? మీటింగా?"

"అవును. నన్ను బాయ్‌కాట్ చెయ్యాలని ఆలోచిస్తున్నారు.''

''నిన్నా? ఎందుకు?"

''అవునండి. రేపు మీ దగ్గరకు వస్తాను. ఈ మీటింగు కేవలం నన్ను గురించి మాత్రమే కాదు. మిమ్ము గురించి కూడ అది జరుగుతోంది. రేపు ఉదయము వచ్చి సమస్తము చెప్పివేస్తాను. ఇంకా సభకు హరేన్ ఒక్కడు మాత్రం రాలేదు. చారు, ప్రద్యోత డాక్టర్లు ఉద్రేకంతో నడుస్తున్నారు. అందరూ సభ జరుపుతారు. మీరు బిపిన్‌బాబును చూచి వచ్చినారా? మీ రుండరా? అసలు మీటింగు సంగతే వారు మీతో చెప్పనేలేదు కాబోలు."

మహాశయుడు ఏమీ ప్రత్యుత్తర మీయలేదు. ఆతడు ఏమాట చెప్ప దలచుకో లేదు.

''ఈవేళ ఉదయము కిశోర్ అన్న మీ మాటా విశేషంగా చెపుతున్నాడు. గ్రామం గగ్గోలుతో నిండిపోయింది."

ఈ నుడువులు విని జీవనమహాశయుడు, మౌనము వహించెను. ''ప్రద్యోత డాక్టరు మిగుల మండిపడుతున్నాడు" అన్నాడు వినయుడు.

''వినయా! ఇక పోతాను'' అన్నాడు మహాశయుడు.

చకితుడై వినయుడు "అదిగో! వారు వస్తున్నారు. నేను కూడా వెడతాను. రేపు నేను మిమ్ము కలుసుకొంటాను" అని చీకటిలో అంతర్ధానుడైనాడు. చారు బాబు, ప్రద్యోతుడు, ప్రద్యోతుని మిత్రు డొకడు వసారాలోనుండి దిగివస్తున్నారు.

# ఇరువది యారవ ప్రకరణము

ప్రద్యోతడాక్టరు బసలో ఆనాడు ఈ ప్రాంతములోని మెడికల్ పట్టభద్రు లందరు సమావేశమైరి. ప్రద్యోతుడే నడుముగట్టి ఈ సమావేశమునకై గట్టి ప్రయత్నము చేసినాడు. ఇచట ఒక కోఆపరేటివ్ మెడికల్ స్టోర్సు నెలకొలుపుట మహాశయుల ఉద్దేశము.

వినయుని బాయ్‌కాట్ చేయడం వారి ఉద్దేశం కాదు. కాని యిటువంటి స్టోర్సు స్థాపించబడిన యెడల వినయుని వ్యాపారం గట్టి దెబ్బ తిని తీరుతుంది.

కేవలం స్టోర్సు స్థాపించడం మాత్రమే కాదు. ఒక చిన్న క్లినిక్ నెలకొల్పుట కూడా డాక్టర్ల ఉద్దేశం.

ప్రద్యోత డాక్టరు స్నేహితు డొకడు క్లినిక్ ప్రాక్టీసులో ఈ జిల్లాలో ప్రసిద్ధి కెక్కినాడు. బిపిన్ యూరిన్ బ్లడ్ పరీక్షలు చేసి స్వయముగ పరిశీలన ఫలితమును అతడు తెలిపినాడు. ఆ రిపోర్టు ఆశాప్రదమైనదే; కాని రోగికి వైద్యం చేసే వ్యక్తికి సందేహం కలిగింది. పరీక్ష మరల మరల జరిగింది. ఇప్పుడు జరిగిన మీటింగులో అతడు కూడ ప్రధాన పాత్రను నిర్వహిస్తున్నాడు. ప్రద్యోతుని ప్రోత్సాహ ప్రార్థనలు అతనిని అందులకు పురికొల్పినవి. క్లినిక్ సహాయము లేనిదే వైద్యవృత్తి సరిగ నడవదని ప్రద్యోతుని ఉద్దేశం. మెడికల్ సైన్సు సక్రమ సాధన అందే జరుగు నని అతని అభిమతము. సాధారణమైన మలేరియా, మరే సామాన్యమైన వ్యాధు లైనను లక్షణముల నుపలక్షించి కుదుర్చవచ్చును. థర్మామీటర్ స్టెతొస్కోపుల సాహాయ్యము వలన చికిత్స చేయడం సాధ్యం. కాని వ్యాధి జటిల మైనప్పుడు, సంశయాస్పదమగుచో, విజ్ఞాన సమ్మత పరీక్షలు—రక్త మల మూత్రముల పరీక్షలు—జరుగని యెడల చికిత్సచేయడం ప్రమాదకరమే అగును. నాడీ పరీక్షపై ప్రద్యోతునకు నమ్మకము లేదు. వాయు, పిత్తము, కఫ ముల ఉదంతము నాతడు ఎరుగడు. కంటబడిన రోగ లక్షణములను గమనించి, రోగి శారీరక గంధమును ఎరిగి, రోగనిర్ణయ మొనరించడం ఏ కొలదిమంది ప్రతి

భావంతులైన డాక్టర్లకో సాధ్యము కావచ్చును. కాని సాధారణ చికిత్సకుల కా శక్తి లేదు. రోగి మరణించినపుడు వైద్యము మొదటినుండి తుదివరకు చెడినదని నిర్ణయింపవచ్చును. రోగము మలేరియాయో లేక కాలాజ్వారో మరేజ్వరమో తెలియక చిత్తము వచ్చిన మందులను మ్రింగించుతారు కొందరు డాక్టరు మహాశయులు. మలేరియాను టి. బి. అని నిర్ణయించినవారు కూడ కొంద రున్నారు.

సభ జరిగిననాడు ఒక పిల్లవానికి చికిత్స చేయడంలో ప్రద్యోతడాక్టరు పరమ ఘోరమైన తప్పు చేసినాడు. వచ్చిన తర్వాత తప్పేమో ఆతడు గుర్తించాడు.

వినయుని అంగడిలో ప్రిస్క్రిప్షనులకు వలసిన మందుల సామగ్రి కలదు. అది లభించినపట్ల తన బుద్ధిని ప్రయోగించి డాక్టరు మందులు కలుపుతూవుంటాడు. నియమ ప్రకారము ఔషధములు తయారగుట అమ్మక్క. ఒక్కొక్కప్పుడు ఆరు నెలలనుండి సంవత్సరము వరకు మందు సామగ్రి నడుపబడుతూ వుంటుంది. గుణమీయని మందులవలన విపత్తులు ఘటిల్లుతూ వుంటవి. పెన్సిలిన్ అన్ని వ్యాధులలో రాజగురువై కూర్చున్నది. నియమానుసారము ఔషధములను భద్ర మొనరించువారు అరుదు. మనుష్యుని జీవన మరణములను గురించి యోచన సలుపక అవజ్ఞతో నిర్లక్ష్యముతో రోగిని చూచి. కుటిల వ్యాపార బుద్ధితో చికిత్స చేయువారి వలన మనుష్య సంఘము విపత్తులో కూలబడుతూన్నది. ప్రవచనము వైద్య మగుచున్నది. ఈ విషయములు ప్రద్యోతడాక్టరుకు తెలియును.

మీదుమిక్కిలి గమనింపదగిన విషయము ఔషధముల ఖరీదు. దరిద్రుడైన వ్యక్తి. నిరుపేదయైన గ్రామవాసి, సర్వస్వమును గోల్పోయి, వెలలేని వైద్యమును చేయించుకొను ఆవశ్యకతను గుర్తించి కూడ అట్టి చికిత్సకు దూరస్థుడై మృత్యువునకు కబళమగుచున్నాడు. అప్పుల జాబితాలు, తీరని మెడికల్ బిల్లులు ఆతని గుండెను దడదడలాడిస్తూ వుంటవి. ఇట్టి రోగం పీతపాండుర దృష్టిని, రోగాత్మకమైన చూడ్కిని చూచినప్పుడు ప్రద్యోతుని హృదయము కరుణరసభరితమగుచుండును. ఆతనికి ఆగ్రహము కూడా కలుగుతూ వుంటుంది. కొందరు రోగులకు విషయము అర్థము కాదు. విషయము తెలిపినను వారు తెలిసికోలేరు. వీరి అభ్యాసములు మిగుల తీవ్రములై ఉండును. విజ్ఞాన శక్తి, నాడీ పరిజ్ఞానములు ఇట్టి రోగుల కెట్లుపయోగించును?

ఈ విషయము లన్నిటిని మనసులో ఉంచుకొని, ఒక నిర్దుష్ట చికిత్స వ్యవస్థను స్థాపించాలని ప్రద్యోతడాక్ట రుద్దేశించినాడు. ఔషధ సామగ్రిని యావత్తు సప్లై చేయగల అంగడిని నెలకొల్పుట కూడ మిగుల ఆవశ్యకమైన విషయ మని అతడు గ్రహించాడు. క్లినిక్ అక్కర కూడ అట్టిదే!

ఈ యేర్పాటుతో చక్కని వ్యాపారం కూడా సాగుతుంది. సుమారు ముప్పై యేళ్లనుండి నవగ్రామంలో చిన్న మందుల అంగడి ఒకటి నడుస్తూ వుంది. హరీశ్ తన యింటిలో ఒక బీరువా ఔషధములుంచి ప్రాక్టీసుతో బిజినెస్ సాగిస్తున్నాడు. జీవనమహాశయుని ఆరోగ్యనికేతనమున చాలకాలమునుండి ఈ కార్యక్రమాలు సాగుతున్నవి. నేడు క్రీ.శ. 1950 లో ఒక క్లినిక్‌లో, ఒక ఫర్మ్‌లో వైద్యవ్యవస్థ నిర్వహణ మగుటలో ఆశ్చర్య మేమి కలదు?

నేడు నవగ్రామంలో ఇద్దరు ఎం.బి.లూ, ఇద్దరు ఎల్.ఎం.ఎస్.లూ ఉన్నారు. పది, పన్నెండు మైళ్లలో ఇందందు నలుగురు ఎల్.ఎం.ఎస్. లు వున్నారు. వీరందరూ ఏదో ఒకవిధముగ తమ వృత్తి సాగిస్తున్నారు. ఎల్లరను ప్రద్యోత డాక్టరు ఆహ్వానించాడు. వీరందరు షేర్లప్రకారం వ్యాపారం సాగించాలని ఇప్పుడు నిర్ణయించారు. ఎల్లరకు లాభం కలుగుతుంది. కేవలము వ్యాపారదృష్టితో ఈ కర్తవ్యమును నిర్వహించడం వారి అభిమతము కాదు. కాని కొంతకు కొంత పైకము వారిచేతికి చిక్కడం తథ్యం. ప్రిస్క్రిప్షన్ కమీషన్ కూడ హెచ్చుగా లభిస్తుంది. ప్రజలకు కూడ చాల ఉపకారము జరుగుతుంది. తక్కువ వెచ్చముతో మంచి ఔషధములు వారికి దొరుకును.

టీపార్టీతో గానవినోదములతో కార్యక్రమము ఆరంభ మైనది. రాత్రివేళ విందు జరిగింది.

* * *

నవగ్రామ ప్రాంత స్థానములో ప్రాక్టీసు చేసే డాక్టర్లందరూ ఆ స్థానమందు ప్రభవించినవారే. ఉత్తమమైన మెడికల్ పరీక్షలలో ఉత్తీర్ణులైనవారే. వ్యాధులు కూడ విశేషముగ చెలరేగుచుండడం వల్ల ఎల్లరకు చేతిలో కావలసినంత పని ఉండేది. ఉపార్జనలో లోపము లేదు.

ఒకప్పుడు 'లా' యెడల ఎల్లరకు మోజు వుండేది. న్యాయశాస్త్ర పరిజ్ఞానమును పురస్కరించుకొనే అవకాశములు ఒకప్పు డుండేవి. ఉద్యోగములు లభింపక

పోయినను, వకీలు వృత్తిలో ప్రవేశించేందుకు అవకాశ ముండేది. నొసట నున్న గీత బాగుగా ఉన్నయెడల, వృత్తిలో పచ్చదనము నొకడు విలోకింపజాలును. లేనియెడల కుంటిబ్రతుకు గడిపే దౌర్భాగ్యము వానికి ఘటిల్లును. రేఖ గల వకీలు రాజు కాజాలును. లేనివాడు ఫకీరగును. డాక్టరు ఈరీతి అస్థిర జీవితమును గడప నక్కర లేదు. అదృష్ట ముంటే రెండుచేతులను డబ్బుతో నింపుకోవచ్చు. కాలుమీద కాలు వేసికొని, యింటిపద్ద కూర్చున్నను నిరాఘాటంగా కథ సాగిపోతుంది. పదేళ్లకు ముందు ఈ ప్రాంతంలో డిగ్రీలుగల డాక్టర్లు ఇద్దరు మాత్ర ముండిరి. కొందరు బర్ద్వాన్‌లో, కొందరు బాంకురాలో, కొందరు కలకత్తాలోని కాంబెల్ మెడికల్ స్కూలులో చదువు సాగించి వస్తూ వుండేవారు. వీరందరు వినయుని మెడికల్ స్టోర్సుతో సంబంధ ముండినవారే. కొన్నికొన్ని విషయాల్లో అపుడపుడు అతనితో పేచీపడుతూ వుండేవారు. వానివద్ద పాత సరుకు వుండేది. వాటి ధరలు కోఆపరేటివ్ స్టోర్సులోకంటె ఎక్కువ. క్లినిక్ నడిపేందుకు వలసిన వ్యవస్థ కంతగా అది తోడుపడేది కాదు. ఒకటి రెండు పెద్ద తెవుళ్లతో పోరేందుకు అది ఉపకరిస్తూ వుండేది. ప్రద్యోతడాక్టరును సంతోషపెట్టే అవకాశ ముండేది. ముఖ్యంగా ఒకటిరెండు సర్జరీ కేసులు అతని చేతుల కందేవి.

అనుయాయులతోపాటు వెళ్లి ప్రద్యోతడాక్టరు బిపినును చూచివచ్చాడు. "మీరేమి చెప్పినా చెప్పండి. ఈరీతిగా బ్రతకడం నా కిష్టం లేదు. నేను బ్రతికి తీరుతానని జీవనమహాశయుడు చెప్పిపోయినాడు'' అని వారితో బిపిన్ చెప్పినాడు.

"లేదు. లేదు. ఆయన అలా అనలేదు. ఆయన చెప్పినదానిని గురించి నీవు అంతగా తర్జన భర్జన చెయ్యవద్దు'' అని రతనబాబు తెలిపెను.

"నే నలా చెయ్యడం లేదు. నే నేమీ చెప్పలేకపోతున్నాను. అని ఫీ స్వీకరించకుండా ఆయన వెళ్లిపోయినారు. ఇందులో ఆయన సదుద్దేశం లేదా? మీరే చెప్పండి'' అని బిపిన్ అన్నాడు.

"సూచనగా ఆయన అలాగే చెప్పినారు'' అని బిపిన్ కొడుకు పలికినాడు.

"ఇప్పుడు మీ మీ వూహాలేవో చెప్పండి. ఎన్నాళ్లు నేను మంచంపై పడి వుండాలి? ఇన్‌వేలిడ్‌నై కొంచెం కొంచెం తిరగవచ్చా? ఎన్నెన్ని పనులో మూలపడి వున్నాయి. నాకై వుబలాటంతో వచ్చినవారి మొగమునైనా చూడలేకపోతున్నాను. ఎన్నాళ్లు వాళ్లను త్రిప్పికొట్టను? ఫ్రాన్క్‌గా చెప్పండి. నేను వినదలచుకొన్నాను" అని బిపిన్ తెలిపినాడు.

"మీ హృదయము చంచల మవుతూ ఉన్నది. ఈ వ్యాధి ఎట్టిదో మీకు తెలియనిది కాదు." అన్నాడు చారు డాక్టరు.

"ఎరిగియే యిలా మాట్లాడుతున్నాను. ఈ స్థితిలో నే నుండదలచుకోలేదు. తాను చెప్పదలచిన దేమో చెప్పివేసి జీవనమహాశయుడు వెళ్లిపోయినాడు. ఏమి చెప్పదలచినది ఇప్పుడు మీ వంతు. నే నెన్నాళ్లలో లేచి తిరుగగలనో చెప్పండి. మునుపటి సత్తువ రాకపోయినను, నేను బ్రతికి బట్టకట్టగలనా? చెప్పండి."

ప్రద్యోత డాక్టరు ఇట్లన్నాడు; "కలకత్తాలోని ప్రముఖ డాక్టరు ఛటర్జి మిమ్మల్ని చూచినాడు. ఆయన హితవును బట్టి, నిర్ణయము ననుసరించి మే మిపుడు మీకు వైద్యం చేస్తున్నాం. మీ రాతనిని రప్పించండి. జీవనమహాశయుని ఊహతో మే మేకీభవించము. క్రమక్రమముగ మీరు లేవ జాలుదురు. ఎన్నాళ్లు అని చెప్పా లంటే డాక్టరు ఛటర్జీతో మేము సంప్రదించి తీరాలి."

"మంచిది. అట్లే జరుగుగాక! ఛటర్జి డాక్టరు వచ్చి నన్ను చూచుగాక! హరేన్! నీవు పోయి ఆ డాక్టరును తీసికొనిరా. ఎంతకావాలో నే నిచ్చివేస్తాను. సిగ్గుతో, అసహ్య భావముతో నేను మండిపోతున్నాను. తుదిమాట వినాలని నిశ్చయించుకొన్నాను మరి. జీవనమహాశయుని పిలువ నక్కరలేదు. జీవన మరణములను గురించి నే నుచ్చరింపదలచుకోలేదు. పుట్టినవారెల్లరు ఎప్పుడో ఒకప్పుడు చచ్చి తీరాలి. ప్రస్తుత స్థితినుండి నేను గట్టెక్కగలనా అను ప్రశ్నకు ప్రత్యుత్తరము పడయవలెనని మక్కువ పడుతున్నాను."

తండ్రివైపు చూపుంచి అత డీ మాట లుచ్చరించినాడు.

అందరు మరలిరి. పరిచారకుడు టీ తెచ్చి ఎదుట పెట్టినాడు. హరిహర కంపౌండరు వచ్చి చారు డాక్టరు సమ్ముఖమున రెండవున్సుల బ్రాందిగల గ్లాసు నుంచినాడు. నూతనముగ నెలకొల్పబడియున్న సొసైటీకి అతడే అధ్యక్షుడుగా ఉంటాడు. సిగరెట్టు ముట్టించి, "మన కార్యక్రమం ఆరంభం కావాలి ప్రద్యోత బాబు. ఇది మంగళ ముహూర్తము. సిద్ధివినాయకుడు మనకు జయము కలిగించు గాక! దుర్గాదేవి బ్రోచుగాక!'' అని ఆతడన్నాడు.

మొదటినుండి ఆతడు పంచాంగము చూచి, సుముహూర్తమును నిర్ణయించినాడు. తిథి, వార, నక్షత్రముల పరిశీలన విషయమై ప్రద్యోతుకు నమ్మకము లేదు.

అయినను చారుబాబు వైఖరి నాతడు ప్రతిఘటింపలేదు. కాగితమూ, కలమూ దగ్గరకు లాగుకొన్నాడు ప్రద్యోత డాక్టరు.

"ఉత్సాహముతో పని ఆరంభం కావాలి. హార్మోనియం తీసికొని రావల సినదని మీ ఆవిడతో చెప్పు."

ఆమె ప్రతిభగల ఆడుది. "అధ్యక్షులవారి ఆజ్ఞ శిరోధార్యము." అని చెప్పి హార్మోనియంను ముందుకు లాగుకొన్నది.

అపుడొక అవాంతరము ఘటిల్లినది.

హఠాత్తుగా ఆసుపత్రి ద్వారం వద్ద నలుగురైదుగురు శబ్దము చేస్తూ లోపల ప్రవేశించినారు. ఒక ఆడుది గుండె కొట్టుకుంటూ బిగ్గరగా ఏడుస్తూ వున్నది. "ఏమర్రో నామాట వినండి నా మాట పాటించండి! అమ్మో! బాబో" అని ఆమె అరుస్తూ వుంది.

ప్రద్యోత డాక్టరు ఏకాగ్రచిత్తముతో లెక్కలు గమనిస్తున్నాడు. ఆ స్త్రీ ఆక్రందనమును విని కాగితాలను, కలమును ఒకప్రక్కవుంచి తాను లేచి నిలిచి నాడు. ఇంత రాత్రివేళ రొమ్ము బాదుకొంటూ ఆమె యేడుస్తూ వుంది. పరుగు పరుగున ఆసుపత్రికి వచ్చి పడింది. నిశ్చయముగ ఇది ఆక్సిడెంటు అయివుంటుంది. ఎమర్జెన్సీ వార్డ్ కేసు. కాని యిపుడు ఎమర్జెన్సీ వార్డులో రెండు పడకలు మాత్ర మున్నవి. ఒకప్పుడు ఒక్కటే ఉండేది. ప్రద్యోత డాక్టరు వచ్చి. విశేష ప్రయత్నం సలిపి కిశోరుబాబు ద్వారా మరికొంత పూనిక సాగించి మరొక పడకను ఏర్పరచి నాడు. హెల్త్ సెంటర్ అయినయెడల మొత్తము ఐదు పడకలు ఏర్పడి తీరును. మరికొన్ని నూతన వ్యవస్థలు జరుగును. ఎమర్జెన్సీ వార్డులోనికి మిక్కిలి అక్కరైనది రక్తము. బ్లడ్ బాంక్ కలకత్తాలో—నూట యేబదిమైళ్ల దూరములో ఉన్నది.

"నేను వస్తున్నాను, ఏమయిందో చూస్తాను." అని ప్రద్యోత డాక్టరు కదలి పోయినాడు.

చారుడాక్ట రిట్లన్నాడు. "కర్తవ్య పరాయణుడైన ఈ రీతి వ్యక్తిని మరా కనిని నేను చూడలేదు. నేను కూడ ఒకప్పుడు ఇక్కడ ఉన్నవాడనే. నా పని కూడ మిగుల రద్దీగా వుండేది. నేను కూడ నిర్దుష్టమైన కార్యనిర్వహణములో అచం చలుడనై ఉండేవాణ్ణి. ఆ రోజులు వేరు. అప్పుడు ఆసుపత్రిని పెద్ద తలకాయలు

నడుపుతూ వుండేవి. టి. బి. గ్రాంటు మాత్రం లభించేది. డిస్పెన్సరీలో పని చేశాను. పెద్ద కుటుంబంవారు సంస్థను నడుపుతూ ఉండేవారు. ఒకనాడు అర్జంటుగా రావలసినదని అధికారులు కబురు పంపినారు. వెళ్లక తప్పినది కాదు. చిన్న పిల్లవాడు గోలపెడుతున్నాడు. అధికారి కూతురుకు మగపిల్లవాడు కలిగినాడు. పన్నెండేళ్ల బాలికకు పిల్లవాడు పుట్టినాడు.''

''పన్నెండేళ్ల బాలికకు పిల్లవాడు కలిగెనా?''

మంజు విస్మయమునకు మేరలేకపోయెను.

"ఇందు ఆశ్చర్యపడవలసిన విషయ మేముంది? ఆ రోజుల్లో ఇది సర్వసామాన్యంగా జరుగుతూ వుండేది. పదకొండేళ్ల పిల్లకు కలిగిన పిల్లవానిని నేను చూశాను. మరి ఆమెకు పిల్లలు లేరు. వెయ్యి దేవుళ్లకు మ్రొక్కేది."

మంజు ఇట్లనెను. ''నాతల్లి తల్లి తల్లి—గ్రేట్ గ్రాండ్ మదర్—ఆమెకు పదమూడవ యేట బాలిక కలిగెను. ఆమె మా తల్లికి తల్లి. మా అవ్వ ఇంకను జీవించియున్నది.''

హఠాత్తుగా భయార్త శోకశబ్దమును విని ఎల్లరు ఉలికిపడిరి. ఏమయినది? ఆక్రందనము డాక్టరుగారి బసలోనుండి వినబడుతూ వుంది.

ఎవరో అరుస్తూ వున్నారు. ఎవరు? ఠాకూరు గళ మని బోధపడుతోంది.

మంజు లేచి ఆ దిక్కుగా పరుగెత్తెను. తోడ్తోడనే ప్రద్యోతుని మిత్రుడు కూడ పరుగెత్తెను.

''ఏమయింది? దొంగలు పడలేదుకదా?" అని చారుడాక్టరు పలికినాడు.

"తెలియదు." అన్నాడు హరేన్.

''ఏదో గంగాళం కాళ్లపై పడివుంటుంది. హరేన్ చూడు'' అని చారుబాబు పలికినాడు.

అందరు చకితులై ద్వారముదెస దృక్కులు సారించారు. చారుబాబు తుది బ్రాంది చుక్కను గొంతుకలో వేసికొని, 'ఓహో! మహాశయా! ఓ! బోసుసతి! ఏమయింది?'' అని అరచినాడు.

ఠాకూరు బొబ్బలు పెడుతూ వున్నాడు. ఏమయిందో తెలియడం లేదు. ప్రద్యోతుని స్నేహితుడు ఉస్సురుస్సు రనుచున్నాడు. డాక్టరు భార్య పకపక నవ్వుతూ వున్నది.

"హరేన్" అని చారుడాక్టరు అరచినాడు.

"చిత్తము"

"ఆ ఆడపిల్ల యెవరు? ఆ నవ్వులాట యేమి?"

"ఎందుండియో భూతము వచ్చింది" అని మంజు పకపక నవ్వుతూ వుంది.

అనేకులు ఆ ప్రదేశమున భయపడుతూ వుంటారు. సమీపమున ముస ల్మానుల శ్మశాన మున్నది. అందుండి ప్రేతవ్రాతము వెడలుతూ వుంటుందని అనేకుల నమ్మకము. ఆ నమ్మకము వలననో, ప్రేత సాక్షాత్కారము వలననో రోగులూ, రోగులను చూడవచ్చినవారూ బొబ్బలుపెడుతూ వుంటారు.

"డాక్టరుబాబూ! దయ్యము లంటే మీకు నమ్మక మున్నదా?" అని మంజు అడిగింది.

చారుడాక్టరు "నమ్మక మున్నది, లేదు—కాని వారిలో వారు తీవ్రంగా పోరాడుతున్నారు." అన్నాడు.

ఎవరో "నవగ్రామ కోఆపరేటివ్ మెడికల్ స్టోర్సు అండు క్లినికల్ లేబ రేటరీ అను సంస్థ ఏర్పడింది" అన్నారు.

చారుడాక్టరు ఉత్సాహంతో "గుడ్" అన్నాడు.

"ఐదువేల మూలధనంతో ఆరంభ మయింది వ్యవహారం. ఒక్కొక్క షేరు పది రూకలు కలది. చారుడాక్టరు నూరుషేరులు తీసుకొంటున్నారు. మంజూబోస్ నూరు షేర్లు తీసుకొంటోంది. నిర్మలసెన్ నూరు షేర్లు పిడికిట పడుతున్నాడు. హరేన్‌బాబు యాభై షేర్లు గ్రహిస్తున్నాడు." అని అతడన్నాడు.

"నేను ఏభై మాత్రం తీపికొంటాను."

"ఏల? నీకు విశేష లాభం వస్తుంది. నీ ప్రాక్టీసు విరివిగా ఉంటోంది."

హరేన్ ముఖము ఎర్రపడిపోయింది. "నలభై షేర్లు మాత్రమే తీసుకో గలను."

"కాదు. కాదు. మిగిలిన పదిషేర్లకు ప్రస్తుతం నేను పైకం చేబదులుగా ఇస్తాను."

"క్లినికల్ టెస్టు లేనిదే ఈకాలంలో మెడికల్ ప్రాక్టీసులో ముందంజ వేయరాదు. ఎల్లర ప్రయత్నం వలన మనం తలపెట్టిన ఈ కార్యం జరిగితీరాలి." అన్నాడు చారుడాక్టరు.

ప్రద్యోతుడు పరిచారకుని, ఫలహారము చేయు ఠాకూరును పిలిచి "రేపు మీరు మీమీ జీతాలు పుచ్చుకొని తొలగిపొండు" అన్నాడు.

"వారికి ఉద్వాసం చెప్పడం అన్యాయం కాదా?" అన్నది మంజు.

"వీరిని తరచుగా పిశాచములు పీడిస్తూ వుంటాయి. ఎందును భూతములు లేకున్నను, ఉన్నట్లుగా భావన చేసి దారుణమైన అల్లరి సృష్టిస్తూ వుంటారు. వీరి వలన ఎట్టి భీషణకాండ సృష్టి అయిందో చూచాము కదా? ఆసుపత్రిలోని వారందరూ హడలెత్తిపోతున్నారు. రోగులలో పెద్ద గగ్గోలు పుట్టింది. అందుచే రేపు తెల్లవారినంతనే వీరిద్దరూ యీ వాతావరణంనుంచి కదలిపోవాలి." అని ప్రద్యోత డాక్టరు స్పష్టంగా చెప్పివేసినాడు.

# ఇరువదియేడవ ప్రకరణము

జీవనమహాశయునకు నిద్ర పట్టలేదు. సమస్తరాత్రివేళ ఆతని మనసులో ఏదో భీషణమైన తుఫాను చెలరేగినట్లైనది. శశాంకుడు, శశాంకుని యిల్లాలు, వనవిహారి, వాని పెండ్లాము, అత్తరుకోడలు, బిపిన్, బిపిన్ భార్య, రతన్‌బాబు - ఎల్లరు ఆతని మంచముచుట్టు కూర్చున్నట్లు వానికి తోచినది. రతన్‌బాబు, బిపిన్, బిపిన్ పత్ని, ఆతనితో "చెప్పండి, మీరే చెప్పండి" అనసాగినారు. శశాంకుడు, వనవిహారి, వారి యిల్లాండ్రు, అత్తరుకోడలు "వద్దు", "వద్దు" అని సంజ్ఞ చేస్తున్నారు.

మహాశయుడు మాటిమాటికి తన హృదయమును విశ్లేషణ మొనరించుకొని పరిశీలించుకొన్నాడు. తండ్రి తెలిపిన మాటలను స్మరించుకొన్నాడు:

"నాయనా! నాడి పరిశీలించేందుకు ముందు మాధవ సంస్మరణ మొనరించి దివ్యానుభూతి నందవలెను. ఈశ్వరప్రసాదము వలన జన్మమృత్యువులును, జీవన మరణములును దివారాత్రులవలె, అంధకార ఆలోకముల లీల పరమానంద మయలీల వలె అగపడును. ఆ యనుభూతి వలన నాడీ తత్త్వము సుబోధక మగును, దానిని నిస్సంకోచముగ చెప్పుట సాధ్య మగును. జిజ్ఞాస సమన్వితమైన ప్రశ్న వేయబడని యెడల, ఈ విషయమును విప్పి చెప్పవలెనను నిబంధనము లేదు. కాని క్షేత్రమును బట్టి ఈ విషయమును నిర్ణయింపవలెను, పృచ్ఛ చేయ బడక పోయినను ఈ విషయమును నీవు స్పష్టముగ తెలుపవచ్చును, పరమార్థ మున మనసుంచు వృద్ధులతో దీనిని పలుక వచ్చును. చెప్పి తీరవలెను. విశ్వాసశక్తి వలనను, ముక్తికాంక్షవలనను, వైరాగ్యచింతను ఘనతర మొనరించ వలెనను ఉద్దేశమున కామ్యతీర్థ సంసేవనోద్దేశము వలనను, పూత జీవిత పంథ యందు ముందంజవేయ దలతువేని వివేకముతో సత్యనిర్వచన మొనరింపుము. ఏదేని నిగూఢ విషయము, గోపన దుశ్చింత అంతరంగమున నిలిచియున్న యెడల, దానిని వ్యక్త మొనరించి, నిశ్చింతుడవు కమ్ము. ఏదేని భోగవాసన లేక

మమతాసమన్విత వాంఛ మనసున అసంతృప్తియై, నిద్రయందలి స్వప్నమువలె నీ మనసున సంచలనమును పుట్టించుచో, దానిని పూర్ణ మొనరించుకొని సంతృప్తి నందుము.''

"వేరొండు క్షేత్రమున రోగుల ఆత్మీయులకు, స్వజనులకు విషయమును విప్పి చెప్పవలెను. అట్టి క్షేత్రమున రోగి వృద్ధుడు కాకపోయినను, పరమార్థమును కాంక్షించు వాడు కాకపోయినను వాని మ్రోల సత్యమును నిర్వచనము చేయ వలెను. కర్మ నిరతుడై, సంసార సమర్థుడై సంసారమందును, సమాజ మందును బహుళ కర్తవ్యము లందును సంశ్లిష్టుడై, వివిధ క్రియలందు జడితుడై, ఎవడు బహుజన పరిపోషణ మొనరించుచుండునో ఆతని సమక్షమున విషయమును వ్యక్తీకరించి తీరవలెను. వాని ఆత్మీయ స్వజనులతో చెప్పవలెను. కారణ మేమన పలువుర మృత్యువునందును బహు కర్మకలాపమందును స్వయంప్రకాశము ద్వారా తన ప్రభావమును ప్రసరింప జేయవలెను. ఈ సందర్భమందు తా నెంతవరకు తన కర్తవ్యమును నెరపజాలునో జీవన పూర్వాహ్ణమున ఆతడు గ్రహింపగలడు.''

జనకుని హితోపదేశమునకు జీవనమహాశయుడు వీసు లొగ్గెను. కాని ఆతడు తెలిపిన దివ్యానుభూతి వానికి కలుగలేదు. తన మనసులోని విషయము నాతడు రతను కెట్లు వివరింపజాలును? అది ఆతనికి సాధ్యము కాదు. మమతాసంభరిత సంసార మందు విశ్వాసమే ఆశ్రయము. అసహాయుడై యున్న మనుష్యునకు ఆశయే ఏకైక సుఖనిద్ర. జ్ఞాన చైతన్యము వలన ఎట్టి ప్రయోజనము లేదు.

రేపే ఆతడు హరేన్ యొద్దకు పోయి చెప్పదలచినాడు. అది సాధ్యము కాక పోవచ్చును. రతనబాబుతో తెలుప నగునేమో! జీవనమహాశయుని మతి చెడినది. ఇపు డాతని కేమియు బోధపడుట లేదు. ఆతడేమి తెలిపినను, దోష భూయిష్ఠ మగు చుండెను. నాడీ పరిజ్ఞానము నాతడు గోల్పోయినాడు. ఇక ఆ దిక్కుగా పోరాదని ఆత డూహించినాడు.

విశేషయోచని చేసి, చేసి, ప్రాతఃకాలమున ఆతడు మంచమునుండి లేచి నాడు.

బిపిన్ ఆరోగ్యము నందుగాక! మతితల్లి స్వస్థత చెంది తిరిగివచ్చుగాక! దాంతు బ్రతికియుండుగాక! తనపూర్వ యోచన, తన పరీక్ష, జ్ఞానము కేవలము భ్రాంతియై, మిథ్యయై పోవుగాక!

లేచి, ప్రాతఃకృత్యములను నెరపి ఆతడు వైద్యశాలలో ప్రవేశించి కూర్చుండెను. జీవికకు సంబంధించిన సమస్య ఆతనిదృష్టి సమక్షమున నిలిచి నది. అదెట్లైన పరిష్కారము కాదా?

జీవనమహాశయుడు విశేష ధనమును ఆర్జించినాడు. సుమారు లక్ష రూక లను సంపాదించినాడు. అంతయు వ్యయమై పోయినది. ముప్పై, నలుబై వేల రూకల ఖరీదుగల ఔషధములను ఇతరులకు ఇచ్చినాడు. కాని ఆతనికి ప్రతి ఫలము ఏమియును లభించలేదు. ఆడపిల్లల పెళ్లిళ్లకై అప్పు చేసినాడు. కాని ఆ అప్పులనుతీర్చ లేకపోయినాడు. అప్పిచ్చినవారి ఇళ్లలో ఫీజు తీసుకొనక వైద్యము చేయుచుండెడివాడు. అంతటిలో వడ్డీభారము తొలగునని ఆతడు ఆశ పడినాడు. కాని ఆశలు అడి యాసలైనవి. ఆస్తి అంతరించినది. ఆతని చేతి యందు ఏమియు మిగులలేదు. ఆర్థిక విషయములలో ఆత డెన్నడును అప్రయ త్నుడై యుండలేదు. ప్రజలందరు ఆతని తండ్రి నాటినుండి ఆతని ఇంట పచ్చ తోరణము వ్రేలాడెనని యెంచెడివారు. అతడు రెండు చేతులతోను ధనమును ఆర్జించినాడని యెంచెడివారు. ఆతడు నాడి ముట్టినంతనే ఆతడు బంగారమును ముట్టెనని యోచించెడివారు. రెండు చేతులతో సంపాదించి నాలుగు చేతులతో ఖర్చుచేసెడి వారని వారితలంపు. వారి ఊహలో కొంత సత్యము లేకపోలేదు. ఆతనికిని, ఆతని ఇల్లాలికిని నడుమ అభిప్రాయ భేదములు చెలరేగు చుండినవి.

ఆజన్మము ఆతడు అంధకారమున అల్లాడుచుండెడివాడు. ఆతడు చింతా తరంగిణులందు, గతకాలానుభూతిని నెమరువేయుచు ఓలలాడుచుండెను. హఠాత్తుగా అప్పుడు ధ్రుతకేతువువలె శశిఎదుట వ్రాలినాడు. ఈ ఆశ్వయుజ మాసమందే ఆతడు చిరిగిన తన ఓవర్ కోటును విడిచినాడు వాని చేతిలో హుక్కా గొట్ట మున్నది. వాని కన్నులు రెండును ఎఱ్ఱబడినవి. ఆతడు మద్యపానము చేసి యుండెను. కాని దుర్గంధము అంతగా గుప్పుమనుటలేదు. గంజాయి వాసన కూడా విశేషించి విజృంభించుటలేదు. బహుశః ఆతడు క్యానాబిసిండికా మెక్కియుండును. ఏ భూమికకును ఎడమియ్యక "రామహరి కొడుకు నేడు వీలునామా వ్రాసి రిజిస్ట్రే షనుచేయించుటకై వచ్చినాడు. మిమ్ము సాక్షిగా తీసికొనును. వానికడసారి భార్యకుకొంత జీవనోపాధిని నిర్ణయము చేయించుట నీ విధి" అని ఆతడు చెప్పి చతికిల పడినాడు.

శశితో ఏమి చెప్పవలెనో మహాశయునకు తోచలేదు. ఆకస్మికముగా బైసికల్ చప్పుడు వాని చెవినిబడినది. అతడు వెనుకకు తిరిగిచూచెను. ఈ రోజులలో బైసికల్ అతి సాధారణవస్తువైనది. సమీపమందలి పల్లెలోని కమతముదారుల పిల్లలుసహితము ఈ దినములలో బైసికలు కొన్నారు. వారి గంటలో ప్రత్యేక ఆకర్షణము కలదు. ఈ గ్రామములో బోసు అను నతడే తొలుత బైసికలు కొన్నాడు. కట్టెదుట రెండు సైకిళ్లు అగపడినవి ఒకదానినుండి ప్రద్యోత డాక్టరు దిగినాడు. వాని మిత్రు డొకడు రెండవదానినుండి దిగినాడు. ఇంత ప్రాతఃకాలమున వారెచ్చటికి పోయెదరు?

"అహీంద్ర సర్కారు గృహము ఎందున్నది?" అని, నమస్కరించిన పిదప ప్రద్యోత డాక్టరు జీవనమహాశయుని అడిగినాడు.

"సమీపమందలి సందులో అది ఉన్నది. మీరు అతనిని చూతురా?" అని మహాశయుడు అడిగినాడు.

ప్రద్యోతుడు చిరునవ్వు నవ్వి, "అతని అల్లుడు ఒకప్పుడు నా సహపాఠి. మే మిద్దరము కలసి ఐ. ఎస్. సి. చదువుకొన్నాము. అతని కొడుకు అస్వస్థుడై యున్నాడు." అని ప్రద్యోతుడు మిత్రునితో కలసి గల్లీలో ప్రవేశించినాడు.

జీవనమహాశయుడు తన మందుల గదినుండి హఠాత్తుగా దిగి ఆ సందులో ప్రవేశించినాడు.

శిశువు వయస్సు నాలుగేళ్లు, జ్వరపీడితుడై పడియున్నాడు. కాని మొగము యావత్తూ వాచిపోయింది. కందినది. సింధూరమువలె ఎర్రపడింది.

ప్రద్యోత డాక్టరు చూచినాడు. మిత్రుడుకూడ చూచినాడు. పిల్లవాని తలవద్ద కూర్చుని వున్నది తల్లి. అహి, ప్రియదర్శకుడైన ఒక యువకునితో కలసి సమీపమున నిలిచినాడు. మహాశయు డింటిలో ప్రవేశించినాడు. మౌనముతో వెనుక నిలబడినాడు. దారుణమైన యాతనతో రోగి బాధపడుతున్నాడు. వాని అనుభవ శక్తి క్షీణించిపోతూ వున్నది. చేతనము విలుప్తమవుతూ వుంది.

తీక్ష్ణ దృష్టితో రోగిని పరిశీలిస్తున్నాడు మహాశయుడు. రోగిని చూచి ప్రద్యోతుడు లేచి నిలిచినాడు. అతని ముఖము గంభీరమై, చింతాన్వితమై ఉన్నది. అతని కన్నులు మహాశయునిపై పడినవి.

"మీరా?"

"నే నొక పర్యాయం చూస్తాను" అని మహాశయుడు రోగి శయ్యమీద కూర్చుండెను.

రోగి తలిదండ్రులు అబ్బురపడిరి. చాలకాలమునుండి ఆత డుపేక్షింప బడెను.

"తెవులు ఏరీతిగా ముదిరిందో చూడండి. నిన్న ఉదయమున అల్లుడు వచ్చినాడు. పిల్లవానిని ఒళ్లో కూర్చుండబెట్టుకొని యిలా అన్నాడు. 'మొగం మీద ఎందుకో బొప్పి కట్టింది. కొంచెము సున్నము రాయండి.' నొప్పిగావుందని సాయంకాలము రాగాలు పెట్టినాడు. బొప్పి పెరిగింది. మొగం బాగా వాచిపోయింది. రాత్రి బాధ యెక్కు వయింది. మంచముపై ఇటూ, అటూ కొట్టుకొన్నాడు. జ్వరంతో ఒళ్లు కాలిపోయింది. తెల్లవారునప్పటికి వ్యాధి బాగా ముదిరిపోయింది. పిల్లవాడు స్పృహలేక పడిఉన్నా. మీకోసం కబురు పంపాలని అనుకొన్నాను. ఇది కురుపు వలన వచ్చిన జ్వరం. కురుపును ఆపరేషన్ చెయ్యవలసి వస్తుందేమో! ఇంకా ఏమేమి చెయ్యాలో? జీవనమహాశయుడు వచ్చి ఏం చేస్తాడు?' అని అల్లుడన్నాడు. ఆస్పత్రిలోని డాక్టరుగారు అల్లునితో చదువుకొన్నవాడు. 'నాయనా! కుర్రవానిని వానికి చూపు. ఎంత ధనమైనా యిస్తాను- అని అల్లునితో చెప్పినాను" అని పిల్లవాని తండ్రి మహాశయునితో పలికినాడు.

పిల్లవానిని చూచి జీవనదత్తు లేచి నిలిచినాడు. వెంటనే ప్రద్యోతుడు లేచి వెలుపలకు పోయినాడు. మందు తెచ్చేందుకై సైకిలు ఎక్కి పోయినాడు. ఇంజెక్షను యిస్తాడు. పెన్సిలిన్ ఇంజెక్షను.

"మహాశయా! ఏం చూశారు? మా నాయన ఎలా వున్నాడు. ఏమయింది?" అని దగ్గుత్తికతో పిల్లవాని తల్లి అడిగింది.

"మొగం వాచింది. జ్వరం వచ్చింది భయ మేమి? పెద్దపెద్ద డాక్టర్లు ఉన్నారు కదా! ఈ రోజుల్లో మంచిమంచి ఇంజెక్షనులు బయలుదేరాయి. పిల్లవాడు బాగు పడతాడు." అని మహాశయుడు వచ్చినట్లుగానే వెళ్లిపోయినాడు. అహి సర్కారు వెనుకబడి 'మామా' అని పిలిచినాడు.

"ఏమి?"

"ఎలా వుంది?"

"నాడిచూచి ఎంతని చెప్పగలను? జ్వరం వృద్ధి అవుతుంది."

ఇక నిలువక చరచర నడచిపోయినాడు మహాశయుడు.

ఆతని యింటిముందు రెండు బళ్లు నిలిచి వున్నవి. ఒకటి పరాన్‌ఖాన్ బండి. రెండవది రామహరి బండి. వీలునామాలో సాక్ష్యం కోసం వచ్చినాడు రామహరి.

రామహరిని చూచి శశి పరుగు పరుగున అందుండి పోయినాడు.

* * *

పరాన్‌ఖాన్ స్త్రీ గర్భవతియైనది. పరాన్ పొంగిపోయాడు. మహాశయుడు కూడ ఆనందించినాడు. మనసు బాగుండుచో రసికత ఉత్పన్నమగును. "మసీదుకు పోయి అల్లాకు మ్రొక్కుకో. పదిమందికి విందుచెయ్యి. ఈపర్యాయం నీ సంతానం నిలుస్తుంది. నీ బీబీ రోగమూ, రొష్టూయెరుగక సుఖంగా వుంటుంది'' అన్నాడు.

కాని మహాశయుని స్వాంత మందు ఆందోళనము లేకపోలేదు. చైతన్య, అచైతన్య స్థితులం దూగాడుతూ వుంది. విహ్వలావస్థ యందున్నది. సర్కారు కొడుకు విషయం వలన ఆతడు విషణ్ణ హృదయుడైనాడు.

ఇచట ప్రవృత్తియొక్క అపరాధము లేదు. ప్రతిష్ఠ, సంపద, లాలన, లోభము వీని ఆకర్షణము వలన బ్రతుకుమీద తీపి పుట్టలేదు. నవీనజీవనమును వృద్ధిచేయుటకై, దానిని పూర్ణమొనరించుటకై ప్రకృతి ప్రేరణము వలన జీవించ వలెనను వాంఛ కలదు. కఠోరయుద్ధము జరుగుతూన్నది. శరీరమందు ప్రచండ సమరము వైశాఖ ఝంఝానిలమువలె నిష్ఠుర వ్యాధి విజృంభించింది. చిన్నదైన మేఘ శకలము భయదమైనకారు మబ్బైనది. ప్రచండధ్వని సుదూర వియత్తల మును కదలించునట్లు ఆతని అంతరంగము కదలిపోయినది. విషజర్జరత వంటి జర్జరత సర్వాంగములను వడకించినది. పెనుగాలితో జలదము చెలరేగునట్లు జ్వరముతో విషజర్జరత కూడా అధికము కాదా? బాలకుని స్థితి మహాశయుని మన సున్ను తలక్రిందు లొనరించినవి. ఔషధాలయమున ఆతడట్లే కూర్చుని యుండెను.

బండి ఒకటి వచ్చి ఆరోగ్యనికేతన సమీపమున నిలిచినది. బండిలో కూర్చున్న వా రెవరు? శశియా? మరొకరా? వినయుడా? అవును. నవగ్రామ మందలి బి. కే. స్టోర్సు యజమాని. తాను వత్తునని నిన్న నాతడు కబురు పంపినాడు.

మహాశయుని చూచి శశి మహోద్వేగముతో అట్టిట్టులాడిన గుండెతో వాని పాదములపై వ్రాలి "ఈ వేళ నేను కదలను. పాదధూళి తీసుకొని తీరుతాను. జయగురుదేవ,

అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితంయేన తస్మై శ్రీ గురుదేవ నమః.

కడసారి పెండ్లాముకు ఐదు యకరాల కొంత్ర తను వీలునామాలో వ్రాసేం దుకు రామహరి అంగీకరించాడు. శశి కాతడు పదునేను రూకలు పంపినాడు మహాశయు డాతనిని బ్రతికించినాడు. పూర్వజన్మమున ఆతడు వాని తండ్రి. అతని యాజ్ఞ నాతడెట్లు ఉల్లంఘింప జాలును? రామహరికుటుంబము మిగుల విచిత్ర మైనది. ఆతని వంశీయులు చెడుచేతలకు చేయిచేసికొనిరి. ఏ నీతికి అంజలి ఘటింపలేదు. అయినను బొత్తిగా బరి దాటిపోలేదు.

తదుపరి వినయకుమారుని విషయమేమి? మౌనముద్ర వహించి ఆతడు కూర్చున్నాడు. ఉల్లాస తరంగములం దోలలాడినాడు. జీవిత హిల్లోలమున నెగయువాడు. తన వాణిజ్యమున పచ్చబడిన బ్రదుకు కలవాడు. నవవర్ష జలధరము వలె వాని హృదయము శీతలమై ఉండును మధుర భాషణ మొనరించుట యం దతడు నేర్పరి.

వినయు డిట్లన్నాడు. "మహాశయా! నేను ఆడవలసిన మాటలు చాలా కలవు. ప్రపంచంలో మనుష్యులు రెండు తీరులవారు. కొందరు తూచి మాట్లాడు తారు. కొందరు వస మెసవిన వదరుబోతు లవుతూ వుంటారు. నేను రెండవ తెగలోని వాడను.

"వినయా! నీవు చెప్పవలసిన విషయము చాలా ఉన్నయెడల, రేపు రా. ఈ వేళ నా మనస్సేమీ బాగులేదు." అన్నాడు మహాశయుడు.

"ఏల?"

"కూర్చో. వస్తున్నాను."

మహాశయుడు వెలుపలికి పోయినాడు.

"అతసీ కొడుకు ఎలా ఉన్నాడు?"

"వాని ముఖము బాగా వాచిపోయింది."

ప్రద్యోతుని మిత్రుడు మహాశయునికి ఎదురై, "పిల్లవాని రక్తము తీసు కొన్నాను. పరీక్ష చేసి చూస్తాను. సమీప పట్టణంలో పరీక్ష జరగాలి. పెన్సిలిన్ ఇన్‌జెక్షన్ యిచ్చాము. స్ట్రెప్టోకకస్ ఇన్‌జెక్షన్ కూడ ఇవ్వబడింది" అన్నాడు.

"అలాగా?"

"మీరు అంటూవుండే సన్నిపాతజ్వరం వానిని పీడిస్తోంది. గొంతుకలో పుండ్లు పుట్టినవి."

"అయ్యో! నేను డిగ్రీపొందిన డాక్టరును కాను. కాని వైద్యం చేస్తున్నాను. రోగి రక్తములో విషము ప్రవేశించింది. వాపు హెచ్చింది."

అపుడు శశి ప్రత్యక్షమైనాడు.

యౌవనములో శశి మద్యపానమును బాగుగా అభ్యసించాడు. దేశములో ఒకప్పుడు మలేరియా విశేషంగా చెలరేగింది. శశి ఛారిటబుల్ డిస్పెన్సరీలో కంపౌండరుగా ఉండెను. ప్రయివేటు ప్రాక్టీసు కూడా సాగిస్తూ వుండేవాడు.

అతడు కూడ ఇప్పుడు అతసీ కుమారుని వైద్యం పట్ల శ్రద్ధ వహిస్తున్నాడు. తన దురభ్యాసముల వలన తల్లిహృదయమును మిక్కుటముగా వేదించినాడు. పథము లందు తూలిపడుతూ వుండేవాడు. దురభ్యాసము అంతరింప కున్నను, వైద్య వృత్తికి చేయి చేసుకొంటూ ప్రద్యోత జీవనమహాశయుల కేసులందు తల దూర్చుతూ వున్నాడు.

అతసీ కుమారునికథను మహాశయునికి తెలిపినాడు. తండ్రి దుఃఖముతో బాలుని వచ్చి చూడుడని దత్తును ప్రార్థించినాడు.

"నీవు పెద్ద డాక్టర్ల వద్దకు పొమ్ము. పిల్లవానిని బ్రతికించడం సాధ్యమయితే, వారికే సాధ్యం. ఈ పని నా వలన కాదు." అన్నాడు జీవనమహాశయుడు.

# ఇరువది యెనిమిదవ ప్రకరణము

ప్రద్యోతడాక్టరు వైద్యశాస్త్రమందు విశేష విశ్వాసము గలవాడు. చొరవతో వైద్యం సాగించే యువకుడు.

అపరాహ్ణము రెండు గంటల వేళైనది. మహాశయుడు భోజనము సాగించి, వీధి చావడిలోనికి పోయి ఒరగి కన్నులు మూసినాడు. అప్పుడు అహినీ సర్కారు (అతసీ మగడు) పరుగు పరుగున వచ్చి "మామయ్యగారూ! ఒక పర్యాయం రండి మామయ్యగారూ!'' అని గగ్గోలుతో అరచినాడు. తుఫాను రేగిందన్న మాట! ప్రద్యోతు 'దేమీ చెయ్యలేక పోయినాడు. క్రొత్తవి, ఖరీదైనమందులు, పని చెయ్యలేదా? నిట్టూర్పుతో ''ఏమయింది?" అన్నాడు మహాశయుడు. "ఏమీ తెలియడం లేదండి."

''జ్వరం బాగా హెచ్చి పోయింది. మొగం వాపు చెప్పనలవిగా కున్నది చూస్తే భయం వేస్తోంది. పిల్లవాడు స్పృహ తప్పి పడిపోయినాడు. మీ రొకసారి వచ్చి పొండి."

వాని మాటలు విని ముందుకు వచ్చి యింటి ఇల్లాలు ఇట్లన్నది : ''బాబూ! ఈయనవలన పనియేమి జరుగుతుంది? ఈయన పరీక్షల్లో పేసైనవారు కారు. ఈకాలపు వైద్యం తెలిసిన వారుకారు.''

"అమ్మీ! నువ్వు నోరు మూసుకోవడం మంచిది.'' అని, "నాయనా! వస్తున్నాను నడు" అన్నాడు మహాశయుడు సర్కారుతో. "నోరు ముయ్యమంటారా?'' అని రుసరుస లాడుతూ చూసింది, తీక్ష్ణ దృష్టితో మగని మొగమును, అమ్మవారు.

''అవును. ఇప్పుడు నీ మాటలను లెక్క చెయ్యరాదు'' అంటూ చర చర సాగిపోయినాడు మహాశయుడు.

స్తబ్ధోత్కంఠ వలన గృహము అర్ధరాత్రివలె గాఢ మైనది. తీవ్రవ్యాధి ప్రకోపమువలన శిశువు చైతన్యమును కోల్పోయెను. కన్నులు మూత పడినవి.

వడివడిగ సాగు శ్వాస ప్రశ్వాసముల వలన పగులునట్లు గుండెలు కొట్టుకొను చున్నవి. మధ్య మధ్య అస్ఫుట ఆక్రందన శబ్దము నిశ్వాసముతో వెడలుచున్నది. వాచినముఖము చూచి మహాశయుడు ఉలికిపడినాడు. యావత్తు శరీరము రక్తాక్తమై కంది పోయినది.

ఇంటివారి నోళ్ళనుండి మాటలు రాలేదు. ఉత్కంఠ వలనను భయము వలనను భాష స్తబ్ధమై పోయినది. ఆదుర్దాగా చూస్తున్నారు. గభీర నిశీథాకాశ మందలి తారల వలె మేల్కొని యుండిరి. గ్రహములును, ఉపగ్రహములును, అసహాయము లైనట్లు వా రూహించిరి. నవజాత గ్రహమొకటి ఏదేని విచిత్ర కారణములవలన అంతరించి పోతున్నట్లు వారు తలచిరి.

రోగిశయ్య పొంత జీవనమహాశయుడు నిలిచెను. మిగుల జాగురూకతతో వాని చేయెత్తినాడు. ''నాలుగైంది'' అన్నాడు అహీనుడు. మిమ్ము పిలిచేందుకు వచ్చేందుకు మున్ను చూచినాను. ప్రద్యోత డాక్టరు మిత్రుడు అరుణబాబు రక్తము గొనిపోయినపుడు మూడైనది. అంతకు కొంత తక్కువై యుండును. ఒంటిగంటన్నరవేళ స్పృహ తప్పినది. పిలిస్తే పలుకలేదు. జ్వరం హెచ్చింది. నూటమూడు పాయింటు రెండు. రెండు గంటలవేళ రమారమి నాలుగు - రెండు పాయింట్లు తక్కువ. తరువాత నాలుగుచూచి మీవద్దకు ఉరుకుకొని వచ్చాను."

రోగి చేతిని వీడి "ఎవరైనా డాక్టరుకు కబురు పంపినారా?''అని మహాశయుడడిగినాడు.

"కబురు తెలిపేందుకై అల్లుడు పరిగెత్తినాడు.''

"డాక్టరు వచ్చి మందిస్తాడు కదా!"

''ఈలోగా మీరుకూడా ఏదేని........''

''నాయానా - నా నాటు వైద్యం సాగేటప్పుడు, రోగి చేతులనుండి జారి పోతాడు. నెత్తురులో వ్యాధి ఉంది. ఇంజెక్షన్ రక్తములో పని చేస్తుంది. డాక్టరును రానిమ్ము.''

"బాబయ్యా! నా బిడ్డను........" అని గద్గద స్వరంతో, తల్లడిల్లుతూ తల్లి ఏమో అనబోయింది.

"అమ్మా! భయం లేదు. డాక్టరును రానిమ్ము. వచ్చి ఔషధం యిస్తాడు. ఇప్పుడు తుపాను రేగినట్లుంది. ఏ పాపము నెరుగని పిల్లవాడు. మందు లోపల

పడిన వెంటనే పట్టిస్తుంది." అని మహాశయుడు వెలుపలికి వచ్చి "అహీనా! జ్వరం మరింత హెచ్చి పోతోంది. నాలుగు దాటింది. ఇంకా పెచ్చిల్లుతుంది" అన్నాడు.

"హెచ్చుతుందా?"

"అవును. ఇదిగో డాక్టరుగారు వచ్చి పడ్డారు."

ప్రద్యోతుని వెంటబెట్టుకొని వచ్చినాడు అహీనుని అల్లుడు. "బాబూ! జ్వరం పెరుగుతోంది. చెయ్యి చూచి మామ అన్నారు."

ఏమీ చెప్పక డాక్టరు లోనికి పోయినాడు. మహాశయుడు నాడి చూడడం అతని కంతగా గిట్టక పోయినట్లు తోచింది.

మహాశయుడు ఖిన్నుడు కాలేదు. లోపలికి పోలేదు. నిలచియే యున్నాడు. రోగి శిశువు. జీవితంలో ఏదేని తప్పు చేసి అతడు మృత్యువును ఆహ్వానింపలేదు. ఇది అకాలమృత్యువు. ఈ రీతిగా చావులను జీవనదత్తు చాలా చూచినాడు. ప్రతి పక్షివలె అతడు ఆయా చోటులందు యుద్ధము చేసినాడు. ఇపుడు సలుపు సమరము వ్యాధితో కాదు. ఇది మృత్యువుతో జరుగు పోరాటము. అది రోగిని మిగుల సమీపించింది. శిరము పొంత, పాదములచెంత, వీపుపై విజృంభిస్తూన్నది. అంధ, బధిర, పింగళకేశి. అప్పుడెవరో తత్తరపాటుతో వెలుపలకు వచ్చిరి. ఎవ రాతడు? అహి—సర్కా—రుకొడుకు. ఒక సైకిలులాగి, దానిపై ఉరికి వెలుపలికి త్రొక్కు—కుని పోయినాడు. వెనుకనుండి వచ్చినాడు డాక్టరు. "నేను కూర్చుని ఉన్నానని చెప్పు. తక్షణమే రావాలని చెప్పు." డాక్టరుబాబూ! అని మహాశయుడు పిలిచినాడు.

"ఏమండి?"

"ఎల్లా వున్నాడు కుర్రాడు? పిల్లవాడంటే డాక్టరుబాబూ నా కెంతో ముద్దు."

"స్వయంగా మీరు చూచారు కదా!" అని ప్రత్యోతు డించుక నవ్వినాడు. "మీరు సరిగానే చూచారు. జ్వరం ముమ్మరమై పోయింది. నాలుగున్నరను సమీపించింది."

"ఇప్పుడు ఏమంటారు?"

ఇంచుక ఊరుకొని ప్రద్యోతు డిట్లన్నాడు. "చారు బాబుకు కబురు చేశాను అతనితో ఆలోచిస్తాను. నా గుండెకు కొంచెము ధక్కా— తగిలింది. స్ట్రెప్టోకకాస్ సాధారణంగా ఫేలు కాదు. అబ్బా! ఎంత జ్వరం! మాంసం భగభగ మంటోంది."

"అవును రోగినెత్తురు విషాక్తమై పోయింది. ఇక అవధి లేదు. చేసే దేమో ఇప్పుడే చెయ్యండి."

"అయితే యేమంటారు? సెలులాయ్‌టిస్? ఇరిసిప్లాస్? యిత్తుమా? బ్రతక దంటారా?"

"నాడి చూడడంలో చెడ్డపేరు సంపాదించాను. రోగము చావుతో ప్రయాణం ఆరంభిస్తుంది. ఇప్పుడు మోతాదు రెట్టింపు చేసి ఔషధం ఇవ్వండి. ఆవు రావురు మంటూ రోగం చెలరేగుతోంది."

"పెన్‌సిలిన్ యివ్వమంటారా? ఎనిమిది గంటల వ్యవధి దాటింది?" అని చింతిత ముఖముతో ప్రద్యోతడాక్టరు అందుండి పోయినాడు.

"వస్తున్నాను పెన్‌సిలిన్ తీసుకొని వస్తున్నాను. ఐదు లక్షలు అవసరము. నా వద్ద ఉన్నది రెండున్నర లక్షలు." అని ఆతడు చరచర పోయినాడు.

విస్మయ విముగ్ధ దృష్టితో మహాశయుడు ప్రద్యోతుని దెస చూస్తూ నిలిచి నాడు.

చారు బాబు వచ్చేందుకు ముందు ప్రద్యోతుడు ఐదు లక్షల పెన్సిలిన్ ఇచ్చి వెలుపలికి వచ్చినాడు. కడుపులోకి ఇచ్చేందుకై మందు తయారు చేయ సాగినాడు. స్తబ్ధుడై రోగిని చూస్తూ చతికిల పడినాడు.

చారు బాబు వచ్చినాడు. అప్పుడు జ్వరం నూటనాలుగు పాయింటు ఆరు.

"సెలు లాయ్‌టిస్ యివ్వాలా?"

కన్నులను విస్ఫారిత మొనరించి చూచినాడు చారుబాబు. రోగిస్థితి ఆతడు గ్రహించినాడు. "మీరు చూడలేదా?" అని మహాశయుని ప్రశ్నించినాడు. మహాశయుడు వెలుపలికి అంజ వేసినాడు."

"చూచారా. నేను ఐదులక్షల పెన్సిలిన్ యిచ్చాను." "అన్నాడు ప్రద్యోతుడు.

"చూచినారా? అది పనిచెయ్య వచ్చును. మహాశయు డేడీ?" జీవనమహాశయుడు శయ్య పొంత నిలిచినాడు. హఠాత్తుగ కూర్చుని నాడిని పరీక్షించినాడు. చాలాసేపు నా డిని పట్టి వున్నాడు. పెనుగాలి ఊర్ధ్వగతి శిథిలమైనట్లు గోచరించెను. ఈ పర్యాయము జ్వరము తగ్గు ముఖం పట్టును. మృత్యువు వెనుక దిక్కున

మెల్ల మెల్లగా సడలుతున్నది. మరల రాత్రి మూడు గంటలవేళ ముందంజ వేస్తుందేమో ?

మహాశయుడు వెలుపలకు వచ్చినాడు. చారుబాబు వెళ్లిపోయినాడు. ప్రద్యోతుడు బేగ్ సర్దుకొన్నాడు.

"డాక్టరుబాబూ! జ్వరం సడలుతోంది! ఈ పర్యాయం తగ్గిపోతుంది" అన్నాడు మహాశయుడు.

"తగ్గుతుందా?"

"తగ్గుతుంది. నాడి చూచి వచ్చాను."

"థర్మామీటర్‌తో పరిశీలించారా?"

"లేదు. అరగంట తాళి అలా పరిశీలింపవచ్చు. ఇపుడు థర్మామీటరును. పట్టి చూడడమే సాధ్యంకాని పని."

జ్వర మల్లే తగ్గింది. ఐదుగంటలవేళ మూడు పాయింటు ఆరులో వుంది వుష్ణము. రోగి కన్నులు తెరచినాడు. పెదవులు కదపి, హీనస్వరంతో ఏమో అన్నాడు.

రక్తాభ నవలోకిస్తూ జీవనమహాశయుడు నిలిచినాడు. పుంజీభూత మేఘముల వలె వ్యాధి విషజర్జరత ఘనీభవించింది. జ్వరప్రకోపము స్థిమిత మైనది. కాని మృత్యు వింకను ఇంటిలో నిలిచియే వుంది. ఒక మూలనే ఉంది. శిశువును పరిశీలిస్తూ ఆతడు "భయం లేదు. చైతన్యం మరలింది. మాట్లాడుతున్నాడు. నవ్వుతున్నాడు. అపుడతడు చైతన్యము స్థిమితమైనయెడల ఆతడును స్థిమితమునందును. 'బ్రతికించండని' అరువడు. ఏడ్వడు. తుదిముహూర్తమున స్తబ్ధుడగును. స్థిరుడగును. నిస్తరంగా ప్రశాంతియందు సుస్థిరుడగును.

* * *

"మహాశయుడు ఉన్నారా?" ఎవరో బొంగురు గొంతుకతో వెలుపలనుండి అరచినారు.

జీవనుడు ఈవలకు వచ్చి "ఓ! రాణా పాఠకా?" అని పలుకరించినాడు.

అతడు టి.బి.తో బాధ పడుతున్నాడు - అని దత్తు జ్ఞాపకం చేసుకొన్నాడు.

"ఏమి నాయనా? ఇంత రాత్రివేళ వచ్చినావు?"

"బాబయ్యా! ఇక సహించలేను. ఎన్నెన్ని స్థలాలో తిరిగి తిరిగి వచ్చాను. పారువెలోని కవిరాజులను చూడుమని మీరు చెప్పినారు. వెళ్ళలేక పోయాను. వాళ్ళు డబ్బు పిండుతారని విన్నాను. చివరకు మిమల్నే ఆశ్రయించాను."

ఆరోగ్యనికేతనం లోపల దీపం వెలుగుతూంది. సేతాబు ఒంటరిగా కూర్చుని తానే యిరుపక్షాలుగా నిర్ణయించుకొని చతురంగం ఆడుతున్నాడు లోపలకు వచ్చి రాణా ఒక ఓటి కుర్చీ చూచి 'కూర్చుంటే విరుగదు కదా!' అని దానిని ఇటూ అటూ కదల్చి చూచినాడు. 'జాడ్యం సంక్రమించినా నేను రాణా పాఠకుణ్ణి—రెండున్నర మణుగుల భారీ మనిషిని' అని ఆతడు నవ్వుకొన్నాడు.

"బాబూ! అది శాల వృక్షపు విగ్గుతో తయారైంది."

నొసలును అరచేతితో చరచుకొని రాణా యిట్లన్నాడు. "మహాశయా నేను రాణా పాఠకుడను. నే నొక దైత్యుడనంటే నమ్మండి. తాటిచెట్టులా నిలబడ గలను. ఏనుగులా, ఖడ్గమృగంలా గంభీరంగా నడువగలను. పిడుగులాంటి వాణ్ణి. ఇలా అని గుండెమీద చేయివేసికొని, రాయి గ్రుద్ది చెప్ప గలను. ఇరవై క్రోశుల దూరము సులభంగా నడువగలను. కాని అయ్యా! అట్టి నేను క్రుంగిపోతున్నాను."

"బాబూ! వైద్యం చేయించుకో! మళ్ళీ తాడిచెట్టులా నిలబడ గలవు. నియమం పాలించు. భయ మేముంది?" అని ఆశ్వాసించినాడు మహాశయుడు.

"భయ మేముంది? ఒకప్పుడు ఎలుగుబంటితో కుస్తీ చేసినాను. ఆ మృగం ఒళ్ళంతా పీకిపీకి వదిలింది. నేను నెత్తురుముద్దనై పోయాను. అయినా జంకక గొంకక ఎట్లో దానిని నేలగూల్చి చిత్తుచేశాను. నా శక్తి సామర్థ్యము మతి తల్లికి తెలుసు ఇపు డామె తిరిగి వచ్చింది. మృత్యువు నోటమట్టి కొట్టింది. అయితే బాబయ్యా! నన్ను బ్రతికిస్తారా? బ్రతికించరా? మీరు బ్రతికిస్తారని వినయు డన్నాడు."

"కొంత చికిత్స చేశారు. రాణా బ్రాహ్మణుడు. మీ హస్తా స్పర్శవలన బ్రతికి బాగుంటాడు."

"నువ్వు కొంత వైద్యం నడిపినావు. ప్రద్యోత డాక్టరు నీకు సన్నిహితుడు. అతడు మంచి వైద్యుడు. ధీరుడైన చికిత్సకుడు" అన్నాడు మహాశయుడు.

"బాబయ్యా! మీరు చూడాలండి, రాణా ఠాకూరును మీరు బ్రతికించాలండి. అతణ్ణి పని కట్టుకొని తీసికొని వచ్చాను. మీరు రోజూ నా డిస్పెన్సరీలో కొంత

సేపుండాలండి. క్రొత్త క్రొత్త డాక్టర్లు వచ్చి నన్ను చంపివేయాలని చూస్తున్నారు. మీరు కాపాడాలి నన్ను'' అని వినయుడు ధీరుడై పలికినాడు.

ఏమీ పలుకక మహాశయు డాతని మొగము చూడ సాగినాడు.

"రేపు చెపుతాను. రాజా! నిన్ను కూడ రేపు చూస్తాను. అహిసర్కారు కేసు నా మనసును బాగుగా కలచి వేసింది.''

ప్రద్యోత డాక్టరు వానికి లక్ష పెన్సిలిన్ యిచ్చినాడు. నే నెప్పుడూ మృత్యు ఘోషణ. చేస్తానని మీరంతా అనుకొంటారు. అలా ఘోషించడం నా ఆనందమని మీ వూహ. సేతాబు ఒక్కడూ కూర్చుని చతురంగం ఆడుతున్నాడు. ఇపుడు రాజు గుర్రాలను మూట కడుతున్నాడు. ఇక నేను కూడ లేస్తాను"అని ఆతడు పలికినాడు.

నిజముగ అహిసర్కారు తనయుని మార్కొన దలచిన మృత్యువుతో తీవ్రమైన యుద్ధమే పొసగినది. ఇట్టి యుద్ధ మాతనికి క్రొత్త కాదు. ఓటమి వాటిల్లి నను, అగౌరవము కాదు. కాని అహీరు కొడుకును గురించి ఆతడు చాల పరి తాపము పొందినాడు. అపుడు టంగుమని ఒకటి కొట్టింది.

సిరంజిని నింపి ప్రద్యోతడాక్టరు తయారుగా వుంచినాడు. అతడు లేచి నిలచినాడు. సరిగా పన్నెండున్నర గంటల కాతడు వచ్చినాడు. ఇంజెక్షన్ పూర్తి చేసి, సిరంజి కడిగివేసి, రోగి ముఖమెత్తి చూచినాడు. మహాశయు డపుడు వాని నాడిని చేబూనినాడు. కన్నులు మూసికొని కూర్చున్నాడు. ''ఇపుడు చేయగలిగిన దంతా చేశాను, రేపు ఉదయం మళ్ళీ చూస్తాను. రోగిని నిద్రపోనియ్యండి. అల్లరి చిల్లరి చెయ్యకండి'' అని పలికి ప్రద్యోతడాక్టరు అందుండి కదలి పోయినాడు.

"బాగున్నాడు'' అంటూ మహాశయుడు కూడా లేచినాడు.

ప్రద్యోతడాక్టరు పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్నవాడు. కాని ఆతని కాలము గడచిపోతున్నది. ఇపుడు క్రొత్త చప్పుళ్లు వినబడుచున్నవి. నూతనా విష్కారములు గోచరిస్తున్నాయి.

# ఇరువది తొమ్మిదవ ప్రకరణము

"ఇక వద్దు. ఈ వృత్తితో సంబంధం వద్దు" అని వనవిహారి మరణించిన పిదప ఆతడు నిశ్చయించుకొన్నాడు. పూర్ణాహుతిఅయి పోయింది అనుకొన్నాడు. ఎవరైనా పిలిస్తే "మహాశయుడు చచ్చినాడు అనుకోండి'' అనేవాడు. జగతిలో దుఃఖావధి ఎంతకలదో ఆత డింకా యెరుగడు. ఆతడు చికిత్సకుడు. మహాశయుల వంశములో శిక్షితుడైనాడు. ఆ శిక్షణ విధానమందే ఆతని చింతాస్రవంతి ప్రవహిస్తూ వుంది. మృత్యువు అనివార్యమని ఆత డెరుగును. శోకము, చిరస్థాయి కాదని కూడా వానికి తెలుసు. జీవన దిక్కులందు ఆరు రసములు విస్తరించి వున్నవి. ఆకాశమందును, వాయువులోను, ధరిత్రియొక్క అంగములందును ఆరు ఋతువుల ఖేలనము విజృంభిస్తూ వున్నది. పృథ్వీ మృత్తికలో ప్రతి కణమందు ఉత్తాపజలతృష్ణలు విద్యమానమగునట్లు జీవనమునందు కూడ శరీరమందలి ప్రతి స్థలమునందు రంగురసముల వాంఛ వ్యాపించి యున్నది, ఇవి లేనిదే జీవుడు మన జాలడు. మనుష్యుడు ఆనందపిపాసువు. శోక మేల తల యెత్తును? అది ఎందుండును? దృక్పథమును అనుసరించును. ఆతని జీవిత సంకల్పములు యావత్తు శిథిలములై పోయినవి.

వనవిహారి అస్తమించిన పిదప ఆతని యిల్లాలు ఏకైక పుత్రుని తోడ్కొని పుట్టింటికి పోయినది. కొలది దినములలో అత్తింటికి తిరిగి రావలెనని ఆమె ఉద్దేశించింది. ఆమె ఒక్కతెయె తలిదండ్రుల సంతానము. విశేషించి ఉత్తరాధికారిణి. వితంతువైన కొమరితను తలిదండ్రులు కడుపున పెట్టుకొన్నారు. వియ్యంకునకిట్లు వ్రాశారు. "మా అమ్మాయీ, మనుమడూ మా వద్దనేవుంటారు. మాకింక వేరు దిక్కులేరు. మీకు కూతుళ్లున్నారు. మనుమలున్నారు. మా కింక ఎవరున్నారు? మీకిష్టమున్నపుడు వచ్చి, వీళ్ళను చూచిపొండి. అక్కడ వుంటే పిల్లవాడు బెంగటిల్లిపోతాడు."

మీదుమిక్కిలి తన వియ్యపురాలు గయ్యాళిగంప అని ఆత డెరుగును. ఆమె ధాటిని తట్టుకొనడం ఫాలాక్షునికైన సాధ్యం కాదు,

"అర్థమును ప్రతిష్ఠను ఆర్జించడం ఎందుకు? ఎవరికోసము? మాధవ సంస్మరణమే ఆతనికి శరణ్యము.'' జీవనదత్తు యోచిస్తున్నాడు. జీవనమృత్యువుల గురించి చింతిస్తున్నాడు. ఆరోగ్యనికేతనమునకు దగ్గరలో ఉన్న ఇంటిలో ఆతడు ఒంటరిగా కాలక్షేపము చేయసాగినాడు. భార్య ఇంటిలో బొబ్బలు పెట్టుతూవుంది. ఏడుస్తూ వుంటుంది. కొద్దిమందివున్న తావులందు మసలుతూ వెక్కి-వెక్కి- ఏడుస్తూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు ఏమాట లేక వెర్రిదానివలె చూస్తూ వుంటుంది. "అమ్మా! అయ్యా! బ్రతికించండి''అని కొడుకుపేడ్చిన ఏడ్పు అమె చెవులందు గింగురు మంటూ వుంటుంది. చీకటినుండి వెడలి కొడుకు ప్రత్యక్ష మగునేమో అని ఆమె ఆశ పడుతూ వుంది. ఆతని వలన ఎన్నెన్నో విషయములు తెలుసుకోవాలని ఆమె అనుకొంటూ వున్నది.

ఐదేళ్లు గడచిపోయినవి. దత్తుమహాశయుడు అపుడు తన నాడిని తాను పరీక్షించుకొంటున్నాడు. మిత్రు లెవరైనా వచ్చినపుడు జీవనమరణములను గురించి వ్యాఖ్యానము చేస్తూవుంటాడు.

తరువాత తీర్థయాత్రకై ఆతడు పోయినాడు. మృత్యు సంధానము గోచరింపలేదు. ఇక మాధవచరణ ద్వంద్వమే శరణ్యమని ఆతడు నిశ్చయించుకొన్నాడు. గంగలో కొడుకుకు పిండమువేసి, బృందావనమునకు పోయినాడు. అందు కొడుకు ఆత్మ శాంతికై ప్రార్థన సలిపినాడు. మందిర ప్రాంగణములో ఒక ప్రస్తర ఖండశకలమును నెలకొల్పినాడు. పెక్కు- చలువరాతి శకలములు ఆతని కంట బడినవి. తొలుతటి దానిపై ఈ మాటలు ఆతని కగపడినవి.

'కాందీ నివాసియైన భూపేంద్ర సింహుని ఆత్మశాంతికై ప్రార్థిస్తున్నాను. హే గోవిందా! కటాక్షించుము. నీ చరణముల పొంతతావిమ్ము!'

తీర్థయాత్రలు ముగించి మహాశయుడు నవగ్రామ స్టేషనులో దిగినాడు. మొదట కిశోరు డాతనికి అగపడినాడు. అపు డాతడు ప్రదీప్త లలాటము గల యువకుడు. ఈ యైదేళ్ళలో ఆతడు దత్తుకు అగపడలేదు. ఐదేళ్ళకాలంలో అతడు ఇంటిలో బంధితుడై యున్నాడు.

ఇద్దరు ఒండొరులను చూచుకొని ఆశ్చర్య పడినారు.

"పెద్దవాడవైనావు".

"అయినా, మీగడతరకలను దిగమ్రింగి నేను బ్రతుకలేను."

"నే నెరుగుదును. ఇక కంసారిని గురించి ఆలోచింపుము."

ఆ మాటలు కిశోరుని కెంతో ఆనందం కలిగించినవి. "ఇన్నాళ్ళనుండి మిమ్మే స్మరించుకొంటున్నాము. ఇపుడు మీ దర్శన భాగ్యము నంది ఎంతో సంతో షిస్తున్నాను. బ్రతికిపోయాను." అన్నా డాతడు.

"నాయనా! నీకు మరణ భీతి యెందుకుండాలి?"

"మహాశయా! కలరా ఆరంభమయింది. నా భీతి నేను చస్తానని కాదు. చచ్చేవారి సంఖ్య చూచినపుడు భయపడుతున్నాను. డాక్టర్లు రెట్టింపు ఫీజు గుంజు తున్నారు. చారుబాబు ఫీ ఆరు రూపాయలునుంచి ఎనిమిది రూపాయల దాకా ఉంది. చక్రవర్తి ఫీ నాలుగు రూకలు. అంతో యింతో నేను హోమియోపతి వైద్యం చేస్తున్నాను. కాని ఈ వైద్యం అంతగా నే నెరగను. మీరు వచ్చారు. బ్రతికి పోయాను. నా చిన్నతనములో కలరా చెలరేగినపుడు మీరే పేదలకు ఉచితంగా వైద్యం చేశారు. ఇపుడు మీ తోడ్పాటు లేనియెడల వేరు ఉపాయం లేదు."

వెంటనే జీవనమహాశయుడు ఉత్తర మీయలేక పోయాడు. ఆకాశము దెస చూస్తూ నిలిచినాడు.

వెనుకటి కాలంలో 1905 వ సంవత్సరంలో మహామారి విజృంభణము ఆతని జ్ఞప్తికి వచ్చినది. అంధబధిర పింగళకేశిని రెండు చేతులు చాపి ఇందందు నడయాడ సాగింది. మహాకాళి డమరువుతో భయంకర శబ్దం చేసింది. ఆ శబ్దము ననుసరించి, ఉన్మత్త నృత్య మొనరిస్తూ తమ్ము తాము మరచి, మృత్యుభయభీతులై మానవులు, అగ్నితో దహింపబడు వనమునుండి వెడలు పశుపక్షులవలె, ఆర్త నాదము సలుపుచు పలుదెసల పరువు లెత్త సాగిరి. వెనుకనుండి పెనుమంట లెగసి వారిని చుట్టు ముట్టినవి. ఆకాశమందలి పక్షు లెందెందో యెగసినవి. ఆ విస్తరించిన అగ్నిజిహ్వలు వానిని తమ దెసకు లాగి కబళించినవి. మహామారి స్మృతి మిగుల భయంకరముగా నుండెను.

"ఇక మీరు ముందంజ వేయాలి" అన్నాడు కిశోరు.

"ఇంకను నాకా శక్తి ఉందా?"

"మీరు పెద్దవంశంలో పుట్టిన వారు. ప్రవీణులు. రావాలి."

తోడ్తోడనే తండ్రిమాటలూ, గురు రంగలాల్ మాటలూ జ్ఞాపకమునకు వచ్చినవి. "సరే. వస్తున్నాను. నడు." అన్నాడు మహాశయుడు.

అప్పుడు కలరా సమయంలో ఇన్‌ట్రావీనస్ సెలాయిన్ ఇంజెక్షనులు ప్రత్యక్ష మైనవి. కలకత్తానుండి మెడికల్ వాలంటీర్లు వచ్చి చేరుకొన్నారు. డిస్ట్రిక్టు జిల్లాబోర్డునుండి సేవకులు వచ్చారు. శానిటరీ ఇన్‌స్పెక్టర్లు వచ్చారు. యువక దళములు వచ్చినవి.

ఎండిన చెరువులందు నూతులు త్రవ్వబడినవి. శానిటరీ ఇన్‌స్పెక్టర్లు వాటిలో బ్లీచింగ్ పౌడర్ వేసి నీటిని పరిశోధన చేయసాగిరి. ప్రజలకు ఆంటి కలరా వాక్సిన్ ఇంజెక్షనులు ఇచ్చారు.

ఎంద రెందరో ఇల్లాండ్రు ఇంటింటా మసలి వాకిళ్ళను, పరిశుభ్రం చేయ సాగిరి. మహాశయుడువెళ్లి అవినాశబావుడీ భార్య మున్నగు వారికి సేవ చేసినాడు. తరుణవయస్కులైన ఇద్దరు డాక్టర్లు అతనికి తోడు పడిరి. వారి కన్నులందు స్వప్నములును,హృదయములందు ప్రత్యాశలును కాంతిల్లినవి. మహాశయుని యత్న ములు ఫలించినవి. అతని కన్నులు కౌతూహలానందములో తేజరిల్లినవి. కాని వ్యాధి తిరుగ బెట్టినది. మాట దక్కలేదు. అవినాశబావుడీ యిల్లాలు అస్తమించింది.

ఈ రోజుల్లో పెన్సిలిన్ క్రియ చూచి, ప్రద్యోతాదుల ఉత్సాహమును చూచి "మీరు ధన్యుల"న్నాడు మహాశయుడు.

అనాడు జీవనమున రెండవ పర్యాయం జీవనమహాశయుని చికిత్స అరంభ మయింది. కలరా విజృంభణము సమసిపోయిన తర్వాత మరల ఇంటిలో కూర్చుండవలెనని అత డెంచినాడు. కాని అట్లొనరించడం సాధ్యం కాలేదు. మరల అది విచిత్రంగా అరంభమైంది. కలరా పేటల్లో తిరిగి తిరిగి రోగులను చూచి, తిరిగి వచ్చి, కిశోరుని వీధి యరుగుపై చేరి, కాళ్ళు చేతులు కడుగుకొని, బ్లీచింగ్ పవుడర్‌తో కాలిజోళ్ళను పరిశుభ్రము చేసికొని కూర్చుండువాడు. అప్పుడు ముగ్గురు, నలుగురు వచ్చి "బాబయ్యా! కృష్ణ అజీర్ణంతో బాధపడు తున్నాం. ఒక పర్యాయం చెయ్యి చూచి మందిచ్చి కాపాడండి" అని మొర పెట్టు కొనసాగిరి.

మహాశయుడు ప్రక్కనున్న యువకులైన డాక్టర్లకు వారిని చూపెను. కాని ఆ కేసులను అతడే చేపట్టవలసి వచ్చెను. పిదప ఈశానపురమందలి పరాన్ ఆతనిని ఆకర్షించెను.

జగతిలో ఎన్నెన్నో విచిత్ర సంఘటనలు జరుగుతూ వుండును.

అది వైశాఖమాసము. అపరాహ్ణ సమయము. భయంకరముగ పెనుగాలి వీచుతూ వున్నది. ఈశానపురమును కలరా కబళిస్తున్నదని కబురు వచ్చింది. కిశోరు యువకులైన కొందరు వాలంటీర్లతో, మహాశయునితో అచటికి పోయినాడు. ఊరిలో ప్రవేశించునప్పటికి ఝంఝూనిలము భయంకరముగ చెలరేగింది. శిలావృష్టి కురియసాగింది. పొలిమేరలోని ఒక యింటిలో వారు తల దాచుకొన్నారు.

"బాబులారా! మమ్మ కాపాడండి" అని ఎవరో సమీపగృహంలో నుండి ఈరెలుంగుతో మొర పెట్టుకొన్నారు.

"ఇటువంటి వడగళ్లవాన ఎన్నడు కురియలేదు." అని కిశోరుడు తన వూహలను కవిత్వ ధోరణిలో వ్యక్తీకరించాడు.

తలుపు తెరచి అపుడెవరో ఈవలికి ఎట్లో దేకుకొని వచ్చినాడు. ఆ మనిషి ఎముకల ప్రోవువలె ఉన్నాడు. ఆ వ్యక్తి యువకుడు కాదు, ప్రౌఢ వయసులోని వాడు కాదు. వృద్ధుడును కాడు. గుర్తు పట్టడం సాధ్య మగుట లేదు.

కిశోరుతో అరుగుపై కూర్చునివున్న మహాశయుని చరణములపై పడి ఆ రోగి "బాబూ! నాకు కదిలే శక్తి లేదు. నన్ను గుర్తు పట్టలేక పోతున్నారు." అని వెక్కి-వెక్కి- ఏడ్చినాడు.

"అవును. గుర్తు పట్టలేక పోతున్నాను. నేను పరానును. మా కుటుంబం మీకు పరిచిత మయింది."

"ఇట్లై పోతివా?" అని చకితుడై మహాశయుడు, "ఏమి జబ్బు చేసింది?" అని ప్రశ్నించాడు.

"నెత్తురు కక్కుతున్నాను బాబయ్యా."

"బాబూ! ఇది టి. బి. అయివుంటుంది—అని క్రొత్త డాక్టర్లు అన్నారు."

మహాశయు డాతని నాడి పట్టి చూచినాడు. చికిత్స ఆరంభించినాడు.

పరాన్‌కు ప్రాణదానం చేశాడు.

రోగి నివేదించినది టి. బి. కాదు. మలేరియా, రక్త పిత్తం రెండూ కలసి వానిని బాధ పెట్టినవి. రోగి రక్తమును క్రక్కుటను, జ్వరమును చూచి తీవ్రమైన నేలపింగు థైఋసిస్ అను వ్యాధి అని పేర్కొన్నారు—చారుబాబు, చక్రధారులూను. ఇది సర్వ సాధారణముగా జరిగే రోగనిర్ణయ విధాన మైనది.

ఈ రోగి విషయమై మహాశయుడు ప్రత్యేక శ్రద్ధ వహించినాడు. తనంత తాను వచ్చి రోగిని చూస్తూ వుండెను. తన చేతితో తాను ఔషధం తయారుచేశాడు.

''బాబయ్యా! మీరు ధన్వంతరి'' అన్నాడు పరాన్.

వాని జీవనాకాశములో సౌభాగ్య సూర్యు డుదయించినాడు. ప్రజల విస్మయమునకు మేర లేకపోయినది.

ఆరోగ్యనికేతనము రోగుల సంఖ్యతో నిండిపోయింది. వారిలో సయ్యద్ సాహేబు అను వ్యక్తి ఒకడు.

''బాబూ! ఈ వ్యాధికి యజమాని భగవంతుడు. ఈ వ్యాధి విశేషించి మానసిక మైనది. నాపై వాడికోరల పులివలె దారుణ గృహ పరిస్థితి దుముకుతూ వుంది. గురువుకై ఆవేదన పడుతున్నాను." అన్నాడు సయ్యదు.

''అలాగా?"

''రామపురంలోని మియారా ఈ ప్రాంతంలో ముసల్మానుల మత గురువు. ఆస్తి కలవాడు. ఆయనపై దావా తెచ్చినారు కొడుకూ, అల్లుడూను. మామగారి కుడి శరీరభాగం పక్షపాతమునకు గురియైనది .గురూజీ కొరకై మానసికంగా బాధ పడుతున్నాను. ఇపుడు మీ తోడ్పాటు మిక్కిలి అవసర మయింది."

"మీయాసాహేబు ఐదేళ్లకు మునుపు మూడవపెళ్లి చేసుకొన్నాడు. చేతి కందిన కొడుకులు ఇద్దరు భార్యలవలన కలిగేరు. కూతుళ్లూ, మనుమలూ, మనుమరాండ్రూ వున్నారు. ఇద్దరు భార్య లుండగా హఠాత్తుగా ఒక తరుణిని పెండ్లి చేసుకొన్నాడు. ఆమె మంచి వంశమున పుట్టినది కాదు. మగని యిల్లు చేరగానే సొంత కుటుంబమును వేరు చేసింది. ఆమె కొక పుత్రుడు కలిగినాడు. ఇపుడు వ్యాజ్యం లోనికి దిగింది."

అని అతడు తన గోడును, గురువు గోడును మహాశయుని మ్రోల ఏకరువు పెట్టినాడు. ''బాబూ నా ఒళ్లు పాడై కూర్చుంది'' అన్నా డాతడు.

గోడు విని మహాశయుడు ఇంచుక నవ్వినాడు.

"మీరు కూడా నవ్వుతున్నారా?" అన్నాడు సాహేబు. వాని అంతరంగము ఆవేగముతో జ్వలించింది. అది వాని కన్నులనుండి వ్యక్త మైనది.

''బాబూ! మా విషయం చూడండి. తరువాత మా తలవ్రాత!" వాని నాడిని పరీక్షించినాడు మహాశయుడు. యథాప్రకారం మృత్యు సందేశము వానికి ధ్వనిపించింది.

నూటయెనుబది దినములు గడచిన పిదప వ్యాజ్యాలు వెల్లంకులూ తెమలు కొని, తనకడకు రమ్మని వానితో చెప్పినాడు. ఆ గడువు గడచువరకు వాని ఘటము నిలిచింది.

సరిగ ఐదుమాసములు గడచిన పిదప ఆతడు దివంగుతు డైనాడు. ఆతడు తలచిన సంఘటన 'తు. చ' తప్పకుండ జరిగినందుకు మహాశయుడు విస్మితు డైనాడు. అంకఫలమువలె అది జరిగినది. పింగళి కేశిని యైన మృత్యుకాంతను ధ్యానించి, ఆమె ముందంజ వేయు ముహూర్తము నాతడు రాయిగ్రుద్ది చెప్పగలడు. నాడీస్పందనమున లక్షణముల నడుమ, రోగి శారీరక గంధమున, పెక్కు గుణ ముల నడుమ, దేహ వర్ణమున వ్రేళ్ల కొనలందు మృత్యుస్పర్శ నాతడు అవలో కింపగలడు. అప్పు డాతనికి చిత్రానుభూతులు కలుగుచుండును.

ఒక్కొక్కప్పుడు మృత్యుమహిళ ముందంజ వేస్తూ వుంటుంది. ఒక్కొ క్కప్పుడు వెనుకంజ వేస్తూ వుంటుంది. మరల వికటాట్టహాసము సలుపుతూ ప్రక్కకు తొలగుతుంది. స్థూలదృష్టికి అగపడునట్లు మృత్యుఖేలనమును మహాశయు డవలోకిస్తూ వుంటాడు.

నేడు అతసీ కొడుకు పొంత కూర్చుని స్వతస్సిద్ధమైన ఆలోచనలో పడినాడు.

ప్రద్యోత డాక్టరు వీరుడు. సాహసోపేతుడైన యోధుడు. వీరునివలె ఆతడు పోరు సాగించినాడు. ఆతని చేతిలోని అస్త్రములు కూడ మిగుల వాడియైనవి. ఈ అస్త్రము లేవీ మహాశయు డెరుగడు.

పెద్ద నిట్టూర్పు వీడి, తనలో ఆతడు 'చాలు! చాలు! ఇంక ఈ వ్యవహారం కట్టిపెట్టి తీరాలి.' అని అనుకొన్నాడు.

# ముప్పదియవ ప్రకరణము

రాత్రి ఒంటి గంటన్నరవేళ ఇంజెక్షన్ ఇచ్చి ప్రద్యోత డాక్టరు ఇంటికి మరలినాడు. పిల్లవాడి నాడి చూచి మహాశయు డింటికి పోయినాడు. మంచముపై చింతామగ్ను డైనాడు. ఎన్నెన్ని విషయాలో వాని మనస్సులో దిర్దిర తిరిగినవి. వేకువజాముున మూడగువరకు వాని కన్నులు మూతపడలేదు. కాని సకాలమున మేల్కొనినాడు.

బాలుడు కొంచెము తేరుకొనినాడు. అతడు ప్రద్యోత డాక్టరును అభినందించినాడు.

భర్త లేచుటకు ఇంచుక మున్నే యిల్లాలు లేచినది. కాళీమందిర ద్వారమును పరిశుభ్రము చేస్తూ వుండగా మతి తల్లి ఆమెను కలసి కొనినది. తనగోడు తెలుపుకొనినది. ఇక బిపిన్ విషయము, సర్కారు కొడుకు విషయము, తన కొడుకు విషయమూ మనసున తగులగానే ఆమె మగనిపై విజృంభించింది. పడకనుండి లేచిన వెంటనే అగ్నివర్షము అతనిపై కురిసినది. "నాడి చూస్తూ మోటుగా మీరు మృత్యు వివరణ చేస్తూవుంటారు. పిల్లవాడు వనవిహారి కడగొట్టు ప్రాణంతో వున్నప్పుడు పాలు, గంగోదకము, తులసీ పత్రము ఇస్తే చాలు నన్నారు. గుటుక్కున వాని ప్రాణం పోయింది. అహిసర్కారు యింటినుండి జాబుతో నాలుగు రూకల ఫీజు వచ్చింది. మీరు ఫీ ముట్టుకోలేదు. మీ వైఖరిలో ఎన్నటికైనా మార్పు కలుగుతుందనే నమ్మకము నాకు కలగడం లేదు'' అని యథాప్రకారము ఆమె మహోపన్యాసము సాగించింది.

నోరు తెరువక ఆత డట్లే కూర్చుని వున్నాడు.

అప్పుడు రాణా ఠాకూరు పిలుపు వినవచ్చింది.

"ఈ అవస్థలో నీవు నడచి రావడం మంచిది కాదోయి. కాని, బాబూ! నీ రోగం విషయం ఏమి చెప్పను? ఆయుర్దాయం వుంటే బ్రతక గలవు. కాళీ స్మరణ చేస్తూవుండడమే నీ వంతు."

"స్వామీ! నా చేయి చూచి, యిప్పుడు మీ అభిప్రాయ మేమో సెలవియ్యండి."

"నువ్వు ప్రద్యోత డాక్టరును చూడడం మంచిది."

"నేను ఆ వ్యక్తిని చూడను. చారు బాబును కూడా చూచేందుకు నా మన సొప్పడం లేదు. 'ఎక్సురే తియ్యండి బాబూ' అని వారిని ప్రార్థించాను. మొగం వాచేటట్లు చీవాట్లు పెట్టి పంపించారు."

వాని మాటలు విని జీవనదత్తు విషణ్ణ హృదయు డైనాడు.

"ఒక ఆడుదాని సంపర్కము వలన రాక్షసునివంటి నా శరీరంలో విషం ప్రవేశించింది. ఆమె కలకత్తాలో వుంటుంది. గూండాలతో మసులుతూ వుంటుంది. పాపినై ఇప్పుడు కాళీమాత చెంత ఏమి మొరపెట్టు కొంటాను? నాకర్మ ఇలా కాలిపోయింది."

జీవనమహాశయుడు జాలి పడినాడు. వాని తండ్రి ఈ రీతిగ వానికి హిత వొసగువాడు. "నాయనా! ఏ రోగితోను కటువుగా ప్రసంగించకు. ప్రపంచం పాపపుణ్యాలతో నిండి వుంది. పుణ్యమే చెయ్యాలని మనుష్యు డనుకొంటాడు. కాని అన్నప్పుడూ అది సాధ్యం కాదు. సంవరణము విషయము ఆదేశ మిమ్ము. కాని రోగిని త్రిప్పివేయకు."

రంగలాల్ ఇట్లనేవాడు "జీవనూ! మానవుడు అసహాయుడు. ఎవరియెడల కోపించకు. ఎవరినీ చూచి రోతపడకు."

ఎన్నెన్నిరీతుల రోగులనో రంగలాల్ పరీక్షించినాడు. వారిలో భూపీ బోసు ఒకడు. అతడు త్రాగుబోతు. ఈ దురభ్యాసం మానుమని రంగలాల్ పెక్కు తూరులు వానిని హెచ్చరించాడు. కాని వాని దుర్గుణం 'నసేమిరా' అన్నది. తుదకు దాని కాతడు కబళమైనాడు. ప్రవృత్తి ప్రమోల మానవుడు నిస్సహాయుడు. నేడు తప్పు చేసి రేపు అనుశోచన మొనరించును. తన్ను తాను నిందించుకొనును. ఆకాశమందలి సూర్యుడు ఢుళ్ళిపడుగాక! సర్వత్ర అంధకారము అలముకొనుగాక! నా బ్రతుకు చీకటికోణమై పోగాక—అని అతడేమో పిచ్చి కూతలు కూయును. ఇల్లాలికి, తన వారికి కానివాడగును.' అని మహాశయు డనుకొన్నాడు.

"బాబయ్యా! ఎలాగైనా నన్ను కాపాడండి!"

అతసీ కుమారుడు క్రమక్రమంగా బాగుపడుతున్నాడు. జ్వరం తగ్గింది. వాపు కూడా క్షీణించింది. ప్రద్యోత డాక్టరు హస్త మహిమ ఫలించింది. ధాతుఘోసాలు

కూడా బాగుపడినాడు. బిపిన్‌బాబు పరిస్థితి కూడా చక్కబడింది. మతి తల్లి బర్ద్వానునుండి తిరిగి వచ్చింది. ముసలిదాని కాలి నొప్పి నిన్న కొంచెం అధిక మయింది.

ఈ విషయములు జీవనదత్తుకు అవగతము లైనవి. ప్రద్యోతుడు వానికి ఇంజెక్షన్ ఇచ్చినాడు.

జీవనమహాశయుడు ఇంటినుండి కదలినాడు. వినయుడు మార్గమందు వాని కెదురై "స్వామీ! నా చెయ్యి చూడండి" అన్నాడు.

అంతకు మున్నే మహాశయుడు రాణా నాడిని పరిశీలించాడు. అనర్థము వలె ఉన్నది. విషాక్తమై ఉన్నది. జీవనదత్తు ముఖము చిట్లించుకొన్నాడు.

"స్వామీ! నా కథ నే నెరుగుదును. చావే దృఢమైన యెడల, అదెప్పటికి దాపురిస్తుంది?"

"క్రొత్త మందొకటి ఆవిష్కరింపబడింది. అదిస్ట్రెప్టోమయిసిన్"

"అది పనిచేస్తుందా?"

"రేపు చెపుతాను. మా ఇంటికి రా. మట్టిమీద నీవు కాలు మోపకుము. ఒంటెద్దుబండి చేసుకొనిరా."

"మంచిది. స్వామీ నా దొక మనవి వున్నది. నే నా ఆడుదానిని చేరదీశాను. ఇద్దరమూ ఒకే వ్యాధి వలన బాధ పడుతున్నాం. నన్ను నమ్మి, నా పంచ చేరిన దాని నెట్లు విడిచి పెట్టగలను?"

"ఆమెను కూడా తీసుకొనిరా, చూస్తాను."

రాణా వెళ్ళి పోయినాడు.

"అందువల్లనే వీనిపై నాకు ప్రీతి మెండు." అని వినయునితో మహా శయు డన్నాడు.

అందుండి సమీపమందలి కాసారమునకు పోయినాడు. దాని తీరమున ఐదు తాటిచెట్లు గలవు. అవి చేతి నాడులవలె పెరిగినవి. వానిపై అతనికిని, అతని కంటె మహాశయునకును ప్రీతి మెండు. ఆపత్కాలము కొరకు వారు వాటిని రక్షణ మొనరించుచున్నారు.

# ముప్పది యొకటవ ప్రకరణము

"ఇక నేనీ లజ్జను సహింపలేను. మరణమునకు ముందే సిగ్గుతో చస్తున్నాను. మీకు కడుపు శోకము పుట్టించి వెళ్లిపోతున్నాను. శత్రుపుత్రుని కృత్యము చేసి పోతున్నాను."

ఇవి బిపిన్ ఉచ్చరించిన కడసారి మాటలు. తండ్రి రతన్ బాబుతో చెప్పిన మాట లివి. ఈ దేశములో ప్రాచీనకాలమునుండి ఒక విశ్వాసము ప్రచలితమౌతూ వున్నది. పూర్వజన్మలో అపజయము పొందిన శత్రు వొకడు పరజన్మమున పుత్రుడై పుట్టి పెద్దవాడై తలిదండ్రులకు ఎన్నెన్నో ఆశలు పుట్టించి, తరువాత వారి గుండెను నిష్ఠురముగ చరచి మరణిస్తాడు. వెనుకటి జన్మమందలి పగను వాడు ఈ రీతిగా తీర్చుకుంటూ వుంటాడు. ఆధునికమైన ఉన్నత విద్యను పొంది నను బిపిన్‌కు తొల్లింటి నమ్మక ముండెను. ఈ మాటలు కాక వేరుమాటలు అతడు ఉచ్చరింపలేక పోయినాడు.

ఇరువది దినములు గడచినవి.

మహాశయుడు వినయుని దుకాణములో కూర్చుని యుండెను. కిశోరు ప్రసంగిస్తున్నాడు. గడచిన రేయి పదునొకండున్నర గంటలప్పుడు బిపిన్ ప్రాణములు విడిచినాడు. పదినాళ్ళకు మున్ను 'బిపిన్ బాగున్నాడు' అని డాక్టర్లు పలికినారు. అప్పటికి ఆపత్తు గడచి పోయింది. తరువాత జ్వర ప్రకోపము హెచ్చు కాకుండిన యెడల గండం గడచిపోయేది. ఎనిమిది రోజుల క్రితము కలకత్తా నుండి ఛటర్జీ డాక్టరు వచ్చినాడు. అనుకూలంగా ఆతడు ప్రసంగించాడు. కాని, ఉత్సాహంతో అతడు తెలిపిన మాటలు కావవి.

"మూడు తరాలనుండి నాడీ పరీక్షలో సిద్ధహస్తులై వున్నారు, మహాశయుని కుటుంబములోని వారు" అని ఛటర్జీతో ఆతడన్నాడు.

"మూడు తరాల అభ్యాస మనడం దొడ్డదే."

"కాని యిది నాడీ పరీక్షే కదా! ఈ పరీక్షలో మొదట కొంతకాలము నాకు నమ్మకం ఉండేది. వయసు వచ్చిన వాణ్ణి. క్రమ క్రమంగా ఆ నమ్మకం సడలిపోయింది." అన్నాడు ఛటర్జీ. అతడు కలకత్తా తరలిపోయినాడు.

పోయేందుకు ముందు బిపిన్‌తో యిట్లు చెప్పినాడు. "ఈ కర్మజీవనమును మీరు వదలడం మంచిది. రాజసిక జీవనం వదలి సాత్త్విక జీవితం గడపినగాని ప్రాణములు నిలువవు. ఇలా అని హితపు చెప్పడం నా ధర్మం."

ఈ హితోక్తులు ఆలస్యముగ వాని చెవులకు పడినవి. కిశోరుడు కూడా నిష్క్రమించాడు. కడచిన నాటినుండి బిపిన్ ఆయాసము హెచ్చిపోయింది. తరువాత ఆతడు చైతన్యరహితుడై పడిపోయినాడు. తరువాత రాత్రి దివంగతుడైనాడు.

సమస్త గ్రామము—సమస్త గ్రామమే కాదు—ఈ ప్రాంత భూమి యావత్తూ కన్నీటితో తడిసిపోయింది. పేరు సంపాదించుకొన్నవాడు; కర్మవీరుడు. మ్లాన విషణ్ణముఖులై పలువురు శవము వెంట వెళ్లినారు. ఆ ప్రదేశపు ఆకాశమంతట ఛాయ నిండుకొనినది. జీవనమహాశయుడు నయితము ఉదాసదృష్టితో వెలుపలివైపునకు చూచినాడు. పృథ్వి మృత్యుబంధుర మైనది. అది బహువిధముల ప్రత్యక్ష మవుతుంది. ఒక్కొక్కప్పు డది అమృతమే అవుతుంది. దృక్పథమున వివిధ దృశ్యములు తాండవిస్తూ వుంటాయి.

వినయు డెపుడో వచ్చి మహాశయుని చెంత కూర్చున్నాడు. అప్పు డొక వృద్ధుడు వచ్చినాడు. అతడు చెప్పులు కుట్టువాడు. వాని పేరు కద్రు. అతడు వినయుని ప్రథమ రోగి. ఆనాడు రాణా అచటికి వచ్చేందుకు ముందే ఆతడు వచ్చినాడు. పథ్యం వానికి తలనొప్పి పుట్టిస్తుంది. పన్నెండు మాసములూ అత డేదో మందు పుచ్చుకొంటూ వుంటాడు. అది యింగ్లీషు మందు కావచ్చు. కవిరాజు లిచ్చే ఆయుర్వేదౌషధం కావచ్చు. హకీము లిచ్చే యూనానీ మందు కావచ్చు. మరేదైనా ఔషధం కావచ్చు. వంతువంతులుగా వాటిని మ్రింగుతూ వుంటాడు.

అతడు ఈ ప్రాంతంవాడు కాడు. విలాసపుర ప్రాంతం నుండి వచ్చినవాడు. చాలా కాలమునకు మున్ను కొడుకుతో ఒక గుంపుతో వచ్చి చేరుకొన్నాడు.

ఆ రోజుల్లో మహాశయు డాతనిని ఒక గడ్డురోగమునుండి రక్షించినాడు. ఆనాటి ప్రాతఃకాలమున వీధిలో మహాశయుని హఠాత్తుగా చూచి, చెయ్యి చాపి నాడిని చూడండని తెలిపి, "బాబయ్యా! మీ జోళ్లు తుడుస్తానండి" అన్నాడు.

చెప్పులు వానిచేతిలో పెట్టక తప్పింది కాదు. అందుకై మహాశయుడు నిలువక తప్పింది కాదు. ఆ నిలిచిన తావెట్టిదైనను సరే.

మహాశయుడు తప్పనిసరిగ వానిచే పని చేయించుకొని పైకం యిస్తూ వుంటాడు.

వనవిహారి మరణించిన పిదప ఇంటినుండి కదలక మహాశయుడు ప్రపంచముతో జోక్యము కలిగించుకోక పడివున్నప్పుడు అతడు నెచ్చెలి యింటికి పోయి, ఆతని జోళ్లను పాలిష్ చేస్తూ వుండేవాడు. ఒక్కొక్కప్పుడు పైకము పుచ్చుకునేవాడు. ఇప్పుడు సంవత్సరము నుండి వయసు ముదిరిపోవడం వల్ల అతగాడు ఇంటి నుండి కదలలేక పోతున్నాడు. సబ్ రెజిస్ట్రారు ఆఫీసుకెదుట రావిచెట్టువరకు ప్రాకి, ఆ చెట్టు మొదలు పనిసామగ్రి పెట్టుకొని కూర్చుని వుంటున్నాడు. వినయుని దుకాణము సబ్ రెజిస్ట్రారు ఆఫీసుకు దగ్గరలో వుంది. తప్పక ఆచట హాజరవుతూ వుంటాడు. అంగడి వద్ద మహాశయుని జోళ్లు బాగుచేసినాడు. పెద్దతనం వల్ల అతడిపుడు మరింత క్రుంగిపోయినాడు.

కద్రు మృత్యుకాలమును నిర్ణయ మొనరించడం కఠినం. అతడు జాగ్రత్తగ బ్రతుకు గడుపుతూ వుంటాడు. వాని రోగము క్రమక్రమముగ గ్రహణిలోనికి మారింది.

"త్వరగా నా తెగులు కుదర్చండి. సూదిమందు వలన ఇది సాధ్య మవుతుందని నా వూహ."

నవ్వి "ఇంజెక్షనా?" అన్నాడు మహాశయుడు.

కద్రు కొడుకులు పెద్దవాళ్లై తండ్రిని వదలి ఎవరి బ్రతుకులు వారు చూచుకొంటున్నారు. వాని భార్య మరణించింది. ఒంటరిగా ఉన్నాడు. అందుచే ముసలివాడు పొట్ట చేతబుచ్చుకొని కష్టపడి తీరాలి.

"నువ్వు ఆస్పత్రిలో చేరడం మంచిది. నీ దొరగారిని పట్టుకుంటే అందులో ప్రవేశం దొరుకుతుంది."

కద్రుదొర కిశోరుడు. అందరూ కిశోరుని, కద్రుదొర అని అంటూ వుంటారు. ఎవరికీ కారణం తెలియదు. కిశోరుపై కద్రుకు భక్తి శ్రద్ధ లెక్కువ.

కిశోరుడు పుట్ బాల్ ఆటలో కాప్టెన్. ఒక పర్యాయం అతనికి పుట్ బాల్ కుట్టి యిచ్చాడు. అందరూ కాప్టెన్ అంటూవుంటే కద్రు అతణ్ణి దొర అనడం మొదలు పెట్టేడు. నిక్కరు మానివేసి కిశోరుడు ఖద్దరు కట్టడం ఆరంభించాడు.

తన్ను దొర అని పిలవడం మానివెయ్యమని కిశోరుడు కద్రును హెచ్చరించాడు. కాని అతడు తన అలవాటును మానుకొనలేక పోయినాడు.

"ఆస్పత్రుల్లో పెద్దపెద్ద ఉద్యోగులూ, దొరసానులూ వుంటూ వుంటారు. నేను తక్కువవాణ్ణి. వెట్టివాణ్ణి. వాళ్ల సేవ పొందడం నాకిష్టం లేదు. అంతేగాక రాత్రింబవళ్లు మంచముపై పడివుండాలి.'' అని చెప్పి కద్రు ఆస్పత్రిలో ప్రవేశం చేందుకు ఇష్టపడలేదు.

"ఆసుపత్రి అందరికోసం ఏర్పడింది. అక్కడ 'ఎక్కువ, తక్కువ' అనే భేదాలు లేవు, రోగు లందరూ ఆస్పత్రిలోని దేవతలు, అందుచే నువ్వు సిగ్గుపడ నక్కర లేదు."

''వద్దు బాబయ్యా''

''ఎందుచేత? అక్కడ బాగుపడి తీరుతావు. వాళ్ల నియమాలు పాటించి తీరుతావు. అచట పరుండి వుండడం నియమం."

''చెట్టుక్రింద కూర్చుని పడుకునే వాణ్ణి. నిద్ర వస్తే అక్కడే పడుకొని వుంటాను. మంచంమీదెక్కి ఎలా పడి వుండనండి?''

''ఆసుపత్రిలోనే పడుకొని వుండవచ్చు.''

"బాబయ్యా! నేను మందుల ఖరీదు యిచ్చుకొంటానుటండి.''

''నేను ఖరీదుమాట చెప్పడం లేదు. కద్రూ! నువ్వు అక్కడకు పోతే బాగుపడతా వంటున్నాను.''

"వద్దు బాబయ్యా! ఆసుపత్రిలో ప్రవేశించేవాళ్లు మరి బ్రతికి రారు.''

''ఎందుచేత?"

"అది గోరీలదొడ్డి దగ్గర వుంది. అందుండి దెయ్యాలు పోయి ఆస్పత్రిపై వ్రాలుతూ వుంటాయి.''

అప్పుడు జీవనమహాశయుని కొక విషయం జ్ఞాపకమునకు వచ్చింది. ఒక నాటిరాత్రి భూత మొకటి ప్రద్యోత డాక్టరు వంటింటి కిటికీ దగ్గర నిలిచి "నాకు మాంసం కావాలి. నాకు మాంసం కావాలి" అని పీడించింది. డాక్టరు లెవ్వరూ మాంసం తినరు. మర్నాడు దాతు ఘోసాలు భయపడి ఆస్పత్రినుండి పారి పోయినాడు.

మహాశయుడు కనుబొమ్మలు ముడివేసినాడు. ఒక స్వానుభూతి వాని జ్ఞప్తికి వచ్చింది. అతడొక పర్యాయం ప్రత్యక్షంగా చూచినాడు. అది చేపలు తింటూ వుంది. అపుడు రాత్రి ఒంటిగంట వేళైంది. ఎవరో ఒక రోగిని చూచి ఆత డింటికి మళ్లుతూ వున్నాడు. దోవగుండా ఒంటెద్దు బండెక్కి పోతున్నాడు. అతడు నవగ్రామపు పొలిమేరలో ప్రవేశించాడు. అక్కడ తోట నానుకొనివున్న చెరువు ఒడ్డున ఒకచెట్టు క్రింద నిలబడివుంది దెయ్య మొకటి. తెల్లబట్ట కట్టుకొని నిలబడివుంది. నములుతూ, నములుతూ వెక్కిరించింది. వెన్నెలలో వికృతా కారంతో స్పష్టంగా అగపడింది.

బండివాడు భయంతో గడగడలాడి పోయినాడు. మహాశయునకు మాత్రం భయం వెయ్యలేదు. బండినుండి దిగి ఆతడు దెయ్యం దెస అడుగులు వేశాడు. ఎదుట నిలిచినది నిజంగా దెయ్యమే! చేపలు మెక్కుతోంది. ఆ దృశ్యం నేడు ఎదుట ప్రత్యక్ష మౌతున్నట్లుంది. దెయ్యాలపై మహాశయునకు గట్టి నమ్మకం కలిగింది.

ఆతడు వికృతంగా నవ్వుకొన్నాడు. ఈ ప్రపంచంలో అన్నీ వున్నాయి. భూతప్రేత బ్రహ్మరాక్షసు లున్నవి. లేవని ఎవ్వరు చెప్పగలరు? నిజమైన దృష్టితో చూడాలి.

కద్రువకు ఇంజెక్షను లిచ్చి అతడే చికిత్స ఆరంభించాడు. వినయుని అంగడిలో ఏ తిధినా డాతడు కద్రువను చూచి, మొదటి పర్యాయం ఔషధ మిచ్చి నాడో ఆనాడే వైద్యం ఆరంభించాడు.

"ఎలా వుంది కద్రూ?"

"బాబయ్యా! ఏమీ బాగా లేదండి. తలనొప్పిగా వుంది, జ్వరంతో ఒళ్లంతా వణికిపోతోంది."

మహాశయుడు వాని చేయి చూచి, "ఏం తిన్నావు?" అని అడిగినాడు.

"బాబూ! ఏమీ తినడం లేదు. కడుపునిండా బార్లి నీళ్లు తాగేనండి."

"భయపడకూడదు. తిని తీరాలి. తినకపోతే చచ్చిపోతావు."

"బాబూ! నేను చావుకు జడియను. వ్యాధి బాధకు భయపడుతున్నాను. ఆ భూతప్రేతముల పీడ" అని ఆతడు రాక్షసులను గురించి అప్రస్తుత ఘోషలో పడినాడు.

ఆత్మానుభూతి విశేషములను వివరించి మహాశయుడు ఆతని కథనమును మరింత భయానక మొనరించినాడు.

* * *

సేతాబు రాలేదు. వాని దగ్గరి చుట్ట మొకర్తుక వాని యింట మరణించింది. ఆమె పదునేడేండ్ల బాలిక. ఇద్దరు పిల్లల తల్లి. సూతికా వ్యాధి వలన ఆమె శరీరము అతసీ కుసుమవర్ణము నందినది. మహాశయుడు పోయి, నాడి చూచి 'మరణము ధృవ' మని చెప్పివేసినాడు. రాత్రి గడచువరకు శశి రోగిని చూస్తూనే వున్నాడు. వాని బండవైద్యము వలన రోగి మరింత బాధ పడి ప్రాణములు విడిచినది. హరేనును పిలిచినప్పటికీ అతడు రాలేదు. ఆమె బంధువులు వానిని తూర్పార బట్ట సాగినారు.

బిపిన్ గడచిన రాత్రి మరణించినాడు. నేడు సూర్యు డుదయించేందుకు ముందునుండి ఆ బాలవృద్ధ వనితాలోకము గుంపులుగా చేరి, మార్గమును నింపి వేశారు. శ్మశానము వరకు జనసమూహము సాగిపోయింది.

విపణివీధి నేడు కాంతివిహీనమై ఉన్నది. ఏవేవో గుడ్డిదీపాలు వెలుగుతూ వున్నవి. డాక్టర్లు నూతనముగా స్థాపించిన కోఆపరేటివ్ మెడికల్ స్టోర్సులో రెండు దీపాలు వెలుగుతూ వున్నవి. ఒకటి లోపల. రెండవది వెలుపల. ఇంకను కావలసిన ఔషధము లందు చేరుకొనలేదు. కొద్దిపాటి మందులతో వ్యాపారం సాగిపోతోంది. చారుబాబు వెలుపల కూర్చుని వున్నాడు. హరేన్ కూడ ఉన్నాడు. బిపిన్ విషయం ప్రసంగించుకొంటున్నారు. "ఇద్దరు పిల్లల తల్లి. ఇపుడు గర్భవతి. పన్నెండేండ్ల వయసులో మొదటి బిడ్డ పుట్టింది. పదమూడేళ్ల ఆరునెలల వయసులో రెండవ సంతానమునకు తల్లి యైనది. పదునేడేండ్ల వయసులో మూడవ శిశువును గర్భమున ధరించినది." అని జీవనమహాశయుడు బాలికను గురించి తలపోసినాడు. ఆరీతి కేసు లెన్నెన్నో ఆతని ఎదుట సాక్షాత్కరింపసాగినవి.

ఆసుపత్రి కాంపౌండులో ప్రద్యోత డాక్టరు వరండాలో దీపం వెలుగుతూ వుంది. నేడు ప్రద్యోతుడు ఏమియు మాట్లాడక కూర్చుని వున్నాడు. డాక్టరు వృత్తిని గురించి ఆత డాలోచిస్తూ వున్నాడు.

హఠాత్తుగా వాయుతరంగములు శూన్యమండలములో విజృంభించినవి. "ఆహా! మనుష్యుడు అసహాయుడు కదా! ఎంత అసహాయుడో! మృత్యువు? దాని నెవ్వ రెదిరింపగలరు? మృత్యుమహిమా! నీ మహిమ మాటల కందనిది కదా!" అని తలపోసి, ఆతడు ఉలికిపడినాడు.

# ముప్పదిరెండవ ప్రకరణము

శయ్యపై పరుండియున్నను మహాశయుని కంటికి కునుకు రాలేదు. రెండు శవములు వాని కన్ను లెదుట ఒకే సమయంలో శ్మశాన వాటికకు కొన్ని గడియలకు మున్నే పంపబడినవి.

ప్రొంత శయ్యపై ఇల్లాలు శయనించియున్నది.

కిటికీగుండా ఆకాశము అగపడుతూ వున్నది. శరత్కాల గాఢ నీల నక్షత్ర ఖచిత వియత్తల మండలి కొంతభాగము దృగ్గోచర మగుచున్నది. అపుడపుడు ఝిల్లీరవము వినబడుచున్నది.

"మృత్యు వనగా నేమి? అనివార్య పరిణతియా? దుర్జ్ఞేయ రహస్యమా? తొల్లింటి మృత్యు వృత్తాంతములు సమస్యాపరిష్కారమున కెట్టి సాంత్వనము ప్రసాదించుట లేదు. శూన్యలోకములు మిగుల విచిత్రములు'' అని మహాశయుడు ఇహలోక, పరలోక విశేషములను గురించి తలపోయసాగెను.

అప్పు డెవరో వీధిలో నుండి కేక వేసిరి. గవాక్షముగుండా దత్తు చూచి నాడు. ఇరువురు వ్యక్తు లందు నిలిచిరి. ఒకని చేతిలో లాంత రున్నది.

''ఎవరు వారు?''

"అయ్యా! మేము పరాన్ ఇంటినుండి వచ్చామండి."

''ఏమయింది? బీబీ కుశలమే కదా?''

''లేదండి. గొప్ప విపత్తు ఘటిల్లింది. బీబీ విషం త్రాగినట్లు తోస్తోం దండి.''

''ఏమీ విషం త్రాగిందా? ఎంత ఘోరము? ఎంత ఆశ్చర్యం! వచ్చే చావు లతో సరిపుచ్చుకోక మానవులు విషము త్రాగి, మెడకు ఉరి పెట్టుకొని, కట్టు గుడ్డలకు నిప్పంటించుకొని, నీటి గుండంలో దుమికి చావును దూ! దూ! అని అంటారా?''

రెండు చేతులందు వంచిన తల నిలుపుకొని పరాన్‌ఖాను వీధిలో చతికిల బడి వుండెను. వాని ముఖము భయము కలిగిస్తూ వున్నది. వాని యిల్లాలు ఏదో విష బీజమును మ్రింగింది. భర్తకన్ను లెఱ్ఱ బడినవి. ఏవేవో వెఱ్ఱికేకలు వేసినాడు.

"ఇప్పుడా పిచ్చి కూతల పని యేమి? మనిషిని బ్రతికించే వుపాయం చూడాలి" అన్నాడు మహాశయుడు.

"చావనియ్యండి."

ఆ ఉదంతమిది: నిన్న అపరాహ్ణము మొదలు బీబీ డోకుట ఆరంభించింది. వేవిళ్ళ డోకులని కొంద రనుకొన్నారు. కాని ఆమె వమనములనుండి వింత ద్రవ్యములను చూచినారు. "ఇవేమి? వీటిని తినేందుకు నీ కిచ్చిన వారెవరు?" అని ప్రశ్నించారు.

అప్పు డామెకు ఇంచుమించుగా అజ్ఞానస్థితి వాటిల్లినది.

పరాన్ గుండెలో వాడియైన శూలము గ్రుచ్చు కొన్నట్లైనది. వాని కిరువురు బీబీ లున్నారు. ఆ ఇరువురి కొట్లాట, కాట్లాట వాని కొంపలో నరక సృష్టి చేస్తూ వుంటవి.

చిన్న బీబీ సుందరి. తరుణి. ఆమె వూపిరి ఇంచు మించుగా కట్టుబడి పోయినది. ఆమె గుండె వేయి ముక్క లవుతూ వున్నట్లు అగపడింది.

"పరాన్! నీ చిట్టి బీబీని ఆస్పత్రికి తీసుకొని పోవడం మంచిది" అన్నాడు మహాశయుడు!

"వద్దండి"

"తలకాయ పాడు చేసుకోకు. నీ మంచి కొరకై చెపుతున్నాను. నేను వెనుకటి జీవనమహాశయుణ్ణి కాను. నేను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వున్నప్పుడు ఈరీతి వంకర కేసులను ఎన్నింటినో చూశాను. ఇప్పు డారోజులు పోయినాయి. ఇప్పుడు కూడా నువ్వు నా మాటలు పాటించి తీరాలి. నేను వైద్యుణ్ణి. నేను రోగిని బ్రతికించాలని అనుకొంటున్నాను. కన్ను లెదుట చావును చూచేందుకై రాలేదు."

అపుడు రాత్రి రెండు గంటలవేళ. బీబీని బండిలో చేర్చుకొని ఆస్పత్రికి పోయినారు.

"డాక్టరు బాబూ! డాక్టరు బాబూ!" అని మహాశయుడు తలుపు తట్టినాడు.

ప్రద్యోతుడు లేచి "ఎవరు?" అన్నాడు.

"నేను జీవనదత్తున్ని."

“మీరా? ఇంత రాత్రివేళ?”

“ఒక బాలిక విషం తాగింది. ఆమెను తీసుకొని వచ్చాను. ఆమె పరాన్ ఖాన్ బీబీ.”

“నే నిపుడే వస్తున్నాను. ఆ వైపున కంపౌండరూ, నర్సులూ వున్నారు. వారు మేలుకొని వున్నారు. వారిని పిలిచినారా?”

“పిలుస్తున్నాను.”

“ఒక్క నిమిషములో వస్తున్నాను.”

లోనికి పోయి హాఫ్‌షర్టు ఒక దానిని ధరించి అతడు వెలుపలకు వచ్చినాడు. ఏమీ ప్రశ్నింపలేదు. ఏమీ యోచనలు సలుపలేదు. ఆస్పత్రిలో ప్రవేశించి, ఎదుట కంపౌండరు హరిహరుని చూచి “అంతా తయారు చేసేందుకు ఎంత కాలం పడుతుంది” అని డాక్టరు ప్రశ్నించాడు.

“పదిహేను నిమిషాములైనా పడుతుంది. పొటాష్ పర్మాంగనేట్ లోషన్ కొంచెం త్రాగించేను.” అన్నాడు హరిహరుడు.

“బీబి బ్రతికితే పోలీసుల కప్పగించండి. లేకపోతే పంపేచోటుకు పంపండి. సలామ్” అని పరాన్‌ఖాన్ నిష్క్రమింపబోయినాడు.

ఇరువురు డాక్టర్లకు కాళ్లాడలేదు. నోళ్లాడలేదు. బీబీ హతభాగిని!

ఆమెను విడిచిపోవుటెట్లు?

మహాశయుడు చతికిల పడినాడు.

రాత్రి కడచిపోతోంది. శేష శర్వరీ వియత్తలము దెస ఆతడు దృక్కులు సారిస్తున్నాడు. ఆకాశములో నక్షత్రముల స్థానములందు పరివర్తనము ఘటిల్లినది. కాలపురుషుడు విశేషముగా కదలిపోయినాడు. సప్తర్షిమండలము, అనతిదూరమున అరుంధతీ నక్షత్రము క్రమక్రమముగ కాంతిని కోల్పోవుచున్నది. తన జీవితము కూడ అట్లే శోభారహితమై కడతేరునని జీవనదత్తు నిట్టూర్పు విడిచినాడు.

“నారాయణ! నారాయణ!” అని ఉచ్చరిస్తూ బీబీని ఆస్పత్రిలో పదిలముగా ఉంచి, మహాశయు డందుండి నిష్క్రమించాడు. రోగులు నిద్రపోతున్నారు. కొందరు బాధపడుతూ శయ్యలపై పొరలుతున్నారు. సమీపమందలి క్వార్టర్సు నిశ్శబ్దముగ ఉన్నవి. అంధకారము గాఢకాల ఛాయవలె అగపడుతున్నది. సమీప

మున ఉన్నది శ్మశాన వాటిక. అందు ఒక వటవృక్షము గలదు. అందలి పత్ర పల్లవముల నడుమ కరువలి గుసగుస సలుపుతున్నది. అపు డేదో శబ్దము మహా శయుని వీనులందు పడినది.

"ఎవ రక్కడ?"

ఆసుపత్రి వసారాలో ఒక నారీ స్వరూపము తెల్లని బట్ట బట్టుకొని నిలిచి వుంది.

"నే నొక నర్సును. మీ రక్కడ నిలిచివున్నా రేల ? వచ్చి కూర్చోండి."

"ఆ బీబీ ఎలా వుంది?"

"బాగులేదు." అని నర్సు లోనికి పోయింది.

"నారాయణా!" అనుకొన్నాడు మహాశయుడు. ప్రద్యోత హరిహరులు వెలుపలకు వచ్చి "మా వల్ల సాధ్యం కాలేదు" అన్నారు.

"మీరు పరాన్ సాహేబు యింటికి పోయి బీబీనాడిని చూచినారు కదా! నాడి వలన ఏమి కనిపెట్టినారు?" అని ప్రద్యోతుడు మహాశయుని ప్రశ్నించినాడు.

"డాక్టరు బాబూ! ఆమె నాడిని నేను చూడలేదండి."

"చూడనే లేదా?"

"లేదు. తమ చికిత్సకై ఏర్పాటు చేశాను. బీబీని మీరు చూచేరు వైద్యం చేసినారు. తమది ఆధునిక చికిత్స. నేను నాడి చూడనేలేదు."

# ముప్పది మూడవ ప్రకరణము

రెండు రోజులు గడచినవి. జీవనమహాశయుడు ఆరోగ్యనికేతనము ఔషధాల ఆగారములో కూర్చుని వున్నాడు. అచ్చట ఒక పుత్తరం పడివుంది. తెల్లకాగితము. నల్లబార్డరు గలది. అందు బిపిన్ శ్రాద్ధనిమంత్రణ లిపి కలదు. మహాశయుడు ఇంటిలోనుండి వచ్చేందుకు ముందుగనే రతన్‌బాబు మనిషి వచ్చి ఉత్తర మిచ్చి పోయినాడు.

పరాన్‌ఖాన్ బీబీ శవము పోస్టు మార్టెమ్ పరీక్షకై పంపబడింది. మగడు గాని మరెవ్వరు గాని పట్టించుకొనలేదు

గడచిననాటి సంధ్యా సమయంలో నవగ్రామములో ఒక సంతాప సభ జరిగింది. మహాశయుడు సభకు హాజరు కాలేదు. కిశోరుడు సమావేశ కర్తలలో ప్రథముడు. గ్రామగ్రామాంతర వ్యక్తులు సభలో హాజరైనారు. డాక్టర్లందరు వచ్చి చేరుకొన్నారు. ఇప్పటి ఆస్పత్రికి బిపిన్ ఐదువేల రూకలను విరాళముగా ఇచ్చి నాడు. రక్తాది పరీక్షలకై ఆస్పత్రికి అనుబంధముగా ఒక క్లినిక్ కట్టుటకు ఈ ధనము వినియోగపడును. తనకు ఉచితమైన పనినే ఆతడు చేసి పోయినాడు. రోగార్తుల మిత్రుడు చేయవలసిన సత్క్రియ నాతడు చేసినాడు.

నవగ్రామమందలి యువకు డొకడు క్రొత్తగ వకీలైనాడు. సభలో ఆత డుపన్యసించిన వారిలో మిగుల ఉత్సాహవంతుడు. "నిర్దుష్టమైన చికిత్స వ్యవస్థ లేక మనము అంధకారంలో అల్లాడుతూ వుంటిమి. బిపిన్ బాబు దానము వలన ఈ అంధకారము దూరీకృతమై పోయింది" అని క్రొత్త వకీలు వచః కౌశల ముట్టిపడ పలికినాడు.

ఆ మాటలందు అతిశయోక్తి లేదు. డాక్టర్లలో పలువురు నాడీ జ్ఞాన మెరుగరు. అయినను యువకుని మాటలు వారి మనసులకు కొంత చురుకుగ తగిలినవి.

యువకునకు ప్రద్యోత డాక్టరు సన్నిహిత మిత్రుడు.

జీవనదత్తు యథాప్రకారం వైద్యం చేస్తున్నాడు క్రమక్రమముగా రోగుల సంఖ్య అధికము కాదొడగినది.

బిచ్చకుని జోలిని వ్రేలాడ గట్టుకొని, చేతిలో కర్ర పుచ్చుకొని వచ్చింది ఘరి అనే వైష్ణవ భిక్షుకి.

''జయగోవింద! బాబయ్యా! దండాలండి'' అని అరిచింది ఆమె.

ఆమె శిరోజములు కురుచగ కత్తిరింపబడినవి. ఆమె నొసటిపై బొట్టు, కలదు. రమారమి అరవైయేళ్ళ ఆడుది. చాల దినములైన పిదప వచ్చింది. ఒకప్పుడు ప్రతి దినము వస్తూ వుండేది. ఆతని కొడుకూ, కూతురూ క్షయపీడితులైరి. వారి కొరకై మందులు తీసుకొని పోయేందుకై వస్తూ వుండేది అది చాల దినములనాటి మాట.

ఇపుడు మహాశయు డెదుట పడగానే, ఆతని పాదద్వయము నంటి ''బాబా ధన్వంతరీ! మీది అమృత హస్తము! నేను అభాగ్యురాలను. నేను పాపిని. నన్ను కాపాడండి'' అన్నది ముసలిది.

క్షయవలన ఆమె మగడూ, కొడుకూ, కూతురూ అస్తమించారు! వారి మరణములను కూర్చుని చూడవలసి వచ్చెను. ఆమె యేడువలేదు. ''ఎవరి కర్మననుసరించి వారు పోయారు. భగవంతుడా! నీ పాదాల చెంత నాకు తావియ్యి'' అని ఆమె దేవుని ప్రార్థించింది. ''నీ కింకా పిలుపు రాలేదా? ఆకస్మికముగ వచ్చావు.'' అన్నాడు మహాశయుడు.

''నా కింకా అట్టి భాగ్యం కలుగలేదు. పసిపాపనై వుండగా పన్నెండవ మాసంలో మా అయ్య అమ్మలు నన్ను క్రింద పెట్టినారు. తరువాత రెండుమూడు చావుగండాలు తప్పినవి. మనిషికి రావలసిన యావత్తురోగాలు అప్పుడు నన్ను పట్టుకొని పీడించినవి. ఇక నన్ను పీడించేందుకు మిగిలిన వ్యాధులు లేవు. ఇప్పుడు తాడిచెట్టులా నిలిచి వున్నాను. ఇప్పుడు నేను వచ్చింది మరొక దానికై. మీ స్నేహితుడు మిశ్రమహాశయుని కోడలు కొరకై. ''

''శశాంకుని భార్య కొరకై వచ్చినావా? అని అన్నా డాతడు. మహాశయుని శరీరము కంపించి పోయింది.

''నా కెన్నాళ్ళు బాకీ వున్నాయో అడిగి తెలుసుకొని రమ్మని చెప్పింది.''

''నారాయణ! నారాయణ! అయితే జరిగిం దేమిటి?''

''ఆరు నెలలనుండి మంచము పట్టినది. దగ్గుతో బాధపడుతోంది. రోగము కాలాజార్ అనిపిస్తోంది. కొందరు క్షయ అంటున్నారు. హరేన్, చారు, ప్రద్యోత డాక్టర్లు వచ్చి చూచినారు. పెన్సిలిన్ ఇంజెక్షన్లు అధికముగా జరిగినవి. కాని, ఏమీ

ఫలం అగపడలేదు. దగ్గు అధికమై పోయింది. దగ్గరి చుట్టాలు కష్టసమయంలో దూరస్థులైనారు. ఆస్తిపాస్తులు మూట గట్టుకొన్నారు. తలిదండ్రులు లేరు. భర్త లేడు. ఏ దిక్కూలేని స్థితిలో ఉన్నది. ఏడుస్తూ యేడుస్తూ మీ దగ్గరకు పంపింది.''

* * *

అభయ వైశాఖమాసపు సస్యక్షేత్రమువలె ధూళిధూసరమై శుష్కించి యున్నది. ఆమె శరీరమూ జీవనమూను. ముఖమందును, కన్నులందును ఇంచు కంతైనా వికాసము లేదు. అంగ ప్రత్యంగములు ఎండు కట్టెల వలె ఉన్నవి. జీర్ణమై, మలినమైన శయ్యపై ఆమె పడి వున్నది. కుక్కిమంచముచుట్టు చీకటి ఘనీభవించియున్నది. చీకటికోణములో ఆమె పొరలాడుతున్నది.

మహాశయుని చూచి ఆమె ''నాకు మోక్ష మెంతలో వస్తుంది? ఈ విషయం మీరు తప్ప మరెవ్వరూ చెప్పలేరు. ఇంక నా బ్రతుకు.'' అని ఆమె ఏమేమో చెప్పబోయింది.

ఆమె మాట పూర్తి కాలేదు. దగ్గు వలన స్వరభంగమై పోయింది. కంఠ నాళము రుద్ధమై పోయింది. మహాశయుడు సమీపమున కూర్చున్నాడు. ఆమె చేయి చాపింది.

''అమ్మా! చూస్తాను, కొంచెంసేపైన పిదప.''

ఆమె నాతడు చూస్తూ కూర్చున్నాడు. "తలుపు బాగా తెరు మరీ" అన్నాడు దత్తు.

ఆమె లలాటముపై ఆతడు చేయి ఉంచినాడు. హేమంత గగనము దిక్కుగా అభయ చూస్తూ వున్నది.

ఒక చేతిని విడిచి, దత్తు రెండవ చేతిని పట్టినాడు. నిట్టూర్పు విడిచినాడు.

ఆమె ఇంచుక నవ్వింది; అది విచిత్ర మైనది. అభయ మాత్రమే ఆ రీతిగా నవ్వ గలదు. అందరు బాలికలు నవ్వలేరు.

''అమ్మా! నీ సహనము నిరుపమానము. నీ భర్త మరణించినప్పుడు కూడా ధైర్యమును చిక్కబట్టితివి. సూతులకు, గోతులకు లోపము లేదు. ఇంటిలో ఉరి త్రాళ్ళకు కొదువ లేదు. ప్రపంచంలో విషం లేకపోలేదు. అమ్మా! నీ రోగము గడ్డు వ్యాధి. ఐదారు తెగుళ్లు కలిసి ఈ రీతిగా పరిణమించినాయి."

"ఆ డాక్టర్లు! ఎక్స్‌రే తియ్యాలంటున్నారు."

"అమ్మా! ఎక్స్‌రే అవసరం లేదు. వారికి విషయం తెలియ లేదు. నీకు సరియైన వైద్యం జరుగలేదు. అమ్మా! నువ్వు ఇంకా నెలా పదిహేను రోజులు బ్రతుక వచ్చును. ప్రపంచంలో నువ్వింకా కొంతకాలము బ్రతికి తీరాలి."

స్తబ్ధయై ఆమె లేచి కూర్చుంది.

"అమ్మా! నేను ఔషధం పంపుతాను. నీకు పథ్యపానాదుల సంగతి చెప్ప నక్కఱ లేదు. నే నెరుగుదును."

ఆకస్మికముగ రెండు జలధారలు ఆమె కంటికోణములనుండి స్రవించినవి. కండను చీల్చుకొని నీరు ప్రవహిస్తున్నట్లున్నది. కాని నిర్నిమేష దృష్టితో అవ్వలి శూన్యలోకము దెస ఎట్లు చూస్తూవున్నదో అట్లే చూస్తూ వున్నది.

"అమ్మా!"

"తండ్రివలె ఆనాడు నన్ను పిలిచినారు. నేను"—

"తల్లీ! ఆ సంగతులు అట్లే వుంచు. కొద్ది దినాలలోనే నీవు లేచి తిరుగు తావు. నేను రేపు మళ్లీ వచ్చి చూస్తాను."

"వనవిహారికి జబ్బుచేసినపుడు వెయ్యి దేవుళ్లకు మ్రొక్కుకొన్నాను."

"ఇపుడు ఆ సంతాప మెందుకు? మా పిల్లవాడు కర్మఫలంవల్ల జారిపోయి నాడు."

అభయకు దగ్గరి చుట్టమొకతె వెలుపలినుండి పలుకరించింది. ఆమెను అభయ గారాబముతో పెంచినది. "మహాశయా! ఎలా వుంది?" అని ఆమె అడిగింది.

"ఏమీ భయం లేదు. నెలా, నెలాపదిహేను రోజుల్లో తేరుకుంటుంది బాలిక. ఎక్స్‌రే తీయిస్తే తీయించవచ్చు. లేకపోతే కొన్నాళ్లు ఓపిక పట్టి చూడడం మంచిది. పదిహేను రోజులైనా చాలు. పక్షందినాల్లో విషయం విస్పష్ట మవుతుంది" అని యించుక సంకోచముతో మహాశయు డన్నాడు. ఆతడు కఠినముగా మాట లుచ్చ రింపగలిగినాడు.

"నారాయణా! నారాయణా!" అనుకొంటూ జీవనమహాశయు డందుండి నిష్క్రమించినాడు.

# ముప్పది నాలుగవ ప్రకరణము

"వినయా! ప్రపంచంలో మృత్యువు ధ్రువము. ఎవరు జన్మింతురో వారు మరణించి తీరుదురు. మృత్యువు బహు పథములనుండి వచ్చును. అది అనివార్యము. కొందరు వ్యాధి పీడితులై మరణింతురు. కొందరు అఘాతముల వలన చచ్చెదరు. కొందరు ఆత్మహత్య చేసికొని మరణము నాహ్వానింతురు. స్వేచ్ఛ నను సరించి చత్తురు. అయినను మృత్యుసింహద్వారములోనికిపోవు నలిగిన తెరువు, ప్రసిద్ధపథము వ్యాధియే! రోగమే మృత్యుస్పర్శ అందును. అన్ని తెవుళ్లవలన ఆ మానవులు మరణింపరు. కాని వాటివలన ఆ దిక్కుగా నడతురు. రోగము వలన జీవనశక్తి క్షీణించును. వైద్యుడు చికిత్స చేయును. రోగి బ్రతుకడని దృఢముగ తెలిసినయెడల, మృత్యు చిహ్నములు పొంచియున్నయెడల, వైద్యుడు స్పష్ట నిర్వచన మొనరించును. ప్రత్యేక రోగిని గురించి ప్రత్యేక వ్యాఖ్యాన ముండును. నా వుద్దేశంలో శశాంకుని పత్ని బ్రతుకును.'' అని జీవనమహాశయుడు వచించెను.

వినయుని అంగడిలో కూర్చుని మహాశయుడు ప్రసంగిస్తున్నాడు.

మరొకదినము గడచినది.

శశాంకుని భార్యను చూచి మహాశయుడు చెప్పినదానిని గురించి కొంత అలజడి బయలుదేరినది నవగ్రామమందలి డాక్టర్లు హరేన్, చారుబాబు, ప్రద్యోతుడు. ముప్వురు కనుబొమ్మలు ముడివేసిరి. ''చెయ్యి చూసికదా క్షయ అని రోగమున కతడు పేరు పెట్టినాడు'' అన్నాడు ప్రద్యోతుడు.

"వైద్యం ఎన్నో ముఖాలు గలది. చికిత్సకుల వైఖరులు కూడా ఎన్ని రీతులలోనో గోచరిస్తాయి. మూడు నాలుగు వేల రోగులను చంపి, మరల వారిని బ్రతికించడం మొదలుపెట్టినాడు జీవనమహాశయుడు. రామహరి కొడుకును కడుపుబ్బరపు వ్యాధినుండి బ్రతికించి, శశాంకుని భార్యను క్షయనుండి బ్రతికిస్తాడు. రాణా పాఠకుని కూడా బ్రతికిస్తాడట'' అని కొందరు డాక్టర్లు ప్రచారం సాగించారు.

వెనుక తాళము వేయసాగినాడు దాతు ఘోసాల్. వినయు డిట్లన్నాడు. "ఘోసాల్ ఆస్పత్రినుండి పారిపోయి దుష్ప్రచారములోనికి దిగినాడు''

"దత్తుగారు క్షయ పీడితుని బ్రతికిస్తే అన్నిరోగములను ఊది నేను చెదరగొట్టగలను. నా చేతిలో కేనాబిసిండికా వుంది" అని శశిడాక్టరు అన్నాడు

"దాతు ఆస్పత్రినుండి పారిపోయినాడా? లేక డాక్టర్లే వానిని వదలివేశారా?" అని మహాశయుడు ప్రశ్నించాడు.

"ఆస్పత్రిపై దెయ్యాలు తాండవ మాడుతున్నవని విన్నా డాతడు. మీదు మిక్కిలి మొన్న రాత్రి పరాన్‌ఖాన్ బీబీ విషంత్రాగి ఆస్పత్రి టేబులుపై చచ్చింది. దాతు నిన్న బాండు వ్రాసి యిచ్చివచ్చినాడు." అని ఒకరు ప్రత్యుత్తర మిచ్చినారు. మహాశయుడు అన్యమనస్కు డైనాడు. కిటికీ పొంతనున్న చెట్ల జొంపములోని పల్లవములగుండా ఆతడు వింటిదెస వీక్షింపసాగెను. వాని స్వాంతము శూన్యలోక మందలి అనంత సృష్టియందు దేనినో వెదకుతూ తిరుగాడుచున్నది. క్షీణ హసన రేఖ వాని పెదవిపై తొలాడుతున్నది.

"మహాశయా!"

అని పెద్ద గొంతుకతో అరచి లోపల ప్రవేశించాడు రాణాపాఠక్.

"బాబయ్యా! నేను కొంచెం బాగున్నానండి. రెండు మూడు రోజులనుండి జ్వరం తగ్గుమొగం పట్టింది. నిన్న రాలేదని చెప్పాలి" అంటూ అతడు వచ్చి బెంచి మీద కూర్చున్నాడు. ఐదు సేర్ల తూకం గల పెద్ద చేపను ఎదుట చేర్చు కొన్నాడు.

మహాశయు డాతనిని తేరి చూడసాగినాడు. వాని మొగముపై మార్పేమైనా అగపడుతుందేమో అని ఆతడు పరీక్షిస్తున్నాడు.

"ఆస్పత్రి డాక్టరు హరేన్‌తోను, చారు బాబుతోను రెండు మాటలు చెప్పి వచ్చానండి" అన్నాడు రాణా.

"ఏమన్నావు?"

"కోఆపరేటివ్ మందుల దుకాణంలో బైఠాయించి వారేదో కారుకూతలు కూయడం దూరంనుండి విన్నాను. నేను ముందుకు వచ్చి తగిన రీతిగా ప్రత్యు త్తరం చెప్పేను."

"వాడిమాటలు కావు కదా!"

"అవి ఘాటైన మాట లనడం నిజం. బండమాట లని చెప్పలేను. నిజమా దేను. ఇంచుమించుగా చచ్చినవాళ్లను మీరు బ్రతికించారన్నాను. నెత్తురు క్రక్కే

క్షయవ్యాధులకు ఆయువు పోశారన్నాను. రక్తపిత్త వ్యాధులను గురించి చెప్పేను. చక్రధారి, చారుబాబులు క్షయ అన్నారు. మనుష్యులు పొరపాటుపడుతూ వుంటారు. శశాంకుని పెండ్లామును గురించి యేమో అన్నారట కాదా?''

''ఆమె బ్రతికి బాగుంటుందన్నాను. ఎక్సురే ద్వారా పరీక్షిస్తే విషయం వారికే బోధపడుతుంది. బాగా నాడీ పరిశీలన చేసినా సంగతి తెలిసిపోతుంది. దుఃఖంతో, పేదరికంతో ఆమె దినాలు గడుపుతూవుంది. మూడు నాలుగు మాసాలు ఇంచుమించుగా తిండిలేని స్థితిలో పడివుండి, లివరు పాడై పోవడంవల్ల దగ్గు వచ్చింది. మీదు మిక్కిలి తొల్లింటి జ్వరం పీడిస్తూనే వుంది. ఈ తబిసీళ్లు వారు గుర్తుపట్టలేక పోయారు."

''నా వ్యాధి క్షయయే! అయినా నేను బ్రతికి బయటపడ్డాను.''

''బాగుపడినావా?''

''అలా అనే నాకు తోస్తోంది. రెండు మూడు రోజులనుండి జ్వరం తగ్గుతూవుంది. అది సామాన్యం. మిగుల సామాన్యంగా వుంది. నా నాడి నేను చూచుకోగల శక్తి నాకుంది. వారి ప్రాక్టీసు నాకు నచ్చలేదు. నియమం బట్టి తింటూ తిరుగుతున్నాను. అందుచేత ఒళ్లు కొంచెం స్వాధీనంలోనికి వచ్చింది వా శ్లోవేవో విమర్శలు చేస్తున్నారు."

''ఆమె మరణించింది. పాపం.''

"నా చెయ్యి చూడండి."

వాని చేతినీ, గుండెనూ చూచి, "ఆ ఔషధమునే సేవిస్తూ వుండుము. ఆ నియమాలనే పాటిస్తూవుండు" అన్నాడు మహాశయుడు.

''ఏం చూశారో చెప్పండి. నాదగ్గర ఏమీ మరుగుపరచకండి. మహాశయా! మీరు రాణా నెరుగుదురు. చావంటే నాకు భయం లేదు. కొంతకాలం నేల మీద నాకు నూక లున్నాయి, వాని నెందుకు చెదరుగొట్టుకోవాలి? క్షయ ఎప్పుడు నాకు సంక్రమించిందో, పరలోకమునుండి పిలుపు వచ్చిందని నే నెరుగుదును. ఏవో కొన్ని దినాలు నాకై మిగిలివుంటే వాటిని సంతోషంగా గడపాలని అనుకొంటున్నాను. ఈశ్వరుని పేరు సరిగా ఉచ్చరింపలేక పోయాను.''

''చెప్పవలసిన సమయం ఇంకా రాలేదు. అయితే అంతగా పాడు కాలేదని చెప్పగలను. బాబూ మరి పదిహేనురోజులు పోయిన తర్వాత రా.''

"మంచిది ఆలాగే వస్తాను. ఇదిగో,ఈ చేపను ఇక్కడే వుంచిపోతున్నాను. దీనిని మీకోసం తెచ్చాను."

"ఎందుకు తెచ్చావు? దీనిని మాయింట్లో తినేవారెవరు?"

"మార్గంలో దొరికింది. తెచ్చాను మీ కోసం. బుద్ధి పుట్టింది. జాలరులు నదిలో చేపలని పట్టేగారు. ఆ నదీప్రాంతం యావత్తూ నా పాటలో వుంది. నిలబడ్డాను. రెండున్నర మణుగుల చేపలు పోగుపడ్డాయి. వాటిలో ఇది నాకు బాగా నచ్చింది. వెంటనే మీరు జ్ఞాపకానికి వచ్చారు. చంక బెట్టుకొని వచ్చాను. ఇంట్లో తినండి. వినయుడు, గినయుడు వగైరాలున్నారుకదా, చేపలకోసం చెవి కోసుకొనేవాళ్లు. ఇరుగుపొరుగువారికి పంచిపెట్టండి. నన్నాశీర్వదించండి. చస్తానో, బ్రతుకుతానో! చప్పుచప్పున సాగిపోవాలి! ఎందుకీ యాతన? బాబయ్యా! ఇంక సెలవు పుచ్చుకొంటాను."

రాణా ఒక విచిత్రవ్యక్తి. భయం లేనివాడు. గట్టిపిండం. కాని అతడు బ్రతుకడు

మత్స్యమును గురించిన ఉదంతము వినయునకు విశేషానందము కలిగించింది. "కాబట్టి ఈవేళ రాత్రి మీ యింట్లో మంచివిందు జరుగుతుంది." అన్నాడాతడు మహాశయునితో.

మహాశయుడు నవ్వినాడు. నవ్వుకొంటూ నిష్క్రమించినాడు వినయుడు.

ఇంటిలో ఒంటరిగా కూర్చుని మహాశయుడు నాడి పరీక్షించుకొంటున్నాడు. నేడు మాటిమాటికి చూసుకొంటున్నాడు. మృత్యుపదధ్వని వినవస్తున్నట్లు వానికి తోస్తోంది. మృత్యువాంఛ మిగుల ప్రబలమై వాని మనస్సును వ్యాపించింది. సర్వేంద్రియములనుండి అది ప్రత్యక్ష మౌతూ వుంది. అందుకై జాగ్రత్తగా ఆతడు కనిపెట్టుకొని కూర్చునివున్నాడు. మృత్యుకాంత పదధ్వని, ఆమె స్వరూపము, ఆమె స్వరము, ఆమె స్పర్శ అనుభూతికి అందుచుండెను. చావుకు రూపు ఉన్న యెడల విని తీరును. స్పర్శ వున్నయెడల స్పర్శానుభూతి నంది తీరును. ఈ అనుభూతుల నిర్వచనమును ఆతడు చేసియేపోవును.

* * *

యువతి ఒకామె వచ్చి గదిలో ప్రవేశించింది. విస్మయముతో మహాశయుడామెను చూచినాడు.

ఆమె దృష్టి శాంత గంభీరమై ఉన్నది. కన్నులు పెద్దవి. ముఖశ్రీ ప్రసన్నమై వున్నది. పచ్చని మేనిఛాయ. వయసు ఇరువదిరెండు, ఇరువదిమూడేండ్లుండును. ఆమె తెల్లని బ్లవుజ్ ధరించింది. పసుపుపచ్చ బార్డరు గల తెల్ల చీర. మెడలో మేలిముత్యాలహారము తళుక్కులీనుతున్నది. చేతులు నిరాభరణములు. ఎడమచేతి మణికట్టున నల్లపట్టీగల రిస్టువాచి. ఆమె సర్వాంగములయందు ప్రసన్నత తొలాక్కాడుచున్నది.

అచ్చెరుపాటుతో మహాశయు డామెను విలోకించినాడు.

"అయ్యా! నే నీ ఆసుపత్రిలో నర్సుగా పని చేస్తున్నాను. మీపేరు విన్నాను. మీరీ ఆస్పత్రి దాపుననుండి వచ్చిపోతూ వుండడం చూస్తూ వుంటాను. మీతో ప్రసంగించాలని మిక్కిలి ఉబలాట పడుతున్నాను. నేను బజారుకు వచ్చి, మీ రొక్కరు కూర్చుండడం చూశాను.''

''అమ్మా! కూర్చో మాట్లాండేందుకు వచ్చానంటున్నావుకదా! నిలబడితే ఎలా ప్రసంగించగలవు? నా వంటి ముసలివానిముందు నీకు సంకోచ మేల? కూర్చో. ఆరోజు రాత్రి ఆస్పత్రిలో గుమ్మం వద్ద నిలబడివుండినది నీవు కదా?''

''నేనే! నన్ను చూశారా? మిమ్ము నేను చూశాను."

''మిమ్మ గురించి ఎన్నో విషయాలు విన్నానండి!"

"ఎవరి దగ్గర?''

"మా ఆమ్మ దగ్గర. మా అమ్మనీ, నన్నూ మీరు పరీక్షించారు. అపుడు నేను చంటిపిల్లదాన్ని. నే నిక్కడే పుట్టాను. మీ వూళ్లోనే."

''అమ్మా! నీ వెవరవు? నీవు మరి——'' ఆతని విస్మయమునకు మేర లేకపోయెను.

''నన్నెలా గుర్తుపట్టగలరు? మా అమ్మ నాన్న యిక్కడ పనిచేసేందుకై వచ్చినారు. అతణ్ణి మీరెలా జ్ఞాపక ముంచుకోగలరు? మీ రెందరు ప్రాణాలో కాపాడేరు. వారందరిని ఎలా జ్ఞాపక ముంచుకోగలరు? బ్రతికి వున్నవారందరికీ మీరు జ్ఞాపక మున్నారు."

"అలాగా?'' అని నవ్వినాడు మహాశయుడు.

''నాకు విషయ మంతా జ్ఞాపక మున్నది. ఇంచుమించుగా నేను మరణించినా నని అమ్మ చెపుతూ వుంటుంది. అందువలన ఆస్పత్రిలోని వారందరితో వాకబు చేస్తూవుంటాను. నువ్వు పేసైరమ్మని వా రంటూవుంటారు."

మహాశయుడు నవ్వినాడు.

''మీరు గొప్పవంశంలో పుట్టేరని మా అమ్మ చెపుతూవుంటుంది.''

"అమ్మా! మీ అమ్మ యెవరు?" అని అచ్చెరుపాటుతో ఆతడు ప్రశ్నించాడు.

''నీకు నా మనుమరాలు వయసున్నది. ఏమీ అనుకోవద్దమ్మా'' అని ఆత డన్నాడు.

''మీరు నాకు తాతగారు. మా అమ్మ మిమ్మల్ని పెదనాన్నగారంటూ వుంటుంది.''

''మీ అమ్మ యెవరు?"

యువతి మాట్లాడక వూరుకుంది.

ఇంచుకసేపుండి, "ఒకరోజు మీయింటికి వస్తాను. అంతా చెపుతాను." అన్నదామె.

ఆమె వంగి ముసలివాని పాదాలకు ప్రణమిల్లింది. ఆతడు చప్పున లేచినాడు. ''నాకు ప్రణామం చేస్తున్నావా? నేను క్షత్రియుణ్ణి. బ్రాహ్మణ బాలికవు కావుకదా?''

''నే నెవరైతేంగాక! మీరు గొప్పయింటివారు! మహాశయులు!''

''ఇంకా మహాశయుడనా? మహాశయత్వము అంతమై పోయింది. కాని ఆశ్చర్యకరవిషయం! పృథివిలో ఈరీతి కృతజ్ఞత వున్నదా? ఎప్పుడు, ఏకాలంలో, స్మృతిపథమునకు వెలుపల ఏ వ్యాధినుండి ఆమెను రక్షించాను? అందుకై ఇంత కృతజ్ఞతయా?"

"తాతగారూ! నేటికి నేను సెలవు పుచ్చుకొంటానండి.''

సచేతనుడై ఆతడు ''అమ్మా! నువ్వెవ్వరవో నాకు స్పష్టంగా తెలియలేదు. నీ పేరేమి?"

"సీత."

"సీతా!''

మెల్లమెల్లగా నడుస్తూ ఆమె అందుండి వెడలిపోయింది.

''బాబయ్యగారూ! అంటూ కద్రు వచ్చి నిలిచినాడు. మహాశయా! బాగా వున్నానండి. మరికొంచెం మందియ్యండి.''

# ముప్పదియైదవ ప్రకరణము

కొన్నినెలలు గడచినవి. అది చైత్రమాసము. అపరాహ్ణసమయంలో ఆరోగ్యనికేతనపు ఔషధాలయంలో కూర్చుని సేతాబుతో జీవనమహాశయుడు చతురంగము ఆడుచున్నాడు.

మహాశయుడు క్రమక్రమముగా ఆటలు పోగొట్టుకొంటున్నాడు. కుడిచేతికి బదులు ఎడమచేతినే ఆదమరపుగా ప్రయోగిస్తున్నాడు. నడుమనడుమ నాడిని పరీక్షించుకొంటున్నాడు.

"మహాశయా! ఇదేమి విడ్డూరము. క్రమక్రమముగ మతి పోతున్నట్లుంది. మనసు ఆటమీద లేదు. మాటిమాటికి నాడిమీదికి చేయి పోకుతూవుంది".

"ఏమీ లేదు. ఒంట్లో ఎలాగో వుంది".

నిట్టూర్పు విడిచినాడు సేతాబు. ఇక ఆట చాలించాలనుకొన్నాడు. ఇంతలో నర్సు సీత రెండుకప్పుల టీ తెచ్చి అచ్చట వుంచి, "తాతా వెడతాను. ఈవేళ సాయంకాలమునుండి డ్యూటీ వుంది" అని చెప్పిపోయింది.

"అమ్మా! రేపు ఎపుడు అగపడతావు?" అని వాత్సల్యముతో ఆమె వీపు తట్టి మహాశయుడు ప్రశ్నించాడు.

"ప్రాతఃకాలమున."

ఆమె నిష్క్రమించింది.

"నడు. వినయుని దుకాణమునకు పోయే దోవలో కద్రును చూచివద్దాం"

"ఆస్పత్రి డాక్టర్లు కద్రును బ్రతికించారు." అన్నాడు సేతాబు ఉత్సాహంతో

"ఈ ఆపరేషనువల్ల డాక్టర్లు వాణ్ణి ఈ వయసులో బ్రతికించగలుగుతారని యెవ్వరూ అనుకోలేదు. ముసలివాడు హెర్నియా వలన బాధపడుతున్నాడు. కత్తి మోపడం యెట్లా అన్నాడు చారుబాబు. అందులోనూ అది స్ట్రాంగులేటివ్ హెర్నియా. అంతా సాధ్యమే. కాని అవసరమైనది ఆత్మవిశ్వాసము అది ప్రద్యోత డాక్టరుకు కలదు" అన్నాడు మహాశయుడు.

కడుపునొప్పితో బాధపడుతూ కద్రూ ఇంటిలో పడివుండెను. వానిని అందుండి లేవదీసి కిశోరుడు ఆస్పత్రిలో చేర్పించినాడు. ఆపరేషను చేసివుండని

యెడల ముసలివాడు చచ్చివుండును. కద్రూ మొరవినక ప్రద్యోతుడు ఆపరేషన్ చేసినాడు. వాణ్ణి బ్రతికించాడు. వాడు మెల్లమెల్లగా లేచినాడు. మహాశయుడు ప్రతిదినము పోయి కద్రూను చూస్తూవుంటాడు. ఒకపర్యాయం ప్రద్యోతును కూడా చూస్తూవుంటాడు. ఆతడు నవ్వుతూ "మీ కద్రూ బ్రతికిపోయాడు" అంటూవుంటాడు.

"వాడి నాడి, చెయ్యి చూచి 'నువ్వు బాగున్నావు' అని చెప్పండి. లేకపోతే బాగుపడ్డాననే నమ్మకం కలగదు వానికి. ఇటువంటి రోగిని చేపట్టడం భాగ్యమే" అన్నాడు ప్రద్యోతుడు.

సీతకు జీవనమహాశయునితో గాఢపరిచయం కలిగింది. అతనితోనే కాదు. ఆతని ఇల్లాలితో కూడా. ఇరువురకు తలలో నాలుకవలె సీత మెలగుతూ వుంది. వృద్ధదంపతుల జీవనశూన్యతలో చతురమతియైన సీతవలన ఇంచుక ప్రసన్నత అగపడింది,

సేతాబు మున్నగువా రాదృశ్యమును విడ్డూరముతో వీక్షిస్తున్నారు. అవసానసమయములో జీవనమహాశయుని అదృష్టము కొంత మరలినట్లు గోచరించింది. ఆతని ప్రశస్తి పునరుద్ధరింపబడుతూ వుంది. రామహరిని బ్రతికించడం వలన సునామ పునరుద్ధరణము కాదొడగినది.

"శశాంకుని ఇల్లాలికి అతడు చేసిన వైద్యవిధానము ప్రజలను ఆశ్చర్యాన్వితులను చేసినది, డాక్టర్లు నిర్ణయించిన వ్యాధి ఒకటి. మహాశయుని నిర్ణయము వేరు. ఆతని మాటయే సత్య మని ధ్రువపడింది. నెల పదిహేనుదినములు గడవక మున్నే శశాంకుని భార్య రోగముక్త యైనది. ఆమె కేసులో వృద్ధుడైన జీవన మహాశయుడు ప్రదర్శించిన పరిశ్రమ, నిష్ఠ ఎంత అద్భుతమైనది! తనచేతితో తాను ఔషధమును తయారుచేసినాడు. నియమప్రకారము ప్రాతఃకాలము రెండు మైళ్లు నడచిపోయి ఆమె గుడిసెపొంత నిలిచి "అమ్మా!" అని సాదరపుగ పిలిచేవాడు మహాశయుడు.

వైష్ణవ వృద్ధ స్త్రీ లేచి యెదు రయ్యేది. "బాబయ్యా, రండి" అని ఆహ్వానించేది,

"అమ్మ లేచిందా?"

"ఆమె వేకువజామునే లేచి కూర్చుంది. జపం ముగించింది."

తెల్లని నైసుబట్ట కట్టుకొని చిక్కి శల్యమై క్లాంతదృష్టితో గౌరాంగియైన ఆ బాలిక ప్రసన్నభావముతో నవ్వుతూ తలమీదికి మేలిముసుగును లాగుకొని మహాశయునకు ప్రణమిల్లి "బాబయ్యా! ఎందుకు కష్టపడి వచ్చారు? ఔషధం పంపితే సరిపోయేదే, బాబా! మీ దయవలన నేను బాగున్నాను" అని ఆమె పలికేది.

"అమ్మా! బాగా వుండితీరుతావని చెప్పేనుకదా! నీ రోగమైతే ముదిరిందే. కాని నాచేయి దాటిపోలేదు. మీదుమిక్కిలి నీ సహనగుణము మిగుల అద్భుతమైనది. బలమైన మనస్సు నీ శరీరంపై మంచిపని చేసింది. నీ చెయ్యి చూడాలి. అందుకోసం వచ్చాను."

"నన్ను బ్రతికించేందుకు మీరింతగా ఎందుకు కష్ట పడ్డారు? నేను వెళ్లిపోవలసిన దానినే. నేను మరణిస్తే కష్టాలు పడే వారెవ్వరు? అని ఆమె వినయముతో పలికేది.

"అమ్మా! ఈ సంసారము సుఖదుఃఖములతో నిండివుంది. ప్రపంచంలో ఎంత సుఖం వుందో అంత దుఃఖం ఉంది. మనుష్యజన్మ వీటి మధ్య పడి నలుగుతూ వుంటుంది."

"బాబయ్యా! మీరు చెప్పింది నిజము. ఎంత తీపో అంత పులుపు."

"నిజ మాడినావు అమ్మా! నన్ను చూడు. కష్టములు ఎన్నెన్ని ఎదురైనను మృత్యువును ఆహ్వానింపరాదు. మరల మృత్యువును చూచి భయపడి వెనుకకు పోయి వెక్కివెక్కి యేడ్వరాదు. రెండు పనులూ దోషాలే."

మహాశయుడు ఒక రోజున "అమ్మా! నీలో దోష మేమీ లేదు. కొంచెం లోపం వుంది. ఇలా అన్నందుకు కోపపడకు" అన్నాడు.

"ఏం లోపం బాబూ?" అన్నది బాలిక చకితయై. "అమ్మా! ఆత్మ దేహాశ్రయి! దేహము లేనిదే ఆత్మ నిరాశ్రయ నిరాలంబమై ఉండును. ఆ దేహము యెడల నీవు శ్రద్ధ వహించి వుండుము. ఏ గుడిలో దేవత కలదో, ఆ గుడిని నిర్లక్ష్యంతో చూచిన యెడల, అందా దేవత యెట్లు నిలుచును? దేహమును పీడించి, అకాలమున దానిని శిథిలము చేసిన యెడల, ఆ క్రియ ఒక విధమైన ఆత్మ హత్య అనిపించుకోదా? శరీరము యెడల ప్రతి మానవుడు విశేషించి శ్రద్ధ వహించి తీరాలి."

ఈ మాటలను శశాంకుని ఇల్లాలు శిరసావహించినది. ప్రాతఃకాలమున ఆమె కడకు పోవుట జీవనమహాశయునకు సాధ్యముకాని యెడల, ముసలివాడు శిరమును ఎండ కప్పగించి అపరాహ్ణమున అచటికి పోవువాడు.

శశాంకుని యిల్లాలు బాగా తేరుకొన్నది. ఆమె యింటినుండి తరలిపోయిన చుట్టాలలో మేనకోడ లొకతె. ఆమె తిరిగి యింటిలో ప్రవేశించింది. ఆమెకై ఎక్సురే తీయించింది. జీవనమహాశయుని నిర్ణయమే ఎక్సురే వలన నిజ మని తేలింది.

ఈ రోజుల్లో కూడా అపుడపుడు వైష్ణవ భిక్షుకురాలు బిచ్చపు జోలిని భుజముపై వ్రేలాడగట్టు కొని "జయగోవిందా" అంటూ గుమ్మముపొంత నిలుస్తుంది. తన జోలినుండి కొంచెం మిఠాయి పైకి తీసి "అమ్మా! ఇదిగో అభయమ్మా! నీకోసం కొంచెం కాళీ మాత ప్రసాదం తెచ్చాను. తీసుకో!" అంటూ సాదరముగ కేక వేస్తుంది.

జీవనమహాశయుని మాట మరొక రీతిగా కూడా సత్య మని దృఢపడింది. దాతూ ఘోసాల్ చచ్చి వూరుకున్నాడు? దెయ్యాల భయం వల్ల అతడు ఆస్పత్రి నుండి పారిపోయినాడు. శశితో జతపడినాడు. కొలది దినములలో విశేష సమారోహంతో వినయుని శ్రాద్ధ మయింది. ఈ శ్రాద్ధభోజనమును ఘోసాల్ కడుపు నిండ ఎక్కించాడు. చూచిన వారి కా భోజన విధానము అత్యాశ్చర్యమును కలిగించింది.

తరువాత అతడు పడిపోయినాడు. వానికి తుది చికిత్స చేసినవాడు జీవన మహాశయుడు. అతడు మరెవ్వరికడకు పోలేదు. పిలిచేందుకు శశి వచ్చినాడు.

దాతుఘోసాల్ మహాశయుని రెండు చేతులు పట్టుకొని వెక్కి వెక్కి యేడ్చినాడు.

మహాశయు డిట్లన్నాడు. "దాతూ! నేనేం చెయ్యను? డాక్టర్ల వంటింటి కిటికీ దగ్గర నిలిచి, నువ్వు భూతం వేషం వేసి, 'మాంసం కావాలి. మాంసం కావాలి' అని అరిచావు. నీ నాటక మంతా నాకు తెలిసినది. దోషం నీది కాదు. నోటి కక్కుర్తికి అలవాటు పడ్డావు. నాలుకను అదుపులో పెట్టుకొన్నావు కావు. నీ తిండి రంధి చెప్ప నలవి కానిది. అదే చివరకు నీవు శత్రువై పోయింది. ఈ శత్రువు న్నుండి దూరస్థుడవు కాలేక పోయినావు. నీ కథ నాకు తెలుసును. అందువల్ల నీతో

ఇంత గట్టిగా చెపుతున్నాను. ఇంక ఈ కర్మ పిడికిలినుండి నీవు విడివడజాలవు. నీ కథను ఆస్పత్రి డాక్టర్లు యెరుగరు. నావలె నిన్ను నమ్మికూడా వుండరు. ఎలాగో బ్రతికించాలని అనుకొన్నారు.''

మహాశయుని మాటలు విని దాతు మరింత ఆవేశముతో వెక్కి వెక్కి యేడ్చినాడు.

మరల మహాశయు డిట్లన్నాడు. ''అధైర్యపడడం ఎందుకు? ఎప్పుడో ఒకప్పుడు అందరూ మరణించేవారే! నేనూ మరణించేవాడనే. మానవులు పుడుతూ వుంటారు. గిడుతూ వుంటారు. ఎవరెంత సుఖింతురో, ఎంత దుఃఖింతురో, ఎవ్వరు చెప్పగలరు? ఐహిక విషయము లన్నీ అనిశ్చయములు. నిశ్చయముగ చెప్పగల విషయము మృత్యువును గురించియే. నీ వయసు తక్కువ కాలేదు. గుండెను దిటవుగ నిలుపుము. భగవంతుని నామము నుచ్చరింపుము. చావును గురించి ఎంతగా భయపడెదవో అంతగా యేడ్వవలసి వస్తుంది. భయపడకుము. మరణమే నీకు సుఖమును ప్రసాదించు నను సత్యమును గ్రహింపగలవు. చిక్కి చీకి కూలబడుతున్న ఈ శరీరమును ఎంతకాలము మోయజాలుదువు? దీనితో నీకు గాని, ప్రపంచమునకు గాని ప్రయోజన మే మున్నది? ఈ గుడ్డపేలిక మార్చుము, మార్చుము.''

ఏడుస్తూ, ఏడుస్తూ మహాశయుని పాదములంటి "బాబయ్యా! ఈ పర్యాయం నన్నెలాగైనా బ్రతికించండి. ఇక నోటి కక్కుర్తికి ఎడమీయను.'' దాతు మొర పెట్టుకొన్నాడు.

''ప్రయత్నిస్తాను. కాని నాయనా! ఒక్కమాట చెప్పితీరాలి! నీ ంటో ఏమీ లేదు. నాడి స్పష్టంగా చెపుతోంది.''

''అయ్యో! అయ్యో!''

మహాశయుడు మాట్లాడుతూవుండగా దాతు గొంతెత్తి గోలపెట్ట సాగినాడు.

వాని మృత్యుసమయమున జీవనమహాశయుడు సమీపమున ఉన్నాడు. ఇంచుమించుగా తుదిముహూర్తమువరకు వానికి జ్ఞానముండెను. వాని కన్నుల నుండి యెడతెగక అశ్రుస్రవంతి ప్రవహిస్తూనేవుంది.

"ఎలా వున్నావు?" అని మహాశయుడు ఒక పర్యాయం అడగినాడు.

"ఏమీ తెలియడం లేదు. భయమేస్తోంది.'' అని అతడు హీనస్వరంతో పలికినాడు.

అది తొల్లింటిమాట. మహా భయము! మహా భయము! మహాంధకారము! మహాశూన్యము! నిశ్వాసమునకు వలసిన వాయు వందు లేదు. నిలుచుటకై తావులేదు. ఏమీ లేదు. ఎవరూ లేరు! నేను లేను. మహాశయునకు గుండెపై ధక్కా తగిలింది. క్షణకాలము అత డూరకొన్నాడు. "హే మాధవా!" అని గభీర స్వరమున అతడు పలికినాడు. ఆతని వెంట సేతాబున్నాడు. ఆతడు దాతుకు పాఠశాలయందు సహపాఠి. నెచ్చెలిని చూచేందుకై వచ్చినాడు. శోకోద్వేగముతో ఆతడు మహాశయుని చేతిని గట్టిగ పట్టుకొనినాడు.

మహాశయుని ప్రాక్టీసు అధికము కాదొడగినది. మరల అభివృద్ధి మార్గమున ఆతడు ముందంజ వేయ సాగినాడు. ఎందుండియో వచ్చి ఉన్నత వృక్షముపై ప్రాలి, దానిని వదలక ప్రాకునట్లు సీత వచ్చి మహాశయునిపై ప్రాలినది. ఇందేమి మమత కలదో? ఏమి మాయ కలదో? సేతాబు ఈ నూతన పరిణతిని మనస్తాపముతో వీక్షిస్తూనే వున్నాడు. అతడేడ? ఈమె యేడ? ఆతని వంశ మెట్టిది? పెద్దలందరు ఈ దృశ్యమును వింతతో, విడ్డూరముతో విలోకింప సాగినారు.

"సేతాబూ! మా యిద్దరి వంశాల్లో భేద మేముంది? మరి-" అని యింకా యేమో చెప్పబోతూ ఆతడు చప్పున ఊరుకొన్నాడు.

ఇరువురు ప్రసంగిస్తూ వుండగా ఎవరిదో ఆక్రందనము వారి చెవులందు పడినది. మహాశయుడు హుక్కా గొట్టము ప్రక్కను నిలిపి ఆతురపాటుతో వీను లొగ్గినాడు.

వచ్చినవారు మతియింటివారై వుండరు. ఆయింటి వారెవ్వరు ఆతని యెదుటికి రారు. మతి తల్లిని గురించిన ఆతని నిర్ణయము అబద్ధ మని తేలిపోయింది. ఆ ముసలిది అదృష్టవశాత్తూ బ్రతికి పోయింది. మరి వారి రాకపోకలు లేవు. ఆ కుటుంబంనుండి ఎవ్వరైనను తన యింటిదాపల పొగులుతున్నారని ఆత డెట్లు ఊహిస్తాడు?

తత్తరపాటుతో ఆతడు స్లిప్పర్లు తొడుక్కొని వెలుపలకు పోయి చూచినాడు. ఆశ్చర్యము! మతి తల్లియే ప్రత్యక్ష మయింది.

"బాబయ్యా! మిమ్మల్ని వదలను. మీ పాదాలు పట్టుకొంటాను. నా మనమణ్ణి బ్రతికించండి" అని అరిచింది మతి తల్లి.

మహాశయుడు పోయి వెళ్ళి యింటిముందు, నిలిచినాడు,

అదే సమయములో ఆస్పత్రి డాక్టరు అక్కడకు వచ్చి చేరుకొన్నాడు. ఒంటారుల కన్నులు తారసిల్లినవి పిచ్చిదానివలె అరుస్తూ వెనుకనుండి పరుగు పరుగున వచ్చింది. మతితల్లి ఏడుస్తూ, ఆమె వారి పాదాలపై పడింది. "అయితే నన్ను కూడా చంపి వెయ్యండి. నాచే విషం మ్రింగించండి. నే నెందుకు బ్రతకాలి?"

"లే లెమ్మ. ఎందుకీ గోల? ఏమయిందో చెప్పు. ఎవరికి జబ్బుచేసింది? లేచి, మాటచెప్పు" అంటూ మహాశయుడు గంభీర స్వరంతో అన్నాడు.

ఏడుస్తూనే ఆమె యేమేమో చెప్ప నారంభించింది.

"ఇలా యేడిస్తే లాభం లేదు. ధైర్యంగా చెప్పు."

"ఈమె పెద్దకొడుకు మరణించాడు" అని ఆస్పత్రి డాక్టరు చెప్పినాడు.

"పాపం! పన్నెండు పదమూడేళ్ల పిల్లవాడు. దుక్కలా వుండేవాడు. ఏమయింది వానికి?" అన్నాడు మహాశయుడు.

"మేలిగ్నెంటు మలేరియా వలన పీడింప బడ్డాడనుకొంటాను. రెండు రోజులు మాత్రమే జ్వర పీడితుడై ఉండెను. హఠాత్తుగా హార్టు ఫేలై పోయింది."

"అయ్యో! నా కొడుకు నా గుండె బ్రద్దలు చేసి పోయాడు" అని గుండెలు కొట్టుకుంటూ ముసిలిది ఏడ్వసాగింది.

పలువురు వచ్చి అందు గుమిగూడిరి. ప్రద్యోతుడు మరింత తొట్రు పడి నాడు. చప్పున నిష్క్రమించాలని ఊహించాడు. కాని అతని సైకిలుకు పంచరు పడింది.

రెండు చేతులతో తల పట్టుకొని "బాబయ్యా! మిమ్మల్ని విడిచిపెట్టి ముప్పు తెచ్చుకొన్నాను. మీ చెయ్యి పడివుంటే నా పిల్లవాడు నాకు దక్కేవాడేమో!" అని అవ్వ ఆక్రందనం సాగించింది.

"నాచెయ్యి పడితే నేమి? మరెవ్వరి చెయ్యి పడితేనేమి? ప్రపంచంలో రోగాలు రెండు రకాలు. కొన్ని డాక్టర్లకు లొంగుతవి. కొన్ని మృత్యువుకు లొంగుతవి."

"నేనేం చెయ్యాలో చెప్పండి బాబూ!"

"ఏం చేస్తావు? సహించు. మృత్యువు ముందు పిన్న పెద్దల వ్యత్యాసం లేదు. మనుష్యునకు మరణము ధ్రువము" అని సాంత్వనం చెప్పినాడు మహాశయుడు.

"బాబయ్యా! నే నెందుకు బ్రతకాలి?

"కర్మను బట్టి బ్రతుకుంటుంది. ఇది చిరకాల నియమం. సంసారంలో డొడ్డవాడెవడైనా మరణశయ్యమీదినుండి లేచినయెడల, మరొకడు ఆ శయ్యపై పడి తీరాలి. ఆ శయ్య ఖాళీ కాకూడదు " అని గుంపులోని వారెవ్వరో పలికినారు.

"ఇక్కడ మేలిగ్నెంటు మలేరియా అనే జబ్బు లేదు. కొన్నాళ్లకు ముందు రోగి మేనమామ యింటికి పోయినాడు అక్కడ యీ వ్యాధి వానికి సంక్రమించి వుంటుంది. అయినా, ఈ విషయం నాకీ వేళే తెలిసింది.'' అన్నాడు ఆస్పత్రి డాక్టరు.

నిట్టూర్పు విడిచి మహాశయు డిట్లన్నాడు :

"రోగ నిర్ణయము చెయ్యడంలోనే విశేషంగా ప్రమాదం ఘటిల్లుతుంది. వైద్యుని భ్రాంతి ఎంతో పని చేస్తుంది. ఔషధం దొరకక పోవడం ఒక కారణమై వుంటుంది. ఇవన్నీ మృత్యు రోగ లక్షణములు కాకపోవచ్చును. కాని హేతువులు. చికిత్స విజ్ఞానము ఆయుర్వేదము. పంచమవేదము. విజ్ఞాన వేదము. ఇది అసత్యము కాదు. ఈ కాలంలో రోగ పరీక్షకు కొన్ని చేయూతలు లభించాయి. కాని మనుష్యుడు భ్రాంతిలో పడి తీరుతాడు.''

''నాడి చూచి మేలిగ్నెంటు మలేరియాను గుర్తు పట్టగలరా?'' అని ప్రద్యోతుడు అడిగినాడు.

"గుర్తు పట్టలేనేమో! పట్టినా కుదర్చలేక పోతాను." లక్షలమంది మనుష్యులు వైద్యం లేక అకాలంలో మరణించారు."

"అవును.''

''మతితల్లికి మీరు చెప్పిన మాటలు నాకు మిక్కిలి నచ్చినవి. కర్మఫలం అనుభవించి తీరాలి. మా కుటుంబంలో కూడా ఎన్నెన్నో దృష్టాంతాలు చూశాను."

"మానవుడు మాయాబద్ధుడై మోహాబద్ధుడై ఉన్నప్పుడు మృత్యు భయం వలన దుఃఖపడుతూ వుంటాడు. నేను బ్రతకాలి;-నన్ను బ్రతికించండి- అని అతడు దేవులాడుతాడు. మృత్యు భయమే ఘోరమైన విపత్తు.''

''ఈ విషయం నిక్కము. మతితల్లి దృష్టాంతమే చెప్పక చెపుతోంది. 'బాబూ! నాదొక కోరిక వుంది. పెద్ద మనుమని పెళ్లామును చూడాలనే వాంఛ నాలో బలంగా ఉంది' అని ఆమె చెపుతూ వుండేది.''

నవ్వి మహాశయు డిట్లన్నాడు, ''మరల ఆ అమ్మికి రోగం వచ్చినయెడల, క్రొత్తవాంఛను ఏకరువు పెట్టి అది ఈడేరేవరకు బ్రతికించండి అని ప్రార్థిస్తుంది. కాని ఆమె కొడుకు పోవడం దారుణ సంఘటన. వానిది గట్టి శరీరం. వాడు మంచి బలవంతు డయ్యేవాడు. బడిలో చదువుతూ వుండేవాడు. కమ్మరి శాలలో తండ్రికి తోడుపడుతూ వుండేవాడు. ఇంకా ఎన్నెన్నో పనుల్లో చేయూత యిచ్చే వాడు అతగాడికి. వాణ్ణి చూచినపుడు మంగళ కావ్యమందలి బాలకుడు కాలకేతు జ్ఞప్తికి వచ్చేవాడు.''

"అకాల మృత్యువు కంటె హృదయ విదారకమైన విషయం మరొకటి లేదు. మృత్యు వనగా అకాల మృత్యువే! ముసలితనంలో అది అమృతమే!"

''ఈమాట నాకు జ్ఞాపక ముంటుంది. నేను మనస్సులో మిగుల తొట్రుపాటు పడుతున్నాను'' అని ఆస్పత్రి డాక్టరు పలికెను.

''తొట్రుపాటేల? మీ ప్రయత్నంలో ఏలోపమూ ఘటిల్లలేదు. మీరేం చేయగలరు?"

నడుస్తూ, నడుస్తూ ఇద్దరూ ఆస్పత్రిని సమీపించారు. డాక్టరు నౌకరు లోపల నుండి పరుగు పరుగున వచ్చి తలుపు తెరచినాడు. డాక్టరుభార్య వరండాలోకి వచ్చి నిలిచింది. విస్మయంతో వారి వైఖరులు చూస్తూవుంది. ఆస్పత్రి సమీపంలో ప్రత్యేకంగా వున్న నర్సుల క్వార్టర్సు వసారాలో నిలిచివుంది సీత. ఆమె కూడా డాక్టరును చూచింది.

''రండి. లోపలికి రండి. ఎన్నెన్ని పర్యాయాలో ఆస్పత్రికి వచ్చారు. మా యింటికి రాలేదు. కద్రును చూచి వెళ్ళండి. మిమ్మల్ని నేను ఎప్పుడు పిలిచివుండలేదు. కొంచెంసేపు కూర్చోండి." అన్నాడు ప్రద్యోత డాక్టరు జీవన మహాశయు నుద్దేశించి.

చేతులు జోడించి ''డాక్టరు బాబూ! నేటికి మన్నించండి. మరొకనాడు వస్తాను'' అన్నాడు మహాశయుడు,

"మహాశయా! నాలో లోపా లెన్నో వుండి వుంటాయి. నేనేం అపరాధం చేసినా యిచ్ఛాపూర్వకంగా చెయ్యలేదు. మీ చికిత్సా పద్ధతికిని, నా చికిత్సా పద్ధతి కిని చాల వ్యత్యాసం వున్నది. నా పద్ధతిని పరిత్యజించి, మీ పద్ధతిని నేను అవలం బించలేను. అట్లు చేసినయెడల నా బ్రతుకు తలక్రిందు లగును. నేను వైద్యం చెయ్యలేక పోతాను ఒకమాట నిజం. మతితల్లి నాడిని మీరు చూచిన విధానము నెరిగి, ఆమె యేడుపు విని నేను కోపించిన విషయం నిజం. ఆ ముసిలిది అప్పుడు చచ్చివుంటే బాగుండేదని ఇప్పుడు నాకు బోధ పడుతోంది. ఆమెకు మేలే జరిగేది. కాని విషయమును నే నా దృష్టితో చూడలేదు'' అని ప్రద్యోతు డన్నాడు. నవ్వి మహాశయుడు ఇట్లన్నాడు: ''విషయం నాకు తెలియును మేము వెనుకటి కాలపు వాళ్లము. మా దృష్టి వేరు. విశేషించి రోగి పరిణత వయస్సులో ఉన్నప్పుడు వ్యాధి కఠినమైన యెడల, రోగియొక్క బాధను నివారించుటకే గట్టి ప్రయత్నం చేస్తాము. మృత్యువుతో హోరాహోరిగా యుద్ధం చేసి రోగిని బ్రతికించాలని ప్రయత్నం చెయ్యము. సూచన వల్లనో లేక స్పష్టంగానో సంగతి చెప్పివేస్తాం. ఈ మట్టి సంసారమునకు బలాదూరని కొందరు ఊర్ధ్వదృష్టి గల వారై ఉంటారు. సాధారణ మనుష్యులకు ఆకాశనీలిమమందేమీ అగపడదు. అట్టి వారికి 'తీర్థయాత్రలు చెయ్యండి. అచటి దేవమందిర శిఖరములపై చూపులు నిలిపి కూర్చోండి' అని చెపుతూ వుంటాము. ఎవరు ఉన్నత మనస్కులో, వృద్ధు లైనను బహుజనులకు ఆశ్రయ మిచ్చువారో, బహుళ కర్మకలాపములందు నిమగ్నులై వుందురో, అట్టి వారిని బ్రతికించుటకై మృత్యువుతో భీషణ సమరము సలుపమా? నే నిట్టి యుద్ధము లెన్నెన్నో చేసినాను.''

"ఈ విషయం గురించి ఇపుడు తర్కించే అవకాశం నాకు లేదు. మా పెద్ద అత్తగారు అస్వస్థురాలై వున్నది. ఆమె వృద్ధురాలు. పోయి చికిత్స చేయాలి."

''ఇది సంసార మందలి వేరొక దిశ. సుఖజీవితములను కడముట్టింప వియ్యడం ఎట్లా?"

''కొన్ని కొన్ని కేసులను మీ చేతిలో పెట్టేందుకు నేను భయపడుతూ వుంటాను. మీ రేమి అంటారో అని అడలుతూ వుంటాను. మీ నాడీ పరీక్షా విధానం అపుడపుడు నా గుండెకు దడ పుట్టిస్తుంది. అహిసర్కారు యింటిలోని పిల్లవాని విషయం ఏ మయింది?''

"అద్భుత రీతిగా మీరు వానిని బ్రతికించారు. అద్భుతమైన చికిత్స చేశారు. ప్రథమనాడీ పరీక్షయందు మృత్యువు నుపలక్షించినాను. నేను మాటి మాటికి వాని నాడిని ఏల పరిశీలించానో యెరుగుదురా? మృత్యువు క్రమక్రమముగా వెనుకకు పోవుట కూడ చూచినాను."

ప్రద్యోత డాక్టరు ఆశ్చర్యాన్వితుడైనాడు.

"ఇక నేను వెళ్ళి వస్తా" అన్నాడు.

"మరొక మాట. అది రాణాపాఠకును గురించిన విషయం." అని నిలిచి ఆతడు పలికినాడు. "డాక్టరుబాబూ! రాణాపాఠక్ బ్రతుకడు. అలా అని ఆత డెరుగును. ఆత డొక అద్భుత వ్యక్తి. చచ్చుటకై ఆతడు భయపడడు. మీ యీనాటి అద్భుత చికిత్స వలన అతడు బ్రతుకగలడేమో! బాగుపడినా తాను బ్రతికిన వారిలో జమ కానని ఆతడంటూ వుంటాడు. స్రుక్కి, స్రుక్కి బ్రతకడం ఎందుకు? అప్పుడు తన్నెవ్వరూ సమీపింపరని ఆత డంటూ వుంటాడు. పిల్లలు అడలుతో పారిపోతారు బ్రతికేందుకై ఇంత తహతహలాడడం ఎందుకు? వ్యాయం చెయ్యడం ఎందుకు? ఏమైనా గాని మీరు వైద్యం చెయ్యండి——అని ఆతడు నన్ను పట్టుకొని వ్రేలాడుతున్నాడు."

ఒక నిట్టూర్పు విడిచి ఆతడు మరల ఇట్లన్నాడు. "నన్ను కూడా అతగాడు చూడడం మానుకొన్నాడు. మందులకూ, మాకులకూ, నీళ్ల వదిలాడు. ఇపుడు దేవస్థానముల ఔషధం సేవిస్తున్నాడు."

రాణాను బ్రతికించ గలిగితే బాగుండు నని అనుకొంటూ మహాశయుడు ఇంటిదెస మరలినాడు. వాని చింతాఝరి ఇట్లు స్రవించింది. "ప్రద్యోతుడు మున్నగు ఆధునిక వైద్యులు వానిని బ్రతికించ గలుగుతారేమో! వీరి చికిత్స చరచర సాగిపోతోంది. కొత్తకొత్త యంత్రాలు పరికరాలు సృష్టి అవుతున్నవి. బీజాణువు తరువాత బీజాణువు వేర్వేరు రీతుల జర్మన్ కనిపెట్టబడుతూ వున్నవి. రోగోత్పత్తిని గురించిన యోచనలలో సమగ్రమైన పరివర్తనము అగపడుతూ వున్నది. క్రిమిజాతి పుట్టు పూర్వోత్తరాలు తేలుతున్నవి. ఆహార విహార నియమ ములు అంతగా కఠినములు కావని తోస్తుంది.

మా శాస్త్రమున గల వృత్తాంతము ప్రత్యేక మయింది. దక్షయజ్ఞములో రుద్రమూర్తి శివుని క్రోధమునుండి జ్వరము సృష్టి అయింది. నానాకారములతో,

నానా ప్రకారములుగా అది విజృంభిస్తూ వున్నది. ఆచార్యులు దాని ప్రకృతిని నిర్ణయ మొనరించి నామకరణ మొనరించిరి. చంద్రునిపై దక్షప్రజాపతి కురి పించిన అభిశాప వృష్టినుండి క్షయ ఉత్పత్తి యైనది. మితిమీరిన బ్రతుకువలన కలుగు దోషముచే క్షయ పుడుతుందట. భోజన లోపము క్షయయొక్క ప్రధాన కారణ మని విజ్ఞు లంటున్నారు. ప్రత్యేక జ్వరకారణమును ప్రత్యేక రీతిగా పరి శీలిస్తూ హేతువును ప్రత్యక్షం చేసుకొంటున్నారు. ఎన్నెన్ని క్రొత్త జ్వరాలో అగపడుతున్నవి. ఇపుడు కాలాజార్ అంటూ ఒక రీతి భయంకర జ్వరం చెల రేగుతోంది. దానిని ఎదుర్కొనేందుకు ఇంజెక్షనులు సిద్ధమైనవి. 'ప్రంట్‌సిల్'. 'సైఫాగ్రుప్' 'పెన్సిలిన్', 'టెర్రామయ్‌సిన్' లు కనిపెట్టబడినవి. వీటి తరువాత ఎన్నెన్ని ఔషధాలో, ఎన్నెన్ని ఇంజెక్షనులో వైద్యరంగస్థలమున అగపడుతున్నవి. అల్ట్రా వైలట్ ద్వారా చికిత్స జరుగుతోంది. హరేన్ ప్రభృతులు ఇంకా ఎన్నెన్నో నూతన విషయాలో చెపుతూ వుంటారు. రక్తము, మూత్రము, ఉచ్ఛిష్టము, చరము బ్లడ్ ప్రెషర్, ఎక్సురే పరీక్షలు జరుగుతున్నవి. క్షయ వలన పీడింపబడే శ్వాసయంత్రము కన్నుల కగపడుతూ వున్నది. టి.బి.ని ఎదుర్కొన డంలో స్ట్రెప్టొమైసిన్ ఎంతో పని చేస్తోంది. ఇదికాక పి.ఎ.ఎస్. ఒకటి బయలు దేరింది. రెండింటిని ఒకేపర్యాయం ప్రయోగిస్తే ఆశ్చర్యకరమైన ఫలము అగ పడుతుందట! ఇవి గాక శస్త్రచికిత్స అత్యద్భుతంగా నడుస్తూ వుంది.

ఆకస్మికముగ తొల్లింటి ఉదంత మొకటి ఆ మహాశయుని మనసున తట్టినది.

గురు రంగలాల్ వద్దకు కలరావ్యాధికై ప్రిస్కిప్షన్ కొరకు ఆత డొక పర్యాయం పోయి వుండెను. మృత్యువు వలన భయకంపితులైన వారి విషయమును గురించి వారు ప్రసంగించుకొనిరి. మృత్యుకాంత ఉన్మాదిని వలె విరబోసికొనిన తలవెంట్రుకలతో భయంకర రూపముతో చేతులు చాపి, ఇందందు నడయాడు చున్నది. మానవులు పారిపోవుచున్నారు; దహింప బడుతూవున్న వనమందలి పక్షుల వలె దిగంతముల జ్ఞాన మెరుగక వారు పరుగెత్తుతున్నారు.

రంగలాల్ డాక్టరిట్లన్నాడు. "హాహాకారములు సలుపుతూ వారు పరుగు లెత్తుట మాత్రం నీకు గోచరిస్తున్నది. వారు తమలో తాము పోరు సలుపుకొను చున్నారు. యుద్ధక్షేత్రమం దెవ్వరును వెనుకకు మళ్ళరు. వెనుకనుండి ముందుకు

త్రోసికొనుచు, ఉరుకు లెత్తుచు ముందుకు చెలరేగుచున్నారు. క్రొత్త క్రొత్త అస్త్రములు సృష్టి అగుచున్నవి. ఈ యత్నమున విరామము లేదు.''

''మృత్యు వెట్టిదో గ్రహించుట సాధ్యం కాదు. మృత్యువు పిలిచియే యుండును. పరిణత వయసున యోగివలె మానవుడు దేహత్యాగ మొనరించును. ఒక్కొక్క రోగి చికిత్సకుని కడకు పోయి 'బాబూ! నే నీ బాధపడ లేను. నాకు నిద్ర వచ్చునట్లు చెయ్యండి. పుట్ మీ టు స్లీప్ ప్లీజ్' అని ప్రార్థిస్తారు.''

ఆనాడు జీవనమహాశయుడు తనలో తా నిట్లనుకొనెను. అది నిద్ర కాదు, మహా నిద్ర!

# ముప్పది యారవ ప్రకరణము

మాసము గడచిపోయినది. వైశాఖ మాసపు తుదివారము. తలవని తలంపుగా హఠాత్తుగా వార్త వచ్చింది.

రాణాపాఠక్ మరణించాడు.

వార్త తెచ్చినవాడు కిశోరుడు. పాఠక్ కడకు అతడు పోయినాడు. రాణాయే వారికి కబురు చేసి నాడు. నవగ్రామ మందలి బెస్తలు చేపలు పట్టేందుకు నదికి వెళ్ళిరి. వారిలో ఒకనికి పాఠక్ యిట్లు చెప్పినాడు: "కిశోరు బాబును ఒక పర్యాయం నేను రమ్మని చెప్పినట్లు చెప్పు బాబూ! ఒకటి రెండు రోజులలో నేను వెళ్ళిపోతాను. తెలిసిందా?"

తన జీవిత మందలి కడపటి దినములలో రాణా తన గ్రామమును పరిత్యజించి, నదీ ఘట్టమందొక కుండమును నిర్మించుకొని, ఆ ప్రాంతమందే నివసిస్తున్నాడు. నదీ ఘట్టములును, నదీ తీరప్రాంతమును ఆతని ఇజారా పాటలో ఉన్నవి. నదీ తీరము అతనికి విశేష ప్రీతిని కలిగించు స్థలము. నదియందును, నదీ తీరమందును, ఆతడు మహోల్లాసముతో తన జీవితము గడపినాడు. నదీ గర్భమున లంఘించి ఎంతో ఉత్సాహముతో అతడు ఈదేవాడు. రాత్రులందు నదీ ఘట్టములందు సుఖముగ కాలక్షేపం చేస్తూ వుండేవాడు. లేక నావపై కూర్చుని, నారీ సహితముగ, ఆట పాటలలో తేలుచు, వివిధ రీతుల రుచ్యపదార్థములను మెక్కుచు, మద్యపానము చేయుచు, శృంగార వీధులందు సంచరించేవాడు. మరి కొన్ని వేళలందు కంఠ మెత్తి కాళీ సంకీర్తనము సలుపుచుండువాడు!

ఇప్పుడు, కొన వూపిరితో ఉన్న ఈ రోజులలో, సన్యాసియై పోయినాడు. సన్యాసివలె నదీ తీరమున కాలక్షేపము చేయ సాగినాడు. కాషాయ వస్త్రమును ధరించినాడు. మీసములను, గడ్డమును పెంచినాడు. మిగుల నిష్ఠాపరుడై మెలగ సాగినాడు. దేవస్థానమునుండి వచ్చిన విభూతి దాల్చి, ప్రసాదమును స్వీకరించి, అందలి ఔషధమునే దివ్యౌషధముగా గణించువాడు.

ఆతని విశ్వాసము అద్భుత మైనది. ఆవంతైనను అది చలింపలేదు. "ఇది నా కర్మ. ఈ విధంగా నా బ్రతుకు తెల్లవారవలెనని విధి నా తలపై వ్రాసినాడు. వేరుతీరుగ అది నడచునా!" అని ఆతడు తుదిమాట లుచ్చరించినాడు.

కిశోరుడు ఆతని దాపల చేరినప్పుడు ఆతడు తుది స్థితిలో ఉండెను. ఆరు గంటల వేళ అయినది. డాక్టరును, కవిరాజును పిలుస్తానని కిశోరుడు రాజాతో చెప్పినాడు. "కిశోర్ బాబూ! వారిని నీవు పిలువవలెననే ఉద్దేశంతో నిన్ను రప్పించలేదు. ఎందుకు పిలిచానో విను. ఈ వేళే నా ప్రాణాలు పోతవి. ఒక వేళ నేడు నిలిచినను, రేపు నిలువవు. రాత్రివేళ నా మంచము కడ ఒకడు ఉండవలెను. నీరు కావలసివస్తే కొంచెం గొంతుకులో పోయాలి. నక్కలు వస్తే దూరంగా కొట్టి వేయాలి. నదీ తీరమందలి శవాలను మెక్కేందుకు అరుస్తూ నక్కలు వస్తాయి. హింసతో అవి బ్రతుకుతున్నవి. గడచిన రెండు మూడు రాత్రులనుండి అవి నన్ను చుట్టుముట్టి చెలరేగుతున్నాయి. ఒక్కొక్కప్పుడు మంచముపైకి ఉరుకుతున్నవి. కేకలు వేసి తరిమి వేస్తున్నాను. ఈ వేళ ఆ పని నాకు సాధ్యం కాదు. అంతే గాక...." అని ఆతడేమో చెప్పబోయినాడు.

ఏమో చెప్పబోతూ ఆత డించుక నవ్వినాడు. మరల ఇలా పలికినాడు. "చచ్చేందుకు ముందు ఎన్నెన్ని పోకిళ్లో వస్తాయి. రాజాకు భయ మయితే లేదు. సత్తువ వుంటే సవాల్ చేసేవాణ్ణి. ఎంతటి మొనగాడితోనైనా, ఒకచేతితో యుద్ధం చేస్తాను నీతో! అని హుంకరించేవాణ్ణి. ఆ సత్తువ సంపూర్ణంగా సన్నగిలి పోయింది. ఈ సమయంలో కొందరు కొందరు వ్యక్తులను పేర్కొంటున్నాను. ఒకడు నా శయ్యవెంత ఉండాలి. చచ్చిన తర్వాత దేహమునకు సంస్కారము చేసేవాడు కావాలి క్షయరోగంతో చచ్చిన వాని శరీరమును గ్రామస్థు లెవ్వరూ అంటరు. అందుచే శవదహనమునకై వలసిన వ్యవస్థ నీవే చేయాలి. ఇక యీ సమయంలో గణింప దగినవారు. తలిదండ్రులు, ఇల్లాలూ, వగైరా వారు నాకు లేనే లేరని చెప్పాలి. అయినా దగ్గర వారు సుతరామూ చెప్పలేను. తల్లిలేని కొడుకొక డున్నాడు. నీకు శక్తి వుంటే వాణ్ణి చూడు. ఆ చుట్టాలను చూడు. జీవనమహాశయుడు నాకు వైద్యం చేశాడు. అందుచే నే నాయనకు ఋణపడి వున్నాను. తీర్చకుండా పోతున్నాను. తీరినట్లుగా ఎంచి క్షమింపుమని నేను వేడుకొన్నట్లు ఆయనతో చెప్పు. ఇంతే. ఇంకేం చెప్పగలను?—" అంటూ రాజా పాఠక్ ప్రాణములు వదలినాడు.

ఈ మరణ వార్తను జీవనమహాశయుడు వినయుని అంగడిలో కూర్చుండి నపుడు విన్నాడు. విని స్తబ్ధుడై చతికిలపడి పోయినాడు. రెండు కన్నీటి బిందువులు రాలి చెక్కిళ్ళపై పడినవి. శివుని జడలందు గంగ పడినట్లు దీర్ఘంగా పెరిగిన వాని గడ్డమందు అశ్రుబిందువులు పడినవి. చాల సేపైన పిదప ఆతడు గోవిందా! గోవిందా! అనుకొన్నాడు. "జయగోవిందా!" అని అరుస్తూ అపుడెవరో అచట ప్రవేశించారు.

స్వరమును బట్టి వైష్ణవభిక్షుకురాలు మరి వచ్చినదని మహాశయుడు గుర్తించాడు. ఆమె తరచుగా ప్రాతఃకాలమందు వస్తూ వుంటుంది. భిక్షాటనమునకై బయలుదేరి అభయ యిచ్చే ప్రసాదమును మహాశయున కిచ్చి పోతూ వుంటుంది. ఏమయింది? అభయ మరల అస్వస్థురాలైనదా? రాణా పాఠకునకు దహనక్రియలు జరిపి, ఆయాసపడి వచ్చి ఎదుట ఉన్న పడక కుర్చీలో మేను చేర్చి కిశోరుడు నిద్ర పోతున్నాడు. చతికిలపడివున్న మహాశయుడు తన నాడిని తాను పరీక్షించుకొనుచుండెను. అది అభ్యాస క్రియయై పోయినది. భిక్షుకురాలి కంఠస్వరము అని ఆతడు నాడిని పీడి —

"ఎవరు ? మరియా ?" అని పలుకరించాడు.

"బాబా! ప్రణామము."

"వేళకాని వేళలో వచ్చావు."

"నే నింటికి తిరిగిపోతూ వచ్చానండి." తన జోలినుండి ఐదు మామిడి పండ్లు తీసి మహాశయుని పాదముల పొంత ఉంచింది.

"అమ్మవారి పెరట్లోని మామిడి చెట్టున మొదట ముగ్గిన పళ్లివి. అభయమ్మ గారు వీటిని మీకు మొదలు కోసిమ్మని చెప్పింది. సమీపంలో గోపీనాథపురంలో కల్యాణోత్సవం జరిగింది. వైష్ణవసేవ చేసి, వంట మొదలైన పనులందు తోడు పడి చేతులు పవిత్రం చేసుకొని వచ్చానండి. అటువంటి చేతులతో పళ్లు తెచ్చాను. పుచ్చుకోండి."

ఆమె మాటలు మధురములై, ఆనంద గర్భితములై వున్నవి. మహాశయుడెంతో సంతృప్తి చెందినాడు.

"సాయంకాలం మీ రిక్కడ ఉంటారని తెలిసి యిక్కడకు వచ్చానండి.

పళ్లు సామాన్యమైన మామిడిపళ్లే. శ్రద్ధా భక్తులవలన కృతజ్ఞతాదరముల వలన అవి అమృతఫలము లైనవి. ముహూర్తమునకు మున్ను వైరాగ్య బంధురమై, ఉదాసీనమై యుండిన పృథ్వి గాఢమమతాసంస్పర్శవలన కోమలమై పోయినది.

"మీతో చెప్పుమని అభయమ్మ మరొకమాట చెప్పిందండి."

"అదేమిః"

"ఈ జ్యేష్ఠ మాసంలో చతుర్దశినాడు సావిత్రీవ్రతం జరుగుతుందని. ఆనాడు మీరు వచ్చి ప్రసాదం స్వీకరించి, ఆశీర్వదించి పోవాలని ఆమె ప్రార్థించింది."

ఆనాటిమాట మహాశయుని జ్ఞప్తికి వచ్చింది. శశాంకుని మృతి నిశ్చయ మని తెలిసినపిదప ఆతడు అభయను పిలిచి, విందారగింప జేయాలని ఊహించాడు. సందుముందు దీపమును చేత బుచ్చుకొని అభయ నిలిచిన దృశ్యము ఇంకను కళ్లకు కట్టినట్లున్నది. దీపముయొక్క వెలుతురు ఆమె సింధూరపు తిలకముపై పడినది. ఆమె ప్రతిబింబము కన్ను లందింకను విద్యమానమై ఉన్నది. విషయ మును తలచుకొని ఆత డులికిపడినాడు. కన్నులు మూసికొనినాడు.

ఒకపెద్ద నిట్టూర్పు విడిచి "సావిత్రీ చతుర్దశినాడు నాచే ఆమె విందార గింప చేస్తుందాః మరీ ఈ ముసలితనంలో నే నచ్చటికి పోలేను." అని మహాశయు డన్నాడు.

"బాబా మహాశయాః అలా అని అభయమ్మతో నేను చెప్పేనండి"—

"అవును. ఆ సంగతి నాకు తెలుసును. అయినా పెద్దవాడు వచ్చి ఆ సమయంలో నన్నాశీర్వదించి పోవాలని నే నెంతో మక్కువ పడుతున్నాను. పోయి చెప్పిచూడు- అని ఆమె నన్ను పంపిందండి. మరొకమాట కూడా చెప్పిందండి."

"చెప్పు"

"మంచి కూరగాయలు కావాలిటండి.."

"మంచిది; పంపుతాను."

"మామిడిపళ్లు తినండి."

"ఇందిరను వెంటబెట్టుకొని సావిత్రీవ్రతం నాడు వస్తానని అభయమ్మతో చెప్పు."

సంకోచము లన్నీ సమసి పోయినవి. యావత్తు తిక్తత ప్రక్షాళింపబడి నది. పృధ్వి మాధుర్యప్లావితమై పోయింది. మహాశయు డచటికి పోవుటకు నిశ్చయించినాడు.

మనసునందు రాగశైవలిని మధుర కలస్వనముతో ప్రవహించుచున్నది. అది నామసంకీర్తన ప్రతిధ్వని. రాత్రి చాలవరకు గడచి పోయినది. నవగ్రామ మండలి విపణి మార్గంలోని దీపములు మెల్లమెల్లగా కాంతిని కోల్పోవుచున్నవి. లాంతరులందు మసి గడ్డ కడుతూ వుంది. కొన్ని కొన్ని దీపప్రదీప్తులు రెండుగా చీలి భగ్గు మనుచున్నవి. పెట్రోమాస్కులైట్లు కూడా ఆరిపోతున్నవి.

దుకాణమందలి గల్లాపెట్టి తాళం చెవులు ప్రక్కన పడి వున్నవి. త్రాళ్ళతో కట్టబడిన పెద్ద చిట్టాపుస్తకాలు వానిపై చిందర వందరగా పడినవి. కొందరు ధూపము వేస్తున్నారు. మరికొందరు అంగళ్లు మూసివేస్తున్నారు.

ధ్వజదత్తు దుకాణము మిగుల పెద్దది. యజమాని నోట్ల కట్టలోని నోట్లు తీసి లెక్కపెడుతున్నాడు. సమీపములో ఎడ్లబండ్లు కొన్ని నిలిచి వున్నవి. అరుగుల మీద కూర్చుని మిత్రబృందం కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఒక వైపున ఉన్న పెంకుల వరాండాలో చారు బాబు, ప్రద్యోతులు కూర్చుని వుండిరి. వా రున్న లోగిలి కోఆపరేటివ్ మెడికల్ స్టోర్సు. అందు సామగ్రి చక్కగ అమర్చబడి వున్నది.

ప్రద్యోతడాక్టరు ఎపుడు తిరిగి వచ్చినాడు?

మతి కొడుకు మరణించిన పిదప ప్రద్యోతుడు హఠాత్తుగా సెలవు పుచ్చుకొని భార్యతో కలసి కలకత్తా పోయినాడు. మతి కొడుకు చావు అతని మనస్సును పూర్తిగా కలచి వేసిందని ప్రజలు చెప్పుకొన సాగిరి. "లజ్జ వలన ఇందుండి బదిలీ చేయించుకొనేందుకు అతడు కలకత్తా పోయినాడు." అని వారు ఒకరితో ఒకరు చెప్పుకొంటున్నారు. సీత వేరుతీరుగా ప్రసంగించింది. "వారు ఇచ్చటి క్లినిక్ కొరకై కలకత్తా పోయినారు. బిపిన్ బాబు అయిదువేల రూకల విరాళ మిచ్చినాడు. ఆ పైకమును గవర్నమెంటు చేతిలో పెట్టి మరింత మొత్తమును శాంక్షన్ చేయించి, జరుగవలసిన కర్తవ్యమును చప్పున జరిగేందుకు అతడు నగర

మునకు పోయినాడు. కలకత్తాలో అసెంబ్లీలో ఎవరైనా పలుకుబడి గల మెంబరును పట్టుకొని అయన ద్వారా ఛీఫ్ మినిష్టరు డాక్టరు రాయ్‌ని సందర్శిస్తారు. చేతిలో ఉన్న పైకముతో ఎంత సామగ్రిని కొనడం సాధ్యమో దానిని కొని తెస్తానని ఆతడు చెప్పి పోయినాడు.''

సీత తన కథనము నింకను ఇట్లు సాగించింది. మహాశయునితో ఇట్లు చెప్పినది. "ప్రద్యోత డాక్టరు ఒక వింత మనిషి. మీతో అతడు చక్కగా మాట్లాడును. అవి ముఖ ప్రీతి వాక్యములు. అంతరంగమున మిమ్ము ఆతడు ద్వేషిస్తూ వుంటాడు."

"అటులనా? నీవు పొరబడుతున్నావు.''

"ఆ పెద్దమనిషిని మీరు అంతగా ఎరుగరు. మిమ్మల్ని నేను 'దాదూ!' అని పిలుస్తూ వుంటానని, తరచుగా మీ దగ్గరకు వస్తానని ఆతడు మండిపడుతూ వుంటాడు."

ఆ మాటలు విని మహాశయుడు బాధపడినాడు.

సీత సాధారణ బాలిక. కృతజ్ఞతగల బాలిక. మామూలు నర్సు. ఆమె శిశువై వుండగా ఆమెను రక్షించిన సంగతి మహాశయుడు మరచినాడు. అది పందొమ్మిదివందల యిరువది మూడవ సంవత్సర మని ఆమెయే జ్ఞాపకం చేసింది. తన దృష్టిలో ఆమె ముక్కు పచ్చలారని పిల్లయే. ఆమె మాటల కంతగా విలువ నివ్వనేల అని మహాశయుడు ఊరుకొన్నాడు.

అచటి సబ్ రిజిస్ట్రారు ఆఫీసులో రామలోచనుడను వ్యక్తి హెడ్‌క్లర్క్‌గా పని చేస్తున్నాడు. ఆతని కొక కూతురు కలదు. ఆమె వితంతువు. ఆమె కొక శిశువు కలదు. భార్యను, వీరిని వెంటబెట్టుకొని రామలోచనుడు ఎనిమిది నెలల నుండి ఇచట కాపుర మున్నాడు. కూతురు తీవ్రమైన మలేరియా వ్యాధి పీడితయైనది. నిరాశ చేసి కొన్నది. కాని మహాశయు డామెను బ్రతికించినాడు. తన వైద్య జీవితంలో ఆతడు గణించుకొనదగిన విషయములలో అది ఒకటి.

అనంతరము చారు బాబు ప్రద్యోతులు మహాశయుని చూచుటకు వచ్చిరి. వృత్తి నిర్వహణములో తా నేదేని దోషము చేయుట వలన, తనపై తీవ్రమైన నేరము మోపుటకై వారు వచ్చినారని మహాశయుడు తలచినాడు.

"ప్రద్యోత డాక్టరు భార్యకు జ్వరం వచ్చింది. ఆమెను మీ రొక పర్యాయం చూడాలి" అన్నాడు చారు బాబు.

"ప్రద్యోత డాక్టరు భార్యకు జ్వరమా? నేను వచ్చి చూడాలా?" అని ఆశ్చర్యముతో మహాశయు డన్నాడు.

"అవును. ఆమె కలకత్తాకు వెళ్ళి జ్వరంతో తిరిగి వచ్చింది. టైఫాయిడ్ లక్షణములు అగపడుతున్నవి. రక్తపరీక్ష చేయవలసి వుంటుంది. మీరు వచ్చి ఒక పర్యాయం ఆమె నాడిని చూడండి. టైఫాయిడే అయితే అది మిగుల విరుల్యెంట్ టైఫాయిడ్."

"మీ డయాగ్నసిస్ అద్భుత మైనది. ఆ జ్వరం టైఫాయిడ్ అవునో కాదో చెప్పండి" అన్నాడు ప్రద్యోతుడు.

"చూస్తా."

ఆమె లావణ్యవతి. జరోత్తాపము వలన ఆమె ముఖమున ఇంచుక రక్తాభ గోచరిస్తున్నది. అది మిగుల భారముగా ఉన్నట్లు తోస్తోంది. కన్నులు మూసికొని పరుండి యున్నది. ఇంటినిండ ఫినాయిల్ చల్లబడింది. సాంబ్రాణి పొగ వేయబడింది. వివిధ రీతుల మందులు చల్ల బడినవి. వీటి వలన కలిగిన మిశ్రిత గంధము గుప్పుమంటూ వున్నది. ఆమె తలవద్ద కూర్చుని వున్నది నర్సు సీత.

మహాశయుడు ఆమె నాడిని పరీక్షించినాడు. సుమారు నూటమూడు డిగ్రీల జ్వరం ఉంటుందని ఊహించాడు. రమారమి నూటనాలుగు డిగ్రీల వరకు ఉండి యుండును. సీత ఆమె ముఖమును చేరి చూస్తూ వున్నది.

ఆమె తలపై ఇంచుక వ్రాలి ప్రద్యోత డాక్టరు "మంజు" అని మృదు స్వరమున పిలిచినాడు.

ఆమె కనుబొమ్మ లెత్తి "ఊ" అన్నది.

"నిన్ను చూచేందుకై జీవనమహాశయుడు వచ్చినారు."

ఆమె కళ్లు తెరచి, యిటు అటు చూచి మరల కళ్లు మూసికొన్నది.

"నాలుక చాపు" అన్నాడు ప్రద్యోతుడు.

ఆమె అట్లే చేసినది.

"థర్మామీటర్ తీసుకొనిరా" అని చారు బాబు సీతతో చెప్పినాడు.

"దానిని అలా వుంచండి. ఇంతకు ముందు జ్వరం యెంత వుంది?" ప్రద్యోత డాక్టరు ఒక నోటు బుక్కు తెచ్చి చూపినాడు. నూటమూడు పాయంట్లు

నాలుగు. మహాశయుడు ఇంటినుండి కదిలి వచ్చులోపల అర డిగ్రీ ఎక్కు-వయింది.

ప్రద్యోతుడు, "టైఫాయిడ్ అంటారా?" అని అడిగినాడు.

"ఈ వేళ సరిగా చెప్పలేక పోతున్నాను. నా మనస్సులో ఏదో గగ్గోలు పుట్టింది. రేపు వుదయం వచ్చి చెపుతాను" అన్నాడు మహాశయుడు.

"క్లోరో మైసిన్ యియ్యాలని అనుకొంటున్నాను. మొదటి వారంలో జ్వర మెంత వుంది సీతా?" అని ప్రద్యోతుడు నర్సు నడిగినాడు.

థర్మామీటర్ తెచ్చి డాక్టరు చేతిలో వుంచి సీత అందుండి తరలిపోయినది.

"నేడు జ్వరము హెచ్చదు. రేపు ఉదయం వస్తాను." అని "నేను క్లోరో మైసెటిన్ తెచ్చినాను. ఈ వేళ యిస్తే—"

"ఈ వేళ కాదు. రేపు. రేపు ఉదయం ఈ రోగము ఎనిమిది గంటల్లో హెచ్చుతూ వుంటుంది. తగ్గుతూ వుంటుంది. ఇప్పుడేం చెప్పగలం?" ప్రద్యోతుని చూచి "మీ మనస్సు బాగా తొట్రుపడిపోయింది. కేసును మీరు చేత బట్టడం మంచిది కాదు." అన్నాడు మహాశయుడు.

"నాకు తొట్రుపాటు ఏమీ లేదు. ఈమెకు వైద్యం నేను చెయ్యడం లేదు. చారు బాబు చికిత్స చేస్తున్నారు."

* * *

మర్నాడు ప్రాతఃకాలమున జీవనమహాశయుడు నాడి చేబూని చాల సేపు ధ్యానమగ్నుడై యుండెను. ఉదయము. ప్రసన్న సూర్యాలోకము ఆగారమును కాంతిల్ల జేసెను. కవాటమును, గవాక్షములను తెరిచిరి. జర్మ్సును చంపే లోషను గదియందు విరివిగా చల్లబడింది.

ఒకమూల సాంబ్రాణివత్తి వెలుగుతూవుంది. పరుపును పరిశుభ్రమైన దుప్పటితో కప్పిరి. శయ్య సమీపంలో టీ పాయ్‌పై మందుల సీసాలున్నవి. ఫీడింగ్ కప్పు ఉంది. కొన్ని కమలాఫలము లున్నవి. టెంపరేచర్ చార్టు ఉన్నది. అనుకొన్నరీతిగా రోగిస్థితి మేలుగా అగపడుతున్నది. జ్వరం తగ్గింది. పెదవులు రెండును ఎండివున్నవి, కన్నులు మూతలు పడియే వున్నవి. మధ్య మధ్య అవి తెరువబడుతున్నవి. మరల రెప్పలు మూతలు పడుతున్నవి. కపాలము మీది రక్తాభ శుష్కించింది. పరిపూర్ణాలోక ప్రసన్నత, వైశాఖ ప్రభాత స్నిగ్ధత రోగికి ఉత్సాహము కలిగించునట్లు తోచుటలేదు.

నాడీగతి పరిశీలించి మహాశయుడు స్పష్టముగా ఇట్లు పలికినాడు.

మందం. మందం. శిథిలం. వ్యాకులం.

మందంగా నడుస్తూ వుంది. అందు ఆకులత కలదు. వ్యాకుల జీవన స్పందనము ఏదో ఆశ్రయమును అన్వేషిస్తున్నది. సన్నిపాత జ్వర లక్షణములు స్పష్టంగా అగపడుతున్నవి త్రిదోష ప్రకోపము తీవ్రముగా ఉన్నది. ఏదో అతనికి బోధపడింది. కాని దానిని చెప్పటకు సంకోచించినాడు. మహాశయుడు ఆస్పత్రి డాక్టరును తేరి చూచినాడు. అతని ముఖమును డాక్టరు అట్లే చూచినాడు. జాగ్రత్తగా నాడి వీడి మహాశయుడు వెలుపలకు పోయినాడు. సబ్బూ, తువాలూ చేతబుచ్చుకొని నౌక రక్కడ నిలబడివున్నాడు. చేతులు కడుగుకొని, తుడుచు కుంటూ మహాశయుడు "రోగము టైఫాయిడ్. నిస్సందేహంగా టైఫాయిడ్‌కు వైద్యం జరగాలి" అన్నాడు.

ఆస్పత్రి డాక్ట రిట్లు అన్నాడు. "అట్లని నేనూ అనుమానించాను. కాని మందుకు ఆ నమ్మకం కలుగలేదు. మేము టైఫాయిడ్ ట్రీట్‌మెంటుకు తగిన వ్యవస్థ సిద్ధంగా వుంచుకుంటాం. నాలుగు నెలల క్రితము ఆమె కలకత్తా వెళ్లింది. మాసం రోజులు ఆమె అక్కడే వున్నది. ఆ సమయంలో క్రొత్తగా తలయెత్తిన ఇనాక్యులేషన్ వేళ గడచి పోయింది. 'కలకత్తాలో వున్నావు. తప్పక టి.ఎ.బి తీసుకో' అని నే నామెకు వ్రాశాను. తీసుకొన్నానని ఆమె వ్రాసింది. ఆ మాటను నేను నమ్మినాను. ఇక్కడకు వచ్చిన తరువాత 'వేక్సిన్ తీసుకొన్నావా ?' అని ఆమె నడిగినాను. తీసుకొన్నా నన్నది. ఈ పర్యాయం జ్వరం వచ్చిన నాటినుండి అదే ప్రశ్న వేస్తూవచ్చాను. తీసుకొన్నానని ఆమె చెపుతూనే వుంది. లేదని నేటి వుదయం నిజం చెప్పి వేసింది. టైఫాయిడ్ అని మహాశయుడు చెప్పినాడంటిని. అప్పుడు నిజం తేలింది. జరిగినదేమో జరిగిపోయింది. ఈ పర్యాయం తప్పకుండ క్లోరోమైసిన్ యిస్తాను. చారుబాబు, హరేన్ బాబులు వస్తున్నారు. వారు వచ్చిన తరువాత విషయం అడిగి చూస్తాను."

అప్పుడు సీత అక్కడికి వచ్చింది. స్నానం చేసి సంజీవితయై వచ్చింది. ఆమె నేడు మిగుల ప్రసన్నయై ఉన్నది. ప్రద్యోత డాక్టరు మాటలు నిక్కంపు రోగమును అంగీకరిస్తూ తెలిపినమాటలు ఆమెకు ఉల్లాసము కలిగించినవి. చారు బాబు వచ్చినాడు. మహాశయుని చూచి అత డిట్లన్నాడు; "ప్రద్యోత బాబూ;

టైఫాయిడని మహాశయుడు చెప్పినాడుగదా, క్లోరోమైసిన్ యివ్వవచ్చు: నిస్సం దేహంగా యివ్వవచ్చు.''

క్లోరోమైసిన్ నూతన యుగమున ఆవిష్కరింపబడింది. అద్భుతమైన ఔషధము.

దుస్సాధ్యమైన టైఫాయిడ్, కేవలం మృత్యువునకు సహచరి యైన సన్ని పాత జ్వరమూ దాని వలన నిరోధింపబడుతూ వుంటవి. గిరి శిఖరమునుండి మిగుల తీవ్రముగ ప్రవహించు జలధారవలె అది పటువేగముతో విజృంభిస్తుంది. అట్టి వేగమును మరలించడం కష్టం. దానిని నిరోధించడం అసాధ్యం. తీవ్ర వేగముతో ప్రవహించి, తనంత తాను మందగతి నందును. అపుడు తీవ్రమైన వడి తగ్గిపోవును. జ్వరగతి సమసి పోకమున్ను జీవనము నిలిచి ఉన్నయెడల, రోగి దక్కును. నదీగతి సమసిపోయినను, అది మిగుల తీవ్రమై యుండును. నదీగర్భ మందలి మృత్తిక కూడ కొట్టుకొని పోయినట్లు శుష్కించి పోవును. శీర్ణ ఊషర భూమి ఖండమువలె ఉండునని అనవచ్చును.

వ్రజలాల్‌బాబు దౌహిత్రునకు టైఫాయిడ్ వచ్చినప్పుడు వేరురీతి ఔషధము ప్రయోగించబడింది. నూతనముగ ఆవిష్కరింపబడిన ఔషధ మిపుడు ప్రయో గింపబడుతూ వుంది.

అప్పుడు స్టేషనునుండి ఏదో బండి వచ్చింది. ఇరువురు స్త్రీలు బండినుండి దిగిరి. ఇరువురు వితంతువులే. వారిలో ఒకామె మిగుల వృద్ధురాలు. డాక్టరు ముందుకు వెళ్లి ''అమ్మా!'' అని పలుకరించినాడు.

''నాయనా! మంజు ఎలా వుంది?''

''బాగులేదు. కాని—ఈమెను ఎందుకు తీసికొనివచ్చావు?''

''ఎక్కడ విడుతును? నన్నీమె విడువకుండా ఉంది.''

''ఈమెను ఎచట ఉంతుము? ఏమి చేతుము?''

''ఒకప్రక్క పడివుంటుంది. ఇక మరి అల్లరి చేయదు. ఊరకనే ఉండును.''

''రండి.''

జీవనమహాశయుని దెస చూచి డాక్టరిట్లన్నాడు;

"డాక్టరుబాబూ! కూర్చోండి. వెళ్లకండి. నే నిపుడే వస్తాను. ఈమె మా పెద్ద అత్తగారు. ఇంటిలోని అవస్థకు ఈ అవస్థ తోడైనది. గోరుచుట్టుపై రోకటి పోటు."

జీవనమహాశయుడు కూర్చుండెను.

వైశాఖ మాసపు ఆకాశము. కడచిననాటి అపరాహ్ణమున సామాన్యమైన గాలివాన కురిసింది. వియత్తలము నేడు ధూళిమాలిన్యము కాదు. నక్షత్రమాల నేడు చక్కగ కాంతిల్లుచున్నది. అట్టి వింటి దిక్కుగా చూడ్కులు నిగిడిస్తూ కూర్చుని ఉన్నాడు జీవనమహాశయుడు. మనస్సు ఆ సమయంలో దేనిమీదను నిలువదు. ఇందందు చిందులు త్రొక్కుతూ ఉంటుంది. ఏమిచేసిన ఏమగునో అను సంశయము మనస్సును పీడిస్తూ వుంటుంది. వేయి ప్రశ్నలు మనసులో తల సూపును. ఎచట ఏమయింది? ఏమి లోపము ఘటిల్లినది. జీవితమున ఏదో గగ్గోలు పుట్టునేమో? ఎందును పలాయన మొనరించుట సాధ్యము కాదు. కాని తీవ్ర పరిస్థితులు దూరముగ నెట్టించి వేయును. దూరముగ చెలరేగ దొడగినవి—ఈ రీతిగా మహాశయుని ఊహాపరంపర పరస్పర సంబంధ మెరుగక చెలరేగసాగెను.

మంజు ఆరాటముతో "అమ్మా!" అని వాపోయినది. చాలకాలమునుండి చికిత్సను సాగించు మహాశయుడు పెక్కుతూరులు ఈరీతి యాతనానుభూతి నుపలక్షించెను.

"అమ్మా!" అని ఆమె యెవరి నుద్దేశించి సంబోధిస్తోంది? దేని నుద్దేశించి హృదయారాటముతో చేసిన సంబోధన మది? అమృతమయమైన ఆమె స్నిగ్ధ స్పర్శమువలన రోగి శరీర మందలి వ్యాధి జర్జరత సమసిపోవును. ఉత్తాపము ఉపశమించును. అశాంతి అంత మగును. హృదయముపై నిలిచిన భారము తొలగిపోవును. చైతన్యము ఉజ్జ్వలమై వెలయును. ప్రదీపమువలె తేజరిల్లును.

అంతరంగమునందు రోగిణి నుపలక్షించి మహాశయుడు మనశ్శాంతి నందెను.

# ముప్పది యేడవ ప్రకరణము

మర్నాటి ప్రాతఃకాలము.

జీవనమహాశయుడు ఆరోగ్యనికేతనపు ఔషధాగారపు గుమ్మముపొంత నిలిచియుండెను. ఆసుపత్రి డాక్టరు ఇంటికి పోవు సమయమది. ప్రద్యోత డాక్టరు సైకిల్ మీద పోతూ, దాని గమనమును తగ్గించి, చిరునవ్వుతో "మహాశయా! ఈవేళ జ్వరం తొంబది తొమ్మిది లోనికి దిగింది" అన్నాడు.

"ఆహా! అట్లాగా?"

"నైన్‌టీ నైన్ పాయింట్ టూ. ఉదయమునుండి మంజు మాట్లాడుతూ ఉంది. ఆమె మాటలు స్పష్టంగానే వున్నవి. బాగానే వున్నాను అంటోంది —"

"ఈశ్వర కటాక్షము, మీ అద్భుత సాహసము, దృఢత యీ ఫలమును చేకూర్చినవి."

తరుణుడైన డాక్టరు ఈ ప్రశంస కెట్టి ప్రత్యుత్తర మీయలేదు. నిస్సంకోచముగ, స్మితముఖముతో దానిని స్వీకరించి, "మహాశయా! మీనాడీ జ్ఞాన సాహాయ్యము పొందక నే నింతగా సాహసింప లేకపోయే వాణ్ణి. ఇక నేను సెలవు తీసుకొంటాను. సంతోషం పట్టజాలక శుభవార్త చెప్పిపోవాలని చప్పున వచ్చాను." అన్నాడు.

సైకిలు వెనుకకు తిరిగింది. డాక్టరు వేగముగా వెళ్ళిపోయినాడు. ప్రభాత సమీర సంస్పర్శవలన వాని కురులు చలించుచుండెను.

"భగవాన్! మాధవా! గోవిందా! అంతా నీదయ" అంటూ మహాశయుడు తన ఆనందమును వ్యక్తీకరించెను.

పృథ్విలో మిగుల సుఖించువారిలో ఆయువతి ఒకర్తుక. సుఖ సంసారము మానససరస్సు వలె ప్రశాంతినిలయమై యుండెను. ఇటువంటి ఆడుదానిని పత్నిగా పడసినవాడు అదృష్టవంతుడని కిశోరు డన్నాడు.

"కిశోరూ! నీవు పెండ్లాడినావని విన్నాను. నిజమేనా?" అని మహాశయుడు ప్రశ్నించాడు.

"బాబయ్యా! పెళ్లంటే భయం వేసింది!"

"ఎందువలన?"

"పెళ్లి చేసుకుంటే ఒక ఆడుది గుమ్మంలో ప్రవేశిస్తుంది. కాని యేరీతి ఆడుదానికై ఒకడు వివాహ మాడునో ఆరీతి ఆడుది లభిస్తుందని చెప్పలేము. నారియు ప్రకృతియు—ఈ రెండును నిజముగ ఒకటే! రెండు దినములు గడచిన పిదప కాలితో గుండెను తన్ని యీ జంట తమతెన్ను తాము తొక్కును. ఒక్కొక్కప్పుడుతన మస్తకమును తాను ఛేదించుకొని, రక్తస్నానం చేస్తుంది. అంతకు మున్ను పతిని దిగమ్రింగి, వేరొకప్పుడు తన తండ్రి చెంత పతినింద విని, దేహత్యాగ మొనరించును. అపుడపుడు పురుషప్రేమవలన పరితృప్తి నంది, అచంచల చిత్తయై, శాంత గంభీర స్వభావముతో ప్రవర్తించును. ఎవరికిట్టి యిల్లాలు లభిస్తుందో వారికి జగతిలో ఆవశ్యక మైనది మరేదియు ఉండదు. ప్రతిష్ఠ ప్రశంసల సామ్రాజ్యమున పతి పట్టభద్రుడై ఉండును. కాని, యిట్టి అదృష్ట మెవ్వరికిని లభించదు. అందువలన అడలుపాటు వలన వెనుకంజ వేశాను."

"నారి నదివలె చరచర సాగిపోవును. పురుషుడు తీరము వలె చేతులు చాపి సాగరము చేరువరకు సాగిపోయినను, దానిని పడయనేరడు. ఆంతరంగికముగ కలిసిరేని, వారి జీవనము మానససరస్సుకు సహపాఠి యగును."

"కిశోరూ! నీమాటలు యథార్థములు" అని పెక్కుతూరులు మహాశయుడుచ్చరించినాడు.

ఆనాడు ఆస్పత్రి డాక్టరు యింటివసారాలో నిలిచి, సంధ్యాసమయంలో మరికొన్ని పర్యాయము లీ ఊహల నాతడు మనన మొనరించుకొన్నాడు.

సీత మందహాసముతో డాక్టరు పత్నిముఖమును తుడిచి "అమ్మా! తేరుకొన్నావు" అన్నది.

"అమ్మా! నువ్వు నాకై చాలా కష్టపడ్డావు" అని శీర్ణముఖముతో చిరువ్వు నవ్వుతూ ఆమె అన్నది.

పిల్లవానివలె ఉబలాటంతో ఉరుకులెత్తుతూ ఇటు అటు చరిస్తూ కంపౌండరుతో చెప్పి నర్సులు ఉండే క్వార్టర్సులో ప్రవేశించాడు, ఆసుపత్రి వంటశాల్లలో రొటి

పిండి కలుపుతూవున్న జమేదారు వద్దకు పోయి శుభవార్తను వాని కెరిగించెను. జీవనమహాశయుడు అం దుండుట ఆతడు మరచినాడు.

రోగు లున్న గదిలో ప్రవేశించి వార్త నచట తెలిపినాడు. విశేషోత్సాహముతో అత్తగారితో చెప్పినాడు.

"మా మంజు వ్యాధి కుదురకపోయిన యెడల, మా అల్లుడు పిచ్చివాడై పోయేవాడు."

"పిచ్చివాడు కాకపోయినను, సన్యాసి అయిపోవువాడు. లేకున్న, ఆత్మహత్య చేసుకునేవాడు" అని సమీపమందలి ఒక వ్యక్తి చెప్పినాడు.

రోగియొక్క శీర్ణక్లాంత శుష్కాధరముపై హసనరేఖ కృష్ణ చతుర్దశీ నాడు, రాత్రి గడచునపుడు అగపడు ఏకచంద్రకళవలె ఇంచుక తళుక్కొత్తినది. ఈ మందహాసమువలన ఆమె బిడియపడలేదు. సంపూర్ణ సంతృప్తితో పుష్ప వికాసమువలె అకుంఠిత ప్రకాశముతో హసన్ముఖమున వికసిత మైనది.

ఆ మధుర దృశ్యము నవలోకించి, అమితానందము నంది, జీవనమహాశయుడు మాధవుని ప్రస్తుతించినాడు.

డాక్టరు తిరిగి వచ్చినాడు. నడకలోనే ఆతని ఉల్లాసము ఉట్టిపడుతూ వుంది.

డాక్టరు అత్తగారు ఆమె సంగిణి పిలిచినది. కడచిన కొన్ని దినముల నుండి ఆమె కంఠస్వరము ఆతనికి వినవచ్చుచుండెను, లోపలి వసారాలోనుండి యీ పిలుపు వినవస్తూ వున్నది. ఒక వితంతువు శూన్యదృష్టితో మౌనము వహించి కూర్చుని యున్నది. ఒకచేతిని మెడపై వేసికొని, నేలపై వేరొక చేతిని మోపి ఆమె కూర్చుని వున్నది. "ధరా! ధరిత్రీ!" అని మధ్య మధ్య పిలుస్తూ వుందామె.

ఆమె పిలుపు విని ఎవ్వరూ పలకడం లేదు. రోగి శిరము పొంత కూర్చున్న వారు మారెట్లు పలుకగలరు? రోగశయ్య కడకు పోతున్నవారు కిక్కురు మనక పోతున్నారు. ఈమె వైఖరిని చూచినపుడు ఒకప్పుడామె గొప్ప బ్రతుకు బ్రతికి నట్లు బోధపడుతుంది. కొంచెము సేపైన పిదప ఆమె మరల "ధరా! ధరిత్రీ, ఓ ధరిత్రీ!" అని పిలిచినది. "అమ్మాయి ఎలా వుందో చెప్పండి. చెప్పండి. ఆగది నేను ప్రవేశించ కూడదని శాపించినారు. అందుచే నే నక్కడకు రావడం లేదు. అయినా అమ్మాయి సంగతి నాకు తెలుపుతూ వుండవద్దా?" అని ఆమె పలికినది.

ఎవ్వరూ ప్రత్యుత్తర మీయ లేదు. ఆమె అట్లే మాట్లాడక కూర్చుని ఉంది.

కొంత సేపైనపిదప ధరిత్రి "ఏమి కావాలి? అని అడిగింది. "ఏమి కావాలి ? అని అడుగుతున్నావా ? నీవైతే నామనుమరాలవు. కూతురు బిడ్డవు. మంజు నీబిడ్డ. అందుచేత నే నిచటికి వచ్చాను."

"సిగ్గు చేటు? నాకిపుడు కావలసిందేమి ?"

"అయితే ఏమంటున్నావు?"

"అయితే ఎలా వుంది అని అడుగుతున్నాను. ఒక పర్యాయం ఆ గదిలోనికి వచ్చి చూస్తాను. కండ్లతో చూస్తానులే. ఒక పర్యాయం తలను, మొగమును, ఒంటిని తడివి చూస్తాను."

"తలనొప్పి అరకు యూడికలన్ కొంచెము మర్దించండి." అను మాట విన వచ్చింది. అవి మంజరి మాటలు. ఆమె నవ్వింది. ఆ అబల దుర్బలమై పోయి నది. అయినను ఆమె నవ్వు వినబడింది.

"తలనొప్పి అరకు నేను మర్దనాలు చేస్తాను. ఎన్నాళ్లైందో నే నిక్కడకు వచ్చి, తలకు కొబ్బరినూనైనా పట్టించిన పాపాన్ని పోలేదు. సువాసన వున్న దమురేమైనా ఇవ్వండి."

"ఊరుకో. అల్లుడుగారు వస్తున్నారు. అవ్వా! నోరు మూసుకో! డాక్టరు వచ్చినాడు. వడవడ వాగక చతికిల పడివుండు" అని మంజుతల్లి అవ్వను హెచ్చరించింది.

జీవన మహాశయుడు ఇంచుక బాధ పడకుండ ఉండలేక పోయినాడు. అవ్వనోరు విప్పక ఉండలేకపోయింది. ఆమె ధోరణి యిట్లు సాగింది "ఏడీ ? నీ అల్లుడు ఏడీ ? ఒకసారి అతగాణ్ణి దగ్గరకు పిలువు. నేనైతే ఈవేళ రోడ్డు మట్టి కంటె తక్కువదాననై పోయాను. పెద్దయింటిలో పుట్టి పెరిగేను. పెద్దయింటిలో కాపురం చేశాను. ఒకప్పుడు నాకు రూపం ఉండేది. యౌవనం వుండేది. నలుగురి గౌరవాభిమానాలు పొందేను. నేను మంజరి అమ్మకు అమ్మమ్మను. ఈ చుట్టరికం బట్టి చూచి నాతో ప్రసంగించి తీరాలి."

"ఏమి? ఏమంటున్నారు?" అన్నాడు డాక్టరు. అవ్వమాటలు ఆతని చెవు లందు పడినవి. వసారాలో నిలిచి ఆతని ధోరణికి చెవి ఒగ్గగలిగినాడు. అవ్వ ధోరణిని కట్టిపెట్టేందుకు మంజరి తల్లి శత విధముల ప్రయత్నించింది. కాని

ఆమె ప్రయత్నాలు నెగ్గలేదు. డాక్టరు మనస్సప్పుడు పరమ ప్రసన్నతతో నిండి వుంది. నవ్వుతూ ఆతడిట్లన్నాడు. "అవ్వగారూ! అన్నివిధాలా ప్రసంగించే అధికారం మీకుంది. మీరు మాకు పరమ పూజ్యులు. అయినప్పటికీ మంజరి ప్రస్తుత స్థితిని బట్టి—"

ఆతనిమాటల కడ్డు వచ్చి అవ్వ "అవును, నాయనా! అవును. నీవు చెప్పింది నిజం. సిగ్గుపడు తున్నాను, భయపడుతున్నాను. ఎందుకొచ్చానా, అని నేను ఆలోచనలో పడ్డాను. నాకు ఆకలి ఎక్కువ. దేని నైనా దిగమ్రింగుతూ వుంటాను. మగని గుటుక్కున మింగి వేశాను. అమ్మాయి యింట్లో ఆయనను దిగ మింగేను. ఆ తర్వాత అమ్మాయిని కూడా మింగేశాను. నీ అత్తగారిని పెంచి పెద్దదానిని చేశాను. అల్లు డింటిలో చతికిల పడ్డాను. కడుపు నిండ తిన్నాను. పట్టు పట్టింది వుండమని. కాదన లేకపోయాను. తర్వాత ధరకు పెళ్లైంది. ఆమె ఇల్లు చేరుకొన్నాను. ధర తలరాత వేరై పోయింది. దురదృష్టం వల్ల విధవ అయిపోయింది. తర్వాత యిక్కడకు వచ్చి పడ్డాను. ఎందు కొచ్చానో? నే నెవరి కోసం వచ్చానో బాబూ యెరుగుదువా? నాకు కళ్లు లేవు. నాయనా! నాకు చూపు ఇయ్యగలవా? నువ్వు పెద్ద డాక్టరువు" అని ఆమె కథనము సాగించింది.

"మంచిది, నేను ఔషధం యిస్తాను."

"ఔషధం కాదు బాబూ! ఆపరేషన్ చెయ్యాలి."

"ఆపరేషన్ అవసరం లేదు. పెద్ద పొరలేమీ లేవు."

"నాయనా! పొరమీద పొర వుంది. ఆపరేషన్‌వల్ల ఎందరి కళ్లో బాగు పడ్డాయి."

"మంచిది. రేపు బాగా పరీక్షించి చెపుతాను. ఇప్పుడు నేను బయటకు పోవాలి. మీ కిక్కడ ఏమీ కష్టం కలగడం లేదు కదా!"

"బాబూ! కష్టం కలగుతూనే వుంది. ఈ తలకాయ ఎండి గడ్డ కట్టుకొని పోయింది. మంచి నూనె కావాలి. నా కట్టు గుడ్డలు పాత గుడ్డలై పోయినాయి."

ఈ మాటలు లోపలనుండి డాక్టరు అత్తగారు విన్నది. సిగ్గు పడిపోయి ఆమె యిట్లు అన్నది. "ఏం చేస్తాం? ఏం వుపాయం వుంది? గుడ్డలకు కంట్రోలు వచ్చి పడింది. లోకంలో అందరూ బట్టల కొరత వల్ల చిరిగిన గుడ్డలు కట్టుకొని కాలక్షేపం చేస్తున్నారు."

"నాయనా! అవును. ఆమాట నిజం. మంజరి తన బట్టల్లో ఒకటి రెండింటిని నా మొగం మీద పడేస్తే కట్టుకొని రోజులు గడుపుతాను."

మంజరి నవ్వి "రంగుతో ఉనిపిన బట్టలున్నాయి. వాటిని కట్టుకో అవ్వా" అన్నది.

"మంచిది. కాని అమ్మా! గుడ్డ పేలికలు మాత్రం నా మొహాన్ని పడవేయకు. వాటిని ఏం చేసుకొంటాను?"

వరండాలో జీవనమహాశయుని చూచి డాక్టరు ఇంచుక సిగ్గు పడ్డాడు. మహాశయుడు దాపున ఉన్నట్లు అత డెరుగడు. మానసోల్లాసముతో అత డంతా మరచినాడు.

"మహాశయా: నా కాలస్యమై పోయింది."

"అవును"

"ఏమయ్యో! మంజరి మగడా! మాట విన్నావా?" అను మాటలు వినిపించినవి.

"ఇదేమి కర్మము?" ఈ పర్యాయం ప్రద్యోతునకు విసుగు పుట్టింది. ఆ అవ్వ మాటలు జీవన మహాశయుని చెవులలో పడి వుంటాయని ఆతడు చాల మనస్తాపము పొందినాడు. విసుగు అవ్వ మీదనే కాదు, మహాశయుని మీద కూడ. ఆతనికి కొంత విరక్తి కలిగింది. ఈ మాటలకు చెవు లొగ్గుతూ ఆతడు కూర్చుండనే కూడదు. అక్కడినుంచి ఆతడు వెళ్లి వుండవలసింది.

"ఇక నేను నేటికి సెలవు పుచ్చుకొంటాను" అని మహాశయు డన్నాడు.

"కొంచెం సేపు కూర్చుండరా?"

"లేదు. రేపు వస్తాను."

"మంచిది. సరియైన రోజు చూసి, మంజరికి పథ్యం పెట్టవలసి వస్తుంది."

"పథ్యపు రోజును మీరే నిర్ణయించాలి. క్లోరోమయ్‌సిన్ వలన జ్వరం పోతుంది. కాని రిలాప్సు అవుతుందేమో అని కొంచెం భయపడుతున్నాను. మళ్లీ మీరు నాడి చూచి, దోషం లేకుండడం గమనించి, పథ్యం పెట్ట వచ్చునంటేనే పెడతాను. బ్లడ్‌ప్రెషర్ ఉంది కాదా! ఇంటెస్టైన్‌లో పర్‌ఫొరేషన్ వుండడం నిశ్చయం. పథ్యం చాలా జాగ్రత్తగా పెట్టాలి."

ఆ దిక్కునుండి అవ్వ మళ్లీ అరవ సాగింది. "ఏమయ్యో! వింటున్నావా? నిన్నే! నిన్నే! ఓ మంజరి మగడా! ఓ! డాక్టరు దొరా!"

"అవ్వా! నోరు మూసుకో! అల్లుడుగారు మహాశయునితో మాట్లాడు తున్నారు." అని మంజరి తల్లి ఇంచుక గద్దించి పలికింది.

"మహాశయునితోనా ? ఆ మహాశయు డెవరే ?"

"ఆయన గొప్ప నాడీ వైద్యుడు. ఈ ప్రాంతంలో పేరు పడపిన వైద్యుడు."

"అలాగా?" అని నోరు మూసికొని, అవ్వ గభీర చింతలో మునిగి పోయింది.

కొద్ది నిమిషాలలో హఠాత్తుగా సచేతనయై అవ్వ మళ్లీ అరచింది.

"ధరా ! అక్కడ ప్రసంగం కట్టిపెట్టేరా లేదా? నేనొక మాట చెప్పవలసి వుంది."

ఈ పర్యాయం ప్రద్యోతుని ఓరిమి పూర్తిగా పోయింది. వెనుకకు తిరిగి నిలిచి "రేపు మీ కళ్లు కోసివేస్తాను. ఏమవుతుందో చూసుకోండి" అని బొంగురు గొంతుకతో అన్నాడు.

"బాబూ! కళ్ల మాట నేను చెప్పడం లేదు."

"మరే మాట ? గుడ్డల మాటా ? మంచిది. వాటిని తెచ్చి యిస్తాను."

"బట్టలమాటా కాదు."

"ఆ మహాశయుడు నాడి బాగా చూస్తాడట కాదా ?"

"అవును. ఆయన మీకేం చేస్తారు ? ఆయన ఆపరేషన్ చెయ్యరు "

"నేను ఆపరేషన్ మాట ఎత్తడం లేదు. ఆయనగారికి ఒకసారి నాడి చూపిస్తాను."

"మీ చేతికీ, నాడికీ ఏమొచ్చింది ? మీ ఒంట్లో బాగా బలం వుంది. మీ కిప్పు డేమీ తెగులు లేదే "

"తెగులు లేదంటావా ? బాబూ! నేను తెగుళ్ల పుట్టను. అవేమో మీరు కనిపెట్టలేరు. ఈ ముసలి డాక్టర్లు కనిపెట్ట గలరు. నువ్వొకసారి ఆయనగారితో

చెప్పి చూడు. మీ ముందు నే నిపుడు గుడ్డిగవ్వ విలువ చెయ్యను. అయినా ఆయనతో ఇలా చెప్పు. కాందీ జమీంధారు ఫలానా బోసు భార్య అని చెప్పు. మావారిని ఎరుగని వాళ్లు ఈ యేడు లోకాల్లో ఎవరూ లేరు. అంతే కాదు. ఈ వూళ్లూ వాడలూ ఒకప్పుడు మా జమీందారీలో వుండేవి. మాట చెప్పగానే ఆయన ఎంతో గౌరవంతో చూస్తారు. ఈ విషయాలు ఇలా వుండగా-మా నాన్న-ఆహా! ఆయన దర్జా'' అని ఆమె కథ సాగిస్తోంది.

ఈ పర్యాయం ప్రద్యోతుని సహనం పూర్తిగా సడలి పోయింది. నిజంగా ఆతడు రెచ్చి పోయినాడు. కాని, ఏం చెప్పాలో తెలియ లేదు.

జీవన మహాశయుడు వెలుపల నిలిచి వున్నాడు.

మంజరి తల్లి అవ్వ చేయి గట్టిగా పట్టుకొని "అవ్వా! నీకు కదూ చెప్ప డం? ఏమిటీ వాగుడు? అవ్వా! నోరు మూసుకో!'' అని నొక్కి చెప్పింది

మహాశయుడు వెలుపలనుండి ''ప్రద్యోత బాబూ! ''అని కేక వేసినాడు.

ప్రద్యోతుడు అచ్చటికి వచ్చినాడు. చేతులు జోడించి, "అయ్యా! ఆమె మాటలు విని మీరేమీ అనుకోవద్దు. ఆమె ఆ కాలపు జమీందారు భార్య. ఆమెకు కొంచెం మతి చెడింది-''

నవ్వి ఆతని మాటల కడ్డు వచ్చి మహాశయు డిట్లన్నాడు. "మీ రిలా అనుకో నవసరం లేదు. నాడి చూపించాలని ఆమె అనుకుంటోంది. లోపలకు రండి. ఆమె నాడిని చూస్తాం. చూస్తే సంతోషిస్తుంది."

''కాందీలో ఆమె ఎవరింటి కోడలు? ఎవరి పెళ్లాము?''

''భూపేన్ బోసు భార్య అతగాణ్ణి ప్రజలంతా భూపీ బోసంటారు. అతడు అమితాచారి. ఆ జీవితానికి తగినట్లుగానే అతడు అమితవ్యయం చేసే వాడు. ఆతని ఆస్తి అంతా సర్వ నాశనమై పోయింది. అయినప్పటికీ అతడు మద్యపానం మానుకో లేకపోయినాడు.

''చెయ్యి చూపిస్తాను. చెయ్యి చూచి ఆయన అంతా స్పష్టంగా చెపుతారని విన్నాను. ఎప్పుడు చచ్చిపోతానో తెలుసుకొంటాను. నాపేరు మంజరి అని ఆయనతో చెప్పు. మంజరి అనే ఆమె చెయ్యి చూడాలని చెప్పు. ఆయన మేష్టరు కూతుర్ని మంజరిని అని చెప్పు కాందీలో వుండే ఫలానా బోసు భార్యనైన మంజరిని అని చెప్పు. విని ఆయన గుర్తు పట్టగలడు.'' అన్నది అవ్వ ప్రద్యోతుని పిలిచి.

జ్యేష్ఠమాసపు రాత్రి ఆకాశము నిర్మేఘమై ఉన్నది. కోమల నీలాభ దీప్తినుండి ఉల్కా పరంపర సడలిపోయి వుంటుంది. జీవన మహాశయుడు స్తబ్ధుడై నిలబడి పోయినాడు.

"ఏమి! మంజరియా?"

"ఆమె నెరుగుదురా?" అన్నాడు ఆస్పత్రి డాక్టరు.

"ఎరుగుదును. బాగా యెరుగుదును. మీకు అభ్యంతరము లేకపోతే ఆమెను నేను చూస్తాను."

"మంచిది. ఈవేళ చూస్తారా?"

"పోయిందేమి? ఈవేళే చూస్తాను."

"ఆమె శరీరంలో పెక్కు రోగా లున్నవి. ఆమె భర్త ఆమె శరీరమును విషంతో నింపివేసినాడు. ఆమె కథ యిది: ఆమె నెరుగుదునని మీరు కూడా చెపుతున్నారు."

"ఎరుగుదును."

"అమితాచారము వలన రక్తంలో విషం వుంది. నాలుక కట్టలేక, రసన లోభఫలం వలన స్టమక్, ఇంటెస్టైన్‌లు వ్యాధిగ్రస్తములై పోయినవి. ఒంట్లో రక్త మాంసములు లేవు. దేహకోశము దుర్బలమై వున్నది. ఆమె మనసులో అశాంతి మిగుల తీవ్ర మైంది. అది కూడా దాని పని అది చేస్తోంది. కళ్లు పోయినవి. చెవులు కూడా ఇంచుమించుగా పనికిమాలినవై పోయినవి. గుండె, ఊపిరి తిత్తులూ అధ్వాన్నపు స్థితిలో వున్నవి. మాటి మాటికి వగర్చుతూ వుంటుంది. అప్పుడప్పుడు జ్వరం వస్తూ వుంటుంది. ఆ శరీరంలో ఏమి ఆశ్చర్య శక్తి వుందో కాని ఇన్ని తెగుళ్ల బాధలనూ, అనుభవిస్తూ ఘటం నిలుపుకుంటూ వుంటుంది. వీలు చిక్కినపుడు దొంగతనం చేసి కడుపు నింపుకొంటూ వుంటుంది."

చెపుతూ చెపుతూ డాక్టరు ప్రసంగం కట్టి పెట్టినాడు. ఇంకా ఏకరువు పెట్టడం ఉచితం కాదనుకొన్నాడు.

మంజరిదొంగతనం చేసి తింటుంది. దొంగరికం చేసి సువాసన తైలామును తలకు పూసుకొంటుంది. చేతితో తడివి చూచి ఎవడి గుడ్డల నైనా లాగి తాను ధరిస్తుంది.

ఆమెను గురించిన ఈ లక్షణములను విని, అవి అన్నీ సత్యములని జీవన మహాశయుడు గ్రహించినాడు.

మహాశయుడు ప్రద్యోత డాక్టరుతో "నడవండి" అన్నాడు.

వా రిరువురు అవ్వయైన మంజరి కడకు పోయిరి.

మంజరి సమీపములో జీవనమహాశయుడు కొన్ని నిముషములు కదలక మెదలక అట్లే నిలిచినాడు. ఆతని కపాలమున అపూర్వ రేఖలు ప్రస్ఫుటించినవి. కన్నులను ఛేదించుకొని అద్భుత దృష్టి ప్రసరించినవి. జేబులోనుండి కళ్ల జోడు తీసి ఆతడు కండ్లకు తగిలించు కొన్నాడు ఎదుటి వ్యక్తిని తేరిచూచినాడు. కడచిన కొన్నాళ్ల నుండి ఆమె నాతడు చూస్తూ వున్నాడు. నేడు కళ్ళజోడు ధరించి, మిగుల సమీపమునుండి, స్థిర దృష్టితో ఆమెను వీక్షింప సాగినాడు. ఇంచుకంతైన దృష్టి చెదురనీయక ఆమెను దీక్షగా చూడ దొడగినాడు.

'ఏదీ? మీ నాడి చూడ నియ్యండి."

ఆమె చేయి అందించింది.

"మీ నాడిలో జ్వరం తీవ్రంగా వుంది: లోపల జ్వర ప్రకోపం మిక్కుటముగ చెలరేగుతోంది. మీ చిత్తము ఉద్వేగముతో, వేండ్రముతో మాడిపోతోంది. నాభిస్పందనమున, ఈ విషయం స్పష్టమై, ఉత్తాప పీడితమై అగపడుతోంది. దేహ మందలి కోశ మంటు అకాశమందలి నక్షత్ర మాలవలె జీవన శిఖలు అహరహము ప్రాణదేవతకు హారతి యిచ్చుచుండునో, ప్రాణమును మధుమయ రస పూరముతో అభిషిక్త మొనరించి జాగరిత మొనరించునో జీవదేహమున ఆ రీతి స్థిమిత ద్యుతులు అరిపోయినవి. ప్రాణ దేవతకు నాలుగు దిక్కులందు ఛాయ తల సూపినది. ఛాయాహిమ స్పర్శ సోకింది. తుది అవధి రేఖను చేరుటకు ఇంచుక తెరువు మాత్ర మున్నది. నాడీ స్పందనమున శ్రుతి గోచరమగు జీవన సంగీతము క్షీణించి క్షీణతరమై విలంబితఛందమున సమాప్తిని అల్ల నల్లన ఘోషణము సలుపు చున్నది."

చేతిని విడిచి, "ఆ చెయ్యి అందించండి" అన్నాడు మహాశయుడు. అందు కూడ అదే సూచన అగపడింది. ఒకే ఛందము! ఒకే ధ్వని!

"అయ్యా! ఏమి చూశారు? కళ్లూ, చెవులూ వస్తాయా? నన్ను బాగుచేయ గలరా?"

"బాగా? ఏమిబాగు?"

''తలనొప్పి మాట ఏమంటారు? ఈ పీడ పోతుందా?''

''అన్ని పీడలూ ఒకే పర్యాయం పోతాయి. అయితే ఇపుడు మంచి మంచి మందులు వచ్చాయి. వాటిని మ్రింగండి. బాధ కొంత తగ్గుతుంది. నే నొక మంచి మందును సూచిస్తాను. డీనిని ఉపయోగిస్తే కొంతవరకు యాతన తగ్గిపోగలదు. కాని సంపూర్ణంగా మీ వ్యాధి నివారణ కాదు.''

"అయితే కడుపులో నొప్పి మాటేమిటి బాబూ? లోపల పెద్ద గగ్గోలు న న్నెప్పుడూ వేదిస్తూ వుంటుంది."

''మీ అసలు రోగ మదే.''

''దానిని నివారణ చెయ్యండి.''

''చూద్దాం.''

"అంటే?"

"మంజరి చంటిబిడ్డ అవతారం యెత్తితే అన్నీ బాగుపడుతవి. జన్మాంతర ములో మీకు నమ్మకం ఉంది కదా! ఈ జన్మ కడచి వేరొక జన్మ యెత్తినయెడల ఈ వ్యాధు లన్నీ సమసిపోతవి.''

ఇంచుక తాళి అవ్వ ''అయితే ముందు చావా లన్న మాట. బ్రతుకు మీది ఆశకు నీళ్లు వదులుకోవాలన్నమాట. కాని, బాబూ! చావంటే భయం వేస్తోంది.''

''భయ మెందుకు? మీకు ముక్తి లభిస్తుంది.''

''ముక్తి అంటారా?''

''అవును. ముక్తికాక మరేమి? వైకుంఠంలో మీ కొరకై మీ భర్త, మీ అమ్మా, మీ అయ్యా, మీ బంధువర్గ మంతా మీకోసం కనిపెట్టుకొనివున్నారు.''

అవ్వ ముఖము ప్రదీప్త మైనది. దృష్టిలేని కన్నులతో ఏమేమో చూస్తూ ఆత్మ మగ్నయై ఆమె కూర్చుని ఉన్నది.

మహాశయుడు, లేచినాడు కుర్చీ చప్పుడు వినగానే ఆమె సచేతన యైనది.

''అయితే నేను వెళ్లిపోవా లంటున్నారు, బాబయ్యా! ఎన్నాళ్ళలో?''

ప్రద్యోతడాక్టరు అక్కడ ఉన్నట్లు జీవనమహాశయుడు మరచినాడు. నాడీ పరీక్ష విషయములో ఆతని అభిప్రాయము పాటించి యుండలేదు. మహాశయుడు మరొక పర్యాయం కూర్చుని అవ్వ చేబూని, మరింత శ్రద్ధతో నాడిని పరీక్షించి, "మూడు మాసాలనుండి ఆరు మాసములలోపల మీరు మోక్షద్వారంలో ప్రవేశిస్తారు. మీ రాకకై గంట మోగుతోంది వైకుంఠంలో. కాని, ఈకాలపు మందులు మ్రింగినయెడల ఈ దుఃఖస్థితిని మరికొన్ని రోజులు అనుభవింపవలసివచ్చును. ఈనాటి మందులు మంచి బలమైనవి" అన్నాడు.

"బాబూ! ఈ మందులూ, మాకులూ నాకు పట్టవు. మింగి ఏం చేస్తాను? ఎంతకాలం వుంటాను? మీరు మంచి మాట చెవిలో వేశారు. మావారు నాకై కనిపెట్టుకొని వున్నారని చెప్పినారు. అందుచేత నాకు ముక్తి ఎంత చప్పున లభిస్తే అంత మేలు. మీరు చెప్పినట్లు ఇటువంటి ఊసు నాచెవిలోఎవ్వరూ వేసినారు కారు. ఆహా! ఎంతకాలమునుండి వారంతా నాకొరకై వేచివున్నారో కదా! ఇక నేను-"

అవ్వ కంఠస్వరం కంపించింది. దృష్టి హీన నేత్రములు రెండును విర్నిమేషములై పోయినవి. ఈ పర్యాయము అశ్రుబిందువులు రాలినవి.

ప్రసంగం చాలించి, జీవనమహాశయుడు మెల్లగ అందుండి లేచినాడు.

చూపులు మళ్లించి, వేడి నిట్టూర్పు విడిచి, తరలునపుడు ఆతడు చకితుడైనాడు. దాపున ఒక నిలువుటద్దము కలదు. తటాలున అం దాతని ప్రతిబింబము అగపడినది. శుభ్ర కేశములు, రేఖాంకిత లలాటము; పాండుర ముఖము, స్థవిర స్వరూపము ప్రత్యక్ష మైనవి. ఆతని మనస్సులో ఒక విషయము తట్టినది. అది ఆతని తండ్రి చెప్పిన మాట. జనకు డిట్లు చెప్పినాడు: "జన్మను అనుసరించియే మృత్యు వుండును. క్రమక్రమముగ దాని ప్రభావము అగపడుతూ వుంటుంది. జీవితము క్షీణిస్తూ వుంటుంది. మృత్యువు తన మార్గమున వ్యక్తిని పొరలించుచుండును. జీవన యుద్ధము సాగుచుండును. ఇందు మానవుడు ఆయాస పడును. జర అతనిని ఆక్రమించును. తరువాత తుది ముహూర్తము ప్రత్యక్ష మగును. లేచినప్పుడు సూర్యోదయము, నిద్దురను చీకటి క్రమ్ముకొనును. బ్రతుకు చావులు ఈరీతిగా గడచుచుండును. సంతసమున మరణము. నూతన ప్రభాతమున జన్మాంతరము దృగ్గోచర మగును."

అద్దము ముందు జీవనమహాశయుడు నిలిచి తన ప్రతిబింబముపై ఏకాగ్ర దృష్టిని సారించి చింతామగ్నుడై యుండుట గాంచి ప్రద్యోతడాక్టరు మిగుల విస్మితుడాయెను.

మహాశయుని రుద్ధ దీర్ఘ నిశ్వాసము ఇపుడు వడిగ వ్యక్త మైనది. మొగము మళ్లించి, కుర్చీపై శరీరమును చేర్చినాడు. అవ్వను చూచి, "మీ కష్ట మేమో చెప్పండి?" అని ప్రశ్నించాడు.

అవ్వ ఇట్లు పలికినది : "మీరు జీవనమహాశయులా? నవగ్రామ దేవీ పురంలో వుండే జీవనదత్తుగారా? నేను మంజరిని. కాందీలో వుండే బంకిం చెల్లెలిని. మేష్టరు నవకృష్ణసింహుని కూతురును."

ఇంతకి నవ్వి మహాశయు డిట్లన్నాడు; "మీ మాటలు విని గుర్తుపట్టినాను. చాలకాలమునాటి మాట. అప్పటి సంగతులు యావత్తూ మనసులో తలలెత్తు లున్నాయి!"

"ఆ బ్రతుకు జ్ఞాపకమునకు వస్తూంది. ఎన్నటి, ఎంతటి బ్రతుకో! ఇక్కడకు వచ్చిన తర్వాత జీవనమహాశయుడు, జీవనమహాశయుడు అని ప్రజలు చెప్పు కొంటూ వుంటే నేను విన్నాను. నవగ్రామం, అనే మాట మాటిమాటికి చెవిలో పడింది. ఈ శబ్దాలు పరిచితములు. మీ పేరు విని మీ వినయం విని, ఈ ప్రసంగ ధోరణిని విని మీరే ఆయన అని ఊహించాను. మరికొందరు మహాశయుల మాట విన్నాను. వారు నవగ్రామంలో వుండడం యెరుగుదును. మతి లేక పోవడంవల్ల మహాశయుల సంఖ్య మస్తకములో చెలరేగింది. మరల కనువిప్పు కలిగింది. వెంటనే మనస్సులో గగ్గోలు; చివరకు నేను చెప్పేమాట ఇది : మీరు ఆయనయే కావచ్చు, కాకపోవచ్చును. మీరు గొప్ప వైద్యులు. మళ్లీ చెయ్యి చూసి, చెప్పండి. బాగుపడతానేమో చెప్పండి."

మహాశయుడు మరేమీ పలుకలేదు. ఆచోటినుండి కదలినాడు.

అతడు ద్వారం చేరువరకు ప్రద్యోతుడు వెంట నుండెను.

"ఇది మీ నాడీపరీక్ష మహిమయా? దీనిని నే నలవరుచుకు నేందుకు మిక్కిలి ఉబలాటపడుతున్నాను" అని అన్నాడు.

వాని మాట మహాశయుని చెవిలో పడలేదు. శూన్యదృష్టితో చూచుచు ఆత డేమేమో యోచింపదొడగెను.

"ఈ వైఖరిని మీవద్దనుండి నేను అలవరుచుకోవాలి" అన్నాడు ప్రద్యోతుడు

మహాశయుని మనస్సులో ఊహాస్రవంతి వివిధరీతుల స్రవించుచున్నది. పింగళవర్ణమైన ఆ కన్య విషయము దిర్దిర తిరుగుచున్నది. పింగళవర్ణము గల ఆమె పింగళకేశిని. పింగళ చక్షువులు కలది. ఆమె కౌశేయవాసిని. పద్మ బీజ భూషణములతో ఆమె అంగ ప్రత్యంగములు అలంకరింపబడినవి. అంధ బధిర స్థితులు ఆమెయందు గలవు. శరీరము వెంట ఛాయ ఉండినట్లు, శ్రమ ననుసరించి విశ్రామ మున్నట్లు, శబ్దము వెంట స్తబ్ధత వుండునట్లు, సంగీతము ననుసరించి సమాప్త ముండునట్లు, గతి వెంట పతన ముండునట్లు, పింగళవర్ణముగల ఆ కన్యను అనుసరించి ఆ లక్షణము లుండును. మృత్యుదూత ఆమెయొద్దకు జీవిని చేర్చును. భూపి రూపమును ధరించి మృత్యుదూత ఆమె మ్రోల సాక్షాత్కరించును. హే మాధవా! ప్రేమబంధురమైన నీ సృష్టియందు కలియుట మాధుర్యానుభూతి నందుట. మృత్యువు నడుమ అమృతమును జుఱ్ఱుకొనుట యగును.

జీవనమహాశయుడు తన చేతిని పట్టుకొనినాడు. రక్త స్రోతము నేడు వడిగా ప్రవహించుచున్నది. హృత్పిండ స్పందనము అధిక మైనది. దేహమందలి రోమకూపములు స్వేదార్ద్రము లైనవి. ఈరీతి ఉత్తేజనానుభూతి ఆత డీవరలో ఎన్నడు అనుభవింపలేదు.

ఆతని మృత్యుదూత ఏరూపమున సాక్షాత్కరించును? మంజరి రూపమున కాదు. మంజరి ఆతని జీవనమున భ్రాంతిమాత్రమే! మిథ్య. తన భార్యరూపమున గోచరించునా? తండ్రి జగత్‌మహాశయుని స్వరూపమున అగపడునా? గురువైన రంగలాల్ మూర్తి ప్రత్యక్ష మగునా? లేకున్న నీరనిబిడాంధకారమున కలసి యుండునా? దానిని వీక్షించుట సాధ్యముకాదా? నా వనవిహారి ఏమైనాడు? ఎట్లు అదృశ్య మైనాడు?"

యోచించుచు, యోచించుచు ఆతడు ఆరోగ్యనికేతనమును సమీపించినాడు.

చేతిలో లాంతరు పుచ్చుకొని ఎవరో అచ్చట కూర్చుని వున్నారు. భ్రుకుంచిత మొనరించి "ఎవ రక్కడ" అని ప్రశ్నించాడు.

"మహాశయబాబా! ప్రభూ! నేను మరిని." ఆమె వైష్ణవభిక్షుకురాలు. "ఇంత రాత్రివేళ వచ్చినావేమి?" అని మహాశయుడు డామెను ప్రశ్నించాడు.

"బాబయ్యా! ఈవేళ సావిత్రి చతుర్దశి. గుడికి పోయి వ్రతము చేయాలని అభయమ్మ చెప్పింది. భక్తితో మిమ్ము ఆహ్వానించింది."

ఎడమచేతిలో కుడిచేతి మణిబంధమును నొక్కిపట్టి, జీవనమహాశయుడు వెంటనే దానిని వదలివేసినాడు. "వస్తున్నాను" అన్నాడు.

# చివరి మాట

నాలుగు నెలల తరువాత.

పందొమ్మిది వందల ఏబది యొకటవ సంవత్సరము. సెప్టెంబరు మాసము

ఆశ్విన్ సంధ్య.

ప్రద్యోత డాక్టరు వెలుపలి వసారాలో కాల్ బాక్సు. బ్లడ్ ప్రెషర్ తెలిసికొనుటకై వినియోగపడు యంత్రమును చేబూని రోగులను చూచేందుకు సంసిద్ధుడై కూర్చునియుండెను. ఎదుటి స్టూల్ మీద టీ కప్పు ఉంది.

మంజు లోపలినుండి వెలుపలికి వచ్చింది. బహుశః ఆమె కూడ అవ్వలకు పోవును. టీ కప్పు చూచి "ఏమి? టీ త్రాగినారుకారు. ఎందువలన?" అని ప్రశ్నించింది.

"త్రాగాలని బుద్ధి పుట్టలేదు."

"సరిగా తయారు కాలేదా? నేను తయారు చేసికొని వత్తునా?"

"వద్దు. టీ త్రాంగేదుకు బుద్ధి పుట్టడం లేదు." నిట్టూర్పు విడిచి ఆతడు "చివరకు ఆ పెద్దమనిషితో గాఢమైన సఖ్యము ఏర్పడింది. నీకు జబ్బు చేసినపుడు మహాశయుడు సర్వవిధముల సేవ చేసినాడు. సేవకంటె అతని వాత్సల్యము దొడ్డది." అన్నాడు.

ఇంచుకసేపు మిన్నకొని ఆతడు మరల ఇట్లన్నాడు. "ఇది ఉన్నత హృదయము గలవాని ధర్మము. అట్టి ఔదార్యం చూడడం మనవంటి వారికి సాధ్యం కాదు. వయసు వచ్చినగాని ఆ ధార్మిక గుణము అలవడదు." భార్యపై చూపు సారించి. "నువ్వు ఈవేళే వచ్చినావు. గంటకు ముందే రైలు దిగివచ్చినావు. నువ్వు ప్రయాణం సాగించకుండా వుంటే మేలయ్యేది. నీకింకా పూర్తి ఆరోగ్యం కలుగ లేదు." అన్నాడు.

జబ్బు చేసిన తర్వాత భార్యను అతడు స్థల పరివర్తనమునకై పంపినాడు. నేటి అపరాహ్ణము ఆమె తిరిగి వచ్చింది.

మహాశయుడు అస్వస్థుడై యున్నాడు. ఆతనిని చూచేందుకు ప్రద్యోతుడు పోవుచున్నాడని విని, తాను కూడా వస్తానని ఆమె చెప్పింది. నాలుగు నెలల నుండి జీవనమహాశయుడు వ్యాధిగ్రస్తుడై వున్నాడు. అపుడపుడు మంచమును బట్టి యున్నాడు. కడచిన మూడు దినములనుండి రోగ ప్రకోపము తీవ్రంగా ఉన్నది. బ్లడ్ ప్రెషర్ అధికంగా ఉన్నది. గుండె నీరసించి పోయింది.

''నీవు రావద్దు'' అన్నాడు ఇల్లాలితో ప్రద్యోతుడు.

''నేనూ వస్తాను. నా ఆరోగ్యం సరిగానే వున్నది. నా కేమీ ఉపద్రవం కలుగదు.''

మానవుని ఉద్వేగ మెట్టిదో గ్రహించడం సాధ్యం కాదు. ''మహాశయుడు వ్యాధిగ్రస్తుడై వున్నాడని విని నేను మొదటి పర్యాయం పోయినపుడు, బాధపడు తున్నను నవ్వుతూ ప్రశాంత భావముతో ఇట్లన్నాడు: స్నేహము, దయ, అను రాగము వీటి ప్రభావము జీవనమున గలదు. పాప పుణ్యముల ఒత్తిడి బ్రతుకుపై ఉండి తీరును. జీవనమును విశేషంగా పరిశీలించినాను.''

"ఎడమ చేతితో కుడిచేతి నాడిని పరీక్షిస్తూ 'అది పొలిమేరలో వున్నది' అన్నాడు. ఆనాడాతని మానసికావస్థ విచిత్రమై యుండెను. మంజరిని చూచి మహాశయుడు వెలుపలకు వచ్చినప్పుడు ఆతని శరీర మందలి రక్త స్రోతము ద్రుత వేగమున ప్రవహింప సాగినది.

మనస్సు ఒక విచిత్రానుభూతి నందెను. అది ఆశ్చర్యకరమైన ఉల్లాసము.''

ఆస్పత్రి ద్వారం వద్ద ఆయనతో నేను "ఇది మీ నాడీ పరీక్ష మహిమయా? దీనిని నేనలవరచుకొనేందుకు మిక్కిలి ఉబలాటపడుతున్నానని అన్నాను.'' ఈ మాటల భావార్థము - నాతడు మననము చేసికొనుచున్నాడు.

ఇంటికి మరలునపుడు ఆతడు మరల చింతామగ్నుడు కాదొడగెను. ఆ చీకటిలో అతడు అరణ్య గజమువలె మృత్యుగహ్వర సంధానమున నడయాడు చుండెను. తావు జనహీనమై యున్నది. గభీరనిబిడ మహారణ్యము అపూర్వాను భూతిని కలిగించుచుండెను. అసంఖ్యాకములైన ఝిల్లీ కీటకముల ఏకైక శ్రుతి

చెవుల బడుచున్నది. మృత్యువుయొక్క మహా శూన్యతా మధ్యమునుండి జీవనప్రవాహము జన్మాంతరముల లోనికి ప్రవించుచున్నట్లు గోచరించెను. నవ జన్మ మీది ఆశతో ఆ మహా గహ్వరమున అది తటాలున లంఘించుచుండెను. తన నాడిపై చేయి నిలిపి ఆతడు నడచుచుండెను. కాని ఆనందావేశమున అనుభూతి యోగము స్థిరము కాలేదు.

ఇంటికి మరలి మరి వైష్ణవ భిక్షుకురాలిని చూచి, అభయ ఆహ్వానమును మన్నించుటకై ఆతడు కదలి పోయినాడు.

"వద్దు. పోవద్దు." అని యిల్లాలు హెచ్చరించింది. కాని ఆతడామె మాటలను పాటింప లేదు. అంతే కాదు. ఆమె మాటలు ఆతనిని రెచ్చ గొట్టినవి. ఆతడు కోపముతో అరచినాడు. ఇదివరలో ఎన్నడు ఈ రీతి ఆగ్రహావేశము నాతడు ప్రదర్శింపలేదు.

సహజమైన ధోరణితో ఆమె తొలుత ఇట్లనినది "ఈ వయసులో, ఇంత రాత్రివేళ విందారగించేందుకు పోతున్నారా? మీ కడుపులోని ఆకటి చిచ్చు చల్లారలేదా? వనవిహారిని మ్రింగినప్పటికీ అది చల్లారలేదా?"

ఈ మాట వలన మహాశయుడు ఇంచుమించుగ ఉన్మాదుడై పోయినాడు. "ఏమీ యీ ధోరణి?" అని ఆత డరచినాడు. అది ఆకాశములో ప్రతిధ్వనించెను.

వైష్ణవ భిక్షుకురాలు ఉలికిపడినది. ఆమె చేతిలోని లాంతరు చివాలున క్రింద పడిపోయినది. గుప్పున ఆరిపోయినది.

అభయ వ్రతమండపము కడ ఆతనికై ప్రతీక్షించియున్నది. దినమంత ఉపవాసము చేసినది. కుశాగ్ర జలమును సయితము ఆమె నోట పోసికొనలేదు. కడచిన నాడు కూడా ఆమె అర్ధోపవాసము చేసింది. తన యింటి పెరట్లో ఉన్న చెట్లపై మగ్గిన పండ్లను, తేనెను అరగించి జీవించాలని ఆమె నిశ్చయించింది. ఆగామీ జన్మమున అవైధవ్య ఫలమును అనుభవింతునని ఆమె దృఢముగ నమ్ముచుండును. అపు డామె జీవించినంతకాలము మృత్యువు ఆమె పతి సాన్నిధ్యమునకు రాలేదని ఆమె విశ్వాసము. పరమ దారుణమైన వ్యాధి సంక్రమించినను ఈ జన్మలో తాను సలుపు ఈ వ్రతఫలము వలన మృత్యువును దూరముగ నెట్టింప గలనని ఆమె నమ్ముచుండెను. ఆర్య నారీశిరోమణి సావిత్రి ఈ వ్రతమును నిర్వ

హించెను. సత్యవంతుని ప్రాణములను చేగొని మృత్యువుయొక్క అధిపతి మృత్యుపురి దిక్కుగా పోయినాడు. అది పార్థివపథము. పార్థివదృష్టి ఆ చోటున అంధమై యుండును. కాని, ఈ వ్రతపాలనములవలన కలిగిన పుణ్యమును పురస్కరించుకొని సావిత్రి మత్యుపతిని అనుసరింప జాలినది. ఈ పుణ్యబలము వలన మృత్యుపతిని ఓడించి, తన పతి ప్రాణములను ఆమె తిరిగి తెచ్చుకొన గలిగినది. సావిత్రి కథ సత్యమో. సత్యము కాదో ఎవ్వరు విమర్శింపరు. ఈ వ్రతపాలనము వలన ఆ రీతి భాగ్యము లభించునో, లభించదో అని నే డెవ్వరు సమీక్షింప సాహసింపరు. గభీర విశ్వాసముతో హిందూరమణులు, భారత నారీమణులు కాల పథమున దీనిని జరపుచునే యున్నారు.

అభయయొక్క ఉపవాస శీర్ణముఖముపై ఈ విశ్వాసపు గాఢతరముద్ర దృగ్గోచర మగుచున్నది. ఆమె ముఖమండలమున చంద్రకళవంటి మందహాసరేఖ కాంతిల్లుచున్నది. ఆగ్రహావేశములో ఇంటినుండి కదలి వచ్చిన జీవనమహాశయుని మనసులోని నిప్పు ఆ ముఖమును చూచినతోడనే చప్పున చల్లారి పోయినది. శారదాంబుదకాశ శుభ్ర ప్రకాశమై. పూర్ణిమనాటి నిర్మేఘవిహాయసము వలె ఆతని స్వాంతము ప్రకాశించెను.

ఆతడు మనస్సులో ఇట్లు వితర్కించుకొనెను. 'చికిత్సకుని దృష్టితో నేను మనుష్యజీవితమును వీక్షిస్తూ వచ్చినాను. మృత్యువు పాపపుణ్యముల విచారము సలుపదు. క్షయ పథమున అది ముందంజ వేస్తూ వస్తుంది. క్షయ ఎందు ప్రబలమై వుండునో అందు మృత్యువు గెలుపుసిదమును చేబూనును.' అభయ నుద్దేశించి ఇట్లనినాడు. "పరజన్మమున నీ భర్త జీవనమున క్షయ ప్రబలినను నీ పుణ్యబలము వలన మృత్యువు తన ఓటమిని స్వీకరించి తరలిపోవుగాక అని, ఘాటిమాటికి ని న్నాశీర్వదిస్తున్నాను. ఇది ఫలించుగాక! ఫలించుగాక!"

మహాశయుని సమక్షమున అభయ ఫలహారముల పళ్లెము నుంచి "స్వామీ! నా చిరకాల తపస్సు నేడు ఫలించింది. ప్రతి పర్యాయము సావిత్రీ వ్రతము నిర్వహించి, బ్రాహ్మణ సమారాధనము సలిపినను, నాకు అంతగా సంతృప్తి కలిగేది కాదు. ఇపుడు మీరు విందారగించడం వలన నా నోము ఫలించినదని అనుకొంటు న్నాను. నాకు సంపూర్ణముగ సంతృప్తి కలిగింది" అని భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లినది.

"అమ్మా! నీ వుద్దేశం సిద్ధించుగాక!" అని పరమ పరితోషముతో జీవన మహాశయుడు పలికినాడు.

"మరేమి ఆరగిస్తారో చెప్పండి. రాత్రులందు మీరు పాలూ, పళ్ళూ మాత్రము పుచ్చుకొంటారని విన్నాను. అవే మీ కిస్తాను. పళ్ళతోపాటు కొంత మధురపదార్థం కూడా పుచ్చుకోండి."

"అమ్మా! నువ్వు ఏమిస్తే దానినే భుజిస్తాను. అదే అమృతము."

"ఒక్క లూచి, కొంచెం పులుసు, కొంచెం కూర—వీటిని కూడా కొంచెం రుచి చూడండి."

"అమ్మా! నీ చేతితో నీవు ఏమి వండినావో వాటిని వడ్డించు." నిక్కముగ తాను అమృతమును ఆరగించినట్లు జీవనమహాశయు డూహించి పరమానందము నందినాడు. ఇంత సంతృప్తితో, ఇంత ప్రసన్నతతో ఈ నడుమ ఆతడు విందార గింపలేదు. భోజనము చేసి, లేచి "భోజనము ఉదాత్త మైనట్లే తోస్తోంది" అని అనుకొన్నాడు.

కడచిన రాత్రి ఛిద్రపథము ననుసరించి ఆతని దూత ప్రవేశించి, గుండెపై గట్టి చరపు చరచెను. ఆతని రొమ్ముపై పెద్ద పాషాణము పడినట్లైనది. మస్తక మందలి స్నాయువులు తీవ్రముగ చలించి పోయినవి. సమస్త శరీరము కంపించి నది!

అతని గృహిణికి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. మానసికారాటము వలన అవిరళముగ ఆమె కన్నులనుండి అశ్రువారి స్రవించుచుండెను. లేచి కూర్చుని, దీపమును పెద్దదిగా చేసి, మహాశయుడు తన గదిలో ప్రవేశించి, ఏమియు ప్రసం గింపక అర్థహీన విస్ఫారిత దృష్టితో ఆమె ముఖమును వీక్షింపసాగెను.

మగని స్థితి బాగులేదని ఆమె గ్రహించింది. కిశోరవినయులను వెంటగొని రమ్మని ఇల్లాలు ఇంద్రుని పంపినది. సేతాబుకు కూడా కబురు పంపినది. కిశోర వినయులు, హరేన్ ప్రద్యోతులకు కబురు పంపిరి. వా రందరు వచ్చునప్పటికి మహాశయుడు ఇంచుక నిమ్మళించినాడు.

బ్లడ్ ప్రెషర్ రెండువందల నలుబది యైనది. గుండెనొప్పి కూడ అధిక మైనది.

సాయంకాలమున ఆత డిట్లు పలికినాడు: "మృత్యువు సమక్షమున పాప పుణ్యముల విచారము లేదు. నీటిగుండములో మునుగువానికి చేయి అందించినను అతడు బుడుంగు మనక మానడు. కంఠముపై కత్తి పడినపుడు, అది మెత్తబడి పూలచెండు కాదు. మృత్యువు నిర్వికారమై చెలరేగును.''

తన నాడిని తాను పరీక్షించుకొని ఆత డిట్లు పలికినాడు. "అమె వస్తోంది. మృత్యుమహిళ పాదముల అలికిడి పొలిమేరనుండి వినవస్తూ వున్నది. పొలిమేర లోని వకుళతలమున ఇంచుక విశ్రాంతి తీసుకొనుచున్నది.''

ఆతడు మెల్లగ నవ్వినాడు.

ప్రద్యోతు డిట్లనినాడు. ''మీతో నే నేమీ చెప్పడం ఉచితం కాదు. మిమ్మ పీడిస్తూ వున్నది త్రంబసిస్ కాదు. అది సామాన్యమైన వేదన మాత్రమే। అది సమసిపోతుంది. మీ కిక ఎట్టి బాధ వుండదు."

పక్షము దినములు కడచినవి. గంగాతీరమునకు పోవలెనను ఉద్దేశమును మహాశయుడు వ్యక్తీకరించెను.

కాని ఆత డట్లు పోలేక పోయినాడు. తన అభిప్రాయమును మార్చుకొని నాడు. గృహిణి విషయం యోచించినాడు. నేను గంగాతీరమునకు పోయిన యెడల, ఆమె ఒంటరియై ఉండును. ఆమె దుఃఖమునకు అవధు లుండవు. ఇక్కడ వీరంతా వున్నారు సుఖదుఃఖములను పంచుకొనుచున్నారు.

ఇల్లా లేమీ పలుక లేదు. ఆమె రాయియై పోయినట్లుంది. వనవిహారి భార్య, ఆతని కొడుకు ఒక పర్యాయం వచ్చి చూచి పోయినారు. మహాశయుడు మొదటి గుండెపోటుకు తర్వాత తేరుకొన్నాడు. తెప్పరిల్లి నడుస్తున్నాడు.

''ఇక భయ మేమీ లేదు. మీరు యథాప్రకారము తిని, తిరుగ గలరు" అని ప్రద్యోతు డన్నాడు.

మహాశయుడు నవ్వినాడు. ఏమీ పలుక లేదు.

"మా మనవి ఒకటి వున్నది. మీరు మాటిమాటికి నాడి చూసుకొంటు న్నారు. అలా చూసుకోవద్దని మా ప్రార్థన" అని ప్రద్యోతుడు వినమ్రుడై ఆత నిని వేడుకొన్నాడు.

"డాక్టరు బాబూ! ఈ విధంగా నేను చాల దినములనుండి చూచుకొంటు న్నాను. "అన్నా డాతడు.

"వలదనే మా వేడికోలు."

నవ్వి మహాశయు డిట్లన్నాడు. "చాలామంది నాడులు చూచి, మృత్యు దిన మును చెప్పివేస్తూ వచ్చాను. ఇపుడా మృత్యువు అలికిడి వినబడుతూ వుంటే చెవులు మూసికొని కూర్చుందునా?"

ఈమాటకు ప్రద్యోతుడు ప్రత్యుత్తర మీయ లేకపోయినాడు.

జీవనమహాశయుడు మరల ఇట్లు వచించినాడు :

"డాక్టరు బాబూ! చావంటే నాకు భయం లేదు. దానికి సంబంధించిన ఉద్వేగంవలన నా బ్లడ్ ప్రెషర్ ఎక్కువ కాదు. అయినను ..."

ఇంచుక సేపూరకొని, అతడు మరల ఇట్లు పలికినాడు. మొదటి దినమున నేను తయారుగా లేను. ఆకస్మికముగ నిద్రలో గుండెపోటుచె చెలరేగింది. హృత్పిండము తలక్రిందులైనట్లు అనిపించింది. అప్పుడు నాకు భయం వేసింది. అసహాయుడైన శిశువువలె అడలుతో అరచినాను. మతి తల్లిని గురించి ఏమేమో చెప్పినాను. మృత్యు భీతి ఆమెకు ఉండెనని పలికినాను. ఆమె దోష మేమీ లేదు. మృత్యు భయంతో పోల్చ దగిన భయ మేమీ లేదు. మృత్యు రోగమువలన కలుగు యాతనను మించిన యాతన మరేమీ లేదు. ఆ భయం పోయినదని అపోహపడి, ఇసుకలో తలదూర్చుకొను ఉష్ట్ర పక్షివలె వుందునా?"

మూడు మాసములు గడచిన వెనుక దారుణమైన గుండెపోటు వచ్చినది. ఇది రెండవ పర్యాయం. అది వచ్చిన క్రితము దినమున ప్రద్యోతునితో జీవన మహాశయు డిట్లు అన్నాడు.

"డాక్టరు బాబూ! ఈ పర్యాయము ఆ మహిళ పడుకతలమునుండి లేచి నిలిచి నది."

ఉల్లేఖనము ప్రద్యోతునికి జ్ఞప్తికి రాలేదు ఆ మాటకు అర్థము తెలియక అతడు ''అయ్యో! ఏమంటున్నారు?'' అని ప్రశ్నించాడు.

"డాక్టరు బాబూ! అది మరొక ఊపు ఊపుతుంది. బ్లడ్ ప్రెషర్ ఎక్కువవు తుంది.''

"ఆ సూచన ఏమీ అగపడడం లేదే! రక్తప్రసారంలో ఏమీ దోషం కని పించడం లేదు."

"బ్లడ్ ప్రెషర్ అధిక మవుతుంది. నాడి వలన విషయం నాకు బోధపడు తోంది."

ఆ ప్రకారంగానే అది అధిక మైనది. మర్నాడు ప్రసారగతి ఊర్ధ్వదిక్కుగా పోదొడగినది. సంధ్యాసమయమున జీవనమహాశయుడు ఇంచుమించుగా అజ్ఞాన స్థితిలో పడియుండెను. నేటికి నాలుగు దినములకు ముందు, మూడవపర్యాయం గుండెపోటు వచ్చినది.

ప్రద్యోతడాక్టరు ఇట్లన్నాడు. ''మహాశయుడు నిన్నటినుండి ఇంచుమించుగా ధ్యాన మగ్నుడై వున్నాడు. కన్నులు మూసికొని, పడకపై ఓరగిలి కూర్చున్నాడు. నిద్రకు నాకు మందియ్యవద్దు. నిద్రలో మరణించడం నా యిష్టం కాదు. జ్ఞానంతో వుండే వెళ్ళిపోవడం నా అభిమతం అని ఆయన నాతో చెప్పినాడు."

మంజు ఇట్లన్నది. ''అమ్మ, అవ్వ మరణించిన వార్త ఆయన విన్నారా? మీరు చెప్పినారా!''

''చెప్పాలని అనుకొన్నాను. కాని నా మాటకు చెవి ఒగ్గేందుకు ఆయన ఇష్టపడలేదు. జాబును జేబులో వుంచుకొని వార్తను చెప్పదలచినాను. మా అత్తగారి అవ్వ, కాందీలో వుండే భూపీ బాబు భార్య-ఎవరినాడిని చూచి ఆయన విశేషంగా చెప్పినారో, సరిగా ఆయన చెప్పినట్లు ఆమె అని నే ననబోతూవుండగా, చేయి ఊపి ఆయన అదంతా అటుంచండి అని మెల్లగా పలికి నన్ను వారించి నాడు."

బాలీసుపై చేరగిలబడి మహాశయుడు కన్నులు మూసి అర్ధచైతన్యముతో ఉండెను. మృత్యు మహిళ వచ్చుచుండుట ఆత డెరుగును. ఆమె పాదముల అలికిడి ఆతని చెవులందు పడుచుండెను. తొలి గుండెపోటునుండి ఆ సూచన అతనికి తెలియుచునే యుండెను. అంతటితో ఆతనికి సంతృప్తి కలుగలేదు. అంత్యముహూర్తములో సజ్ఞాన స్థితిలో ముఖాముఖి అగుటకై అతడు ఉబలాట పడుచుండెను. మృత్యుకాంతకు రూప మున్న యెడల దానిని వీక్షించుటకై ఆతడు ఉవ్విళ్లూరుచుండెను. ఆమెకు స్వర మున్నచో, ఆ కంఠస్వరమును వినవలెనని ఆతడు కుతూహలపడుచుండెను. ఆమెకు వాసన ఉన్నయెడల దానిని అంత్య విశ్వాసమున, కొనయూపిరి కడచులోపల గ్రహింప దలచుచుండెను. దానికి స్పర్శ ఉండుచో, ఆ స్పర్శానుభూతిని పొందవలెనని ఆత డుత్సాహపడుచుండెను. అపు డపుడు దట్టమైన మంచుతెరలు సమస్తమును కప్పుచున్నట్లుండెను. అంతయు ఎందో అదృశ్య మగుచున్నది. అతీత వర్తమాన కాలముల స్మృతులు విస్మృతిలో మరల తల లెత్తుచున్నవి. ఆత డొక పర్యాయము కండ్లు తెరచినాడు. ఆ మహిళ వచ్చినదా? వీ రందరూ యెవరు! బహుదూర మందలి అస్పష్ట ఛాయా చిత్రముల వలె ఉన్న వీ రెవరు?

వీరి స్వరము మెల్లమెల్లగా చెవులందు పడుచున్నది. ఏమనుచున్నారు? ఏమి?

జీవనమహాశయుడు అల్లనల్లన తల ఊపినాడు. తల ఊగుసమయమున అలసి సొలసిన కంటిరెప్పలు మరల వ్రాలినవి. ప్రగాఢ శాంతి చ్ఛాయ శీర్ణ ముఖ మండలముపై పడినది.

జీవనమహాశయు డేమి చూచుచుండెనో ప్రద్యోతునకు తెలియలేదు.

ఆ ముహూర్తమందే ఆయన ఇల్లాలు పతి ముఖమును చేతబట్టి "ధ్యానము ముగిసినదా?" అని ప్రశ్నించినది. "మాధవుని చరణాశ్రయమున శాంతిని పొంది తిరా? ఇక నేను? నన్ను కూడ....నన్ను కూడ వెంట గొని పొండు!" అన్నది.

ప్రశాంత ఆత్మ సమర్పణమువలె ప్రాణపతి చరణకమలములపై ప్రణామ పూర్వకముగా గృహలక్ష్మి పడిపోయినది.